ఓమ్

శ్రీ రామాయ నమః

శ్రీమద్వాల్మీకి

# రామాయణ కథామృతము







రచన:

శ్రీ మామిడిపూడి రామకృష్ణయ్య

ద్వితీయావృత్తి

వెల : రెండు వందల రూపాయలు



గ్రంథకర్త
స్వర్గీయ శ్రీ మామిడిపూడి రామకృష్ణయ్య గారు
వకీలు - నెల్లూరు

ముద్రణ : వాసిరెడ్డి ప్రింటర్స్, 38, అరవింద నగర్, దోమలగూడ, హైదరాబాదు - 29.



శ్రీ శ్రీ శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు
జగద్గురు శ్రీమత్ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారు

మొహరు

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య
శ్రీమచ్ఛంకరభగవత్పాద ప్రతిష్ఠిత
శ్రీకాంచీ కామకోటి పీఠాధిప జగద్గురు
శ్రీమచ్చంద్రశేఖరేంద్ర సరస్వతీ శ్రీపాదైః

క్రియతే నారాయణస్మృతిః

ధర్మానుష్ఠాపనార్థమేవ ధృతశరీరస్య భగవదవతారస్య
శ్రీరామచంద్రస్య చరిత ప్రతిపాదన వ్యాజేన సత్పుత్రకర్తవ్యం,
స్త్రీణాం పాతివ్రత్యమ్, భ్రాతౄణాం పరస్పర ప్రేమ, రాజ్ఞః
ప్రజాపరిపాలన రీతిః, సత్యస్య మహిమా ఇత్యాదీన్ సద్ధర్మాన్
కాంతాసమ్మితతయా ఉపదిశన్ శ్రీరామాయణాఖ్యః
ఇతిహాసః భారతేవర్షే అనితర సాధారణం స్థాన మావహతి.
అస్యేతిహాస తల్లజస్య సంస్కృతపరిచయరహితానా మాంధ్ర
భాషాజ్ఞానాం సులభార్థ బోధానుకూలతయా
సింహపురీ వాస్తవ్యేన మామిడిపూడి శ్రీరామకృష్ణేన సరళయా
రీత్యా లలితపదగుంఫనపూర్వకం రచితః సముచితోఽయ మను
వాదః పఠితౄణాం శ్రీరామచంద్రభక్తిప్రవర్తకో
భూయాదిత్యాశాస్మహే

విజయ యాత్రాస్థానం
నూంబల్
వికారి శ్రావణశుద్ధ చతుర్దశీ

నారాయణస్మృతిః



కృతిసమర్పణ మహోత్సవ సభకు
అధ్యక్షత నహించిన ఆంధ్రప్రదేశ్ హైకోర్టు జడ్జి
శ్రీ సత్యనారాయణరాజుగారు

శ్రీ ర స్తు

# శ్రీమద్వాల్మీకి రామాయణ కథామృతము

## వచన కావ్యము

ఇది నెల్లూరు పురవాస్తవ్యులు ప్రసిద్ధ న్యాయవాదులు నగు శ్రీ మామిడిపూడి రామకృష్ణయ్యగారు రచించియున్నవారు. ఇది గద్య రూపము నొంది నడుమ నడుమ వాల్మీకుల పద్యములంగూడి పద్యమువలె హృద్య మగుచున్నది. ఈ కూర్పు సువర్ణహారమున మణులు చేర్చి కూర్చి నట్లు గానవచ్చి మెచ్చు హెచ్చిల్లఁజేయుచున్నది....................

............కొన్ని తెలుఁగు పుస్తకములలో మూలములోని మెఱుఁగులు లోపించుటలు గానవచ్చును గాని యీ పుస్తకమునం దట్లుగాక ఆయా మెఱుఁగు లన్నియు విన్ననువొప్పఁ జెప్పఁబడియున్నవి.

ఈ రచన నాతికఠిన మృదుమధురముగా మనోహరముగా నున్నది. ............కవిగారీ గ్రంథము అచిరకాలములో ముద్రించి, ఆంధ్ర లోకోపకారము గావింతురుగాక యని కోరుచున్నాను.

మకామ్
నెల్లూరు
11–1–60

ఇట్లు,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ఆంధ్రప్రభుత్వాస్థాన కవి.

ఓమ్

శ్రీరామాయనమః

# విజ్ఞప్తి

శ్రీరాముడు మా యిలువేల్పు. మా పితృపితామహులు గీర్వాణభాషా కోవిదులు. నా పూర్వ పుణ్య వశమున శ్రీమద్వాల్మీకి రామాయణమును అనేక పర్యాయములు పారాయణము చేయు భాగ్యము నా కొదవినది.

నేను వృత్తిచే న్యాయవాదిని. విశ్రాంతి వేళలయందు మా న్యాయవాది సంఘ భవనమున రామాయణ ఘట్టములలో కొన్నింటినిగూర్చి నేను ముచ్చటించుటయు నా మిత్రులు శ్రద్ధా భక్తులతో వినుటయు పలుమారు జరుగుచుండినది. అట్లు కూరిమితో వారు వినుటకు కారణము వారికి నాపైగల ప్రేమాభిమానములే - వినుటయే కాదు. రామాయణ కథ ఆద్యంతము నెల్లూరి పౌరులకు నేను నా మాటలతో చెప్పి వినిపింపవలయు నని ప్రోత్సహించిరి. ఈ ప్రోత్సాహకులలో ముఖ్యులు శ్రీయుతులు మోచర్ల రామకృష్ణకవి, గుట్టం సుబ్రహ్మణ్యం, కోట శ్రీనివాసరావు, నేలనూతుల శ్రీకృష్ణమూర్తి గార్లు. నా శక్తినసమర్థతను తెలిసికొనిన వాడ నైనను మిత్రుల మాటలు త్రోసిపుచ్చజాలక, నేను నెల్లూరు ఫండ్ ఆఫీసు హాలులో ఎనిమిది దినములు ఉపన్యాసములు చెప్పి రామాయణ కథా కథనము పూర్తి చేసితిని. నా యుపన్యాసములను పుస్తక రూపమున ప్రచురించినయెడల ఆంధ్రదేశమున కంతటికిని ఉపయోగకరముగా నుండునని ఊదిపలికి నా మిత్రులు ఈ గ్రంథరచనకు నన్ను ప్రేరించిరి. భగవదనుగ్రహమున గ్రంథరచన పూర్తి యైనది.

ఈ గ్రంథమునకు ఇప్పటి యీ రూపమును తెచ్చిన వారు 'సరసకవి' 'సాహిత్యరత్న' శ్రీ మోచర్ల రామకృష్ణయ్య. వారికి నే నెంతయు కృతజ్ఞుడను. ఈ గ్రంథమును నా మిత్రుడు శ్రీ నేలనూతుల శ్రీకృష్ణమూర్తి ఆంగ్లభాషలోనికి హృద్యముగా అనువదించి యున్నారు. ఆ యనువాదము అచిరకాలమున ముద్రితమై ప్రకటిత మగునట్లు భగవంతు డనుగ్రహించునని విశ్వసించుచున్నాను.

ఈ రచన శ్రీమద్వాల్మీకి రామాయణము ననుసరించియే కావింపబడినది. ఆ యా ఘట్టములలో నాకు తోచిన భావములను ప్రత్యేకముగా సూచించియున్నాను. అట్లు చేయుటలో ఒక్కొక్క విషయములోని ప్రాముఖ్యమును నిర్దేశించుట మాత్రమే నా యుద్దేశము.

గ్రంథరచనము పూర్తి అయినపిమ్మట నాకు గలిగిన ఒక అనుభూతి ఫలితముగా నేను నా వ్రాతప్రతిని గైకొని నా మిత్రులు శ్రీయుతులు మోచర్ల రామకృష్ణకవి, కోట శ్రీనివాసరావు, నేలనూతుల శ్రీకృష్ణమూర్తి వార్లను కూడి శ్రీశ్రీశ్రీ కంచి కామకోటి పీఠాధిపతుల దర్శనము చేసికొనుటకై 9-8-59 తేదీ నాడు బయల్దేరితిని. మద్రాసు సమీపమందున్న నూంబల్ గ్రామమున శ్రీవారి దర్శన భాగ్యము మాకు లభించెను.

ఆ సందర్భమున మా రామకృష్ణకవి రచించి శ్రీవారి సన్నిధిలో చదివిన ప్రార్థనా పద్యరత్నముల నిందు పొందుపరచుచున్నాను.

కలలో నెచ్చెలి కాంచఁగల్గిన భవత్కల్యాణరూపంబు మి
త్రుల మీ నల్వుర మొక్కతూరి కని సంతోషింపగా నెంచి, య
గ్గలపుం గౌతుక మూని వచ్చితిమి - మీ కారుణ్య సంపూర్ణ ని
ర్మల దృష్టిం బ్రసరింపఁజేయవలయున్ మాపైఁ బరివ్రాణ్మణీ!

భవతాపఘ్నము మీ సుదర్శనము లబ్ధంబయ్యె, రామాయణ
శ్రవణైక వ్యవసాయ కారణముగా, బ్రహ్మణ్యమూర్తీ సదా
శివ సారూప్యవిరాజమాన నిగమ శ్రీరాశి మా నల్వురన్
భవ దాశీస్సుమసౌరభప్రభవసంపన్మాన్యులన్ జేయవే!

మా మిత్త్రుం డగు రామకృష్ణుఁడు రఘుశ్రీకాంతు చారిత్రమున్
సామోదంబుగ భక్తి సంభరిత దీక్షం బూని గద్యంబుగా
సీమం బొప్ప రచించి భక్తులకు విన్పించెన్ బ్రసాదింపుమీ
స్వామీ తత్కృతి మీ యనుగ్రహ కటాక్షప్రేమపాత్రంబుగాన్:

ఈ పద్యములు పఠింపబడిన పిదప, నా యీ గ్రంథము నుండి మూడు ఘట్టముల యందలి మూడు పట్టులను, శ్రీ కృష్ణమూర్తిగారి యాంగ్లానువాదమునుండి కొన్ని సన్నివేశములను వినిపించుకొని శ్రీవారు ఆశీర్వదించినారు. శ్రీవారి ప్రసాదమును స్వీకరించితిమి. శ్రీవారు ప్రసాదించిన శ్రీముఖమును కృతజ్ఞతతో ఇందు పొందుపరచుచున్నాను.

ఈ గ్రంథమును శ్రీ మోచర్ల రామకృష్ణయ్య సింహపురి వర్ధమాన సమాజ యాజమాన్యమున నెల్లూరు పురమందిరపు ఆవరణమునం దున్న శ్రీ రేబాల పట్టాభిరామిరెడ్డి పఠన మందిరమున తే 16-8-59 దీ నుండి రమారమి నలుబది దినములు చదివి వినిపించి నెల్లూరి పౌరులకు అత్యంతానందము చేకూర్చినారు. రామకృష్ణయ్యగారివంటి ప్రబంధ పఠన రచనా ప్రవీణులు ఆంధ్రదేశమున ఎందరో లేరని నా యభిప్రాయము. శ్రోతలలో కొందరు గ్రంథముద్రణమునకై ద్రవ్యసాహాయ్యము చేయుటకు సంసిద్ధులైరి. మరికొందరు ఉదారులు తదుపరి కొంతవరకు సాయపడిరి. వారి కందరికి నా కృతజ్ఞత తెల్పుచున్నాను.

తేదీ 12-9-59 నాడు కృతి సమర్పణోత్సవము నెల్లూరు పుర మందిరమున వైభవోపేతముగా జరిగినది. నా గురువర్యులు ఆచార్య శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్య, వారి సతీమణి సౌభాగ్యవతి వెంకమ్మగారలు నా కృతిని అంకితము గావించుకొనుటకు సమ్మతించి ప్రతిగ్రహించి నన్ను కృతార్థుని జేసినారు. ఆచార్యులవారు నాకు జ్యేష్ఠ సోదరు లగుటయే కాక ప్రాథమిక విద్యార్థి దశయందును కళాశాలలో చదువునప్పుడును నాకు విద్య నేర్పిన గురువులు. ఆ దంపతులు నన్ను చిన్ననాటినుండియు ప్రేమతో పెంచి పెద్దజేసి దారికి తెచ్చినవారు. వారిరువురు పవిత్రమూర్తులు. ఈ కృతిని వారికి సమర్పించి కొంతకు కొంత

వారి ఋణము తీర్చుకొని ధన్యుడనైతినని నమ్ముచున్నాను. కృతిసమర్పణోత్సవ సభకు అధ్యక్షత వహింపుడని నేను కోరిన వెంటనే నా సంప్రార్థనమును మన్నించి నెల్లూరి కరుదెంచి ఏతత్సదస్సును జయావహముగా నిర్వహించిన ఆంధ్రప్రదేశ్ హైకోర్టు జడ్జి శ్రీ సత్యనారాయణరాజు గారికి నా నమస్సులు. ఆనాటి సమావేశమున జదువబడిన శ్రీ రామకృష్ణకవి కృతమైన అభినందన పద్య పంచకము నిందు జతపరచుచున్నాను.

విలస న్మామిడిపూడివంశ కలశాబ్ధిప్రస్ఫురత్పూర్ణచం
ద్రులు శ్రీ వేంకటరంగయాఖ్య విబుధుండున్ రామకృష్ణార్యుఁ ద
ర్మిలి పర్తింతురు రామలక్ష్మణుల పేర్మిన్ దమ్ముఁ డన్నయ్య కీ
చెలువొప్పన్ కృతి యిచ్చుటన్ గనిన మా చిత్తంబు లుప్పొంగెడిన్.

శుభసంధాయకమైన రామకథ నీ శుద్ధాంతరంగుండు తా
నభిరూపస్తవనీయగద్యకృతి సేయంగల్గి సౌభ్రాత్ర సౌ
రభముల్ నిండగ నంకితం బొసఁగె నౌరా! సత్యనారాయణ
ప్రభుఁ డధ్యక్షుఁడుగా లభించె సభ కీ భాగ్యంబు సామాన్యమే!

తన విద్యార్థిదశన్ సవిత్రివలె వాత్సల్యంబుతోఁ దన్నుఁ బెం
చిన సౌశీల్యనిధిన్ వధూనికను, వాసిన్ వన్నెయున్ గూర్చి వి
ద్యను విత్తార్జనకౌశలంబు ననుసంధానించి త న్నాదరిం
చిన యన్నన్ గృతిరత్నభూషితులఁ జేసెన్ దమ్ముఁ డర్హంబెకా!

ఆర్యారాధ్యులు కామకోటిగురు పీఠాధ్యక్షులౌ శంకరా
చార్యస్వాములవారి మంగళ వచ స్సంపత్తి వాల్మీకి వా
గ్ధుర్య శ్లోక పరంపరాకలిత మాధుర్యంబు సీతాపతి
స్థైర్యౌదార్య మహత్త్వ మీ సుకృతి నాచంద్రార్కమున్ నిల్పతన్.

భక్తానీకము లాలకించి నవశోభాలాభమార్జింప, నా
సక్తిన్ నేను పఠింప మంచి యవకాశంబున్ బ్రసాదించె సం
సక్త స్నేహరసప్రపూరిత మనీషన్ రామకృష్ణార్యుఁ డు
త్సిక్తప్రీతికృతజ్ఞతాయుతమతిన్ జేమోడ్పు లర్పించెదన్.

ఈ గ్రంథము ప్రచురించుటకు వలసిన సౌకర్యములు నా కొనగూర్చిన ఆడిటరు శ్రీ వేదం మహదేవన్ గారికిని శ్రీ ఏనుగు సుందరరామిరెడ్డి గారికిని శ్రీ వేమన రామచంద్రయ్య నాయుడుగారికిని శ్రీ ఈపూరు బలరామిరెడ్డిగారినికి శ్రీ సానెకొమ్ము మాలెకొండారెడ్డి గారికిని చిరంజీవి మామిడిపూడి ఆనందమునకును శ్రీ గాదిరాజు శ్రీరామమూర్తి గారికిని నా ప్రత్యేక కృతజ్ఞతను ఈ కృతిముఖమున వ్యక్తము చేయుచున్నాను. ఈ గ్రంథమును ఇంత ముచ్చటగా అచ్చొత్తించి యిచ్చిన హైదరాబాదు 'యువ ప్రెస్సు' వారికిని శ్రీరామపట్టాభిషేక త్రివర్ణ

చిత్రమును చిత్రించన నా కుమారుడు చి॥ కృష్ణమూర్తికిని నా కీ రచనమునను ముద్రణమునను సహాకరించిన వారి కందరకును శ్రీ సీతారామచంద్రమూర్తులు సకల శ్రేయస్సులను సమకూర్తురు గాక.

ఆంధ్రదేశములో ఆబాలగోపాలము చదువుట కనువైన శైలిలో మాతృకానుసారము వ్రాయబడిన దీనిని పఠించి యానందించి యే కొందరైనను మూలమును పారాయణము చేయుదు రన్న ఆశతో మూల శ్లోకములను అచ్చటచ్చట ఇమిడ్చియున్నాను. అది ఫలించునేని నా యీ పరిశ్రమము సార్థకమైనదనుట నిస్సందేహము. శ్రీమద్రామాయణము నిత్య జీవితములో మన కెంతో ఉపకరింపగల దనుట పరమసత్యము.

రచనములోని పొరపాటులను సహృదయులు మన్నింతురుగాక.

— మామిడిపూడి రామకృష్ణయ్య

శ్రీరామాయనమః

# ప్రార్థన

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే.

దోర్భిర్యుక్తా చతుర్భిః స్ఫటికమణిమయీమక్షమాలాందధానా
హస్తేనైకేన పద్మం సితమపి చ శుకం పుస్తకం చాపరేణ
భాసా కుందేందు శంఖ స్ఫటికమణి నిభా భాసమానాసమానా
సా మే వాగ్దేవతేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా.

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకికోకిలం

వాల్మీకేర్మునిసింహస్య కవితావనచారిణః
శృణ్వన్ రామకథానాదం కోనయాతి పరాంగతిమ్.

యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్
అతృప్తస్తం మునిం వందే ప్రాచేతసమకల్మషమ్.

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్.

అంజనానందనం వీరం జానకీ శోకనాశనమ్
కపీశమక్షహంతారం వందే లంకాభయంకరమ్.

ఉల్లంఘ్య సింధోః సలిలం సలీలం
యః శోకవహ్నిం జనకాత్మజాయాః
ఆదాయతేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయమ్.

ఆంజనేయమతిపాటలాననం కాంచనాద్రి కమనీయ విగ్రహమ్
పారిజాత తరుమూలవాసినం భావయామి పవమాన నందనమ్.

యత్రయత్ర రఘునాథ కీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్.

మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి.

యఃకర్ణాంజలిసంపుటై రహరహఃసమ్యక్ పిబత్యాదరా
ద్వాల్మీకేర్వదనారవింద గళితం రామాయణాఖ్యంమధు
జన్మవ్యాధి జరావిపత్తి మరణై రత్యంత సోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోఃపదం శాశ్వతమ్.

తదుపగతసమాస సంధియోగం సమమధురోపనతార్థవాక్యబద్ధమ్
రఘువర చరితం మునిప్రణీతం దశశిరసశ్చవధం నిశామయధ్వమ్.

వాల్మీకిగిరి సంభూతా రామసాగరగామినీ
పునాతు భువనం పుణ్యా రామాయణ మహానదీ
శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోల సంకులమ్
కాండగ్రాహమహామీనం వందే రామాయణార్ణవమ్.

వేదవేద్యేపరేపుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా.

వైదేహీసహితం సురద్రుమతలే హైమేమహామండపే
మధ్యేపుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్
అగ్రేవాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యఃపరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామంభజే శ్యామలమ్.

వామే భూమిసుతా పురశ్చ హనుమాన్ పశ్చాత్ సుమిత్రాసుతః
శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయోర్వాయ్వాది కోణేషు చ
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవాన్
మధ్యే నీలసరోజకోమలరుచిం రామంభజే శ్యామలమ్.

నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యైచతస్యై జనకాత్మజాయై
నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో నమోఽస్తు చంద్రార్కమరుద్గణేభ్యః

ఓం తత్సత్

శ్రీ రా మా య న మః

# వి ష య సూ చి క

## బాల కాండము

## అయోధ్యా కాండము

## అరణ్య కాండము

## కిష్కింధా కాండము

## సుందర కాండము

## యుద్ధ కాండము

శ్రీ రామాయనమః

# శ్రీమద్వాల్మీకి రామాయణ కథామృతము

## బాలకాండము

శ్రీమద్రామాయణము ఆర్షము. వాల్మీకి మహర్షి ప్రోక్తము.

రామాయణమునకు 'సీతాచరిత్రము' - 'రావణ వధము' అనియు పేర్లు ఉన్నవి.

కావ్యం రామాయణం కృత్స్నంసీతాయాశ్చరితం మహత్
పౌలస్త్య వధ మిత్యేవ చకార చరితవ్రతః. బాల 4-7

రామాయణము శృంగారాది నవరస భరితమైన ఆదికావ్యము. తరువాత జనించు కవుల కందరికిని ఆధారభూతమైనది.

పరం కవీనా మాధారం 4-26

చదువుటకు పాడుటకు కూడ వీలైనది.

పాఠ్యే గేయే చ మధురం ప్రమాణై స్త్రిభిరన్వితమ్ ।
జాతిభి స్సప్తభిర్బద్ధం తంత్రీలయ సమన్వితమ్. 4-8

ధర్మార్థ కామములను చక్కగా ప్రతిపాదించునది, సముద్రమువలె రత్న సంపన్నమైనది, (లోతుకు పోవుచున్నకొలది అమూల్య రత్నములు లభించును) వీనులకు విందుచేయునది, మనస్సును రంజిల్లజేయునది, సమస్త అవయవములకు, మనస్సులకు, హృదయములకు ఆనందము కలుగజేయునది.

కామార్థ గుణ సంయుక్తం ధర్మార్థ గుణ విస్తరమ్ ।
సముద్రమివ రత్నాఢ్యం సర్వశ్రుతి మనోహరమ్. 3 8
హ్లాదయ త్సర్వగాత్రాణి మనాంసి హృదయాని చ 4-29

ఇట్టి మహిమగల రామాయణమును అందరు శ్రద్ధగా చదివి సుఖమును శాంతిని పొందుదురుగాక !

## రామాయణము పుట్టుక

వాల్మీకి మహర్షి ఆశ్రమము చిత్రకూటపర్వతము సమీపమున ఉండినట్లును సీతా రామలక్ష్మణులు తమ అరణ్యావాస కాలములో అచ్చటికి వెళ్ళి ఋషిని సందర్శించి నట్లును కానవచ్చుచున్నది.

ఇతి సీతాచ రామశ్చ లక్ష్మణశ్చ కృతాంజలిః
అభిగమ్యాఽఽశ్రమం సర్వే వాల్మీకి మభివాదయన్. అయోధ్య 56-16

తాన్మహర్షిః ప్రముదితః పూజయామాస ధర్మవిత్
ఆస్యతామితిచోవాచ స్వాగతంతు నివేద్యచ. అయోధ్య 56-17

అరణ్యములో ఆశ్రమమును నిర్మించుకొని తపస్సు చేయుచుండిన మహర్షికి కావ్యము వ్రాయు తలంపు ఏవిధముగా జనించినదో తెలిసికొందము.

దేవర్షియైన నారదుడు ఒకనాడు వాల్మీకి మహర్షి ఆశ్రమమునకు విచ్చేసినారు. ఏదియో గొప్ప కార్యమును తలపెట్టిగాని రారు నారదులవారు. వారికి తగిన విధమున సత్కారము చేసి వాల్మీకి వారిని ఒక ప్రశ్న అడిగినారు

తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్. బాల 1-1

వాల్మీకి: మహర్షీ! నేను ఉదాహరించు పదునారు గుణములు కలిగియున్న పురుషు డెవ్వడైన ఈ లోకమున ఉన్నాడా?

ఇట్లు పలికి ఆ పదునారు గుణములు గల పురుషుని వర్ణించినాడు. (1) గుణవంతుడు (2) వీర్యవంతుడు (3) ధర్మజ్ఞుడు (4) కృతజ్ఞుడు (5) సత్యవాక్కు గలవాడు (6) దృఢవ్రతుడు (7) శుద్ధ చారిత్రము గలవాడు (8) సమస్త ప్రాణులకు హితుడు (9) విద్వాంసుడు (10) సమర్థుడు (11) సర్వదా ప్రియదర్శనుడు (12) ధృతిగలవాడు (13) క్రోధమును జయించినవాడు (14) ద్యుతిమంతుడు (15) అనసూయకుడు (16) రోషము కలిగినప్పుడు దేవతలకు సైతము భయము కలిగింప గలవాడు.

ఇట్టి నరు డెవ్వడేని ఉన్నయెడల తెలియజెప్పుడు - ముల్లోకములలో మీకు తెలియని విషయము లేదుగదా! వినుటకు వేడుకపడుచున్నాను.

నారదుడు :- వాల్మీకి మహర్షీ! గొప్ప ప్రశ్ననే అడిగితివి! ఇన్ని గుణములతో కూడిన నరుడు సులభుడు కాదు.

బహవో దుర్లభాశ్చైవ యే త్వయా కీర్తితా గుణాః 1-7

కాని అట్టి ఉత్తమ పురుషుడు కూడ ఒకడున్నాడు. అతడే రాముడు. శ్రీరాముని కథ సర్వము సంగ్రహముగా చెప్పెదను వినుము.

ఇట్లు చెప్పి నారదులవారు శ్రీరాముని చరిత్రను ప్రారంభించినారు. "ఇక్ష్వాకు వంశ ప్రభవః" అని మొదలు పెట్టినారు.

[ఈ యెత్తుగడ యెంత చక్కగా ఉన్నది! ఒక మానవుడు ఎంత గొప్పవాడైనను వాని తండ్రి యెవడు తాత యెవడు అని అడుగుట లోకములో సహజము. ఇది నిర్లక్ష్యముగా త్రోసిపుచ్చదగిన మాటకాదు. గొప్ప వంశములో జన్మించిన వానికి గొప్ప గుణములు సహజముగా పుట్టుకతోనే కలుగును - 'సహజము' అనుమాటకు ఇదే అర్థము - అట్లే హీనవంశములో పుట్టినవానికి తగ్గుగుణము లుండును - అన్నివసతులు చక్కగా అమరియుండు కాలములో అందరు పెద్దబుద్ధి కలిగి మర్యాదగా ఉందురు. కాని ఒక చిక్కులో పడినప్పుడు వారివారి సహజ గుణము తప్పక తలచూపి పనిచేయును. ఈ సత్యము రామాయణములో అనేక స్థలములయందు ఉదాహరింపబడి యున్నది-ఆ యా సందర్భములలో వానిని గమనింపవచ్చును.]

నారదులవారు శ్రీరాముని కథను ప్రారంభించినారు.

> ఇక్ష్వాకువంశ ప్రభవో రామోనామ జనైః శ్రుతః
> నియతాత్మా మహావీర్యో ద్యుతిమా న్ధృతిమాన్ వశీ. 1-8

[ఈ విధముగా ప్రారంభించి నారదులవారు శ్రీరాముని చరిత్ర నంతయు వాల్మీకి మహర్షికి నివేదించినారు. ఇదియే బాలకాండలోని మొదటి సర్గ. దీనిని 'బాలరామాయణము' అందురు. ప్రాతకాలములో వీధి బడులలో విద్యార్థులకు చెప్పుచుండువారు. ఇప్పుడు కూడ చెప్పుట మంచిది.]

నారదులవారు రామచరిత్రను వాల్మీకి చెవిని వేసి దేవలోకమునకు వెళ్లినారు. ఆతరువాత వాల్మీకి మహర్షి స్నానార్థము నదికి బయలుదేరినారు. శిష్యుడు కలశమును గైకొని గురువుల వెంబడి నడచినాడు. వాల్మీకి నదియొద్దకు వెళ్ళి ప్రకృతి సౌందర్యమును అనుభవించుచు తిరుగుచుండగా ఆయన కొక దృశ్యము కనబడినది. క్రౌంచ పక్షుల జంట ఒక చెట్టుమీద కూడి క్రీడించుచుండగా ఒక బోయవాడు అచ్చటికి వచ్చి పోతుపిట్టను కొట్టినాడు. అది విలవిల తన్నుకొని క్రింద పడిపోయినది. ఇదంతయు వాల్మీకి కండ్లలో పడినది. ఆయనకు జాలి కలిగినది. ఆయన నోటినుండి ఈ మాటలు వెడలి వచ్చినవి.

> మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమ శ్శాశ్వతీస్సమాః
> యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్. 2-15

ఈ మాటలు ఆయనకు తెలియకనే శ్లోక రూపమున వెల్వడినవి. వాల్మీకి హృదయములో ఆవేదన పుట్టినది. ఈ శ్లోకమును గురించి ఆలోచన చేయుచునే స్నానము ముగించుకొని ఆశ్రమమునకు వచ్చినాడు. జపమునకు కూర్చుండినను ఆవేదన వాల్మీకిని వదలలేదు. ఇంతలో బ్రహ్మదేవుడు అచ్చటికి వచ్చినాడు. వాల్మీకి మహర్షి బ్రహ్మదేవునికి పాద్యము అర్ఘ్యము ఆసనము వందనము సమర్పించి పూజించినారు.

**బ్రహ్మ :** మహర్షీ! మీరును ఆసీనులు కండు.

వాల్మీకి కూర్చుండినాడు కాని ఆయన మనస్సంతయు శ్లోకము మీదనే లగ్న మైనది. ఎదుట నుండిన బ్రహ్మను గూడ మఱచిపోవు స్థితిలో ఉన్నాడు.

బ్రహ్మదేవుడు దీనిని గమనించి చిఱునవ్వుతో అనుచున్నాడు.

బ్రహ్మ :- మహర్షీ ! ఏమి నీ ఆలోచన ? నీవు పలికినది శ్లోకమే. ఇందులో సందేహమేమియు లేదు. నా ఇష్టము ననుసరించియే నీ నోటినుండి ఆ శ్లోకము వెల్వడినది.

శ్లోక ఏవ త్వయాబద్ధో నాత్ర కార్యా విచారణా
మచ్ఛన్దాదేవ తే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ. 2-30

రామకథను నారదుని వలన సంగ్రహముగా విన్నావుగదా. ఆ కథను శ్లోక రూపమున సంపూర్ణముగా నిర్మింపుము. రాముడు, లక్ష్మణుడు, సీత, రాక్షసులు మొదలైనవారి అందరి చేష్టలు సంకల్పములు ప్రకాశముగా ఉండునవిగాని రహస్యముగా ఉండునవిగాని సమస్తము నీ మనస్సునకు గోచరింపగలవు. నీ కావ్యమందు అబద్ధమను నది ఉండనే ఉండదు. రామకథను శ్లోకరూపముగా చెప్పుము. వినువారి పాపములు నశించి పోవును. నీవును శాశ్వత కీర్తిని పొందగలవు.

రహస్యంచ ప్రకాశంచ యద్వృత్తం తస్యధీమతః
రామస్య సహ సౌమిత్రే రాక్షసానాంచ సర్వశః. 2-33

వైదేహ్యాశ్చాపి యద్వృత్తం ప్రకాశం యదివా రహః
తచ్చా ప్యవిదితం సర్వం విదితంతే భవిష్యతి. 2-34

న తే వా గనృతా కావ్యే కాచి దత్ర భవిష్యతి
కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమామ్. 2-35

ఈ విధముగా వాల్మీకి మహర్షిని ఆశీర్వదించి బ్రహ్మదేవుడు అంతర్ధానమైనాడు. వాల్మీకి మహర్షికి ఉత్సాహము కలిగినది. నిర్మలమైన మనస్సుతో దర్భాసనము మీద కూర్చుండి ఆచమనముచేసి రామచరిత్రమునుగూర్చి ఆలోచింపసాగినాడు. విషయము లన్నియు అఱచేతి యందలి ఉసిరిక కాయవలె ఆయనకు స్పష్టముగా కానవచ్చినవి.

పాణా వామలకంయథా. 3-6

వాల్మీకి మహర్షి రామాయణమును పూర్తిచేసినారు.

ఈ విధముగా బ్రహ్మప్రసాదమున పుట్టిన రామాయణము అందఱును శ్రద్ధగా వినదగి యున్నది.

రామాయణము ఆరు కాండములుగా విభజింప బడియున్నది. (1) బాలకాండము, (2) అయోధ్యాకాండము, (3) అరణ్యకాండము, (4) కిష్కింధాకాండము, (5) సుందర

కాండము, (6) యుద్ధకాండము. రామాయణమునందు అయిదు వందల సర్గలు ఇరువది నాలుగువేల శ్లోకములు ఉన్నట్లు కనబడుచున్నది.

చతుర్వింశ త్సహస్రాణి శ్లోకానా ముక్త్వా నృషిః
తథా సర్గశతాన్ పంచ షట్కాండాని తథోత్తరమ్. 4-2

[ఇప్పటి ప్రతులను బట్టి చూడగా ఈ లెక్క సరిపోవుటలేదు. ఆరుకాండలలో అయిదు వందల ముప్పదియేడు సర్గలున్నవి. ఈ హెచ్చు తక్కువలతో మనకు పనిలేదు.

ఉత్తర కాండమును గురించి ఒక్కమాట పై శ్లోకమును బట్టి ఉత్తర కాండముకూడ వాల్మీకి రచితమని కనబడుచున్నది. కాని ఉత్తర కాండము వాల్మీకి రచన కాదని చెప్పువారు అనేకు లున్నారు. వాదములతో మనకు పనిలేదు. వాదోపవాదములకు యెడమిచ్చిన ఉత్తర కాండముకూడ మనకు పనిలేదు. లోక కల్యాణమునకు వలయు అన్ని విషయములు షట్కాండలలో సమగ్రముగా చెప్పబడియున్నవి. మన క్షేమమునకు అవియే చాలును.]

## కథా ప్రారంభము

సరయూనదీతీరమున కోసలమని ఒక గొప్ప దేశము కలదు. దాని ముఖ్యపట్టణము 'అయోధ్య'-పండ్రెండు యోజనముల నిడుపు, మూడు యోజనముల వెడల్పు-విశాలమైన వీధులు-ఎల్లప్పుడు నీరు చల్లించి శుభ్రముగా ఉంచెడివారు. అంగడి వీధులు, యంత్రాగారములు, ఆయుధశాలలు, నాటకశాలలు ఉద్యాన వనములు, హర్మ్యములు, ప్రాసాదములు-ఈనాడు మన గొప్పగొప్ప నగరములలో ఎన్ని వసతు లున్నవో అవి సర్వము అయోధ్యలో ఉన్నవి.

[అన్న విక్రయశాలలు మాత్ర మున్నట్టు కనబడదు.]

ఈ రాజ్యమునకు పాలకుడు దశరథమహారాజు ఆయనకు లోబడి సామంత రాజులు అనేకు లుండెడివారు. దశరథుడు ఇక్ష్వాకు వంశస్థుడు. 'రాజర్షి' అని ముల్లోకములలో పేరుబడ్డ ధర్మరతుడు-పరాక్రమవంతుడు. జను లందఱికి ప్రేమాస్పదుడు. దేశములో ఎట్టి బాధలు లేక ప్రజలందఱు తమ జీవితములను సుఖముగా గడపుచుండిరి. అందఱికి సుఖమున్నచో దొంగతనములుగాని, ఇతర నేరములుగాని రాజ్యములో ఉండవు. స్త్రీ పురుషు లెల్లరు ధర్మగుణము, ఇంద్రియ నిగ్రహము కలిగి పుట్టిననాటి నుండియు మంచి స్వభావము, సదాచారము కలిగి మహర్షులవలె పరిశుద్ధులుగా ఉండినారు.

**సర్వే నరాశ్చ నార్యశ్చ ధర్మశీలా స్సుసంయతాః**
**ఉదితా శ్శీలవృత్తాభ్యాం మహర్షయ ఇవామలాః** 6-9

**'అయోధ్య' అనగా శత్రువుల కెదరింప నలవికానిది అని అర్థము. సార్థక నామమును కలిగిన అయోధ్యకు దశరథ చక్రవర్తి ప్రభువు. దశరథునికి ముగ్గురు భార్యలు**

(1) కౌసల్య (2) సుమిత్ర (3) కైకేయి - మంత్రులు యెనిమిదిమంది (1) ధృష్టి (2) జయంతుడు (3) విజయుడు (4) సిద్ధార్థుడు (5) అర్థసాధకుడు (6) అశోకుడు (7) మంత్రపాలుడు (8) సుమంత్రుడు.

పురోహితులు ఇద్దరు (1) వసిష్ఠుడు (2) వామదేవుడు. వీరితోపాటు మఱి కొందఱు మంత్రు లుండినారు. వారందరు శ్రీమంతులు, బుద్ధిమంతులు, నీతిగలవారు.

[ మంత్రుల కుండవలసిన లక్షణములు ఏడవ సర్గ 5 మొదలు 12 వరకు శ్లోకములలో చెప్పబడి యున్నది.]

అందరు ఒకేమాట - అసూయలు లేవు.

శుచీనా మేక బుద్ధీనాం సర్వేషాం సంప్రజానతామ్. 7-12

మంత్రులిట్లున్న యెడల పరిపాలన చక్కగా ఏలయుండదు ? అట్టిరాజు, అట్టి మంత్రులు ఉన్నప్పుడు ప్రజలుకూడ సుఖముగా ఉందురు.

సమస్తము చక్కగనే యున్నది. కాని అందఱికి ఒకకొరత మాత్ర ముండినది. తమ ప్రభువుకు సంతానము కలుగలేదు. "తరువాతి సంగతి యేమి" అనిన చింత పట్టు కొన్నది. ఈబాధయే దశరథ చక్రవర్తినికూడ ఆవరించినది. ఇక్ష్వాకు వంశమును నిల బెట్టుటకు పుత్రుడు కావలయును. కుమారుని కోరి దశరథుడు పరితపించుచుండెను కాని లాభము లేకపోయినది.

తస్యత్వేవం ప్రభావస్య ధర్మజ్ఞస్య మహాత్మనః
సుతార్థం తప్యమానస్య నాసీ ద్వంశకర స్సుతః. 8-1

ఇట్లే దశరథుడు వృద్ధుడైనాడు. దినదినమునకు బాధ యెక్కువ కాజొచ్చినది. అట్టిస్థితిలో ఒకనాడు ఉన్నట్లుండి అతనికి ఒక ఆలోచన స్ఫురించినది.

*దశరథుడు :* (తనలో) ఏమి నా తెలివి ! పుత్రులు లేరు లేరని చింతించుచుంటినే గాని అందుకుగా విధింపబడిన యజ్ఞమును చేసి దేవతల నారాధింపక కాలము వ్యర్థము చేసితిని. ఇప్పటికైనను తోచుట ఎంతో మేలు.

సుతార్థం హయమేధేన కిమర్థం న యజామ్యహమ్. 8-2

దశరథుడిట్లు తలపోసి మంత్రులతో సంప్రదించి తన అభిప్రాయమును స్థిరపరచు కొని సుమంత్రుని పిలిచి "సుమంత్రా ! మా గురువులను పురోహితులను తోడ్కొని రమ్ము." అని ఆజ్ఞాపించినాడు. సుమంత్రుడుపోయి సుయజ్ఞుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, వసిష్ఠుడు మున్నగు బ్రాహ్మణోత్తములను తోడ్కొనివచ్చినాడు.

*దశరథుడు* : గురువులారా! పుత్రులులేని బాధ భరింపజాలకున్నాను. అశ్వమేధయాగము చేయవలయు నని నాకు సంకల్పము కలిగినది. నా కోరిక నెరవేరు తీరు మీరు నిర్ణయింపవలసినదిగా ప్రార్థించుచున్నాను.

*బ్రాహ్మణులు* : మహారాజా! పుత్రుల కొఱకు నీకిట్టి ధార్మిక బుద్ధి పుట్టినది. కాబట్టి నీకు పుత్రులు తప్పక కలుగుదురు.

దశరథునికి పట్టరాని సంతోషము కలిగినది. సరయూనది ఉత్తర తీరమున యజ్ఞభూమిని సిద్ధము చేయించి అన్ని వస్తువులను సమకూర్పు డని ఉత్తర్వు లిచ్చినాడు.

*దశరథుడు* : ఈ యజ్ఞమును యథాక్రమముగ మెలకువతో చేయవలెను. అపచారములు కలుగుటకు అనేక అవకాశము లేర్పడగలవు. విద్వాంసులైన బ్రహ్మరాక్షసులు ఏవియో ఛిద్రములను వెదకుచునే యుందురు. లోపము లున్నచో యజ్ఞకర్త వెంటనే నశించును. కావుననే యీ అశ్వమేధయాగమును అందరు రాజులు చేయరు. బ్రాహ్మణోత్తములారా! మీ రందరు యజ్ఞకర్మలయందు నిపుణులు. శాస్త్రవిహితముగా ఈ క్రతువును పూర్తి చేయవలసిన దని కోరుచున్నాను. మంత్రులారా! ఋత్విక్కులు చెప్పిన మేరకు సంభారము లన్నింటిని సిద్ధము చేయింపుడు.

ఈ విధముగా యెవరికి తగిన ఉత్తరువులను వారికిచ్చి దశరథుడు అంతఃపురమున కరిగి తన భార్యల కీసంగతిని తెలియపరచినాడు.

తమకు పుత్రప్రాప్తి కలుగుటకై మహారాజు చేసిన ప్రయత్నముల గూర్చి విన్న వారి ముఖ కమలములు హేమంత ఋతువు గడచిన పిదప పద్మములవలె శోభిల్లినవి.

ఇంత జరిగిన పిదప సుమంత్రుడు దశరథుని ఒక ప్రక్కకు పిలిచి రహస్యముగా కొన్ని మాటలు చెప్పినాడు.

*సుమంత్రుడు* : మహారాజా! నీ కోరిక తప్పక ఫలించును. నీకు పుత్రులు కలుగు విషయమును గురించి పూర్వకాలమున సనత్కుమారుడు ఋషుల సన్నిధిలో చెప్పిన మాటలు నే నిదివరలో వినియున్నాను. వానిని మనవిచేయుచున్నాను, వినుడు.

"కాశ్యప మహర్షికి విభండకు డను పుత్రుడు కలడు. విభండకునకు ఋశ్యశృంగుడు అను ఒక కుమారుడు పుట్టగలడు. అతడు అరణ్యములో తన తండ్రి మాటయందుండి బ్రహ్మచర్యవ్రతము ననుసరింపగలడు. ఆ కాలముననే రోమపాదు డను రాజు అంగదేశమును పాలించుచుండును. ఆ రాజు ధర్మము నతిక్రమించుట జేసి దేశములో అనావృష్టి బాధ సంభవించును. ప్రజలు ఎక్కువగా బాధ పడుదురు. [రాజు

ధర్మము తప్పినయెడల ప్రజలకెంత బాధ కలుగునో గమనింపదగ్గి యున్నది]. అంతట రాజు బ్రాహ్మణులను పిలిపించి 'దోష పరిహార మెట్లగును' అని అడుగ గలడు. 'ఋశ్యశృంగుని తోడ్తెచ్చి మీ కొమారిత శాంతాదేవిని అతని కిచ్చి వివాహ మొనరించిన యెడల యీ బాధ తొలగును' అని వారు చెప్పుదురు. రాజు కొందరు వేశ్యలను పంపి ఋశ్యశృంగుని తన రాజ్యమునకు పిలిపించును. వెంటనే వర్షము కురియగలదు. ఋశ్యశృంగునికి శాంత నిచ్చి పెండ్లి జరిపించి రాజు అతనిని తన ఇంటనే నిలుపుకొన గలడు. ఆ ఋశ్యశృంగుడు దశరథునికి పుత్రులు కలుగు మార్గమును విధింపగలడు" మహారాజా! ఇది నేను విన్నసంగతి. కావున ప్రస్తుతము మీరు చేయదగిన కార్య మొకటి యున్నది. మీరు స్వయముగా బలవాహనములతో అంగదేశమునకు పయనించి రాజునకును ఋశ్యశృంగునకును ఉచిత సత్కారములుసల్పి ఋశ్యశృంగుని తోడితెండు.

సత్వం పురుష శార్దూల తమానయ సుసత్కృతమ్
స్వయమేవ మహారాజ గత్వా స బలవాహనః 11-12

సుమంత్రుని మాటలను విని దశరథు డీ విషయమును వసిష్ఠునికి తెలియజెప్పి వారి అనుమతితో అంతఃపుర స్త్రీలను మంత్రులను వెంటనిడికొని రోమపాదుని నగరమునకు ప్రయాణమైనాడు.

[ ఇక్కడ మనము గమనింపదగిన విషయము. ఎంతో కాలము పుత్రులకుగా పరితపించుచుండిన దశరథునకు యజ్ఞము చేయవలయునను తలపు ఇంతకుపూర్వ మేల కలుగలేదు? సర్వజ్ఞుడైన వసిష్ఠ భగవానుడు ఈ యజ్ఞమును గూర్చి దశరథుని ఏల ప్రోత్సహింపలేదు? తనకు తెలిసిన రహస్యమును సుమంత్రుడు ఇంతకాలము తన ప్రభువున కేల తెలియపరచలేదు?

యజ్ఞమును గురించిన తలపు దశరథునకు స్వయముగా కలిగిననే కాని యజ్ఞము సఫలము కానేరదని కాబోలు! అందులకే కాబోలు ఇంతకాలము సుమంత్రుని కీ విషయము స్ఫురింపలేదు! మొత్తముమీద దైవయోగ మున్ననే గాని ఏ చిన్నపనియు జరుగదు! ]

## దశరథుడు ఋశ్యశృంగుని తోడ్తెచ్చుట

దశరథుడు సపరివారముగా అంగదేశమునకు బయలుదేరి రోమపాదుని నగరుకు పోయినాడు. వారిద్దరు చిన్ననాటి స్నేహితులు. రోమపాదుడు దశరథునకును అతని పరివారమునకును ఉచిత మర్యాదలు చేసి పూజించినాడు.

[ వెళ్లి వెళ్లుటతోడనే తాను వచ్చిన పనిని గురించి దశరథుడు చెప్పలేదు. "మీరు వచ్చినపని ఏమి" అని రోమపాదుడు అడుగలేదు. ]

దశరథుడు తన మిత్రుని ఆతిథ్యమును స్వీకరించుచు కాలమును గడపుచుండినాడు. ఏడెనిమిది దినములైన పిమ్మటగాని విషయమును బయట పెట్టలేదు.

ఏవం సుసత్కృత స్తేన సహోషిత్వా నరర్షభః
సప్తాష్ట దివసాన్ రాజా రాజాన మిద మబ్రవీత్. 11-18

[అప్పుడైనను "నీ అల్లుని పంపుము" అనలేదు. ఏమన్నాడు మఱి!]

"నీ కొమారిత శాంతను భర్తతో కూడ మా నగరికి పంపుము. ఒక గొప్ప కార్యము కావలసియున్నది" అన్నాడు.

శాంతా తవ సుతా రాజన్ సహ భర్త్రా విశాంపతే
మదీయ నగరం యాతు కార్యం హి మహదుద్యతమ్. 11-19

[ఎంత మెలకువ! ఎంత మాట పొందిక! ఎంత ఓర్పు! కార్యసాధనకు ఇంత నేర్పు కావలయును. మాటలాడు విషయమును గూర్చి దశరథుని యొద్ద నేర్చుకొనవలసిన అంశము లనేకము లున్నవి.]

రోమపాదుడు దశరథుని అభీష్టమును గ్రహించి అల్లుని పిలిపించి "నీ భార్యను తీసికొని దశరథుని వెంట వెళ్ళి ఆ మహారాజు పని చక్క జేయుము" అని చెప్పినాడు. అందరు అయోధ్యకు ప్రయాణమైనారు. తమ రాకను తెలుపుటకు దూతలను ముందు పంపించినారు. తమ ప్రభువు ఋశ్యశృంగ సమేతుడై వచ్చు సమాచారమును విని వారికి సుస్వాగత మిచ్చుటకై అయోధ్యానగరమును అలంకరించినారు. వీధులలో నీరు చల్లి ధూపములు వేసినారు. పతాకము లెత్తించినారు. పౌరు లందఱు ఆనందసాగరములో మునిగినారు.

[తమ ప్రభువుకు పుత్రసంతానము కలుగు యేర్పాటు జరుగుచున్నదిగదా!]

దశరథుడు ఋశ్యశృంగునితోకూడ నగరప్రవేశము చేసినాడు.

## అశ్వమేధయాగము

యజ్ఞమునకు కావలసిన యేర్పాటు లన్నియు జరుగుచున్నవి. అశ్వమును విడిచినారు ఒక వసంత ఋతువులో-మరల వసంత ఋతువు వచ్చినప్పుడు అనగా ఒక సంవత్సరమునకు యజ్ఞము ప్రారంభ మైనది.

పునః ప్రాప్తే వసంతేతు పూర్ణస్సంవత్సరోఽభవత్
ప్రసవార్థం గతో యష్టుం హయమేధేన వీర్యవాన్. 13-1

వసిష్ఠులవారు సంభారము లన్నింటిని సమకూర్చినారు. పనివారిని, ఇటుకలు చేయు వారిని, చెరువులు త్రవ్వువారిని, లెక్కలు వ్రాయువారిని, చిత్తరువులు తీర్చువారిని, నట నర్తకులను కూర్చినారు. వసతి గృహములు కట్టించినారు.

ఏర్పాటులన్నియు పూర్తిగావించి వసిష్ఠుడు సుమంత్రునితో అనుచున్నాడు.

వసిష్ఠుడు : సుమంత్రా! ఈ భూమండలములోని ధార్మికులైన రాజు లందరికి ఆహ్వానములు పంపుము. సమస్త దేశములలోని బ్రాహ్మణులను, క్షత్రియులను, వైశ్యులను, శూద్రులను వేనవేలకొలది మర్యాదగా పిలిచి రప్పింపుము. సమస్త శాస్త్ర పారంగతుడై మహాభాగ్యశాలియైయున్న జనకమహారాజును నీవు స్వయముగా ఆహ్వానింపుము. పూర్వసంబంధి గనుక అతని పేరు మొదట చెప్పితిని.

పూర్వసంబంధినం జ్ఞాత్వా తతః పూర్వం బ్రవీమి తే. 13-21

అట్లే దశరథునికి ప్రియమిత్రుడైన కాశీరాజును, దశరథుని మామగారైన కేకయరాజును, ఋశ్యశృంగుని మామగారైన రోమపాదుని స్వయముగా ఆహ్వానింపుము. అన్ని దిశలయందలి రాజులను పిలిపింపుము. అందఱిని పరివార బంధుజన సమేతులై రమ్మని ఆహ్వానములు పంపుము.

[బంధుమిత్రపరివార సమేతులై రమ్మని ఈనాడు మనము శుభలేఖలలో వ్రాయుమాట ఇక్కడిదే.]

సంతి స్నిగ్ధాశ్చ యేచాన్యే రాజానః పృథివీ తలే
తా నానయ యథాక్షిప్రం సానుగాన్ సహబాంధవాన్. 13-26

[వసిష్ఠుడు జాగరూకుడై సుమంత్రుని హెచ్చరించుచున్నాడు. "నేను పేరుపెట్టి చెప్పలేదని కొందరిని పిలువకుందువుకాబోలు! నేను పొరపాటువలన చెప్పకున్నను నీవుమాత్రము అందరికిని ఆహ్వానములు పంపుము సుమా!"]

వసిష్ఠుని మాట మేరకు అందరిని ఆహ్వానించినారు. యజ్ఞమునకు వలసిన కట్టడములు సంభారములు అన్నియు సిద్ధమైనవి. రావలసిన వారందరు వచ్చినారు. వసిష్ఠుడు పనివారికి ఒక ఉత్తరువు చేసినాడు. [అందఱు జ్ఞప్తియందుంచుకొన దగినది]

వసిష్ఠుడు : అన్నము పెట్టునప్పుడు శ్రద్ధతో పెట్టుడు. కామము వలనగాని క్రోధమువలనగాని ఏ సందర్భములలోను అనాదరముగా పెట్టకూడదు. అనాదరముతోకూడిన దానము దాతను తప్పక చెరుచును. ఈ మాటను మనస్సుననిలిపి ప్రవర్తింపుడు.

దాతవ్య మన్నం విధివ త్సత్కృత్య నతు లీలయా 13-12

సర్వేవర్ణా యథా పూజాం ప్రాప్నువంతి సుసత్కృతాః
నచావజ్ఞా ప్రయోక్తవ్యా కామక్రోధవశాదపి. 13-13

అవజ్ఞయా కృతం హన్యా ద్దాతారం నాత్ర సంశయః 13-31

ఒక మంచి దినము చూచుకొని దశరథుడు యజ్ఞశాలకు వెళ్లినాడు. ఋశ్యశృంగుని పురస్కరించుకొని వసిష్ఠాదులు యజ్ఞమును ప్రారంభించి యథా శాస్త్రముగా జరిపించినారు.

[పదునాల్గవ సర్గలోని వివరములు చూడగా వాల్మీకి మహర్షి ఎన్నియో యజ్ఞములు జరిపించి యుందురని స్ఫురించుచున్నది.]

యజ్ఞము చక్కగా జరిగినది. ఎవ్వరికిగాని అన్న వస్త్రములకు కొరతలేదు. తీరిక సమయములందు శాస్త్రచర్చలు జరుగుచుండినవి.

[అక్కడ సమావేశమైన వారందరు గొప్ప పండితులు. యజ్ఞము వలన ఎంత గొప్ప ప్రయోజనమో ఈ పట్టున తెలిసికొనవచ్చును.]

కర్మాన్తరే తదా విప్రా హేతు వాదా న్బహూనపి
ప్రాహుః సువాగ్మినో ధీరాః పరస్పర జిగీషయా. 14-17

యజ్ఞము పూర్తి అయినది. అశ్వము మెదడును పక్వము చేసినారు. దాని ధూమమును దశరథుడు ఆఘ్రాణించినాడు. ఆ తరువాత దశరథుడు తన రాజ్యము నంతయు దానము చేసినాడు. తూర్పుదిక్కును హోతకు పడమటి దిక్కును అధ్వర్యువునకు దక్షిణ దిక్కును బ్రహ్మకు ఉత్తర దిక్కును ఉద్గాతకు.

ఋత్విక్కులు:- మహారాజా! మా కెందులకీ రాజ్యములు? మేము వేదాధ్యయనము చేసికొనుచు కాలము గడపువారము. భూమిని పాలించుట మా తరమా! ఆ కార్యమునకు మీరే సమర్థులు. మాకు భూమి వలన ఎట్టి ప్రయోజనమును లేదు. దానిని మీరే ఉంచుకొని మాకు బంగారము గాని అట్టిది మఱియొకటి గాని ఇప్పింపుడు. మా కంతే చాలును.

[శక్తికి మించిన పనులకు పూనుకొనుట తప్పు గదా! అందులో రాజ్య పరిపాలనము సులభమైనది కాదు. అందఱు గమనింపదగి యున్నది.]

భవానేవ మహీం కృత్స్నా మేకో రక్షితు మర్హతి
న భూమ్యా కార్య మస్మాకం నహి శక్తాస్స్మ పాలనే 14-43
రతా స్స్వాధ్యాయ కరణే వయం నిత్యంహి భూమిప
నిష్క్రియం కించి దేవేహ ప్రయచ్ఛతు భవానితి. 14-44

మణి రత్నం సువర్ణం వా గావో యద్వా సముద్యతమ్
తత్ప్రయచ్ఛ నరశ్రేష్ఠ ధరణ్యా న ప్రయోజనమ్. 14-45

దశరథుడు బ్రాహ్మణులకు గోవులు వెండి బంగారు సమర్పించినాడు. ఋశ్యశృంగుడు, వసిష్ఠుడు వానిని బ్రాహ్మణు లందరికిని న్యాయముగా పంచిపెట్టినారు. బ్రాహ్మణులు దశరథునికి వేదోక్త ఆశీర్వాదములు చేసినారు. అశ్వమేధయాగము పూర్తి అయినది.

# పుత్రకామేష్టి

అశ్వమేధయాగము పూర్తియైన పిదప దశరథుడు ఋశ్యశృంగునకు నమస్కరించి "నాకు వంశవృద్ధికరమగు క్రతువును చేయింపుడు" అని ప్రార్థించినాడు. ఋశ్యశృంగుడు కొంచెము సేపు ఆలోచించి కార్యవిధానమును నిర్ణయించుకొని దశరథుని ప్రార్థనను అంగీకరించి వేదోక్త ప్రకారము హోమము చేసినాడు.

తతః ప్రాక్రమ్య తామిష్టిం పుత్రీయాం పుత్రకారణాత్
జుహావ చాగ్నౌ తేజస్వీ మంత్రదృష్టేన కర్మణా. 15-3

ఈ యాగమందు హవిర్భాగములను గ్రహించుటకు బ్రహ్మాది దేవత లందఱు ఒకచోట కలిసినారు. రావణాసురుని దుండగములను గుఱించి దేవతలందఱు బ్రహ్మతో మొఱపెట్టుకొన్నారు. అతనిని వధించు ఉపాయము నాలోచింపుమని బ్రహ్మను వేడుకొన్నారు.

బ్రహ్మ : (ఆలోచించి) రావణాసురుడు మానవునిచే చావవలసినవాడేగాని మఱియొక విధముగా అతనికి మరణములేదు.

ఈ మాటలలోనే విష్ణుదేవుడుకూడ అచ్చటికి విచ్చేసినాడు. బ్రహ్మాది దేవతలు విష్ణుదేవునికి నమస్కరించి రావణుని సంగతి ప్రస్తావించి "దేవా! నీ స్వరూపమును నాలుగు భాగములుగా విభజించుకొని దశరథునికి నలుగురు పుత్రులుగా పుట్టుదువుగాక అని ప్రార్థించుచున్నాము. దశరథుడు మహనీయుడు. అతని ముగ్గురు భార్యలు హ్రీ శ్రీ కీర్తి దేవతలకు సరివచ్చువారు. మీరు అవతరించుటకు తగియున్నది.

[దశరథుడు అయన భార్యలు ఎంతో గొప్పవారు. కానిచో వారికి విష్ణుదేవుడు పుత్రులుగా అవతరించునా!]

రాజ్ఞో దశరథస్య త్వ మయోధ్యాధిపతేః ప్రభోః
ధర్మజ్ఞస్య వదాన్యస్య మహర్షి సమతేజసః. 15-18
తస్య భార్యాసు తిసృషు హ్రీ శ్రీ కీర్త్యుపమాసు చ
విష్ణో పుత్రత్వ మాగచ్ఛ కృత్వాత్మానం చతుర్విధమ్. 15-19

విష్ణుదేవుడు : దేవతలారా! మీరు కోరినట్లే చేసెదను. లోకకల్యాణము కొఱకు మీరు కోరినట్లు నేను అవతరించి రావణుని వధించి పదునొకండువేల సంవత్సరములు భూమిని పాలింపుచు మనుష్యలోకములో ఉండగలను. ఇకమీద మీరు భయపడవలసిన పనిలేదు.

దేవతలు : స్వామీ! మహాప్రసాదము. కార్యమును నిర్వర్తించి మరల వైకుంఠమునకు దయచేయుడు.

[భూలోకములోనే ఉండిపోవుదురని భయపడినారు కాబోలు!]

విష్ణుదేవుడు అవతరించుటకు నిశ్చయించి అంతర్ధానమైనాడు.

సకృత్వా నిశ్చయం విష్ణు రామంత్ర్యచ పితామహమ్
అంతర్ధానం గతోదేవైః పూజ్యమానో మహర్షిభిః. 16-10

ఆ తరువాత ఋష్యశృంగుడు చేయుచుండిన ఇష్టి సందర్భమున ప్రజాపతి పంపున ఒక మహాపురుషుడు పాయస పూర్ణకుంభమును గైకొని అగ్నిహోత్రమునుండి వెడలి వచ్చి ఆ పాయస కుంభమును దశరథునకు సమర్పించినాడు.

తప్త జాంబూనదమయీం రాజతాంత పరిచ్ఛదామ్
దివ్యపాయస సంపూర్ణాం పాత్రీం పత్నీమివప్రియామ్
ప్రగృహ్య విపులాందోర్భ్యాం........ 16-17

ప్రాజాపత్య పురుషుడు: రాజా! నీయాగము వలన దేవతలు సంతృప్తులై నీకీ పాయసము నంపినారు. దీనిని సజాతీయులగు నీభార్యలకిచ్చి భుజింపజేయుము. నీకోరిక సఫలమగును.

భార్యాణా మనురూపాణా మశ్నీతేతి ప్రయచ్ఛవై
తాసుత్వం ప్రాప్స్యసే పుత్రాన్ యదర్థం యజసే నృప. 16-20

దశరథుడు ఆనంద నిమగ్నుడై ఆ పాత్రను శిరసా వహించి గైకొని ప్రాజాపత్య పురుషునకు నమస్కరించి ప్రదక్షిణముచేసి ధనమునొందిన దరిద్రునివలె మిక్కిలి సంతసించెను.

బభూవ పరమప్రీతః ప్రాప్యవిత్తమివాధనః. 16-23

ప్రాజాపత్య పురుషుడు అంతర్ధానమైనాడు.

## దశరథునికి పుత్రులు కలుగుట

దశరథుడు అంతఃపురమున కరిగి పాయసమును ముగ్గురు భార్యలకు పంచిపెట్టినాడు. కౌసల్యకు సగము నిచ్చినాడు. మిగిలిన సగములో సగము సుమిత్రకు మిగిలిన దానిలో సగము కైకేయికి ఇచ్చి ఆ మిగిలిన దానిని మరల సుమిత్రకు ఇచ్చినాడు.

కౌసల్యాయై నరపతిః పాయసార్థం దదౌ తదా
అర్ధాదర్ధం దదౌచాపి సుమిత్రాయై నరాధిపః. 16-30

కైకేయ్యై చావశిష్టార్థం దదౌ పుత్రార్థ కారణాత్
ప్రదదౌ చావశిష్టార్థం పాయస స్యామృతోపమమ్. 16-31

అనుచింత్య సుమిత్రాయై పునరేవ మహీపతిః
ఏవం తాసాం దదౌ రాజా భార్యాణాం పాయసం పృథక్. 16-22

[ఈ పట్టున మనము దశరథుని ధర్మబుద్ధిని గమనింపవలయును. కైకేయిమీద ఎంతటి మోహమున్నను పాయసము పంచుటలో పట్టపుదేవియైన కౌసల్యను విశేషముగా గౌరవించినాడు. సుమిత్ర గుణములను గమనించి ఆమెకు రెండుమార్లు పాయసము ఇచ్చినాడు. ప్రియురాలైన కైకేయికి యెనిమిదవ భాగమే చాలునని నిశ్చయించినాడు!]

దశరథుని ముగ్గురు భార్యలు పాయసము భుజించినారు. తరువాత కొంత కాలమునకు గర్భములను దాల్చినారు. దశరథుడు పరమానందభరితుడైనాడు.

## వానరుల సృష్టి

బ్రహ్మదేవుడు దేవతల నందఱిని పిలిపించినాడు.

బ్రహ్మ : దేవతలారా! విష్ణుదేవుడు రావణుని వధించుటకు భూలోకమున అవతరించి యున్నాడుగదా! ఆయన కచ్చట సహాయము కావలసియుండును. మీరందఱు మీ మీ పరాక్రమమునకు సరివచ్చు పరాక్రమముతో కూడిన వానర రూపధరులగు పుత్రులను అప్సరసల యందును గంధర్వ స్త్రీల యందును సృజింపుడు. నేనిదివరలోనే యెలుగుబంట్లలో మేటియైన జాంబవంతుని సృజించియున్నాను.

బ్రహ్మదేవుని అజ్ఞను దేవతలు శిరసావహించినారు. ఇంద్రుడు వాలిని, సూర్యుడు సుగ్రీవుని, బృహస్పతి తారుని, కుబేరుడు గంధమాదనుని, విశ్వకర్మ నలుని, అగ్నిదేవుడు నీలుని, అశ్విని దేవతలు మైందద్వివిదులును, వరుణుడు సుషేణుని, పర్జన్యుడు శరభుని, వాయుదేవుడు హనుమంతుని ఇతరులు పెక్కువేల బలశాలురైన వీరులను వానరులు యెలుగుబంట్లు కొండముచ్చుల ఆకారములతో సృష్టించినారు. నఖములను దంతములను ఆయుధములుగా కలిగి యున్నవారు. వారందఱు అస్త్ర కోవిదులు.

నఖదంష్ట్రాయుధా స్సర్వే సర్వే సర్వాస్త్ర కోవిదాః 17-24

వీరికందఱికి ప్రభువు ఇంద్రపుత్రుడైన వాలి.

ఈ విధముగా వానరసైన్యము సిద్ధమైనది. వానరులందఱు బలశాలురు-కామరూపులు. ఆకసమున కెగురగలరు. పర్వతములను ఛేదింపగలరు. అందఱు పండితులు. వానరులు వారి సేనానాయకులైన వాలిని సుగ్రీవుని నలుని నీలుని హనుమంతుని తదితర సేనానాయకులను కొలుచుచుండిరి.

## శ్రీరామ జననము

తన భార్యలు గర్భములు దాల్చినందుకు ఆనందపడుచు దశరథమహారాజు పుత్రుల జననమునకు వేచియుండినాడు. ఈ విధముగా ఆరు ఋతువులు గడచిపోయినవి. పండ్రెండవ మాసమున పుత్రులు కలిగినారు.

చైత్రమాసము - నవమితిథి - పునర్వసు నక్షత్రము - సూర్యుడు అంగారకుడు బృహస్పతి శుక్రుడు శని తమతమ ఉచ్చస్థానములగు మేష మకర కర్కాటక మీన తులా రాసులయందుండగా బృహస్పతి చంద్రునితో కూడియుండగా సమస్త లోక నాయకుడగు శ్రీరాముడు కౌసల్యా గర్భమునుండి ఆవిర్భవించినాడు.

తతో యజ్ఞే సమాప్తేతు ఋతూనాం షట్సమత్యయుః
తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ 18-8
నక్షత్రేఽదితిదైవత్యే స్వోచ్చ సంస్థేషు పంచసు
గ్రహేషు కర్కటేలగ్నే వాక్పతావిందునాసహ 18-9
ప్రోద్యమానే జగన్నాథం సర్వలోక నమస్కృతమ్
కౌసల్యాఽజనయద్రామం సర్వలక్షణ సంయుతమ్ 18-10
విష్ణోరర్థం మహాభాగం పుత్రమైక్ష్వాకు వర్ధనమ్. 18-11

పుష్యనక్షత్రము మీనలగ్నమున కైకేయికి భరతుడు జన్మించినాడు. మధ్యాహ్న వేళ ఆశ్లేషా నక్షత్రము కర్కాటక లగ్నమందు సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులు జన్మించినారు.

[లక్ష్మణునికంటె భరతుడు పెద్దవాడని ఏర్పడుచున్నది.]

ఈ విధముగా దశరథునికి నలుగురు కుమారులు కలిగినారు. గంధర్వులు పాడినారు. అప్సరసలు ఆడినారు. దేవదుందుభులు మ్రోగినవి. పుష్పవృష్టి కురిసినది. అయోధ్యలోని ప్రజలు గుంపులుగూడి వేడుకలు జరుపుకొన్నారు. పురము నిండ ఉత్సవములే.

దశరథుడు అందఱికి విరివిగా దానధర్మములు చేసినాడు. పదునొకండవ దినము గడవగనే కుమారులకు వసిష్ఠుడు నామకరణము జరిపించినాడు. రాముడు భరతుడు లక్ష్మణుడు శత్రుఘ్నుడు అనియెడు పేర్లు ఆయన పెట్టినవే.

కుమారులకు యుక్తకాలమున అన్నప్రాశన చౌలోపనయనాది కర్మలను జరిపించినారు. కుమారులు నలుగురు పెరుగుచున్నారు. వారిలో జ్యేష్ఠుడగు రాముడు ధ్వజమువలె శోభిల్లుచు కడమ కొడుకులకంటె ఎక్కువగా తండ్రికి సంతోషము కలిగించుచు సమస్తప్రాణులకు బ్రహ్మదేవు డెట్లో అట్లే మిక్కిలి ఇష్టుడుగా నుండెను.

**తేషాం కేతురివ జ్యేష్ఠో రామో రతికరః పితుః**
**బభూవ భూయో భూతానాం స్వయంభూరివ సమ్మతః** 18-23

[ఈ శ్లోకమును మఱవరాదు. కథ అంతయు దీనిమీద నే నడచినది. దశరథునికి రాముని యందుగల ప్రత్యేక ప్రేమయే కథకు బీజము.]

కుమారులు నల్వురును గొప్పవారు. వేద వేదాంగములలోను రాజవిద్యల యందును మేటులైనారు. ధనుర్వేదమును చక్కగా అభ్యసించినారు. కాని అందరి కంటె ఎక్కువగా శ్రీరాముడు ప్రశంస లందుకొన్నాడు. తండ్రిసేవయందు రతుడై ఉండినాడు.

చిన్ననాటినుండియు లక్ష్మణుడు రామునియెడ మిక్కిలి స్నేహము కలిగి రామునికి బహిఃప్రాణమై యుండినాడు. రాముని శరీరము రామునికి కలిగించు సంతోషముకంటె మిక్కిలిగా లక్ష్మణుడు రామునికి ప్రీతికలిగించుచుండినాడు !

సర్వప్రియకర స్తస్య రామస్యాపి శరీరతః
లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిఃప్రాణ ఇవాపరః 18-28

లక్ష్మణుడు లేనియెడల రామునికి నిద్రపట్టదు. అన్నము సహించదు.

నచతేనవినా నిద్రాం లభతే పురుషోత్తమః
మృష్ట మన్న ముపానీత మశ్నాతి నచ తం వినా 18-29

ఈ విధముగా రామలక్ష్మణు లిద్దరు జంటగా పెరిగినారు. అట్లే భరత శత్రుఘ్నులు మఱియొక జంట.

అన్నదమ్ములు నలుగురు పెరిగి పెద్దవారగుచున్నారు. వారి పెండ్లిమాట ఆలోచింపవలెగదా! దశరథుడు పురోహితుని, బంధువులను కూడి కుమారుల వివాహము లను గురించి ఆలోచించుచున్నాడు.

అథరాజా దశరథ స్తేషాం దారక్రియాం ప్రతి
చింతయామాస ధర్మాత్మా సోపాధ్యాయ స్సబాంధవః 18-36

అట్టి సమయములో విశ్వామిత్ర మహాముని వచ్చినారు.

తస్య చింతయమానస్య మంత్రి మధ్యే మహాత్మనః
అభ్యగచ్ఛ న్మహాతేజా విశ్వామిత్రో మహామునిః 18-37

[విశ్వామిత్రుని రాక పెండ్లి మాటలకు ఒక విధముగా అడ్డు తగిలిన దన్నమాట. ఈ సందర్భమును మఱువ కూడదు. దీని ప్రాముఖ్యము మనకు శీఘ్రములోనే వెల్లడి కాగలదు. దైవము ఏయే పనిని ఎట్లు నిర్ణయించి యున్నదో ముందుగా మనకు తెలియదు.]

## విశ్వామిత్రుడు

[బాలకాండలో విశ్వామిత్రుడు ముఖ్యపాత్రము. విశ్వామిత్రుని చరిత్ర బాలకాండ 51-17 మొదలు 65-25 వఱకు వివరింపబడి యున్నది.]

విశ్వామిత్రుడు తపస్సుచేత బ్రహ్మర్షియైన మహాపురుషుడు. అతడు జన్మముచే క్షత్రియుడు. బ్రహ్మదేవుని కుమారుడు కుశుడు. కుశుడు ఒక దేశమునకు రాజు. కుశుని

కుమారుడు కుశనాభుడు. కుశనాభుని కుమారుడు గాధి. ఆ గాధి పుత్రుడే విశ్వామిత్రుడు. కాలక్రమేణ విశ్వామిత్రుడు రాజ్యాధిపతియై ధర్మబుద్ధితో రాజ్యమును పాలించుచుండెను.

రాజాభూ దేష ధర్మాత్మా దీర్ఘకాల మరిందమః
ధర్మజ్ఞః కృతవిద్యశ్చ ప్రజానాంచ హితేరతః. 51-17

ఒకానొకప్పుడు విశ్వామిత్రుడు చతురంగ బలసమేతుడై భూమి యంతయు సంచరించుచు వసిష్ఠుని ఆశ్రమమునకు వచ్చి మహర్షిని సందర్శించి వినయముతో ఆయనకు నమస్కరించినాడు. వసిష్ఠుడు రాజుకు స్వాగతముచెప్పి కూర్చుండబెట్టి ఫలమూలాదులను సమర్పించి మర్యాద చేసినాడు. ఇద్దరు పరస్పర యోగక్షేమములను గురించి మాటలాడుచున్నారు.

*విశ్వామిత్రుడు :* మహర్షీ ! మీ ఆశ్రమమున ఎట్టి బాధలును లేక మీతపస్సు నిర్విఘ్నముగా జరుగుచున్నదా ? మీ శిష్యుల విషయమునగాని, అగ్నిహోత్ర విషయములందుగాని ఎట్టి ఇబ్బందులును లేవుగదా !

*వసిష్ఠుడు :* మేము సర్వవిధముల సుఖముగనే యున్నాము. రాజా ! నీకు క్షేమమేనా ! నీవు నీరాజ్యమును చక్కగా పాలించుచుంటివిగదా ! నీ చతురంగ బలములకు, ధనాగారములకు, స్నేహితులకు, పుత్రులకు, పౌత్రులకు క్షేమమా.

ఈ విధముగా సల్లాపము లాడుకొనుచు సంతోషముగా కొంతకాలము గడిపినారు

**వసిష్ఠుడు :** (చిఱునవ్వుతో) రాజా ! నీవు అతిథిశ్రేష్ఠుడవు. నీకు అవశ్యము సత్కారము చేయవలసి యున్నది. నీకును నీ సైన్యమునకును అతిథిపూజ జరుపనెంచుచున్నాను: నీవు స్వీకరింపవలయును.

రాజా త్వమతిథిశ్రేష్ఠః పూజనీయః ప్రయత్నతః 52-14

**విశ్వామిత్రుడు :** స్వామీ! మీ ప్రియవాక్యమే చాలును. మీరు ప్రసాదించిన ఫలమూలముల చేతను భగవంతులగు మీ సందర్శనము చేతను పూజనీయులగు మీచే సత్కరింపబడితిని. నాకు సెలవు దయచేయుడు. నా నమస్కారముల నందుకొని నన్ను చల్లని చూపులతో చూచుటయే చాలును.

సర్వథా చ మహాప్రాజ్ఞ పూజార్హేణ సుపూజితః
గమిష్యామి నమస్తేఽస్తు మైత్రేణేక్షస్వ చక్షుషా. 52-[illegible]

**వసిష్ఠుడు :** రాజా! ఈ మాటలవలన లాభములేదు. మీరు తప్పక నా ఆతిథ్యము[illegible]గైకొనవలెను.

విశ్వామిత్రుడు : చిత్తము! మీరు సెలవిచ్చినట్లే అగును గాక

యథా ప్రియం భగవత స్తథాస్తు ముని పుంగవ. 52-19

వసిష్ఠుడు తన కామధేను వగు శబళను పిలిచి "శబళా! త్వరగా వచ్చి నామాట వినుము. ఈ రాజర్షికిని ఇతని సైన్యమునకును ఆతిథ్య మీయగోరుచున్నాను. కావలసిన వస్తువులను సిద్ధము చేయుము" అని ఆజ్ఞాపించినాడు.

శబళ అన్నింటిని సిద్ధము చేసినది. ఎవ్వరేమేమి కోరుకొనిరో వాని నన్నిటిని సమకూర్చినది.

విదధే కామధు క్కామాన్ యస్య యస్య యథేప్సితమ్. 53-1

అందఱును విందులారగించి సంతృప్తులైనారు. విశ్వామిత్రుడు తిన్న ఇంటి వాసములు లెక్కపెట్ట సాగినాడు.

విశ్వామిత్రుడు : స్వామి! మాకు సన్మానము చక్కగా జరిపినారు. సంతోషమైనది. నా మనవిని చిత్తగింపవలయును. మీకు లక్షగోవుల నిచ్చెదను. ఈ శబళను నాకు ప్రసాదింపుడు. శబళ ఒక అమూల్య రత్నము. రత్నములు రాజుల సొమ్ముగదా! కావున ఇది న్యాయముగా నాసొత్తే. బ్రాహ్మణుడ వగు నీది కాజాలదు.

వసిష్ఠుడు : రాజా! లక్షకాదు సరిగదా! పెక్కు నూర్ల కోట్ల గోవుల నిచ్చినను శబళను విడువ జాలను. వెండిరాసు లిచ్చినను దీనిని నీ కీయను. ఈ కామధేనువు నా యొద్దనే ఉండదగినదిగాని విడువ దగినదికాదు. ఇది అద్భుత మహత్త్వము కలది. కారణములతో పనియేమి! నేను శబళను ఎంత మాత్రము విడువను.

విశ్వామిత్రుడు : చక్కగా ఆలోచించి చెప్పుము. బంగారు మోకులతో కట్టిన ఏనుగులు పదునాలుగువేలు, నాలుగు నాలుగు తెల్ల గుఱ్ఱములతో కూడిన రథములు నాలుగు వందలు, పదునొకండువేల గుఱ్ఱములు, కోటి గోవులు మీరు కోరిన బంగారు, రత్నములు - అన్నిటిని ఇచ్చెదను. శబళను నాకు దయచేయుడు.

వసిష్ఠుడు : రాజా! ఈ శబళయే నా సర్వస్వము. పెక్కుమాటలతో పనియేమి? నేను శబళను నీ కీయను. అంతే.

ఏతదేవహి మే రత్నం ఏతదేవహి మే ధనమ్
ఏతదేవహి సర్వస్వం ఏతదేవహి జీవితమ్. 53-23

బహునా కిం ప్రలాపేన నదాస్యే కామదోహినీమ్. 53-26

విశ్వామిత్రునికి పట్టరాని కోపము కలిగినది. శబళను బలాత్కారముగా తన భటులచేత ఈడ్పించినాడు. పాపము! శబళకు దుఃఖము వచ్చి "ఈ భటులు న న్నేల యిట్లు బలాత్కరించి కొనిపోవుచున్నారు! వసిష్ఠుడు నన్ను పరిత్యజించెనా! నేను వారికి ఎట్టి అపకారమును చేయలేదుగదా !" అని చింతించి భటులను విదిల్చివైచి వసిష్ఠుని పాదమూలమున చేరి "స్వామీ! నే నేమి అపచారము చేసితిని - నన్ను మీ రేల విడిచితిరి" అని మొఱపెట్టుకొన్నది.

వసిష్ఠుడు : శబళా! నేను నిన్ను విడువలేదు. మన రాజు బలోన్మత్తుడై నిన్ను బలాత్కరించి కొనిపోవుచున్నాడు. నాకు సేనలు లేవుగదా! అదియు గాక అతడు మన ప్రభువు. నే నేమి చేయగలను ?

నహితుల్యం బలం మహ్యం రాజాత్వద్య విశేషతః
బలీ రాజా క్షత్రియశ్చ పృథివ్యాః పతిరేవచ. 54-10

శబళ : స్వామీ! క్షాత్రబలముగూడ ఒక బలమా! బ్రహ్మతేజోబలము ఎదుట ఆ బలమెందుకు పనికివచ్చును. మీరు నన్నాజ్ఞాపింపుడు. అతని దర్పమును ధ్వంసము చేయగలను.

వసిష్ఠుడు అంగీకరించినాడు. శబళ అపారసైన్యమును సృజించినది. విశ్వామిత్రుని సైన్యమంతయు నాశనమైనది. అంతట విశ్వామిత్రుని పుత్రులు నూరుగురు వసిష్ఠునిపై కడరినారు. కాని మహర్షి ప్రభావమువలన ఒక ముహూర్తకాలములో భస్మమైనారు. విశ్వామిత్రుడు, తన సైన్యమును తన కుమారులను కోల్పోయి దీనుడై, చావక మిగిలియుండిన ఒక కుమారుని రాజ్యపాలనకు నియమించి తాను హిమాలయ ప్రాంతమున కరిగి పరమేశ్వరునిగూర్చి తపస్సు ప్రారంభించినాడు.

స గత్వా హిమవత్పార్శ్వం కిన్నరోరగ సేవితమ్
మహాదేవ ప్రసాదార్థం తపస్తేపే మహాతపాః 55-13

కొంతకాలమునకు ఈశ్వరుడు ప్రత్యక్షమై "నీ కోరిక యేమి" అని అడిగినాడు.

విశ్వామిత్రుడు : స్వామీ! రహస్యమంత్రములతో కూడియుండు ధనుర్వేదమును నాకు ప్రసాదింపుడు. దేవ దానవ మహర్షి గంధర్వ యక్ష రక్షస్సులందు గల అస్త్ర సర్వస్వమును నాకు దయచేయుడు.

ఈశ్వరుడు "తథాస్తు" అన్నాడు. ఈ విధముగా విశ్వామిత్రుడు అస్త్రములను సంపాదించి వసిష్ఠుడు హతుడైనట్లే భావించి సంతోషించినాడు.

[ఈ పట్టున ఒక విషయము గమనింపదగియున్నది. విశ్వామిత్రుని అహంభావముసంగతి. ఈశ్వరుడు 'నీ కేమి కావలయును' అని అడిగినప్పుడు 'వసిష్ఠుని జయించుటకు శక్తి కావలయును' అని కోరియుంచిన సరిపోవునుగదా! కాని విశ్వామిత్రు డట్లు కోరలేదు. అస్త్రములను సంపాదించినచో తాను వానిని ప్రయోగించి జయము పొందగల నని తన శక్తినే నమ్మినాడు. అహంభావము సులభముగా పోదు.]

ఈ విధముగా విశ్వామిత్రుడు అస్త్రబలము సంపాదించి మరల వసిష్ఠుని మీదికి పోయినాడు. అస్త్రములను ప్రయోగించి వసిష్ఠుని ఆశ్రమమును దహించినాడు. వసిష్ఠుడు ఆగ్రహోదగ్రుడై బ్రహ్మదండమును పైకెత్తినాడు.

*వసిష్ఠుడు :* రాజా ! నీ బల మేపాటిది ! బ్రహ్మతేజోబల మెట్టిదో చూతువు గాక !

క్వచతే క్షత్రియబలం క్వచ బ్రహ్మబలం మహత్
పశ్య బ్రహ్మబలం దివ్యం మమ క్షత్రియపాంసన 56-4

వసిష్ఠుడు బ్రహ్మదండమును పట్టి విశ్వామిత్రుని ఆగ్నేయాద్యస్త్రములను ప్రతిహత మొనరించినాడు. అస్త్రము లన్నియు వ్యర్థమైన పిదప విశ్వామిత్రుడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించినాడు. వసిష్ఠుడు ఆ బ్రహ్మాస్త్రమునుసైతము తన బ్రహ్మదండముతో మ్రింగినాడు. అంతట వసిష్ఠునకు దారుణరూపము కలిగినది. రోమకూపములనుండి అగ్నిజ్వాలలు బయలువెడలినవి. అప్పుడు లోకహితము కోరు మునులు వసిష్ఠుని సమీపించి ఆ మహర్షిని స్తుతించి విశ్వామిత్రుడు ఓటు వడెనని చెప్పి బ్రహ్మాస్త్రతేజమును ఉపశమింపజేయు మని ప్రార్థించినారు. వసిష్ఠుడు సమ్మతించి కోపోపశమనము చేసినాడు. విశ్వామిత్రునికి పరాభవ మైనది.

*విశ్వామిత్రుడు :* (నిట్టూర్చి) ఛీ! క్షాత్రబలము నిస్సారము గదా! ఒక్క బ్రహ్మదండముచే నా అస్త్రము లన్నియు హతమైపోయినవి ! బ్రహ్మతేజస్సుబలమే బలము.

కావున నేను పోయి బ్రహ్మత్వమునకు మూలమైన తపస్సును ఆచరించెదను.

ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజో బలం బలమ్
ఏకేన బ్రహ్మదండేన సర్వాస్త్రాణి హతానిమే. 56-23

తదేత త్సమవేక్ష్యాహం ప్రసన్నేంద్రియ మానసః
తపోమహ త్సమాస్థాస్యే యద్వై బ్రహ్మత్వ కారణమ్. 56-24

[విశ్వామిత్రుని అపజయమే అతని అభ్యుదయమునకు దారి తీసినది. మహాత్ముల ఆగ్రహము కూడ అనుగ్రహమే. మనము 'కీడు' అని భావించినదానిలో నుండియే మేలు పుట్టవచ్చును. దైవచిత్రములు పలుతీరులు - ఈ విషయమును గ్రహించి మనము అన్ని అవస్థలలోను దిగులు మాని ధైర్యముగా ఉండవచ్చును.]

## విశ్వామిత్రుని తపస్సు (దక్షిణదిక్కున)

విశ్వామిత్రుడు భార్యాసమేతుడై బయలుదేరి దక్షిణదిక్కు చేరి తపస్సు ప్రారంభించినాడు. అక్కడ ఆయనకు నలుగురు పుత్రులు కలిగినారు. ఒక వేయి సంవత్సరములు తపస్సు చేయగా ఋషిసమేతుడై బ్రహ్మ ప్రత్యక్షమై 'రాజర్షి' అను బిరుదును ప్రసాదించినాడు. అందుకు విశ్వామిత్రుడు సిగ్గుపడినాడు. కోపము కూడ వచ్చినది.

*విశ్వామిత్రుడు* : ఇన్ని సంవత్సరములు ఎంతో కష్టించి తపస్సు చేసితిని. మీ రందరు వచ్చి నన్ను 'రాజర్షి' అని తేల్చినారు. నా తపస్సు కంతటికి ఇదియేనా ఫలము!

తపశ్చ సుమహత్తప్తం రాజర్షిరితి మాం విదుః
దేవా స్సర్షిగణా స్సర్వే నాస్తిమన్యే తపఃఫలమ్. 57-8

[పాపము! క్రొత్తలో అట్లే అనిపించుట సహజము. ఇట్టి నిందలను మనము తరచుగా వినుచుందుము. విశ్వామిత్రుని నిష్ఠుర వాక్యముల వల్లనే తెలినది గదా అతని తపస్సు ఎంత వరకు సాగిన దని!]

విశ్వామిత్రుడు మునుపటికంటె తీవ్రముగా తపస్సు చేయసాగినాడు. కాని త్రిశంకునిమూలమున కొంత అంతరాయము కలిగినది.

## త్రి శం కు ని చ రి త్ర

త్రిశంకువు ఇక్ష్వాకువంశపు రాజు. శరీరముతోనే స్వర్గమునకు పోవలయు నని అతనికి కోరిక కలిగి అందుకు అనుకూలముగా ఒక యజ్ఞమును జరిపింపు మని కులగురు వైన వసిష్ఠుని యాచించినాడు. వసిష్ఠుడు "అది శక్యముకాని పని" అని చెప్పినాడు. అంతట త్రిశంకువు వసిష్ఠుని పుత్రులను పూజించి తన కోరికను వారికి తెలియజేసి "వసిష్ఠులవారు తమవల్ల కాదన్నారు. మీరైనను ఆ యజ్ఞమును నిర్వహించి నా కోరికను తీర్పుడు" అని ప్రార్థించినాడు.

*వసిష్ఠపుత్రులు* : దుర్మార్గుడా! సత్యవాదియైన గురువుచే నిరాకరింపబడి ఇతరుల నాశ్రయించుచుంటివా! మా తండ్రి కాదనిన పనిని మేము చేయగల మని వచ్చితివా! నీవు పరమ మూర్ఖుడవుగా ఉన్నావు. బుద్ధితో మరలిపొమ్ము. వసిష్ఠుడు సామాన్యుడు కాడు. యాగములు చేయించుటలో ముల్లోకములందును అతనికి సరి వచ్చువారు లేరు. గురువును అవమానించి, అసాధ్యమైన యీ యజ్ఞమును చేయించుటకు మేము పూనుకొనగల మని నీ కెట్లు తోచినది?

[పెద్దలు చేయుటకు వీలు లేదన్న పనికి పిన్నలు పూనుకొనుట గొప్ప తప్పు]

ఈ మాటలు విని త్రిశంకునకు కోపము వచ్చినది.

*త్రిశంకువు :* గురువు చేతను గురుపుత్రులచేతను నిరాకరింపబడితిని గనుక నేను మరి యొక యాజకుని ఆశ్రయించెదను.

ఈ మాటలకు వసిష్ఠుని కుమారులకు కోపము కలిగి "గురుద్రోహి వగు నీవు చండాలుడ వగుదువుగాక !" అని శపించినారు. ప్రభువైన త్రిశంకునకు చండాలత్వము వచ్చినది. నల్లబట్టలు, బిరుసుపారిన నల్లని శరీరము, పొట్టిజుట్టు, శ్మశానమందలి పూదండలు, బూడిద మైపూత, ఇనుప సొమ్ములు – తెల్లవారుసరికి ఈ విధముగా ఉన్నాడు. మంత్రులు, పురజనులు ఈ రూపమును చూచి రాజును త్యజించినారు. త్రిశంకువు ఒక్కడే బయలుదేరి విశ్వామిత్రునికడ కరిగినాడు. ఇట్లు వచ్చిన త్రిశంకుని చూచి విశ్వామిత్రునికి జాలి కలిగినది.

*విశ్వామిత్రుడు :* రాజా ! నీవు వచ్చిన పని యేమి ? నీ కీ చండాలరూప మెట్లు కలిగినది ?

*త్రిశంకువు :* నే నెన్నియో యజ్ఞములు, దానములు చేసియున్నాను. గురువులకు పూజ లర్పించితిని. శరీరముతో స్వర్గమునకు పోవలయు నని నా కొక కోరిక యున్నది. కాని నామీద మాగురువుకు దయ రాలేదు సరిగదా ! నా ప్రయత్నమునకు ఫలముగా ఈ చండాలరూపము సంభవించినది. నేను మరియొక యాజకుని ఆశ్రయింతు నని చెప్పగా గురుపుత్రులు ఆగ్రహించి నన్ను శపించినారు. దీనిని బట్టి చూడగా దైవమునకే యెక్కువ బల మున్నట్లు తేలుచున్నది. పురుష కారమునకు బలములేదు.

దైవమేవ పరం మన్యే పౌరుషంతు నిరర్థకమ్
దైవేనాక్రమ్యతే సర్వం దైవంహి పరమాగతిః. 58-22

ఇప్పుడు మీ అనుగ్రహము కోరి వచ్చితిని. మీరు తప్ప నాకు రక్షకులు లేరు. మీ పౌరుషముచే దైవగతిని మరలించి నాకు అనుకూల పరిస్థితి కల్పింపవలసినదిగా వేడుచున్నాను.

దైవం పురుషకారేణ నివర్తయితు మర్హసి. 58-24

*విశ్వామిత్రుడు :* రాజా ! భయపడకుము. తగినవారిని పిలిపించి నీవు కోరిన యజ్ఞమును జరిపింతును. కాని ఒక్క చిక్కుమాత్ర మున్నది. గురుశాపమువలన సంభవించిన యీ చండాలరూపమును మార్చుటకుమాత్రము సాధ్యముకాదు. వలయునేని ఈ శరీరముతోనే నిన్ను స్వర్గమునకు పంపగలను. నన్ను శరణు జొచ్చితివి కావున స్వర్గము నీ అరచేతిలో ఉన్నట్లే.

[ఇదియే అరచేతిలోని వైకుంఠము.]

గురుశాపకృతం రూపం యదిదం త్వయి వర్తతే
అనేన సహరూపేణ సశరీరో గమిష్యసి 59-4
హస్తప్రాప్తమహం మన్యే స్వర్గం తవ నరాధిప
యస్త్వం కౌశిక మాగమ్య శరణ్యం శరణాగతః 59-5

త్రిశంకువు ఆ చండాలరూపముతోనే స్వర్గమునకు పోవుటకు సిద్ధపడినాడు!

[దేహాభిమానము ఎంతపనినైనను చేయింపగలదు. త్రిశంకువు శాశ్వతముగా ఆ చండాల రూపముతోనే ఉండుటకు సమ్మతించినాడు!]

విశ్వామిత్రుడు యజ్ఞమునకు పూనుకొన్నాడు. అందఱిని ఆహ్వానింపు డని కుమారులను పంపినాడు. ఎవ్వరైనను ఆక్షేపణ చేయుదురేని ఆ సంగతి తనకు తెలుప వలసిన దని ఆదేశించినాడు. విశ్వామిత్రుని పుత్రులు బయలుదేరినారు. అందఱితోపాటు వసిష్ఠుని పుత్రులనుగూడ ఆహ్వానించినారు. వసిష్ఠుని పుత్రులు అపహసించినారు.

వసిష్ఠపుత్రులు : యజ్ఞము చేయించువాడు క్షత్రియుడు. చేయువాడు చండాలుడు! అట్టి యజ్ఞమున హవిర్భాగములను గ్రహించుటకు దేవతలెట్లు రాగలరు!

క్షత్రియో యాజకోయస్య చండాలస్య విశేషతః
కథం సదసి భోక్తారో హవిస్తస్య సురర్షయః 59-13

ఈ మాటలు విశ్వామిత్రుని చెవిలో పడినవి. విశ్వామిత్రుడు కోపించి వసిష్ఠ కుమారులను శపించినాడు.

మిగిలినవారు వచ్చినారు. విశ్వామిత్రుడు యజ్ఞమును పూర్తిచేసినాడు. కాని హవిర్భాగములు గైకొనుటకు దేవత లెవ్వరును రాలేదు. విశ్వామిత్రుడు ఆగ్రహించి తన తపఃప్రభావముచే త్రిశంకుని స్వర్గమున కంపినాడు.

**స్వార్జితం కించిదప్యస్తి మయాహి తపసః ఫలమ్**
**రాజన్ స్వతేజసా తస్య సశరీరో దివం వ్రజ.** **60-14**

త్రిశంకువు శరీరముతో స్వర్గమున కరిగినాడు కాని ఇంద్రుడు అక్కడ ఉండనీయ లేదు. "గురుశాపహతులైనవారి కిక్కడ చోటులేదు. నీవు తలక్రిందుగా పడిపొమ్ము" అన్నాడు.

**త్రిశంకో గచ్ఛ భూయస్త్వం నాసి స్వర్గకృతాలయః**
**గురుశాప హతో మూఢ పత భూమి మవాక్ఛిరాః** **60-17**

త్రిశంకువు తలక్రిందుగా పడుచు "విశ్వామిత్రా! రక్షింపుము" అని కేకపెట్టినాడు. విశ్వామిత్రు డా దీనాలాపమును విని కోపించి "నిలు నిలు" అన్నాడు. ఆ మాటలతో విశ్వామిత్రుడు త్రిశంకుని అంతరాళమున నిలిపి, దక్షిణ దిక్కునందు క్రొత్తగా సప్తర్షి మండలమును సృజించి నక్షత్రములనుసైతము సృష్టించినాడు. మఱి యొక ఇంద్రుని, దేవతలనుగూడ సృష్టింపదలచినాడు. అంతట దేవతలు ఋషులు మున్నగువారు వచ్చి విశ్వామిత్రుని వేడుకొని "గురుశాప హతులకు స్వర్గములో స్థాన మున్నదా! మీరే సెలవిండు" అని అడిగినారు.

*విశ్వామిత్రుడు:* సరేకాని, శరీరముతో స్వర్గమునకు పంపుదునని త్రిశంకునకు మాట ఇచ్చితిని గదా! ఆ మాట యేమికావలెను? నేను సృజించిన ఈ స్వర్గమున త్రిశంకువు ఉండుటకు మీ రెల్లరు సమ్మతింప వలయును.

*దేవతలు:* అనాదిగా ఉన్న జ్యోతిశ్చక్రమునకు వెలుపలగా మీ నక్షత్రములు మున్నగునవి ఉండును గాక! త్రిశంకువు ఆ నక్షత్ర మండలములో శాశ్వతముగ తలక్రిందుగ నిలిచి యుండును గాక!

ఈ విధముగ ఉభయులు సమ్మతించినారు. త్రిశంకువు ఈ నాటికిని తలక్రిందుగా అక్కడనే ఉన్నాడు. [అదియే త్రిశంకు స్వర్గము]

[త్రిశంకువు కోరిన స్వర్గ మిదియేనా! అతనికి లభించినది మాత్రము ఇదియే. అంతటి దేహాభిమానము గలవారు తలక్రిందుగా ఉండవలసినదే కాబోలు! మఱియొకమాట - దేహము ఈ లోకమునకు సంబంధించినది గనుక చూపు భూమి వైపుననే నిలిచి యుండుట ఎంతో సమంజసముగా నున్నది. ఈ పట్టున గమనింపదగిన విషయము మఱియొకటి కలదు. గురువునకు అపచారము చేసినచో కలుగు బాధ సులభముగా తీరునదికాదు. కావున గురువుల యెడ మెలకువతో ప్రవర్తింపవలయును.]

త్రిశంకువు కథ విన్నాము. విశ్వామిత్రుడు అప్పటివఱకు ఆర్జించిన తపోధనమును త్రిశంకునికై వ్యయపఱిచినాడు.

## విశ్వామిత్రుని తపస్సు (పడమటి దిక్కున)

విశ్వామిత్రుడు దక్షిణ దిక్కును వదలి పడమటి దిక్కు చేరి తపస్సు మరల ప్రారంభించినాడు. పుష్కర తీర్థముల తీరములందలి ఫలమూలములను మాత్రము భుజించుచు ఉగ్రతప మాచరించినాడు. అక్కడ సైతము ఒక విఘ్నము సంభవించినది.

## శునశ్శేపుని కథ

విశ్వామిత్రుడు పడమటి దిక్కున తపస్సు చేయుచుండిన కాలములోనే అయోధ్య రాజగు అంబరీషుడు ఒక యాగమును ప్రారంభించినాడు. యజ్ఞ పశువును ఇంద్రుడు

అపహరించినాడు. పశువు దొరకనిచో యజ్ఞకర్తకు హాని కావున పశువునైనను వెదకి తెచ్చికొనవలయును. లేక ఆ పశువునకు ఈడుగా నరపశువునైనను సేకరింపవలయును. ఎంత వెదకినను యజ్ఞపశువు కానరాలేదు. కాబట్టి నరపశువును సంపాదించుటకు అంబరీషుడు బయలుదేఱినాడు. ఈ యత్నముతో ప్రయాణము సాగించుచుండగా భృగుతుంగ మను పర్వత ప్రాంతమున ఋచీకు డను మహర్షి భార్యా పుత్రులతో ఉండుట అంబరీషుడు చూచినాడు.

[ఋచీకుడు విశ్వామిత్రుని సోదరి భర్త.]

*అంబరీషుడు :* ఋచీకుడా! లక్ష గోవుల నిచ్చెదను. యాగ పశువుగా ఉపయోగించు కొనుటకు ఒక్క కుమారుని నాకు విక్రయింతువా?

*ఋచీకుడు :* రాజా! నీ వెంత వేడుకొన్నను నేను నా జ్యేష్ఠపుత్రుని విక్రయింప నొల్లను.

*ఋచీకుని భార్య :* నే నెంతమాత్రము నా చిన్నకుమారుడగు శునకుని విడువ జాలను. జ్యేష్ఠపుత్రులు తండ్రులకు ప్రియులైనట్లు కనిష్ఠులు తల్లులకు ప్రియులు గదా!

ప్రాయేణహి నరశ్రేష్ఠ జ్యేష్ఠాః పితృషు వల్లభాః
మాతౄణాంతు కనీయాంస స్తస్మాద్రక్షే కనీయసమ్. 61-19

ఈమాటలను నడిమివాడైన శునశ్శేఫుడు విన్నాడు. తానే స్వయముగా అంబరీషునితో అనుచున్నాడు.

*శునశ్శేఫుడు :* పెద్దకుమారు నీయజాలనని తండ్రి చెప్పినాడు. చిన్నవాని నీయనని తల్లి చెప్పినది. మధ్యముడనగు నన్ను విక్రయించుటకు నాతలిదండ్రు లిద్దరు సమ్మతించి నట్లు విదిత మగుచున్నది. కావున నన్ను తోడ్కొని పొండు.

అంబరీషుడు లక్ష గోవులనిచ్చి శునశ్శేఫుని వెంటబెట్టుకొని వెడలినాడు. దారిలో పుష్కరతీర్థము చెంత అందఱు విశ్రమించినారు. ఆ యవకాశమును చూచుకొని శునశ్శేఫుడు తన మేనమామ యగు విశ్వామిత్రుని కలిసికొని తనకథను క్రుతపఱిచి విలపించి రక్షింపుమని ప్రార్థించినాడు.

[ఋచీకునికిని విశ్వామిత్రునికిని గల బంధుత్వము ఇక్కడ సూచితమైనది.]

*శునశ్శేఫుడు :* మామా! అంబరీషుని యజ్ఞము సఫలము కావలయును. నేను దీర్ఘాయువును కావలయును. తగిన ఆలోచన చేసి నన్ను రక్షింపుము.

విశ్వామిత్రుడు తన పుత్రులను పిలిచి "సుతులారా! మీలో ఒక్కడు ఈ బాలునికి బదులు అంబరీషుని యజ్ఞపశువుగా పోయి ఈ బాలుని రక్షింప వలయును."

అన్నాడు. అందుకు తన సుతులెవ్వరును సమ్మతింపలేదు. "నీ కుమారులను విసర్జించి ఊరివారి కుమారుని రక్షింపబూనుట ఏమిన్యాయము? భోజనమునందు కుక్కమాంసమువలె నీవు చెప్పినది తగినదికాదు" అని తిరుగబడినారు.

కథ మాత్మసుతాన్ హిత్వా త్రాయసేఽన్య సుతం విభో
అకార్యమివ పశ్యామ శ్వమాంస ఇవభోజనే. 62-14

విశ్వామిత్రుడీమాటలకు కోపించి "మీరు కుక్కమాంసమును భుజించుచు వేయి సంవత్సరములు భూమియందు తిరుగుచుందురుగాక" అని తనసుతులను శపించినాడు.

['శ్వమాంస ఇవభోజనే' అని ఉపమానముచెప్పి తండ్రిని నిందించినందుకు ఫలితముగా వారికి ఈ శాపము వచ్చినదికాబోలు!]

శ్వమాంస భోజిన స్సర్వే వాసిష్ఠా ఇవ జాతిషు
పూర్ణం వర్షసహస్రంతు పృథివ్యామనువత్స్యథ. 62-17

విశ్వామిత్రుడు పుత్రులను శపించి శునశ్శేపుని రక్షించుటకు ఉపాయము ఆలోచించినాడు.

*విశ్వామిత్రుడు:* శునశ్శేపా! దివ్యము లగు రెండుగాథలను నీకు ఉపదేశింతును. నీవు వానిని గ్రహించి యాగమునందు గానము చేయుము. నీకు ఎట్టి హానియును కలుగదు. అంబరీషుని యజ్ఞము సఫల మగును.

అంబరీషుడు శునశ్శేపుని వెంటబెట్టుకుని యాగశాలకు పోయి ఆబాలుని యజ్ఞపశువుగావించి యూపస్తంభమున బంధింపగా విశ్వామిత్రుడు తనకు ఉపదేశించిన గాథలను గానముచేసి ఇంద్రుని ఉపేంద్రుని శునశ్శేపుడు స్తుతించినాడు. ఇంద్రుడు తృప్తిజెంది శునశ్శేపునికి దీర్ఘాయువు ప్రసాదించినాడు. అంబరీషుని యజ్ఞము ఫలవంతమైనది.

విశ్వామిత్రుడు తపస్సునకు మరల పూనుకొని వేయి సంవత్సరములు తపమాచరించినపిదప బ్రహ్మదేవుడు ఋషిగణములను దేవతలను కూడి వచ్చి విశ్వామిత్రునికి 'ఋషి' అను బిరుదును ప్రసాదించినాడు. ఇంతకాలమునకు విశ్వామిత్రుడు 'రాజర్షి' మెట్టుదాటి 'ఋషి' అయినాడు.

విశ్వామిత్రుడు తపస్సు మరల చేయసాగినాడు. మరల విఘ్నము కలిగినది.

## విశ్వామిత్రుడు - మేనక

అప్సరస మేనక పుష్కరతీర్థములందు స్నానము చేయుచు మేఘమునందలి మెఱుపువలె వెలుగుచు విశ్వామిత్రుని కంట బడినది.

రూపేణా ప్రతిమాం తత్ర విద్యుతం జలదే యథా 63-5

విశ్వామిత్రుడు పరవశుడైనాడు.

*విశ్వామిత్రుడు:* మేనకా! నేను కామవశుడనైతిని. నీవు నా ఆశ్రమమునకువచ్చి నన్ను అనుగ్రహింపుము.

మేనక అంగీకరించినది. [అందుకొఱకు వచ్చిన వగలాడికదా!] ఆశ్రమమున ప్రవేశించినది. పదిసంవత్సరములు సుఖముగా గడచిపోయినవి. అప్పటికి విశ్వామిత్రునికి కనువిప్పు కలిగినది. సిగ్గుపడి దుఃఖపడినాడు. కోపముకూడ కలిగినది.

*విశ్వామిత్రుడు:* (తనలో) ఆహా! ఎంతపని జరిగినది. నా తపోభంగ మొనరించుటకు దేవతలే ఇట్లు చేసినారు. పది సంవత్సరములు ఒక్క అహోరాత్రముగా గడచి పోయినవి! మన్మథమోహమున బడి నేనీ విఘ్నమున కగ్గమైతినిగదా!

సర్వం సురాణాం కర్మైతత్ తపోపహరణం మహత్ 63-10
అహోరాత్రాపదేశేన గతాస్సంవత్సరా దశ
కామమోహాభిభూతస్య విఘ్నోఽయం ప్రత్యుపస్థితః 63-11

విశ్వామిత్రుడు మేనకను చూచినాడు. మేనక గడగడ వణకిపోవుచున్నది. అంజలిబద్ధయై నిలబడియుండుట చూచి విశ్వామిత్రుడు కోపమును నిగ్రహించి మధుర వాక్కులు పలికి మేనకను పంపివైచినాడు.

## విశ్వామిత్రుని తపస్సు (ఉత్తర దిక్కున)

విశ్వామిత్రుడు మేనకను పంపించి అటుపై హిమవత్పర్వతమునకు వెళ్ళి కౌశికీ నదీతీరముచేరి ఇంద్రియములను జయింపగోరి తపస్సు ప్రారంభించినాడు. ఒక వేయి సంవత్సరములు తపస్సు కావించిన పిదప బ్రహ్మదేవుడు సాక్షాత్కరించి విశ్వామిత్రునికి 'మహర్షి' బిరుదమును ప్రసాదించినాడు.

*విశ్వామిత్రుడు:* స్వామీ! 'మహర్షి' పదవి ప్రసాదించితిరి. నేను ఇంద్రియములను జయించి నట్లేనా?

*బ్రహ్మ:* లేదు. ఇంకను ప్రయత్నము చేయవలసి యున్నది.

ఈ మాటలు పలికి బ్రహ్మ తిరోహితుడైనాడు. విశ్వామిత్రుడు ఉగ్రతపస్సును మొదలుబెట్టినాడు. చేతులు పైకెత్తి నిరాలంబుడై వాయు భక్షణమాత్రముచేయుచు ఎండకాలములో పంచాగ్ని మధ్యమున నుండి వానకాలములో బయలనిలిచి శిశిరఋతువులో రాత్రింబగళ్లు నీటిలో మునిగి ఈవిధముగా వేయిసంవత్సరములు తపస్సు చేసి

నాడు. దేవతలు, ఇంద్రుడు భయపడినారు. ఇంద్రుడు రంభను పిలిచి "రంభా! నీ వల్లనే కావలయును ఈ దేవకార్యము. విశ్వామిత్రుని ఎట్లైనను నీవు వశపఱచుకొనవలయును" అన్నాడు.

*రంభ :* (భయముతో) ప్రభూ! ఈ కార్యము నాకు సాధ్య మగునా! విశ్వామిత్రుడు ఉగ్రకోపి యగుట నన్ను శపించుట నిశ్చయము. నన్ను క్షమింప వేడుచున్నాను.

*ఇంద్రుడు :* రంభా! భయపడకుము. నేను మన్మథ సమేతుడనై వచ్చి వసంతఋతువు నందు ఒక రమ్యమైన తరువుమీద కోయిల రూపములో నీ చెంతనే ఉందును.

రంభ ధైర్యమును తెచ్చికొని అలంకారము చేసికొని విశ్వామిత్రుని సమీపించినది. కోయిల మనోహరముగా ఆలాపించినది. విశ్వామిత్రుడు తల ఎత్తి రంభను చూచినాడు. ఆయనకు సందేహము కలిగినది. ఇది దేవేంద్రుని కార్య మని గ్రహించి ఆగ్రహించి రంభను శపించినాడు. వెంటనే సంతాపము కలిగినది. "కోపమును నిగ్రహించుకొనజాలనైతిని గదా" అని బాధపడ్డినాడు. రంభ శిలయైనది. ఇంద్రుడు, మన్మథుడు పరుగెత్తి పోయినారు. కోపకారణముగా విశ్వామిత్రుని తపస్సు తఱిగినది.

*విశ్వామిత్రుడు :* (తనలో) ఇక నేను కోపింపను. మాటలకు కూడ స్వస్తి చెప్పెదను. నిట్టూర్పు సైతము విడువను. ఇంద్రియములను తప్పక జయింతును. నాకు బ్రాహ్మణ్యము ప్రాప్తించు వఱకు ఇట్లే ఉండి తపస్సు చేయుదును.

## విశ్వామిత్రుని తపస్సు (తూర్పుదిక్కున)

విశ్వామిత్రుడు దీక్ష బూని తపస్సు చేయుటకు తూర్పుదిశ కరిగి తపస్సు ప్రారంభించినాడు. ఎన్ని విఘ్నములు కలిగినను కోపముపాలట పడలేదు. ఇట్లు వేయి సంవత్సరములు తప మాచరించి నియమము ముగియగనే అన్నము సిద్ధము చేసికొన్నాడు.

ఇంద్రుడు బ్రాహ్మణ రూపమున వచ్చి అన్నమును యాచించినాడు. విశ్వామిత్రుడు అన్న మంతయు ఆ బ్రాహ్మణునికి పెట్టి మౌన మూని ఊరకుండినాడు.

మరల ఒక వేయి సంవత్సరములు తపస్సు చేసినాడు. నిట్టూర్పు సైతము విడువని నియమముతో తపస్సు సాగించినాడు. అంతట విశ్వామిత్రుని శిరస్సునుండి పొగ బయలు వెడలినది. ముల్లోకములు కలత జెందినవి. దేవతలు గంధర్వులు మున్నగువారు విశ్వామిత్రుని తపస్సుయొక్క తేజస్సువలన కాంతి తఱిగి యుండిరి. అందరును బ్రహ్మను సమీపించి మొఱపెట్టుకొని "స్వామీ! విశ్వామిత్రుని తపస్సునకు భంగము కలిగించుట మాకు సాధ్యము కాలేదు. ఆయన కోరునదేదియో ఆయనకు ప్రసాదించిన యెడల బ్రదుకగలము. అట్లు మీరు అనుగ్రహింపనిచో ముల్లోకములు నాశము కాగలవు" అని విన్నవించినారు.

కాలాగ్నినా యథాపూర్వం త్రైలోక్యం దహ్యతేఽఖిలమ్
దేవరాజ్యం చికీర్షేత దీయతామస్య యన్మతమ్. 65-17

బ్రహ్మదేవుడు వచ్చి విశ్వామిత్రునికి 'బ్రహ్మర్షి' పదవిని ప్రసాదించినాడు.

బ్రహ్మ: విశ్వామిత్రుడా! తపస్సుచేత బ్రాహ్మణత్వము సాధించితివి. నీకు మంగళమగును గాక.

విశ్వామిత్రుడు సంతసించి బ్రహ్మాది దేవతలకు నమస్కరించి "బ్రాహ్మణ్యము, దీర్ఘాయుష్షు నాకు కలిగెనేని ఓంకారము వషట్కారము వేదములు నన్ను వరించును గాక! వేదముల నెరిగిన వారందరిలోను శ్రేష్ఠుడగు వసిష్ఠుడు మీరు చెప్పిన విధముననే నేను బ్రాహ్మణుడ నని పలుకును గాక!

బ్రాహ్మణ్యం యదిమే ప్రాప్తం దీర్ఘమాయుస్తథైవ చ
ఓంకారశ్చ వషట్కారో వేదాశ్చ వరయంతుమామ్. 65-22

క్షత్రవేద విదాంశ్రేష్ఠో బ్రహ్మవేద విదామపి
బ్రహ్మపుత్రో వసిష్ఠో మా మేవం వదతు దేవతాః. 65-23

దేవతలారా! నాకు ప్రధానమైన ఈ కోరికను తీర్తురేని మీరందరు మీ నెలవులకు పోవచ్చును.

యద్యయం పరమః కామః కృతో యాంతు సురర్షభాః. అయోధ్య 65-24

అంతట తాపస శ్రేష్ఠుడగు వసిష్ఠుడు దేవతలవల్ల సంతోషపరుపబడి విశ్వామిత్రునితో స్నేహము కలిపి "ఏవమస్తు" అన్నాడు.

[అనగా 'దేవతలు చెప్పినట్లే అగునుగాక' అని చెప్పినాడు.]

తతః ప్రసాదితో దేవైర్వసిష్ఠో జపతాం వరః
సఖ్యంచకార బ్రహ్మర్షి రేవమస్త్వితి చాబ్రవీత్. 65-25

దేవతలు: విశ్వామిత్రుడా! నీవు బ్రహ్మర్షివే. ఇందుకు సందేహములేదు. బ్రహ్మర్షి అధికారము లన్నియు నీకును ఉండును. ఈ మాటలు పలికి అందరు వారివారి నెలవుల కరిగినారు.

బ్రహ్మర్షి స్త్వం న సందేహ స్సర్వం సంపత్స్యతే తవ
ఇత్యుక్త్వా దేవతాశ్చాపి సర్వాజగ్ము ర్యథాగతమ్. 65-26

[ఇది విశ్వామిత్రునికథ. ఇందు గమనింప దగిన విషయము - ఇతర ఇంద్రియములను జయించినను కోపమును జయించుట మిక్కిలి కష్టము. కోపమును జయించినచో అన్నింటిని జయించినట్లే.]

## విశ్వామిత్రుని యాగరక్షణ

దశరథుడు కొలువుదీరి పుత్రుల వివాహవిషయము తలపోయుచుండగా విశ్వామిత్రుడు వచ్చినాడు. ద్వారపాలకుని లోనికంపి తనరాకను దశరథునకు తెలియజేసినాడు. అంతట దశరథుడు పురోహిత సమేతుడై విశ్వామిత్రుని కెదురేగి ఆయనను తోడ్కొనివచ్చి మర్యాదలు జరిపినాడు. విశ్వామిత్రుడు సంతసించి రాజు క్షేమమును వసిష్ఠాదుల క్షేమమును అడిగినాడు. అందఱు సభలో ప్రవేశించి వారివారికి యోగ్యమైన స్థానములలో ఆసీనులైనారు.

## దశరథుడు విశ్వామిత్రునికి స్వాగతము చెప్పుట

*దశరథుడు :* స్వామీ! తమ ఈ రాకచే నాకు అమృతము ప్రాప్తించినట్లయినది. నీరులేని సమయమున వర్షము కురిసినట్లు, సంతానము లేనివానికి పుత్రుడు కలిగినట్లు, పోగొట్టుకొనిన వస్తువు మరల లభించినట్లు, ఉత్సవారంభమున సంతోషము కలిగినట్లు, నాకు ఎంతో ఆనందముగ ఉన్నది. మీకు స్వాగతమగుగాక.

యథాఽమృతస్య సంప్రాప్తి ర్యథా వర్షమనూదకే
యథా సదృశ దారేషు పుత్రజన్మాఽప్రజస్యచ 18-49
ప్రణష్టస్యయథాలాభో యథాహర్షో మహోదయే
తథైవాగమనం మన్యే స్వాగతంతే మహామునే 18-50

మీరాకవలన నా జన్మ సఫలమైనది. తమరు రాజర్షిగాఉండి తపస్సుచే బ్రహ్మర్షిత్వము సంపాదించినవారుగనుక మీరు నాకు అనేకవిధములుగా పూజనీయులు. తమరు ఇక్కడికిప్పుడు వచ్చుట ఆశ్చర్యకరము - తమ సందర్శన భాగ్యముననే పుణ్యక్షేత్రములను దర్శించినట్లయినది. తాము వచ్చినకార్యమేమియో సెలవీయుడు. మీ ఆజ్ఞను పాలించుటకు సిద్ధముగా ఉన్నాను. ఈ కార్యము నేను చేయుదునో చేయనో అను సందేహము వలదు. మీరు నాకు దైవమువంటివారు. మీరు కోరినపని తప్పక చేయుదును.

కార్యస్య న విమర్శంచ గంతు మర్హసి కౌశిక
కర్తా చాహ మశేషేణ దైవతంహి భవాన్మమ 18-56

స్వామీ! నాకిప్పుడు గొప్ప మంగళము లబ్ధమైనది. ఉత్తమ ధర్మము ప్రాప్తించినది.

మమచాయ మనుప్రాప్తో మహానభ్యుదయోద్విజ
తవాగమనజః కృత్స్నో ధర్మశ్చా నుత్తమోమమ. 18-57

[రాబోవుసంగతి తెలిసి చెప్పినాడో తెలియక పలికినాడోగాని ఈమాటలు అక్షరముల నిజమే అయినవి !]

మనస్సునకును చెవికిని ఇంపుగానుండు ఈ మాటలను విని విశ్వామిత్రునికి సంతోషము కలిగినది.

## విశ్వామిత్రుడు తనకోరికను దశరథునకు తెలుపుట

విశ్వామిత్రుడు : రాజా! గొప్పవంశమున జన్మించి వసిష్ఠుని యంతటివానిచే ఉపదేశమును పొందిన నీవుగాక ఇంతచక్కగా మాటలు చెప్పగలవారు మరెవ్వరు ఉండరు. నీ పలుకులవలన నాకు మిక్కిలి సంతోషమైనది. నా కోరికను చెప్పుమనుచుంటివా ! చెప్పెదను వినుము. నీవు నీ ప్రతిజ్ఞను సత్యము గావించుకొని నా కోరిక తీర్పుము.

నేను ఒక యాగము చేయుచున్నాను - దానిని విఘ్నమొనరించుటకు కామరూపులగు రాక్షసు లిద్దరు పూనియున్నారు. వారి పేర్లు మారీచుడు సుబాహువు. ఆ యాగములో కోపము పనికిరాదు గనుక నేను కోపించి వారిని శపింప జాలకయున్నాను. సత్యపరాక్రము డగు నీ కుమారుడు రాముడు ఆ రాక్షసులను హతమొనర్చుటకు సమర్థుడు కావున రాముని నా వెంట పంపుము. రాముడు తప్ప మరెవ్వరును ఆ రాక్షసులను వధింపజాలరు. నేను రాముని తోడ్కొని పోయి అతనికి ముల్లోకముల యందును ప్రఖ్యాతి కలుగునట్లు అనేక విధములుగా మేలు చేకూర్తును.

శ్రేయ శ్చాస్మై ప్రదాస్యామి బహురూపం న సంశయః ।
త్రయాణామపి లోకానాం యేన ఖ్యాతిం గమిష్యతి. 19-10

[సీతారాముల కల్యాణమే గదా రావణ వధకు నాంది !]

రాజా! ఏమి నీ ఆలోచన? పుత్రు డని గారాబము చేయవలదు.

నచ పుత్త్రకృత స్నేహం కర్తుమర్హసి పార్థివ. 19-13

రాముని మాహాత్మ్యమును నే నెరుగుదును. నేనే కాదు - మహాప్రభావు డగు వసిష్ఠుడును తపోనిష్ఠులగు ఈ ఋషులును యెరుగుదురు.

[తపస్సు చేతనే తెలిసికొనదగినవాడు శ్రీరాముడు. తండ్రియైన దశరథునికి కూడ శ్రీరాముని ప్రభావము మనసుకు రాలేదు గదా !]

అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్
వసిష్ఠోఽపి మహాతేజా యే చేమే తపసి స్థితాః. 19-14

రాజా! పృథివియందు నీ ధర్మవర్తనము నీ కీర్తి స్థిరముగా ఉండవలయునని కోరుదువేని రాముని నా వెంట పంపుము. వలసిన యెడల వసిష్ఠుని అడిగి తెలిసికొనుము.

నీ మంత్రులతో ఆలోచింపుము. వారికి ఇష్టముగా ఉన్న యెడలనే రాముని పంపుము. పది దినములు మాత్రమే నా యొద్ద నిలుపుకొందును.

## దశరథుని వేదన - విశ్వామిత్రుని కోపము

ఈ మాటలు చెవిని బడినంతనే దశరథుడు భయపడి దిగులుపడి గడగడ వణకి పోయినాడు. మూర్ఛిల్లినాడు. కొంత సేపటికి గాని తేరుకొనలేదు.

[పాపము ! శుభమా అని పుత్రుని వివాహమును గూర్చి ఆలోచించుచుండగా విపరీత సంఘటన ఏర్పడినది ! కుమారుని రాక్షసులకు బలియిచ్చుటకు మనసు ఒప్పునా !]

***దశరథుడు :*** స్వామీ ! క్షమింపుడు - మా రాముడు పసివాడు. ఇంకను పదునారు సంవత్సరములైనను నిండలేదు. రాక్షసులతో యుద్ధము చేయుగలడా!

[ఈ మాటను బట్టి రాముని వయస్సు లెక్కకట్టబూనుట సరికాదని తోచుచున్నది. కుమారునికి అరువది సంవత్సరములున్నను తండ్రికి పసివాడుగనే కనిపించుచుండును. తండ్రి కుమారుని చూచి "మాఅబ్బాయి" అనుచుండును. ఇది లోక సహజమైన మాట గనుక దశరథుని మాటను గూడ మనము ఈ అర్థముతోనే గ్రహించుట యుక్తము కదా !]

***దశరథుడు :*** మహర్షీ ! నా మాట నాలకింపుడు. నాకు అపారమైన సేన లున్నవి. నేనా సేనలతో మీ వెంట వచ్చి నా ప్రాణ మున్నంతవరకు రాక్షసులతో యుద్ధ మాడి మీ యాగమును రక్షించెదను. మా రాముడు కేవల బాలుడు. విలువిద్య కూడ చక్కగా నేర్చినవాడు కాడు. అస్త్రబలము అసలే లేదు. బలాబలములు గుర్తింపలేడు. యుద్ధములో అనుభవము లేదు. రాక్షసులు కపటయుద్ధము చేయువారుగదా! వారితో మా రాముడు పోరగలడా! మహర్షీ! ఒక్కమాట. రాముని విడిచి నేను క్షణమైనను జీవించి యుండజాలను.

విప్రయుక్తోహి రామేణ ముహూర్తమపి నోత్సహే
జీవితుం మునిశార్దూల న రామం నేతు మర్హసి. 20-8

కావున రాముని తీసికొని పోవలదు. రాముని కొనిపోవు తలపు కలదేని నన్ను సైతము చతురంగ బలములతో కొని పొమ్ము. స్వామీ! నేనెన్నియో ఉపవాసములు వ్రతములు చేసిన పిదప ముసలితనమున నాకు కలిగిన రాముని ఎంతమాత్రము కొని పోవవలదు. రాముడు నా జ్యేష్ఠ పుత్రుడు. నల్వురు పుత్రులలోను నాకు రామునిమీద ఎక్కువ ప్రీతి. స్వామీ! నా రాముని తీసికొని పోవలదు.

చతుర్ణా మాత్మజానాం హి ప్రీతిః పరమికా మమ
జ్యేష్ఠం ధర్మప్రధానంచ నరామం నేతుమర్హసి. 20-11

అది సరేకాని ఆ యిద్దరు రాక్షసులు ఎవరు? వారివృత్తాంతము సెలవీయుడు.

విశ్వామిత్రుడు : పులస్త్య వంశమున జన్మించినవాడు రావణుడు అను ఒక రాక్షసు డున్నాడు. వాని బలము వాని దుండగములు నీవుకూడా వినియుందువు. ఆతడు యాగములకు విఘ్నము గావించుచుండును. స్వయముగా వచ్చుటకు వీలు కానప్పుడు ఈ మారీచ సుబాహులను పంపుచుండును.

దశరథుడు : ఆ దురాత్మునితో (రావణునితో) యుద్ధము చేయుట నా తరమా! ఆ రావణుని ఎదుట దేవతలే ఆగలేరుగదా! మానవులు నిలువ గలరా! నేను నా సేనలు, నా కుమారులు అందరు ఏకమై వచ్చినను వానిముందు పనికిరాము. ఈ పరిస్థితిలో నేను రాముని ఎంతమాత్రము పంపజాలను.

విశ్వామిత్రుడు : (కోపోద్రిక్తుడై) రాజా! ప్రతిజ్ఞనే తప్పుచుంటివా! రఘుమహావంశమున జన్మించినవాడు చెప్పదగిన మాటలేనా ఇవి! నీవు చేయునది మంచిపనియని నీవు తలంతువేని నేను వచ్చినదారిననే వెళ్ళెదను. నీవు మాటతప్పినవాడవై నీ బంధువులనుగూడి సుఖముగా నుండుము.

యదీదం తేక్షమంరాజన్ గమిష్యామి యథాగతమ్
మిథ్యాప్రతిజ్ఞః కాకుత్స్థ సుఖీభవ సబాంధవః 21-3

## వసిష్ఠుని హితవాక్యములు

విశ్వామిత్రుని కోపమునకు భూమి వణకినది. దేవతలుసైతము భయము జెందిరి. అంతట వసిష్ఠభగవానుడు దశరథునికి హితము బోధించుచున్నాడు.

వసిష్ఠుడు : మహారాజా! ఇక్ష్వాకుమహావంశమున జన్మించితివి. నీ గుణగణములనుబట్టి 'ధర్మమూర్తి' అనదగినవాడవు. ధృతిమంతుడవు - ఎన్నో వ్రతములు చేసితివి. ధర్మాత్ముడ వని ముల్లోకములలో కీర్తింపబడుచున్నావు. ఈనాడు మాటతప్పి అప్రతిష్ఠపా లగుట సరికాదు. మాట తప్పుట గొప్పతప్పు. నీకు తగదు. నీవు నీ ప్రతిజ్ఞను పాలించి రాముని పంపుము. దీనివలన నీకు వచ్చు హాని యేమియును లేదు. విశ్వామిత్రుడు మిక్కిలి దొడ్డవాడు. ధర్మవిగ్రహుడు.

ఏషవిగ్రహవాన్ ధర్మ ఏషవీర్యవతాం వరః
ఏష బుద్ధ్యాఽధికోలోకే తపసశ్చ పరాయణమ్. 21-10

ముల్లోకములలోని అస్త్రములను ఈతడెరుగును. క్రొత్తఅస్త్రములను సైతము సృష్టింపగలడు. విశ్వామిత్రునివెంట రాముని పంపుటనుగూర్చి సందేహింపకుము. **మన రాముడు అస్త్రములందు సమర్థుడు కానిమ్ము కాకపోనిమ్ము - విశ్వామిత్రుని రక్షణలో ఉన్న రామునికి రాక్షసులవలన ఎట్టి అపాయమును కలుగదు.**

కృతాస్త్ర మకృతాస్త్రంవా నైనం శక్ష్యంతి రాక్షసాః
గుప్తం కుశికపుత్రేణ జ్వలనేనామృతం యథా. 21-19

రాక్షసులను నిగ్రహించుటకు తనకు శక్తిలేక కాదు విశ్వామిత్రు డిచ్చటికివచ్చుట. నీకుమారులకు మేలు సమకూర్చుటకే ఇట్లు నీకడకు వచ్చి నిన్ను యాచించుట !

తేషాం నిగ్రహణే శక్త స్స్వయంచ కుశికాత్మజః
తవపుత్ర హితార్థాయ త్వాముపేత్యాభియాచతే. 21-20

గురువుగారి హితవాక్యములవలన దశరథుడు మోహమును వీడి ప్రసన్న హృదయుడై శ్రీరాముని విశ్వామిత్రునివెంట పంపుటకు సమ్మతించి రామలక్ష్మణులను స్వయముగా తోడ్కొనివచ్చినాడు. కౌసల్య, దశరథుడు, వసిష్ఠుడు రామలక్ష్మణులకు మంగళాచరణము జరిపి విశ్వామిత్రునికి అప్పగించినారు. పుష్పవృష్టి కురిసినది. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వెంటబెట్టుకొని బయలుదేరినాడు.

## రామలక్ష్మణులు విశ్వామిత్రునివెంట పోవుట

ముందు విశ్వామిత్రుడు తరువాత రాముడు ఆ వెనుక లక్ష్మణుడు-ఈ వరుసన ప్రయాణము సాగించి సరయూనది దక్షిణతీరము చేరినారు.

*విశ్వామిత్రుడు :* రామా ! జలము గైకొనుము. నీకు 'బల', 'అతిబల' అను రెండు మంత్రములను ఉపదేశించుచున్నాను. వానిని గ్రహింపుము- ఈ విద్యల ప్రభావముచే నీకు అలసటగాని దప్పిగాని రూప విపర్యయము గాని కలుగవు. నిదురపోయి నప్పుడు గాని మేల్కొంచి యున్నప్పుడు గాని రాక్షసులు నిన్నేమియు చేయ జాలరు. బాహుబలములో నీకంటె అధికుడు ఎవ్వడును ఉండబోడు. సౌందర్య మందు, తెలివియందు, బుద్ధియందు, మాటలయందు నీవు మేటిగా నుండగలవు. ఈ విద్యలను స్వీకరించుటకు నీవు సర్వవిధముల అర్హుడవు - కావున వానిని నీ కిచ్చుచున్నాను.

శ్రీరాముడు ఆ విద్యలను ప్రతిగ్రహించెను. ఆ రాత్రి యంతయు సరయూనది దక్షిణతీరమున గడపినారు. పత్రములపై శయనించినారు. వేకువజా మైనది.

*విశ్వామిత్రుడు :* రామా ! వేకువ కావచ్చినది లెమ్ము. లేచి ఆహ్నికములు జరుప వలయును గదా !

కౌసల్యా సుప్రజారామ ః పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నర శార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్. 23-2

[ఈ శ్లోకము శ్రీ వెంకటేశ్వర సుప్రభాతములో సైత మున్నది. అనుదినము వేకువ జామున తిరుపతి కొండమీద గానము చేయుచుందురు.]

రామ లక్ష్మణులు లేచి స్నానాది కాలకృత్యములు ముగించుకొని సంధ్యను ఆరాధించినారు. ముగ్గురు బయలుదేరి పయనించి సరయూనది సంగమమందు గంగా నదిని చూచినారు. అక్కడ ఒక ఆశ్రమమును చూచి "స్వామీ! యీ ఆశ్రమ మెవ్వరిది" అని రాముడు విశ్వామిత్రుని అడిగినాడు.

అది స్థాణుని ఆశ్రమము. 'కామాశ్రమము' అనియు దానికి పే రున్నది. ధానికి సంబంధించిన కథను విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు చెప్పుచున్నాడు.

*విశ్వామిత్రుడు :* పూర్వకాలమున మన్మథుడు సాకారుడై యుండినాడు. శివుడు పార్వతీ సమేతుడై ఈ ఆశ్రమమున ఉండినపుడు మన్మథుడు శివునికి కోపకారణమును కల్పించినాడు. శివుడు తన మూడవ కన్ను తెరచి మన్మథుని భస్మ మొనరించినాడు. ఆ విధముగా మన్మథుడు అనంగు డైనాడు. అతడు శరీరమును విడిచిన ప్రదేశము అంగదేశ మైనది. ఇదియే ఆ స్థాణుని ఆశ్రమము. ఇక్కడి మునులు వారి శిష్యులే. వారందరు ధర్మపరులు. మనము ఈ రాత్రి ఇందే యుండి రేపు బయలు దేరుదము. మనము స్నానము చేసి ఆశ్రమములోనికి శుచిగా ప్రవేశింప వలయును. ఆశ్రమము పవిత్ర ప్రదేశముగదా!

ఈ విధముగా మాటలాడు కొనుచుండగా ఆశ్రమమునందలి మునులు వీరి రాకను గమనించి వచ్చి ఆశ్రమములోనికి కొనిపోయి అతిథి సత్కారములు చేసినారు. రాత్రి సుఖముగా గడచినది.

తెల్లవారి బయలుదేరి తాటకా వనమును చేరినారు.

## తాటకా సంహారము

భయంకరమైన వనమును చూచి దాని విషయము తెలియజేయుడని రామ లక్ష్మణులు విశ్వామిత్రుని కోరినారు.

*విశ్వామిత్రుడు :* రామా! పూర్వము ఇంద్రుడు వృత్రాసురుని వధించెను గదా! ఇంద్రునికి బ్రహ్మహత్యాదోషము సంభవించినది. అశుచిత్వము, ఆకలి కలిగినవి. ఆ రెంటినీ ఇంద్రుడు ఈ ప్రదేశమున విసర్జించి శుచి యైనాడు. తన అశుచిత్వమును, ఆకలిని స్వీకరించిన ఈ ప్రదేశమునందు ధనధాన్యములు పుష్కలముగా ఉండునట్లు ఇంద్రుడు వరము ప్రసాదించి ఈ మలద కరూశ దేశములను అనుగ్రహించినాడు.

అందువలన ఈ దేశములు పచ్చగా చక్కగా ఉండినవి. కొంత కాలమునకు తాటక అను ఒక యక్షస్త్రీ జనించినది. ఆమె పుట్టినప్పుడే వేయి ఏనుగుల బలముతో పుట్టినది. ఆమె సుందుని భార్య. వారికి "మారీచుడు" అను ఒక కుమారుడు కలిగినాడు-మారీచుడు, రాక్షసుడు-ప్రజలను భయపెట్టు స్వభావము కలవాడు. ఈ మలద కరూశ దేశములను తాటక ఆక్రమించి నాశనము చేయుచున్నది. నీ బాహుబలముచే నీవీ తాటకను వధింపవలయును.

**స్వబాహుబల మాశ్రిత్య జహీమాం దుష్టచారిణీమ్.** 24-30

*రాముడు :* యక్షులు అల్పవీర్యులని అందురుగదా ! ఈ స్త్రీకి వేయి ఏనుగుల బల మెట్లు కలిగినది ?

*విశ్వామిత్రుడు :* అది వరదానము వలన కలిగిన బలము. సుకేతుడు అని యొక యక్షుడుండువాడు. అతనికి సంతానము కలుగలేదు. తపస్సు చేసినాడు. బ్రహ్మ ప్రత్యక్షమై పుత్రుని ప్రసాదింపక వేయి ఏనుగుల బలముతో గూడిన పుత్రికను ప్రసాదించినాడు. ఆమె మంచి సౌందర్యవతి. సుకేతుడు తన పుత్రికను సుందునకిచ్చి పెండ్లిచేసినాడు. వారికి మారీచుడు పుట్టినాడు. ఒకానొక సందర్భమున అగస్త్య మహర్షి సుందుని చంపవలసివచ్చి చంపినాడు. అందుపై తాటకయు మారీచుడును అగస్త్యుని మీదికి పోయి గుద్దులిమినారు. అగస్త్యుడు వారిని శపించినాడు. ఆ శాప ఫలముగా తాటకయును మారీచుడును రాక్షసులైనారు. తాటక తీవ్ర కోపము నూని యీదేశమును నాశనము చేయుచున్నది. నీవు ఆ తాటకను వధింపవలయును. మరియెవ్వరును ఆపని చేయలేరు.

రామా! స్త్రీఅని శంకింపతగదు. గోబ్రాహ్మణ హితముకొరకు నీవీ దుష్టురాలిని వధింపుము. పూర్వము ఇంద్రుడు మంథరను వధించియున్నాడు (25-19) విష్ణుదేవుడు శుక్రునితల్లిని కడతేర్చియున్నాడు (25-20) ఇట్టి ఉదాహరణములు ఎన్నియో కలవు. రాజు ప్రజలను రక్షింపవలసినవాడు కావున ప్రజలకు హితకరమైన కార్యమును - క్రూరమైనది కానిమ్ము - క్రూరము కానిది కానిమ్ము - పాపము కానిమ్ము - అపవాదములు తెచ్చునది కానిమ్ము - ఎట్టిదైనను తప్పక చేయవలయును. కాబట్టి ఈ తాటకను వధింపుము. ఇందులో ధర్మలోప మేమియును లేదు.

**గోబ్రాహ్మణ హితార్థాయ జహిదుష్ట పరాక్రమామ్** 25-14
**నహితే స్త్రీవధకృతే ఘృణా కార్యానరోత్తమ**

**చాతుర్వర్ణ్య హితార్థాయ కర్తవ్యం రాజసూనునా** 25-16

నృశంస మనృశంసంవా ప్రజారక్షణ కారణాత్
పాతకంవా సదోషంవా కర్తవ్యం రక్షతాసతా. 26-17

రాజ్యభారనియుక్తానా మేషధర్మ స్సనాతనః
అధర్మ్యాం జహి కాకుత్స్థ ధర్మోహ్యస్యానవిద్యతే. 25-18

రాముడు : స్వామీ! తాము విధించినపని తప్పక చేయుదును. మీ పనులన్నిటిని నెరవేర్పుమని మా తండ్రిగారు చెప్పిపంపిరిగదా! తండ్రిమాటను అవమానింతునా.

పితుర్వచన నిర్దేశా త్పితుర్వచన గౌరవాత్
వచనం కౌశికస్యేతి కర్తవ్య మవిశంకయా. 26.2

శ్రీరాముడు తాటకా సంహారమునకు సిద్ధపడినాడు. విల్లుచేబూని టంకారము చేసినాడు. ఆ శబ్దము దశదిశలకు వ్యాపించినది. తాటకకూడ ఆ శబ్దమునువిని కోపించి పరుగెత్తుకొని వచ్చినది. తాటక వికారరూపమును శ్రీరాముడు చూచినాడు.

రాముడు : లక్ష్మణా! చూచితివా ఈ ఆకారమును! పిటికివారెవరైన చూతురేని వారి గుండెలు బ్రద్దలగునుసుమా!. ఈ తాటకకు ముక్కుచెవులు కోసి దీనిపొగరు అణచిన సరిపోవును. స్త్రీకదా! వధించుట ఏల?

నహ్యేనా ముత్సహే హంతుం స్త్రీ స్వభావేన రక్షితామ్
వీర్యం చాస్యాగతించాపి హనిష్యామీతి మే మతిః 26-12

[ ఇప్పటి వరకు విశ్వామిత్రుడు చెప్పిన ఉపదేశ మేమైనట్లు? ఆ మాటలు అడుగునపడి రాముని సహజ ఔదార్యగుణము పైకి వచ్చినది! ]

ఈ మాటలలోనే తాటక వచ్చినది. చేతులు పైకెత్తి గర్జించుచు రామునిమీదికే వచ్చినది. విశ్వామిత్రుడు "రామలక్ష్మణులకు మంగళమగును గాక" అని ఆశీర్వదించినాడు. తాటక వచ్చు వేగమునకు దుమ్ము రేగినది. తాటక శిలావర్షమును కురిపించినది. శ్రీరాముడు బాణములు ప్రయోగించి తాటకచేతులను ఖండించినాడు. లక్ష్మణుడు తాటక ముక్కు చెవులు ఖండించినాడు.

కామరూపిణియగు తాటక అంతర్ధానమునొంది శిలావర్షమును కురిపించినది. అంతట విశ్వామిత్రుడు "రామా! తాటకను దయతలచుట ఇంక చాలును. సాయంకాలము కాబోవుచున్నది. రాక్షసులకు బలము వృద్ధియగు వేళ. ఈ లోపలనే ఆ దుష్టురాలిని వధింపుము" అని చెప్పినాడు.

ఈ ప్రబోధమును విని శబ్దవేధియగు శ్రీరాముడు తన లాఘవమును ప్రదర్శించి మఱుగుపడియున్న తాటకమీద బాణములు విడిచినాడు. తాటక రామలక్ష్మణులపైకి దూకినది. తాటక ఱొమ్ములోన ఒక బాణమును నాటి రాముడు తాటకను వధించినాడు

దేవతలు ఇంద్రుడు సంతోషించి శ్రీరాముని కొనియాడినారు. అందఱు విశ్వామిత్రునితో "నీకు మంగళమగును గాక! ఈ తాటకా సంహారము మా కందఱకు సంతోషము కలిగించినది. స్వామీ! శ్రీరామునియెడ అనుగ్రహము జూపుము. ఇతడు చేయవలసిన గొప్ప దేవతా కార్యమున్నది. శ్రీరామునికి అస్త్రము లన్నింటిని ఉపదేశింపుము. వానిని స్వీకరించుటకు శ్రీరాముడు తగినవాడు" అని చెప్పి వారి వారి నెలవులకు పోయినారు.

[ తాటకవంటి రాక్షసిని కేవల బాహుబలముచే వధించి తన శక్తిని నిరూపించిన శ్రీరాముడు అస్త్రములను స్వీకరించుటకు అర్హుడే!]

విశ్వామిత్రుడు శ్రీరాముని శిరము మూర్కొని "రామా! ఈ రాత్రి ఇందే యుండి రేపు నా ఆశ్రమమునకు పోవుదము" అన్నాడు.

తాటక మరణించిన పిదప ఆ వనమంతయు మనోహరమైనది. ఆ రాత్రి రామ లక్ష్మణులు విశ్వామిత్రుడు సుఖముగా గడపినారు.

## అ స్త్ర ప్ర దా న ము

సూర్యోదయమైనది.

విశ్వా : (ఆనందముతో) రామా! నీకు మంగళమగును గాక! అస్త్రము లన్నింటిని ఇచ్చెదను స్వీకరింపుము. దేవతలు, రాక్షసులు, గంధర్వులు, ఉరగులు ఏకమైవచ్చినను నీకు కొంచెమేని అపాయము కలుగకుండునట్లు చేయగల దివ్యాస్త్రములను నీకు ఉపదేశించెదను. ధర్మచక్రము, కాలచక్రము, విష్ణుచక్రము, ఐంద్రాస్త్రము, వజ్రాస్త్రము, శైవశూలము, బ్రహ్మశిరము, ఐషీకము, బ్రహ్మాస్త్రము, మోదకి శిఖరి అను రెండు గదలు, ధర్మపాశము, కాలపాశము, వరుణపాశము, వారుణాస్త్రము, శుష్కాశని, ఆర్ద్రాశని, పైనాకాస్త్రము, నారాయణాస్త్రము, ఆగ్నేయాస్త్రము, వాయవ్యాస్త్రము, హయశిరోనామాస్త్రము, క్రౌంచాస్త్రము, విష్ణుశక్తి, రుద్రశక్తి మున్నగు అస్త్రముల నన్నిటిని నీకిచ్చుచున్నాను. వానిని గ్రహింపుము.

ఇట్లు చెప్పి తూర్పుమొగముగా నిలిచి విశ్వామిత్రుడు అస్త్రమంత్రము లన్నిటిని శ్రీరామునికి ఉపదేశించినాడు. శ్రీరాముడు ఆ మంత్రములను జపించినవెంటనే అస్త్రములన్నియు రాముని సేవించినవి. అస్త్రదేవతలు రామునికి ప్రత్యక్షమై "ప్రభూ! మేము నీకు పరిచారకుల మైతిమి" అని చెప్పినారు. రాముడు ఆ దేవతలను స్పృశించి "నా మనస్సును అనుసరించి యుండుడు" అన్నాడు.

ఈ విధముగా అస్త్రప్రదానము జరిగినది. మరల ప్రయాణము సాగింపబోవు సమయములో రాముడు విశ్వామిత్రునితో

**రాముడు :** స్వామీ ! తాము ప్రసాదించిన అస్త్రములను ప్రతిగ్రహించితిని. ప్రయోగము గ్రహించితిని. ఉపసంహారము సైతము ఉపదేశింప వేడుచున్నాను.

[ ఉపసంహారము నెఱుగని వానికి ఎన్ని చిక్కులు ! శ్రీరాముని జాగరూకత గమనింపదగియున్నది. ]

రాముని ప్రార్థన నంగీకరించి విశ్వామిత్రుడు రామునికి ఉపసంహార మంత్రములను కూడ ఉపదేశించినాడు.

[28 సర్గ 4 మొదలు 10 వఱకు శ్లోకములలో వివరింపబడి యున్నవి.]

రాముడు ఉపసంహార మంత్రములను ప్రతిగ్రహించినాడు. మంత్రాధిష్ఠాన దేవతలు రాముని సమీపించి "రామప్రభూ! ఇదిగో వచ్చి యున్నాము. ఏమి ఆజ్ఞ?" అని అడిగినారు.

**రాముడు :** కార్యావసరమున నేను మిమ్ము స్మరించినప్పుడు వచ్చి నాకు సాయపడవలయును. ఇప్పుడు వెళ్ళవచ్చును.

> **మానసాః కార్యకాలేషు సాహాయ్యం మేకరిష్యథ**
> **గమ్యతామితి తానాహ యథేష్టం రఘునందనః.** 28-15

అధిష్ఠాన దేవతలు రామునికి ప్రదక్షిణముచేసి అంతర్ధాన మైనారు. విశ్వామిత్రుడు రామలక్ష్మణులు ప్రయాణము సాగించినారు.

## సి ద్ధా శ్ర మ ము

శ్రీరాముడు ఒక ఆశ్రమమును చూచి "మిక్కిలి మనోహరముగా ఉన్న యీ ఆశ్రమ మెవ్వరిది? మీరు యాగము చేయు ప్రదేశ మెచ్చట ఉన్నది. నేను రాక్షసులను వధింపవలసినది ఎక్కడ" అని విశ్వామిత్రుని అడిగినాడు.

**విశ్వా :** రామా ! దర్శనీయమైన ఈ ఆశ్రమము సంగతి వినుము. విష్ణుదేవుడు అనేక సంవత్సరములు తపస్సు చేసిన ప్రదేశ మిది. ఇదియే వామనావతార రూపు డగు విష్ణుదేవుని ఆశ్రమము.

> ఏషపూర్వాశ్రమోరామ వామనస్య మహాత్మనః
> సిద్ధాశ్రమ ఇతిఖ్యాత స్సిద్ధోహ్యత్ర మహాతపాః. 29-3

గొప్ప తపస్వియైన కాశ్యపుడు తపస్సిద్ధిని పొందిన చోటు. గనుక దీనికి సిద్ధాశ్రమ మని పేరు వచ్చినది.

ఆ కాలముననే బలిచక్రవర్తి దేవతలను జయించి స్వర్గమునకు కూడా అధిపతియై ఒక యజ్ఞమును ప్రారంభించినాడు. అప్పుడు దేవత లందరు అగ్నిదేవుని పురస్కరించుకొని ఈ ఆశ్రమమున తపస్సు చేయుచుండిన విష్ణుదేవుని సమీపించి "స్వామీ! బలిచక్రవర్తి ఉపక్రమించిన యాగము పూర్తియగుటకు పూర్వమే మనము మనపని చక్కజేసికొనవలయును. ఎవ్వ డేది కోరునో దాని నిచ్చి బలిచక్రవర్తి అర్థిజనుల కోరికలను తీర్చుచున్నాడు. మీరిప్పుడు వామనావతారము నెత్తి దేవతా కార్యమును నిర్వర్తింపుడు" అని ప్రార్థించినారు. ఆ కాలముననే కాశ్యపుడు అదితినిగూడి విష్ణుదేవుని గూర్చి తపమాచరించుచుండెను. విష్ణుదేవుడు కాశ్యపునకు ప్రత్యక్షమై వరము కోరుమని సెలవిచ్చినాడు.

కాశ్య :- స్వామీ! నీవు నాకును అదితికిని పుత్రుడవుగా జన్మించి ఇంద్రునికి తమ్ముడవై దేవతల దుఃఖమును బాపి వారికి సహాయము చేయుము. ఇదియే నా కోరిక.

పుత్రత్వం గచ్ఛ భగవ న్నదిత్యా మమ చానఘ
భ్రాతా భవ యవీయాం స్త్వం శక్ర స్యాసురసూదన. 29-16

శోకార్తానాం తు దేవానాం సాహాయ్యం కర్తు మర్హసి. 29-17

విష్ణుదేవుడు వామనరూపమున అదితికి పుత్రుడుగా పుట్టినాడు. వామనుడు బలిచక్రవర్తి యొద్దకు పోయి మూడడుగులను యాచించి తీసికొని రెండడుగులకే ముల్లోకములను ఆక్రమించి మూడవ అడుగు బలిచక్రవర్తి తలమీద పెట్టి అటుపై బలిచక్రవర్తిని బంధించి స్వర్గాధిపత్యమును మరల దేవేంద్రుని కిచ్చెను.

శ్రమను పోగొట్టు ఈ ఆశ్రమము పూర్వము వామనునిది. దానిని ఇప్పుడు నే ననుభవించు చున్నాను.

తేనైష పూర్వమా క్రాంత ఆశ్రమశ్శ్రమ నాశనః
మయాపి భక్త్యా తస్యైష వామన స్యోపభుజ్యతే. 29-22

రామా! నా యాగమునకు విఘ్నము కలిగించు రాక్షసులు ఇక్కడికే వత్తురు. నీ వా దుర్మార్గులను వధింపవలసినది ఇక్కడనే. మహత్వముగల ఈ సిద్ధాశ్రమములో ప్రవేశింతము. నాయనా! ఈ ఆశ్రమము నా కెట్లో నీకును అట్లే సొంతము సుమా!

[శ్రీరాముడు విష్ణురూపుడే కావున విష్ణుదేవుని ఆశ్రమము రామునికి సొంత మనుటలో ఆశ్చర్య మేమియులేదు.]

**అద్యగచ్ఛామహే రామ సిద్ధాశ్రమ మనుత్తమమ్**
**తదాశ్రమ పదం తాత తవాప్యేత ద్యథా మమ.**

ముగ్గురును ఆశ్రమములోనికి ప్రవేశించినారు. అచ్చటి మునులందరు పరుగులతో వచ్చి విశ్వామిత్రుని పూజించి రామలక్ష్మణులకు ఆతిథ్య మిచ్చినారు. రామలక్ష్మణులు విశ్వామిత్రునితో "తాము దీక్ష వహింపుడు. ఈ సిద్ధాశ్రమము సార్థక నామధేయము గలది యగునుగాక" అన్నారు.

విశ్వామిత్రుడు దీక్ష వహించినాడు.

ప్రభాతమైన తోడనే రామలక్ష్మణులు కాల్యకృత్యములను తీర్చుకొని విశ్వామిత్రునికి నమస్కరించి "స్వామీ! ఆ రాక్షసుల నెప్పుడు వధింప వలయును?" అని అడిగినారు. విశ్వామిత్రుడు పలుకలేదు. అచ్చటి మునులు "మీరు ఈ యాగమును ఆరు రాత్రులు రక్షింప వలెను. ఈ మహాముని దీక్ష వహించి యున్నాడు గనుక మీతో పలుకడు" అన్నారు.

## యా గ ర క్ష ణ

రామ లక్ష్మణులు అహోరాత్రులు యాగమును రక్షించు చుండిరి. అయిదు దినములు గడచి పోయినవి. ఆరవనాడు రాముడు "లక్ష్మణా! మెలకువ కలిగియుండుము" అన్నాడు. ఈ మాటలోనే యాగవేదిక జ్వలించినది. ఆకాశమున పిడుగువంటి శబ్దము కలిగినది. మారీచ సుబాహులు వచ్చి రక్త వర్షమును కురిపించినారు. శ్రీరాముడు ఆకాశములోని రాక్షసులను చూచి "లక్ష్మణా! రాక్షసులు; మానవాస్త్రమును ప్రయోగించి వారిని పారదోలెదను" అని మారీచుని రొమ్మున మానవాస్త్రమును ప్రయోగించినాడు. మారీచుడు నూరు యోజనముల దూరము పోయి సముద్రములో పడినాడు. రాముడు దీనిని చూచి "లక్ష్మణా! ఈ మానవాస్త్రము రాక్షసుని మూర్ఛితు జేసికొని పోవుచున్నదే కాని అతనిని వధింపలేదు" అని ఆగ్నేయాస్త్రము ప్రయోగించి సుబాహువును సంహరించినాడు. మిగిలిన రాక్షసుల మీద వాయవ్యాస్త్రమును ప్రయోగించినాడు.

ఈ విధముగా రాక్షసులను శిక్షించి శ్రీరాముడు విశ్వామిత్రుని యాగమును రక్షించినాడు. విశ్వామిత్రుడు సంతోషించి "రామా! నీవు నీ తండ్రి మాటను పాటించి నన్ను కృతార్థుని చేసితివి. ఈ ఆశ్రమము పేరు నిలబెట్టితివి. ఇది నిజముగా సిద్ధాశ్రమమే అయినది" అని పలికినాడు.

ఆ రాత్రి ఆశ్రమములో సుఖముగా గడచిపోయినది. ఉదయమున రామలక్ష్మణులు విశ్వామిత్రుని కడ కేగి "స్వామీ! మేము చేయవలసిన కార్యములు మఱే వైన గలవేని ఆజ్ఞాపింపుడు" అని కోరినారు. మును లందఱు విశ్వామిత్రుని పురస్క

కించుకొని "రామా! జనక మహారాజు ఒక యజ్ఞమును చేయుచున్నాడు. మేమందరము అక్కడికి వెళ్లుచున్నాము. మీరుకూడ రండు. అక్కడ ఒక అద్భుతమైన ధనుస్సున్నది. దానిని మీరు చూడవచ్చును. అది దేవతలిచ్చిన ధనుస్సు! దానిని మోపెట్టుటకు ఎందరెందరో ప్రయత్నించిరి కాని ఎవ్వరికిని సాధ్యము కాలేదు" అని చెప్పినారు.

[ అట్టి ధనుస్సును చూచుట వీరులగు క్షత్రియ కుమారులకు ఆనందము నిచ్చును. ]

విశ్వామిత్రుడు మునులు రామలక్ష్మణులు ప్రయాణమై సూర్యాస్తమయమునకు శోణానదీ తీరముచేరి ఆ రాత్రి అక్కడ విశ్రమించినారు. ప్రొద్దున స్నానాదికములు కావించి అందఱు విశ్వామిత్రుని సన్నిధిలో కూర్చుండినారు.

*రాముడు :* స్వామీ! ఈ దేశము ఎంతో శోభాయమానముగా ఉన్నది. ఎవ్వరిది?

*విశ్వా :* బ్రహ్మపుత్రుడైన కుశుడు అను ఒక మహానుభావుడుండినాడు. అతనికి కుశాంబుడు, కుశనాభుడు, అధూర్తరజసుడు, వసువు అని నలుగురు పుత్రులు కలిగిరి. కుశుడు కుమారులను పిలిచి "సుతులారా! ప్రజాపాలనముచేసి ధర్మమునార్జింపుడు" అని ఆదేశించినాడు.

నలుగురు నాలుగు రాజధానులను నిర్మించుకొనిరి. కుశాంబుడు 'కౌశాంబి' అను పట్టణమును రాజధానిగా చేసికొనెను. కుశనాభుడు 'మహోదయము'ను, అధూర్తరజసుడు 'ధర్మారణ్యము' ను వసువు 'గిరివ్రజము' ను రాజధానులుగా చేసికొని ప్రజలను పాలించుచుండిరి.

ఇప్పుడు మన ముందునది వసుమహారాజు రాజ్యము. అయిదు పర్వతముల నడుమ ఉన్నది.

కుశనాభుడు రాజర్షి ఆయన భార్య 'ఘృతాచి' అను ఒక అప్సరస. వారికి నూరుగురు కొమారితలు కలిగినారు. అందరు సౌందర్యవతులు. ఉద్యానవనములో విహరించుచు ఆడుచు పాడుచు హాయిగా నుండువారు. ఒకప్పుడు వాయుదేవుడు వారిని చూచి మోహించి "నాకు మీరు భార్యలు కండు. మీకు నిత్యయౌవనము, అమరత్వము ప్రసాదింతును" అని పలికినాడు.

చలం హి యౌవనం నిత్యం మానుషేషు విశేషతః
అక్షయ్యం యౌవనం ప్రాప్తా అమర్యాశ్చ భవిష్యథ. 32-17

*కన్యలు :* వాయుదేవుడా! నీ ప్రభావము మేమెరుగుదుము. మమ్ముల నేల ఇట్లు అవమానించుచున్నావు? మేము కుశనాభుని దుహితలము. నిన్నున్నునీ ప్రభువైన

ఇంద్రుని పదభ్రష్టులుగా చేయగలము. కాని శపింతుమేని మా తపస్సు తఱిగి పోవునని ఆ పని చేయకున్నాము. తలచినంతనే నిన్ను మా తండ్రి హతమార్ప గలడు. ఆ మహనీయుని అవమానింపకుము. మా తండ్రి మమ్ముల నెవనికిచ్చునో అతడే మా పతి. మా తండ్రియే మాకు దైవము.

పితాహి ప్రభురస్మాకం పరమం దైవతం హి నః
యస్య నో దాస్యతి పితా సనోభర్తా భవిష్యతి. 32-22

[ ఈ సూచన నేటికిని అనుసరింప దగినది. ]

ఈ మాటలు విని వాయుదేవునికి కోపము కలిగినది. కన్యల సమస్త అవయవములలో ప్రవేశించి అందఱిని కుబ్జల చేసినాడు. వారు సిగ్గుపడి దుఃఖించుచు ఇంటికి పోయి జరిగిన సంగతిని తండ్రికి చెప్పినారు. కుశనాభుడు వారి ఓర్పును మెచ్చుకొని 'క్షమ' యొక్క ప్రాశస్త్యమును ఉగ్గడించినాడు. "లోకమంతయు ఓర్పుమీదనే ఆధారపడి యున్నది" అని చెప్పినాడు.

క్షాంతం క్షమావతాం పుత్ర్యః కర్తవ్యం సుమహత్కృతమ్
ఐకమత్య ముపాగమ్య కులం చావేక్షితం మమ 33-6
అలంకారోహి నారీణాం క్షమా తు పురుషస్యవా
దుష్కరం తచ్చయత్ క్షాంతం త్రిదశేషు విశేషతః 33-7
యాదృశీవః క్షమా పుత్ర్య స్సర్వాసా మవిశేషతః
క్షమాదానం క్షమాయజ్ఞః క్షమాసత్యం హి పుత్రికాః 33-8
క్షమాయశః క్షమాధర్మః క్షమయా విష్ఠితం జగత్ 33-9

అటు పిమ్మట కుశనాభుడు పుత్రికల వివాహమును గూర్చి మంత్రులతో ఆలోచించినాడు. "చూళి" అను ఒక ఋషి కలడు. ఆయనకు 'సోమద' అను గంధర్వ స్త్రీ పరిచర్యలు చేయగా ఆమె సేవకు చూళి సంతోషించి "నీకేమి కావలయును" అని అడిగినాడు. "బ్రాహ్మణశక్తితో కూడిన కుమారుని కోరుచున్నాను" అని సోమద చెప్పినది. చూళి సోమదకు "బ్రహ్మదత్తుడు" అను మానస పుత్రుని ప్రసాదించినాడు. బ్రహ్మదత్తుడు సమస్త సంపదలతో కాంపిల్యా నగరములో నివసించుచుండెను. కుశనాభుడు బ్రహ్మదత్తుని ఆహ్వానించి నూరుగురు పుత్రికలను అతనికిచ్చి వివాహము జరిపించినాడు. బ్రహ్మదత్తుడు పాణిగ్రహణము చేయుటతోడనే కన్యలకు కుబ్జాత్వము పోయి యథాప్రకారము సౌందర్యవతులైనారు. కుశనాభునికి సంతోషమైనది. నూరుగురు కొమారితలను అల్లునివెంట అత్తవారింటికి పంపి కుశనాభుడు హాయిని పొందినాడు. సోమద కోడండ్రను చూచి ఆనందించి ఆదరించినది.

కుశనాభునికి పుత్రులు లేరు. పుత్రుని కొరకు పుత్ర కామేష్టి చేసినాడు. అప్పుడు కుశుడు దర్శనమిచ్చి "నాయనా! నీకు గాధి యను సుపుత్రుడుదయింప గలడు. అతని వలన నీవు శాశ్వత కీర్తిని పొందగలవు" అని ఆశీర్వదించి కుశుడు బ్రహ్మలోకమున కరిగినాడు. కొంతకాలమునకు కుశనాభునికి కుమారుడు కలిగినాడు. అతడే గాధి రామా! ఆ గాధియే నా తండ్రి. నేను కుశవంశమున జనించినందున నాకు 'కౌశికుడు అను పేరు వచ్చినది. నా కొక జ్యేష్ఠ సోదరి ఉండినది. ఆమె ఋచికుని భార్య.

[ ఈమె శునశ్శేఫుని తల్లియై యుండును. ]

నా సోదరి తన భర్తను సేవించి శరీరముతో స్వర్గమునకు వెళ్లినది.

[ త్రిశంకువు సాధింపలేని పనిని ఈ సాధ్వి భర్తసేవవలన సాధింప గలిగినది! పతిసేవ ఎంత మహిమ గలది. ]

నా సోదరి లోకహితము కొరకు హిమవత్ప్రాంతమున చేరి 'కౌశికీ' నదిగా ప్రవహించు చున్నది. నేనామెకు చేరువగా ఉండదలచి కౌశికీ తీరమున నివాస మేర్పరచుకొంటిని. యాగము చేయుటకై ఇక్కడికి వచ్చితిని. రామా! నీ పరాక్రమ సహాయముచే నాకు యజ్ఞసిద్ధి లభించినది.

ఇది నా కథ. ఈ కథలతోనే అర్ధరాత్రమైనది. చంద్రోదయముకూడ అగు చున్నది. మీరిక నిద్రపొండు.

ఈ మాటలు చెప్పి విశ్వామిత్రుడుకూడ విశ్రమించినాడు.

[ అస్తమివాంశుమాన్ 34-22 : అస్తమించు సూర్యుని పగిది ఉన్నాడు. ]

ఉదయమైనది. విశ్వామిత్రుడు రాముని మేల్కొలిపినాడు.

సుప్రభాతా నిశా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రంతే గమనాయాభిరోచయ 35-2

**రాముడు :** స్వామీ! ఈ శోణా నదిని ఏ మార్గమున దాటుదము.

అయంశోణ శ్శుభజలో గాధః పులిన మండితః
కతరేణ పథా బ్రహ్మన్ సంతరిష్యామహే వయమ్ 35-4

**విశ్వా :** దీనికై ఆలోచన ఏల? మహర్షులు ఏ మార్గము నవలంబింతురో ఆ మార్గముననే పోవుదము.

ఏవ ముక్తస్తు రామేణ విశ్వామిత్రోఽబ్రవీదిదమ్
ఏష పంథా మయోద్దిష్టో యేన యాంతి మహర్షయః 35-5

[ ఈ శ్లోకములో గొప్ప అర్థమున్నది. ఎప్పుడుకూడ మహర్షులు సూచించిన మార్గము ననుసరించుటయే సరియైన పద్ధతి. స్వతంత్రించి అడ్డదారులలో నడచుట యుక్తము కాదు. ]

అందరు కొంతదూరము పయనించి గంగానదిని సమీపించినారు. అందరు గంగా తీరమున విడిసి స్నానములు భోజనములుచేసి విశ్వామిత్రుని పరివేష్టించినారు.

## గంగావతరణము

రాముడు : భగవాన్! గంగను 'త్రిపథగ' అందురు గదా! ఆ నది ముల్లోకములను ఆక్రమించి సముద్రుని పొందిన విధమేమి ? వినగోరుచున్నాను.

విశ్వా : రామా! చెప్పెదను వినుము. హిమవంతుడను పర్వతరాజు కలడు గదా! ఆయన భార్య పేరు మనోరమ. ఆమె మేరుపర్వత పుత్రి. వారికి ఇద్దరు పుత్రికలు కలిగినారు. పెద్ద కొమారిత పేరు 'గంగ', చిన్నకొమారిత పేరు 'ఉమ'. ఆమెకు 'పార్వతి' అనికూడ ఒక పేరున్నది.

దేవతలందరు హిమవంతునియొద్దకు వచ్చి ఆయనను యాచించి వారి కార్యసిద్ధి కొరకు గంగను తీసికొని పోయినారు.

ఉమ ఉగ్రతపస్సు ప్రారంభించినది. ఆమెను శివునకిచ్చి పెండ్లిచేసినారు. గంగ దేవతానదియై దేవలోకములో చేరినది.

రాముడు : గంగ త్రిపథగ ఎట్లయినది ?

విశ్వా : అది ఒక పెద్ద కథ. చెప్పెదను వినుము. శివునికి పెండ్లియైనదని చెప్పితినిగదా! శివుడు తన భార్యతో క్రీడింప నారంభించినాడు. నూరు దివ్య సంవత్సరములు గడచినవి. పార్వతికి సుతుడు కలుగలేదు. బ్రహ్మాది దేవతలకు భయము కలిగినది. "ఈ పార్వతియందు ఉద్భవించు భూతమును ఎవరు సహింపగలరు ?" అని. వారికేమియు తోచక శివుని యొద్దకు వచ్చి "స్వామీ! దేవతల మందలము వచ్చి నీకు నమస్కరించుచున్నాము. నీ తేజస్సున పుట్టిన పుత్రుని లోకములు ధరింప జాలవు. కావున నీవు పార్వతిని గూడి తపమాచరింపుము. నీ తేజస్సును నీయందే ధరింపుము" అని ప్రార్థించినారు.

శివుడు : మంచిది! మీ ప్రార్థనలను అంగీకరించితిని. కాని స్థానమునుండి చలించిన తేజస్సును ఎవరు ధరింతురు ?

దేవతలు : భూమి ధరింపగలదు.

చలించిన తేజస్సును శివుడు భూమిపై విడువగా అది భూమి యందంతయు వ్యాపించినది. దేవతలు భయపడి అగ్నిదేవునితో "అగ్నిదేవుడా! నీవు వాయువుతో

కూడి ఈ శివతేజస్సును ప్రవేశింపుము" అని పలికిరి. అగ్నిదేవు డట్లుచేయగా ఆ తేజస్సు శ్వేతపర్వత మైనది. అంతేకాదు. పానకాదిత్య సన్నిభమైన శరవణ మైనది (తెల్లువనము). ఆ తెల్లువనమునందే కుమారస్వామి ప్రభవించినాడు. ఆయనకు కృత్తికలు పాలిచ్చి పెంచినందున 'కార్తికేయుడు' అను పేరు వచ్చినది. అగ్నిదేవునిచే ధరింపబడినందున అతనికి 'అగ్నిపుత్రుడు' అను పేరుకూడ కలిగినది.

ఇట్లు జరిగిన పిదప దేవతలు తృప్తిజెంది పార్వతీ పరమేశ్వరులను పూజించినారు. పార్వతి మాత్రము కోపించి దేవతలను శపించినది. "పుత్రేచ్ఛతో చేయబడుచుండిన క్రీడను మీరు నివారించితిరి. కావున మీకు మీ భార్యలయందు సంతానము కలుగకుండును గాక" అని దేవతలను శపించి భూమినిసైతము ఇట్లు శపించినది. "భూమీ! నీవు అనేక రూపములు కలిగి పెక్కుమందికి భార్యవుగా ఉండగలవు. నా పుత్రప్రాప్తికి నీవు ఇష్టపడనందున పుత్రులవలని సంతోషము నీకు కలుగకుండును గాక."

[ ఈ కారణము వలననే కాలోలు భూమి పలుమారు చేతులు మారుచుండుట. ]

అవనే నైక రూపాత్వం బహుభార్యా భవిష్యసి
నచ పుత్రకృతాం ప్రీతిం మత్క్రోధ కలుషీ కృతా 36-23
ప్రాప్స్యసిత్వం సుదుర్మేధే మమ పుత్ర మనిచ్ఛతీ 36-24

దేవతలు సిగ్గుపడినారు. ఈ దృశ్యమునుచూచి శివుడు పార్వతీసమేతుడై అక్కడి నుండి కదలి హిమాలయప్రాంత శిఖరముచేరి దానిపై తపస్సు చేయనారంభించెను.

రామా! పార్వతి సంగతి వింటివి గదా! గంగ సమాచారము వినుము. లక్ష్మణా! నీవును వినుము.

శివుడు తపస్సు ప్రారంభించినందున దేవతలకు సేనాపతి లేకపోయినాడు. దేవత లందరు బ్రహ్మతో మొఱపెట్టుకొన్నారు. "స్వామీ! నీవు మాకు ప్రసాదించిన సేనాపతి తపస్సులో నిమగ్నుడైనాడు. ఇప్పుడు మా గతి ఏమి?" అని విన్నవించినారు.

బ్రహ్మ: దేవతలారా! పార్వతీదేవి మిమ్ములను శపించినందున మీకు మీ భార్యలందు సంతానము కలుగదు. ఆ దేవిమాట అమోఘము. ఇప్పుడు మీరు చేయదగిన పని ఒకటి కలదు. ఆకాశవాహినియైన గంగయందు అగ్నిదేవుడు ఒక పుత్రుని కలిగింపగలడు. గంగాసుతుడు కావున పార్వతీదేవికూడ ఆ కుమారునియెడ ప్రీతికలిగి యుండును.

దేవతలు సంతోషించి కైలాస పర్వతమున కరిగి అగ్నిదేవుని ప్రోత్సహించి "నీవు ధరించియుండు శివతేజస్సును గంగయందు విడువుము" అని ప్రార్థించినారు.

దేవతా కార్యము గనుక గంగసైతము సమ్మతించినది. గంగ అవయవములన్నియు శివ తేజస్సుతో నిండి పోయినవి. ఆ వేడిని భరింప జాలక అగ్నిదేవునితో తన బాధ చెప్పుకొన్నది.

అగ్ని : గంగా! నీవు భరింపజాలని యెడల ఈ గర్భమును హిమవత్పర్వత పాదమందుంచుము.

గంగ ఆ తేజస్సును విడిచినది. అది భూమిమీద పడినతోడనే దానినుండి బంగారు, వెండి పుట్టినవి. ఆ తేజస్సు తీవ్రత వలన రాగి, ఇనుము పుట్టినవి. దాని మాలిన్యము నుండి తగరము, సీసము కలిగినవి. నానాధాతువులు వృద్ధి పొందినవి.

శ్వేతపర్వతము (కైలాసము) మీద మొలిచిన రెల్లు వనమంతయు సువర్ణమైనది. కావుననే బంగారమునకు 'జాతరూపము' అను పేరు వచ్చినది. (పుట్టిన రూపము కలది.)

కుమారస్వామి జన్మించినాడు. కృత్తికలు ఆ పాపకు స్నానము చేయించి పాలిచ్చి పెంచినారు. గర్భస్రావమున (స్కన్నం) రూపొందిన వాడగుట 'స్కందుడు' అను పేరు వచ్చినది.

కృత్తికలిచ్చిన పాలు ఒక దినము మాత్రమే కుమారస్వామి త్రాగుట! శివుని కుమారుడు కావున పరాక్రమ వంతుడై రాక్షస సేనలను జయించినాడు. అగ్ని మున్నగు దేవతలందరు కుమారస్వామిని దేవ సేనాధిపతిగా అభిషేకించినారు.

ఇది కుమార స్వామికథ. దీనిని భక్తితో విన్నవారికి సకల సంపదలు చేకూరును.

**భక్తశ్చయః కార్తికేయే కాకుత్స్థ భువిమానవః**
**ఆయుష్మాన్ పుత్రపౌత్రైశ్చ స్కంద సాలోక్యతాం వ్రజేత్. 37-32**

రామా ! గంగను గూర్చి మరియొక కథను చెప్పెదను వినుము. అది మీ పూర్వులకు సంబంధించినది.

## సగరుని యజ్ఞము

పూర్వకాలమున సగరుడను రాజు అయోధ్యను పాలించు చుండెను. అతడు ధర్మాత్ముడు. అతనికిద్దరు భార్యలు-కేశిని, సుమతి అనువారు. పెద్ద భార్యయైన కేశిని ధార్మికురాలు. చిన్న భార్యయైన సుమతి అందగత్తె. సగరునికి సంతానము కలుగలేదు. కావున భార్యలను వెంటబెట్టుకొని హిమవత్పర్వతములోని భృగుప్రస్రవణమను ప్రదేశమున కరిగి తపస్సు ప్రారంభించినాడు. అచ్చట వెలసి యుండిన భృగుమహర్షి సగరునికి పత్యక్షమై వరము ప్రసాదించినాడు.

**భృగుమహర్షి:** రాజా! నీకు అనేక పుత్రులు కలుగుదురు. ఒక భార్యకు వంశకరుడగు ఒక కుమారుడు జనించును. కడమ భార్యకు సుతకరులు కావట్టి అరువదివేల మంది కుమారులు కలుగుదురు.

ఈ మాటలు భార్య లిద్దరు విన్నారు. "మహర్షీ! మాలో నెవతెకు ఒక కుమారుడు కలుగును? ఎవతెకు అరువది వేల మంది కలుగుదురు" అని అడిగినారు.

**భృగు:** ఎవ్వతె కేమి కావలయునో మీరే కోరుకొనుడు.

**కేశిని:** నాకు వంశకరుడగు పుత్రుడు కావలెను.

**సుమతి:** నేను అరువదివేల సుతులను కోరుచున్నాను.

భృగుమహర్షి 'తథాస్తు' అన్నాడు. సగరుడు కృతకృత్యుడై భార్యల గూడి రాజధానికి వచ్చినాడు. కాలక్రమేణ భార్యలిద్దరు గర్భములు దాల్చినారు. కేశినికి 'అసమంజుడు' అను పుత్రుడు కలిగినాడు. సుమతి కడుపున సొరకాయవంటి గర్భపిండ మొకటి పుట్టినది. ఆ పిండమ్మును భేదింపగా అరువది వేల మంది పుత్రులు ఏర్పడినారు. దాదులు వారిని నేతి కుండలలో పెట్టి పెంచగా వారు రూపయౌవనశాలులైనారు.

అసమంజుడు వంశకరుడైనను అతనికి ఒక దుర్గుణ ముండినది. ప్రజల బిడ్డలను సరయూనదిలో ముంచి వారి బాధను చూచి ఆనందించుచుండినాడు. ఈ చేష్టను గురించి ప్రజలందరు రాజుతో మొరపెట్టుకొన్నారు. సగరుడు ధార్మికుడు కావున పుత్రుని నగరమునుండి వెడల గొట్టినాడు. అసమంజుని కుమారుడైన అంశుమంతుడు మిక్కిలి యోగ్యుడు.

కొంత కాలమునకు సగరునికి ఒక యజ్ఞము చేయు కోరిక కలిగినది.

**రాముడు:** స్వామీ! మా పూర్వుడైన సగర చక్రవర్తి చేసిన యజ్ఞమును గురించి వినుటకు కుతూహల పడుచున్నాను.

**విశ్వా:** (నవ్వుచు) నేనును దానినే చెప్పదలచుకొంటిని. నీవుకూడా దానినే అడిగితివి. చెప్పుచున్నాను వినుము.

భరత ఖండమున హిమాలయమను పర్వతమున్నదిగదా! దాని దగ్గర వింధ్య పర్వతమని మరియొక పర్వత మున్నది. అవి రెండును ఉన్నతములైనవి గనుక ఒక దానిని మరియొకటి చూచునట్లు కనిపించును. ఆ రెండు పర్వతముల మధ్య ప్రదేశము యజ్ఞములు చేయుటకు ప్రశస్తమైనది. సగరుని యజ్ఞము ఆ ప్రదేశమున జరిగినది.

తయోర్మధ్యే ప్రవృత్తోఽభూ ద్యజ్ఞస్స పురుషోత్తమ
సహిదేశో నరవ్యాఘ్ర ప్రశస్తో యజ్ఞకర్మణి. 39-5

యజ్ఞరక్షణార్థమై అంశుమంతుడు సగరుని వెంబడించినాడు. సగరుడు సంకల్పించినది అశ్వమేధ యాగము. యజ్ఞము జరుగుచుండగా ఇంద్రుడు రాక్షస రూపముతో వచ్చి అశ్వమును అపహరించినాడు. తస్కరుని వెదకి వానిని వధించి గుఱ్ఱమును తెమ్మని ఋత్విజులు సగరునితో చెప్పినారు. అట్లు చేయనిచో అందరికి చేటు వాటిల్లు ననికూడ సూచించినారు. సగరుడు తన అరువది వేల కుమారులను పిలిచి "నేల నాలుగు చెరగులు తిరిగి వెదకుడు. ఒక్కొకడును ఒక్కొక యోజన విస్తీర్ణము సంచరించి అవసరమైనచో భూమిని త్రవ్విచూచి అశ్వమును పట్టితెండు. గుఱ్ఱము దొరకు వరకు నేనును ఋత్విజులును ఇచ్చటనే వేచియుండెదము" అని చెప్పినాడు.

కుమారులు బయలుదేరినారు. ఒక్కొకడు ఒక్కొక యోజనము చొప్పున భూమిని త్రవ్వినారు. వారి ఘాతములకు ఓర్వజాలక ఉరగులు అసురులు రాక్షసులు ఆక్రందింప సాగినారు. ఇట్లు జంబూ ద్వీపమును త్రవ్వగా దేవతలు కలత జెంది బ్రహ్మ యొద్దకు పోయి మొరపెట్టుకొన్నారు. "స్వామీ! సగరకుమారులు పెట్టు బాధలకు అంతము కానరాలేదు. కనబడిన ప్రతిప్రాణిని "వీడే చోరుడు. వీడే మా గుఱ్ఱమును అపహరించిన పాపాత్ముడు, అని పట్టి వధించుచున్నారు" అని మొర యిడిరి.

బ్రహ్మ: దేవతలారా! భయపడకుడు-పృథివీ పతియైన విష్ణువు కపిలరూపధారియై ఈ భూమిని భరించుచున్నాడు. ఈ సగరకుమారులు ఆయన కోపాగ్నిలో పడి దగ్ధు లగుదురు.

సగరకుమారులు భూమిని ఎంత దూరము త్రవ్వినను వారికి గుఱ్ఱము కానరాలేదు. అందరు దీనులై తండ్రి యొద్దకు వెళ్లినారు. సగరుడు "మీరు ఇంకను వెదకుడు. గుఱ్ఱము లభ్య మగువరకు వెదకుడు" అని ఆదేశించినాడు. సగరకుమారులు మరల బయలుదేరినారు. నేల త్రవ్వుట కుపక్రమించినారు. త్రవ్వగా త్రవ్వగా వారికి ఈ భూమిని భరించుచున్న విరూపాక్షు మను దిగ్గజము పూర్వదిక్కున కానవచ్చినది.

రామా! ఆ విరూపాక్షము అలసట తీర్చుకొనుటకు శిరముకదల్చినప్పుడు భూకంపము కలుగును.

సగరకుమారులు ఆ దిగ్గజమునకు ప్రదక్షిణము చేసి భూమిని ఇంకను త్రవ్వసాగినారు. తూర్పుదిశ పూర్తిచేసి-దక్షిణ దిశకు పోయినారు. అక్కడి దిగ్గజము పేరు 'మహాపద్మము'-ఆ తరువాత పడమటి దిక్కు త్రవ్వగా 'సౌమనసము' అను దిగ్గజము కానబడి

నది. అటుపైన ఉత్తర దిక్కు త్రవ్వి 'భద్రము' అను దిగ్గజమును చూచినారు. ఆవల ఈశాన్య దిశకుపోయి అచ్చట కపిలరూపుడగు విష్ణువును చూచినారు. ఆయన చెంతనే తిరుగుచుండిన గుఱ్ఱముకూడ వారికి కానవచ్చినది. "ఇతడే చోరుడు" అని ఆయుధములు గైకొని కపిలుని మీదికి దూకినారు. కపిలుడు కోపించి హుంకారము చేయగా సగరకుమారులందరు బూడిదరాసు లయినారు.

సగరుడు తన పుత్రులకొరకు ఎన్నాళ్లు ఎదురు చూచినను వారి జాడ కానరాలేదు. అంతట తన మనుమడగు అంశుమంతుని పిలిచి "నాయనా! నీ పినతండ్రుల గతి ఇంతవరకు తెలియలేదు. నీవు ఆయుధముల ధరించి బయలువెడలుము. నమస్కరింపదగిన వారికి నమస్కరింపుము. గుఱ్ఱపు దొంగను పట్టి వధించి కృతార్థుడవై మరలి వచ్చి యజ్ఞము పూర్తియగునట్లు చూడుము," అని చెప్పి పంపినాడు.

అంశుమంతుడు బయలుదేఱి తన పినతండ్రులు త్రవ్విన మార్గముననే నడచి దిగ్గజములను చూచి వానిని పూజించి దాటి సాగించి సగరకుమారులు బూడిదరాసులుగా పడియున్న ప్రదేశము చేరినాడు. గుఱ్ఱముకూడ అచ్చటనే ఉండినది. బూడిదరాసులను చూచి తన పినతండ్రులను గూర్చి మిగుల దుఃఖించినాడు. వారికి జలతర్పణము చేయగోరి జలముకొఱకు వెదకినాడు. ఎక్కడను ఒక్క జలాశయమైన కానరాలేదు. నాలుగుప్రక్కల దృష్టి సారించినాడు. తన పినతండ్రులకు మేనమామ యైన గరుత్మంతుడు కనిపించినాడు.

*గరుత్మంతుడు :* నాయనా! దుఃఖింపకుము. నీ పినతండ్రుల మరణము లోకసమ్మతము - కపిలుని కోపాగ్నిచే దగ్ధులైన వీరి జలతర్పణములకు ఈ లోకమందలి జలము ఉపయోగపడదు. గంగాజలములతో తర్పణము చేసినగాని వీరు తరింపరు. ఈ బూడిదరాసుల మీదుగా గంగాజలమును ప్రవహింపజేయుము. ఇప్పుడు గుఱ్ఱమును కొనిపోయి యజ్ఞము పూర్తి కావింపుము.

అంశుమంతుడు గుఱ్ఱమును తీసికొని సగరునియొద్దకు పోయి తన పినతండ్రులకు ప్రాప్తించిన విపత్తు, గరుత్మంతుని సందేశము సగరునికి నివేదించినాడు. సగరుడు యజ్ఞమును పూర్తిచేసి తన రాజధాని చేరి 'గంగానదిని తెచ్చు ఉపాయ మేమి?' అని ఆలోచించినాడు. కాని అతని కేమియు తోపలేదు - ఏమియు చేయకయే కొంతకాలమునకు సగరుడు కాలధర్మము నొందినాడు. రాజ్యము అంశుమంతునికి సంక్రమించినది. అతనికి దిలీపుడను కుమారుడు కలిగినాడు - అంశుమంతుడు దిలీపునిపై రాజ్యభారమును మోపి కొంతకాలము తప మాచరించి స్వర్గస్థుడైనాడు-దిలీపుడును గంగావతరణ మెట్లు సాధ్య మగునా యని చింతించుచునే గతించినాడు. ఆ దిలీపుని పుత్రుడు భగీరథుడు

రాజ్యమునకు అధిపతియైనాడు. భగీరథునికి సంతానము కలుగలేదు. గంగావతరణము సాధింపవలసి యున్నది. దానికై అతడు రాజ్యమును మంత్రులవశము చేసి తపస్సు ప్రారంభించినాడు. వేయిసంవత్సములు తపస్సు చేయగా బ్రహ్మ ప్రత్యక్షమై వరము కోరుమని చెప్పినాడు.

*భగీరథుడు :* స్వామీ ! సగరకుమారులకు జలతర్పణము చేయుటకు వీలు కలిగింపుడు. ఇక్ష్వాకు కులము నిలబెట్టుటకు నాకు సంతానము ప్రసాదింపుడు.

*బ్రహ్మ :* నీవు కోరిన గొప్ప వరములను ప్రసాదించుచున్నాను. గ్రహింపుము. మరి యొక్కమాట-గంగాదేవి వేగమును శివుడు తప్ప ఇతరులు సహింపలేరు. కావున ఈ కార్యమునకై శివుని ప్రార్థింపుము.

గంగాయాః పతనం రాజన్ పృథివీ న సహిష్యతి
తాం వై ధారయితుం వీర నాన్యం పశ్యామి శూలినః. 43-24

ఈ మాట భగీరథునికి చెప్పి బ్రహ్మదేవుడు స్వర్గమున కరిగి ఈ విషయమును గంగకుకూడ చెప్పినాడు.

భగీరథుడు శివుని గూర్చి తపస్సు చేయగా శివుడు ప్రత్యక్షమై గంగను తన శిరమున దాల్చుటకు అంగీకరించినాడు.

రామా ! అటుపైన ఏమైనదో ఎరుగుదువా ! గంగ గర్వించి "ఈ శివుడేనా నన్ను శిరస్సున ధరించువాడు ! నా వేగము సంగతి తెలిసినట్లు లేదు. నా ప్రవాహ వేగముతో ఈ శివుని పాతాళమునకు కొని పోయెదను" అని ఆలోచించి మహనీయ మైన ఆకారమును దాల్చి సహింపరాని వేగము నవలంబించి ఆకాశమునుండి శివుని శిర మున వ్రాలినది. శివున కిది యొకలెక్కయా ! శివుడు గంగకు గర్వభంగము చేయదలచి గంగను తన శిరస్సుమీది జటలలోనికి దించుకొన్నాడు. గంగ ఆ జటల సమూహములో చిక్కుబడి పోయినది. ఎంతప్రయత్నించినను బయటికి రాలేక పోయినది. ఈ స్థితిలో అనేక సంవత్సరముల కాలము గడచిపోయినది.

పాపము ! భగీరథుడు ఎంత వెదకినను గంగ కానరాలేదు. ఏమి చేయగలడు! మరల తపస్సు ప్రారంభించినాడు. ఆ తపస్సుకు శివుడు సంతోషించి గంగను బిందు సరస్సులో వదలి పెట్టినాడు. శివుడు విడువగనే గంగ యేడు పాయలైనది. వానిలో హ్లాదిని, పావని, నళిని అను మూడు పాయలు తూర్పుదిశగా ప్రవహించినవి. సుచక్షువు, సీత, సింధువు అనుమూడు పాయలు పడమటి దిశగా ప్రవహించినవి. ఏడవ పాయ భగీ రథుని వెంట వచ్చినది. భగీరథుని రథము ముందు నడచుచుండగా రథము ననుసరించి గంగ నడచినది. ప్రయాణ మిట్లు సాగుచున్నది.

శివుని శిరమునుండి గంగ భూమిపై పడినప్పుడు గొప్పశబ్ద మైనది. చేపలు, తాబేళ్లు, మొసళ్లు మున్నగు జలజంతువులు గుంపులు గుంపులుగా గంగతో కూడ క్రింద పడినవి.

ఆకాశమునుండి భూమిమీద పడిన గంగను దేవతలందరు విమానముల మీద వచ్చి చూచినారు. వారి ఆభరణ కాంతులచే ఆకాశము నూరుగురు సూర్యులతో ప్రకాశించుచుండినట్లు కానబడినది. గంగ ప్రవహించుచున్నది. భూలోక వాసులే గాక దేవతలు సైతము ఈశ్వరుని శరీరమునుండి పతితమైన జలము పరమ పావన మని తలచి గంగలో స్నానములు చేసినారు.

[స్వర్గములో నున్నప్పుడు ఈశ్వర స్పర్శలేని గంగ భూమికి దిగివచ్చి ఈశ్వరుని సాంగత్యము వలన అధిక పవిత్రతను ఆర్జించినది.]

అట్లు పావనమైన గంగలో స్నానముచేసి శాపహతులై ఆకసమునుండి భూమిపై బడినవారు వారి పాపములను పోగొట్టుకొని నిష్కల్మషులై శుద్ధులై వారి వారి పుణ్యలోకములకు చేరినారు. గంగలో స్నానము చేసిన వారందరు బడలిక పోగొట్టుకొని సుఖము ననుభవించినారు.

గంగ సర్వపాపములను నశింప జేయగలదు.

సర్వపాప ప్రణాశినీ. 43-34

గంగ భగీరథుని రథము ననుసరించి నడచుచున్నది. అట్లు ప్రవహించుటలో జహ్నుమహాముని యజ్ఞశాలను తన నీటితో ముంచినది. మహాప్రభావుడైన జహ్నుమహాముని కోపించి గంగను త్రాగివైచినాడు. అంతట దేవతలు ఋషులు గంధర్వులు మున్నగు వారు వచ్చి మహామునిని పూజించి "ఈ గంగ నీకు దుహితగా ఉండగలదు. దయచేసి విడువుడు" అని ప్రార్థించినారు. ఆయన సమ్మతించి తన చెవుల గుండ గంగను విడిచి పెట్టినాడు. జహ్నుపుత్రిక కావున గంగకు 'జాహ్నవి' అను పేరు వచ్చినది.

ఈ విధముగా బయటపడి గంగ భగీరథుని అనుసరించి సముద్రుని చేరి అక్కడ నుండి భగీరథుని కార్యసిద్ధి కొరకు పాతాళమునకు పోయినది.

ఇంతటి గొప్ప ప్రయత్నముచేసి భగీరథుడు గంగను తెచ్చి తన పూర్వుల బూడిద రాసుల మీద ప్రవహింప జేసినాడు. అంతట వారు పాపరహితులై స్వర్గమున కరిగిరి.

[భగీరథ ప్రయత్న మనగా ఇదియే.]

భగీరథునిచే భూలోకమునకు తేబడినది గనుక గంగకు 'భాగీరథి' అను పేరు కలిగినది.

బ్రహ్మ వచ్చి భగీరథుని ఆశీర్వదించి వెళ్ళినాడు. రామా! గంగ 'త్రిపథగ' ఎట్లైనదో వింటివా! గంగావతరణ కథను శ్రద్ధతో విన్నవారికి సర్వ విధములైన మంగళములు కలుగును.

ఇద మాఖ్యాన మవ్యగ్రో గంగావతరణం శుభమ్
యశ్శృణోతి చ కాకుత్స్థ సర్వాన్ కామా నవాప్నుయాత్. 44-22
సర్వేపాపాః ప్రణశ్యంతి ఆయుః కీర్తిశ్చ వర్ధతే. 44-23

ఈ కథ పూర్తియగు నప్పటికి చీకటిపడి ప్రొద్దుపోయినది. అందరు విశ్రమించినారు. మరునాడు.

రాముడు: స్వామీ! మీదయవలన గంగావతరణ కథను విన్నాము. ఎంతో మనోహరముగా ఉన్నది. దానినే తలపోయుచు శయనించితిమి. రాత్రి యంతయు క్షణప్రాయముగా గడచినది. మన మిప్పుడు గంగానదిని దాటవలెను గదా! మీ కొరకు నావకూడ సిద్ధముగా ఉన్నది.

అందరు ప్రయాణ మైనారు. గంగను దాటి విశాలానగరమును చేరినారు.

రాముడు: స్వామీ! ఈ విశాలానగరమును గూర్చి వినగోరుచున్నాను.

విశ్వా: మంచిది! చెప్పెదను వినుడు. ఇది బహుకాలము నాటి సంగతి.

## అమృత మథనము

కృతయుగమునాటి మాట. దితిపుత్రులు అదితిపుత్రులు అని రెండు తెగలు. దితిపుత్రులు బలవంతులు. అదితిపుత్రులు వీర్యవంతులు, ధార్మికులు. ఉభయులకు ఒక ఆలోచన కలిగినది. "వ్యాధిగాని ముసలితనముగాని మరణముగాని కలుగకుండుట ఎట్లు" అని చింతించినారు. పాలసముద్రమును చిలికి అమృతమును సంపాదింపవలయునని నిశ్చయించినారు. మందర పర్వతమును కవ్వముగా చేసికొని వాసుకిని త్రాడుగా ఉపయోగించి సముద్రమును చిలుకుటకు పూనుకొన్నారు. మున్ముందు నిప్పువంటి 'హాలాహలవిషము' ఉత్పన్న మైనది. దేవతలు భయపడి ఈశ్వరుని సమీపించి రక్షింపుమని ప్రార్థించినారు. విష్ణుదేవుడుకూడ అక్కడికి వెళ్ళినాడు.

విష్ణు: ప్రభూ! దేవతలలో నీవు మొదటి వాడవు. గనుక సముద్ర మథనమువలన మొదట పుట్టినది నీ భాగము. మేము నీ కొసరించు అగ్రపూజగా దీనిని గ్రహించి ఈ విషము పుచ్చుకొనుము.

దైవతైర్మథ్యమానేతు యత్పూర్వం సముపస్థితమ్
త్వదీయం హి సురశ్రేష్ఠ సురాణామగ్రజోఽసియత్. 45-23

అగ్రపూజా మిమాం మత్వాగృహాణేదం విషం ప్రభో. 45-24

[విష్ణుదేవుని మాటలు ఎంత చమత్కారముగా ఉన్నవి!]

ఈ మాటలు శివునికి చెప్పి విష్ణుదేవుడు తన నెలవుకు పోయినాడు. శివుడు విషమును మ్రింగి శ్రీకంఠు డై నాడు. హాలాహలమును అమృతము వలె స్వీకరించినాడు!

హాలాహల విషం ఘోరం సజగ్రాహామృతోపమమ్. 45-26

అందరు మరల మథనము సాగించినారు. ఇట్లు మథించుచుండగా మందరపర్వతము క్రుంగి సముద్రములో మునిగి పాతాళమున చేరినది. దేవతలు గంధర్వులు విష్ణుదేవుని సమీపించి మందరపర్వతమును ఉద్ధరింపు మని ప్రార్థించినారు. అప్పుడు విష్ణుదేవుడు తాబేలు రూపమును ధరించి పర్వతమును తన వీపుపై నిలుపుకొని సముద్రమున శయనించి చేతులు పైకెత్తి పర్వతమును లేపి తానుకూడ సముద్రమును చిలుక నారంభించెను. కొంతకాలమునకు అందుండి ధన్వంతరి ఉద్భవించినాడు. తరువాత అప్సరసలు జనించినారు. చిలుకుటవలన కలిగిన రసమునుండి పుట్టినవారుగనుక వారికి 'అప్సరసలు' అను పేరు వచ్చినది. ఇట్లు అరువదివేలకోట్ల అప్సరసలు జన్మించినారు. వారిని దేవతలు గాని దానవులుగాని పెండ్లి చేసికొనలేదు. కావున వారు సాధారణ స్త్రీలు (వేశ్యలు) అయినారు.

సర్వా స్సాధారణా స్స్మృతాః 45-36

వరుణదేవుని కొమారిత వారుణి (సుర) తన్ను వివాహమాడువారిని వెదకికొనుచు సముద్రమునుండి వెడలి వచ్చినది. దితిపుత్రులు ఆమెను పరిగ్రహింపలేదు. అదితిపుత్రులు ఆమెను పరిగ్రహించి సురలై నారు. దితిపుత్రులు అసురులై నారు.

సముద్రమును చిలుకుటలో ఉచ్చైశ్శ్రవము అను మేలుగుఱ్ఱము, కౌస్తుభమణి, అమృతము, క్రమముగా పైకి వచ్చినవి. అమృతముకొరకు దితిపుత్రులకు అదితిపుత్రులకు గొప్ప యుద్ధము జరిగి అనేకమంది చనిపోయినారు. అప్పుడు విష్ణుదేవుడు మోహినీ రూపము ధరించి అమృతమును గ్రహించినాడు. దేవతలు అసురులను వధించినారు. ఇంద్రుడు రాజ్యమును, అమృతమును పొంది లోకపాలకు డై నాడు.

దితి తన సుతులను కోల్పోయి పరమదుఃఖితయై తన భర్తయగు కశ్యపుని సమీపించి "నాథా! నీ పుత్రులు నా పుత్రుల నందరిని వధించినారు. నాకు ఒక వరము ప్రసాదింపుడు. ఇంద్రుని వధింపగల కుమారుని అనుగ్రహింపుడు. దానికిగా చేయవలసిన తపస్సు చేయుటకు సిద్ధముగా ఉన్నాను" అన్నది.

*కశ్యపుడు :* మంచిది! నీవు కోరిన వరమును ఇచ్చితిని. కాని ఒక సంగతి. కుమారుడు కలుగువఱకు నీవు శుచివిగా ఉండవలెను. అట్లుండినచో వేయి సంవత్సరములకు నీకొక కుమారుడు కలుగును.

ఈ మాటలు చెప్పి కశ్యపుడు దితి దేహమంతయు స్పృశించి ఆమెను ఆశీర్వదించినాడు.

దితి కుశప్లవన మను ప్రదేశమునకరిగి తపస్సు ప్రారంభించినది. ఆమెకు పరిచర్య చేయుటకై ఇంద్రుడు వచ్చినాడు. ఆమెకు కావలసిన దర్భలు, సమిధలు, అగ్ని, ఫల మూలములు, జలము, మున్నగువానిని ఆమెకు ఎప్పు డేది కావలయునో అప్పుడు అన్నింటిని సిద్ధము చేయుచు ఇంద్రుడు పరిచర్యలు చేసినాడు. అవసరమైనప్పుడు గాత్ర సంవాహనము, విసరుట మొదలైన శ్రమను పోగొట్టు ఉపచారములు సైతము చేయుచుండినాడు.

ఈవిధముగా అనేక సంవత్సరములు గడచినవి. వేయి సంవత్సరములు పూర్తి యగుటకు పది సంవత్సరములు మాత్రమే మిగిలియుండినవి. దితి ఇంద్రుని సేవలకు సంతోషించి "ఇంద్రుడా! ఇక పది సంవత్సరములకు నీకు తమ్ముడు పుట్టగలడు. నిన్ను జయింపవలెనని వానికి కోరిక యున్నను నేను అడ్డుపడి ఆతని సమాధాన పెట్టెదను. మీరిద్దరు కూడియుండి ముల్లోకములను సుఖముగా పాలింతురుగాక" అని చెప్పినది.

తరువాత మధ్యాహ్నమైనది. దితికి నిద్ర పట్టినది. నిద్రమత్తులో పాదములవైపు తలపెట్టుకొని తలవైపు పాదములు పెట్టుకొని నిద్రపోయినది. ఈ విధముగా దితి తన శుచిత్వమును కోల్పోయినది. ఇంద్రుడు దీనిని గమనించి దితి గర్భములో చేరి లోపలి శిశువును తన వజ్రాయుధముతో ఏడు ముక్కలుగా ఖండించినాడు. శిశువు రోదన శబ్ద మును విని దితి మేల్కాంచినది. శిశువు యేడ్చుచుండగా ఇంద్రుడు "యేడవకుము, యేడవకుము" అని ఊరడించుచు శిశువును ఖండించుచుండుట తెలిసికొని దితి నాయనా! శిశువును వధింప వలదు" అని ఇంద్రుని వేడుకొన్నది. అంతట ఇంద్రుడు వెలుపలకు వచ్చి "తల్లీ! నీవు అశుచివైనందున నాకీ అవకాశము లభించినది. నన్ను వధించుటకుగా జనింప నున్నవాడు గనుక నే నిట్లు చేయవలసివచ్చినది. నన్ను క్షమిం పుము" అన్నాడు.

*దితి :* ఇంద్రుడా! దీనిలో నీ తప్పు ఏమియులేదు. అంతయు నాదే. నా గర్భము విచ్ఛి న్నమైనది. ఏడు ఖండము లైనదిగదా! నీవు నా ప్రీతికొరకు ఒక కార్యము చేయుము. ఒక్కొక్క ముక్కను ఏడుచేసి ఏడు ముక్కలును సప్తమరుద్గణ ములై లోక పాలకులుగా నుండునట్లు అనుగ్రహింపుము. బ్రహ్మలోకములో

ఒక గణము, ఇంద్రలోకమున ఒక గణము, ఆకాశమున ఒకటి, మిగిలిన నాలుగు గణములు నాలుగు దిక్కులయందు సంచరించుచుండుదురుగాక ! వారు ఏడ్చునప్పుడు నీవు "మారుదః మారుదః" అన్నావు గదా ! కావున వారు "మారుతములు"గా వెలయుదురుగాక.

*ఇంద్రుడు :* తల్లీ ! నీవు కోరినట్లే అగుగాక ! నీ కుమారులు దేవత్వము నొంది నీవు కోరినట్లు సంచరింపగలరు.

ఈ విధముగా ఏర్పాటు కావించుకొని దితియును ఇంద్రుడును తపోవనమును స్వర్గమున కరిగినారు.

రామా ! ఇప్పుడు మనము ఉండు ప్రదేశమే దితి తపస్సు చేసిన ప్రదేశము. ఆనాటి కుశప్లవనము ఈనాడు విశాలాపురి యైనది. ఇక్ష్వాకు మహారాజు కుమారుడగు విశాలుడే ఈపట్టణమును నిర్మించినవాడు. ఆ వంశస్థుడగు సుమతి ఇప్పుడు దీని నేలుచున్నాడు. ఈ రాత్రి మన మిందే యుండి రేపు ఉదయమున బయలుదేరి జనకమహారాజును చూడవచ్చును.

విశ్వామిత్రుడు వచ్చిన సంగతి సుమతికి తెలిసినది. అతడు వెంటనే వచ్చి విశ్వామిత్రుని పూజించి "స్వామీ ! తమ రాక వలన ధన్యుడ నైతిని. నా కంటె ధన్యుడు లోకములో లేడు. తమ దర్శన భాగ్యము లభించుటవలన కృతార్థుడ నైతిని. మహాప్రభావు లగు ఈ కుమారు లెవ్వరు ? దుర్గమ మార్గమున వీరు కాలినడకన వచ్చుట కేమి కారణము" అని అడిగినాడు.

కిమర్థంచ మునిశ్రేష్ఠ సంప్రాప్తౌ దుర్గమే పథి. 48-6

[సీతాదేవిని చూచుట సులభ సాధ్య మగునా !]

విశ్వామిత్రుడు రామలక్ష్మణులను సుమతికి పరిచయ పరచి సిద్ధాశ్రమ వాసము రాక్షసుల వధ మున్నగు విశేషములను సుమతికి చెప్పినాడు. అందరు సుమతి చేసిన పూజలను గైకొని ఆరాత్రి అచ్చట నిలిచి వేకువనే లేచి మిథిలకు ప్రయాణ మైనారు.

## అహల్యా శాప విమోచనము

కొంతదూరముపోగా మిథిల సమీపమున నుండిన వనమందు రామునికి ఒక ఆశ్రమము కనబడినది. కంటికి రమ్యముగా కనిపించినది కాని శూన్యముగా ఉండినది. జన సంచారములేదు. పర్ణశాలవంటి దేదియు కానరాలేదు. పాడుబడియున్నట్లు తోచినది.

*రాముడు :* భగవాన్ ! ఈ ఆశ్రమము మునివర్జితమై ఇట్లున్న దేమి. ఎవ్వరిదో ఇది !

**విశ్వామిత్రుడు :** రామా! దీనిని గురించి నీవు ప్రశ్నించుట నాకు సంతోషమైనది. చెప్పెదను వినుము.

ఇది మహాత్ముడగు గౌతముని ఆశ్రమము. ఒకప్పుడు ఉన్నతస్థితిలో ఉండినది. దీనిని దేవతలు సైతము పూజించెడివారు. ఇచ్చట గౌతముడు తన భార్యయగు అహల్యతో కూడినవాడై అనేక సంవత్సరములు తపస్సు చేసినాడు. ఇంద్రుడు గౌతముని తపస్సును భగ్నము చేయుటకుగాను గౌతముడు ఆశ్రమమున లేని సమయము కనిపెట్టి మునివేష ధారియై అహల్యను సమీపించి "నీతో క్రీడింపగోరుచున్నాను. నన్ను అనుగ్రహింపుము" అన్నాడు. మునివేషమున వచ్చినవాడు ఇంద్రుడని తెలిసికొనియు అతనిమీద ఆమెకు మనసు మరలినందున అహల్య సమ్మతించినది.

మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన
మతిం చకార దుర్మేధా దేవరాజకుతూహలాత్. 48.19

పిమ్మట

**అహల్య :** ప్రభూ! కృతార్థురాలనైతిని. నీవు త్వరగా వెడలిపొమ్ము. నిన్నును నన్నును రక్షించుకొను మార్గమును చూడుము. నా మర్యాదను కాపాడుము.

కృతార్థాఽస్మి సురశ్రేష్ఠ గచ్ఛ శీఘ్రమితః ప్రభో
ఆత్మానం మాం చ దేవేశ సర్వథా రక్ష మానద. 48.21

గౌతముడు వచ్చునేమో యని శంకించి ఇంద్రుడు వేగముగా వెడలుచుండినాడు. కాని గౌతముడు స్నానము చేసి ఆశ్రమమునకు వచ్చుచుండినాడు. ఇంద్రుడు గౌతముని చూచి భయపడి వివర్ణుడైనాడు.

[చేయగూడని పని చేసినచో ఇంద్రుడైన నేమి మరెవ్వడైన నేమి! ఇదే గతి!]

గౌతముడుకూడ ఇంద్రునిచూచి కోపించి శపించినాడు.

"దుర్మార్గుడా! నీవు విఫలుడ వగుదువుగాక" అని శపించినాడు. ఇంద్రుడు వెంటనే విఫలుడైనాడు.

గౌతముడు అహల్యను సైతము శపించినాడు.

"నీవు ఈ ఆశ్రమమునందే అనేక వేల సంవత్సరములు వాయు భక్షణము మాత్రము చేయుచు బూడిదలో శయనించి తపస్సు చేయుచు ఏ ప్రాణికిగాని కనబడక యుందువు గాక"

ఇహ వర్ష సహస్రాణి బహూని త్వం నివత్స్యసి
వాయు భక్షా నిరాహారా తప్యంతీ భస్మశాయినీ 48.29

అదృశ్యా సర్వభూతానా మాశ్రమేఽస్మిన్నివత్స్యసి 48-30

మునివర్జితమై భయంకరముగానుండు ఈ ఆశ్రమమునకు దశరథపుత్రు డగు శ్రీరాముడు ఏనాడు వచ్చునో ఆనాడు నీవు శుచివి కాగలవు. శ్రీరామునికి అతిథి సత్కారము చేసి దానివలన లోభ మోహములను వీడి నీవు నీ నిజరూపమును దాల్చి నా ఎదుట సంతోషమున నుండగలవు" అని చెప్పినాడు.

యదా చైతద్వనం ఘోరం రామో దశరథాత్మజః
ఆగమిష్యతి దుర్ధర్ష స్తదా పూతా భవిష్యసి 48-31
తస్యాతిథ్యేన దుర్వృత్తే లోభమోహ వివర్జితా
మత్సకాశే ముదాయుక్తా స్వంవపుర్ధారయిష్యసి 48-32

[శ్రీరామునికి ఆతిథ్య మిచ్చినయెడల లోభ మోహములు విడిపోవును!]

ఈవిధముగా ఇద్దరిని శపించి గౌతముడు ఈ ఆశ్రమమును వదలి హిమవత్పర్వత శిఖరముపై తపస్సు చేయుచున్నాడు.

రామా! ఇంద్రుడు అఫలుడై దేవతలను సమీపించి తనస్థితిని గూర్చి మొర పెట్టుకొన్నాడు.

**ఇంద్రుడు**: దేవతలారా! నేను గౌతముని తపస్సుకు విఘ్నము కలిగింపగోరి ఈ కార్యమును చేసి ఆయనకు కోపము కలిగించితిని. దానివలన గౌతముని తపస్సు తరిగి పోయినది. ఈవిధముగా దేవతలకు సహాయ మొనర్చితిని కావున మీరు నన్నెట్లైన సఫలుని చేయుడని వేడుచున్నాను.

ఈ మాటలు విని అగ్ని మున్నగు దేవతలు వాయుదేవులతో కూడి పితృదేవతల కడ కేగి "మీకు యాగములలో భాగార్థ మేర్పడియుండు. మేషమున కున్న ఫలములను తీసి ఇంద్రునికి ప్రసాదింపుడు" అని యాచించినారు. వారు సమ్మతించినారు.

అగ్నేస్తు వచనం శ్రుత్వా పితృదేవా స్సమాగతాః
ఉత్పాట్య మేష వృషణౌ సహస్రాక్షేన్యవేశయన్ 49-8

ఈవిధముగా ఇంద్రుడు సఫలు డైనాడు.

[రామాయణ కాలము నాటికే శస్త్రచికిత్స మనదేశములో ఎంత ప్రశస్తముగా ఉండివదో యీ శ్లోకములో సూచిత మైనది]

రామా! నీ విప్పుడు గౌతముని ఆశ్రమమున అడుగిడి అహల్యకు శాప విముక్తి కలిగింపుము.

విశ్వామిత్రుని మాట మేరకు లక్ష్మణ సమేతుడైన శ్రీరాముడు విశ్వామిత్రుని పురస్కరించుకొని గౌతమాశ్రమమున ప్రవేశించినాడు.

విశ్వామిత్ర వచశ్శ్రుత్వా రాఘవస్సహలక్ష్మణః
విశ్వామిత్రం పురస్కృత్య తమాశ్రమ మథావిశత్. 49-12

శ్రీరాముడు అడుగు పెట్టుట తోడనే తపస్సుచే ఇనుమడించిన కాంతితో తేజరిల్లుచుండిన అహల్య కానవచ్చినది. శాపము అంతమైనందున వారికి కనబడినది.

శాప స్యాంత ముపాగమ్య తేషాం దర్శన మాగతా. 49-16

రామ లక్ష్మణులు అహల్యా పాదములకు నమస్కరించినారు. శాపకాలమున గౌతముడు పలికిన మాటలను స్మరించి అహల్య రామ లక్ష్మణులకు అతిథి సత్కారము చేసి పూజించినది. ఈ శుభసమయమున పుష్పవృష్టి కురిసినది. అప్సరసలు ఆడినారు. గంధర్వులు పాడినారు. గౌతమ మహామునీశ్వరులు సైతము అచ్చటికి వచ్చినారు. చిరకాలము విడిపడియుండిన అహల్యా గౌతములు కలుసుకొన్నారు. గౌతముడు కూడ శ్రీరాముని యథావిధిగా పూజించినాడు.

గౌతమోఽపి మహాతేజా అహల్యా సహితస్సుఖీ
రామం సంపూజ్య విధివ త్తపస్తేపే మహాతపాః. 49-21

విశ్వామిత్రుడు రామ లక్ష్మణులను వెంట బెట్టుకొని మిథిలకు ప్రయాణమైనాడు.

[శ్రీరాముని వివాహము శ్రీఘ్రకాలముననే జరుగనున్నది. ఈపట్టున ఒకమాట - చిరకాలము విడిపడియుండిన అహల్యా గౌతములను ఒకటిగా కూర్చుట మనోహరమైన విషయము - అదిగాక ఆ పురాణ దంపతుల ఆశీర్వాదములతో శ్రీరాముడు మిథిలకు పోవుట ఎంతో శుభసంధాయకము. లక్ష్మీనారాయణులు ఒకటి కాబోవుచున్నారుగదా !]

## విశ్వామిత్రుడు రామలక్ష్మణులను కూడి మిథిలకు పోవుట

గౌతముని ఆశ్రమమునుండి ఈశాన్య దిక్కుగా నడచి విశ్వామిత్రుడును రామలక్ష్మణులును జనకమహర్షి యజ్ఞము చేయుచుండిన ప్రదేశమునకు వచ్చినారు.

రాముడు : స్వామీ ! జనకుని యజ్ఞశాల సంభారములతో నిండి కన్నులపండువు కావించుచున్నది. ప్రజలు వేలకువేలుగా కూడియున్నారు. ఋషులు బ్రాహ్మణోత్తములు ఎన్ని వేలమంది వచ్చియున్నారో గదా ! శకటములకు లెక్కలేదు. ఇంత ఇరుకులో మన మెక్కడ విడియగలము? మనము నిలుచుటకు వీలుగా ఒక ప్రదేశమును చూచిన బాగుండును.

దేశో విధీయతాం బ్రహ్మన్ యత్రవత్స్యామహే వయమ్. 50-4

[జనకుని యజ్ఞము ఎంత పెద్దయెత్తున జరుగుచున్నదో ఈ మాటలవలన మనము గ్రహింప వచ్చును - ఎన్నియో విషయములు చెప్పకయే చెప్పుట వాల్మీకిమహర్షి సొమ్ము]

జలసౌకర్యము కలిగి జనసంకులము గానిదిగా ఒక చక్కని ప్రదేశమును చూచి విశ్వామిత్రుడు విడిది ఏర్పరిచినాడు.

ఇంతలోనే విశ్వామిత్రుని రాక జనకునకు తెలిసినది.

జనకుడు తన పురోహితుడైన శతానందుని పురస్కరించుకొని విశ్వామిత్రుని యొద్ద కేగి ఆ మహనీయునికి వినయముతో యథాశాస్త్రముగా మర్యాదలు చేసినాడు. అందరు ఆసీనులై యోగక్షేమములు మాటలాడుకొనుచున్నారు.

**జనకుడు :** స్వామీ! దేవతలు నన్ననుగ్రహించి మీ దర్శన భాగ్యము లభింపజేసినారు. భగవంతులగు మీ దర్శనమువలన ఇప్పుడుగదా నా యజ్ఞము సఫలమైనది!

**అద్యయజ్ఞ సమృద్ధిర్మే సఫలా దైవతైః కృతా**
**అద్యయజ్ఞ ఫలం ప్రాప్తం భగవద్దర్శనాన్మయా.** 50-13

ఈ యజ్ఞ మిక పండ్రెండు దినములకు పూర్తి కాగలదనీ పెద్ద లనుచున్నారు. మీరు అప్పటివరకు ఇందుండి హవిర్భాగములు గైకొనుటకు వచ్చు దేవతలను సందర్శింపగోరుచున్నాను.

[ఈ మాటలలోనే జనకుని కన్ను రామలక్ష్మణులపై బడినది!]

స్వామీ! ఈ కుమారు లెవ్వరు? దేవలోకమునుండి భూలోకమునకు దిగివచ్చిన దేవతలు కారుగదా! శౌర్య వీర్య సంపదలు కలిగి అప్రతిమాన సుందరమూర్తులై యున్న వీరు కేవల పాదచారులై ఏ ప్రయోజనమును కాంక్షించి ఇచ్చటికి వచ్చియున్నారు? వీరిని కన్న తండ్రి ఎవ్వరో కదా!

[యోగ క్షేమములు విచారించు వ్యాజమున నే కుమారుల కుల గోత్రములు తెలిసికొను చున్నాడు. తన కొమారితకు శ్రీరాముడు తగిన వరు డని ఊహించియుండునా!]

ఇమౌ కుమారౌ భద్రం తే దేవతుల్య పరాక్రమౌ
గజసింహగతీ వీరౌ శార్దూల వృషభోపమౌ 50-17

పద్మపత్ర విశాలాక్షౌ ఖడ్గతూణీ ధనుర్ధరౌ
అశ్వినా విప రూపేణ సముపస్థిత యౌవనౌ. 50-18

యదృచ్ఛయైవగాం ప్రాప్తౌ దేవలోకా దివామరౌ
కథం పద్భ్యా మిహ ప్రాప్తౌ కిమర్థం కస్యవా మునే. 50-19

**విశ్వా :** జనకమహారాజా! వీరిరువురు దశరథ చక్రవర్తి కుమారులు! అని చెప్పి వారు సిద్ధాశ్రమమునకు వచ్చుట, రాక్షసులను వధించుట, అహల్యా శాప విమోచనము కావించుట, అహల్యా గౌతముల సమాగమము మున్నగు విషయములను

వివరముగా చెప్పి 'వీరు శివధనుస్సును చూడగోరుచున్నారు' అని కూడ తెలియ జేసినాడు.

ఈ వివరములను శతానందుడు సైతము విన్నాడు. శతానందుడు అహల్యా గౌతముల కుమారుడు. తన తల్లిదండ్రులు కలిసికొని సుఖముగా నున్న మాటను విని శతానందుడు సంతోషించినాడు. తన తల్లికి శాపవిమోచన మొనర్చిన శ్రీరాముని సందర్శించి ఆశ్చర్యచకితు డైనాడు. అట్టి మహిమగల శ్రీరాముని వెంటగొని వచ్చిన విశ్వామిత్రునికి నమోవాకము లర్పించి,

శతా: స్వామీ! మాతల్లిని శ్రీరాముడు సందర్శించెనా? మా తల్లికి విధిబలమున కలిగిన పతనమును గూర్చి శ్రీరామునికి చెప్పితిరా? మా తల్లి శ్రీరామునికి అతిథి మర్యాదలను జరిపించినదా! మాతల్లిదండ్రులు సమకూడినారా? మా తండ్రి శ్రీరాముని సత్కరించెనా? శ్రీరాముడు మా తల్లిదండ్రులను పూజించెనా?

విశ్వా: నాయనా! జరుగవలసిన పను లన్నిటిని క్రమముగా జరిపించినాను. ఏవియు కొఱతపడలేదు. రేణుక జమదగ్నిని కూడినట్లు మీ తల్లి మీ తండ్రిని కలసికొన్నది.

నాతిక్రాంతం మునిశ్రేష్ఠ యత్కర్తవ్యం కృతం మయా
సంగతా మునినా పత్నీ భార్గవేణేవ రేణుకా. 51-11

ఈ మాటలు విని శతానందుడు సంతోషించి రామునికి స్వాగతము చెప్పి విశ్వామిత్రుని మాహాత్మ్యమును రామునికి ఎరుకపరిచినాడు.

శతానందుడు: రామా! నీకు స్వాగతమగునుగాక! మహానుభావు డగు విశ్వామిత్రునితో నీ విచ్చటికి వచ్చుటకు దైవయోగమే కారణము.

స్వాగతంతే నరశ్రేష్ఠ దిష్ట్యా ప్రాప్తోసి రాఘవ
విశ్వామిత్రం పురస్కృత్య మహర్షి మపరాజితమ్. 51-13

విశ్వామిత్రుడు గొప్ప తపస్వి. మహాప్రభావుడు. ఇతడే పరమగతి. ఇట్టి విశ్వామిత్రుడు నీకు రక్షకుడుగా ఉన్నందున ఈలోకములో నిన్ను మించిన ధన్యుడులేడు.

అచింత్య కర్మా తపసా బ్రహ్మర్షి రతులప్రభః
విశ్వామిత్రో మహాతేజా వేత్స్యేనం పరమాంగతిమ్. 51-14

నాస్తి ధన్యతరోరామ త్వత్తోఽన్యోభువి కశ్చన
గోప్తా కుశికపుత్ర స్తే యేన తప్తం మహత్తపః 51-15

[విశ్వామిత్రుని కథ నంతయు శతానందుడు చెప్పినాడు. ఇదివరలో చెప్పబడియున్న విశ్వామిత్రుని కథ ఈ శతానందుడు చెప్పినదే]

రామా! విశ్వామిత్రుడు తపస్సుచే బ్రాహ్మణ్యము పొందిన మహానుభావుడు. ముని శ్రేష్ఠుడు. తపోమూర్తి. ఎల్లప్పుడును ధర్మమునే ఆచరించువాడు. వీర్యమునకు ఉనికిపట్టు.

ఏషరామ మునిశ్రేష్ఠ ఏష విగ్రహవాం స్తపః
ఏష ధర్మపరో నిత్యం వీర్యస్యైషపరాయణమ్. 65-27

**జనకుడు :** (ప్రాంజలియై విశ్వామిత్రునితో) మునిపుంగవా! నేను ధన్యుడను. మీరు రామలక్ష్మణులను తీసికొని ఇచ్చటికి వచ్చుటవలన మీచే అనుగ్రహింపబడితిని. నాకు మీ సందర్శన మొసంగి నన్ను పాలించినారు. తమ దర్శనభాగ్యమువలన నాకు అనేక విధములైన శుభములు చేకూరినవి.

విశ్వామిత్ర మహాభాగ బ్రహ్మర్షీణాం వరోత్తమ
గుణా బహువిధాః ప్రాప్తా స్తవ సందర్శనాన్మయా. 65-31

[జనకుడు యోగి. అతనికి మోహ బంధములులేవు. కావున అతడు రాబోవు సంగతులను స్పష్టముగా చూడగలిగినాడు. రాముడు రాక్షసులను వధించుట, అహల్యకు శాపవిముక్తి కలిగించుట మున్నగు విశేషములను విన్నాడు. రాముని మహత్త్వమును గుర్తించినాడు. శివధనుస్సును చూడగోరుచున్నాడని విశ్వామిత్రుడు చెప్పనే చెప్పినాడు. మహాప్రభావు డగు విశ్వామిత్రుడు రామలక్ష్మణులను మిథిలకు ఎందు నిమిత్తము తీసికొని వచ్చినట్లు? అన్నియు ఆలోచింపగా సీతాదేవి పెండ్లి దగ్గరలోనే ఉన్నట్లు గ్రహించి గొప్ప అర్థముగల ఈ మాటలను అన్నాడు.

అదే దశరథుని విషయము గమనింతము. విశ్వామిత్రుడు దశరథునితో స్పష్టముగా చెప్పినాడుగదా! "రామునకు అనేక విధములైన శుభములను చేకూర్చెదను. ఇందుకు సందేహము లేదు. అతని కీర్తి ముల్లోకములలో వ్యాపింప గలదు" అని.

శ్రేయశ్చాస్మై ప్రదాస్యామి బహురూపం న సంశయః
త్రయాణామపిలోకానాం యేన ఖ్యాతిం గమిష్యతి. 19-10

ఇంత స్పష్టముగా చెప్పినను పుత్రమోహమున బడియుండిన దశరథునికి ఈ మాట అర్థమే కాలేదు. అసలు వినెనో లేదో అనికూడ అనిపించును.

అందుకే పెద్దలు నిర్మోహిత్వమును సాధింపు మందురు.]

**జనకుడు :** మహర్షి! నీ గొప్ప చరిత్రము విన్నాము. అద్భుతముగా ఉన్నది. నీ కథలు వినగా వినగా మరిమరి వినవలయునని కుతూహలపడుచున్నాము. మునిపుంగవా! నాకిప్పుడు సెలవు దయచేయుడు. సూర్యాస్తమయము కాబోవుచున్నది. నేను యజ్ఞకర్మ చేయవలెనుగదా! రేపు ఉదయము తమ దర్శనము కావింతును.

జనకుడు విశ్వామిత్రునికి ప్రదక్షిణము చేసి ఆయన సెలవు గైకొని వెళ్లినాడు. విశ్వామిత్రుడు రామ లక్ష్మణులతో తమ విడిదికి చేరినాడు.

[జనకుడు యజ్ఞము చేయుట తన పుత్రిక వివాహము నుద్దేశించియే అని ఊహింప వచ్చును. వయసు వచ్చిన కొమార్తె అవివాహితగా నుండుట ఏ తండ్రికైనను బాధగనే ఉండును. తమకు పెండ్లి కాలేదని తమ తల్లిదండ్రులు బాధపడుట చూచి పుత్రికలు కూడ లోలోపలనే బాధ పడుచుందురు. ఈ విషయములు అయోధ్యాకాండము చివర సీతాదేవి అనసూయాదేవికి చెప్పిన మాటలవలన మనము తెలిసికొనవచ్చును.

తన స్వయంవర కథను చెప్పుమని అనసూయ కోరగా సీతాదేవి ఈ విధముగాచెప్పినది.

"మా తండ్రి జనకుడు యజ్ఞము చేయుటకు భూమిని దున్నుచుండగా నే నాయనకు నాగేటిచాలునందు దొరికితిని. నన్ను కొనిపోయి జనకమహారాజు తన పుత్రికవలె నన్ను పెంచినాడు. నాకు వివాహయోగ్య మగు వయస్సు వచ్చుట చూచి నా తండ్రి దీనుడై ధన మును కోల్పోయిన దరిద్రుని వగిది దుఃఖము నొందెను.

పతి సంయోగ సులభం వయో దృష్ట్వాతు మే పితా
చింతామభ్యగమ ద్దీనో విత్తనాశా దివాధనః. అయోధ్య 118-34

పెరిగిన కొమారిత అవివాహితగా ఇంట నుండినయెడల అట్టికన్య తల్లి దండ్రులు సరి వారిలోనేగాక తక్కువవారిలో కూడ తిరస్కారము పొలగుదురు. తండ్రి ఇంద్రుని యంతటివా డైనను ఈ అవమానమునకు గురికాక మానడు.

సదృశా చ్చాపకృష్టాచ్చ లోకే కన్యా పితా జనాత్
ప్రధర్షణా మవాప్నోతి శక్రేణాపి సమో భువి. అయోధ్య 118-35

అట్టి తిరస్కారము తనకు కూడ శీఘ్రములోనే కలుగ నున్నదని నా తండ్రి గ్రహించి సముద్రమున బడి దరిజేరుటకు తెప్ప లేనివాని వలె దుఃఖము నొందెను.

తాంధర్షణా మదూరస్థాం దృష్ట్వా చాత్మని పార్థివః
చింతార్ణవగతః పారం నాససా దాప్లవోయథా. అయోధ్య 118-36

నేనా అయోనిజను. నాకు తగిన వరుడు ఎంత వెదకినను కానరాలేదు. అంతట నా తండ్రి స్వయంవరము చాటించినాడు. మా ఇంట ఒక ధనుస్సున్నది. వరుణుడు మా తండ్రి కిచ్చినది. ఆ ధనుస్సును మోపెట్టినవానికి నన్ను ఇచ్చి పెండ్లి చేయుదు నని మా తండ్రి చెప్పి నాడు. ఆ ధనుస్సు సామాన్యమైనదికాదు. అసాధ్యమైన బరువు దానిని కదలించుటకూడ కష్టము. వంచుట సంగతి చెప్పవలయునా! స్వయంవరమును చాటింపగా రాజు లెందరో వచ్చినారు. కాని పర్వతాకారమైన ఆ ధనుస్సును చూచి దానికి ఒక నమస్కారము చేసి పోయెడివారు. [నీ కొక దండము బాబూ అన్నట్లు].

**తచ్చదృష్ట్వా ధనుశ్శ్రేష్ఠం గౌరవా గ్గిరి సన్నిభమ్**
**అభివాద్య నృపా జగ్ముః రశక్తా స్తస్య తోలనే. అయోధ్య 118-43**

ఇది ఇప్పటి వరకు జరిగిన విషయము. యోగ్యుడైన వరుని గానక జనకుడు దుఃఖములో నున్నాడు. 'అమ్మాయి పెండ్లి జరుగునా భగవంతుడా' అని తపించుచుండినాడు. ఇప్పుడు యజ్ఞము కూడ చేయుచున్నాడు. రామ లక్ష్మణులను చూచి విశ్వామిత్రుని పలుకులు తల పోయుచు జనకుడు ఆరాత్రి ఎన్ని ఆలోచనలతో గడపెనో మనము ఊహించుకొన వచ్చును.]

మరునాడు ఉదయమున తాను చేయవలసిన యాగకర్మను పూర్తిచేసి జనకుడు రామలక్ష్మణులతో సమేతుడైన విశ్వామిత్రునికడ కేగి వారినందరిని యథావిధిగా పూజించి

*జనకుడు :* మహామునీ! మీ ఆజ్ఞ ఏమి? మీ ఆజ్ఞను శిరసావహించి పాలించుటకు సిద్ధుడనై యున్నాను.

*విశ్వా :* రాజా! ఈ రామ లక్ష్మణులు దశరథ చక్రవర్తి కుమారులు. క్షత్రియులు-లోక ప్రసిద్ధులు-నీ యొద్దనుండు శివధనుస్సును వీరు చూడగోరుచున్నారు.

[పెండ్లి పెద్దగదా! కులము గోత్రము స్థితి పేరు ప్రతిష్ఠలు అన్నింటిని తెలియ జెప్పి గొప్ప సంబంధమని సూచించినాడు.]

జనకమహారాజా! నీకు మంగళమగును గాక! ఈ కుమారులు ధనుస్సును చూచి వారి కోరిక తీర్చుకొని మరలి పోగలరు.

*జనకుడు :* చిత్తము! ఆ ధనుస్సు ఇక్కడికెట్లు వచ్చినదో ఇక్కడ ఎందుల కున్నదో మనవి చేయుదును. నిమిచక్రవర్తికి ఆరవ పురుషుడు దేవరాతుడను రాజు. ఈ ధనుస్సును శివుడు దేవరాతునియొద్ద న్యాసముగా ఉంచినాడు. దక్షుని యజ్ఞమున శివుడు కోపించి దేవతల నందరిని ఈధనుస్సుతో కూల్తునని చెప్పినాడు. అందరు భయపడి శివుని వేడుకొనగా శివుడు శాంతుడై ధనుస్సును దేవతల కిచ్చినాడు. దేవతలు దానిని మా పూర్వుడగు దేవరాతుని కిచ్చినారు.

నేను యాగభూమిని దున్నుచుండగా నాకు సీత దొరికినది. సీత అయోనిజ కావున వీర్యశుల్కమీయగల వానికే సీత నిచ్చి పెండ్లి చేయుటకు నిశ్చయించితిని. రాజు లెందరో వచ్చి సీత నిమ్మని కోరినారు. అందరికి నా నిశ్చయమును చెప్పినాను. రాజు లందరు మిథిలకు వచ్చి "మా పరాక్రమమును ఎవ్విధముగా ప్రకటింపవలెను?" అని ప్రశ్నించినారు. నేను వారికి శివధనుస్సును చూపించి దానిని ఎక్కుపెట్టుడని కోరితిని. ఆ రాజులు దానిని ఎత్తజాలకపోయిరి సరిగదా దానిని కదలించుటకు కూడ వారికి సాధ్యము కాలేదు. మరి ఎక్కు పెట్టుట ఏమున్నది?

న శేకుర్గ్రహణే తస్య ధనుషస్తోలనేపివా. బాల 66-18

కావున వారిలో ఎవ్వరికిగాని మా సీత నిచ్చుటకు నేను సమ్మతింపలేదు. మహామునీ! ఆ పిదప ఏమి జరిగినదో ఎరుగుదురా! ఆ రాజు లందరు ఏకమై మిథిలను ముట్ట

సించినారు. ఒక సంవత్సర కాలమునకు నా సైన్యము సంభారములు తరిగిపోయినవి. ఏమి చేయుటకును నాకు తోచలేదు. తపస్సు ప్రారంభించితిని. దేవతలు తృప్తిజెంది నాకు చతురంగ బలములు ప్రసాదించినారు. ఆ సహాయముతో నేను శత్రువులను ఓడించినాను.

ధనుస్సు చరిత్ర విన్నారుగదా! ఆ ధనుస్సును రామ లక్ష్మణులు చూడగోరిన యెడల తప్పక చూడవచ్చును. రాముడు ఆ ధనుస్సును ఎక్కుపెట్టగలిగినయెడల సీతను రామునికిచ్చి నేను తప్పక వివాహము జరిపింతును.

యద్యస్య ధనుషో రామః కుర్యా దారోపణం మునే
సుతా మయోనిజాం సీతాం దద్యాం దాశరథేరహమ్॥ 66.26

విశ్వా: మహారాజా! మంచిది. ఆ ధనుస్సును తెప్పించి రామునికి చూపింపుడు.

జనకుని ఆజ్ఞ ననుసరించి మంత్రులు పట్టణములోని కరిగి శివధనుస్సును తెప్పించినారు. మంచి బలశాలురు అయిదు వేల మంది ఎనిమిది చక్రములు గల మంజూషమీద అతి ప్రయాసతో తెచ్చినారు.

నృణాం శతాని పంచాశ ద్వ్యాయతానాం మహాత్మనామ్
మంజూషా మష్ట చక్రాంతాం సమూహుస్తే కథంచన. 67.4

జనకుడు: మహర్షీ! ధనుస్సు వచ్చినది. దేవతలుగాని, అసురులు, రాక్షసులు, గంధర్వులు యక్షులు, కిన్నరులు, ఉరగులుగాని ఎవ్వరును దీనిని పూరింప జాలరు. మానవులకు సాధ్యమగునా! అయినను మీ మాట కాదన జాలను. దీనిని రామ లక్ష్మణులకు చూపింపుడు.

విశ్వా: రామా! ఈ ధనుస్సును చూడుము.

వత్సరామ! ధనుఃపశ్య ఇతిరాఘవ మబ్రవీత్. 67.12

శ్రీరాముడు పెట్టె తెరచి ధనుస్సును చూచి విశ్వామిత్రునితో

రాముడు: స్వామీ! ఈ ధనుస్సును స్పృశించి దానిని కదలించుటకును, మోపెట్టుటకును ప్రయత్నించెదను.

[ఎంత వినయము! గమనింపదగిన విషయము.]

ఇదం ధనుర్వరం బ్రహ్మన్ సంస్పృశామీహ పాణినా
యత్నవాంశ్చ భవిష్యామి తోలనే పూరణేఽపివా. 67.14

విశ్వామిత్రుడు, జనకుడు 'మంచిది' అన్నారు. ధర్మాత్ముడైన రాముడు ఎట్టి ప్రయాసయు లేక లీలగా ధనుస్సును పట్టుకొని బాణముతో పూరించి ఆకర్షించి ధనుస్సును రెండు ముక్కలుగా విరిచినాడు. ఈ దృశ్యమును వేలకొలది జనులు చూచినారు.

లీలయా సధను ర్మధ్యే జగ్రాహ వచనాన్మునేః
పశ్యతాం నృపసహస్రాణాం బహూనాం రఘునందనః. 67-15

ఆరోపయ త్స ధర్మాత్మా సలీలమివ తద్ధనుః
ఆరోపయిత్వా ధర్మాత్మా పూరయామాస తద్ధనుః. 67-16

తద్బభంజ ధను ర్మధ్యే నరశ్రేష్ఠో మహాయశాః. 67-17

ధనుర్భంగము వలన కలిగిన పిడుగుపంటి శబ్దమునకు జనకుడు విశ్వామిత్రుడు రామ లక్ష్మణులు తప్ప తక్కిన వారందరు మూర్ఛనొంది పడిపోయినారు. కొంత సేపటికిగాని వారు మూర్ఛదేరలేదు. అందరు లేచిన పిదప జనకుడు విశ్వామిత్రునికి నమస్కరించి

**జనకుడు :** స్వామీ! రాముని అద్భుత పరాక్రమమును తిలకించితిని. నా సుత యగు సీత రాముని భర్తగా బడసి మా వంశమునకు కీర్తి చేకూర్ప గలదు. నా కొమారిత తను వీర్యవంతునకే ఇచ్చెదనని నేను చేసిన ప్రతిజ్ఞ సత్యమే అయినది. సీతను రామున కిచ్చెదను. ఈ మాట తప్పను. తాము అనుజ్ఞ నిత్తురేని వెంటనే నా మంత్రులను అయోధ్యకు పంపి ఇక్కడి విషయములను దశరథ చక్రవర్తికి నివేదించి వారి నిక్కడికి తోడ్కొనివచ్చుటకు తగిన ఏర్పాటులు కావింతును.

రామ లక్ష్మణులు విశ్వామిత్రమహాముని రక్షణలో ఉన్నారని కూడ నా మంత్రులు దశరథచక్రవర్తికి నివేదింతురుగాక!

మునిగుప్తౌచ కాకుత్స్థౌ కథయంతు నృపాయవై. 67-25

విశ్వామిత్రుడు 'తథాస్తు' అన్నాడు. జనకుడు మంత్రులను పిలిపించి వివాహ పత్రికలను వారి చేతి కిచ్చి వియ్యాలవారిని శీఘ్రముగా పిలుచుకొని రమ్మనిచెప్పి వారిని అయోధ్యకు పంపినాడు.

అయోధ్యాం ప్రేషయామాస ధర్మాత్మా కృత శాసనాన్
యథావృత్తం సమాఖ్యాతు మానేతుంచ నృపం తదా. 67-27

[ఒక విషయము ఈ ఘట్టములో చెప్పబడియుండలేదు. అయోధ్యా కాండములో సీతాదేవి అనసూయాదేవికి చెప్పిన స్వయంవర కథలో ఆ విషయము చెప్పబడి యున్నది. అది ముఖ్య విషయము కావున ఈ పట్టున గమనింపదగియున్నది.

ధనుర్భంగమగుట తోడనే ఇంతకాలమునకు తన బాధ తొలగినందుకు జనకుడు ఆనంద పరవశుడై వెంటనే కన్యాదానము చేయ సమకట్టినాడు. ఆలస్య మైనయెడల ఏవేని ఇబ్బందులు కలుగవచ్చును. దశరథుడు ఈ సంబంధమునకు అంగీకరించునో లేదో! ఇట్టి సమస్యలు తట్టినవి కాబోలు! జనకుడు ఏమి ఆలోచించుకొనెనో గాని దశరథునికి కబురుచేయు మాట

*దశర :* జనకమహారాజా ! ఋషులను ఎంత గొప్పగా పూజించితివి ! నీకు శుభమగును గాక ! మేము విడిదికి వెళ్ళి నాంది మొదలైన కార్యకలాపమును జరుపుకొనవలయునుగదా !

దశరథచక్రవర్తి విడిదికి వెళ్ళి దానములు, ధర్మములు విరివిగాను, యథాశాస్త్రముగను జరిపించినాడు. గో దానములు లక్షలులక్షలుగా కుమారులచేత చేయించినాడు. గోదానములు జరిగిననాడే భరతుని మేనమామయగు యుధాజిత్తు మిథిలకు వచ్చినాడు.

*యుధా :* (దశరథునితో) మహారాజా ! మా తండ్రిగారు భరతుని చూడగోరుచున్నారు. భరతుని తోడ్కొని పోవుటకు అయోధ్యకు రాగా మీరు మిథిలకు వచ్చినట్లు తెలియవచ్చినది. కావున నే నిచ్చటికి వచ్చితిని.

[ఇదియే అయోధ్యాకాండమునకు పీఠిక.]

దశరథుడు బావమరదికి తగిన మర్యాదలు చేసినాడు. ఆ రాత్రి సుఖముగా గడపి మరునాడు ఉదయమున ఋషులను పురస్కరించుకొని దశరథుడు జనకుని యాగశాల కరిగినాడు. రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు సర్వాభరణ భూషితులై వసిష్ఠాది మహామునులను మున్నిడికొని వివాహమునకు అనుకూలమైన విజయ మను ముహూర్తమున దశరథుని వెంట బయలుదేరినారు.

వసిష్ఠుడు కొంచెము ముందుగా వెళ్ళి జనకునితో అనుచున్నాడు.

*వసిష్ఠుడు :* రాజా ! మంగళాచరణము జరిగింపబడిన పుత్రులను వెంటగొని దశరథమహారాజు వచ్చి దాతవగు నీ కొరకు వేచియున్నాడు.

**రాజా దశరథో రాజన్ కృతకౌతుకమంగళైః**

**పుత్రై ర్నరవరశ్రేష్ఠ దాతార మభికాంక్షతే. 73.11**

దాతకును ప్రతిగృహీతకును సమస్త పురుషార్థములు సమకూరును. కావున నీవు కన్యాదానము చేసి నీ ధర్మమును నెరవేర్పుము.

*జనకుడు :* మహర్షి ! దశరథమహారాజుగారు లోపలికి దయచేయుటకు అభ్యంతర మేమి? వారు వచ్చుటకు ఒకని ఉత్తరువు కావలయునా ! ఈ గృహము వారిదికాదా ? ఈ రాజ్యమంతయు వారిదేకదా ! స్వగృహమునందు సంకోచ మేటికి ? వారిని అడ్డుపెట్టువా రొకరున్నారా ! వారిని వేగిరము రమ్మనుడు. మేము సిద్ధముగా ఉన్నాము. నా కొమారితలు వివాహోచిత మంగళములను గావించుకొని జ్వలించుచున్న అగ్నిజ్వాలల చందమున తేజరిల్లుచు వేదిమూలమున సిద్ధముగా ఉన్నారు. మా అలస్యమేమియునులేదు. వారిని రమ్మనుడు.

కష్చిన్తః ప్రతిహారోమే కస్యాజ్ఞా సంప్రతీక్ష్యతే
స్వగృహే కో విచారోఽస్తి యథా రాజ్య మిదం తవ. 73-14

కృతకౌతుకసర్వస్వా వేదిమూల ముపాగతాః
మమకన్యా మునిశ్రేష్ఠ దీప్తా వహ్నేరివార్చిషః. 73-15

దశరథుడు కుమారులను ఋషులను బంధుపరివారములను వెంటబెట్టుకొని యాగశాల ప్రవేశించెను.

*జనకుడు*: (వసిష్ఠునితో) మహర్షీ ! నీవు ధార్మికుడవు. మాకు ప్రభుడవు. లోకులను రమింపజేయు శ్రీరాముని వివాహమును ఈ ఋషులతోకూడి మీరు జరిపింప వలయునని ప్రార్థించుచున్నాను.

కారయస్వ ఋషే సర్వ మృషి భిస్సహ ధార్మికః
రామస్య లోకరామస్య క్రియాం వైవాహికీం విభో. 73-18

[ఈ శ్లోకము శ్రద్ధతో చదువదగియున్నది. శ్రీరాముని అవతార ప్రయోజనము ధర్మ సంస్థాపనముగదా! సర్వకాల సర్వావస్థలయందు ధర్మమును పాటించుటచేతనే శ్రీరాముడు లోకాభిరాముడైనాడు. భర్తయొక్క ధర్మాచరణమునకు భార్య అనుకూలింపని యెడల ధర్మలోపము కలుగుటకు అవకాశ మేర్పడును. అట్టివి జరుగకుండునట్లు చేయవలయును. పరమ ధార్మికుడైన వసిష్ఠభగవానునిచే వివాహము జరిపించిన యెడల వారి ఆశీర్వాద ఫలముగా ధర్మాచరణమునందు లోపము కలుగదు.]

వసిష్ఠుడు విశ్వామిత్రుని శతానందుని పురస్కరించుకొని పెండ్లి పందిలి నడుమ వేదిని సిద్ధపరిచి గంధపుష్పములతోను పాలికలతోను ఇతర పాత్రలతోను వేదిని యథా శాస్త్రముగా అలంకరించి అగ్నిని ప్రతిష్ఠించి వధూవరుల అభ్యుదయము కొరకు వేద మంత్రములను చెప్పి హోమము కావించెను.

జనకుడు సర్వాభరణ భూషితయైన సీతాదేవిని తోడ్కొని వచ్చి అగ్నిసన్నిధిలో శ్రీరామునికెదురుగా నిలిపి "రామా! నా సుత యగు సీతను నీ కిచ్చుచున్నాను. నీవు నీ పాణితో ఆమె పాణిని గ్రహించి (పాణిగ్రహణముచేసి) ఈ కన్యను పరిగ్రహింపుము. ఈ సీత నీ సహధర్మచారిణిగా ఉండగలదు. నీకు శుభ మగుగాక! పతివ్రతయై మహాభాగ్యము కలదియై నిన్ను ఎల్లప్పుడు నీడవలె అనుసరించుచుండగలదు;" అని చెప్పి కన్యాదానము చేసినాడు.

ఇయం సీతా మమసుతా సహధర్మచరీ తవ
ప్రతీచ్ఛచైనాం భద్రంతే పాణిం గృహ్ణీష్వపాణినా. 73-26

పతివ్రతా మహాభాగా ఛాయేవాను గతా సదా. 73-27

[ఈ శ్లోకములకు వ్యాఖ్యాతలు అనేక విశేషార్థములు చెప్పియున్నారు. నాకు తోచిన మాటనుకూడ ఒకటి మనవిచేయుచున్నాను.

పైశ్లోకములలోని మాటలు రాముని పేరుబెట్టి చెప్పినవైనను నిజముగ సీతను ఉద్దేశించి చెప్పినట్లే కనబడుచున్నది. జనకుడు అన్యాపదేశముగా తన తనయకు పతివ్రతా ధర్మములను ఉపదేశించుచున్నాడు. అత్తవారింట ఆమె ఎట్లు మెలగవలసినది సూచించుచున్నాడు. ఆ శ్లోకములు ఈవిధముగా అన్వయము చేసికొనవచ్చును. "అమ్మాయి! నిన్ను ఈ రాముని చేతిలో పెట్టుచున్నాను (పాణిగ్రహణము) (ఇయం సీతా) నీవు సీతవు (అయోనిజవు) అన్నమాట జ్ఞప్తియందుంచుకొనుము.(మమసుతా)జనకుని కొమారిత వను సంగతి మరచి పోవలదు.పవిత్రమైన మన కులమర్యాదను కాపాడుము. (పతివ్రతా....) పతివ్రతాధర్మములను పాటించి సర్వదా భర్తను అనుసరించి వర్తించుచు మహాభాగ్యశాలినివి గమ్ము" అని సీతాదేవికి చెప్పుచున్నట్టు ధ్వనించుచున్నది.

సీతాదేవి పేరుబెట్టి ఈ మాటలు ఆమెకు చెప్పుటలో ఔచిత్యములేదు. నిండుసభలో రాముని సమక్షమున పాతివ్రత్య ధర్మములను సీతకు నూతనముగా బోధించుచున్నట్లు కనబడకూడదు. పాతివ్రత్య ధర్మములు సీతాదేవికి అంతకుముందు తెలియనట్లు రామునికి తోపించుట పాడికాదు.

అదిగాక ఇతరులు తనకు పాతివ్రత్య ధర్మమును బోధించుట సీతకు సరిపడదు. ఆ మాటలు విని సహించి ఊరకయుండలేదు. దీనికి రెండు ఉదాహరణను లున్నవి.

సీతా రామ లక్ష్మణులు వనవాసమునకు బయలుదేరినప్పుడు కౌసల్య సీతకు పతివ్రతా ధర్మముల నుపదేశించినది. ఆ మాటలు విని సీతాదేవి ఏమన్నదో ఎరుగుదురా! "అత్తా! నాకు మాత్రము తెలియవా పతివ్రతాధర్మములు! నన్ను దుష్ట స్త్రీలతో పోల్చవలదు" అన్నది.

అభిజ్ఞాఽస్మి యథా భర్తుర్వర్తితవ్యం శ్రుతంచమే
నమా మసజ్జనే నార్యా సమానయితు మర్హతి. అయోధ్య 39-27

మరియొక సందర్భములో అనసూయాదేవికికూడ ఇట్టి జవాబే చెప్పినది. సీత అనసూయతో "స్త్రీకి భర్తయే దైవమని నాకుకూడ తెలియును. పాణిప్రదాన కాలమున అగ్నిసన్నిధిలో మా తల్లి చెప్పియే యున్నది. నేనా మాటలనుకూడ మనసులో పెట్టుకొనియే యున్నాను" అని చెప్పినది.

విదితంతు మమాప్యేత ద్యథా నార్యాః పతిర్గురుః. అయోధ్య 118-2

పాణిప్రదాన కాలేచ యత్పురా త్వగ్ని సన్నిధౌ
అనుశిష్టా జనన్యాఽస్మి వాక్యం తదపి మే ధృతమ్. 118-8

ఈ మాటనుబట్టి పైన ఉదాహరింపబడిన సూచనకు కొంత ఆధార మున్నట్లు తోచుచున్నది. అగ్నిసన్నిధిలో పాణిప్రదాన కాలమున జనకునిచే "ఇయంసీతా...." అని చెప్పబడి

నదిగదా! తల్లి స్పష్టముగా బోధించిన విషయములను తండ్రి అన్యాపదేశముగా చెప్పుట ఎంతో సహజముగాను సమంజసముగాను ఉన్నది.]

ఈ మాటలు చెప్పి జనకుడు మంత్రపూతమైన జలమును రాముని చేతిలో విడిచెను. దేవతలు ఋషులు మున్నగు వారందరు ఆనందించినారు. పుష్పవృష్టి కురిసినది.

తరువాత లక్ష్మణ భరత శత్రుఘ్నులకు సైతము వివాహములు జరిగినవి. ఊర్మిళను లక్ష్మణునికి, మాండవిని భరతునికి, శ్రుతకీర్తిని శత్రుఘ్ననికిని ఇచ్చి వివాహములు జరిపించినారు.

రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు వసిష్ఠుని అనుమతితో వారివారి భార్యల హస్తములు గ్రహించి అగ్నిహోత్రమునకు, వేదికి, జనకమహారాజునకు, ఋషులకు ప్రదక్షిణములు చేసి శాస్త్రప్రకారము వివాహ కార్యకలాపమును సంపూర్తి కావించిరి. అట్టి శుభసమయమున పుష్పవృష్టి కురిసినది. దుందుభులు మ్రోగినవి. అప్సరసలు ఆడినారు. గంధర్వులు పాడినారు. వధూవరులు మూడు పర్యాయములు అగ్నికి ప్రదక్షిణము చేసినారు.

ఈ విధముగా వివాహములు జరిగిన పిదప దశరథమహారాజు కుమారులతోను వారి భార్యలతోను బంధుమిత్రులతోనుకూడి విడిదికి చేరినాడు.

మరునాడు ఉదయము విశ్వామిత్రమహాముని జనకమహారాజును దశరథమహారాజును వీడ్కొని నలుగురు వధూవరులను ఆశీర్వదించి హిమవత్పర్వతమున కరిగినాడు.

[వచ్చిన పనిపూర్తి అయినది. శ్రీరామునికి సకల సంపదలనుకూర్చి అస్త్రప్రదానముచేసి వివాహము జరిపించి వెళ్ళినాడు. వివాహప్రసక్తి వచ్చినప్పుడు వచ్చిన మహనీయుడు దగ్గర ఉండి వివాహములు జరిపించి వెళ్ళినాడు. రామాయణములో ఆ మహానుభావుని పని అంతవరకే. ఆ తరువాత మనకు కానరాడు.]

## దశరథుడు బంధుజనులతో అయోధ్యకు పోవుట

విశ్వామిత్రుడు వెళ్లిన పిదప దశరథచక్రవర్తి తన కుమారులతోను, కోడండ్రతోను, బంధుజన పరివారములతోను అయోధ్యకు ప్రయాణమైనాడు. జనకమహారాజు ఇచ్చిన కన్యాధనమునకు మేరలేదు. ఏనుగులు, గుఱ్ఱములు, దాసీ జనములు, వెండి, బంగారు, పట్టువస్త్రములు, ఆభరణములు మున్నగు వానిని లెక్కకు మిక్కిలిగా ఇచ్చి జనకుడు దశరథుని కొంతదూరము సాగనంపి మిథిలకు మరలినాడు.

మునకు ముందుగా జరుగవలసిన అంకురార్పణము మొదలైన కార్యవిధులను జరిపించినాడు. అందరు ఆ రాత్రి సుఖముగా గడపినారు.

[సీతాదేవికేకాక ఆమె చెల్లెండ్రకు కూడ వివాహములు జరుగగలవని అప్పుడే ఊహించినారు జనకమహర్షులవారు!]

జనకోఽపి మహాతేజాః క్రియాం ధర్మేణ తత్త్వవిత్
యజ్ఞస్యచ సుతాభ్యాంచ కృత్వారాత్రి ముపాసహ. 69-18

జనకుని యజ్ఞము పూర్తియైనది. మరునాడు ప్రొద్దుననే జనకుడు తన పురోహితుడైన శతానందునితో "నా తమ్ముడు కుశధ్వజుడు ఇక్షుమతీ తీరమునందు సాంకాశ్య పట్టణమున ఉన్నాడుగదా! అతడే నా యజ్ఞమును రక్షించినవాడు. ఈ శుభమునందు అతడుకూడ పాల్గొనవలెనని కోరుచున్నాను. అతనిని పిలిపింపుడు" అని చెప్పినాడు.

కుశధ్వజుడు వచ్చినాడు. జనకుడు కుశధ్వజుడు రాజార్హములైన ఆసనములను అలంకరించినారు. జనకుడు తన మంత్రియైన సుదామనుని దశరథుని యొద్దకు పంపినాడు. దశరథుడు మంత్రులతోను ఋషులతోను బంధుజనులతోను సభామంటపమునకు వచ్చినాడు. అందరు ఉచితాసనములను అలంకరించినారు.

*దశర :* జనకమహారాజా! భగవంతుడగు వసిష్ఠమహర్షి మా ఇక్ష్వాకు వంశస్థులకు ఇలువేల్పు. వారి మాట లేక మేము ఏ కార్యమును చేయము. ఈ విషయము మీకును తెలిసియే ఉండును. విశ్వామిత్రుని అనుమతితో వసిష్ఠభగవానుడు మా వంశక్రమమును ఇప్పుడు చెప్పగలడు.

["మా వంశక్రమమును చెప్పుడు" అని వసిష్ఠులవారిని అడుగు నా దశరథుడు!]

వసిష్ఠులవారు దశరథుని వంశక్రమమును ఇట్లు చెప్పినారు.

| (1) | (2) |
|---|---|
| బ్రహ్మ | దిలీపుడు |
| \| | \| |
| మరీచి | భగీరథుడు |
| \| | \| |
| కాశ్యపుడు | కకుత్థ్సుడు |
| \| | \| |
| సూర్యుడు | రఘువు |
| \| | \| |
| మనువు | ప్రవృద్ధుడు (కల్మాషపాదుడు) |
| \| | \| |

(1)

|
ఇక్ష్వాకు (అయోధ్య మొదటి రాజు)
|
కుక్షి
|
వికుక్షి
|
బాణుడు
|
అనరణ్యుడు
|
పృథువు
|
త్రిశంకువు
|
దుందుమారుడు (యువనాశ్వుడు)
|
మాంధాత
|
సుసంధి
|
ధ్రువసంధి ప్రసేనజిత్తు
|
భరతుడు
|
అసితుడు
|
సగరుడు
|
అసమంజుడు
|
అంశుమంతుడు
|
దిలీపుడు

(2)

|
శంఖణుడు
|
సుదర్శనుడు
|
అగ్నివర్ణుడు
|
శీఘ్రగుడు
|
మరువు
|
ప్రశుశ్రుకుడు
|
అంబరీషుడు
|
నహుషుడు
|
యయాతి
|
నాభాగుడు
|
అజుడు
|
దశరథుడు

వసిష్ఠ : జనకమహారాజా! ఇట్టిది వీరి వంశక్రమము. వంశముచే వీరు ఆదినుండియు పరిశుద్ధులు. అందరు పరాక్రమవంతులు, సత్యవాదులు, ధర్మనిరతులు. ఇట్టి మహా వంశమున జన్మించిన రామ లక్ష్మణులకు నీ కొమారితల నిమ్మని కోరుచున్నాను. సర్వథా అనురూప దంపతులుగా ఉందురనుటకు సందేహములేదు.

జనక : మునితిలకా! మా వంశముకూడ తక్కువైనదికాదు. సత్కులమున జనించినవాడు కన్యాదానము చేయు సమయమున తన వంశక్రమమును చెప్పవలయును గదా! వినుడు.

(1)

నిమి
|
మిథి (ఇతడే మిథిలను నిర్మించినవాడు. ఇతడే మొదటి జనకుడు)
|
ఉదావసువు
|
నందివర్ధనుడు
|
సుకేతువు
|
దేవరాతుడు
|
బృహద్రథుడు
|
మహావీరుడు
|
సుధృతి
|
ధృష్టకేతువు
|
హార్యశ్వుడు
|
మరువు

(2)

మరువు
|
ప్రతింధకుడు
|
కీర్తిరథుడు
|
దేవమీఢుడు
|
విబుధుడు
|
మహీధ్రకుడు
|
కీర్తిరాతుడు
|
మహారోముడు
|
స్వర్ణరోముడు
|
హ్రస్వరోముడు
|
జనకుడు — కుశధ్వజుడు

ఇట్టిది మా వంశక్రమము. నేను రాజ్యమునకు వచ్చిన పిదప నేను నా తమ్ముడు మిథిలలో నుండగా సాంకాశ్యపురాధిపతియైన సుధన్వుడు మిథిలను ముట్టడించి శివ ధనుస్సును, సీతను తన కిమ్మని కోరినాడు. నే నందుకు సమ్మతింపనందున నాపైకి యుద్ధమునకు వచ్చినాడు. యుద్ధములో నేను సుధన్వుని వధించి మా తమ్ముని సాంకాశ్యపురాధిపతిగా చేసితిని.

వసిష్ఠమహామునీ! మీ ఆజ్ఞానుసారము నా కొమారితలను రామ లక్ష్మణులకు సంతుష్టాంతరంగుడనై ఇత్తును. సీతను రామునికి, ఊర్మిళను లక్ష్మణునికిని తప్పక ఇచ్చెదను. త్రికరణశుద్ధిగా, నిస్సంశయముగా ఇచ్చుచున్నాను.

**వీర్యశుల్కాం మమసుతాం సీతాం సురసుతోపమామ్**
**ద్వితీయా మూర్మిళాం చైవ త్రిర్దదామి నసంశయః.** 71.21

మీరు జరుపుకొనవలసిన గోదానములు, నాందికర్మాదికములు జరుపుకొనుడు. **నేడు మఘానక్షత్రము.** మూడవ దినమున ఉత్తరఫల్గునీ శుభ నక్షత్రమున వివాహము **జరిపింప** వేడుచున్నాను.

***విశ్వా:*** (వసిష్ఠుని అనుమతితో) జనకమహారాజా ! ఇక్ష్వాకు వంశము యొక్కయు **విదేహరాజుల** వంశము యొక్కయు మహిమలు కొనియాడుటకు ఒకనికి **సాధ్యమా !** రెండు వంశములును మిక్కిలి కీర్తింపదగినవి. ఈ వివాహ సంబంధ **ములు ఎంతయేని** ఒప్పియున్నవి. వధూవరులు రూపసంపదలలో **తులతూగు చున్నారు.** మాకు పరమసంతోషముగా ఉన్నది.

**సదృశో ధర్మసంబంధ స్సదృశో రూపసంపదా**
**రామలక్ష్మణయో రాజన్ సీతాచోర్మిళయాసహ.** 72.3

**మహారాజా !** చెప్పవలసినమాట మరియొకటి కలదు. వినుడు. కుశధ్వజుని **కొమారితలను భరత శత్రుఘ్నుల** కీయగోరుచున్నాను. వారును ఒకరికొకరు సర్వవిధ **ముల తగినవారు.**

[దశరథుడు తన నలుగురు పుత్రులకు వివాహములు జరిపించు మాటలలో ఉన్నప్పుడు వచ్చిన విశ్వామిత్రుడు ఇద్దరికి మాత్రము వివాహములు జరిపించుట బాగుండునా !]

***జనకుడు:*** (వసిష్ఠునికిని విశ్వామిత్రునికిని నమస్కరించి) మునిశ్రేష్ఠులారా ! మేము ధన్యు **లము. మీ మాటను** మీ ఆజ్ఞగా గైకొని పాలింపగలవారము. రాజపుత్రులు నలు గురు, రాజపుత్రికల నలుగురిని ఒక్కదినముననే వివాహ మాడుదురుగాక !

మహర్షులారా ! మీరు నాకు కన్యాదాన ఫలము కలిగించి ధర్మము చేకూర్చితిరి. **ఎల్లప్పుడు** నేను మీ శిష్యుడనే. మీరీ సింహాసనముల నలంకరింపుడు. ఈ మిథిల **దశరథునకు ఎట్లు** సొంతమో అయోధ్య నాకును సొంతము. కావున అయోధ్యనుకూడ **నేను మీ కీయవచ్చును.** మీరు మా రాజ్యములను గ్రహించి మమ్ము అనుగ్రహింపుడు.

**పరోధర్మః కృతోమహ్యం శిష్యోఽస్మి భవతోస్సదా.** 72.15

**యథా దశరథస్యేయం తథాయోధ్యాపురీ మమ**
**ప్రభుత్వే నాస్తి సందేహో యథార్హం కర్తుమర్హథ.** 72.16

**ఈ మాటలకు దశరథుడు** మిక్కిలి సంతోషించినాడు.

మున్ముందు అనుకొన్నట్లు కనిపించుటలేదు. అనసూయకు సీతాదేవి చెప్పిన మాటలను గమనింతము.

**సీత :** పరాక్రమవంతుడగు రాముడు ఒక క్షణములో ధనుస్సును పూరించినాడు. ఆ వేగమునకు ధనుస్సు రెండుగా విరిగినది. అప్పుడు కలిగిన శబ్దము పిడుగు పడినట్లు భయంకరముగా నుండినది.

నిమేషాంతర మాత్రేణ త దానమ్య స వీర్యవాన్
జ్యాం తమారోప్య ఝడితి పూరయామాస వీర్యవత్. అయోధ్య 118-48

తేన పూరయతా వేగా న్మధ్యే భగ్నం ద్విధాధనుః
తస్యశబ్దోఽభవద్భీమః పతితస్యాశనేరివ. అయో 118-49

అంతట సత్యప్రతిజ్ఞుడగు నాతండ్రి నన్ను రామునకీయ నిశ్చయించుకొని జలకలశము నెత్తినాడు.

తతోఽహం తత్రరామాయ పిత్రా సత్యాభి సంధినా
నిశ్చితా దాతు ముద్యమ్య జలభాజన ముత్తమమ్. అయో 118-50

నా తండ్రి నన్ను రామునికీయబోగా రాము డేమన్నాడో తెలియునా! 'మాతండ్రిగారి అభిప్రాయమును తెలిసికొనక ఈ వధువును ప్రతిగ్రహింపను' అన్నాడు.

దీయమానాం నతుతదా ప్రతిజగ్రాహ రాఘవః
అవిజ్ఞాయ పితుశ్ఛంద మయోధ్యాధిపతేః ప్రభోః. అయో 118-51

ఆ తరువాత నా తండ్రి మామామగారిని పిలిపించి నన్ను రామునికిచ్చి వివాహము జరిపించినాడు.

తతశ్శ్వశుర మామంత్ర్య వృద్ధం దశరథం నృపమ్
మమ పిత్రా త్వహం దత్తా రామాయ విదితాత్మనే. అయో 118-52

[ఈ ఘట్టములో రాముని గొప్ప గుణమును గమనింపవలెను. జనకమహారాజంతటివాడు లక్ష్మీదేవికి సరివచ్చు సీతాదేవిని ఇచ్చెదనన్నప్పటికిని తండ్రి ఇష్టపడిననే పెండ్లి చేసుకొందునని చెప్పినాడు. తల్లి దండ్రుల ఇష్టము ననుసరించి జరుగు వివాహములు శుభప్రదములు. ఎంత మంచి సంబంధమని తోచినను స్వతంత్రించి చేసికొనుట ఉచితముకాదు. అంత మంచిదైనప్పుడు తల్లిదండ్రులు మాత్రము ఏల సమ్మతింపరు?]

జనకుడు దశరథుని యొద్దకు దూతలను పంపినాడు. అందులో కూడ చాల మెలకువతో వర్తించినాడు. కుమారులు విశ్వామిత్రుని రక్షణలో ఉన్నారని చెప్పి పంపినాడు.

మునిగుప్తౌచ కాకుత్థ్సౌ కథయంతు నృపాయవై. బాల 67-25

[విశ్వామిత్రుడు ఇష్టపడిన సంబంధ మని దశరథునికి తెలిసినచో దశరథుడు తప్పక సమ్మతించునని జనకుడు నమ్మినాడు. విశ్వామిత్రుని మాటకు అంత విలువ!

[ఇంత సన్నాహము చేయవలసివచ్చినది. కార్యము సులభముగా కాలేదు. జనకుడు దశరథుని యొద్దకు దూతలను పంపినాడు. వారు మరలివచ్చువరకు 'దశరథు డేమనునో' అని కొంత దిగులుతోనే జనకుడు కాలము గడపియుండును.]

జనకుని దూతలు మూడు రాత్రులు వడిగా ప్రయాణము చేసి అయోధ్యకు పోయి జనకుని సందేశమును దశరథునికి నివేదించినారు.

[ఈ మాటల పొందిక గమనింపదగియున్నది.]

**దూతలు:** మహారాజా! మిథిలాధిపతియగు జనకమహారాజు "మీకును మీ అగ్నిహోత్రములకును ఋత్విజులకును ఉపాధ్యాయునకును పరివారమునకును క్షేమమేనా! అందరు అనామయులై యున్నారుగదా" అని స్నేహభావముతోను మధుర వచనములతోను మాటిమాటికి అడుగుచున్నాడు.

జనకమహారాజుగారు మీ క్షేమ మడిగి విశ్వామిత్రుని అనుమతితో ఈ మాట మీతో మనవిచేయుమన్నారు.

పృష్ట్వా కుశల మవ్యగ్రం వైదేహో మిథిలాధిపః
కౌశికానుమతే వాక్యం భవంత మిదమబ్రవీత్. 68-6

[విశ్వామిత్రుని అనుమతిని గురించి విశేషముగా ఊది పలుకుచున్నారు!]

"నేను నా పుత్రికను పరాక్రమము ప్రదర్శించిన వానికే ఇచ్చునట్లు ప్రతిజ్ఞ చేసి యుంటినిగదా! నా భాగ్యవశమున విశ్వామిత్రుని పురస్కరించుకొని మిథిలకు వచ్చిన నీ కుమారుడు తన పరాక్రమముచే శివధనుస్సును విరిచి నా ప్రతిజ్ఞను పాలించినాడు. నేను నా కొమారిత యగు సీతను రామునికిచ్చి నా ప్రతిజ్ఞ నెరవేర్పగోరుచున్నాను. మీ రందుకు అనుజ్ఞ నీయవలసినదిగా ప్రార్థించుచున్నాను.

అస్మైదేయా మయా సీతా వీర్యశుల్కా మహాత్మనే
ప్రతిజ్ఞాం కర్తు మిచ్ఛామి తదనుజ్ఞాతు మర్హసి. 68-10

మీరు బంధు మిత్ర పురోహిత సమేతులై శీఘ్రమున వచ్చి మీ పుత్రులను చూడవచ్చును. మీ రాకచే అందరికి సంతోషము కలుగును"

మహారాజా! విశ్వామిత్రుని అనుమతితోను, శతానందుని సమ్మతితోను జనక మహారాజుగారు మీ కీ విన్నపమును పంపినారు.

ఈ మాటలు విని దశరథుడు పరమానందము పొంది వసిష్ఠునితోను, వామదేవాదులతోను దూతల వార్తను చెప్పినాడు.

*దశర :* మన రామలక్ష్మణులు విశ్వామిత్రునిచే రక్షింపబడుచు మిథిలలో ఉన్నారట!

[రాక్షసులతో యుద్ధము చేయుటకు వెళ్ళిన కుమారులను తలచుకొని ఎంత తపించుచుండినాడో పాపము!]

మన రాముని పరాక్రమమును కన్నులార చూచి జనకమహారాజు తన కొమార్తెను రామునికీయ గోరుచున్నాడు. ఈ సంబంధము మీకును ఇష్టమగునేని అందరము మిథిలకు బయలువెడలుదము. రేపే ప్రయాణము. మీ అభిప్రాయమేమి?

[సంబంధము తనకు నచ్చిన దని తేటపరచినాడు. రేపే ప్రయాణము అనియు చెప్పినాడు. వారి అభిప్రాయము మాటవరుసకు అడిగినట్లే అయినది. గొప్పవారి సంప్రతింపుల పద్ధతే అంత!]

దశరథుని మాటకు అందరు సమ్మతించినారు..

[ఈ పట్టున మనము గమనింపదగిన విషయ మొకటి ఉన్నది. దశరథుడు తన కుమారుల వివాహమును గురించి ఆలోచించుచుండగా వచ్చినాడు విశ్వామిత్రుడు. పెండ్లి మాటలకు ఒక విధముగా అంతరాయము కలిగినట్లు తోపజేసి రాక్షసులతో యుద్ధము చేయుట కని రామలక్ష్మణులను వెంటబెట్టుకొని వెళ్ళినాడు. శుభమా అని పెండ్లి గురించి మాటలాడు సమయమున ఇంత విపరీతము జరిగినది. పెండ్లిమాట లెక్కడ! రాక్షసులతో యుద్ధ మెక్కడ! కుమారుల క్షేమమును గురించి దశరథునికి భయము కలుగునంతటి పని చేసినాడు విశ్వామిత్రుడు. పర్యవసానములో మంచి సంబంధము కుదిర్చి పెండ్లికి తరలి రమ్మని చెప్పి పంపినాడు. వచ్చినవారు జనకుని దూతలైనను కార్యము మాత్రము విశ్వామిత్రునిదే. ఇందులో సందేహములేదు. కార్యగతులు ఇట్లుండును. మనము తలపెట్టిన పనికి ప్రతికూలముగ కనబడు సందర్భములద్వారా భగవంతుడు తరచుగా మన పనులను చక్కపరచుచుండును. కావున అన్ని సందర్భములయందును మనము ధైర్యము కలిగియుండవచ్చును.]

## దశరథుడు పరివార సమేతుడై మిథిలకు పోవుట

మరునాడు దశరథుడు ప్రయాణమునకు కావలసిన ఏర్పాటులను చేసినాడు.

*దశర :* సుమంత్రా! ధనము, రత్నములు, వెలగల వస్తువులు పుష్కలముగా తీసికొని మన కోశాధికారులు ముందు నడచునట్లు ఏర్పాటు చేయుము. చతురంగ బలములను ప్రయాణమునకు సిద్ధపరుపుము. వసిష్ఠుడు, వామదేవుడు మున్నగు బ్రాహ్మణోత్తములను ప్రయాణమునకు సంసిద్ధులగునట్లు హెచ్చరింపుము.

దశరథుని మాటకు అందరు సమ్మతించినారు.

అందరు బయలుదేరి మిథిలకు చేరినారు. జనకునికి పట్టరాని ఆనందము కలిగినది. దిగులు తీరిపోయినది. దశరథచక్రవర్తికి ఎదురేగి స్వాగత మిచ్చినాడు.

*జనకుడు :* మహారాజా! మీకు స్వాగత మగునుగాక! మా భాగ్యవశమున మీరిచ్చటికి దయచేసితిరి. కుమారుల పరాక్రమమువలన కలిగిన సంతోషమును మీ రనుభవింతురుగాక.

> స్వాగతం తే మహారాజ ! దిష్ట్యా ప్రాప్తోఽసి రాఘవ
> పుత్రయో రుభయోః ప్రీతిం లప్స్యసే వీర్యనిర్జితామ్. 69-9

మా భాగ్యవశముననే మహాప్రభాపూర్ణుడైన వసిష్ఠభగవానుడు నూరు యజ్ఞములు చేసిన దేవేంద్రునివలె ఇచ్చట వెలసినాడు. మహారాజా! మా భాగ్యవశమున విఘ్నము లన్నియు జయింపబడినవి. విక్రమ సంపన్నులగు రఘుమహావంశము వారితో సంబంధము కుదిరి నా కులము ప్రశస్తమైనది.

> దిష్ట్యా ప్రాప్తో మహాతేజా వసిష్ఠో భగవానృషిః
> సహ సర్వై ర్ద్విజశ్రేష్ఠై ర్దేవైరివ శతక్రతుః. 69-10

> దిష్ట్యా మే నిర్జితా విఘ్నా దిష్ట్యా మే పూజితం కులమ్
> రాఘవైః సహ సంబంధా ద్వీర్యశ్రేష్ఠై ర్మహాత్మభిః. 69-11

రేపు ఉదయమున యాగాంతమున ఋషులకు సమ్మతమగునట్లు వివాహము జరుపుదము.

> శ్వః ప్రభాతే నరేంద్రేంద్ర నిర్వర్తయితుమర్హసి
> యజ్ఞస్యాంతే నరశ్రేష్ఠ వివాహ మృషి సమ్మతమ్. 69-12

*దశర :* జనకమహారాజా! ఇచ్చువారు మీరు. పుచ్చుకొనువారము మేము. ప్రతిగ్రహము దాత అధీనముగదా! కావున తాము ఎప్పు డిత్తురో అప్పుడు ప్రతిగ్రహింతుము. మీరు సకల ధర్మములు తెలిసినవారు. మీరు చెప్పినట్లే అగునుగాక!

> ప్రతిగ్రహో దాతృవశః శ్రుత మేత న్మయాపురా
> యథావక్ష్యసి ధర్మజ్ఞ తత్కరిష్యామహే వయమ్. 69-15

దశరథుని అద్భుత వాక్యములను విని జనకుడు ఆశ్చర్యపడినాడు. వసిష్ఠుడు విశ్వామిత్రుడు మున్నగు మునులందరు పరస్పర సల్లాపములతో సంతోషము ననుభవించుచుండిరి. దశరథుడు కుమారులను చూచి ఆనందపరవశుడైనాడు. యజ్ఞసంబంధముగా నిలిచియుండిన కార్యకలాపమును జనకుడు పూర్తికావించి కొమారితల వివాహ

# పరశురాముడు

దశరథుడు అయోధ్యకు ప్రయాణము సాగించుచుండగా ఉన్నట్లుండి చీకట్లు క్రమ్మినవి. సైన్యము మూర్ఛపోయినది. దశరథుడు, దశరథుని పుత్రులు, వసిష్ఠాది ఋషులు, వీరుమాత్రము స్పృహకలిగి యుండినారు. ఈ వింతయేమిటా అని చూడగా పరశురాముడు కనుపించినాడు. చేతిలో గొప్పవిల్లు ధరించి యున్నాడు. వసిష్ఠాది ఋషులు పరశురామునికి అర్ఘ్యపాద్యాదుల నిచ్చి పూజించినారు. పరశురాముడు విల్లు చేతబూని శ్రీరాముని సమీపించి.

పరశు : రామా ! నీ వీర్యమును గురించి విన్నాను. శివధనుస్సునే విరిచినావటగా ! నేను మరియొక ధనుస్సు తెచ్చినాను. మా తండ్రి నాకు ప్రసాదించినది. దీనిని పూరించి నీబలమును ప్రదర్శింపుము - అటుపైన నీతో ద్వంద్వ యుద్ధము చేయుదును.

ఈ మాటలను విని దశరథుడు వణకిపోయినాడు.

దశర : (దీనుడై) బ్రాహ్మణోత్తమా ! క్షత్రియులపై కోపము చాలించి శాంతుడవైతివి గదా ! నీవు బ్రాహ్మణుడవు. గొప్ప కీర్తికలవాడవు. నా పుత్రులు కేవల బాలురు. దయచేసి వీరికి అభయ మొసంగుము.

క్షత్రరోషా త్ప్రశాంత స్త్వం బ్రాహ్మణశ్చ మహాయశాః
బాలానాం మమపుత్రాణా మభయం దాతు మర్హసి 75-6

ఇంద్రునియొద్ద ప్రతిజ్ఞచేసి శస్త్రమును విసర్జించితివి గదా ! భూమండలమును కాశ్యపున కిచ్చి మహేంద్రపర్వతము మీద నివసించుచున్నావు. ఇప్పుడు నన్ను నాశనము చేయుట కేల వచ్చితివి ? మా రాముడు గతించునేని మేమందరము హతుల మైనట్లే.

పరశురాముడు ఈ దీనాలాపములు వినిపించుకొనలేదు. రామునితోనే మాటలాడుచున్నాడు.

పరశు : రామా ! నీవు విరిచినది శివధనుస్సు గదా ! నేను తెచ్చినది విష్ణుదేవుని ధనుస్సు. పూర్వకాలమున శివునికి విష్ణుదేవునికి విరోధము కలిగినప్పుడు విశ్వకర్మ రెండు ధనుస్సులను నిర్మించి చెరియొకటి ఇచ్చినాడు. ఇద్దరు వారివారి ధనుస్సులను ప్రయోగించినారు. శివుని విల్లు జడమైపోగా అతడు కోపించి ఆ ధనుస్సును దేవరాతుని కిచ్చినాడు. నీవు విరిచిన ధనుస్సు అదియే. విష్ణుదేవుని ధనుస్సును ఎక్కుపెట్టగలవేమో చూడుము.

**రాముడు :** (దశరథుని యందలి ప్రీతిచే కొంతవినయముగా) పరశురామా! నీ విదివరలో చేసినపనులను గురించి విని నిన్ను మెచ్చుకొన్నాను. ఇప్పుడు నీవు నన్ను అవమానింప గోరుచున్నావు. ఇట్టి అవమానమును నే నెంతమాత్రము సహింప జాలను. నా పరాక్రమమును ప్రదర్శింపు మనియేనా నీ పడుగుట ? చూడుము. ఈ మాటలు పలికి శ్రీరాముడు పరశురాముడు తెచ్చిన ధనుస్సును మోపెట్టి బాణమును సంధించినాడు.

**రాముడు :** పరశురామా! చూచితివా! ఈ బాణమును నీమీద ప్రయోగించుటకు మనసు వచ్చుటలేదు. నీవు బ్రాహ్మణుడవు. మహాత్ము డైన విశ్వామిత్రుని స్మరించి బ్రాహ్మణుడ వైన నిన్ను విడిచి పుచ్చుచున్నాను. అయినను ఈ బాణము అమోఘ మని నీవును ఎరుగుదువు గదా! దీనితో నీ పాదగతిని కొట్టుమందువా లేక నీ తపఃఫలమును హతము చేయుమందువా చెప్పుము.

**పరశు :** (శ్రీరాముని అపారతేజస్సును గుర్తించి) రామా! నేను భూమినంతటిని కాశ్య పున కిచ్చి మహేంద్రపర్వతముమీద వాసము చేయున్నాను. ఈ భూమిలో నాకు చోటులేదు. నేను నా వాసస్థానమగు పర్వతముమీదికి పోవలసియున్నది. కావున నా పాదగతిని కాపాడుము. నేను తపస్సుచే ఆర్జించిన లోకములమీదనే బాణ మును ప్రయోగింపుము. ఈ ధనుస్సును ఆరోపించినప్పుడే గ్రహించితిని, నీవు విష్ణుదేవుడవే అని.

> అక్షయ్యం మధుహంతారం జానామి త్వాం సురేశ్వరమ్
> ధనుషోఽస్యపరామర్శా త్స్వస్తితేఽస్తు పరంతప. 76-17

రామా! నీకు మంగళ మగునుగాక! నీవు త్రైలోక్యనాథుడవు. నీచే నా కిట్టి పరాభవము కలిగినదని నేనెంతమాత్రము సిగ్గుపడుటలేదు.

> నచేయం మమకాకుత్స్థ వ్రీళాభవితు మర్హతి
> త్వయా త్రైలోక్యనాథేన యదహం విముఖీకృతః. 76-19

రామా! నీవు బాణమును విడిచి నా తపోధనమును కొట్టుము. నేను మహేంద్ర గిరికి త్వరగా పోవలెను.

శ్రీరాముడు బాణమును విడిచి పరశురాముడు తపస్సుచే ఆర్జించిన లోకములను కొట్టినవెంటనే పరశురాముడు మహేంద్రగిరికి అరిగినాడు. అంతట దిక్కు లన్నియు ప్రకాశించినవి. దేవతలు, ఋషులు రాముని ప్రశంసించినారు. పరశురాముడు తెచ్చిన ధనుస్సును రాముడు వరుణదేవుని కిచ్చినాడు.

[పరశురామావతారము ముగిసినది. శ్రీరామావతారము ప్రారంభ మైనది.]

శ్రీరాముడు వసిష్ఠాదులకు నమస్కరించి, భయపడియుండిన తండ్రిని జూచి

రాముడు: తండ్రీ! భయముతో పనిలేదు. పరశురాముడు ఇక్కడలేడు. తన నెలవుకు వెళ్ళినాడు. మనము అయోధ్యకు పోవుదము. మన సైన్యములకు తగిన ఉత్త రువు లిచ్చి ప్రయాణమునకు అనుజ్ఞ నిండు.

## దశరథుడు మున్నగువారు అయోధ్యకు పోవుట

దశరథుడు ఆనంద పరవశుడై రాముని శిరము మూర్కొని పుత్రునికిని తనకును పునర్జన్మ లభించినట్లు సంతోషించి ప్రయాణము సాగించి పరివారముతో కూడ అయోధ్య చేరినాడు. పౌరుల ఆనందమునకు మేరలేదు. అందరు రాజును పూజించినారు.

కౌసల్య సుమిత్ర కైకేయి మున్నగు రాజస్త్రీ లందరు క్రొత్త కోడండ్రకు మర్యాదలు చేసి లోనికి గొనిపోయి వారికి పట్టుచీరలను కట్టించి మంగళకర మగు అలం కారములు చేయించినారు. ఆ కోడండ్రు గృహ దేవతాదులను శ్రద్ధాభక్తులతో పూజించినారు.

అటుపైన వారివారికి ప్రత్యేకముగా ఏర్పాటుచేయబడియుండిన గృహములలో ప్రవేశించి ధనధాన్యములు బ్రాహ్మణుల కిచ్చి పూజించి వారి ఆశీర్వాదములను బడసి తమతమ భర్తలతో సుఖముగా కాలము గడపుచుండినారు.

[రహస్యముగా భర్తలతో కూడి క్రీడించుచుండిరి—అని వాల్మీకిమహర్షి శృంగార రస మును ముచ్చటగా వర్ణించినారు.]

రేమిరే ముదితా స్సర్వా భర్తృభి స్సహితా రహః 77-14

రాజకుమారులు తమతమ పనులయందు శ్రద్ధవహించి శుశ్రూష చేయుచు తండ్రిని అనుసరించి వర్తించుచుండిరి.

[భార్యల మాటలలో పడి తల్లిదండ్రులను మరచిపోలే దన్నమాట.]

కొంతకాలమైన పిదప దశరథుడు భరతుని పిలిచి "నాయనా! నిన్ను తోడ్కొని పోవుటకు మీ మేనమామ వచ్చియున్నాడు. మీ మాతామహుడు నిన్ను చూడగోరు చున్నాడట వెళ్లివత్తువా" అన్నాడు.

భరతుడు మాతామహుని నగరమునకు ప్రయాణమైనాడు. శత్రుఘ్నుడు భర తుని అనుసరించి వెళ్ళినాడు.

రామ లక్ష్మణులు అయోధ్యలో ఉండి తండ్రికి, తల్లులకు సేవలు చేయుచు గురువులను పూజించుచు తమ కల్యాణ గుణములచే పురజనులను రంజింపజేయుచు కాలమును సుఖముగా గడపుచుండినారు.

## సీతారాముల దాంపత్యము

[సీతారాముల దాంపత్య జీవితమును, వారి పరస్పర ప్రేమను మహర్షిగారు అయిదు శ్లోకములలో వర్ణించియున్నారు. అవి వెలలేని రత్నములు. అందరు శ్రద్ధగా చదివి ఆనందింపదగి యున్నవి.]

రాముడు సీతయందు మనస్సు నిలిపి తాను ఆమె మనస్సునందు ఎల్లప్పుడు నిలిచియుండి సీతతోకూడ అనేక ఋతువులు క్రీడించెను.

రామస్తు సీతయాసార్థం విజహార బహూనృతూన్
మనస్వీ తద్గత స్తస్యా నిత్యం హృది సమర్పితః. 77-25

రామునికి సీతయందుండిన ప్రీతికి మూడు కారణములు, మొదటిది తండ్రి కూర్చిన భార్యగనుక; రెండవది సీతాదేవి గుణములు; మూడవది సీతాదేవి సౌందర్యము.

మొదటి కారణమువలన కలిగిన ప్రీతిని మిగిలినవి వృద్ధిపరచినవి.

[కారణముల వరుస క్రమము గమనింపదగియున్నది. సౌందర్యము కడపటిది!]

ప్రియాతు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి
గుణా ద్రూపగుణాచ్చాపి ప్రీతిర్భూయోఽభ్యవర్ధత 77-26

[శ్రీరామునికి సీతాదేవియెడగల ప్రేమను పైశ్లోకములో చెప్పి సీతాదేవికి భర్తయెడ గల ప్రేమను ఈ క్రింది శ్లోకములో వర్ణించారు]

రామునికి సీతయందుగల అనురాగముకంటె రెండింతలుగా రామునిమీద ప్రేమ సీతాదేవి హృదయమునందు ఉండినది.

తస్యాశ్చ భర్తా ద్విగుణం హృదయే పరివర్తతే 77-27

[ఈవిధముగా సీత హృదయములో ఉండిన అనురాగము రామునికెట్లు తెలిసినది? అను మాటకు మహర్షి చెప్పిన సమాధానము వినదము.]

సీతాదేవి హృదయములోని భావమును రాముడు తన హృదయముచే స్పష్టముగా తెలిసికొనగలిగినాడు.

[మనసు మనసు కలిసినచో మాటలతో పని యేమి?]

అంతర్జాతమపి వ్యక్త మాఖ్యాతి హృదయం హృదా 77-27

[సరే! సీతకు తనయందుగల ప్రేమను రాముడు గ్రహించినాడు. మరి, రామునికి తన యందుగల ప్రేమను సీత తెలిసికొనెనా అను మాటకు సమాధానము ఈ క్రింది శ్లోకములో చెప్పబడియున్నది.]

దేవతా స్త్రీలతో సరివచ్చు సౌందర్యము కలిగి ఆకారము నొందిన లక్ష్మీదేవివలె విరాజిల్లుచున్న సీతాదేవి శ్రీరాముని ప్రేమను శ్రీరామునికంటె మిక్కిలి చక్కగా తెలిసికొన్నది.

తస్యభూయో విశేషేణ మైథిలీ జనకాత్మజా
దేవతాభి స్సమా రూపే సీతా శ్రీరివరూపిణీ 77-28

[సీతాదేవిని 'మైథిలీ జనకాత్మజా' అన్నారు మహర్షి. మైథిలీ అనుటలో మిథిలలో పుట్టుటవలన ఇంగితజ్ఞానము సహజముగా కలది అని సూచింపబడినది. 'జనకాత్మజా' అనుటలో జనకమహర్షి తనయ గనుక పాండిత్యమునకు లోటులేదు. కావున, శ్రీరాముని ప్రేమను అర్థము చేసికొనుటలో సీతాదేవికి కష్ట మేమి]

రాజర్షి సుతుడైన శ్రీరాముడు సౌందర్యవతియును అనురాగవతియును ఉత్తమ రాజకన్యయు అయిన సీతాదేవిని గూడి లక్ష్మీదేవిని గూడిన విష్ణుదేవుని వలె మిక్కిలి శోభిల్లినాడు.

తయా సరాజర్షిసుతోఽభిరామయా
సమేయివా నుత్తమ రాజకన్యయా
అతీవరామ శ్శుశుభేఽతికామయా
విభుశ్శ్రియా విష్ణురివా మరేశ్వరః 77-29

ఓం తత్సత్

శ్రీ రా మా య న మః.

# శ్రీమద్వాల్మీకి రామాయణ కథామృతము

## అ యో ధ్యా కాం డ ము

గచ్ఛతా మాతుల కులం భరతేన తదాఽనఘః
శత్రుఘ్నో నిత్య శత్రుఘ్నో నీతః ప్రీతి పురస్కృతః. అయోధ్య 1-1

భరతుడు శత్రుఘ్నుని కూడి తన మేనమామగారి ఇంటికి వెళ్ళి కేకయ రాజధాని యగు గిరివ్రజమున సుఖముగా కాలక్షేపము చేయుచున్నాడు. రామలక్ష్మణులు అయోధ్యయందే ఉన్నారు. దశరథునికి కుమారు లందఱిమీద ప్రేమ కలదు. కాని వారిలో రామునిమీద ఎక్కువ ప్రీతి. రామునిపై ప్రత్యేక ప్రేమ కలిగియుండుటలో వింత యేమియు లేదు. రాముని కల్యాణగుణములుగాని మోహనాకారముగాని అందఱిని ఆకర్షింపగలవు. రాముడు ఎల్లప్పుడు ప్రశాంతముగ ఉండువాడు. ఎప్పుడు గాని కఠినముగా మాటలాడడు. ఎవ్వరిని చూచినను మృదువుగా పెచ్చరించుకొనును. ఇతరులు పరుషముగా పలికినను రామునికి కోపమురాదు.

సతు నిత్యం ప్రశాన్తాత్మా మృదు పూర్వం ప్రభాషతే
ఉచ్యమానోఽపి పరుషం నోత్తరం ప్రతిపద్యతే. 1-10

రాముడు బుద్ధిమంతుడు - మధురముగా భాషించువాడు. అప్రియములు పలుకు వాడు కాడు. ఎవ్వరినైనను తానే ముందు పల్కరించువాడు.

బుద్ధిమా న్మధురా భాషీ పూర్వభాషీ ప్రియంవదః 1-13

[మాటలు అట్లుండవలయును. మన మెంత గొప్పవారమైనను మన ఎదుటికి వచ్చిన వానితో ఒక చల్లనిమాట పలికిన మాత్రమున మనకు కలుగు హాని యేమియులేదు. ఎదుటి వాడు ఎంతో సంతోషించును.]

కిరణములచే సూర్యుడు వెలుగునట్లు కల్యాణ గుణములచే శ్రీరాముడు ప్రకాశించెను.

తథా సర్వప్రజాకాంతైః ప్రీతిసంజననైః పితుః
గుణై ర్విరురుచే రామో దీప్త సూర్య ఇవాంశుభిః 1-33

శ్రీరాముని గుణగణములను చూచి భూదేవి సైతము రాముని పతిగా కోరినది.

## దశరథుడు శ్రీరాముని యువరాజు జేయగోరుట

ఇట్టి సుగుణ సంపన్నుడైన రాముని చూచి, ముసలివాడగుచున్న దశరథునికి ఒక ఆలోచన పొడమినది. "నేను జీవించియుండగనే రాముని భూమండలమునకు రాజును చేసినయెడల బాగుండును. దీనికి మార్గ మేమి?" అని తలపోసినాడు.

అథ రాజ్ఞో బభూవైవం వృద్ధస్య చిరజీవినః
ప్రీతిరేషా కథం రామో రాజా స్యా న్మయి జీవతి. 1-36

మహీ మహా మిమాం కృత్స్నా మధితిష్ఠన్త మాత్మజమ్
అనేన వయసా దృష్ట్వా యథా స్వర్గ మవాప్నుయామ్. 1-49

మంత్రులతో ఆలోచించి రాముని యువరాజు జేయుట మంచిదని నిశ్చయించినాడు.

నిశ్చిత్య సచివై స్సార్థం యువరాజ మమన్యత. 1-41

దశరథు డిట్లు నిశ్చయించి సామంతరాజులను నానా నగరవాసులను జానపదులను, స్నేహితులను అయోధ్యకు పిలిపించినాడు. కాని కేకయరాజుకును, జనకమహారాజుకును ఆహ్వానములు పంపలేదు. "అభిషేకము జరిగిన పిమ్మట ఈ శుభవార్తను వారు వినగలరు" అని సరిపెట్టుకొన్నాడు.

నతు కేకయరాజానం జనకంవా నరాధిపః
త్వరయా చానయామాస పశ్చాత్తౌ శ్రోష్యతః ప్రియమ్. 1-47

వారిద్దరుతప్ప మిగిలిన వారందరు వచ్చినారు. అందరు రాజసభలో సమావిష్టులైనారు.

*దశరథుడు:* రాజులారా! ప్రజలారా! ఈ రాజ్యమును మా పూర్వులు ఎంత ప్రీతితో పరిపాలించిరో మీకు తెలిసియే యున్నది. నేను సైతము వారి మార్గము ననుసరించి నాశక్తికొలది ప్రజారక్షణ కార్యమును నిర్వహించితిని. ఇప్పుడు నేను ముసలివాడనై విశ్రాంతి కోరుచున్నాను. మీ రందరు సమ్మతించినచో ఈ రాజ్య భారమును నా జ్యేష్ఠ కుమారు డగు రామునికి అప్పగింపవలయు నని ఆశపడుచున్నాను. రాముని గుణగణములు మీకు తెలియనివికావు. నా కోరికను మీరు అంగీకరింతురేని నా బాధకూడ తీరిపోవగలదు.

గతక్లేశో భవిష్యామి సుతే తస్మి న్నివేశ్యవై. 2-14

నాకు తోచిన మాటను చెప్పితిని. ఇంతకంటె మేలైన ఆలోచన మీకు తోచినయెడల వినుటకు సిద్ధముగా నున్నాను.

*రాజులు-ప్రజలు :* (ఆలోచించుకొని ఒక నిర్ణయమునకువచ్చి) మహారాజా! మీకు వయసు చెల్లినమాట వాస్తవము. రామునికి యౌవరాజ్యాభిషేకము చేయుట మాకందరికి ఇష్టముగా నున్నది. కావున మీరు చెప్పినట్లే కానిండు.

*దశరథుడు :* రాజులారా! ప్రజలారా! నేను మాట చెప్పియు చెప్పకపూర్వమే మీరెల్లరు సరే' అనుచున్నారు. ధర్మమార్గమున నేను రాజ్యమును పాలించుచుండగా రాముని యువరాజు చేయుట మేలని చెప్పుచున్నారు. మీ మాటలు వినగా నాకొక సందేహము కలిగినది. నా పరిపాలనలో లోపము లేమైన ఉన్నవా?

[నేను ఎంత శీఘ్రముగా తొలగిపోయిన అంత మంచిది అన్నట్టుగా ఉన్నది మీ ఉరవడి]

*సభవారు :* మహారాజా! అదికాదు మా అభిప్రాయము. నీ కుమారుడగు శ్రీరాముని యందు సకల కల్యాణగుణములు నెలకొనియున్నవి.

బహవో నృప! కల్యాణగుణాః పుత్రస్య సన్తి తే 2-26

శ్రీరాముని గుణములను వినుడు.

[పుత్రుని గొప్పతనమునుగూర్చి ఇతరులు కీర్తింపగా వినుటకంటె మించిన ఆనందము తండ్రికి ఏమియుండగలదు? ఇట్టి మాటలు సభవారి నోట విని ఆనందించుటకే దశరథుడు చమత్కారముగా వారిని ప్రశ్నించియుండును. దశరథుడు మంచి మాటకారి]

మహారాజా! శ్రీరాముడు సత్యపరాక్రముడు. ఇక్ష్వాకువంశస్థు లందరిలో మేటి యనదగినవాడు. అందరియందును దయగలవాడు. ప్రజలను స్వజనులవలె ఆదరించువాడు. ఎవ్వనికైనను దుఃఖము కలిగినప్పుడు తానుకూడ వానితో సమానముగ దుఃఖపడువాడు. ఎవ్వరైనను ఉత్సవములు చేసికొనునప్పుడు వారిని చూచి కన్నతండ్రివలె సంతోషించువాడు. సర్వదా నవ్వుముఖమువాడు. ఎదురుపడినవారిని ముందు పలుకరించువాడు. ధర్మమును విడనాడనివాడు. ఇంద్రియములను జయించినవాడు. ప్రజాపరిపాలన రీతి చక్కగా తెలిసినవాడు. ముల్లోకములను పాలింప సమర్థుడు. అట్టి శ్రీరామునికి ఈ భూమండలమును పాలించుట పెద్దపనికాదు. లోకాభిరాముడైన శ్రీరాముడు మాకు ప్రభువుగా నుండుట మాకు ఆనందదాయకము. చిన్న, పెద్ద, స్త్రీలు, పురుషులు అను భేదములేక రాష్ట్రములోని ప్రజ లందరు శ్రీరాముని క్షేమము నుద్దేశించి ప్రతి ఉదయమునను సాయంకాలమునను తమ ఇష్టదేవతలను ప్రార్థించుచున్నారు. శ్రీరాముడు మాకు ప్రభువైనచో అంతకంటె మాకు కావలసిన దేమియు లేదు. కావున మేమందరము ఏకగ్రీవముగా మనవి చేయుచున్నాము. శ్రీరామునికి పట్టాభిషేకము జరిపింపవలసినదని ప్రార్థించుచున్నాము.

దివ్యై ర్గుణై శ్శక్ర సమో రామ స్సత్య పరాక్రమః
ఇక్ష్వాకుభ్యోఽపి సర్వేభ్యో హ్యాతిరిక్తో విశాంపతే. 2-28

మృదుశ్చ స్థిరచిత్తశ్చ సదా భవ్యోఽనసూయకః
ప్రియవాదీచ భూతానాం సత్యవాదీచ రాఘవః 2-32

పౌరాన్స్వజనవన్నిత్యం కుశలం పరిపృచ్ఛతి
పుత్రే ష్వగ్నిషు దారేషు ప్రేష్యశిష్య గణేషుచ 2-38

వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః
ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి 2-40

స్మితపూర్వాభి భాషీచ ధర్మం సర్వాత్మ నాశ్రితః 2-42

రామో లోకాభిరామోఽయం శౌర్యవీర్యపరాక్రమైః
ప్రజాపాలనతత్వజ్ఞో న రాగోపహతేంద్రియః 2-44

శక్త స్త్రైలోక్యమప్యేకో భోక్తుం కింను మహీ మిమామ్ 2-45

స్త్రియో వృద్ధా స్తరుణ్యశ్చ సాయం ప్రాత స్సమాహితాః
సర్వా న్దేవా న్నమస్యన్తి రామస్యార్థే యశస్వినః 2-52

ఈ మాటలువిని దశరథుడు మిక్కిలి సంతోషించినాడు. తన అభిప్రాయమును ప్రజ లందరు అంగీకరించుటయేగాక మెచ్చుకున్నారు. ఇక ఆలస్య మెందుకు?

దశరథుడు తన పురోహితులైన వసిష్ఠ వామదేవులతో అనుచున్నాడు.

*దశరథుడు:* ఈ చైత్రమాసము మిక్కిలి శుభకరమైన మాసము. రాముని యౌవరాజ్య పట్టాభిషేకమునకు కావలసి వాని నన్నిటిని సిద్ధము చేయింపుడు.

చైత్ర శ్శ్రీమా నయం మాసః పుణ్యః పుష్పిత కాననః
యౌవరాజ్యాయ రామస్య సర్వమే వోపకల్ప్యతామ్ 3-4

ఈ మాటలు విని ప్రజలు జయజయ ధ్వానములు చేసినారు. జరుపవలసిన కార్య కలాపమును గూర్చి దశరథుడు ఆజ్ఞాపించుచున్నాడు.

*దశరథుడు:* రత్నములు, సువర్ణము, ఓషధులు, పుష్పములు, వస్త్రములు, రథములు, చతురంగబలములు, శుభలక్షణశోభితమైన ఏనుగు, ఛత్ర చామరములు, సువర్ణ శృంగముల వృషభము, వ్యాఘ్రచర్మము, ఇంకను కావలసిన ఇతర వస్తువులను సిద్ధము చేయుడు. పట్టణ ద్వారములను అంతఃపుర ద్వారములను అలంకరించి సువాసనలుగల ధూపములను వేయించవలయును. బ్రాహ్మణులకు భోజన

వసతులు కావింపుడు. సూర్యోదయ వేళకు స్వస్తివాచనము పర్వాటు చేయుడు. రాజమార్గములందు శీతల జలములు చల్లించి పతాకముల నెత్తింపవలయును. గణికలు అలంకరించుకొని వారికి నియమింపబడిన ప్రదేశములలో ఉండ వలయును. మంచి ఉడుపులను ధరించిన యోధులు రాజాంగణమున సంసిద్ధులై యుండునట్లు పర్వాటు కావింపుడు.

వసిష్ఠుడు, వామదేవుడు దశరథుని ఆజ్ఞానుసారము అన్ని యేర్పాట్లను చేసి ఆ విషయమును దశరథునికి నివేదించి వెళ్లినారు.

నానాదేశాధిపతులతో శోభిల్లుచుండిన కొలువుకూటమున దశరథుడు సింహాస నాసీనుడై సుమంత్రునితో అనుచున్నాడు.

*దశరథుడు :* సుమంత్రా ! నీవు త్వరగా వెళ్లి రాముని తోడ్కొని రమ్ము.

## శ్రీరాముడు దశరథుని యొద్దకు వచ్చుట

సుమంత్రుడు వెళ్లి రాముని రథముపై నెక్కించుకొని వచ్చినాడు.

[రథస్థుడైన రాముని వాల్మీకిమహర్షి అద్భుతముగా వర్ణించియున్నారు.]

దశరథుడు మేడమీద కూర్చుండి రథస్థుడైన రాముని తిలకించుచున్నాడు. శ్రీరాముడు గంధర్వ రాజువలె శోభిల్లుచున్నాడు. ఆజానుబాహుడు. చూచుటకు ఎంతో ముచ్చటగా ఉన్నాడు. పురుషులను కూడ ఆకర్షింపగల మోహనాకారుడు. తన రూపముచేత వారి చూపులను, గుణములచేత మనస్సులను అపహరించువాడు. ప్రజలకు సుఖము చేకూర్చి వారి హృదయములను రంజిల్లజేయువాడు.

ఇట్టి శ్రీరాముని ఎంతచూచినను దశరథుడు తృప్తి జెందలేదు. మరిమరి చూడ వలయు ననియే ఉన్నది.

గంధర్వరాజ ప్రతిమం లోకే విఖ్యాత పౌరుషమ్
దీర్ఘబాహుం మహాసత్త్వం మత్తమాతంగ గామినమ్ 3.27

చంద్రకాంతాననం రామ మతీవ ప్రియదర్శనమ్
రూపౌదార్య గుణైః పుంసాం దృష్టి చిత్తాపహారిణమ్ 3.28

ఘర్మాభితప్తాః పర్జన్యం హ్లాదయన్త మివ ప్రజాః
న తతర్ప సమాయాంతం పశ్యమానో నరాధిపః 3.29

సుమంత్రుడు శ్రీరాముని రథమునుండి దింపి దశరథుని యొద్దకు తీసికొని వెళ్లి నాడు. శ్రీరాముడు తండ్రికి నమస్కరించినాడు. దశరథుడు రాముని ఆలింగనము చేసి

కొని, ఉత్తమాసనమున కూర్చుండ బెట్టినాడు. రాముడు చిరునవ్వు నవ్వుచు ఆసీనుడై నాడు. సభ యంతయు శ్రీరాముని కాంతితో తేజరిల్లినది.

*దశరథుడు :* రామా! నీవు నా జ్యేష్ఠ భార్య పుత్రుడవు-గుణసంపన్నుడవు. నిన్ను యువ రాజు జేయు మని ప్రజలందరు కోరుచున్నారు. కావున నీవు పుష్య నక్షత్రమున యౌవరాజ్య పట్టాభిషేకము చేసికొనుము.

తస్మాత్త్వం పుష్యయోగేన యౌవరాజ్య మవాప్నుహి. 3-41

రామా! నీవు గుణనిధివి. అయినను తండ్రి నగుటచే చెప్పుచున్నాను. నీవు మరింత వినయము నవలంబించి జితేంద్రియుడవై యుండుము.

భూయో వినయ మాస్థాయ భవ నిత్యం జితేంద్రియః. 3-42

కామక్రోధముల వలన జనించు వ్యసనములను విసర్జింపుము. ప్రజలను చక్కగా పాలింపుము.

ఈ మాటలను విని రాముని స్నేహితులు కౌసల్య భవనమునకు పరుగెత్తి ఈ శుభవార్తను ఆమెకు తెలియజేసినారు. కౌసల్య ఆనందపరవశురాలై వారి కందరికి బహుమతు లిచ్చినది.

శ్రీరాముడు తండ్రికి నమస్కరించి రథ మెక్కి తన భవనమునకు వెళ్లినాడు. ప్రజ లందరు తమతమ గృహముల కరిగి ఇష్టదేవతలను పూజించినారు.

ప్రజలు వెళ్లిన పిదప దశరథుడు మరల తన మంత్రులతో ఆలోచించినాడు.

['ఆలోచించుట' యనగా మంత్రులను అడిగి వారి అభిప్రాయమును గ్రహించి అనుసరించుటకాదు. 'ఆలోచించుట' అనగా తన అభిప్రాయమును వారితో చెప్పి 'సరి' యని అనిపించుట మాత్రమే. గొప్పవారి 'ఆలోచనలు' తరచుగా ఈలాగే ఉండును!]

*దశరథుడు :* మంత్రులారా! రేపే పుష్యనక్షత్రము. రాముని అభిషేకము రేపే జరిపింపవలయును.

శ్వఏవ పుష్యో భవితా శ్వోఽభిషేచ్యస్తు మే సుతః. 4-2

[మంత్రులు కాదనగలరా!]

దశరథుడు కొలువు చాలించి అంతఃపురములోనికి వెళ్లినాడు. వెంటనే ఏమితోచినదోకాని సుమంత్రుని పిలిచి "సుమంత్రా! రాముని మరియొక పర్యాయము చూడవలెనని ఉన్నది. తోడ్కొనిరమ్ము" అని ఆజ్ఞాపించినాడు.

సుమంత్రుడు వెళ్ళి దశరథుని కోరికను శ్రీరామునికి తెలియపరిచినాడు. ఈ పిలుపు యెందుకైనది శ్రీరామునికి తెలియులేదు. సుమంత్రుడును చెప్పలేదు. అయినను శ్రీరాముడు వెంటనే బయలుదేరి పోయి తండ్రికి నమస్కరించినాడు. దశరథుడు శ్రీరాముని కౌగిలించుకొని భద్రాసనమున కూర్చుండబెట్టి అనుచున్నాడు.

*దశరథుడు* : రామా! నేను ఈలోకములోని సుఖముల నన్నిటిని అనుభవించినాను. ఎన్నో యజ్ఞములు, దానములు చేసినాను. ఇప్పుడు ముసలివాడ నైతిని. నీకు రాజ్యాభిషేకము చేయుటమాత్రమే మిగిలియున్నది. నిన్ను యువరాజు జేయుమని ప్రజ లందరు వేడుకొనుచున్నారు. నాకేమో స్వప్నమున ఉత్పాతములు కనబడుచున్నవి. రాజునకు మరణముగాని గొప్ప ఆపదగాని సంభవింపగలదని సూచితమగుచున్నది. నా బుద్ధి చలింపకపూర్వమే నీవు అభిషేకము చేసికొనుట మంచిది. మానవులబుద్ధి అతిచంచలము. ఈనాడు పునర్వసు నక్షత్రము. రేపు పుష్యమి. నీకు రేపే పట్టాభిషేకము చేయవలె నని తహతహ పడుచున్నాను. నీవు రేపే పట్టాభిషిక్తుడవు కమ్ము. నీవు నిశ్చలమైన మనస్సుతో దర్భలపై శయనించి భార్యాసమేతుడవై ఈరాత్రి ఉపవాసము చేయవలయును.

ఇట్టికార్యములకు అనేక విఘ్నములు కలుగగలవు. నీ స్నేహితులు నిన్ను రక్షింతురుగాక!

ఒకమాట—దూరదేశమునందున్న భరతు డిచ్చటికి రాకపూర్వమే నీపట్టాభిషేకము జరుగవలయునుసుమా! భరతుడు యోగ్యుడే - నీమీద ఎంతో గౌరవము కలవాడే - ధర్మబుద్ధిసైతము విశేషముగా కలిగియున్నవాడే - ఇందుకు సందేహమేమియునులేదు. అయినను మానవుల బుద్ధి స్థిరముగా ఉండదు. కావున నీవు జాగుచేయక రేపే పట్టాభిషేకము చేసికొనుట మంచిది. పని జరిగిపోయిన పిదప దానినిగురించి గొప్పవారు అంతగా పట్టించుకొనరు.

> తద్యావదేవ మే చేతో నవిముహ్యతి రాఘవ
> తావదేవాభిషించస్వ చలాహి ప్రాణినాం మతిః 4-20

> తతః పుష్యేఽభిషించస్వ మన స్త్వరయతీవమామ్
> శ్వ స్త్వాఽహ మభిషేక్ష్యామి యౌవరాజ్యే పరంతప 4-22

> తస్మాత్త్వయాఽద్యప్రభృతి నిశేయం నియతాత్మనా
> సహవధ్వోపవ స్తవ్యా దర్భప్రస్తర శాయినా 4-23

> సుహృదశ్చాప్రమత్తా స్త్వాం రక్ష న్త్వద్య సమ న్తతః
> భవ న్తి బహువిఘ్నాని కార్యా ణ్యేవంవిధానిహి 4-24

విప్రోషితశ్చ భరతో యావదేవ పురా దితః
తావదేవాభిషేకస్తే ప్రాప్తకాలో మతో మమ 4-25

కామం ఖలు సతాం వృత్తే భ్రాతా తే భరతస్థితః
జ్యేష్ఠానువర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేంద్రియః 4-26

కింతు చిత్తం మనుష్యాణా మనిత్యమితి మే మతిః
సతాంచ ధర్మనిత్యానాం కృతశోభిచ రాఘవ 4-27

[ ఈ ఘట్టమున మనము గమనింపవలసిన విషయములు కొన్నియున్నవి. దశరథుని బాధ యేమిటి? భరతుని గూర్చి చెప్పిన మాటలకు అర్థ మేమైన కలదా? రామునికి పట్టాభిషేకము చేయుటకు దశరథుడు తహతహ లాడుచున్నాడు. దశరథుడు ప్రజల అంగీకారమును పొందినాడు. అందరను ఆహ్వానించినాడు కాని కేకయభూపతికి గాని జనకమహారాజునకుగాని సమాచారముకూడ తెలియపరచలేదు. వసిష్ఠునంతటి పురోహితు డుండగా, వారితోకూడ ఆలోచింపకయే పట్టాభిషేకమునకు ముహూర్తము తానే స్వయముగా నిర్ణయించినాడు. ఈ పట్టాభిషేకమునకు ముహూర్తమును వసిష్ఠుడు పెట్టినాడను వాడుకమాటకు ఆధారములేదు. ముహూర్తమును గురించి వసిష్ఠులవారిని అడుగు ఓపికకూడ దశరథునికి ఉండినట్లు కనిపింపలేదు. రహస్య విషయము లన్నియు వసిష్ఠునికి తెలిసియుండును కావున వారితో సంప్రతించినచో ఏమి ప్రమాదము వచ్చునో యని భయపడి దశరథుడు ముహూర్తమును తానే నిర్ణయించి యుండును.

భరతుడు రాక పూర్వమే పట్టాభిషేకము జరుగవలయు నని చెప్పుచున్నాడు. భరతుడు వచ్చినచో ఏమి జరుగును? రాముని అభిషేకమునకు భరతుడు ఆటంకము కలుగజేయవలసిన కారణ మేమి? రాముని అభిషేకమునకును భరతుని మంచిచెడ్డలకును సంబంధ మేమి? అదియునుగాక పట్టాభిషేకము చేసికొను మని దశరథుడు రాముని బ్రతిమాలుకొనుచున్నాడు. దీనికి కారణ మేమి? రాజ్యాభిషేకము చేసికొనుటకు అంత ఒత్తిడి యెందుకు? "నా బుద్ధిమారక పూర్వమే అభిషేకము చేసికొనుము" అని దశరథుడు చెప్పవలసిన పని యేమి? దశరథుని బుద్ధి మారవలసిన కారణ మేమి?

ఈ సమస్య లన్నిటికి మనకు శ్రీరాముడే సమాధానము చెప్పియున్నాడు. శ్రీరాముని అయోధ్యకు తోడ్కొని వచ్చుటకు భరతుడు చిత్రకూటమునకు పోయినప్పుడు ఈ రహస్యమును శ్రీరాముడు భరతునికి చెప్పినాడు.

కైకేయి పెండ్లినాటిమాట. దశరథుడు కైకేయిని వివాహ మాడగోరినాడు. అప్పటికే ఇద్దరు భార్యలు ఉండినందున కేకయరాజు తన కొమారితను ఇచ్చుటకు ఉత్సాహపడలేదు కాబోలు! అంతట, కైకేయికి పుట్టిన కుమారునికే రాజ్య మిచ్చెద నని కేకయరాజుకు మాట ఇచ్చి దశరథుడు కైకేయిని వివాహ మాడినాడు.

పురా భ్రాతః పితా నస్స మాతరంతే సముద్వహన్
మాతామహే సమాశ్రౌషీ ద్రాజ్యశుల్క మనుత్తమమ్. అయోధ్య 107-3

నలుగురు కుమారులలోను దశరథునికి రామునిమీద ప్రేమ అధికము. కావున రామునికి ఎట్లయినను పట్టాభిషేకము చేయవలయునని దశరథునికి కోరిక కలిగినది. ప్రజలను సమావేశ పరచి వారి సమ్మతిని స్థిరపరచుకొన్నాడు. కేకయరాజును, జనకమహారాజును, ఆహ్వానించ లేదు. కేకయరాజు వచ్చి "పెండ్లినాటి ప్రమాణ మేమైనట్లు?" అని అడిగినచో ఏమి సమాధానము చెప్పగలడు? జనకుడు వచ్చి "నా అల్లుడు జ్యేష్ఠుడుకదా! అతనిని తప్పించి చిన్నవానికి పట్టాభిషేకము చేయుట ఎక్కడి న్యాయము?" అని అడిగినచో బదు లేమి చెప్పగలడు? జనకుని ఆహ్వానించి కేకయరాజునుమాత్రము పిలువకుండుట బాగుండునా? ఇట్టి ఆలోచనలు చేసికొని కాబోలు దశరథుడు వారిద్దరిని పిలుచుట మానుకొన్నాడు.

భరతునికి అతని మాతామహుడు ఈ రహస్యమును చెప్పియుండునేమో! భరతుడు వచ్చి ఎట్టి ఆటంకములు కలుగజేయునో! కావున భరతుడు రాకపూర్వమే కార్యము పూర్తియైనయెడల భరతుడు సమాధానపడి ఊరకుండును.

వసిష్ఠులవారికి రాజ్యశుల్కము విషయము తెలియకుండునా! పెండ్లిపెద్ద ఆయనే అయియుండును. పట్టాభిషేకమునకు ముహూర్తము నిర్ణయింపు డని వసిష్ఠుని అడిగినచో, అసత్యదోషమునుండి దశరథుని తప్పించుటకైనను వసిష్ఠుడు భరతుడు వచ్చువరకు కాల యాపన చేయునేని కార్యము చెడిపోవును. అందుచే ముహూర్తమును తానే నిర్ణయించినాడు. రాజు మాటను కాదని వసిష్ఠుడు అనడు.

ఈ రాజ్యశుల్కము సంగతి రామునికి సైతము తెలిసియుండవచ్చును. ఇందులో సందేహము లేదు. రాముడు చెప్పినందుననేకదా ఈ రహస్యము భరతునికిగాని మనకుగాని తెలియ వచ్చినది. దీని విషయము రామునికి తెలియు నని దశరథుడు ఊహించియుండును. ఈ రహస్యమును మనసునం దుంచుకొని "నాకు పట్టాభిషేకము వలదు" అని రాము డన్నచో దశరథుని కోరిక విఫలమై పోవును. ఇట్టిది కలుగకుండగలందులకే, పట్టాభిషేకము చేసికొను మని దశరథుడు రామునితో అనేక విధములుగా మాటిమాటికి చెప్పి తన కోరిక తీర్పు మని వేడుకొనుచున్నాడు. శ్రీరాముడు తండ్రిమాటలు విన్నాడు. కాని రహస్యమును బయటపెట్టి తండ్రిని నల్గురిలోను అవమానపరచు స్వభావము లేనివాడు గనుక తండ్రి మాటలకు అడ్డము పలుకలేదు. ధీరోదాత్తుడు కావున జరుగవలసిన పనులు దైవము నిర్ణయించునట్లు జరుగగల వని నమ్మి ధీరుడుగా వర్తించినాడు.

రాజ్యశుల్కము విషయము పెద్దవారిమధ్య జరిగిన పెండ్లిమాటలు గనుక కైకేయికి తెలిసియుండదు. పెండ్లి జరిగినపిదప, కైకేయి కొలువులో చేరినందున కాబోలు మంథరకు సైతము ఈ విషయము తెలిసినట్లు లేదు.

దశరథుడు అనేకవిధములుగా ఆలోచించి పెండ్లినాటి ప్రమాణమును అతిక్రమించుటకు తీవ్రప్రయత్నము చేయుచున్నాడు. శ్రీరాముని యందలి మోహమే దీనికి కారణము. దశరథుడు ధర్మాత్ముడు. ఈ విషయమున మాత్రము ధర్మపథమునుండి తొలగజూచినాడు.

కాని దైవము అడ్డుపడినందున అతని ప్రయత్నము విఫలమైనది. ఈ విధముగా మనకు తెలియకయే దైవము మనలను రక్షించుచుండును.

దశరథుడు కైకేయి భవనమునకు వెళ్లుటకూడ శ్రీరామ పట్టాభిషేకమునకు ఆమెను ఒప్పించుటకే అయియుండును. శ్రీరామునియెడ ఆమెకు మిక్కిలి ప్రీతి. రాముని పట్టాభిషేక సమాచారము వినుటవలన ఆమెకు సంతోషమే కలుగును. కావున ఆమెతో చెప్పుటవలన హాని కలుగదు. తరువాత భరతుడు వచ్చి ఆక్షేపించినను "మీ తల్లి సైతము సమ్మతించిన పనికి నీ ఆక్షేపణ యేమి'' అని సరిపెట్టవచ్చును.

మొత్తమునకు తాను తప్పుపని చేయుచున్నట్లు దశరథునికి తెలియును. అందుకే అంత బాధపడుచున్నాడు. పుత్రమోహమున చిక్కుకొని తన ప్రతిజ్ఞను అతిక్రమింపదలచినాడు. దీనిని గమనింపదగియున్నది.]

## శ్రీరాముడు కౌసల్యయొద్దకు పోవుట

దశరథుడు చెప్పిన మాటలను శ్రీరాముడు విని తండ్రియొద్ద సెలవు గైకొని తన భవనమున కరిగి అక్కడనుండి తన తల్లిభవనమునకు వెళ్ళినాడు. సుమిత్ర, లక్ష్మణుడు, కౌసల్య ఇంట నుండినారు. సీతాదేవినికూడ పిలిపించినారు.

కౌసల్య నారాయణుని ధ్యానించుచున్నది. శ్రీరాముడు తల్లికి నమస్కరించి శుభవార్తను ఆమెకు తెలియజేయుచున్నాడు.

**రాముడు :** అమ్మా! నాకు రేపే పట్టాభిషేకము చేయునట్లు తండ్రిగారు చెప్పినారు. సీతయు నేనును ఈరాత్రి ఉపవాసము చేయవలయునట! మాకు మంగళాశీర్వాదములు ప్రసాదింపుము.

ఈ మాటలు వినిన కౌసల్యకు పట్టరాని ఆనందము కలిగినది.

**కౌసల్య :** (ఆనంద బాష్పములతో) రామా! నిన్ను ఎట్టి శుభనక్షత్రమున కన్నాను! నా వ్రతములు ఎన్నాళ్ళకు ఫలించినవి!

లక్ష్మణుడు చేతులు కట్టుకొని ప్రక్కన నిలబడియున్నాడు.

**రాముడు :** లక్ష్మణా! నీవుకూడ నాతో ఈ భూమిని పాలింపుము. నీకొరకేగాని ఈ రాజ్యముతో నాకు పని యేమి?

**జీవితంచ హి రాజ్యంచ త్వదర్థ మభికామయే** 4-44

ఈ ధోరణిలో కొంతసేపు మాటలాడుకొని శ్రీరాముడు తల్లులకు నమస్కరించి సీతాదేవిని వెంటబెట్టుకొని తన భవనమున కరిగినాడు.

## సీతారాముల ఉపవాసము

దశరథుని ఆజ్ఞానుసారము వసిష్ఠులవారు రథము నెక్కి రాముని భవనమునకు వచ్చినారు. శ్రీరాముడు వసిష్ఠుని సగౌరవముగా రథమునుండి దింపి లోపలికి తోడ్కొనిపోయి ఉచితమర్యాదలుచేసి కూర్చుండబెట్టినాడు.

**వసిష్ఠుడు :** రామా! మీ తండ్రి రేపు ఉదయమున నీకు యౌవరాజ్య పట్టాభిషేకము జరిపించెదరట! కావున నీవు భార్యాసహితుడవై ఈ రాత్రి ఉపవాసవ్రతము నాచరింపవలయును.

ఈమాటలుచెప్పి వసిష్ఠులవారు యథావిధిగా సీతారాములచేత ఉపవాసవ్రతము చేయించి శ్రీరాముని భవనమునుండి వెడలిపోవుచున్నారు.

శ్రీరాముని భవనము ఎంతో వైభవోపేతముగా ఉన్నది. సీతారాముల స్నేహితు లందరు అచ్చట కూడినారు. సందడిగా ఉన్నది. వసిష్ఠుడు రాజమార్గమున ప్రయాణము చేయుచు పురవైభవమును తిలకించినాడు.

వీధులనిండ ప్రజలు గుంపులుకూడి ఆనందించుచున్నారు. రాజమార్గములలో శీతలజలము చల్లి అరటిచెట్లు, పోకచెట్లు, అలంకారముగా కట్టినారు. గృహములమీద పతాకల నెత్తినారు. పురజను లందరు రామపట్టాభిషేక దర్శనభాగ్యమును కోరుచు సూర్యోదయమున కెదురుచూచుచుండినారు.

వసిష్ఠుడు దశరథునియొద్దకు వెళ్ళి సీతారాముల ఉపవాసవ్రతమును జరిపించిన వార్తను నివేదించినాడు.

వసిష్ఠుడు వెళ్ళినపిదప సీతారాములు నారాయణుని ఉపాసించినారు. ఆరాత్రి దర్భలపై శయనించి జాముర్రాతి మిగిలియుండగనే లేచి భవనమునకు అలంకారము చేయించినారు.

## పౌరుల ఆనందము

అయోధ్యలో ఎక్కడ చూచినను రాముని పట్టాభిషేకమునుగూర్చిన మాటలే వినబడుచున్నవి. నగరము నంతయు సింగారించినారు. నట నర్తక సంఘములు ఆడుచు పాడుచు ఆనందముగా ఉన్నారు. బాలురుసైతము ఇండ్లముందర గుంపులుగా చేరి రామాభిషేకమునకు సంబంధించిన ఆటలాడుకొనుచు మాటలను చెప్పుకొనుచు ఆనందించుచున్నారు.

బాలా అపి క్రీడమానా గృహద్వారేషు సంఘశః
రామాభిషవ సంయుక్తా శ్చక్రురేవ మిథః కథాః 6-16

రాజమార్గములందు పుష్పములు చల్లి ధూపములు వేసి ముగ్గులు పెట్టినారు. ప్రజలు గుంపులు గుంపులుగా చేరి శ్రీరాముని తమకు రాజుగా ప్రసాదించుచున్న దశరథమహారాజును కొనియాడినారు. "దశరథుడు చిరకాలము జీవించుగాక" అని అనుచున్నారు.

## మంథర పురవైభవమును చూచి అసూయపడుట

కైకేయీ దాసియైన మంథర యాదృచ్ఛికముగా మేడపైకి వెళ్ళి పురవైభవమును చూచినది. దాని అర్థ మేమియో మంథరకు బోధపడలేదు.

ప్రహృష్టముదితైః పౌరై రుచ్ఛ్రితధ్వజమాలినీమ్
అయోధ్యాం మన్థరా దృష్ట్వా పరం విస్మయ మాగతా. 7-6

విషయము తెలియగోరి, చెంతనుండిన ఒక దాసిని అడుగుచున్నది.

*మంథర :* ఏమిచే ఈ సంరంభము? అర్థపరురాలైన కౌసల్య ప్రజ లందరకు తెంపుగా దానములు చేయుచున్న దేల! నగరములో ఎక్కడ చూచినను ఈ అలంకారము లేమిటి! ఈ ఉత్సవము లేమిటి? నీ కేమైన తెలియునా?

[కౌసల్య అర్థపరురాలట! కౌసల్యమీద మంథరకు ఎంత కోపమో!]

*దాసి :* (సంతోషముతో) మంథరా! రేపు ప్రొద్దుననే మన శ్రీరామునికి యౌవరాజ్య పట్టాభిషేకము జరుగనున్నదిగదా! అందుకే ఈ అలంకారము లన్నియు.

ఈ మాటలు విని మంథరకు అసూయ కలిగి వెంటనే కైకేయి చెంతకు పరుగెత్తినది. కైకేయి శయనించియున్నది.

## మంథర కైకేయికి దుర్బోధించుట

***మంథర :*** మూఢురాలా! లేలెమ్ము! కొంప మునిగినది. నీ సౌభాగ్య మంతయు నాశనమగుచున్నది. నీకీ పడక ఏమిటి? లేలే.

***కైకేయి :*** మంథరా! ఏమి జరిగినది? ఏమిటి నీ బాధ? నీ ముఖము వాడిపోయిన దేమి నీకు వచ్చిన ఆపద ఏమి?

***మంథర :*** (కోపముతో) కైకేయీ! నీ పని అయిపోయినది. మన రాజు రామునికి పట్టాభిషేకము చేయుచున్నాడు. అంతకంటె నీకు దుఃఖ మేమి కావలయును?

నీకు ఆపద కలిగినచో నాకును కలిగినట్లే. నీవు లక్షణముగా ఉన్నప్పుడే నాకును సంతోషముగా ఉండును. ఇప్పుడు నీకు గొప్ప ఆపద సంభవించినది. నీవు అమాయికురాలవు. కపట మన్నది ఎట్టిదో తెలియనిదానవు. కావున రాజు చేయుచున్న మోసమును గ్రహింపజాలకయున్నావు. నీతో తీయని మాటలు పలుకుచునే నిన్ను త్రోసిపుచ్చి కౌసల్యకు మేలు చేయుచున్నాడు. భరతుని దూరదేశమునకు పంపి అత డిక్కడ లేనిసమయము చూచి రామునికి రాజ్యమును కట్టబెట్టుచున్నాడు. చూచితివా! కైకేయీ! రాముడు రాజైనయెడల నీవును నీవారును హత మైనట్లే సుమా! నీ కుమారుని, నిన్ను, మమ్ములను రక్షించుకొనుము.

**కైకేయి** : (సంతోషముతో లేచి కూర్చుండి) మంథరా! ఎంత చక్కని శుభవార్త చెప్పితివి! నాకు మిక్కిలి సంతోషముగా నున్నది. ఇదిగో! ఈ ఆభరణమును నీకు బహుమతిగా ఇచ్చుచున్నాను; తీసికొనుము. మరి ఏమైన కావలసియున్నచో కోరుకొనుము. తప్పక ఇచ్చెదను.

**మంథర** : (ఆభరణమును విసరివైచి) తెలివిమాలినదానా! నీవు శోకసముద్రములో మునిగియున్నావు. యేడ్వవలసిన సమయములో ఈ సంతోష మేమిటి? సపత్ని కుమారుడు బాగుపడుట చూచి యెవ్వరైన సంతోషింతురా? రాముడు రాజైనయెడల నీవు కౌసల్యకు దాసివి కావలసినదే. నీ కుమారుడును అంతే. రామునికి సేవచేయుచు ఉండవలసినదే. గత్యంతరములేదు.

**కైకేయి** : నీ మాటలకు అర్థములేదు. రాముడు ఎంతో మంచివాడు. రాజునకు జ్యేష్ఠపుత్రుడు. రాజ్యమును పాలించుటకు అతడే తగినవాడు. రామునికి తన అనుజులయెడ మిక్కిలి ప్రీతి. రామునికి పట్టాభిషేకము జరుగుటయే యుక్తము. నీ వేల అనవసరముగా తపించిపోవుచున్నావు! కౌసల్యకంటె మిక్కిలిగా నాకు శుశ్రూష చేయువాడుగదా రాముడు! రాముడు రాజగుటయే మనకందరికి మేలు. భరతునికి రాజ్యము చేయవలెనను కోరిక గలదేని రాముడు నూరు సంవత్సరములు రాజ్యము చేసి అటుపై రాజ్యమును భరతుని కీయగలడు.

**మంథర** : పిచ్చిదానా! నీ కొక్కటియు తెలియదు. రాముని తరువాత, రాజ్యము రాముని కుమారునికి సంక్రమించునుగాని భరతుని కెట్లు రాగలదు! రాజుయొక్క కుమారు లందరకు రాజ్యములు రావు. జ్యేష్ఠ కుమారునికి మాత్రమే సంక్రమించును. నీవు ఇంత గొప్ప ఆపదలో నున్న సంగతి తెలిసికొనలేక సంతోషించి నాకు బహుమతికూడ ఇచ్చితివి! నీ తెలివిని ఏమనవలయునో తెలియుట

లేదు. ఒకమాట వినుము - శ్రద్ధగా వినుము. రాముడు తనకు రాజ్యము వచ్చిన వెంటనే భరతుని ఈ దేశమునుండి తరుమగలడు. ఒకవేళ చంపినను చంపగలడు. కావున భరతుని, తాతగారి ఇంటినుండి తిన్నగా అడివికి పంపుటయే మేలు. అట్లు చేసినచో బ్రతికియైనను ఉండగలడు.

ధ్రువంతు భరతం రామః ప్రాప్య రాజ్య మకంటకమ్
దేశాంతరం వా నయితా లోకాంతర మథాఽపివా 8-27

నీ కుమారుని ఎట్లైన రక్షించుకొనుము. మరియొక మాట కూడ శ్రద్ధగా వినుము. నీవు ఇదివరలో రాజును వశపరచుకొని కౌసల్యను ఎంతో అవమానించి యున్నావు. ఇప్పుడు కౌసల్య ఆ పగను తీర్చుకొనకుండునా? రామునికి పట్టాభిషేకము జరిగినయెడల నీకు తీరని అవమానము జరిగితీరును. భరతునికి కూడ అపాయము తప్పదు. ఇట్టి దురవస్థను తప్పింపుము.

దర్పాన్నిరాకృతా పూర్వం త్వయా సౌభాగ్యవత్తయా
రామమాతా సపత్నీతే కథం వైరం నయాతయేత్ 8-37

రాముని నగరమునుండి బయటికి పంపుము. భరతునికి రాజ్యము సిద్ధించు మార్గమును చూడుము.

ఈ మాటలతో కైకేయికి రోష మెక్కినది. ముఖము ఎఱ్ఱబడినది. కైకేయి బుసలు పెట్టుచున్నది. "అంత గొప్పగా బ్రదికి ఈనాడు కౌసల్య యెదుట చేతులు కట్టుకొని నిలబడవలయునా" అని రోషపడినది.

*కైకేయి* : మంథరా! రాముని ఇప్పుడే అరణ్యమునకు పంపవలయును. భరతునికి పట్టాభిషేకము జరిపింపవలయును. దీని కేమైన ఉపాయ మున్నదా? ఆలోచింపుము.

*మంథర* : ఉపాయము నీకు తెలియకున్నదా! అయినను నా నోట వినగోరుచున్నావు కాబోలు! చెప్పెదను వినుము. పూర్వము శంబరాసురునికి ఇంద్రునికి జరిగిన యుద్ధమునాటిసంగతి. దశరథుడు అసురులతో యుద్ధమాడి గాయపడి స్మృతి తప్పియుండగా నీ వతనిని యుద్ధభూమినుండి దూరముగా కొనిపోయి అతని ప్రాణమును రక్షించితివి. అప్పుడు దశరథుడు సంతోషించి నీకు రెండువరములు ప్రసాదించినాడు. "నేను వలసినప్పుడు గైకొనియెదను." అని చెప్పి నీవు ఆ రెండు వరములను అతనియొద్దనే దాచియుంచితివి. జ్ఞప్తియందున్నదా? ఈ విషయము నీవు చెప్పగా నాకు తెలిసినది. నీకొరకు దానిని నా మనస్సులో భద్రముగా ఉంచియున్నాను. ఆ రెండు వరములను ఇప్పుడు కోరి తీసికొనుము. భరతుని

పట్టాభిషేకము, రామునికి పదునాలుగు సంవత్సరములు వనవాసము-తెలిసినదా! రాముడు పదునాలుగు సంవత్సరములు కంటికి కనిపించక పోయినచో, ప్రజలు రాముని మరచిపోయి భరతుని అనుసరించి యుందురు. రాజ్యము ఈ లోపల భరతునికి స్థిరపడును. అర్థమైనదా!

నీవు వెంటనే కోపమందిరములో ప్రవేశింపుము. మురికిబట్టలు కట్టుకొని నేలమీద పరుండి ఏడ్చుచుండుము. రాజు వచ్చినను తలయెత్తి చూడకుము. అతనితో మాటలాడకుము. నీభర్తకు నీమీద ఎంతో ప్రేమ. నీకొరకు నిప్పులో దూకుమన్నను దూకును. నీకొరకు ప్రాణములనుకూడ విడుచును.

తవప్రియార్థం రాజాహి ప్రాణానపి పరిత్యజేత్ 9-25

నీకు రత్నములు, బంగారము, మున్నగువానిని ఇచ్చెదనని చెప్పగలడు. వాని మీదికి నీ మనస్సును పోనీయకుము. నేను చెప్పిన రెండువరములను జ్ఞప్తియందుంచుకొని అడిగి తీసికొనుము.

నిన్ను దశరథుడు స్వయముగా లేపి కూర్చుండబెట్టగలడు. అతనిని మున్ముందు మాటమీద నిలద్రొక్కి ఆతరువాత చెప్పుము వరములసంగతి—తెలిసినదా?

యదాతు తే వరం దద్యా త్స్వయముత్థాప్య రాఘవః
వ్యవస్థాప్య మహారాజం త్వమిమం వృణుయా వరమ్ 9-29

పదునాలుగు సంవత్సరములలో నీ కుమారుడు రాజ్యములో పాదుకొని పోగలడు. ఆతరువాత రాముడు వచ్చినను భరతుని కదిలింపలేడు.

చతుర్దశహి వర్షాణి రామే ప్రవ్రాజితే వనమ్
రూఢశ్చ కృతమూలశ్చ శేషం స్థాస్యతి తే సుతః 9-31

యేనకాలేన రామశ్చ వనా త్ప్రత్యాగమిష్యతి
తేనకాలేన పుత్రస్తే కృతమూలో భవిష్యతి. 9-34

కైకేయికి పరమానందము కలిగినది.

కైకేయి : మంథరా! నీవెంత తెలివిగలదానవే! ఇన్నాళ్లు నేను తెలిసికొనలేకపోయితిని. గూనివారు చక్కని ఆలోచనలు చెప్పగలరని వినియున్నాను. కాని నీవంటి గూనిది లోకములో ఉండ దని నానమ్మకము. నాకు ఎంతమంచి ఆలోచన చెప్పితివి! నామేలు కోరుదానవు నీవొక్కతెవే! నీవు లేకున్నచో, రాజు చేసిన మోసము నాకు తెలిసియేయుండదుసుమా!

పృథివ్యామసి కుబ్జానా ముత్తమా బుద్ధినిశ్చయే
త్వమేవతు మమార్థేషు నిత్యయుక్తా హితైషిణీ 9-39

నాహం సమవబుద్ధ్యేయం కుబ్జే! రాజ్ఞ శ్చికీర్షితమ్. 9-40

మంధరా! లోకములో గూనివా రెందరో విరూపు లున్నారు. నీ వట్లుగాక ఎంతో అందగత్తెవై యున్నావు. గాలికి వంగిన పద్మమువలె శోభిల్లుచున్నావు.

సన్తి దుస్సంస్థితాః కుబ్జా వక్రాః పరమదారుణాః
త్వం పద్మమివ వాతేన సన్నతా ప్రియదర్శనా. 9-40

మంధరా! నీ గూనిలో ఎన్ని మాయలు దాచియుంచితివే! దానికి ఒక సువర్ణ హారము వేయుదును. భరతునికి రాజ్యము వచ్చిన వెంటనే, రాముడు అడవికి పోవుట తోడనే, నీ గూనికి బంగారు కవచము తొడిగింతును. నీ యొడలినిండ నగలు పెట్టెదను.

***మంధర :*** ఈ లాభములేని మాటల కేమిగాని త్వరగా లేచి పనిసంగతి చూడుము. ఆలస్యమైనచో గతజలసేతుబంధన మగును-జాగ్రత్త.

గతోదకే సేతుబంధో నకల్యాణి విధీయతే. 9-54

## కైకేయి కోపగృహమున ప్రవేశించుట

కైకేయి కోపగృహములో ప్రవేశించినది.

***కైకేయి :*** మంధరా! నా ప్రతిజ్ఞ వినుము. వరములు పొందెదను; లేదా ప్రాణములను విడిచెదను.

ఈ మాటలు చెప్పి కైకేయి తన ఆభరణము లన్నిటిని తీసి, నేలమీద విసరివేసినది. పూదండలు తీసిపారవైచినది. కోపగృహమున శయనించి యున్నది. నక్షత్రములు మాటుపడగా, చీకటి అలముకొన్న ఆకాశమువలె కైకేయి కాంతిహీనముగా ఉన్నది. మైలబట్టలతో, ఏకవేణితో, మంధర చెప్పిన వేషమును ధరించినది.

[ఈ వేషము రాబోవు వైధవ్యమును సూచించుచున్నది.]

## దశరథుడు కైకేయి భవనమునకు పోవుట

దశరథుడు సభవారి అనుజ్ఞగైకొని రాముని పట్టాభిషేకమును గూర్చిన ప్రియవార్తను తన ప్రియభార్యకు చెప్పి సంతోషపెట్టుటకై కైకేయి మందిరమునకు వెళ్లినాడు. అదిగాక కైకేయిని మామూలుప్రకారము ఒకపర్యాయము చూచినట్లు కూడ అగును.

ప్రియార్హాం ప్రియమాఖ్యాతుం వివేశాంతఃపురం వశీ 10-11

కైకేయి మంచముమీద లేదు. ఈవేళలో తనరాక కెదురుచూచుచుండు కైకేయి ఈనాడు కానరాకుండుటకు కారణ మేమి ? ఇట్టి దెన్నడును జరిగియుండలేదు.

నహి తస్య పురా దేవీ తాం వేళా మత్యవర్తత 10-18

రాజున కేమియు తోపలేదు. అటునిటు చూచినాడు. కైకేయి కోపగృహములో ఉన్నదని దాసి చెప్పినది. దశరథుడు కోపగృహములోనికి ప్రవేశించినాడు. కైకేయి నేలపై పరుండి పొరలాడుచుండినది. ముసలిభర్త వయస్సులోనున్న భార్యను తన ప్రాణమునకంటె అధికముగా ప్రేమించుచున్నాడు. పాపము! దశరథుడు తన చేతులతో కైకేయిని తడివి పరామర్శించుచున్నాడు.

స వృద్ధ స్తరుణీం భార్యాం ప్రాణేభ్యోపి గరీయసీమ్
అపాపః పాపసంకల్పాం దదర్శ ధరణీతలే. 10-23

పరిమృశ్యచ పాణిభ్యా మభిసన్త్రస్త చేతనః
కామీ కమలపత్రాక్షీ మువాచ వనితా మిదమ్. 10-27

*దశరథుడు*: దేవీ ! నీకోపమునకు కారణ మేమి ? నేను జీవించియుండగా నీవిట్లు నేలమీద శయనించి యుండుట సరికాదు. నీకేమైనను జబ్బు చేసినదా ? మనదగ్గర గొప్ప వైద్యులున్నారు. వారిని పిలిపించి చికిత్స చేయించెదను. అట్లుగాక నీకేదైనను కోరిక గలదేని చెప్పుము. ఎవరికి మేలు చేయుమన్నను చేయుదును. ఎవరికి కీడు చేయుమన్నను చేయుదును. నీ కోరికను తీర్చుటకై, వధింపరానివానినైనను వధింతును. వధింపదగినవానిని విడిపింపు మని నీవు కోరుదువేని విడిపించుటకు సిద్ధముగా ఉన్నాను. దరిద్రుని ధనసంపన్నునిగా చేయదలతువేని అట్లే చేసెదను. ధనికుడు దరిద్రు డగునట్లు చేయగోరుదువేని దానికికూడ సిద్ధపడి యున్నాను.

అవధ్యో వధ్యతాం కోవా కోవా వధ్యో విముచ్యతామ్
దరిద్రః కోభవత్వాఢ్యో ద్రవ్యవా న్వాఽప్యకించనః. 10-33

దేవీ ! నేనును నా సర్వస్వమును నీ వశమేగదా ! నా ప్రాణములు విడిచియైనను నీ కోరిక తీర్చెదను-నీవిట్లు దుఃఖించుట సరికాదు.

[కామము ఏమాటల నైన పలికింపగలదు. ఎంతపని నైనను చేయింపగలదు!]

కామవశుడైన భర్త స్థితిని గమనించి కైకేయి ఈ... వాక్యములను పలుకుచున్నది.

తం మన్మథశరై ర్విద్ధం కామవేగ వశానుగమ్
ఉవాచ పృథివీపాలం కైకేయీ దారుణం వచః, 11-1

కైకేయి : రాజా ! నాకు రోగ మేమియు లేదు. న న్నెవ్వరుగాని అవమానింపలేదు. నాకు ఒక కోరిక మాత్రము కలదు. దానిని తీర్చెద నని మాట యిత్తువేని చెప్పెదను. ఊరక అనుటమాత్రమే కాదు. దృఢముగా ప్రతిజ్ఞ చేయవలెను. అట్లు ప్రతిజ్ఞ చేయుదువేని నా కోర్కెను తెలియజేసెదను.

[మంథరపాఠము చక్కగా తల కెక్కినది కైకేయికి !]

దశరథుడు : కైకేయి ! స్త్రీలలో నీకంటెను, పురుషులలో రామునికంటెను, ప్రియులు నా కెవ్వరును లేరు. ప్రమాణము చేసి చెప్పుచున్నాను వినుము. రాముని సాక్షిగా నీ కోరిక తీర్చెదను. ఎవ్వని చూడక ఒక క్షణమైనను జీవించియుండజాలనో అట్టి రామునిమీద ప్రమాణము చేయుచున్నాను. నీ కోరిక తప్పక తీర్చెదను.

యం ముహూర్త మపశ్యంస్తు నజీవేయ మహం ధ్రువమ్
తేన రామేణ కైకేయి ! శపే తే వచనక్రియామ్. 11-7

కైకేయి ! ఈ విషయములో నీ కెట్టి సందేహమును అక్కరలేదు. నీ కోరిక తప్పక తీర్చెదను.

ఈ విధముగా దశరథుడు మూడు పర్యాయములు ప్రతిజ్ఞ చేసినాడు.

కైకేయి : నీ శపథమును సూర్యచంద్రులు, గ్రహములు, భూతములు, దిక్కులు విందురుగాక ! దేవతలందరు నీ ప్రతిజ్ఞకు సాక్షులుగ ఉందురుగాక ! రాజా ! చాలకాలము నాటి మాట-నీ జ్ఞప్తికి తెచ్చుచున్నాను వినుము. పూర్వము దేవాసుర యుద్ధములో నీ ప్రాణములు రక్షించినందుకు నాకు రెండు వరముల నిచ్చియున్నావు. వానిని నీ యొద్దనే దాచియుంచితిని. ఆ రెండు వరములు నా కిప్పుడు కావలయును. వాని నీయకుందువేని నే నిప్పుడే మరణింతును. నా కేమి కావలయునో చెప్పుచున్నాను వినుము.

రామపట్టాభిషేకమునకు వలయు సంభారములను సిద్ధపరిపించి యున్నావుగదా ! ఆ వస్తుసామగ్రితోనే భరతునికి పట్టాభిషేకము జరిపింపవలయును. ఇది మొదటి వరము.

రెండవ వరమును వినుము. రాముడు చీరాజినజటాధారియై తాపసుడుగా పదునాలుగు సంవత్సరములు దండకారణ్యములో నివసింపవలయును. అట్లైననేగాని భరతుని రాజ్యము అకంటకముగా ఉండదు. ఇప్పుడే రాముడు అరణ్యమునకు పోవుట నేను చూడవలెను.

నీవు రాజరాజువు. నీ ప్రతిజ్ఞను పాలింపుము. నీ కులమును నీ శీలమును నీ జన్మమును రక్షించుకొనుము. పరలోక వాసమునకు సత్యమును మించిన సాధనము లేదని తపోధనులు చెప్పు హితవాక్యము నీకు తెలియనిది కాదు.

స రాజరాజో భవ సత్యసంగరః
కులంచ శీలంచ హి రక్ష జన్మచ
పరత్రవాసేహి వద న్త్యనుత్తమం
తపోధనా స్సత్యవచో హితం నృణామ్. 11-29

కైకేయి పలికిన దారుణ వాక్యములను వినిన దశరథునికి మూర్ఛ వచ్చినది. దిక్కు తోపలేదు. కొంత సేపటికి తేరి తలపోయుచున్నాడు.

*దశరథుడు* : (తనలో) ఇదేమి! కల కనుచుంటినా, లేక నాకేమైన చిత్తభ్రాంతి కలిగినదా! అట్లుగాక, జన్మాంతరమున అనుభూతమైనది ఇప్పుడు జ్ఞప్తికి వచ్చుచున్నదా! లేక, నా మనస్సునకు వికారము కలిగించు వ్యాధి యేదైనను సంభవించినదా!

కింను మే యదివా స్వప్న శ్చిత్తమోహో౽పివా మమ
అనుభూతోపసర్గోవా మనసోవా ప్యుపద్రవః 12-2

దశరథునికి కొంత సేపటికి స్పృహ కలిగినది. కైకేయిని చూచి ఆడుపులి యెదుట బడిన జింకవలె వణకిపోయినాడు. కొంత సేపటికి భయము పోయి కోపము వచ్చినది. కండ్లు నిప్పులైనవి.

*దశరథుడు* : ఓసి దుర్మార్గురాలా! మా వంశమును నాశనము చేయుటకే నీవు పుట్టినట్టున్నావు! నేనుగాని రాముడుగాని నీకు చేసిన అపకార మేమి! రాముడు నీ కెల్లప్పుడు శుశ్రూషలు చేయువాడుకదా! అతని కెందుకు ఇట్టి కష్టమును తెచ్చిపెట్టుచున్నావు. రామునిమీద ఏ దోషము మోపి అడవికి పంపు మనుచున్నావు? నీ వొక క్రూరసర్ప మని తెలియక నిన్ను ఇంటికి తెచ్చుకొన్నాను. పశుపక్ష్యాదులుకూడ రాముని ఎంతగానో ప్రేమించుచున్నవి గదా! అట్టి రాముని అడవులపాలు చేయుమని కోరుచున్నా వేమి? నేను రాముని ఎంత మాత్రము విడువజాలను. రాముడు కనబడనియెడల నా ప్రాణము పోవును.

అపశ్యతస్తు మే రామం నష్టా భవతి చేతనా
తిష్ఠే ల్లోకో వినా సూర్యం సస్యంవా సలిలం వినా 12-13
నతు రామం వినా దేహే తిష్ఠేత్తు మమ జీవితమ్ 12-14

కైకేయి! నీ పాపపు కోరికను వదలుకొనుము.

[దశరథుడు కోపము నణచుకొని ప్రార్థించుచున్నాడు పాపము!]

నీ పాదములకు శిరసా మ్రొక్కి యాచించుచున్నాను. నా మీద దయ చూపుము.

అపి తే చరణౌ మూర్ధ్నా స్పృశామ్యేష ప్రసీద మే 12-15

భరతుని కంటె ఎక్కువగా నీకు రాముడు శుశ్రూషలు చేయుచున్నాడు గదా! రాముని సద్గుణములను గురించి నీవే నాతో ఎన్ని పర్యాయములు చెప్పియున్నావు! ఆ పలుకు లన్నియు ఉత్తిమాటలేనా! ఈ కుటిలబుద్ధి నీ కెట్లు కలిగినది? రామునికంటె అధికముగా నిన్ను పూజించువారు ఎందైన గలరా! రాముడు తప్ప నాకు గతి ఎవరు?

కైకేయి! నేను ముసలివాడను. కొనకు వచ్చియున్నాను. నేడో రేపో చావ బోవుచున్నాను. ఈ దీనుని మీద దయచూపరాదా! నీకు నమస్కారము చేయుచున్నాను. నీ పాదములుకూడ పట్టుకొనుచున్నాను. రాముని రక్షింపుము. నేను మాట తప్పినవాడ నని అనిపింపకుము.

మమ వృద్ధస్య కైకేయి ! గతాంతస్య తపస్వినః
దీనం లాలప్యమానస్య కారుణ్యం కర్తు మర్హసి 12-34
అంజలిం కుర్మి కైకేయి ! పాదౌచాపి స్పృశామి తే
శరణం భవ రామస్య మాఽధర్మో మా మిహస్పృశేత్ 12-36

కైకేయి: (భయంకరాకారముతో) రాజా! ప్రతిజ్ఞనే తప్పజూచుచుంటివా! మాట తప్పినవాడు లోకమున ధార్మికు డని అనిపించుకొనగలడా! నలుగురు సమావేశ మైనప్పుడు "దశరథుడా! నీవు కైకేయికి రెండు వరముల నిచ్చితివి గదా! ఆమె యేమి కోరినది? నీవే మిచ్చితివి" అని అడిగినప్పుడు సమాధాన మేమి చెప్పుదువు? "నా ప్రాణములు కాపాడిన కైకేయికి మాట ఇచ్చితినిగాని చెల్లింప లేక పోయితిని" అని చెప్పుకొందువా? ధర్మజ్ఞుడ వని పేరు పడినావు. ఇప్పుడు నీ కొదవిన ఈ విపరీతపు బుద్ధి మానుకొని ప్రతిజ్ఞను పాలింపుము. శైబ్యుడు తన మాటకొరకు తన మాంసమును కోసి డేగ కిచ్చి పావురమును రక్షించెను కదా! అలర్కుడు తన కన్నుల నిచ్చి ఉత్తమగతి పొందియుండ లేదా! సముద్రుడు తన మాట నిల్పబెట్టుకొనుటకు చెలియలి కట్టను అతిక్రమింప కున్నాడు గదా! మాట తప్పుట గొప్ప తప్పు. నీవు ధర్మమును విడనాడి, రామునికి పట్టాభిషేకము చేసి కౌసల్యతో కులుకుచుండ దలచితివి కాబోలు! అది ఎన్నటికిని కుదురదు. నే నడిగిన వరములు ధర్మసమ్మతములు కానిమ్ము కాక పోనిమ్ము. మంచివి కానిమ్ము చెడ్డవి కానిమ్ము, నీ ప్రతిజ్ఞను ముమ్మాటికి జరిపితీర వలసినదే - దీనికి తిరుగులేదు.

భవ త్వధర్మో ధర్మోవా సత్యం వా యదివాఽనృతమ్
య త్త్వయా సంశ్రుతం మహ్యం తస్య నాస్తి వ్యతిక్రమః. 12-46

నా మాట కాదని నీవు రామునికి అభిషేకము చేయదలతువేని నేను ఇప్పుడే విషము పుచ్చుకొని నీ కన్నెదుటనే మరణింతును. ప్రజలు రాముని తల్లికి నమస్కార ములు చేయుట చూచుటకంటె నాకు మరణమే మేలు.

ఏకాహ మపి పశ్యేయం యద్యహం రామమాతరమ్
అంజలిం ప్రతిగృహ్ణన్తీం శ్రేయో నను మృతి ర్మమ. 12-48

[కౌసల్యను పేరుపెట్టి చెప్పుటకు కూడ కైకేయికి మనసొప్పలేదు. 'రామ మాతరమ్' అనుచున్నది. సపత్నులపోరు ఇట్టిదే కాబోలు !]

రాజా ! నీ వెన్ని చెప్పినను లాభములేదు. రాముని అడవికి పంపుట తప్పనిచ్చి నీ వెన్ని చేసినను నాకు తృప్తిలేదు.

కైకేయి మాటలు విన్నాడు దశరథుడు-ఏమి చేయగలడు పాపము ! కైకేయి భయంకరాకారమును చూచినాడు. ఆమె తన పట్టుదలను వదలునట్లు లేదు. దశరథుడు నిర్విణ్ణుడై 'రామా' అని నిట్టూర్పులు పుచ్చి మొదలు నరకిన వృక్షమువలె క్రింద పడి పోయినాడు. కొంతసేపటికి తేరి

*దశరథుడు* : నీ కిట్టి దుర్బోధన చేసినవా రెవ్వరు ? సిగ్గు విడిచి ఇట్లు నాతో నిర్భయముగా మాటలాడు చున్నావు ! నీ కేదో పిశాచము పట్టి యుండును. నీ పిచ్చిగాని ! ధర్మజ్ఞుడైన భరతుడు నీ మాటను పాటించి రాజ్యమును గైకొనునా ! పట్టాభి షేకమునకు వచ్చిన రాజు లందరు నన్ను ఎంతో నిందింతురు. నీ మూలమున కౌసల్యకు ఇంతకుముందు ఎంతో అపచారము చేసియున్నాను. కౌసల్య ఎల్లప్పుడు నా హితమునే కోరుచుండును. నాకు దాసివలె పరిచర్యలు చేయుచు, చెలికత్తె చందమున వినోదములు నెరపుచు, భార్యగాను, తోడబుట్టిన దాని వలెను, తల్లి తీరునను ఆయా సమయములలో వర్తించుచుండునది. అట్టి కౌసల్యకు ఇదివరలో ఎట్టి సత్కారములను నీవలని భయమున చేయకుంటిని. ఇప్పుడు రాముని అడవికి పంపి నేను కౌసల్య కేమి సమాధానము చెప్పగలను.

యదా యదాహి కౌసల్యా దాసీవచ్చ సఖీవచ
భార్యావ ద్భగినీవచ్చ మాతృవ చ్చోపతిష్ఠతి 12-68

సతతం ప్రియకామా మే ప్రియపుత్రా ప్రియంవదా
న మయా సత్కృతా దేవీ సత్కారార్హా కృతే తవ 12-69

[కార్యేషు దాసీ........ఈ భావము ననుసరించి వచ్చినదే !]

మాట తప్పుట గొప్పతప్పు అని నీవే అనుచున్నావు. నీ కోరికను తీర్చినయెడల "రామునికి రేపు పట్టాభిషేకము చేయుదును" అని నేను అంతమందిలో చెప్పినమాటను తప్పినవాడనే అగుచున్నానుగదా! "దశరథుడు బుద్ధి నిలకడ లేనివాడు" అని అందరు నన్ను నిందింపరా? "రామునివంటి కుమారునే అడవికి పంపినవాడు నాపుత్రుని ఏమి చేయునో" అని సుమిత్ర నన్నుచూచి భయపడకుండునా? ప్రజ లెల్లరు నన్ను ధిక్కరింప కుందురా? "ఈ కాముకుని రాజ్యమున మనకు క్షేమము కలుగదు" అని ప్రజలు దిగు లొందకుందురా! ఈ దుఃఖమును సీత భరింపగలదా! ఇంత దుఃఖము కలిగినపిదప నేను మాత్రము జీవించియుండగలనా! నేను మరణించుట నిశ్చయము. కైకేయీ! నీవు విధవవై నీ కొడుకును కూడి ఈ రాజ్యము నేలుకొనుము.

సా నూనం విధవా రాజ్యం సపుత్రా కారయిష్యసి 12-75

ఆహా! ఎంత విపరీతము జరిగినది! నీరూపమునుచూచి మోసపోయితిని. నీవు మృత్యు వని తెలిసికొనజాలక నిన్ను కౌగిలించుకొన్నాను. కొడుకును అమ్ముకొని భార్యను కొనిన ట్లయినది నాపని. సురాపానము చేసిన బ్రాహ్మణుని దూషించునట్లు ప్రజలందరు నన్ను వీధులలోకూడ తిట్టిపోయుదురు.

అనార్య ఇతి మా మార్యాః పుత్రవిక్రాయికం ధ్రువమ్
ధిక్కరిష్యన్తి రథ్యాసు సురాపం బ్రాహ్మణం యథా. 12-78

రాముడు కల్లకపటము లేనివాడు. "అడవికిపొమ్ము" అని నే ననినవెంటనే "సరే" అని అనగలడు. రెండవమాటకూడ పలుకడు.

నాలం ద్వితీయం వచనం పుత్రో మాం ప్రతిభాషితుమ్
స వనం ప్రవ్రజే త్యుక్తో బాఢ మిత్యేవ వక్ష్యతి. 12-86

"నేను వెళ్ళను" అని రాముడు చెప్పునేని నా కెంతో సంతోషముగా నుండును. కాని అట్లు పలుకు స్వభావము కలవాడు కాడు రాముడు. మనస్సులో ఒకటి పెట్టుకొని బయటికి మరొక్కటి పలుకుచున్నానని రాముడు తెలిసికొనలేడు. రాముడు అట్టివాడు కాడుగనుక కపటమును అర్థము చేసికొనలేడు.

శుద్ధభావో హి భావం మే నతుజ్ఞాస్యతి రాఘవః
స వనం ప్రవ్రజే త్యుక్తో బాఢ మిత్యేవ వక్ష్యతి. 12-88

కైకేయి! రాముడు అరణ్యమునకు పోవునేని నా ప్రాణములు పోవుట నిశ్చయము. నన్ను, కౌసల్యను, సుమిత్రను అందరను ఘోరదుఃఖమున ముంచి నీవు

మాత్రము సుఖముగా నుండుము. రాముని అడవికి పంపుట భరతుడు ఆమోదించునేని నేను మరణించిన పిదప వాడు నాకు ఉత్తరక్రియలు చేయకూడదు. కైకేయి! నీకోరిక తీర్చుకొనుము. నేను మరణింతును. నీవు విధవవై నీవును నీ కుమారుడును ఈ రాజ్యమును కట్టుకొని యేలుకొనుడు. నీవొక రాజపుత్రి వని భ్రమపడి నిన్ను కోరి కోరి తెచ్చుకున్నాను.

ఆహా! నా రాముడు అడవికి పోవలయునా! ఆచేదు కషాయములు వగరు కందమూలములు భక్షించుచు అడవిలో నుండగలడా ఆ సుకుమారుడు! కాషాయము ధరించి, నేలమీద శయనించి, కాలము గడపగలడా నా రాముడు! ఛీ! స్త్రీలను నమ్మరాదు. స్త్రీజాతిలోని వారందరు మండిపోదురుగాక! కాదు కాదు! స్త్రీలందరు కాదు. భరతుని తల్లిమాత్రమే.

ధిగస్తు యోషితో నామ శఠా స్స్వార్థపరా స్సదా
నబ్రవీమి స్త్రియస్సర్వా భరతస్యైవ మాతరమ్. 12-103

పాపిష్ఠురాలా! రాముడు నీకేమి అపకారము చేసినాడు. నీవు చేయుపని కొంచెమైనను మంచిదికాదు. రామునికి దుఃఖము కలిగింతువేని జగత్తంతయు నీపై ఆగ్రహించునుసుమా!

ఆహా! నీవు ఇట్టిదారుణ వాక్యములను నా యెదుటనే పలుకుచున్నావే! నీ దంతములు రాలిపడి ముక్కలు కాలేదే!

కైకేయి! నీవు కంది కుందిననుసరే! నిప్పులో దూకి నాశనమైననుసరే! కొండమీదినుండి పడి, వేయిముక్కలైననుసరే! నేను మాత్రము నీ కోరిక తీర్చను.

ప్రతామ్యవా ప్రజ్వలవా ప్రణశ్యవా
సహస్రశోవా స్ఫుటితా మహీం వ్రజ
న తే కరిష్యామి వచ స్సుదారుణం
మమాహితం కేకయరాజపాంసని. 12-112

కైకేయి! నీవెంతో మంచిదానవు. నాకు అపకారము చేయకుము. నీ పాదములు పట్టుకొని వేడుకొందును. నా మీద దయ జూపుము.

మమాహితం దేవి నకర్తు మర్హసి
స్పృశామి పాదావపి తే ప్రసీదమే. 12-114

ఇట్లు కొంత సేపు పరుషముగాను కొంత సేపు దీనముగాను అనేక విధములుగా చెప్పి దశరథుడు కైకేయి పాదములమీద పడినాడు. ఇంతలోనే కైకేయి తన పాదములను ప్రక్కకు మరలించినది. దశరథుడు నేలమీద పడిపోయినాడు.

[దశరథుడు వెర్రివాడై పోయినాడు. నయమున భయమున అనేక విధములుగా కైకేయికి చెప్పి రాముని రక్షించుకొనుటకు సకల ప్రయత్నములు చేయుచున్నాడు]

కైకేయి మెత్తబడలేదు. దశరథుని మాటలకు జంకలేదు. తన పట్టు వీడలేదు.

**కైకేయి :** మహారాజా! "నేను సత్యవాదిని, దృఢవ్రతుడను" అని విఱ్ఱవీగుచుందువు గదా! నాకు వరము లిచ్చి వెనుదీయుచున్నా వేమి ?

దశరథునికి కోపము వచ్చినది. తెలివిదప్పి పడిపోయినాడు. కొంతపడికి తేరుకొని తన స్థితిని గూర్చి చింతించుచున్నాడు.

**దశరథుడు :** హా! ముద్దులు మూటగట్టు ముఖముగల రాముని అడవికి పంపగలనా !

కథ మిందీవరశ్యామం దీర్ఘబాహుం మహాబలమ్
అభిరామ మహం రామం ప్రేషయిష్యామి దండకాన్ 13-10

నేను ఈ క్షణముననే మరణించిన బాగుండును. ఈ కఠోర వార్త రామునికి చెప్పుటయైనను తప్పును.

దశరథు డిట్లు విలపించుచున్నాడు. సూర్యాస్తమయ మయినది. దశరథుడు దుఃఖముతోనే రాత్రిని గడపుచున్నాడు. రాత్రి రాత్రిగానే ఉండిపోయిన మేలని కొంతసేపు, త్వరగా సూర్యోదయమైనచో కైకేయి పొత్తైనను తప్పు నని కొంతసేపు అనుకొనుచున్నాడు. దుఃఖమును భరింపజాలక, కైకేయితో మరల మొరపెట్టు ‌కొనుచున్నాడు.

**దశరథుడు :** (అంజలిచేసి) కైకేయీ! నీవు సహజముగా ఎంతో మంచిదానవు. నేను నీ భర్తను, అంతేగాక నేను రాజును. నా ప్రార్థన మంగీకరింపుము. నేను నీ కిచ్చిన రాజ్యమును నీవే రామునికి ప్రసాదించి కీర్తి నార్జింపుము. అట్లు చేయుదువేని రామునికి, భరతునికి, నీకు, నాకు, లోకమున కంతటికి కూడ ప్రియముగా నుండును.

కైకేయి మనస్సు కరగలేదు. దశరథుడు నేలమీదపడి పొర్లాడుచున్నాడు.

**కైకేయి :** నాకు వరము లిచ్చి ఏల ఇట్లు బాధపడుచున్నావు - సత్యమే పరమధర్మ మని పెద్దలు చెప్పగా వినలేదా! సత్యమే బ్రహ్మము, ధర్మ మంతయు సత్యముమీదనే నిలిచియున్నది. వేదములు సైతము సత్యమునే ప్రతిపాదించుచున్నవి. మోక్షమునకు కూడ సత్యమే సాధనము.

సత్య మేకపదం బ్రహ్మ సత్యే ధర్మః ప్రతిష్ఠితః
సత్యమే వాక్షయా వేదా స్సత్యే నైవాప్యతే పరమ్ 14-7

కావున సత్యమును పాటించి నా వరములను ఇమ్ము. నుమ్మాటికిని అంతే. అట్లీయనిచో నీ యెదుటనే ప్రాణత్యాగము చేయుదును.

కైకేయి జంకు గొంకు లేనిదై మాటలాడుచు చూచిన దశరథునికి దిక్కు తోప లేదు. ముఖము వెలవెలపోయినది. కన్నులు గిర్రున తిరుగ జొచ్చినవి. ఎట్లో కొంత ధైర్యము కూర్చుకొని తెంపుగా పలుకుచున్నాడు.

*దశరథుడు :* కైకేయీ! వినుము. ఇక నీవు నాకు భార్యవు కావు. నేను నీకు భర్తనుగాను. నిన్ను, నీ కుమారుని విసర్జించుచున్నాను. నేను మరణించుట నిశ్చయము. రాముని అభిషేకమునకు సామగ్రి సమకూర్చి యున్నాను. ఆ సామగ్రిని ఉపయోగించి రాముడే నా ఉత్తరక్రియలు జరుపవలయును.

రామాభిషేక సంభారై స్తదర్థ ముపకల్పితైః
రామః కారయితవ్యో మే మృతస్య సలిలక్రియామ్ 14-16

కైకేయికి రోషము పెరిగినది. మండిపడుచున్నది.

*కైకేయి :* రాజా! ఇట్టి దారుణ వాక్కులవలన లాభ మేమి? రాముని పిలిపించి నీవు నా కిచ్చిన వరములను పాలించుటయే కర్తవ్యము.

*దశరథుడు :* ధర్మపాశమున బంధింపబడితినిగదా! రాముని చూడగోరుచున్నాను.

పట్టాభిషేక ముహూర్తము సమీపించుచుండినది. అభిషేక ద్రవ్యము లన్నింటిని సిద్ధపరిచి వసిష్ఠుడు నగరము ప్రవేశించినాడు. రాజమార్గములు శుభ్రపరచి శీతలజలములు చల్లినారు. పువ్వులు వెదజల్లినారు. ఇంటింట పతాకల నెత్తినారు. పట్టణమును విశేషముగ అలంకరించినారు. వీధులలో ప్రజలు కిటకిటలాడుచున్నారు. అందరు పట్టాభిషేకమును ఎదురుచూచుచు ఆనందవివశులై యున్నారు.

వసిష్ఠుడు జనసమూహమును తప్పించుకొని అంతఃపురమునకు వచ్చి సుమంత్రుని చూచి "సుమంత్రా! పట్టాభిషేకమునకు కావలసిన ద్రవ్యములు గంగాది తీర్థములు, సింహాసనము, ఛత్ర చామరములు, రథములు మున్నగు పరికరము లన్నిటిని సిద్ధపరచినాను. నేను వచ్చి వేచియున్నా నని రాజుగారికి మనవిచేయుము. ముహూర్తవేళ సమీపించుచున్న దని వారికి హెచ్చరిక చేయుము" అని చెప్పినాడు.

సుమంత్రుడు లోపలికి వెళ్లి యథాచారముగా రాజును స్తుతించి మేల్కొలిపినాడు. "పట్టాభిషేక సమయము సమీపించినది. జను లందరు కనిపెట్టుకొని యున్నారు. వసిష్ఠులవారు కూడ సంసిద్ధులై వచ్చియున్నారు. తమరు త్వరగా లేచి, ప్రజలకు దర్శన మిప్పింపు డని ప్రార్థించుచున్నాను" అని మనవి చేసినాడు.

ఈ మాటలు విన్న దశరథునికి దుఃఖము ముంచుకొని వచ్చినది.

*దశరథుడు* : సుమంత్రా! ఇప్పటికే నా మనస్సు నలిగియున్నది. నీ స్తుతి వాక్యములు నన్ను మరింత బాధపెట్టుచున్నవి.

సుమంత్రునికి ఈ మాటలు అర్థము కాలేదు. రాజు దీనుడై దుఃఖములో ఉండుట చూచి ఏమి చేయుటకును తోపక సుమంత్రుడు చేతులుకట్టుకొని కొంచెము ప్రక్కగా నిలబడినాడు. సుమంత్రునితో మాటలాడుటకు రాజునకు శక్తిలేకయుండుట చూచి కైకేయి సుమంత్రునితో మాటలాడుచున్నది.

*కైకేయి* : సుమంత్రా! రాముని పట్టాభిషేకమును గురించిన సంతోషముతో రాజుగారు రాత్రి అంతయు మేలుకొని అలసిపోయి ఇప్పుడు నిద్రలో ఉన్నారు. నీవు వెంటనే వెళ్లి రాముని తోడ్కొని రమ్ము.

కైకేయి మాటలను వినిన పిదప సుమంత్రుని అనుమానము తొలగిపోయినది. పట్టాభిషేకము జరుపుటకే రాముని పిలిపించుచున్నారని తలచి సుమంత్రుడు వడిగా బయలుదేరినాడు. బయటికివచ్చి పట్టాభిషేకమునకు సమకూర్చబడిన ద్రవ్యములను చూచినాడు. నానాదేశములనుండి వచ్చిన రాజులు, ప్రజలు కనిపెట్టుకొని యున్నారు. దశరథుని త్వరగా మేల్కొలుపుమని సుమంత్రునితో చెప్పినారు. సుమంత్రుడు మరల వచ్చి రాజును మేల్కొలిపినాడు.

*దశరథుడు* : సుమంత్రా! రాముని తోడ్కొని రమ్మని కైకేయి చెప్పినదిగదా! నీ వాపని ఏల చేయలేదు? ఆ మాటను నా ఆజ్ఞగానే పాటింపుము. అప్పుడు నేను నిద్రలో నుంటి నని సందేహించితివి కాబోలు! ఇప్పుడు మేలుకొనియే ఉన్నాను. నీవు శీఘ్రముగా వెళ్లి రాముని తోడ్కొనిరమ్ము.

రామ మానయ సూతేతి యదస్యభిహితోఽనయా
కిమిదం కారణం యేన మదాజ్ఞా ప్రతి హన్యతే 15-26
నచైవ సమ్ప్రసుప్తోఽహ మానయే హాశు రాఘవమ్ 15-27

సుమంత్రుడు సంతోషముగా రాముని భవనమునకు వెడలినాడు. చక్కగా అలంకరింపబడిన రాజవీధిలో ప్రవేశించినాడు. ఎచ్చట చూచినను ఎచ్చట వినినను రాముని అభిషేకపు మాటలే! సుమంత్రుడు ఈ మాటలను వినుచు ఆనందించుచు శ్రీరాముని మందిరము చేరుకొన్నాడు. రాముని భవనము జనసమూహములతో నిండి ఇంద్రభవనము పగిది శోభిల్లుచుండినది. అందరు ఆనందపరవశులై రామ పట్టాభిషేకమును గురించి సంభాషించుకొనుచుండినారు. రామునికిని సమస్త లోకమునకును మంగళము కోరుకొనుచుండినారు.

సతత్ర శుశ్రావచ హర్షయుక్తా
రామాభిషేకార్థ కృతా జనానామ్
నరేంద్ర సూనో రభిమంగళార్థా
స్సర్వస్య లోకస్య గిరః ప్రహృష్టః 15-44

శ్రీరాముడు ఆరోహింపదగిన శత్రుంజయ మను యేనుగు అలంకరింపబడి యుండినది. రాముని భవనమునకు అనేక కక్ష్యలు ఉన్నవి. సుమంత్రుడు ఒక్కొక్కదానిని దాటి రాముని అంతఃపురము సమీపించి తన రాకను రామునికి చెప్పి పంపినాడు.

రాముడు సీతాసహితుడై యున్నాడు. సుమంత్రుని లోపలికి రమ్మని చెప్పి పంపినాడు.

సుమంత్రుడు సీతారాముల మందిరమున ప్రవేశించి తన జన్మను తరింపజేయు దృశ్యమును చూచినాడు.

శ్రీరాముడు పట్టాభిషేకమునకు ఉచితమైన అలంకారము చేసికొని సీతాదేవి యలందిన పరిమళ చందనముచే సుశోభితుడై మేలి దుప్పటి పరిచిన సువర్ణ పర్యంకమున ఆసీనుడై యుండినాడు. సీతాదేవి ప్రక్కన నిల్వబడి వింజామరము వీచుచున్నది. చిత్తా నక్షత్రముతో కూడిన చంద్రుని వలె సీతాసమేతుడైన శ్రీరామచంద్రుడు శోభిల్లుచున్నాడు.

తం వైశ్రవణ సంకాశ ముపవిష్టం స్వలఙ్కృతమ్
దదర్శ సూతః పర్యఙ్కే సౌవర్ణే సోత్తరచ్ఛదే. 16-8

వరాహ రుధిరాభేణ శుచినాచ సుగంధినా
అనులిప్తం పరార్థ్యేన చందనేన పరంతపమ్ 16-9

స్థితయా పార్శ్వతశ్చాపి వాలవ్యజన హస్తయా
ఉపేతం సీతయా భూయ శ్చిత్రయా శశినం యథా 16-10

భానుతేజో విరాజితుడైన శ్రీరామునికి సుమంత్రుడు నమస్కరించినాడు.

తం తపంత మివాదిత్య ముపపన్నం స్వతేజసా
వవందే వరదం వన్దీ వినయజ్ఞో వినీతవత్ 16-11

[ఈ దృశ్యమును సందర్శించు మహాభాగ్యము సుమంత్రునికి మాత్రమే లభ్యమైనది. సుమంత్రుడు ఎంతో ధన్యుడు!]

సుమంత్రుడు: (నమస్కరించి) రామప్రభూ! మీ తండ్రిగారు కైకేయి మందిరములో ఉన్నారు. వారిద్దరు నిన్ను చూడగోరుచున్నారు.

రాముడు : (సంతోషముగా సీతతో) దేవీ! వా రిద్దరు నా పట్టాభిషేకమును గురించియే ఆలోచించుచున్నా రనుటకు సందియము లేదు. కైకేయికి నా మీద ఎంతో ప్రీతి. నాకు వేగిరమే పట్టాభిషేకము చేయింపు మని మా తండ్రికి బోధించుచుండును. రాజుగారు నా కిప్పుడే పట్టాభిషేకము చేయగలరు. నేను వెళ్లి ఇప్పుడే వచ్చెదను. ఈ లోపల నీవు నీ పరిజనములతో క్రీడించుచుండుము. సరేనా!

సీత "ముందు ముందు నీవు చక్రవర్తివై రాజసూయమున అభిషిక్తుడవగుటకు యోగ్యముగా నీ కిప్పుడు యౌవరాజ్య పట్టాభిషేకము జరుగుగాక! నీవు రాజసూయ దీక్ష వహింపగా నేను చూచి ఆనందించి నిన్ను సేవించుచుండగలను. తూర్పు దిక్కున ఇంద్రుడును, దక్షిణ దిక్కున యముడును, పశ్చిమ దిక్కున వరుణుడును, ఉత్తర దిక్కున కుబేరుడును నిన్ను రక్షింతురుగాక!" అని మంగళము మనస్సున కోరుకొనుచు భర్తను గుమ్మముదనుక అనుసరించినది.

## శ్రీరాముడు కైకేయి మందిరమునకు పోవుట

శ్రీరాముడు తండ్రి యొద్దకు బయలుదేరినాడు. లక్ష్మణుడు ద్వారముచెంతనే చేతులు కట్టుకొని నిల్చబడియుండి రాముని అనుసరించుటకు వేచియుండినాడు. అక్కడ కూడియుండిన స్నేహితులతోను పురజనులతోను రాముడు మంచిమాటలాడి రథము నారోహించినాడు. లక్ష్మణుడు కూడ రథమునెక్కి ఒకచేత ఛత్రమును ఒకచేత చామరమును గైకొని రాముని వెనుక నిలబడినాడు.

రథము సాగిపోవుచున్నది. జనులు గుంపులు గుంపులుగా వెంబడించినారు. రథమునకు ముందును వెనుకను వందలకొలది రౌతులు గుఱ్ఱముల మీదను ఏనుగుల మీదను కాలినడకతోను వచ్చుచున్నారు. వాద్యములు మ్రోగుచున్నవి.

మేడలమీదినుండి స్త్రీలు పుష్ప వర్షము కురిపించుచున్నారు. కౌసల్య అదృష్టమును కొనియాడుచున్నారు. సీతాదేవిని అభినందించుచున్నారు. "శ్రీరాముని హృదయప్రియయైన సీతాదేవి స్త్రీ లందరిలోను ఉత్తమురాలు. పూర్వజన్మమున ఆమె ఎంత గొప్ప తపస్సు చేసినదో! కానిచో శ్రీరామునివంటి భర్తను బడయుటకు సాధ్య మగునా!" అని శ్లాఘించుచున్నారు.

సర్వసీమంతినీభ్యశ్చ సీతాం సీమంతినీం పరామ్
అమన్యన్తహి తా నార్యో రామస్య హృదయప్రియామ్ 16-40

తయా సుచరితం దేవ్యా పురా నూనం మహత్తపః
రోహిణీవ శశాంకేన రామసంయోగ మాపయా 16-41

"రాముడు రాజైన యెడల మన కదియే చాలును. రామపట్టాభిషేకమున కంటె మాకు ప్రియమైన దేదియునులేదు."

తతోహి నః ప్రియతరం నాన్య త్కించి ద్భవిష్యతి
యథాభిషేకో రామస్య రాజ్యే నామిత తేజసః. 17-11

ఇట్టి స్తుతివాక్యములను వినుచు శ్రీరాముడు రాజమార్గమున తన ప్రయాణము సాగించుచున్నాడు. ఉదాసీనముగ ఉన్నాడేగాని ఈ స్తుతి వాక్యములను విని పొంగలేదు.

[అందుకే శ్రీరాముడు 'ధీరోదాత్తుడు' అన్నారు. పొంగినవారు క్రుంగక తప్పదు!]

ఏతా శ్చాన్యాశ్చ సుహృదా ముదాసీనః కథా శ్శుభాః
ఆత్మసంపూజనీ శ్శృణ్వ న్యయౌ రామో మహాపథమ్. 17-13

శ్రీరాముని మోహనాకారమునుచూచి పురుషులు సైతము తమ చూపులను గాని మనస్సులనుగాని మరలింపజాలక యుండినారు. రాముడు తమ దృష్టికి అందక దాటిపోయిన పిదపకూడ ఆ దిక్కునే చూచుచుండినారు.

నహితస్మా న్మనః కశ్చి చ్చక్షుషీ వా నరోత్తమాత్
నరః శక్నో త్యపాక్రష్టు మతిక్రాన్తేఽపి రాఘవే. 17-14

ఎవ్వడు రాముని చూడడో, రాముడు ఎవ్వరిని చూడడో అట్టివాడు లోకులందరిచేత నిందింపబడుటయేగాక అతని ఆత్మచేకూడ నిందింపబడగలడు.

యశ్చ రామం నపశ్యేత్తు యంచ రామో నపశ్యతి
నిందిత స్సవసే ల్లోకే స్వాత్మాఽప్యేనం విగర్హతే. 17-15

[ఇది గమనింప దగిన శ్లోకము. రాముని మహత్త్వము ఇందులో ఇమిడియున్నది.]

శ్రీరాముడు దశరథుని అంతఃపురములో ప్రవేశించినాడు. అతనివెంట వచ్చిన స్నేహితులు, ప్రజలు, వెలుపల నిలిచి రాముని రాకకు వేచియుండినారు.

## కైకేయి మందిరమున శ్రీరాముడు

రాముడు అంతఃపురములో ప్రవేశించి పరిస్థితిని చూచినాడు. దశరథుడు పాలిపోయిన ముఖముతో దీనుడై యున్నాడు. మంచముమీద ఒక ప్రక్క దశరథుడు మరియొక ప్రక్క కైకేయి కూర్చుండియున్నారు. రాముడు తల్లికిని తండ్రికిని నమస్కరించినాడు.

దశరథుని కన్నులలో నీరు క్రమ్మినది. 'రామా!' అన్నాడు. అంతే! పైమాట రాలేదు.

దశరథుడు ఇట్టి దుఃఖములో నుండుట రాముడు ఎన్నడుగాని చూచియుండ లేదు. "నన్ను చూచి మాతండ్రి కన్నీరు కార్చుచున్నాడేమి? ఎంత కోపములో నున్నను నన్ను చూచుటతోడనే ప్రసన్నుడగుచుండిన నా తండ్రికి ఇప్పుడు కలిగిన బాధ యేమై యుండును" అని ఆలోచించినాడు. ఏమియు తోపలేదు. రాముడు కైకేయిని అడుగుచున్నాడు.

**రాముడు :** (దీనముగా) తల్లీ! మా తండ్రి ఇట్లుండుటకు కారణమేమి? నా మీద కోపము కలిగినదా! ప్రమాదవశమున నే నేదైన తప్పు చేసితినా? నా తండ్రికి నామీద గల కోపమును శమింపజేయుము. తల్లీ! అట్లుగాక, ఆయన కేమైన జబ్బు చేసినదా! మనోవ్యాధి యేమైన కలిగినదా చెప్పుము. ఎట్టివానికైనను ఎల్లప్పుడు సుఖముగా నుండుట కుదురదుగదా!

దుర్లభంహి సదా సుఖమ్. 18-13

తల్లీ! భరతునికిగాని, శత్రుఘ్నునికిగాని నా తల్లులలో ఎవరికిగాని ఆపద యేమైన సంభవించినదా! ఇప్పుడేమి చేసినచో నా తండ్రికి సంతోషము కలుగునో చెప్పుము. నా తండ్రి మనస్సును రంజిల్లజేయక, నా తండ్రి ఆజ్ఞను నిర్వర్తింపక ఒక్క క్షణమైనను జీవించి యుండలేను.

ఒకవేళ చనువుకొలది నీ వేమైన పరుషముగ పలికి నా తండ్రి మనస్సును నొప్పింప లేదుగదా! తల్లీ! దీని నిజ మేమియో తెలియజెప్పుము.

**కైకేయి :** (సిగ్గువిడిచి) రామా! రాజునకు కోపముకాని రోగముకాని లేదు. ఆయనకు ఒక్క కోరికమాత్ర మున్నది. దానిని విని నీ వేమందువో అని జంకుచున్నాడు. ప్రియుడవైన నీతో అప్రియమైన వార్తను చెప్పుటకు ఆయనకు నోరాడకున్నది.

ప్రియం త్వా మప్రియం వక్తుం వాణీ నాస్యోపవర్తతే 18-21

ఆ మాటను నేనే చెప్పెదను వినుము. మీ తండ్రి నాకు రెండు వరము లిచ్చి ఇప్పుడు దుఃఖపడుచున్నాడు. గతజలసేతుబంధనము చేయ పూనుకొన్నాడు. దీని వలన యేమైన లాభ మున్నదా!

స నిరర్థం గతజలే సేతుం బంధితు మిచ్ఛతి 18-23

రామా! చూతుము! రాజు చెప్పు మాట శుభమైనదిగాని అశుభమైనదిగాని నీవు చేయుటకు సమ్మతింతువేని దానిని నేనే చెప్పెదను. ఆ మాటలు నీతో చెప్పుటకు మీ తండ్రికి నోరాడదు.

**రాముడు :** తల్లీ! ఏమిటి నీ మాటలు! నా బ్రతుకు ఇంతకు వచ్చినదా! తండ్రి మాటను చెల్లింతునో చెల్లింపనో అను సందేహము కలిగిన పిదప నేను బ్రతికిమాత్ర మేమి ప్రయోజనము! సందేహపడకుము. నా తండ్రి మాట తప్పక పాలింతును. అగ్నిలో పడుమన్నచో పడెదను. విషము మ్రింగుమన్నచో మ్రింగెదను. సముద్రములో దుముకుమన్నచో దుమికెదను. నా గురువు, నా తండ్రి, నా ప్రభువు, నా హితుడు చెప్పిన మాటను కాదనువాడను కాను. ఆ మాట ఏదియో నిస్సందేహముగ చెప్పుము. తప్పక చేయుదును. చేయుదు నని ప్రతిజ్ఞ కూడ చేయుచున్నాను. రాముడు రెండు నాలుకలవాడు కాడు.

అహో : ధిఙ్నార్హసే దేవి వక్తుం మా మీదృశం వచః
అహంహి వచనా ద్రాజ్ఞః పతేయ మపి పావకే 18-28

భక్షయేయం విషం తీక్ష్ణ మ్మజ్జేయ మపి చార్ణవే
నియుక్తో గురుణా పిత్రా నృపేణ చ హితేన చ 18-29

కరిష్యే ప్రతి జానేచ రామో ద్విర్నాభి భాషతే 18-30

**కైకేయి :** రామా! మరేమియులేదు. పూర్వము దేవాసుర యుద్ధమున నీ తండ్రి ప్రాణములను నేను రక్షించి నప్పుడు ఆయన నాకు రెండు వరములు ప్రసాదించినాడు. వానిని ఇప్పుడు కోరినాను. భరతునికి పట్టాభిషేకము చేయు మని ఒకటి; నిన్ను వెంటనే దండకారణ్యమునకు పంపించు మని మరియొకటి. నీ తండ్రి ప్రతిజ్ఞను నీవు పాలింపదలచుకొన్నచో నామాటమేరకు నడచుకొనుము. నీవు నీ అభిషేక ప్రయత్నమును మాన్పించి జటాజినములు ధరించి అరణ్యములో పదునాలుగు సంవత్సరములు నివసింపవలయును. ఇప్పుడు సిద్ధముగా ఉన్న అభిషేక ద్రవ్యములతోనే మా భరతునికి పట్టాభిషేకము జరుగవలయును.

మీ తండ్రి నాకు వరము లిచ్చి ఇప్పుడు పశ్చాత్తాప పడుచున్నాడు. నీవు నీ తండ్రి మాటను సత్యము కావించి ఆయనను తరింపజేయవలయును.

సత్యేన మహతా రామ తారయస్వ నరేశ్వరమ్ 18-40

ఈ మాటలు విని దశరథుడు కపించిపోయినాడు. కాని రాముడు మాత్రము దుఃఖపడలేదు. అతని మనస్సున ఎట్టి బాధయు కలుగలేదు.

**రాముడు :** తల్లీ! నీకెట్టి అనుమానమును వలదు. నా తండ్రి ప్రతిజ్ఞను తప్పక పాలించెదను. నీ కోరికమేరకు నేను జటాజినములు ధరించి అడవికి ఇప్పుడే పయనమగుదును. ఒక్క విషయము మాత్రము నన్ను బాధించుచున్నది. నా తండ్రి

నన్నుచూచి యెప్పటివలెనే ఏల సంతోషించుటలేదు? భరతుని అభిషేకమును గురించి మా తండ్రి నాతో స్వయముగా చెప్పక పోవుటకు కారణ మేమి? అమ్మా! కోపముతో పనిలేదు. నీవు సంతోషముగా ఉండుము. నీ యెదుటనే నేను నారచీరలు ధరించి అడవికి బయలుదేరెదను. వెంటనే భరతుని పిలిపింపుము. భరతునికి దేనినైన ఇచ్చు విషయములో నా కితరులు చెప్పవలయునా! భరతుడు కావలయు నని కోరిన యెడల పరుల ప్రోత్సాహము లేకయే నేను సీతను, రాజ్యమును, నా ప్రాణమును, నా సర్వస్వమును సంతోషముగ ఇచ్చుటకు సిద్ధముగా ఉన్నాను.

అహం హి సీతాం రాజ్యం చ ప్రాణానిష్టా న్ధనానిచ
హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతా యాప్రచోదితః 19-7

అట్టియెడ తండ్రి ప్రతిజ్ఞను పాలించుటకై భరతునికి రాజ్య మిచ్చుట ఒక గొప్ప సంగతి కాదు. భరతుని పిల్వబంపుము. నేను కూడ దండకారణ్యమునకు ఇప్పుడే బయలు దేరుచున్నాను. నీవు కోరినట్లు పదునాలుగు సంవత్సరములు వనవాసము చేయుదును.

కైకేయి: (సంతోషముతో) రామా! మంచిది! నీ వన్నట్లు భరతుని యొద్దకు దూతల నిప్పుడే పంపెదను. నీవుమాత్రము త్వరగా ప్రయాణమై అడవికి పొమ్ము. ఆలస్యము చేయవలదు. నీవు కదలిపోవువరకు నీ తండ్రి స్నానముగాని భోజనముగాని చేయడు.

యావ త్త్వం న వనం యాతః పురా దస్మా దభిత్వరన్
పితా తావ న్నతేరామ స్నాస్యతే భోక్ష్యతేఽపివా. 19 16

దశరథుడు ఈ మాటలు విని "ఛీ! ఎంత కష్టము వచ్చినది!" అని నిట్టూర్పులు విడుచుచు మూర్ఛ జెంది పడిపోయినాడు. రాముడు తండ్రిని లేవనెత్తి కూర్చుండబెట్టి అరణ్యమునకు వెళ్ళుటకు సిద్ధపడి కైకేయితో అనుచున్నాడు.

రాముడు: తల్లీ! నాకు ధనముమీదగాని రాజ్యముమీదగాని ఆసక్తి లేదు. నేను ఋషి వంటి వాడను. కేవల ధర్మమునే ఆశ్రయించి యుండువాడ నని తెలిసికొనుము.

నాహ మర్థపరో దేవి! లోక మావస్తు ముత్సహే
విద్ధిమా మృషిభిస్తుల్యం కేవలం ధర్మమాస్థితమ్. 19-20

మాతండ్రి నాతో స్వయముగా చెప్పకపోయినను నీ మాటనుబట్టి నేను అడవికి ప్రయాణ మగుచున్నాను. తల్లీ! నీవు ఒక్కమాట నాతో అనియుండిన నీవు కోరినట్లు

చేసియుండనా! ఈ మాత్రమునకు వరరూపముగా నీవు రాజును ఆశ్రయింపవలసి వచ్చినదా! ఇంతకును నీవు నా స్వభావమును అర్థము చేసికొనలే దన్నమాట!

మా తల్లితోను సీతతోను వీడికోలు చెప్పివచ్చుటయే ఆలస్యము. వారితో ఒక్క మాట చెప్పి అడవికి ప్రయాణ మగుచున్నాను. భరతునికి పట్టాభిషేకము జరిపింపుము. తండ్రికి శుశ్రూషలు చేయు మనిమాత్రము భరతునితో చెప్పుము.

ఈ మాటలను దశరథుడు విని తెలివిదప్పి పడిపోయినాడు. రాముడు తండ్రికిని కైకేయికిని నమస్కరించి వారికి ప్రదక్షిణము చేసి దివ్యతేజస్సుతో ప్రకాశించుచు మందిరమునుండి వెలుపలికి వచ్చినాడు.

[ధర్మమార్గము ననుసరించినవాని ముఖమునందు ఒక విలక్షణమైన కాంతి కానబడును!]

లక్ష్మణుడు ఆగ్రహముతోను శోకముతోను రాముని వెనుకనే నడచుచున్నాడు. అచ్చట ఉండిన పట్టాభిషేక ద్రవ్యములను రాముడు కంటితోకూడ చూడలేదు. రాముని ముఖకాంతి కొంచెమైనను తగ్గలేదు. రామునికి మనోవికార మేమియును కలుగలేదు. శ్రీరాముడు ఛత్ర చామరములను, రథమును, తనవెంటవచ్చిన జనసమూహములను విడిచిపెట్టి కౌసల్యా భవనమునకు కాలినడకన వెళ్లుచున్నాడు. రాముని ముఖమున ఎట్టి వికారమును కానబడలేదు. సంతోషము తగ్గలేదు. తన్ను వెంబడించుచున్న ప్రజలకు మంచి మాటలు చెప్పి వారిని పంపివైచి ధీరాత్ముడైన రాముడు లక్ష్మణ సమేతుడై కౌసల్యా గృహమునకు నడచినాడు.

వాచా మధురయా రామ స్సర్వం సమ్మానయఞ్జనమ్
మాతు స్సమీపం ధీరాత్మా ప్రవివేశ మహాయశాః 19-38

[అట్టి సంకట సమయమున మధురవాక్కులు పలుకుటకు ఎంత ఇంద్రియ నిగ్రహము కావలెను! అందుకే రాముని ధీరాత్ముడన్నారు వాల్మీకి మహర్షి. రాముడు తప్ప ఇతరు డిట్లు ప్రవర్తింపగలడా!]

## శ్రీరాముడు - కౌసల్య

కౌసల్యకు వ్రతములపట్ల మిక్కిలి ప్రీతి. కుమారునికి పట్టాభిషేకము జరుగబోవు చున్నదిగదా! కావున కౌసల్య రాత్రి యంతయు మేలుకొని తెల్లవారగనే విష్ణుదేవుని పూజించి బ్రాహ్మణులచేత హోమము చేయించుచుండినది. రాముడు వచ్చి తల్లికి నమస్కరించినాడు. కౌసల్య రాముని కౌగిలించుకొన్నది.

**కౌసల్య:** రామా! నీ తండ్రి యెంత సత్యవంతుడు! మాటమీద నిలిచి నీకిప్పుడే యౌవ రాజ్య పట్టాభిషేకమును చేయనున్నాడు. చూడుము.

ఈ మాటలు చెప్పి రామునికి పీఠము వైచి "నాయనా! భోజనము చేయుము" అని చెప్పినది. రామునికి సిగ్గు ముంచుకొని వచ్చినది. మర్యాదను పాటించి పీఠమును స్పృశించి తల్లితో అనుచున్నాడు.

రాముడు : తల్లీ! మనకు సంభవించిన గొప్ప ఆపదసంగతి నీకు తెలిసినట్లేలేదు. ఇప్పుడు నీకును, సీతకును, లక్ష్మణునికిని గొప్ప దుఃఖము వాటిల్లినది. రాజుగారి ఆజ్ఞ అయినది. నేను దండకారణ్యమునకు వెళ్ళి పదునాలుగు సంవత్సరములు మునివృత్తిలో గడపవలయును. యౌవరాజ్యము భరతునికి ప్రసాదింపబడినది.

ఈ మాటలు వినినతోడనే కౌసల్య మూర్ఛిల్లి నేల వ్రాలినది. రాముడు తల్లిని లేవనెత్తి కూర్చుండబెట్టి శరీరమును తడివి ధూళి దులిపినాడు.

కౌసల్య : (దీనురాలై) రామా! నీవు పుట్టకయే యుండినచో బిడ్డలు లేరన్న చింత మాత్రమే ఉండి యుండును. ఇట్టి విపరీతదుఃఖము నాకు కలిగియుండదు. నా జన్మమున సుఖమను మాటయేలేదు కాబోలు! భర్తవలన నా కెట్టి సుఖము గాని కలుగలేదు. కొడుకైనను సుఖపెట్టకపోవునా అని ఆశపడినాను.

నదృష్టపూర్వం కల్యాణం సుఖంవా పతి పౌరుషే
అపి పుత్రేఽపి పశ్యేయ మితి రామాఽస్థితం మయా 20-38

నేను పట్టమహిషినైనను నా సపత్నులు నన్నెంతో తూలనాడుచు అనరాని వినరాని మాటలతో బాధపెట్టుచున్నారు. స్త్రీకి అంతకుమించిన దుఃఖము మరియొకటి కలదా! నీ విందున్నప్పుడే నా సపత్నులవలన నాకు ఎంత అవమానము జరుగుచున్నదో చూచితివి గదా! నీ విక్కడనుండి వెళ్ళినయెడల నాగతి ఏమి? నేను కైకేయి ముఖము చూచి ఆవిడ ఆజ్ఞకు లోబడి కాలము గడపగలనా! ఆమె పొడుపుమాటలను సహింపగలనా! నీవు యువరాజు వగుదు వనియు నా దుఃఖము తీరిపోవు ననియు ఎన్నియో కలలు కన్నాను. నా వ్రతములు, ఉపవాసములు, దానములు, నియమములు, అన్నియు చవిటిభూమిలో నాటిన బీజమువలె నిష్ఫలము లైనవి.

సునిష్ఫలం బీజ మివోప్త మూషరే. 21-52

నా హృదయము ఒక రాతిబండ. కానిచో ఇట్టి దారుణవార్త వినినవెంటనే అది తునియలైపోవదా! నాకు యమలోకమునకూడ చోటులేదుకాబోలు! రామా! నేను నిన్ను విడిచియుండలేను. ఆవు తనదూడను వెంబడించునట్లు నేను నీవెంట అడవికి వచ్చెదను.

ఇట్లు విలపించుచున్న కౌసల్యా దీనాలాపములను లక్ష్మణుడు విని మాటలాడు చున్నాడు.

లక్ష్మణుడు: ఒకానొక స్త్రీమాటకు లోబడి రాముడు అరణ్యమునకు పోదలచుట నా కేమియు సమ్మతముకాదు. వృద్ధుడు, చపలుడు, విషయలోలుడు అయిన దశరథుడు కైకేయి ప్రేరణతో ఎట్టిమాటనైనను చెప్పగలడు. దానిని మన మంగీకరింపవలసిన పనిలేదు. రాముడు అరణ్యమునకు వెళ్లవలసినంత అపరాధము ఏమి చేసినాడు? దేవకల్పుడైన రామునియందు దోష మెన్నువారు నా కగపడ లేదు. ఇట్లు అకారణముగా కుమారుని పరిత్యజించువా రెందైన గలరా? అట్టి తండ్రిమాటను రాజనీతి తెలిసిన కుమారుడు పాటించునా! రామా! నామాట వినుము. ఈ విషయము నలుగురికి వెల్లడి కాకపూర్వమే నీవు రాజ్యమును స్వాధీన పరచుకొనుము. నేను ధనుస్సును ధరించి నీవెంబడి ఉందును. నీ ఆజ్ఞను ఎవ్వడు అతిక్రమించునో చూచెదను. ఎవ్వరు అడ్డము వచ్చినను వారిని వధించిపుచ్చెదను. భరతుని పక్షమువా రెవరైనను ఉన్నయెడల వారిని సైతము వధింతును. రామా! మనము మృదువుగా ఉన్నచో మనకు పరిభవము తప్పదు.

మృదుర్హి పరిభూయతే. 21-11

కైకేయిమాటకు లోబడి మనతండ్రి మనకు అడ్డము వచ్చునేని తండ్రినికూడ వధింతును; లేదా బంధించెదను. తండ్రియైనను దారితప్పి నడచువానిని దండింపవలసినదే.

ప్రోత్సాహితోఽయం కైకేయ్యా సంతుష్టో యదినః పితా
అమిత్ర భూతో నిస్సఙ్గం వధ్యతాం బధ్యతా మపి 21-12

గురోరప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః
ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనమ్. 21-13

ఈ దశరథుడు ఏ బలమును నమ్ముకొని ఇంతటి దారుణకృత్యమును తలపెట్టి నాడు! నిన్ను విడనాడుటకు కారణ మేమైన కలదా? నీతోను నాతోను విరోధ మూని భరతునికి రాజ్యమును ఎట్లీయగలడో చూచెదనుగాక!

తల్లీ కౌసల్యా! రామునియెడ నాకు మిక్కిలి ప్రీతి. సత్యముమీదను నాధనుస్సు మీదను ప్రమాణము చేసి చెప్పుచున్నాను. రాముడు అడవికి పోయినను అగ్నిలో ఉరికినను అతనికి ముందే అక్కడ నేనుందునని నమ్మియుండుము. నీవేమియు దుఃఖంప వలసిన పనిలేదు. నీ దుఃఖమును నా పరాక్రమముచే రూపు మాపెదను. నా శౌర్య వీర్యములను నీవును రాముడును ఇప్పుడే చూతురుగాక!

కౌసల్య : (ఆశపడి) రామా! వింటివా నీ తమ్ముని పలుకులు! అత డన్నట్లు చేయకూడదా? నా సపత్నియైన కైకేయి మాటలను పాటించి నన్ను దుఃఖమున ముంచివేయకుము. ధర్మమునే అవలంబింప కోరుదువేని నాకు శుశ్రూష చేయుచు ఇందే యుండుము. మాతృశుశ్రూష గొప్ప ధర్మముకాదా! నీవు అడవికి వెళ్లుట నేను సమ్మతింపను. నా మాట త్రోసిపుచ్చి నీవు వెళ్లుదువేని నేను ప్రాణములు విడువగలను. ఆ పాపము నీకు ఆపాదించును.

రాముడు : తల్లీ! నీకు సాష్టాంగ నమస్కారముచేసి వేడుకొనుచున్నాను. అడవికి వెళ్లుటకు నాకు అనుజ్ఞ నిమ్ము. నేను తండ్రిమాటను మీరజాలను. మన పూర్వు లందరు పితృవాక్యపరిపాలన చేసినవారు. పరశురాముడు తండ్రిమాట ననుసరించి తల్లినికూడ వధించి యున్నాడు. ఎందఱో మహనీయులు పితృవాక్యమును పరిపాలించి ధర్మము నార్జించి యున్నారు. పితృవాక్య పరిపాలనము క్రొత్త ధర్మముకాదు. మహనీయులు సూచించిన మార్గమునే అనుసరించుచున్నాను గాని మరేమియుకాదు. పితృవాక్యమును పాలించినవాడు ఎన్నిటికిని చెడడు.

(లక్ష్మణునిచూచి) లక్ష్మణా! నా యందు నీకుగల సాటిలేని స్నేహమును నే నెరుగుదును. ఎదురులేని నీ బల పరాక్రమముల మహిమ నాకు క్రొత్తదికాదు. దుఃఖమున మునిగియుండి మోహితురాలై మాతల్లి 'సత్యము'ను 'శమము'ను అర్థము చేసికొనజాలక యున్నది. ధర్మవిదుడ వగు నీవుకూడ ఇట్లేల మాటలాడుచుంటివి?

పురుషార్థము లన్నిటిలోను ధర్మము శ్రేష్ఠమైనది. ధర్మమునందే సత్యము నెలకొని యున్నది. పితృవాక్య పరిపాలనకూడ ధర్మసంశ్రితము గనుక దానిని తప్పక ఆచరింపవలెను.

ధర్మోహి పరమో లోకే ధర్మే సత్యం ప్రతిష్ఠితమ్
ధర్మ సంశ్రిత మేతచ్చ పితుర్వచన ముత్తమమ్. 21-40

లక్ష్మణా! క్రూరమైన రాజనీతిని అనుసరించి నీవు మాటాడుచున్నావు. ధర్మమునకును రాజధర్మమునకును ఎంతో భేద మున్నది. క్రూరమైన నీ తలపులు మాని నీవు ధర్మము నాశ్రయించి నా మతము ననుసరింపుము.

తదేనాం విసృజానార్యాం క్షత్రధర్మాశ్రితాం మతిమ్
ధర్మ మాశ్రయ మాతైక్ష్ణ్యం మద్బుద్ధి రనుగమ్యతామ్. 21-43

తల్లీ! నీకు నమస్కారము చేయుచున్నాను. నాకు అనుజ్ఞ నిచ్చి నన్ను ఆశీర్వదింపుము. నేను ప్రతిజ్ఞను పాలించి మరల అయోధ్యకు రాగలను. దశరథ చక్రవర్తి ఆజ్ఞకు లోబడవలసినది నేను మాత్రమేకాదు. నీవును, సుమిత్రయును, లక్ష్మణుడును,

సీతయు, అందరును లోబడవలసినవారే. ఇది సనాతన ధర్మము. కావున నన్ను అడవికి పంపుమాట చూడుము.

లక్ష్మణా ! కైకేయికి ఎట్టి అనుమానముగాని కలుగజేయకుండుటయే ప్రధాన కర్తవ్యము. తండ్రిని సత్యసంధు డని అనిపించుట ముఖ్యము. కావున నేను వెంటనే అడవికి ప్రయాణ మగుచున్నాను. అప్పుడుగాని కైకేయికి సంతోషము కలుగదు. ఇది అంతయు దైవసంకల్పమేగాని వేరుకాదు. అట్లు కానిచో కైకేయికి ఇట్టి బుద్ధి జనించునా? గొప్పకులమున పుట్టిన కైకేయి భర్త యెదుట సిగ్గువిడిచి ఒక ప్రాకృత స్త్రీ వలె మాటలాడిన దనగా అర్థ మేమి ? ఇది అంతయు దైవ సంకల్ప మని తెలిసికొనవలెను. దైవము మన బుద్ధికి అందునదికాదు. దైవమునకు తిరుగులేదు. "దైవమును పురుష ప్రయత్నముచేత నివారింప జాలమా" అని అందువుకాబోలు! అది సాధ్యముకాని పని. ఏల యన, దైవగతి మనకు ముందుగా తెలియదు. కార్యఫలమునుబట్టి మాత్రమే తెలిసికొనగలము. ఫలిత మేర్పడినపిదప నివారించుట కేమున్నది ? కావున ముందే సిద్ధపడి దైవము నెదుర్కొనుటకు వీలులేదు. దైవయోగము జరిగియే తీరును.

దైవము లేదని వాదించుటలో లాభములేదు. గమనించి చూడుము. మన మెంతో శ్రమపడి అక్కర కలిగి చేసిన పనులు కొన్ని ఫలింపవు. కొన్ని పనులు మనకు తెలియకయే సులభముగా నెరవేరుచున్నవి. దీని కంతటికిని దైవమే కారణము. సుఖము, దుఃఖము, భయము, కోపము, లాభము, నష్టము, జననము, మరణము మున్నగు వానికి నిజమైన కారణములు మనకు తెలియవు. మన బుద్ధిచే మనము తెలిసికొనలేని ఇట్టి సంఘటన లన్నియు దైవకృతములే అని ఎరుగుము. ఈ సత్యము నా మనస్సునకు తోచియే నా పట్టాభిషేకము విఫల మైనను, నేను అరణ్యావాసము చేయవలసి వచ్చినను పరితాపము జెందక యున్నాను. నీవుకూడ ఈ అర్థమును తెలిసికొనుము. సంపద తొలగిపోయిన దని విచారపడకుము. రాజ్యమును వనవాసమును సరిపోల్చి చూడగా వనవాసము ధర్మఫలము నిచ్చును గనుక రాజ్యమునకన్న వనవాసమే గొప్ప దని ఏర్పడుచున్నది. దీని కంతటికి కైకేయి కారణభూతురా లని చెప్పుట తప్పు. దైవమే ఆమెచేత అట్లు పలికించినది. దైవమును కాదనుటకు మనకు సాధ్యముకాదు.

సోఽభిషేక నివృత్త్యర్థైః ప్రవాసార్థైశ్చ దుర్వచైః
ఉగ్రై ర్వాక్యై రహం తస్యా నాన్యద్దైవా త్సమర్థయే 22.18

కథం ప్రకృతి సంపన్నా రాజపుత్రీ తథాగుణా
బ్రూయా త్సా ప్రాకృతేవస్త్రీ మత్పీడాం భర్తృ సన్నిధౌ 22.19

యదచిన్త్యంతు తద్దైవం భూతేష్వపి న హన్యతే
వ్యక్తం మయిచ తస్యాం చ పతితో హి విపర్యయః 22.20

కశ్చి ద్దైవేన సౌమిత్రేః యోద్ధు ముత్సహతే పుమాన్
యస్య నగ్రహణం కిఞ్చి త్కర్మణోఽన్యత్ర దృశ్యతే 22.21

సుఖదుఃఖే భయక్రోధౌ లాభాలాభౌ భవాభవౌ
యచ్చ కించి త్తథాభూతం ననుదైవస్య కర్మతత్ 22-22

అసంకల్పిత మేవేహ య దకస్మా త్ప్రవర్తతే
నివర్త్యారంభ మారబ్ధం నను దైవస్య కర్మతత్ 22.24

మా చ లక్ష్మణ సంతాపం కార్షీ ర్లక్ష్మ్యా విపర్యయే
రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః 22.29

న లక్ష్మణాస్మిన్ ఖలు కర్మవిఘ్నే
మాతా యవీయస్యతి శంకనీయా
దైవాభి పన్నా హి వద న్త్య నిష్టం
జానాసి దైవంచ తథా ప్రభావమ్ 22.30

శ్రీరాముని మాటలు విన్న లక్ష్మణునికి ఒకప్రక్క సంతోషము ఒకప్రక్క విషాదము కలిగినవి. రాముని ధర్మబుద్ధిని తలచుకొని సంతోషించినాడు. రాజ్యమును వదలుకొనుచున్నాడు గదా యని విషాదపడినాడు.

లక్ష్మణుడు తన కోపమును అణుచుకొనలేక బొమముడి వైచి బుసలు విడుచు చున్నాడు. చేతిని విదిలించి మెడను ముందుకు వెనుకకు క్రిందికి పైకి త్రిప్పుచు కడకంట చురచుర చూచుచు రామునితో అనుచున్నాడు.

***లక్ష్మణుడు :*** అన్నా! నీవు చేయుపని ఏ మాత్రము బాగులేదు. దుర్బలమగు దైవమును కొనియాడుచున్నావు. పాపాత్ములైన కైకేయీ దశరథుల మాటలు మన్నించుచున్నావు. ఇది అంతయు వారి కుట్ర. వరము లేమిటి? ఇన్నాళ్లు లేక ఇప్పుడు కోరుట యేమిటి? దానిని ఇచ్చు టేమిటి? నీవు జ్యేష్ఠుడవు. నిన్ను తప్పించి చిన్నవానికి పట్టాభిషేకము చేయుట ఎందైన గలదా? దీనికి నేను సమ్మతింపను. పితృవాక్య పరిపాలన గొప్ప ధర్మ మన్నావు. సరే! బాగుగనే ఉన్నది. కాని తండ్రి తెలిసి చెప్పిన మాటకే ఆ ధర్మము వర్తింపగలదు. మన తండ్రి నీకు పేరుకు మాత్రమే తండ్రిగాని నిజముగా నీకు శత్రువు. కైకేయికి లోబడిన కాముకుడు. అట్టివాని మాట ఏల పాటింపవలయును ?

ఇదియంతయు దైవయోగ మన్నావు. దైవమునకు తిరుగు లేదని వాదించు చున్నావు. ఆమాట నేను అంగీకరింపను. ఎవ్వరో చేతగాని బలహీనులు దైవమును అనుసరింతురుగాని వీరులు, ధీరులు అట్లు చేయరు.

విక్లబో వీర్యహీనో యః స్స దైవ మనువర్తతే
వీరా స్సంభావితాత్మానో న దైవం పర్యుపాసతే 23-16

ఆ దైవము సంగతి ఇప్పుడే తేల్చివైచెదను. నా పౌరుషముచే దైవమును హతము చేయుదును. నా బాహువు లుండుట అలంకారమునకు కాదు. నా ధనుస్సును భూషణముగా ధరించుటలేదు. శత్రు సంహారమునకు ఉపయోగించుటకే ఇవన్నియు.

ద్రక్ష్యన్తి త్వద్యదైవస్య పౌరుషం పురుషస్యచ
దైవ మానుషయో రద్య వ్యక్తావ్యక్తి ర్భవిష్యతి 23-19

అద్య మత్పౌరుష హతం దైవం ద్రక్ష్యన్తివై జనాః 23-20

న శోభార్థా విమౌ బాహూ నధను ర్భూషణాయ మే 23-30

రామా! నేను నీ కింకరుడను. నీవు ఆజ్ఞ ఇత్తువేని ఈ క్షణములో నిన్ను సింహాసనము మీద కూర్చుండబెట్ట గలను. అడ్డువచ్చిన వారి నందరను చించి చెండాడి నిన్ను ప్రభువుగా చేయుదును.

లక్ష్మణునికి కన్నీరు ప్రవహించుచుండినది. రాముడు లక్ష్మణుని కన్నీరు తుడిచి ఓదార్చి

రాముడు : లక్ష్మణా! నీవు సహజముగా సౌమ్యుడవు గదా! ఇప్పు డెందు కీ కోపము. నీ కోపమును, నీ దుఃఖమును మానుము. మన తండ్రిమాట జరిగి తీరవలసినదే. అదియే ధర్మము. దీనికి తిరుగు లేదు.

కౌసల్య : నాయనా! అడవికి వెళ్లుటయే నిశ్చయించితివా! విధికి ఎంత బల మున్నది! కానిచో లోకాభిరాముడవైన నీవు అడవులపా లగుదువా!

నూనం తు బలవాన్ లోకే కృతాంత స్సర్వమాదిశన్
లోకే రామాభి రామ స్త్వం వనం యత్ర గమిష్యసి 24-5

రామా! నిన్ను విడిచి ఉండజాలను. నేనుకూడ నీ వెంట వచ్చెదను.

రాముడు : అమ్మా! నీవు నావెంట వత్తువేని మా తండ్రికి దిక్కెవరు? కైకేయి చేతిలో చిక్కి ఇప్పటికే ఎంతో నలిగియున్నాడు. నేనేమో అరణ్యమునకు వెళ్లుచున్నాను. నీ వింటనే ఉండి ఆయనకు శుశ్రూష చేయుచుండుము.

కౌసల్య : రామా ! నేను నా సపత్నుల నడుమ సుఖముగా ఉండగలనా! నా బాధను గమనించి నన్ను నీవెంట కొనిపొమ్ము.

రాముడు : అమ్మా! నీకు తెలియని దేమున్నది. స్త్రీకి భర్తయే గదా దైవము. భర్త జీవించియుండగా నీవు నా వెంట వచ్చుట బాగుండునా! అదియుగాక, భరతుడు ధర్మాత్ముడు. నిన్ను తప్పక పూజింపగలడు. నీవు నా తండ్రికి పరిచర్యచేయుచు ఇక్కడనే ఉండి నేను మరలి వచ్చువరకు నా క్షేమము నర్థించి దేవతలను పూజించుచుండుము. నేను వచ్చునప్పటికి నా తండ్రి జీవించి యుండునేని నీ కోరిక లన్నిటిని నీవు తీర్చుకొనవచ్చును. నేను వనవాస వ్రతమును ముగించుకొని వచ్చి నీ మాటలోనే ఉండగలను.

కౌసల్య : నాయనా! నీ బుద్ధి మరలించుట నాకు సాధ్యముకాదు. దైవబలమునకు తిరుగు లేదు. నీవు నిశ్చల బుద్ధితో అడవికి వెళ్లుము. నీకు మంగళ మగుసు గాక! నీవు నీ వనవాస వ్రతమును పూర్తి గావించి నీ ప్రతిజ్ఞను తీర్చుకొని కుశలివై వచ్చి పట్టాభిషిక్తుడవు కమ్ము. నాయనా! నీవు ఏ ధర్మము నాశ్రయించి అడవికి వెళ్లుచుంటివో ఆ ధర్మమే నిన్ను రక్షించుగాక! దేవతలు నిన్ను కాపాడుదురు గాక! విశ్వామిత్ర మహాముని నీకు ప్రసాదించిన అస్త్రములు నిన్ను ఎల్లప్పుడును రక్షించుచుండుగాక! ఆకాశము, భూమి, నక్షత్రములు, గ్రహములు, అహో రాత్రములు, సంధ్యా కాలములు, పర్వతములు, సముద్రములు, అన్నియు నిన్ను రక్షించుగాక! రాక్షసులవలనగాని పిశాచములవలనగాని నీకు భయము కలుగకుండునుగాక!

కౌసల్య శ్రీరామునికి మంగళా శాసనము కావించి బ్రాహ్మణులచే యథా శాస్త్రముగా హోమము చేయించి రామునికి మంగళము కోరుచు ఆశీర్వదించినది.

యన్మంగళం సహస్రాక్షే సర్వదేవ నమస్కృతే
వృత్రనాశే సమభవ త్తత్తే భవతు మంగళమ్ 25-32

యన్మంగళం సుపర్ణస్య వినతాఒకల్పయ త్పురా
అమృతం ప్రార్థయానస్య తత్తేభవతు మంగళమ్ 25-33

అమృతో త్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్యయత్
అదితి ర్మంగళం ప్రాదా త్తత్తే భవతు మంగళమ్ 25-34

త్రీ న్విక్రమా న్ప్రక్రమతో విష్ణో రమిత తేజసః
యదాసీ న్మంగళం రామ తత్తే భవతు మంగళమ్ 25-35

ఋతవ స్సాగరాద్వీపా వేదా లోకా దిశశ్చ తే
మంగళాని మహాబాహో దిశన్తు శుభమంగళాః. 25.38

ఈవిధముగా కౌసల్య కుమారుని ఆశీర్వదించి శిరస్సున అక్షతలు వైచి మేనికి గంధ మలంది 'విశల్యకరణి' అను ఓషధిని రాముని చేతికి రక్షగా కట్టి దుఃఖమును దిగమ్రింగి రాముని కౌగిలించుకొని

**కౌసల్య :** నాయనా! నీవు సుఖముగా పోయిరమ్ము. నీవు నీ ప్రతిజ్ఞను నెరవేర్చి కుశలివై వచ్చి పట్టాభిషిక్తుడవై నా కోడలి ముచ్చట్ల నన్నిటిని తీర్చుచు హాయిగా వర్ధిల్లుము. నే నిప్పుడు పూజించిన దేవత లందరు నీకు హితము చేకూర్తురుగాక!

కౌసల్య ఈ విధముగా ఆశీర్వదించి రక్షగా రామునికి ప్రదక్షిణముచేసి కుమారుని ఆలింగనము చేసికొన్నది. శ్రీరాముడు తల్లి పాదములకు పలుమారు మ్రొక్కి తల్లి యొద్ద సెలవు గైకొని తన తేజస్సుతో ప్రజ్వలించుచు సీతా నిలయమునకు ప్రయాణ మైనాడు.

తథాతు దేవ్యా చ కృత ప్రదక్షిణో
నిపీడ్య మాతు శ్చరణౌ పునః పునః
జగామ సీతా నిలయం మహాయశా
స్సరాఘవః ప్రజ్వలిత స్స్వయం శ్రియా. 25.47

[ధర్మమును అనుసరించువాని ముఖమందు అట్టి వెలుగు కలుగును.]

## శ్రీరాముడు తన వనవాసమునుగూర్చి సీతాదేవికి చెప్పుట

జరిగిన విపరీతము లేవియు సీతాదేవికి తెలియవు. పట్టాభిషేకము జరుగు ననియే తలంచి శ్రీరామునికి సుస్వాగత మిచ్చుటకు సిద్ధముగా ఉండి భర్త రాకకు ఎదురు చూచుచున్నది.

శ్రీరాముడు లజ్జాభరమున తలవంచుకొని

[26.5 హ్రియా కించి దవాఙ్ముఖః] పాదచారియై వచ్చుచున్నాడు. దుఃఖ పడు చున్నాడు. అట్టి శ్రీరాముని చూచి సీతాదేవి కంపించినది. రాముడు సీతను చూచి దుఃఖమును ఆపుకొనలేకపోయినాడు. కన్నీరు వచ్చినది.

**సీత :** ప్రభూ! ఏమిటీ వైఖరి! పట్టాభిషేక సమయము గదా! నీఛత్ర మేది! చామరము లెక్కడ? వంది మాగధులు కానరారేమి? పట్టాభిషేకము ఇంకను జరుగని కారణ మేమి? ప్రజలు నీ వెంబడి గుంపులు గుంపులుగా వచ్చుటలే దేమి.

నీ రథ మేమైనది ? పట్టపుఏనుగు కానరాదేమి. నీ ముఖము పాలిపోయియున్న కారణ మేమి ? ఇంతకు పూర్వము ఎన్నడులేని యీ దుఃఖము ఇప్పు డేల వచ్చినది.

**రాముడు :** సీతా ! నా తండ్రిగారు నన్ను అరణ్యమునకు వెళ్లు మని ఆజ్ఞాపించినారు. నీవు గొప్పకులమున జన్మించి ధర్మమును తెలిసికొని ఆచరించుదానవు. నా వన వాస విషయమును చెప్పెదను వినుము.

కులే మహతి సంభూతే ; ధర్మజ్ఞే ధర్మచారిణి
శృణు జానకి యే నేదం క్రమే ణాభ్యాగతం మమ. 26-20

పూర్వ మెప్పుడో మా తండ్రిగారు కైకేయికి రెండు వరము లిచ్చినారట. వానిని ఆమె ఇప్పుడు కోరుకొన్నది. నేను పదునాలుగు సంవత్సరములు దండకా రణ్యములో నివసించుట మొదటిది. భరతునికి యౌవరాజ్య పట్టాభిషేకము చేయుట రెండవది. నే నిప్పుడే అరణ్యమునకు బయలుదేరవలెను. నిన్ను చూచి పోవుద మని ఇక్కడికి వచ్చితిని.

ఒకమాట జ్ఞప్తియం దుంచుకొనుము. భరతుని ఎదుట మాత్రము నన్నెప్పుడును స్తుతింపకుము. సంపదతో కూడియున్నవారు పరుల గొప్పతనమును విని సహించి యుండలేరు.

బుద్ధి యుక్తాహి పురుషా న సహన్తే పర స్తవమ్. 26-25

సీతా ! నీ వెల్లప్పుడు భరతునికి అనుకూలముగా ప్రవర్తింపవలయును సుమా !

నేను అడవికి పోయినప్పుడు నీవు వ్రతములు, ఉపవాసములు, చేయుచు నియమముగా ఉండుము. ప్రొద్దుననే లేచి పూజలుచేసి మా తండ్రికి నమస్కరింపుము. మా తల్లిని గౌరవించుచుండుము.

భరత శత్రుఘ్నులమీద నాకు మిక్కిలి ప్రేమ. వారిని సోదరులు గాను, కుమారులుగాను భావింపుము.

భరతుడు 'ప్రభువు' అనుమాట మరవవలదు. రాజులకు కోపము కలుగునేని ఎంతపనికైయైనను చేయుదురు. కన్నకొడుకులను సైతము విసర్జింతురు. కావున ప్రభువుపట్ల మెలకువతో వర్తింపవలయును.

సా త్వం వసేహ కల్యాణి రాజ్ఞ స్సమనువర్తినీ
భరతస్య రతా ధర్మే సత్యవ్రత పరాయణా. 26-37

**సీతా ! నేను అరణ్యమునకు వెళ్ళెదను.**

సీతాదేవి శ్రీరాముని మాటలను విన్నది. ఆమెకు ప్రణయకోపము కలిగి రాముని తో అనుచున్నది.

ప్రణయా దేవ సంక్రుద్ధా భర్తార మిద మబ్రవీత్. 27.1

## సీతారాముల సంవాదము

**సీత:** రామా! ఏమిటి ఈ పనికిమాలిన మాటలు! నీ వొక రాజపుత్రుడవుగా ఉండి ఇట్లు తేలికగా మాటలాడ దగునా! ఎవ్వరైనను విన్నచో నవ్విపోగలరు.

కిమిదం భాషసే రామ! వాక్యం లఘుతయా ధ్రువమ్
త్వయా య దపహాస్యంమే శ్రుత్వా నరవరాత్మజ. 27.2

తల్లి, తండ్రి, తోబుట్టువులు, కొడుకులు, కోడండ్రు వారి వారి కర్మఫలములను వారే అనుభవింతురు. భార్యమాత్రమే భర్తకు సంభవించు శుభాశుభములను అనుభవించుచున్నది.

భర్తుర్భాగ్యం హి భార్యైకా ప్రాప్నోతి పురుషర్షభ. 27.4

కావున, నిన్నాజ్ఞాపించినప్పుడు నన్నుకూడ ఆజ్ఞాపించినట్లే. స్త్రీకి భర్తయే కదా గతి? నేను నీ వెంట వచ్చెదను. నేను ముందర నడచి, మార్గమున నుండు కంటకములను తీసివైచి, దారిని చక్కపరతును. ఈర్ష్యారోషములను విసర్జించి నీతో నివసింపగలను. భర్తపాదసేవను మించిన శుభ మేదియునులేదు. ఈ విషయమును గురించి నా తల్లిదండ్రులు ఇదివరకే నాకు ఉపదేశించి యున్నారు. నాకు సమస్త ధర్మములు చక్కగా తెలియును. ఇప్పుడు క్రొత్తగా యెవ్వరును చెప్పవలసిన పనిలేదు.

రామా! నీకు శుశ్రూష చేయుచు నియమముతో బ్రహ్మచారిణిగా ఉండెదను. మనము వనములో సుఖముగా కలిసియుండవచ్చును. నీతో అడవిలో నున్నను తల్లిగారింట ఉన్నటులే యుండును. నన్ను రక్షించుట నీకొక పెద్దపనికాదు. అక్కడికి వచ్చి నిన్ను బాధపెట్టను. అది కావలెను, ఇదికావలెను అని అడుగను. నన్ను నీవెంట కొనిపొమ్ము. ఫలమూలములను భక్షించుచు నీ కెట్టి సంతాపమును కలిగింపక నీతోటి ఉండెదను.

శుశ్రూషమాణా తే నిత్యం నియతా బ్రహ్మచారిణీ
సహ రంస్యే త్వయా వీర! వనేషు మధుగంధిషు. 27.12

ఫలమూలాశనా నిత్యం భవిష్యామి నసంశయః
న తే దుఃఖం కరిష్యామి నివసంతీ సహత్వయా. 27.15

రామా! నేను నీతో వచ్చి అరణ్యములు, పర్వతములు మున్నగు వానిని చూడ వలయునని ఆశపడుచున్నాను. నీతోకూడ అడవిలో ఎన్నివేల సంవత్సరములైనను సుఖముగా గడపగలను. నిన్నుబాసి స్వర్గమున సైతము నివసింప జాలను. నేను నీతో తప్పక వత్తును. నన్ను వదలి నీవు పోయినయెడల నేను జీవించియుండజాలను. నిన్ను వేడు కొనుచున్నాను. నా ప్రార్థన నంగీకరించి నన్ను నీవెంట తోడ్కొనిపొమ్ము.

అరణ్యమునందలి కష్టములను తలచుకొని రాముడు సీతను తీసికొనిపోవుటకు ఇష్టపడలేదు. ఆమెను ఎట్లయిన ఆపివేయుటకు ప్రయత్నించుచున్నాడు.

రాముడు: సీతా! గొప్పఇంట పుట్టితివి. ఎల్లప్పుడు ధర్మమునే ఆచరించుచుందువు. ఇందే ఉండి ధర్మము నాచరించుచుండుము. నీ మనోసుఖమును గురించి మాత్రమే ఆలోచింపరాదు. నేను చెప్పినట్లు చేయవలయునేగాని నీ ఇష్టానుసారము వర్తింప కూడదు.

సీతే! యథా త్వాం వక్ష్యామి తథాకార్యం త్వయాఽబలే. 28-4

అరణ్యమనిన సామాన్యముకాదు. అచ్చట అనేక కష్టము లున్నవి. అందుకే వనమును 'కాంతారము' అన్నారు. అంటే 'చొరరానిది' అన్నమాట. వనములో సుఖమనునది ఉండదు. ఎప్పుడును దుఃఖమే. పర్వతముల పైనుండి సెలయేళ్లు గొప్ప శబ్దముతో పారుచుండును. పర్వత గుహాలయందు సింహములు, వ్యాఘ్రములు గర్జించు చుండును. మనపైకి దూకి మనలను చంపినను చంపును. నదులలో పెద్దపెద్ద మొసళ్లు కలవు. అచ్చటి నదులను దాటుటకు ఏనుగులుకూడ జంకు ననగా మన సంగతి యేమిటి! అడవిలో దారిగాని డొంకగాని ఉండదు. జలముకూడ దుర్లభము - పగలంతయు తిరిగి తిరిగి కందమూలములను త్రవ్వి తెచ్చుకొనవలయును. రాత్రివేళ నేలమీద చెట్ల ఆకులను పరచుకొని శయనింపవలెను. ఉపవాసములు నియమముగా చేయవలెను. నార చీరలు ధరించి జటలు దాల్చి యుండవలెను. దేవతలకు అతిథులకు పూజలు చేయుచుండవలెను. దినమునకు మూడుసారులు స్నానములు చేయవలెను. మనకు కావలసినంత ఆహారము కూడ లభింపదు. తేళ్లు పాములు మున్నగునవి ఎల్లప్పుడు దారికి అడ్డముగా తిరుగుచునే ఉండును. దారి అసలు ఉండదు. ఎక్కడ చూచినను కంటకమయముగా నుండును. నడచుట సులభముకాదు.

వనవాసము చేయువారికి కోపము, లోభము ఉండకూడదు. బుద్ధిని తపస్సునందే నిలుపవలయును.

ఈ కష్టము లన్నియు నీ కెందుకు చెప్పుము! సుఖముగా ఇందుండుము.

సీత : (కన్నీటితో) నాథా ! నిన్ను గూడియుందును గావున వనవాసమును గురించి నీవు చెప్పిన దోషము లన్నియు నాకు గుణములుగానే తోచుచున్నవి. నీవు చెప్పిన సింహములు వ్యాఘ్రములు నీ అపూర్వ రూపమును చూచి భయపడి పరుగెత్తిపోగలవు. భయము వానికి మాత్రము లేకయుండునా ?

అదృష్ట పూర్వ రూపత్వా త్సర్వే తే తవ రాఘవ
రూపం దృష్ట్వా పసర్పేయు ర్భయే సర్వేహి బిభ్యతి 29.4

నాథా ! భర్తకు దూరమైన స్త్రీ ప్రాణముతో ఉండజాలదు. ఈవిషయము నీవే నాకు అనేక పర్యాయములు చెప్పియున్నావుగదా ! అదియునుగాక నాకు కొంత కాలము వనవాసము ప్రాప్తించు నని దైవజ్ఞులు మా తండ్రి ఇంట ఇదివరకే చెప్పి యున్నారు. అది ఎన్నడు కలుగునా అని ఎదురుచూచుచున్నాను. అరణ్యావాసము నిన్నుగూడి చేయవలసినదే గాని ఇతరవిధముగా నా కది సాధ్య మగునా ?

దైవజ్ఞులు నా వనవాసమునకు నిర్ణయించిన సమయముకూడ ఇప్పుడే - నిన్ను కూడి వనవాసము చేయవలయు నని నాకు బహుకాలముగా కోరిక యున్నది.

నాథా ! నీ యందు ప్రేమగలదానను. పతివ్రతను - దుఃఖములో ఉన్నాను. సుఖదుఃఖములను రెండింటిని నీతో సమముగా పంచుకొనుదానను. నన్ను నీ వెంట తోడ్కొని పొమ్ము.

భక్తాం పతివ్రతాం దీనాం మాం సమాం సుఖదుఃఖయోః
నేతు మర్హసి కాకుత్స్థ ! సమాన సుఖదుఃఖినీమ్ 29.20

నాథా ! నన్ను తీసికొని పోవుటకు సమ్మతింపవేని, నేను విషము పుచ్చుకొనెదను. లేనిచో అగ్నియందో జలములందో పడి ప్రాణత్యాగము చేయుదును.

ఈ విధముగా బ్రతిమాలి సీతాదేవి కన్నీరు విడిచినది. కాని రాముడు మెత్త బడలేదు. అతని బుద్ధి మారలేదు. ఊరడింపు పలుకులు మాత్రము పలుకుచున్నాడు.

సీతాదేవికి దుఃఖముతోపాటు కోపము వచ్చినది. నిష్ఠురముగా మాటాడుచున్నది.

సీత : నాథా ! నన్ను వెంట గొనిపోవుటకు భయపడుచున్నా వేమి ? ఈ సంగతిని విని మా జనకు డేమి భావించునో తెలియునా ! "మా అల్లుడు పురుషరూపములో నున్న స్త్రీయే" అని భావింపగలడు.

కిం త్వా మన్యత వైదేహః పితామే మిథిలాధిపః
రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహమ్. 30.3

నాథా! నన్ను వెంటకొనిపొమ్ము. నేను సావిత్రివంటి పతివ్రత నని తెలిసికొనుము. నిన్ను విడిచి ఒక క్షణమైనను ఉండజాలను. నేను నీ భార్యను-పతివ్రతను. యౌవనములో ఉన్నాను. మనమిద్దరము చాలకాలము సంసారము చేసితిమి. ఈనాడు నీవు నన్ను పరునిచేతికి అప్పగింపజూచుట ఏల!

స్వయంతు భార్యాం కౌమారీం చిర మధ్యుషితాం సతీం
శైలూష ఇవమాం రామ పరేభ్యో దాతు మిచ్ఛసి. 30-8

[ఇతరులు ఇంత ధైర్యముగా పలుకగలరా! పాతివ్రత్యమునకు అంత శక్తియున్నది.]

నాథా! నీకు తెలియని నీతికాని, ధర్మముకాని లేదు. నీవు నన్ను వదలివైచి వెళ్లుటకు ఎంతమాత్రము వీలులేదు. నాథా! నేను నిన్నేమియు వేధింపను. కష్టము అని నీవు చెప్పినవానినన్నింటిని సంతోషముగా భరించెదను. ధూళిని కస్తూరిగా భావింతును. పచ్చిక నేలను పట్టుపాన్పుగా అనుభవింతును. నీ చేతులార ఇచ్చిన కందమూలములను అమృతతుల్యముగ స్వీకరింతును. నా తల్లినిగాని తండ్రినిగాని గృహమునుగాని స్మరింపనైనను స్మరింపను. నావలన నీకెట్టి కష్టమును కలిగింపను. నీతో ఉండుటయే నాకు స్వర్గము. నిన్ను బాసియుండుటయే నరకము. నన్ను తోడ్కొనిపొమ్ము. లేనిచో నేను ప్రాణములు త్యజింతును. అంతేకాని శత్రువుల స్వాధీనమున మాత్రము ఉండజాలను.

సీతాదేవి ఇట్లు విలపించి భర్తను ఆలింగనము చేసికొని గట్టిగా ఏడ్చినది. రాముని మనస్సు కరగినది. సీతాదేవిని గాఢముగా కౌగిలించుకొని రాముడు అనుచున్నాడు.

**రాముడు:** సీతా! ఏడ్వకుము. నిన్ను విడిచి నేను మాత్రము ఉండగలనా! నిన్ను రక్షించుటకు నాకు శక్తి లేకపోలేదు. నీ అభిప్రాయమును పూర్తిగా తెల్సుకొనకయే నిన్ను వెంటబెట్టుకొని పోవుటకు మనసొప్పలేదు. ఇప్పుడు నీ మనస్సు చక్కగా అర్థమైనది. నిన్ను తప్పక తీసికొనిపోవుదును.

సీతా! మనము అడవికి వెళ్లుట తప్పదు. పితృవాక్యమును పాలించుట గొప్ప ధర్మము. తల్లియు, తండ్రియు ప్రత్యక్ష దైవములు. తల్లి, తండ్రి, గురువు ఈ ముగ్గురు మూడు లోకములు. వారిని మించిన దైవములేదు. సత్యమునకుగాని దానమానములకుగాని యజ్ఞములకుగాని పితృశుశ్రూషకుగల మహిమలేదు.

నసత్యం దానమానౌ వా న యజ్ఞా శ్చాప్త దక్షిణాః
తథా బలకరా స్సీతే యథా సేవా పితుర్హితా. 30-35

పితృ శుశ్రూష వలన పొందరాని దేదియునులేదు. స్వర్గముగాని, ధన ధాన్యములుగాని, విద్యలుగాని, సుతులుగాని, సుఖములుగాని, అన్నింటిని పితృ శుశ్రూష

వలన సాధింపవచ్చును. కావున తండ్రి ఆజ్ఞను పాలించుట నా ధర్మము. నీ మనస్సు కూడ నాకు తెలిసినది గనుక నిన్నుకూడ తీసికొని వెళ్లెదను.

సీతా ! నీవు నాతో వనవాసము చేయుటకే జన్మించిన ట్లున్నావు.

[ఈ మాటలో గొప్పసత్య మున్నది. లక్ష్మీదేవి అవతారముగదా సీతాదేవి !]

నాతో వచ్చి న న్ననుసరించి ధర్మము నాచరించుచుండుము.

సా హి సృష్టా నవద్యాంగీ వనాయ మదిరేక్షణే
అనుగచ్ఛస్వ మాం భీరు సహధర్మచరీ భవ 30.40

["సహధర్మ చరీ తవ" అనిగదా జనకుడు కన్యాదానము చేసినది]

సీతా ! నాతో కూడ అరణ్యావాసము చేయవలయునని నీకు తోచుట నీ కులమునకు నా కులమునకు ఎంతో తగియున్నది. నీవు ప్రయాణమునకు సిద్ధము కమ్ము. అందరకు దానములు చేయుము. బ్రాహ్మణులకు భిక్షుకులకు భోజనములు పెట్టింపుము. మన వస్తువుల నన్నింటిని మన సేవకుల కందరకు పంచిపెట్టుము.

సీతాదేవికి పట్టరాని సంతోషము కలిగినది. దానధర్మములు ఉత్సాహముగా చేయసాగినది.

[సిద్ధముగా ఉన్న పట్టాభిషేకము చేయి జారిపోయినది. చేతిలోఉన్న వస్తువులను కూడ దానములు చేసినారు. మిగిలిన దంతయు సంతోషము ఒక్కటే ! సంతోషమునకు వస్తువాహనములతో పనిలేదు. మనస్సే ప్రధానము. ధర్మమును అనుసరించుటవలన లభ్యమగు ఆనందము రాజ్యము కన్నను వస్తువాహనములకన్నను మించినది. ఈ సత్యము సీతారాములకు అర్థ మయినట్లు అందరకు అగునా !]

## లక్ష్మణుడు సీతారాములను అనుసరింపగోరుట

లక్ష్మణుడు సీతారాముల సంవాదమును విన్నాడు. సీతాదేవిని తోడ్కొని పోవుటకే ఎంతో కష్టముమీద సమ్మతించిన రాముడు తనవిషయములో ఏమనునోయని లక్ష్మణునికి దిగులు తోచినది. దుఃఖము సైతము పొంగివచ్చుచున్నది.

లక్ష్మణుడు అన్నగారి పాదముల నాశ్రయించి పలుకుచున్నాడు.

**లక్ష్మణుడు :** రామా ! నేనుకూడ నీ వెంట వచ్చెదను. నిన్నుబాసి దేవత్వముగాని సమస్త లోకముల ఐశ్వర్యముగాని నేను ఇష్టపడను.

న దేవలోకాక్రమణం నామరత్వ మహం వృణే
ఐశ్వర్యం వాపి లోకానాం కామయే నత్వయా వినా. 31.5

[శ్రీరామునిమీద కుదిరిన మనస్సు మఱి దేనిమీదికిని పోదు]

రాముడు : లక్ష్మణా ! నా మాట వినుము. నీ వింటే యుండుము.

లక్ష్మణుడు : అన్నా ! నన్ను నీతో రమ్మని ఇదివరకే చెప్పితివి గదా ! ఇప్పుడు వల దనుటకు కారణ మేమి ?

ఉపక్లప్తం హి యత్కించి దభిషేకార్థ మద్య మే
సర్వం విసర్జయ క్షిప్రం కురుకార్యం నిరత్యయమ్. 22-4

తస్మా దపరితాపస్సం స్త్వ మప్యనువిధాయమామ్
ప్రతిసంహారయ క్షిప్ర మాభిషేచనికీం క్రియామ్. 22-6

["అభిషేక కార్యమును విసర్జించి హానిలేని కార్యము చేయుము. నీవు ఎట్టి పరితాపమును పొందక న న్ననుసరించి పట్టాభిషేకమునకు సంబంధించిన పనులను మాన్పింపుము" అని రాముడు చెప్పియున్నాడు. కావున దీనినిబట్టి రాముడు ఇదివరకే అనుజ్ఞ నిచ్చినట్టు లక్ష్మణు డనుచున్నాడు.]

రాముడు : తమ్ముడా ! నీవు మంచివాడవు. నా కెంతో కావలసిన వాడవు. నీవు నా ప్రాణ సమానుడవు. పరాక్రమశాలివి. నీవు నా వెంట వచ్చుట సంతోషమే, కాని అందులో కొన్ని చిక్కు లున్నవి. నీవు నా వెంట వత్తువేని కౌసల్యను, సుమిత్రను భరించువా రెవ రున్నారు చెప్పుము. తండ్రిగా రేమో కైకేయికి లోబడి యున్నారు. తన కుమారుడు రాజైన యెడల, కైకేయి తన సపత్నులను బాధింపకుండునా ? భరతుడు రాజైన పిదప, తన తల్లిమాట కాదని మన తల్లుల సంగతి పట్టించుకొనునా ? కావున నీ వింటే ఉండి మన తల్లుల మంచి చెడ్డలను గమనింపుచుండుము.

అట్లు చేయుదువేని నా మీద భక్తి చూపిన ట్లగును. తల్లిని పూజించిన ధర్మము కూడ నీకు లభ్య మగును.

ఏవం మమ చ తే భక్తి ర్భవిష్యతి సుదర్శితా
ధర్మజ్ఞ గురుపూజాయాం ధర్మశ్చా ప్యతులో మహాన్. 31-16

లక్ష్మణుడు : రామా ! కౌసల్యకు గాని సుమిత్రకు గాని భరతుని వలన నెట్టి భయమును ఉండదు. నిన్ను, నీ పరాక్రమమును తలచుకొని, భరతుడు మన తల్లులను ఎంతో గొప్పగా పూజింపగలడు. ఇందుకు సందేహములేదు. మొదటిమాట, కౌసల్యను ఒకరు పోషింపవలసిన దేమున్నది ! నావంటివారిని వేయిమందిని ఆమె పోషింపగలదు. ఇదివరకే వేయి గ్రామములను దానముగా ఇచ్చియున్నది. ఆమె తనను, సుమిత్రను పోషించుకొనగలదు.

రామా! నేను నీ వెంటవచ్చి కృతార్థుడను కాగోరుచున్నాను. నేను మీ ఇరువురకును పరిచర్యలు చేయుచుందును. నా ప్రార్థనను త్రోసిపుచ్చకుము.

శ్రీరాముని మనస్సు మెత్తబడినది.

**రాముడు :** సరే! నీవిప్పుడే వెళ్ళి మన ప్రయాణమునుగూర్చి మనస్నేహితులకు చెప్పి రమ్ము. మరియొకమాట. జనకుని యజ్ఞమున వరుణదేవుడు ప్రసాదించిన ధనుస్సులు, అక్షయతూణీరములు, అభేద్యకవచములు మున్నగునవి వసిష్ఠులవారి గృహమున భద్రపరచియున్నాను. వానిని గైకొని రమ్ము.

లక్ష్మణుడు అన్నిటిని తెచ్చినాడు. తమ ప్రయాణమును గురించి స్నేహితులకు చెప్పి వచ్చినాడు.

## సీతారామలక్ష్మణులు తమ వస్తుసంపత్తిని దానము చేయుట

**రాముడు :** లక్ష్మణా! మనము మన ధనము నంతయు బ్రాహ్మణులకు, ఆశ్రితులకు పంచిపెట్టి అడవికి పోవుదము. నీవు త్వరగా వెళ్ళి మన గురుపుత్రుడైన సుయజ్ఞుని తోడ్కొని రమ్ము.

లక్ష్మణుడు సుయజ్ఞుని పిలుచుకొనివచ్చినాడు. రాముడు సుయజ్ఞునికి చేమోడ్పు గీలించి సీతాసహితుడై అతనికి ప్రదక్షిణము చేసినాడు. రాముడు తన బాహుపురులను, కుండలములను ఇతర ఆభరణములను సుయజ్ఞుని కిచ్చినాడు. సీతాదేవి తన చెవిలో ఊదిన మాటను రాముడు సుయజ్ఞునితో అనుచున్నాడు.

**రాముడు :** సఖా! సీత తన మెడనూలును, మొలనూలును, హారమును ఇతర ఆభరణములను నీ భార్య కీయగోరుచున్నది. వానిని గ్రహించి నీ భార్య కిమ్ము. ఇవిగో! ఈ అంగదములనుకూడ ఇచ్చుచున్నది. వానినికూడ గైకొనుము. మాపాన్పును కూడ ఇచ్చుచున్నాము గ్రహింపుము.

రాముడు సుయజ్ఞునికి అనేక వస్తువుల నిచ్చినాడు. సుయజ్ఞుడు వానిని ప్రతిగ్రహించి సీతారామలక్ష్మణులకు మంగళాశీర్వాదములు కావించినాడు.

**రాముడు :** లక్ష్మణా! కౌసల్య ఉపాధ్యాయునికిని, మనలను మన తల్లిదండ్రులను ఆశ్రయించి యుండువారికిని పుష్కలముగా ధనము నిమ్ము. గోదానములు విరివిగా చేయుము. అందరికి వేయేసి ఆవులకు తక్కువ లేకుండ ఈయవలయును.

లక్ష్మణుడు కుబేరునివలె విరివిగా దానములు చేసినాడు. సేవకులు, ఆశ్రితులు, అందరు కన్నీరు కార్చుచున్నారు. వారిని చూచి రాముడు "మేము మరలివచ్చువరకు

నా గృహములోను లక్ష్మణుని గృహములోను దీపము పెట్టి జాగ్రత్తగా చూచుకొనుడు" అని చెప్పినాడు.

ధనాధ్యక్షుని పిలిపించి ధనము తెప్పించినాడు - అక్కడ ప్రోగుచేసిన ధనరాశి అంతఇంత అని చెప్పుటకు సాధ్యముకాదు. ధనమునంతయు పంచిపెట్టినారు.

## త్రిజటుని కథ

త్రిజటుడు ఒక పేద బ్రాహ్మణుడు. కందమూలములను త్రవ్వి తెచ్చుకొనుచు నేల రాలిన పరిగ యేరి తెచ్చుకొనుచు కాలమును వెళ్లబుచ్చుచున్నాడు. ముసలివాడు. చాలమంది పిల్లలు. సంసారము బరువుగా ఉన్నది. అతని భార్య వయస్సులో ఉన్నది.

త్రిజటుడు కందమూలములను త్రవ్వుచుండినాడు. అతని భార్య త్రిజటుని సమీపించి "ఎంతసేపైనను ఈ గొడ్డలి ఈ గుద్దలి పట్టుకొని కూర్చున్నచో ఏమైనట్టు! వానిని అక్కడ పారవైచి అటువెళ్లి రాముని కంటబడినయెడల మన కేమైన లాభము కలుగును" అని చెప్పినది.

అపాస్య ఫాలం కుద్దాలం కురుష్వ వచనం మమ
రామం దర్శయ ధర్మజ్ఞం యది కించి దవాప్స్యసి 32-31

[ఇది గొప్ప శ్లోకము. ఇందులో సూక్ష్మార్థ మొకటి కలదు. మన పనిముట్లన్నియు అవల పారవైచి శ్రీరాముని తలచుకొనుచు ఉందుమేని ఆ మహానుభావునికి మనమీద దయ కలుగును. శ్రీరాముని కంట బడినవానికి ఏ లోటు ఉండదు!]

భార్య మాటను కాదనలేక త్రిజటుడు బయలుదేరినాడు. చిరిగిపోయిన శాటిని కప్పుకొని వచ్చినాడు. బ్రహ్మతేజస్సుతో జ్వలించుచున్నాడు గనుక ఎవ్వరు అడ్డగింపలేదు.

త్రిజటుడు రాముని సమీపించి "రామా! నేనొక పేద బ్రాహ్మణుడను. బహు కుటుంబిని. నాపై నీ దృష్టిని ప్రసరింపజేయుము" అని వేడుకొన్నాడు.

నిర్ధనో బహు పుత్రోఽస్మి రాజపుత్ర మహాయశః
ఉంఛవృత్తి ర్వనే నిత్యం ప్రత్యవేక్షస్వ మా మితి 32-35

రాముడు: (పరిహాసముగా) నీకు వేయి ఆవులనైనను ఈయను.

[వేయి ఆవు లనగా అంత కనీసమన్నమాట. ఒక చిల్లి గవ్వనైనను ఇయ్యను అన్నట్టు]

నీ కొక చిన్న పరీక్ష పెట్టుచున్నాను. ఇదిగో! ఈ కఱ్ఱను తీసికొని విసరి వేయుము. అది ఎంత దూరము పోవునో అంత మేరకు గోవుల నిచ్చెదను.

త్రిజటుడు శాటిని మొలకు చుట్టుకొని తన బల మంతయు వినియోగించి కఱ్ఱను గిరగిర త్రిప్పి విసరినాడు. ఆ కఱ్ఱ సరయూనది ఆవలిగట్టున పడినది. రాముడు ఆనంద పరవశు డై నాడు. త్రిజటుని కవుగిలించుకొని గోవులను ఆశ్రమమునకు చేర్చి త్రిజటుని ఊరడించుచు పలుకుచున్నాడు.

రాముడు : స్వామి! కోపింపకుము. పరిహాసమున కనిన మాటయేగాని అన్యము కాదు. జ్వలించుచున్న నీ అపార తేజస్సునుచూచి దాని ప్రభావమును తెలియగోరి నీచే ఈ పని చేయించితిని. దీనిని గురించి ఆయాస పడవలదు. మరి యేదైనను కావలసినచో కోరుకొనుము. ఇచ్చుటకు సిద్ధముగా ఉన్నాను. నా ధన మంతయు మీవంటివారికి ఇచ్చుటకే గాని, లేనిచో దానితో నాకేమి పనియున్నది!

మన్యు ర్నఖలు క ర్తవ్యః పరిహాసో హ్యయం మమ 32-40
ఇదంహి తేజ స్తవ య ద్దురత్యయం
తదేవ జిజ్ఞాసితు మిచ్ఛతా మయా
ఇమం భవా నర్థ మభిప్రచోదితో
వృణీష్వ కించే దపరం వ్యవస్యతి 32-41

త్రిజటుడు ఇంకేమియుకోర లేదు. [శ్రీరాముని కవుగిలితో నేకృతార్థుడై నాడు]

[ఇక్కడ మనము అనుకోదగిన మాట ఒకటి యున్నది. అరణ్యమునకు ప్రయాణ మగు చున్న శ్రీరాముని మనస్సు ఏ మాత్రము కలకబారలేదు సరిగదా, మరింత ప్రసన్నముగా ఉన్నది. అట్లు కానిచో త్రిజటునితో పరిహాసము లాడగలడా! ]

## సీతారామలక్ష్మణులు దశరథుని చూడబోవుట

ఈ విధముగా తమ ధన మంతయు అందరకు పంచిపెట్టి సీతారామలక్ష్మణులు దశరథుని చూచుటకు బయలుదేరినారు. ఛత్రములులేవు. రథములులేవు. రాజవీధిలో పాదచారులై వెళ్లుచున్నారు. ప్రజ లందరు మేడలపై నెక్కి దుఃఖముతో కుమిలి పోవుచు దీనులై చూచుచున్నారు. ఇంతకుముందు, ఆకాశమున విమానములలో ప్రయాణము చేయువారికికూడ కంటికి కబడని సీతాదేవి ఇప్పుడు రాజవీధిలో నడచి పోవుచు అందరకు కనబడుచున్నది.

యా నశక్యా పురా ద్రష్టుం భూతై రాకాశగై రపి
తా మద్య సీతాం పశ్యంతి రాజమార్గగతా జనాః 33-8

ప్రజలు : దశరథునికి ఏదేని పిశాచము పట్టియుండును. కానిచో ఇట్టి దారుణ కార్య మును చేయునా! రాముడు మానవలోకమునకు వేరువంటివాడు. జనులు

పుష్ప ఫలాదులు. మూలము శిథిల మగునేని ఫల పుష్పములు నశింపకుండునా! కావున మన మందరము మన గృహములను విడిచిపెట్టి శ్రీరాముని అనుస రించుట మేలు. ఈ పాడుబడిన పట్టణమును కట్టుకొని కైకేయి సుఖపడును గాక! శ్రీరాముడు ఏ అడవిలో నుండునో ఆ అడవియే పట్టణము కాగలదు. మన మందరము పరిత్యజించిన ఈ పట్టణమే అరణ్య మగును.

వనం నగరమేవాస్తు యేన గచ్ఛతి రాఘవః
తస్మాభిశ్చ పరిత్యక్తం పురం సంపద్యతాం వనమ్ 33.22

ఈ మాట లన్నిటిని రాముడు విన్నాడు; కాని అతని మనస్సు ఎట్టి వికారమును పొందలేదు.

శుశ్రావ రామ శ్శ్రుత్వా చ న విచక్రేఽస్య మానసమ్. 33.26

ఈ విధముగా సీతారామ లక్ష్మణులు రాజమార్గమున నడిచి దశరథుని భవన మును చేరుకున్నారు.

## దశరథుని భవనమున సీతారామ లక్ష్మణులు

సుమంత్రుడు దీనుడై ఒక ప్రక్కన నిల్వబడి యుండినాడు.

రాముడు : సుమంత్రా! నేను వచ్చియున్నానని తండ్రిగారికి నివేదింపుము.

సుమంత్రుడు : (లోనికిపోయి, మాటలు తడబడుచు) మహారాజా! మన రాముడు తన ధనము నంతయు దానముచేసి అడవికి పోవుటకు ముందు నీ దర్శనము చేసికొను టకు వచ్చి వాకిట వేచియున్నాడు. రామునికి దర్శన మిమ్ము.

దశరథుడు : సుమంత్రా! నా భార్యల నందరను పిల్వబంపుము. వారందరితో కూడి రాముని చూడగోరుచున్నాను.

దశరథుని కోరిక ననుసరించి అతని భార్యలు మూడు వందల ఏబది మంది కౌసల్యను గూడి సభామందిరమునకు వచ్చినారు. ఆ పిదప సుమంత్రుడు సీతారామ లక్ష్మణులను లోపలికి ప్రవేశపెట్టినాడు.

రాముని చూచుటతోడనే దశరథుడు లేచి ఎదురేగినాడు; కాని రాముని చెంతకు నడవజాలక క్రిందపడి మూర్ఛిల్లినాడు. రాముడు, లక్ష్మణుడు, సీత దశరథుని లేవనెత్తి మంచముమీద కూర్చుండబెట్టినారు. కొంత సేపటికి దశరథునికి తెలివివచ్చినది.

రాముడు : తండ్రీ! నేను దండకారణ్యమునకు పోవుచున్నాను. నీవు దుఃఖమును విడిచి నన్ను ప్రసన్న దృష్టితో చూడుము. లక్ష్మణుడు, సీత నావెంట వచ్చెద మను

చున్నారు. నేను ఎంతదూరము వారించినను వారు నా మాటను అంగీకరింప లేదు. వారికి కూడ అనుజ్ఞ నీయమని నిన్ను వేడుచున్నాను.

*దశరథుడు*: రామా! కైకేయికి వరములిచ్చి మోసపోయితిని. నీవిప్పుడు నన్ను నిగ్రహించి పట్టాభిషేకము చేసికొనుము.

*రాముడు*: (అంజలిచేసి) తండ్రీ! సత్యమును కాపాడుటయే ధర్మము. నేను పదునాలుగు సంవత్సరములు అరణ్యములో నివసించి తరువాత నీ పాదములకు మ్రొక్క గలను. ఇప్పుడు నాకు సెలవిమ్ము.

[యుద్ధానంతరమున స్వర్గమునుండి వచ్చిన దశరథునికి శ్రీరాముడు మ్రొక్కి ఈ మాటను సార్థకము చేసికొనియున్నాడు.]

*దశరథుడు*: (సత్యపాశబద్ధుడై దుఃఖముతో రాముని చూచుచు) నాయనా! నీ దృఢ బుద్ధిని మరలించుటకు నాకు సాధ్యముకాదు. కాని రేపు వెళ్లకూడదా! ఈ ఒకదినమైనను నిన్ను కన్నార చూచుచు సుఖముగా ఉండగలను. నీ తల్లిని చూడుము. ఎంత దుఃఖించుచున్నదో, పాపము! ఈ నాడు నీ ముచ్చట లన్నియు తీర్చుకొని రేపు ఉదయముననే వెళ్లవచ్చును.

*రాముడు*: తండ్రీ! రేపైనను వెళ్లవలసినదే కదా! ఒక్కనాటి భోగముతో పని యేమి! నేనిప్పుడే వెళ్ళుట మంచిది. నీవు భరతునికి పట్టాభిషేకము జరిపింపుము. కైకేయికి ప్రసాదించిన వరములను కొఱతలేక పాలింపుము. నాకు రాజ్యముతో గాని భోగములతోగాని పనిలేదు. నిన్ను సత్యవంతుని చేయుట మాత్రమే నాకు కావలసినది. ఈ మాటను నేను ప్రమాణముచేసి చెప్పుచున్నాను. నాకు వనవాస మొక కష్టముకాదు. ప్రజ లందరిని ఊరడింపవలసిన నీవు ఇట్లు దుఃఖించుట తగునా! తండ్రీ! దుఃఖపడకుము. ప్రసన్నుడవై నాకు సెలవిమ్ము.

నైవాహం రాజ్య మిచ్ఛామి న సుఖం నచ మైథిలీమ్
నైవ సర్వానిమాన్ కామా న్నస్వర్గం నైవ జీవితమ్. 34.47
త్వా మహం సత్య మిచ్ఛామి నానృతం పురుషర్షభ
ప్రత్యక్షం తవ సత్యేన సుకృతేన చ తే శపే. 34.48

తండ్రీ! దేవతలకు కూడ తండ్రియే దైవమని అందురు గదా! కావున తండ్రిని దైవముగా భావించి తండ్రి ఆజ్ఞను పాలింతును.

ఈ మాటలు విని దశరథుడు కుమారుని కవుగిలించుకొని తెలివిదప్పి పడిపోయి నాడు. కైకేయి తప్ప మిగిలిన వారందరు గట్టిగా విలపించినారు. సుమంత్రునికి

కైకేయిమీద మిక్కిలి కోపము కలిగినది. తల విదుర్చుకొని, బుసలు కొట్టుచు, పండ్లు పటపట కొరకుచు, కోపముతో మండిపడుచు కైకేయి హృదయమును నిశిత వాక్కులతో చీల్చుచున్నాడు.

సుమంత్రుడు : కైకేయి ! నీ వెంతటికైనను తగుదువు. నీ భర్త, నీ రాజు అను మాటను కూడ పాటింపక, దశరథ చక్రవర్తినే ఈ గతి పట్టించినావు. నీవు భర్తను చంపుదానవు. కుల ధ్వంసకురాలవు. భర్తను అవమానింపకుము. స్త్రీలకు కోటి మంది పుత్రులకన్న భర్త అనురాగమే అతిశయ మని తెలిసికొనుము.

మావమంస్థా దశరథం భర్తారం వరదం పతిమ్
భర్తు రిచ్ఛా హి నారీణాం పుత్రకోట్యా విశిష్యతే 35-8

ఇక్ష్వాకు వంశమున జ్యేష్ఠ పుత్రుడే రాజ్యార్హుడు. ఈ అనాది ఆచారమును తలక్రిందులు చేయబూనుకొన్నావు. భరతునికి రాజ్యము కట్టబెట్టి నీ కోర్కెను తీర్చుకొనుము. ఒక్కరుకూడ నీ రాజ్యములో ఉండరు. మేమందరము రామునివెంట పోయెదము. నీవు చేసిన క్రూర కార్యమునకు నీవు దహింపబడ లేదేమి ! మామిడి చెట్టును ఛేదించి, వేపచెట్టును నాటి, దానికి పాదులుకట్టి పాలుపోసి పెంచినను వేప చెట్టు మధురఫలముల నిచ్చునా !

ఆమ్రం ఛిత్వా కుఠారేణ నింబం పరిచరేత్తు యః
యశ్చైనం పయసా సించే న్నైవాస్య మధురో భవేత్ 35-14

వేపచెట్టు నుండి తియ్యని తేనె స్రవింప దను వాక్యములో ఎంతో నిజ మున్నది. నీ కొఱకు చెప్పినదే ఈ ఉపమానము. కైకేయి ! నీ తల్లి సంగతి మాకు తెలియనిది కాదు. నీ స్మృతికి తెచ్చుచున్నాను వినుము.

ఒక మహాత్ముడు ప్రసాదించిన వరప్రభావమున నీ తండ్రి సకల జంతువుల భాషలు నేర్చుకొన్నాడు. ఒకనాడు శయనమందిరమున చీమలు మాటలాడుకొనుచుండినవి. ఆ మాటలను వినగా మీ తండ్రికి నవ్వు వచ్చినది. తన్నుచూచి పరిహసించుచున్నాడని మీ తల్లి భ్రమపడి మీ తండ్రిమీద కోపించి "ఈ నవ్వుకు కారణ మేమి ?" అని మీ తండ్రిని ప్రశ్నించినది. "ఆ కారణమును చెప్పిన యెడల నాకు వెంటనే మరణము సంభవించును" అని మీ తండ్రి చెప్పినాడు. ఆ మాటకు నీ తల్లి ఏమన్నదో ఎరుగుదువా ! "నీవు చచ్చిన చత్తువుగాక ! బ్రతికిన బ్రతుకుదువు గాక ! నీ చావు బ్రతుకులతో నాకు పనిలేదు. నీ నవ్వుకు కారణమును చెప్పితీరవలసినదే," అని పట్టు పట్టినది. నీ తండ్రి తన గురువుచెంత కరిగి సంగతి చెప్పినాడు. "నీ భార్య చనిపోయినను

సరే! నీ వెంత మాత్రము రహస్యమును చెప్పగూడదు," అని గురువుగారు చెప్పినారు. నీ తండ్రి మరలివచ్చి నీ తల్లిని తిరస్కరించి సుఖపడినాడు.

విన్నావా నీ తల్లి సంగతి! అట్టి తల్లికి పుట్టిన దానవు! నీకు మంచి బుద్ధి ఎట్లు కలుగును? కొడుకులకు తండ్రి గుణములు, కొమారితలకు తల్లి గుణములు సంక్రమించు నన్న లోకోక్తి నీ పట్ల సత్యమే అయినది.

సత్య శ్చాద్య ప్రవాదోఽయం లౌకికః ప్రతిభాతి మే
పితౄన్ సమనుజాయంతే నరా మాతర మంగనాః 35-26

కావుననే దశరథుని ప్రాణము మీదికి వచ్చు ఈ కష్టమును కలిగించుటకు నీవు జంకుట లేదు.

కైకేయి! నా మాట వినుము. నీవు నీ భర్త చెప్పినట్లు చేసి ఆయనను రక్షించుకొనుము. దుఃఖ సముద్రములో మునిగియున్న ఈ ప్రజల నందరను తేర్చుము.

దశరథుని మోసపుచ్చి వరములు గైకొంటివి. అట్టి వరములను దశరథుడు పాలింప నవసరములేదు. అతడు వానిని పాలింపడు. అట్టి ఆశ వదలుకొనుము. శ్రీరామునికి పట్టాభిషేకము జరిపింపుము. అట్లు చేయవేని నీకు లోకములో తీరని అపవాదము కలుగును. రాముడు అడవికి వెళ్ళిన యెడల ఈ అయోధ్యలో ఒక్కడైనను ఉండబోడు. ఎందు కెక్కిన గొడవ! రామునికి పట్టాభిషేకము చేయింపుము. అందరము సుఖముగా ఉండవచ్చును.

ఇట్లు కఠినముగాను మృదువుగాను అనేకవిధములుగా సుమంత్రుడు చెప్పి చూచినాడు. కాని కైకేయి కొంచెమైనను చలింపలేదు. ఆమె ముఖమున ఒక చిన్న మార్పుకూడ కానరాలేదు.

నైవ సా క్షుభ్యతే దేవీ న చస్మ పరిదూయతే
నచాస్యా ముఖవర్ణస్య విక్రియా లక్ష్యతే తదా 35-35

[అందరిలో సిగ్గువిడిచి నిల్వబడి పట్టుదలతో ఉండుట అంతయు దైవబలముననే!]

దశరథుడు వరదానమును తలచుకొని తీరని దుఃఖములో మునిగి యున్నాడు. వలలోనుండి తప్పించుకొనుటకు వీలు కనబడలేదు. ఒక ఆలోచన తోచినది.

*దశరథుడు*: సుమంత్రా! కైకేయి రాముని అడవికి పంపుటకు పూనుకొన్నది. రాముడు కూడ వెళ్లుటకే నిశ్చయించినాడు. కావున ఈ వనవాసము తప్పునట్లు కనబడ లేదు. నీ విప్పుడు ఒకపని చేయుము. రామునివెంట చతురంగ బలములను పంపుము. రత్నములు ధనధాన్యములు రాసులు రాసులుగా రాముని వెంట

పంపుము. అరణ్యములో, రాముడు యజ్ఞయాగాదులు చేయుచు ఋషులతో సుఖముగా కాలము గడపగలడు.

ఈ మాటలు విని కైకేయి భీతి జెందినది. ముఖము వెలవెల బోయినది.

**కైకేయి** : (సిగ్గు విడిచి) రాజా! ఏమి యీ విపరీతము! సైన్యమును ధనమును రాముని వెంట పంపి, శూన్యమై పాడుబడిన రాజ్యమునా నీవు భరతున కిచ్చుట!

**దశరథుడు** : కైకేయి! మొదలే దుర్భరమైన బాధలో ఉన్నాను. నన్నేల ఇంకను బాధించుచున్నావు? రాముని వెంట సైన్యమును పంపకూడ దని నీ కిచ్చిన వరములో ఉన్నదా?

**కైకేయి** : అరణ్యవాసమునకు పోవువాడు నిర్ధనుడై పోవలయును. ఇది క్రొత్త సంగతి కాదు. మీ వంశములోనే మీ పూర్వుడైన అసమంజుడు అడవికి ఎట్లు వెళ్లినాడు? పుటికతో గొడ్డలితో వెళ్లినాడు. అడవికి పోవుటయనగా అట్టిది. రాముడు కూడ అట్లు వెళ్లవలసినదే.

ఈవిధముగా నిండు సభలో జంకులేక మాటలాడుచున్న కైకేయిని చూచి అందరు సిగ్గుపడినారు. కాని కైకేయి లక్ష్యము చేయలేదు. దశరథుడు తన్నుతాను నిందించుకొనుచు నిశ్చేష్టుడైనాడు.

**సిద్ధార్థుడు (మంత్రి)** : కైకేయి! అసమంజుడు ప్రజల బిడ్డలను సరయూనదిలో ముంచి బాధించి తాను ఆనందించుచుండిన దుర్మార్గుడు. ప్రజ లందరు అతని దుండగమును గురించి తమ ప్రభువైన సగర చక్రవర్తితో మొరపెట్టుకొన్నారు. సగరుడు తన పుత్రుడుచేసిన నేరమునకు శిక్ష విధించి అతనిని అడవికి వెడలగొట్టినాడు. రాము డిప్పుడు ఏదేని తప్పు చేసి శిక్ష ననుభవించుటకు అడవికి పోవుచున్నాడా యేమి? రాముడేదైన నేరము చేసి యుండునేని చెప్పుము. అట్లైన అతనిని తప్పక దండింతుము. మా కెవ్వరికిని రామునియందు ఎట్టి దోషముగాని కానరాలేదు. ధర్మమార్గమును అనుసరించుచున్న రాముని ఇట్లు అడవికి పంపుదుమేని ధర్మమునకు ఆటంకము కలిగి అందువలన ఎంతటి సంపదయైనను భస్మ మగును. కావున నీ దుష్టబుద్ధిని మానుకొనుము. రాముని ఇందే యుండనిమ్ము. వృథా నిందలపాలు కావలదు.

**అదుష్టస్య హి సంత్యాగ స్సత్పథే నిరతస్య చ**
**నిర్దహే దపి శక్రస్య ద్యుతిం ధర్మ నిరోధనాత్** 36-29

[ఈ అర్థమును గమనించి మనము మెలకువకలిగి ప్రవర్తింపవలయును. మంచివారి మనస్సులను నొప్పించు పనులను చేయకూడదు. అట్లు చేసినయెడల మన సంపదలు తొలగి పోగలవు.]

కైకేయికి సిద్ధార్థుని మాటలు నచ్చలేదు. ఇంతలో దశరథునికి వేరొక్క ఆలోచన తట్టినది.

*దశరథుడు :* కైకేయి! నేను రాజ్యమును సుఖమును ధనమును విడిచిపెట్టి రామునివెంట వెళ్ళెదను. నీవును నీ కుమారుడును రాజ్యము నేలుచు సుఖముగా ఉండవచ్చును.

ఈ మాటలు విని శ్రీరాముడు తండ్రితో అనుచున్నాడు.

*రాముడు :* తండ్రీ! సమస్త భోగములను పరిత్యజించి అరణ్యమున కందమూలములను భుజించి మునివృత్తి నవలంబించు నాకు సైన్యములతోగాని ధనధాన్యములతో గాని పని యేమి! ఏనుగును దానము చేసి దానిని బంధించు త్రాటిని వదలుకొనలేక బాధపడుచున్నట్లున్నది నీ మాట! ఏనుగును వదలుకొన్నవానికి త్రాటితో పని యేమి!

> యోహి దత్వా ద్విపశ్రేష్ఠం కక్ష్యాయాం కురుతే మనః
> రజ్జు స్నేహేన కిం తస్య త్యజతః కుంజరోత్తమమ్. 37-3

నాకు మఱేమియు అక్కరలేదు. నారచీరలు మాత్రము దయచేయుడు. కందమూలములు త్రవ్వి తెచ్చుకొనుటకు పరికరము లిచ్చిన చాలును.

## సీతారామలక్ష్మణులు నారచీరలు ధరించుట

కైకేయి సిద్ధముగా ఉన్నది. నారచీరలు స్వయముగా తెచ్చినది. సిగ్గు విడిచి పెట్టినది. నారచీరలు రామునికిచ్చి ధరింపుమని చెప్పినది.

> అథ చీరాణి కైకేయీ స్వయ మాహృత్య రాఘవం
> ఉవాచ పరిధత్స్వేతి జనౌఘే నిరపత్రపా 37-6

శ్రీరాముడు నార చీరలను ధరించినాడు. కైకేయి లక్ష్మణునికి కూడ నారచీరల నిచ్చినది. లక్ష్మణుడు కూడ ధరించినాడు.

కైకేయి అంతటితో ఊరకొనలేదు. సీతాదేవికి సైతము రెండు నారచీరలిచ్చినది. సీతాదేవి వానిని చూచి భయపడి చీరలను చేతికి తీసికొని ఒకదానిని మెడపై వేసుకొని రెండవదానిని చేతపట్టుకొన్నది. సిగ్గు ముంచుకొని వచ్చినది సీతాదేవికి. ఏమి చేయుటకును తోపక దిక్కులు చూచుచున్నది.

కృత్వా కంఠే చ సా చీర మేక మాదాయ పాణినా
తస్థౌ హ్యకుశలా తత్ర వ్రీళితా జనకాత్మజా 37-13

నారచీరలు ఎట్లు ధరింపవలయునో సీతాదేవికి తెలియలేదు. మును పెప్పుడు గాని చూచి ఎరుగదు. పాపము! సీతాదేవి దిగులుపడి భర్తను చూచి నెమ్మదిగా అడుగుచున్నది.

"అడవిలో నుండు తాపసులు ఈ చీర లెట్లు ధరింతురు" అని అడిగినది.

కథన్ను చీరం బధ్నంతి మునయో వనవాసినః 37-12

అంతట రాముడు ఆ నారచీరలను తనచేతికి తీసికొని సీతాదేవి పట్టుచీరమీద ఆ నారచీరను స్వయముగా కట్టినాడు.

తస్యా స్తత్ క్షిప్ర మాగమ్య రామో ధర్మభృతాం వరః
చీరం బబంధ సీతాయాః కౌశేయ స్యోపరి స్వయమ్

ఈ దృశ్యమును చూచి సభలో కన్నీరు కార్చనివారులేరు (కైకేయి తప్ప).

**అంతఃపురస్త్రీలు**: రామా! వనవాసము నీకు విధించినారు గాని సీతాదేవికి విధింపలేదే సీతను అరణ్యమునకు తీసికొని పోవలదు. ఇక్కడనే ఉండనిమ్ము నీవు వచ్చు వరకు ఆమెను శ్రద్ధతో రక్షించుచుండగలము.

రాముడు ఈ మాటలను చెవిని బెట్టలేదు. కాని, సీతాదేవి నారచీరలు ధరించుట వసిష్ఠుడు సమ్మతింపక ఆ పనిని నివారించి కైకేయితో అనుచున్నాడు.

**వసిష్ఠుడు**: గుణహీనురాలా! సీతాదేవి అరణ్యమునకు పోవలసిన పని యేమి? శ్రీరాముని కి సిద్ధపరచిన సింహాసనముమీద సీతాదేవిని కూర్చుండ బెట్టెదను. సీతాదేవి ఈ రాజ్యమును పాలించునుగాక! రాముని భార్య రాముని ఆత్మ కావున అతడు పాలింపవలసిన రాజ్యమును ఆమె పాలింపగలదు.

అనుష్ఠాస్యతి రామస్య సీతా ప్రకృత మాసనమ్ 37-23
ఆత్మాహి దారా స్సర్వేషాం దార సంగ్రహ వర్తినామ్
ఆత్మేయ మితి రామస్య పాలయిష్యతి మేదినీమ్ 37-24

ఒకవేళ సీతాదేవి రాముని అనుసరించి అరణ్యమునకు వెళ్ళునేని మేమందరము కూడ వారిని అనుగమించెదము. భరతుడు, శత్రుఘ్నుడు నారచీరలు ధరించి రామునికి శుశ్రూష చేయుటకు అడవికి వెళ్ళగలరు. అయోధ్యలో నీవును స్థావరము లైన వృక్షములును మిగిలియుందురు. పాడుపడిన ఊరిని పాలించుచు ఈ చెట్లతోకూడ

నీ వింటే యుండుము. రాముడు ఎందుండునో అదియే రాజ్యము. రాముడు లేని ప్రదేశమే అరణ్యము.

నహి త ద్భవితా రాష్ట్రం యత్ర రామో న భూపతిః
త ద్వనం భవితా రాష్ట్రం యత్ర రామో నివత్స్యతి. 37-29

కైకేయి! ఒక్కమాట మాత్రము జ్ఞప్తియందుంచుకొనుము. భరతుడు దశరథునికి జన్మించినవాడే అగునేని తండ్రి మనసార తన కీయని రాజ్యమును పాలింపనే పాలింపడు. నిన్ను తల్లిగాకూడ లెక్కచేయడు.

న హ్యదత్తాం మహీం పిత్రా భరత శ్శాస్తు మర్హతి
త్వయి వా పుత్రవ ద్వస్తుం యది జాతో మహీపతేః 37-30

భరతుడు ఇక్ష్వాకు వంశ చరిత్రమును చక్కగా తెలిసికొని యున్నవాడు గనుక నీవు భూతలమునుండి ఆకాశము వరకు ఎగిరినను భరతుడు నీవు కోరినట్లు వర్తింపడు.

యద్యపి త్వం క్షితితలా ద్గగనం చోత్పతిష్యసి ·
పితృవంశ చరిత్రజ్ఞ స్సోఽన్యథా న కరిష్యతి 37-31

నీవు చేయున దంతయు భరతునికి అపకారమేగాని ఉపకారము కాదు. శ్రీరాముని అనుసరింపనివాడు లోకములో ఒక డున్నాడా! రాముడు అడవికి వెళ్లుచుండగా అతనిని వెంబడించు పశుపక్ష్యాదులను రామునివైపు మరలి చూచుచున్న వృక్షములను నీవు చూడగలవు. కైకేయి! నీ కోడలైన సీతాదేవికి నార చీరలు తగవు. ఆమెకు మేలైన ఆభరణముల నిచ్చి అలంకారము చేయించి పంపుటయే యుక్తము.

వసిష్ఠుడు ఈ మాటలను పలికి సీతాదేవిచేత నార చీరలు ధరింపజేయు యత్నమును ఆపుచేయు మని చెప్పినాడు. అక్కడ కూడిన జను లందరు దశరథుని దూషించుట కారంభించినారు. ఆ నిందా వాక్యములను భరింపలేక దశరథుడు తన జీవితముమీద రోత కలిగి మరణించిన మేలని తలపోసినాడు. దశరథుడు నిట్టూర్పులు పుచ్చుచు అనుచున్నాడు.

**దశరథుడు :** కైకేయి! గురువుగారు చెప్పిన మాట సత్యము. సీతకు నార చీరలు పనికి రావు. నేను తెలివితక్కువవాడనై నీకు వరము లిచ్చితిని. రాముని అడవికి పంపుచున్నావు. సరే! సీత నీకేమి అపకారము చేసినది ?

ఇట్లు పలికి దశరథుడు తల వంచుకొన్నాడు.

**రాముడు :** తండ్రీ! నేను అడవికి వెళ్లుచున్నాను. నా తల్లి కౌసల్యవంక ఒకమారు చూడుము. నా తల్లి ఎంత యోగ్యురాలు! తన కుమారుని అరణ్యమునకు

పంపుచున్నను నిన్ను ఒక్కమాటకూడ అనలేదు. ఆమెయెడ దయజూప వేడు చున్నాను. ఆమె పుత్ర శోకమును మరచిపోవునట్లు ఊరడింపుము. నా గురించి దుఃఖముతో ఆమె ప్రాణము విడుచును కాబోలు! ఆమెను కాపాడుమని ప్రార్థించుచున్నాను.

దశరథుడు దుఃఖమును పట్టజాలకపోయినాడు. రాముని కన్నెత్తి చూడలేక పోయినాడు. నోట మాట రాలేదు. అట్లే దుఃఖించుచు "నేను పూర్వ మెందరు తండ్రులను వారి బిడ్డలకు దూరము చేసితినోగదా! ఎంతమందిని ఎట్టి బాధలు పెట్టితినోగదా! ఆపాపమే నాకిప్పుడు ఇట్టి దుఃఖమును కలిగించినది. నాకు మృత్యువు రాలేదే! కాలము కానప్పుడు కాలము చేయుటకూడ కానిపని! ఒక్క కైకేయి కారణముగా ఎందరు దుఃఖముల పాలైనారు!" అని చింతించినాడు. తలయెత్తిచూచి 'రామా!' అన్నాడు. పైమాట రాలేదు. మూర్ఛ వచ్చినది. కొంత సేపటికిగాని తెలివి రాలేదు. కన్నులనిండ అశ్రువులు క్రమ్మినవి.

*దశరథుడు* : సుమంత్రా! మంచి రథమును తెచ్చి వారి నెక్కించుకొనిపోయి అరణ్యమున చేర్చిరమ్ము. ఔరా! నా సత్యము నన్నెంత దుఃఖమున ముంచినది! కన్నకొడుకును అడవులపాలు చేయుచున్నానే! మంచిగుణములకు ఇట్టి ఫలమే కాబోలు!

సుమంత్రుడు రథము సిద్ధపరచినాడు. దశరథుడు ధనాధ్యక్షునితో అనుచున్నాడు.

*దశరథుడు* : సీతకు పదునాలుగు సంవత్సరములకును కావలసిన వస్త్రములను ఆభరణములను తీసికొనిరమ్ము.

వాసాంసి చ మహార్హాణి భూషణాని వరాణి చ
వర్షాణ్యేతాని సంఖ్యాయ వైదేహ్యా క్షిప్ర మానయ. 39-15

ధనాధ్యక్షుడు అన్నిటిని తెచ్చినాడు. సీతాదేవి అలంకరించుకొన్నది. కౌసల్య సీతాదేవిని కవుగిలించుకొని

*కౌసల్య* : సీతా! స్త్రీల స్వభావము సహజముగా మంచిది కాదు. తాము కోరిన దంతయు ఇచ్చుచున్నంతకాలము భర్తపట్ల అనురక్తలై యుందురు. భర్తకు కొంచెము కష్టదశ సంభవించినప్పుడు అతనిని నిర్లక్ష్యము చేయుదురు. సుఖముగా ఉన్నంతకాలము ఎంతో మంచివారై యుందురు. భర్తకు సంపద తఱిగిపోయి అతడు కష్టములో నుండునప్పుడు భర్తను త్యజించుటకును వెనుదీయరు. స్త్రీలు అనృతములాడుటకు జంకరు. వారి మనస్సులు తెలిసికొనుట సులభమైన పని కాదు. ఒక్కక్షణములో, భర్తమీది ప్రేమ సర్వము మాయమగును. కులమును

గాని, పొందిన మేలునుగాని, విద్యనుగాని లోకమర్యాదనుగాని దేనినికూడ లెక్కపెట్టరు. స్త్రీలు అతి చపలస్వభావలు. పతివ్రతలు మాత్రమే భర్తను దైవముగా పూజింతురు.

సీతా ! అడవికి పంపబడినవాడని నా కుమారుని అవమానింపకుము. దరిద్రుడైనను ధనికుడైనను భర్తయే దైవమను మాట జ్ఞప్తియందుంచుకొనుము.

సీత : అత్తా ! ఇంతదూరము నాకు చెప్పవలయునా ! నీవు చెప్పినట్లే నడచుకొందును. భర్త నేవిధముగా పూజింపవలెనో నాకు మాత్రము తెలియదా ! దుష్ట ప్రవర్తనగల స్త్రీలతో పోల్చతగినదానను కాను. ధర్మమును ఎంతమాత్రము నే నతిక్రమింపను.

తంతువులు ఛిన్న మగునేని వీణ పలుకునా! చక్రములు లేక రథము నడచునా! అట్లే శత సుతులు గలదైనను భర్తకు దూరమైన పడతి సుఖపడదు. తండ్రిగాని, తల్లిగాని, పుత్రుడుగాని స్త్రీకి కొంచెముసుఖమునుమాత్రమే కూర్పగలరు. భర్తవలన కలుగు సుఖమునకు మితిలేదు. అమిత సుఖము నిచ్చు భర్తను గౌరవింపని స్త్రీ ఎందుకైనను పనికివచ్చునా ! నేను పతివ్రతను. ధర్మాధర్మముల నెఱిగినదానను. నేను భర్తను అవమానింతునా ! పతియే నాకు దైవము.

ఈ మాటలు విని కౌసల్యకు మిక్కిలి సంతోషము కలిగినది.

[అత్తా కోడలు ఏకమై కైకేయిని ఉద్దేశించి మాటాడుచున్నట్లు అనిపించుచున్నది. ఒక్క కుమారుని సుఖమునకై భర్తను త్యాగము చేయుటకు సిద్ధపడిన కైకేయి ఎంత నీచురాలైనది తమ మాటలలో వ్యక్తపరచినారు. కాని ఈ మాటలను విని కైకేయి కొంచెమైనను చలింపలేదు.]

[సీతా కౌసల్యల సంభాషణమునకు సంబంధించిన శ్లోకములు పఠనీయములు]

కౌసల్యా :

అసత్య స్సర్వలోకేఽస్మిన్ సతతం సత్కృతాః ప్రియైః
భర్తారం నానుమన్యంతే వినిపాత గతం స్త్రియః 39-20

ఏష స్వభావో నారీణా మనుభూయ పురా సుఖమ్
అల్పామ ప్యాపదం ప్రాప్య దుష్యంతి ప్రజహ త్యపి 39-21

అసత్య శీలా వికృతా దుర్గ్రాహ్య హృదయా స్తథా
యువత్యః పాప సంకల్పాః క్షణమాత్రా ద్విరాగిణః 39-22

నకులం నకృతం విద్యాం నదత్తం నాపి సంగ్రహమ్
స్త్రీణాం గృహ్ణాతి హృదయ మనిత్య హృదయా హి తాః 39-23

సాధ్వీనాంహి స్థితానాం తు శీలే సత్యే శ్రుతే శమే
స్త్రీణాం పవిత్రం పరమం పతి రేకో విశిష్యతే 39-24

సత్వయా నావమంతవ్యః పుత్రః ప్రవ్రాజితో మమ
తవ దైవత మస్త్వేష నిర్ధన స్సధనోఽపివా 39-25

సీత :

కరిష్యే సర్వమేవాహ మార్యా య దనుశాస్తి మామ్
అభిజ్ఞాస్మి యథా భర్తు ర్వర్తితవ్యం శ్రుతంచ మే 39-27

నమా మసజ్జనే నార్యా సమానయితు మర్హతి
ధర్మా ద్విచలితుం నాహమలం చంద్రాదివ ప్రభా 39-28

నాతంత్రీ వాద్యతే వీణా నాచక్రో వర్తతే రథః
నాపతి స్సుఖమేధేత యా స్యాదపి శతాత్మజా 39-29

మితం దదాతి హి పితా మితం మాతా మితం సుతః
అమితస్యహి దాతారం భర్తారం కా నపూజయేత్. 39-30

సాహమేవం గతా శ్రేష్ఠా శ్రుతధర్మ పరావరా
ఆర్యే కిమవమన్యేఽహం స్త్రీణాం భర్తాహి దైవతమ్. 39-31

రాముడు : (తల్లికి ప్రదక్షిణముచేసి) అమ్మా! దుఃఖపడకుము. పదునాలుగు సంవత్సరము లనగా నెంత! ఇట్టే క్షణములో గడచిపోగలవు. ఆ తరువాత నేనువచ్చి నీ సన్నిధానముననే ఉండగలను. ఈ లోపల తండ్రిని మెలకువతో కాపాడుచుండుము. (మిగిలినవారిని చూచి అంజలిబద్ధుడై) తల్లులారా! చనువువలనగాని పొరపాటున గాని నేను చేసిన అపరాధములను మన్నింపుడు. నాకు సెలవు దయచేయుడు.

సంవాసా త్పరుషం కించి దజ్ఞానాద్వాపి యత్కృతమ్
తన్మే సమనుజానీత సర్వా శ్చామంత్రయామి వః. 39-38

ఈ మాటలను విని దశరథుని భార్యలు గొల్లున విలపించినారు. కైకేయిని తిట్టని వారులేరు. మందిర మంతయు రోదన ధ్వనితో నిండిపోయినది.

సీతారామలక్ష్మణులు ప్రయాణమునకు సిద్ధమై దశరథునికి ప్రదక్షిణము చేసినారు. సీతాదేవిని, లక్ష్మణుని తనవెంట తీసికొని పోవుటకు రాముడు తండ్రి అనుజ్ఞపొంది తల్లికి సమస్కారము చేసినాడు. లక్ష్మణుడుకూడ కౌసల్యకు, సుమిత్రకు నమస్కరించినాడు.

## సుమిత్ర లక్ష్మణునికి హితము ఉపదేశించుట

సుమిత్ర : (లక్ష్మణుని శిరము మూర్కొని) కుమారా! నీకు స్నేహితులపట్ల ఎంతో ప్రీతి. రాముని యెడ మిక్కిలి అనురాగము కలవాడవై అతనివెంట అడవికి పోవుటకే

నిన్ను దైవము పుట్టించినాడు. ఏమరుపాటులేక సీతారాములను కనిపెట్టి యుండుము.

సృష్ట స్త్వం వనవాసాయ స్వనురక్త స్సుహృజ్జనే
రామే ప్రమాదం మా కార్షీః పుత్రి భ్రాతరి గచ్ఛతి 40-5

రాజ్యపాలకుడైనను వ్యసనతప్తుడైనను రాముడే నీకు పరమగతియని ఎరుగుము. నీవు రాముని అనుసరించి అరణ్యమునకు పొమ్ము. ఒక్క మాట మాత్రము సదా జ్ఞప్తియం దుంచుకొనుము. రాముని తండ్రిగాను, సీతను తల్లిగాను, అడవిని అయోధ్యగాను భావింపుము. తెలిసినదా! కుమారా! నీకు మంగళ మగునుగాక!

రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథా సుఖమ్ 40-9

## సీతారామలక్ష్మణులు అడవికి పోవుట

సుమంత్రుడు రథమును సిద్ధపరచి తెచ్చినాడు. సీతాదేవి సర్వాభరణ భూషితయై ఉత్సాహభరితయై రథ మారోహించినది. రామలక్ష్మణులు సైతము రథము నారోహించినారు. దశరథుడు సీతాదేవికి ఇప్పించిన వస్త్రాభరణములను, రామలక్ష్మణుల ఆయుధములను, కవచములను, కందమూలములు త్రవ్వుకొనుటకు కావలసిన పరికరములను అన్నిటిని రథములో పెట్టినారు. రథము బయలుదేరినది.

పట్టాభిషేకమును చూడవచ్చిన వారందరు శ్రీరాముడు అరణ్యమునకు పోవుట చూచి దుఃఖితులై మూర్ఛిల్లినారు. రథము వడిగా పోవుచున్నది. జనులు మూర్ఛదేరి పరుగెత్తుచు రథమును వెంబడించుచున్నారు.

"సుమంత్రా! రథమును మెల్లగా తోలుము" అని కేకలు పెట్టుచున్నారు. జను లందరు పరిపరివిధములుగా మాటలాడుకొనుచున్నారు.

జనులు : కౌసల్యది రాతి గుండె. కానిచో ఆమె ఇంకను బ్రతికి యుండునా! సీతాదేవి కృతార్థురాలు. నీడవలె రాముని అనుసరించుచున్నది.

కృతకృత్యా హి వైదేహీ ఛాయే వానుగతా పతిమ్ 40-24

["పతివ్రతా మహాభాగా ఛాయే వానుగతా సదా" అని గదా జనకుడు చెప్పి కన్యాదానము చేసినాడు]

లక్ష్మణా! నీవే ధన్యుడవు. రామునికి పరిచర్యచేయు మహాభాగ్యమును ఆర్జించినావు. ఇదియే నీకు తపస్సిద్ధి. ఇట్లు రాముని అనుసరించుటయే నీకు శాశ్వత కీర్తిని కలుగజేయును. స్వర్గమునకు కూడ ఇదియే మార్గము సుమా!

మహాత్యేషా హి తే సిద్ధి రేష చా భ్యుదయో మహాన్
ఏష స్వర్గస్య మార్గశ్చ య దేనమనుగచ్ఛసి 40-26

జనులు ఈ విధముగా మాటలాడుకొనుచు కన్నీరు కార్చుచు వెళ్లుచున్నారు. ప్రయాణమువలన రేగిన దుమ్ము వారి కన్నీటి వలన అణగిపోయినది!

[వాల్మీకి మహర్షి కవిత్వ మాహాత్మ్యమును ఈ భావములో చూడవచ్చును]

దశరథుడు సైతము రాముని చూడవలెనని తన భవనమునుండి బయలుదేర నాడు. అంతఃపుర స్త్రీలు, కౌసల్య మున్నగువారు పరుగులెత్తి రాముని చూచుటకు వచ్చుచున్నారు.

దశరథుడు కొంతదూరము వచ్చి క్రింద పడిపోయినాడు. శ్రీరాముడు తల్లి దండ్రుల అవస్థనుచూచి వారి దుఃఖమును భరింపజాలక "సుమంత్రా! రథమును వేగముగా తోలుము" అన్నాడు. దశరథుడు "సుమంత్రా! నిలు! నిలువుము" అని అఱచుచున్నాడు. శ్రీరాముడు "పో! పొమ్ము" అని త్వరపెట్టు చున్నాడు. సుమంత్రునికి ఏమి చేయుటకును తోపలేదు. సుమంత్రుని పని రెండు చక్రముల సందున చిక్కుకొన్న ట్లయినది.

తిష్ఠేతి రాజా చుక్రోశ యాహి యాహీతి రాఘవః
సుమంత్రస్య బభూవాత్మా చక్రయో రివ చాంతరా 40-46

**రాముడు :** (సుమంత్రుని బాధను గమనించి) సుమంత్రా! నీవు తిరిగివచ్చిన పిదప రాజు గారు నీపై తప్పుపెట్టిన యెడల "మీ అరవు నాకు వినబడలేదు" అని చెప్పి తప్పించుకొన వచ్చును. వారి దుఃఖమును చూడలేకున్నాను. రథమును వేగ ముగా పోనిమ్ము.

నా శ్రౌషమితి రాజాన ముపాలబ్ధోఽపి వక్ష్యసి
చిరం దుఃఖస్య పాపిష్ఠ మితి రామ స్త మబ్రవీత్.

రథము వేగముగా పోవుచున్నది. రాజబంధువులు, మఱికొందఱు గొప్పవారు రథమును కొంతదూర మనుసరించి వెనుకకు మరలినారు. సామాన్య జనులు రథము వెంట వెళ్లుచునే యున్నారు.

దశరథుని శరీరము చెమటతో తడిసిపోయినది. విలపించుచున్నాడు. ముసలివాడు పాపము! గుఱ్ఱముల పరుగు నందుకొనగలడా! కౌసల్య సైతము అట్లే బాధపడు చున్నది. అంతట మంత్రులు దశరథునితో "ఎవడు మరల క్షేమముగా రావలయు నని కోరుదువో అట్టివానిని ఎక్కువ దూరము వెంబడించుట సరికాదు" అని హెచ్చరించినారు.

**యమిచ్ఛే త్పునరాయాంతం నైనం దూర మనువ్రజేత్** 40-50

దశరథుడు కౌసల్య మున్నగువారు ఆగిపోయినారు. రాముని రథ గమనమున రేగిన ధూళి యెంతదనుక కంటికి కనబడుచుండెనో అంతవరకు దశరథుడు ఆ వైపుననే చూచుచుండినాడు. అదికూడ కనిపింపకపోయిన వెంటనే దశరథుడు దుఃఖభారమున పడిపోయినాడు. దశరథుని లేవనెత్తుటకు కౌసల్య కుడిచేయి పట్టుకొన్నది. కైకేయి ఎడమ ప్రక్కకు వచ్చినది.

*దశరథుడు:* (కైకేయినిచూచి) ఓసీ దుర్మార్గురాలా! నన్ను స్పృశింప వలదు. నీ ముఖము నాకు చూపకుము. నీవు నాకు భార్యవుకావు. నీకు నాకు ఎట్టి బంధుత్వముగాని లేదు. నిన్ననుసరించి యుండువారికిని నాకును ఎట్టి సంబంధములేదు. నీవు కేవల అర్థపరురాలవు. నీకు ధర్మబుద్ధిలేదు. నిన్ను పరిత్యజించుచున్నాను. నీవు చేసిన అకార్యమును ఆమోదించి భరతుడు రాజ్యమును స్వీకరించి పాలించునేని అతడు నాకు చేయు జలతర్పణాదులు నన్ను చెందకుండునుగాక!

కైకేయి! మా మమాంగాని స్ప్రాక్షీ స్త్వం దుష్టచారిణీ
నహిత్వాం ద్రష్టు మిచ్ఛామి న భార్యా నచ బాంధవీ. 42-6

యేచత్వా మను జీవంతి నాహం తేషాం నతే మమ
కేవలార్థ పరాం హిత్వాం త్యక్త ధర్మాం త్యజామ్యహమ్. 42-7

అగృహ్ణాం యచ్ఛతే పాణి మగ్నిం పర్యణయం చ యత్
అనుజానామి తత్సర్వ మస్మిన్ లోకే పరత్ర చ. 42-8

భరతశ్చే త్ప్రతీతస్స్యా ద్రాజ్యం ప్రాప్యేద మవ్యయమ్
యన్మే స దద్యా త్పిత్రర్థం మాం మా తద్దత్తమాగతమ్. 42-9

కౌసల్య దశరథుని లేవనెత్తినది. నెమ్మదిగా పురము ప్రవేశించుచున్నారు. దశరథుడు రాముని తలచుకొని విలపించుచున్నాడు. సీతారామలక్ష్మణులు అడవిలో కాలము నెట్లు గడపగలరో యని వేదన పడుచున్నాడు. కైకేయిని నిందించుచున్నాడు.

"కైకేయి! నీకోర్కె తీర్చుకొనుము. నీవు విధవవై రాజ్యము నేలుకొనుము. నేను రాముని విడిచి జీవింపజాలను" అని విలపించినాడు.

సకామా భవ కైకేయి విధవా రాజ్య మావస
నహితం పురుష వ్యాఘ్రం వినా జీవితు ముత్సహే. 42-21

ఇట్లు దుఃఖించుచు దీనుడై పురము ప్రవేశించినాడు. అయోధ్య పాడుపడి యుండినది. శక్తిగల పౌరు లందరు రాముని వెంట వెళ్లినారు. వీధులలో నరసంచా

రములేదు. దుకాణములు మూసినారు. దేవాలయములు కూడ మూయబడి యుండినవి. అయోధ్య శూన్యముగా కానబడినది.

*దశరథుడు:* నన్ను కౌసల్యా మందిరమునకు కొనిపొండు. రాముని తల్లియింట తప్ప మరియొకచోట నా మదికి ఊరట కలుగదు.

దశరథుడు కౌసల్యా భవనము ప్రవేశించినాడు. మంచముమీద కూర్చుండినాడే గాని మతి మతిలోలేదు. "రామా! నన్ను వీడి పోవుచుంటివా!" అని బిగ్గరగా విలపించినాడు. "రాముడు వనవాస వ్రతమును పూర్తిచేసి మరల అయోధ్యకు వచ్చు వరకు జీవించియుండి రామునిచూచి ఆనందింప గలిగినవారే ధన్యులు" అని తల పోసినాడు.

సగము రాత్రి గడచినది. అప్పుడు దశరథుడు కౌసల్యతో అనుచున్నాడు.

*దశరథుడు:* కౌసల్యా! నా చూపు రామునే అనుసరించుచున్నది. దానిని ఇప్పటికిని మరలింప జాలకున్నాను. నాకు నీవుకూడ సరిగా కనిపించుటలేదు. నన్ను నీ చేతితో స్పృశింపుము.

**రామం మేఽనుగతా దృష్టి రద్యాపి ననివర్తతే**
**నత్వా పశ్యామి కౌసల్యే సాధు మాం పాణినా స్పృశ** 42-34

ఇట్టి స్థితిలోఉన్న దశరథునిచూచి కౌసల్యకు మరింత దుఃఖము వచ్చినది.

*కౌసల్య:* (దశరథునితో) ఎంతపని చేసినది కైకేయి! రాముని అడవులపాలు చేయక భరతునికి దాస్యము చేయుమని కోరినను మేలుగా నుండియుండును. ఊరిలో బిచ్చ మెత్తుకొని భరతునికి సేవ చేయుచు నా కన్నుల యెదుట నైనను ఉండును గదా, నా రాముడు!

**అథస్మ నగరే రామశ్చరన్ భైక్షం గృహే వసేత్**
**కామకారో వరం దాతు మపి దాసం మమాత్మజమ్** 43-4

నీవు కైకేయి మాటలను విని, మంచి చెడ్డలను గమనింపక, అట్టి సుకుమారులను అడవులపాలు చేసితివిగదా! మంచి యౌవనమున భోగము లనుభవింపవలసిన కాలములో ఆ దంపతులకు వనవాస మేమిటి! ఇది అంతయు నా పురాకృత కర్మమే. బిడ్డలు పాలు త్రాగబోవునప్పుడు వారి తల్లుల పాలిండ్లను పూర్వజన్మమున ఛేదించి యుందును. లేక లేక పుట్టిన ఒక్క కొడుకును విడిచిపెట్టి నేను జీవించియుండగలనా!

*సుమిత్ర:* కౌసల్యా! ఎందు కీ విలాపము. నీ కుమారుడు ధర్మమార్గము నవలంబించి తండ్రిని సత్యవంతునిగా చేయుటకు గదా అడవికి పోయినాడు! అట్టి ధర్మాత్ముని

గురించి దుఃఖించుట సరికాదు. రామునికి పరిచర్య చేయుటకు అరణ్యమునకు వెళ్లిన లక్ష్మణుడు మిక్కిలి అదృష్టవంతుడు. సీత పతివ్రత కావున రాముని అనుసరించినది. రాముడు మహానుభావుడు. వారికి అరణ్యమున ఎట్టి ఆపదలును కలుగవు. రాముడు మహాప్రభావుడు. రామునికి అపజయ మను మాట లేదు. నారచీరలు ధరించి అడవికి బయలుదేరిన రాముని సీత అనుసరించినట్లే లక్ష్మియు అతనిని వెంబడించినది. అట్టి రామునికి దుర్లభమైన దేమియు లేదు.

కుశచీర ధరం దేవం గచ్ఛంత మపరాజితమ్
సీతే వానుగతా లక్ష్మీ స్తస్యకిన్నామ దుర్లభమ్ 44-19

కౌసల్యా! దుఃఖమును విడిచిపెట్టుము. రాముడు తీర్ణప్రతిజ్ఞుడై వచ్చి నీ పాదములకు మ్రొక్కగలడు. పట్టాభిషేకము చేసికొని దివ్యతేజస్సుతో వెలుగుచున్న నీ కుమారుని చూచి నీవు ఆనందబాష్పములను విడువగలవు.

పునః ప్రవిష్టం దృష్ట్వా త మభిషిక్తం మహాశ్రియమ్
సముత్స్రక్ష్యసి నేత్రాభ్యాం క్షిప్ర మానందజం పయః 44-23

సుమిత్ర ఊఱట మాటలవల్ల కౌసల్యా దుఃఖము తగ్గిపోయినది.

[సుమిత్రాదేవి ఎంత గొప్పది! ఆమెను 'తపస్విని' అని వర్ణించినారు వాల్మీకి మహర్షి. ఆమె కౌసల్యకు చెప్పిన హితవాక్యములను గమనించినచో ఆ వర్ణనలోని సత్యము విశదమగును. తన కుమారుడు లక్ష్మణుడు అడవికి ప్రయాణ మగుచుండగా ఆమె దిగులు పడలేదు సరిగదా, అంతకన్న మంచిపని లేదని అభినందించినది. లక్ష్మణుని అదృష్టమును కొనియాడినది. రాముని మహత్త్వమును గుర్తించిన కొద్దిమందిలో సుమిత్ర ఒకతె. విశ్వామిత్రుడు దశరథునికి చెప్పినమాట ఇచ్చట స్మరింపదగి యున్నది.

అహం వేద్మి మహాత్మానం రామం సత్య పరాక్రమమ్
వసిష్ఠోఽపి మహాతేజా యే చేమే తపసి స్థితాః బాల. 19-14

తపస్సుచేతగాని రాముని తెలిసికొనుట సాధ్యము కాదని ఈ శ్లోకమున సూచితమైనది. సుమిత్ర 'తపస్విని' అగుటచేతనే రాముని తెలిసికొన గలిగినది. రాముని తెలిసికొన్న వారికి ఎట్టి ఆపదయును రాదు. అందుకే సుమిత్ర నిర్విచారముగా నున్నది.]

## సీతారామలక్ష్మణులు అరణ్యమునకు పోవుట

సీతారామ లక్ష్మణులు రథముమీద ప్రయాణము చేయుచున్నారు. ప్రజలందరు రథమును వెంబడించి పోవుచున్నారు. రాముడు వారిని స్నేహభావముతో చూచినాడు. దయార్ద్రదృష్టులతో వారిని త్రాగుచున్నట్టు తోచినది.

**ఆవేక్షమాణ** స్సస్నేహం చక్షుషా ప్రపిబన్నివ 45-5

[రాముని చల్లని చూపులకు వారెన్ని నోములు నోచినారో !]

**రాముడు:** ప్రజలారా ! నాయెడ మీకుగల ప్రీతి గౌరవములను నా ప్రీతి కొరకు భరతునియెడ ఎక్కువగా ప్రదర్శింపుడు. వయస్సులో చిన్నవాడైనను భరతుడు జ్ఞానవృద్ధుడు. మృదువుగా ఉన్నను గొప్ప పరాక్రమశాలి. ప్రభువునకు ఉండ వలసిన కల్యాణగుణములు భరతునియందు నెలకొని యున్నవి. భరతుడు మన చక్రవర్తిచే యువరాజుగా నియమింపబడినవాడు. మన ప్రభువుగారి ఆజ్ఞను మీరు, నేను, అందఱను పాలించి అనుసరింప వలయును. కావున మీ రెల్లరు భరతుని యందు భక్తికలిగి అతని మాటచొప్పున నడచుకొనుడు. మీ రిక అయోధ్యకు మరలుడు.

రాముని మాటలు ఎవ్వరును వినిపించికొనలేదు. ఒక్కరుగూడ వెనుకకు తిరుగ లేదు. కొందరు ముసలి బ్రాహ్మణులు రథాశ్వముల నుద్దేశించి "ఓ అశ్వములారా ! మీరు ముందుకు అడుగు వేయకుడు. వెనుకకు మరలి రాముని అయోధ్యకు కొనిరండు. అశ్వములు కర్ణవంతములని చెప్పుదురుగదా ? మీరు మా ప్రార్థనను చెవినిబెట్టుడు" అని వాపోయినారు.

ఇట్లు విలపించుచుండిన ముసలి బ్రాహ్మణులను చూచి శ్రీరాముడు జాలిపడి రథమునుండి దిగినాడు. రాముని వెంబడి సీతయును లక్ష్మణుడును దిగినారు. బ్రాహ్మ ణులు గుఱ్ఱముల వేగమును అనుకరించలేరని ఇట్లుచేసి కాలినడకను మెల్లగా ప్రయాణము సాగించుచున్నారు. బ్రాహ్మణులు రాముని కలిసికొన్నారు.

**బ్రాహ్మణులు:** రామప్రభూ ! అనవరతము వేదముల నాశ్రయించియుండు మా బుద్ధి నీ నిమిత్తమై వనవాసము మీదికి మరలినది. మాకు పరమధన మైన వేదములు మా హృదయములలోనే నిలిచి యుండగలవు. మా భార్యలను వారి పాతివ్రత్యమే రక్షింపగలదు. కావున మేము లేకపోయినను వారు తమ గృహములలో సురక్షితముగా ఉండగలరు. మేము నీ వెంటవచ్చి నిన్ను వేడుకొనుచున్నాము. నీవు అయోధ్యకు మరలిరమ్ము. వృద్ధ బ్రాహ్మణుల మాట త్రోసిపుచ్చుట ధర్మముకాదు. మేమేకాదు. జంగమములు స్థావరములు అన్నియును నీరాక కోరుచున్నవి. వృక్షములు సైతము నీవైపే తిరిగి చూచు చున్నవి చూడుము.

ఇట్లు మాటలాడుచునే తమసానదీ తీరమునకు వచ్చినారు. బ్రాహ్మణుల ప్రార్థనల నంగీకరింపక ప్రయాణము సాగించుట బాగులేదని చెప్పినట్లు రాముని

ప్రయాణమునకు తమసానది అడ్డు తగిలినది. సుమంత్రుడు గుఱ్ఱములను విప్పినాడు. అందరు తమసానదీ తీరమున విశ్రమించినారు. శ్రీరాముడు సీతాదేవివంక చూచి లక్ష్మణునితో అనుచున్నాడు.

తతస్తు తమసా తీరం రమ్య మాశ్రిత్య రాఘవః
సీతా ముద్వీక్ష్య సౌమిత్రి మిదం వచన మబ్రవీత్ 46-1

[లక్ష్మణుని పేరుపెట్టి సీతాదేవికి చెప్పుచున్నా డన్నమాట. రామునితో కూడిన సంగతియే అంత! చెప్పదలచుకున్న మాటను తిన్నగా చెప్పడు. ఎల్లప్పుడు ఇతరులను పరీక్ష చేయుచున్నట్లే ఉండును. మాట మిక్కిలి సున్నితము. శ్రీరాముని అర్థము చేసికొన గలిగిన వారు ఇద్దరు మాత్రమే కనబడుచున్నారు. సీతాదేవి, లక్ష్మణుడు. వారిద్దరలో కూడ సీతాదేవియే మేటి]

రాముడు : లక్ష్మణా! వనవాసపు మొదటిరాత్రి వచ్చినది. ఇంటిసంగతి మరచి పొమ్ము. అయోధ్యలోని వారందరు మనలను తలచుకొని దుఃఖించుచుందురు. తల్లిని తండ్రిని తలచుకొని నాకు మిక్కిలి దుఃఖము కలుగుచున్నది. వారు ఏడ్చి ఏడ్చి గ్రుడ్డివారయి పోవుదురు కాబోలు పాపము! భరతుడు ధర్మాత్ముడు కాబట్టి వారికి ఊరట కలుగజేయగలడని కొంత ధైర్యముగా ఉన్నాను. లక్ష్మణా! నీవు నన్ననుసరించివచ్చుట ఎంతో మేలయినది. లేనిచో సీతా సంరక్షణ విషయమున చిక్కు కలిగియుండును.

తమ్ముడా! ఈరాత్రికి నా కాహార మేమియు వలదు. నీరుమాత్రము త్రాగెదను. సుమంత్రా! గుఱ్ఱముల విషయమున జాగ్రత్తగా ఉండుము.

సుమంత్రుడు గుఱ్ఱములను కట్టివేసి వానికి మేపుపెట్టి రామునిచెంతకు వచ్చినాడు. సుమంత్రుడును లక్ష్మణుడును సీతారాములకు పర్ణశయ్యను ఏర్పరిచినారు. సీతారాములు పర్ణశయ్యమీద శయనించినారు.

సుమంత్రుడు, లక్ష్మణుడు శ్రీరాముని గుణములను గురించి మాటాడుకొనుచు రాత్రి యంతయు మేల్కాంచియుండినారు. రాముని వెంబడించిన ప్రజ లందరు నిద్ర పోయినారు.

వారెవ్వరును నిద్రనుండి లేవకముందే రాముడు లేచినాడు.

రాముడు : లక్ష్మణా! చూచితివా యీ ప్రజలను! ఇండ్లు వాకిండ్లు విడిచివచ్చి ఈ చెట్ల క్రింద నిదురపోవుచున్నారు. వారికి మనమీద ఎంత అనురాగము! అయోధ్యకు రమ్మని పట్టుపట్టియున్నారు. వారిసంగతి చూడగా వారు ప్రాణముల నైనను త్యజింతురుగాని వారిపట్టును మాత్రము విడుచునట్లులేదు. కావున వారు నిద్ర

లేవకముందే మనము వెళ్ళుట మంచిది. మనము మన ప్రజలను సర్వవిధముల రక్షింప వలయును. కాబట్టి మనము వెంటనే వెళ్ళుట మేలు.

లక్ష్మణుడు: నాకుకూడ అట్లే తోచుచున్నది.

సుమంత్రుడు రథము నాయితముచేసి సీతారామలక్ష్మణులను ఎక్కించుకొని తమసానదిని దాటించి ఆవలితీరమునకు చేర్చినాడు. జనులకు భ్రమకలిగించుటకు రాముడు ఒక ఉపాయము ఆలోచించినాడు.

రాముడు: సుమంత్రా! నీవుమాత్రము రథము నెక్కి కొంచెము దూరము ఉత్తర ముఖముగా పొమ్ము. తరువాత రథమును మరలించి తెమ్ము. నేను ఏతట్టు వెళ్ళినది వారికి తెలియకుండునట్లు రథమును త్రిప్పుము.

సుమంత్రుడు రాముని ఆజ్ఞను నిర్వర్తించి రథమును రామునియొద్దకు తెచ్చినాడు. అందరు రథము నారోహించి తపోవనమునకు పోవు మార్గము ననుసరించి ప్రయాణమైనారు.

తెల్లవారినది. జనులు రాముని జాడను తెలిసికొనజాలక తమకు పట్టిన నిద్రను నిందించుకొన్నారు.

[తమసా తీరమున శయనించినవారు నిద్రపోవక యేమి చేయగలరు! తమస్సు ఆవరించినది!]

ప్రజలకు ఏమిచేయుటకును తోపలేదు. అక్కడనే అగ్నిలో పడి మరణించుట మేలని కొంతసేపు తలపోసినారు. "రాముడు లేకయే అయోధ్యకు వెళ్లుట యెట్లు" అని కొంతసేపు తర్కించుకొన్నారు. తరువాత ఎంతో కష్టముమీద అయోధ్యకు వెళ్లినారు.

పట్టణ మంతయు పాడుపడి యుండినది. భయపడుచు ఇండ్లలో ప్రవేశించినారు. స్త్రీలందరు రోదనము చేయుచుండినారు. జ్యేష్ఠపుత్రుడు సమీపించినను తల్లులకు సంతోషము కలుగుటలేదు. శ్రీరాముని విడిచి పురమునకు మరలివచ్చిన జనులను వారి స్త్రీజనములు నిందించుచున్నారు.

స్త్రీలు: శ్రీరాముని విడిచివచ్చినవారికి ఇండ్లతో గాని భార్యా పుత్రులతో గాని ధన ధాన్యములతోగాని యేమి ప్రయోజనము! రామునివెంట నడిచిన లక్ష్మణుడొక్కడే లోకమున కంతటికి మంచిమగవాడు. అడవిలో శ్రీరాముడు ఏయే నదులలో ఏయే సరస్సులలో స్నానము చేయునో అవన్నియు ఎంతోపుణ్యము చేసికొన్నవై యుండును. అరణ్యములోని వృక్షములు, పర్వతములు, శ్రీరా

ముని ఎంతో ఆదరింపగలవు. అకాలమున సైతము వృక్షములు పూచి, కాచి, రామునికి ఆనందమును కూర్పగలవు. రాము డున్నచోట భయము, పరాభవము ఉండవు. మన మిప్పుడే రాముని వెంబడించి పోవుదము. ఆలస్యము చేసినచో రాముడు మనకు అందక దూరముగా వెళ్లగలడు. అందరు కదలుడు. రాముని పాదసేవ చేసికొనుచు సుఖముగా ఉండగలము. మేము సీతాదేవికి పరిచర్యలు చేయుచుందుము. మీరు శ్రీరామునికి పరిచర్యలు చేయుచుండుడు. రాముడు లేని అయోధ్యలో ఒక్కక్షణమైనను ఉండజాలము. కైకేయి రాజ్యమున మాకు ప్రాణములు దక్కవు. ఆస్తిపాస్తులు మొదలే దక్కవు. కేవలము ఐశ్వర్యముకొరకు పుత్రుని, భర్తను త్యాగము చేసిన కైకేయి మనలను సుఖపెట్టునా! రామునివంటి మహాత్ముని అరణ్యముపాలు చేసిన మహాతల్లి మనలను సరకుసేయునా!

రాజ్య మంతయు అనాయకమై ఛిన్నాభిన్నమైనది. మీరు పరమ దరిద్రులు. కావుననే రాముని విడిచి రాగలిగితిరి. మీ కిచ్చట చోటులేదు. విషము మ్రింగుడు. లేనియెడల మీ పేరుకూడ వినబడకుండునట్లు దూరదేశములకు పొండు.

ఈ విధముగా తమ మగవారిని నిందించుచు స్త్రీలందరు రోదనము చేయుచు కూర్చుండినారు. ఇండ్లలో వంటలూ వార్పులూ యేమియులేవు. పురమునందు ఎక్కడివారక్కడ కూర్చుండి దుఃఖించుచున్నారు.

కిన్ను తేషాం గృహైః కార్యం కిం దారైః కిం ధనేన వా
పుత్రైర్వాకిం సుఖైర్వాపి యే నపశ్యంతి రాఘవమ్ 48-7

[శ్రీరాముని చూడనివారికి ఎన్నియుండియు లాభము లేదు]

అకాలే చాపి ముఖ్యాని పుష్పాణి చ ఫలాని చ
దర్శయిష్యం త్యనుక్రోశా ద్గిరయో రామ మాగతమ్ 48-13

యత్ర రామో భయం నాత్ర నాస్తి తత్ర పరాభవః 48-15

పాదచ్ఛాయా సుఖా భర్తు స్తాదృశస్య మహాత్మనః
సహి నాథో జనస్యాస్య నగతి స్సపరాయణమ్ 48-17

వయం పరిచరిష్యామ స్సీతాం యూయంతు రాఘవమ్ 48-18

యయా పుత్రశ్చ భర్తా చ త్యక్తా వైశ్వర్య కారణాత్
కం సా పరిహరే దన్యం కైకేయీ కులపాంసనీ 48-22

యా పుత్రం పార్థివేంద్రస్య ప్రవాసయతి నిర్ఘృణా
కస్తాం ప్రాప్యసుఖం జీవే దధర్మ్యాం దుష్టచారిణీమ్. 48-24

## సీతారామలక్ష్మణుల ప్రయాణము

శ్రీరాముడు కోసలదేశము నందలి నగరములు, గ్రామములు, వనములు, ఉపవనములు అన్నింటిని సీతాదేవికి పరిచయము చేయుచు వారి రాజ్యము సరిహద్దు చేరినారు.

**రాముడు :** సుమంత్రా! మనదేశపు ఎల్లకు వచ్చినాము. మరల నే నెప్పుడు వచ్చి మన సరయూవనమున వేటాడగలనోగదా! రాజులకు వేటవంటి ఆట మరియొకటిలేదు.

ఈవిధముగా మాటలాడుకొనుచు కోసలదేశమును దాటినారు. శ్రీరాముడు అయోధ్యవైపు తిరిగి నమస్కరించి "నాకు సెలవిమ్ము. మహారాజు ఋణము తీర్చుకొని వచ్చి నిన్ను మరల దర్శింపగలను" అని ప్రార్థించినాడు. పురజనులు వెనుకకు వెళ్ళినారు. కాని జానపదులు మాత్రము గుంపులు గుంపులుగా శ్రీరాముని వెంబడించుచునే యున్నారు. రాముడు వారిని జాలితోచూచి "మీరు నాయందు ఆదరము చూపించి మిక్కిలి దూరము వచ్చినారు. మీరు నాచేరువన ఉందురేని మీకును నాకును దుఃఖము గనే యుండును. కావున మీరు వెనుకకు మరలుడు," అని చెప్పినాడు. వారు దుఃఖభార పీడితులై అతిప్రయాసమీద వెనుకకు మరలినారు.

## గుహుడు

శ్రీరాముని రథము గంగాతీరమున నుండిన శృంగిబేరపురమును సమీపించినది. పవిత్రమైన గంగానదిని దర్శించి అందరు రథమునుండి దిగి ఒక గారచెట్టు క్రింద విశ్రమించినారు. వారు విడిసిన ప్రదేశము నిషాద రాజ్యము లోనిది. ఆ దేశమునకు రాజు గుహుడు. శ్రీరామునికి ప్రాణస్నేహితుడు.

రాముడు తన దేశమునకు వచ్చిన వార్త విని గుహుడు తన మంత్రులతోను, పరిజనముతోను, వచ్చి రామునికి స్వాగత మిచ్చినాడు.

**గుహుడు :** (రాముని కవుగిలించుకొని) రామ ప్రభూ! ఈ రాజ్యము నీ సొంతము. నీ విచ్చటికి వచ్చుట నా భాగ్యమేకాని ఇతరము కాదు. నీవంటి అతిథి అందరకును లభ్యపడడు. ఇవిగో! పిండివంటలు భోజన పదార్థములు సిద్ధముగా ఉన్నవి. వీనిని ఆరగింపుము. మీకు మేలైన పాన్పులను తెప్పించి యున్నాను. మీ గుఱ్ఱములకు కావలసిన మేపు కూడ సిద్ధపరచి యున్నాను. నీవు నా ఆతిథ్యమును స్వీకరించి నన్ను కృతార్థుని చేయ వేడుచున్నాను.

**రాముడు :** (గుహుని కవుగిలించుకొని) గుహుడా! నీవు శ్రమపడి తెచ్చిన పదార్థములను మరల నీకే ఇచ్చుచున్నాను. గ్రహింపుము. ఇప్పుడు నేను వనవాసము చేయుచున్నాను. కావున వానితో నాకు పనిలేదు. ఈ గుఱ్ఱము లన్న మా తండ్రికి

ప్రాణము. వానికి మాత్రము మేత పంపినచో అదే చాలును. నాకు మరే మియు అక్కరలేదు.

శ్రీరాముడు నారచీరలను ధరించియే సంధ్యను ఉపాసించి లక్ష్మణుడు కొని తెచ్చిన గంగాజలమును త్రాగి సీతాసమేతుడై ఒక చెట్టుక్రింద శయనించినాడు. సీతా రాముల సంరక్షణార్థము గుహుడు ధనుష్పాణియై సుమంత్రునితోను, లక్ష్మణునితోను మాటలాడుచు ఆ రాత్రియంతయు మేలుకొనియున్నాడు.

*గుహుడు :* (లక్ష్మణునితో) నాయనా! నీవు రాజపుత్రుడవు. ఇట్లు మేలుకొని యుండుట ఎందుకు ? ఈ పాన్పుమీద శయనించి సుఖముగా నిద్రింపుము. శ్రీరాముడు నాకు ప్రాణసమానుడు. రాముని అనుగ్రహమువలన నాకు కీర్తి ధర్మము ధనము అన్నియు లభింపగలవని ఆశించుచున్నాను. ఈ అరణ్యమున నాకు తెలియని ప్రదేశము గాని నాకు తెలియని విషయము గాని లేదు. నేను మెల కువ గలిగి సీతారాములను రక్షింపగలను. నీవు సుఖముగా నిదురింపుము.

అస్య ప్రసాదా దాశంసే లోకేఽస్మిన్ సుమహద్యశః
ధర్మా వాప్తించ విపులా మర్థా వాప్తించ కేవలమ్ 51-5

[శ్రీరాముని అనుగ్రహ మున్నయెడల ఎట్టి కొరతయును ఉండదు]

*లక్ష్మణుడు :* గుహుడా! నీవు రక్షించుచుండగా మా కెవ్వరికిని భయములేదు. కాని, సీతా రాములు ఆ విధముగా నేలమీద శయనించి యుండగా నాకు నిదురపట్టునా! ఆహా! వారికి ఎట్టి కష్టకాలము వచ్చినది! రాముని అరణ్యమునకు పంపి మా తండ్రి చాలకాలము జీవించి యుండజాలడు. కౌసల్యగాని సుమిత్రగాని దశరథ మహారాజుగాని ఎక్కువ కాలము బ్రతికియుండలేరు. మా తండ్రి తన కోర్కెను తీర్చుకొనలేకయే ప్రాణములు విడువగలడు. తండ్రికి ప్రేతకార్య ములు చేయుటకైనను మేము నోచుకొనలేదు.

రాత్రియంతయు ఇట్టి మాటలతోనే గడచి పోయినది. సూర్యోదయమైనది.

*రాముడు :* లక్ష్మణా! ఈ గంగానది మిక్కిలి వడిగా ప్రవహించుచున్నది. దీనిని మన మెట్లయినను దాటవలయును.

[ఒక నావ కావలెనని గుహునికూడ అడుగడు. రాముని మాటతీరే అంత. ఆయన మన స్సులోని అభిప్రాయమును మనము ఊహించి తెలిసికొనవలెను. ఆ పని అందరకు సాధ్య మగునా! లక్ష్మణునివంటివానికిగాని సాధ్యముకాదు. ఒక్కొకమారు లక్ష్మణుని ఊహాకు సైతము అందదు. సీతాదేవియే ఆపనికి సమర్థురాలు.]

లక్ష్మణుడు రాముని అభిప్రాయమును గ్రహించి ఒక నావను తెప్పింపుమని గుహునితో చెప్పినాడు. గుహుడు నావను సిద్ధపరచినాడు.

*గుహుడు*: రామప్రభూ! నావ సిద్ధముగా నున్నది. గంగానదిని దాటుటకు అభ్యంతర మేమియు లేదు.

అందరు నావయొద్దకు బయలుదేరినారు.

*సుమంత్రుడు*: రామప్రభూ! నా కేమి ఆజ్ఞ.

శ్రీరాముడు తన కుడిచేతిని సుమంత్రునిమీద వైచి ఎంతో అనురాగము చూపించి అనుచున్నాడు.

*రాముడు*: సుమంత్రా! నీవు రథమును తీసికొని అయోధ్యకు మరలిపొమ్ము.

*సుమంత్రుడు*: రామప్రభూ! నీవంటివానికి వనవాసము ప్రాప్తించిన దనగా బ్రహ్మచర్యము, వేదాధ్యయనము, సద్గుణములు నిరర్థకము లన్నమాట. నీవు పితృవాక్యమును పాలించి ముల్లోకములను జయించుచున్నావు. కాని మా గతి మాత్రము దుర్గతియే. మేము కైకేయి రాజ్యమున సుఖపడగలమా!

ఈ మాటలు చెప్పి సుమంత్రుడు పెద్దగా ఏడ్చినాడు.

*రాముడు*: సుమంత్రా! ఏడ్వకుము. నీవు అయోధ్య కరిగి మా తండ్రిని ఊరడింపుము. కైకేయికి సంతోషము కలిగించుటకు మా తండ్రి చేయుమన్న పనులను చేయుచుండుము. మా తండ్రి దుఃఖమును తీర్పగల కార్యములను చేసి ఆయన దుఃఖమును తీర్పుము.

నా తండ్రికి నాకు మారుగా నమస్కరించి నా మాటలుగా ఇట్లని పలుకుము. "తండ్రీ! అరణ్యా వాసము మాకు కొంచెముకూడ దుఃఖమును కలిగించుటలేదు. నీవు భరతుని పిలిపించి అతనికి యౌవరాజ్య పట్టాభిషేకము చేసి భరతుని కవుగిలించుకొనుము. అట్లైన నీ కిప్పుడు సంభవించిన దుఃఖము తీరిపోవును."

సుమంత్రా! కౌసల్యకు, సుమిత్రకు, కైకేయికి మా ముగ్గురి నమస్కారములు చెప్పి మా క్షేమమును తెలియజేయుము.

భరతునికి నా మాటలుగా ఇట్లు చెప్పుము "తండ్రి మాటను గౌరవించి పట్టాభిషేకము చేసికొనుము. మీ తల్లిని చూచునట్లే మా తల్లినికూడ చూచి ఆదరింపుము. తల్లు లందరియందును భేదభావము లేక ప్రవర్తింపుము."

*సుమంత్రుడు*: రామప్రభూ! నేను అయోధ్యకు వెళ్లలేను. నీతో ఉండెదను. నీవు లేక శూన్యమైన రథమును తీసికొనిపోయినచో పురజను లందరు నన్ను తిట్టిపోయ

గలరు. నేను వెళ్లి నీ తల్లి ముఖమును చూడగలనా! "మా రాము డేడి?" అని కౌసల్య అడుగునేని నే నామెకు ఏమి సమాధానము చెప్ప గలను? "నీ కుమారుని మేనమామ ఇంట వదలి వచ్చితిని. అతనికి వచ్చిన భయ మేమియును లేదు" అని అబద్ధము చెప్పగలనా. "అడవిలో వదలి వచ్చితిని" అని నిజము పలుకుదునేని ఆమె దుఃఖమును భరింప గలనా! నేను నీతో అడవిలోనే ఉండెదను. అట్లుండుటకు నీవు సమ్మతింపవేని నేను రథ సహితముగా అగ్నిలో పడి ఆహుతి యగుదును. నన్ను నీతో ఉండనిమ్ము. వనవాసము పూర్తికాగానే ఈ రథమునందే మిమ్ము కూర్చుండబెట్టి అయోధ్యకు చేర్చెదను. నా ప్రార్థన అంగీకరింపుము.

రాముడు : సుమంత్రా! నీ బాధ నాకు తెలియకపోలేదు. నా యెడ నీకు గల అపార భక్తి కూడ నాకు తెలియును. కాని నీవు అయోధ్యకు వెళ్లుట అత్యవసరము. కారణమును వినుము. నీవు అయోధ్యకు వెళ్లిన గాని నేను అడవికి పోయినట్లు కైకేయికి నమ్మకము కుదురదు. కైకేయికి నమ్మకము కలిగి ఆమె సంతోషించిన గాని నా తండ్రి మాట సత్యము కాజాలదు. భరతునిచే పాలింపబడు రాజ్యము కైకేయికి లభించుటయే నాకు ముఖ్యము. కావున నీవు అయోధ్యకు వెళ్లుము.

ఈ మాటలు సుమంత్రునితో చెప్పి రాముడు గుహునితో

రాముడు : గుహుడా! జన సంచారముగల ఈ ప్రదేశమున నేను నివసించుట సరికాదు. అరణ్యములోని ఆశ్రమములకు వెళ్లుట మంచిది. జటలు దాల్చి వెళ్లవలయును. నీవు మఱ్ఱిపాలు తీసికొనిరమ్ము.

గుహుడు మఱ్ఱిపాలు తెచ్చినాడు. ముందు లక్ష్మణుడును తరువాత రాముడును జటలు దాల్చినారు.

గుహునికి కూడ వీడుకోలిచ్చి సీతారామలక్ష్మణులు నావచెంతకు వచ్చినారు.

రాముడు : లక్ష్మణా! నీవు ముందుగా నావ నెక్కి తరువాత సీతను ఎక్కింపుము.

[ఇది సాధ్య మగు పనియేనా! లక్ష్మణునికి ఒక చిన్న పరీక్ష.]

లక్ష్మణుడు రాముని సంగతి తెలిసినవాడు కావున ఆయన హృదయమును కనిపెట్టి ముందు సీతాదేవిని ఎక్కించి తరువాత తాను ఎక్కినాడు. రాముడుకూడ నావనెక్కినాడు. గుహునినావికులు నావను నడిపినారు.

తతో నిషాదాధిపతి ర్గుహో జ్ఞాతీ నచోదయత్ 52.77

[గుహుడు నావను నడిపినట్టు వాడుకలో ఉన్నమాట సరికాదు]

సీతారామలక్ష్మణులు గంగానదికి నమస్కారము చేసినారు. నావ నడచుచున్నది.

నావ నదీమధ్యప్రదేశమునకు వచ్చినపుడు సీతాదేవి చేతులు జోడించి,

**సీత :** తల్లీ! నా ప్రాణేశ్వరుడు తన తండ్రి ఆజ్ఞను పరిపాలించి నాతోను లక్ష్మణునితోను కుశలియై మరలి వచ్చినప్పుడు నిన్ను పూజించెదను. గంగాదేవీ! నీకు నమస్కారము చేయుచున్నాను. నా విభుడు క్షేమముగా వచ్చి అయోధ్యా విభుడైన పిదప నేను నీకు ప్రీతిగా, గోవులను వస్త్రములను బ్రాహ్మణుల కిచ్చి వారికి మృష్టాన్న భోజనములు పెట్టించెదను. నీకు సహస్ర ఘటముల మద్యము, మాంసము సమర్పింతును. నీ తీరమున గల దేవతలను పూజించెదను. తీర్థములకు దేవాలయములకు పూజ లర్పించెదను. మేము క్షేమముగా వెళ్లి మరల క్షేమముగా అయోధ్యకు వచ్చునట్లు అనుగ్రహింపుము.

నావ గంగానదిని దాటి దక్షిణతీరము చేరినది. సీతారామలక్ష్మణులు దిగి నడవ సాగినారు.

**రాముడు :** లక్ష్మణా! మనము అరణ్యములో ప్రవేశించుచున్నాము. మెలకువతో సంచరింపవలెను. ముందు నీవు, తరువాత సీత నడువుడు. మేము మిమ్ములను రక్షించుచు వెనుక నడచెదను. ఈ అడవిలో మనము ఒకరి కొకరు సహాయపడుచుండవలెను. ఏదైనను కార్యము చెడినపిమ్మట దానిని సరిదిద్దుట సులభము కాదు.

నహి తావ దతిక్రాంతా సుకరా కాచన క్రియా 52-97

సీతారామలక్ష్మణులు గంగానది ఆవలితీరము చేరువరకును సుమంత్రుడు చూచుచుండి వారు దూరమై చూపు ఆనకపోయిన పిదప కన్నీరు కార్చినాడు.

సీతారామలక్ష్మణులు వత్సదేశమునకు వచ్చినారు. సాయంకాల మైనతోడనే ఒక చెట్టుక్రింద చేరి పండుటాకులు పరచుకొని శయనించినారు.

**రాముడు :** లక్ష్మణా! సుమంత్రుడైనను లేక మనము ఒంటరులమై గడపవలసిన రాత్రులలో ఇది మొదటిరాత్రి. నీవు దుఃఖమును విడిచిపెట్టుము.

[ఈ మాట సీతాదేవిని ఉద్దేశించి చెప్పినట్లే కనబడుచున్నది]

ఈ రాత్రి మన తండ్రికి నిద్రపట్టి యుండదు. కైకేయి ఇప్పుడైనను సంతోషించి మన తండ్రి ప్రాణములు తీయకుండునా! మనతండ్రి కామాత్ముడు. కైకేయి చేతిలో చిక్కుపడినాడు. తండ్రి సంగతి తలచుకొన్నప్పుడు అర్థ ధర్మములకన్నను కామమే బలీయమని తోపక మానదు.

ఇదం వ్యసన మాలోక్య రాజ్ఞశ్చ మతి విభ్రమమ్
కామ ఏ వార్థధర్మాభ్యాం గరీయా నితి మే మతిః 53-9

కానిచో తండ్రిని అనుసరించి యుండు నావంటి కుమారుని ఒక స్త్రీ నిమిత్తము ఎట్టి అపండితుడైనను పరిత్యజించునా! ఇక భరతుడును, అతని భార్యయు సుఖముగా నుండగలరు. యువరాజైన భరతుడు మన తండ్రి మరణానంతరము రాజుకూడ కాగలడు. అర్థ ధర్మములను విడనాడి కామమునే ఆశ్రయించువారి కందరికి దశరథునికి పట్టిన గతియే పట్టును. మన ఇంట కైకేయి అడుగు పెట్టుట నన్ను అరణ్యమునకు పంపించి రాజు మరణించునట్లు చేసి భరతునికి రాజ్యము చేకూర్చుటకే కాబోలు! సౌభాగ్య మదముతో కైకేయి మన తల్లులను బాధింపకుండునా! లక్ష్మణా! నా నిమిత్తము సుమిత్ర బాధపడుట నా కెంతమాత్రము ఇష్టములేదు.

అపీదానీం న కైకేయీ సౌభాగ్య మదమోహితా
కౌసల్యాం చ సుమిత్రాం చ సంప్రబాధేత మత్కృతే. 53-15

లక్ష్మణా! నీవు ప్రొద్దుననే లేచి అయోధ్యకు మరలిపొమ్ము. కౌసల్య దిక్కులేక యున్నది. నీవుపోయి ఆమెకు అండగా ఉండుము. కైకేయి దుష్టురాలు కాబట్టి కౌసల్యకు ఏదైన గొప్ప అపకారము చేయునేమో! నీవు వెళ్ళి మా తల్లిని భరతునికి అప్పగింపుము. పూర్వజన్మమున మాతల్లి యేదియో పాపముచేసి యుండును. అందుకే ఆమెకిట్టి దుఃఖము సంభవించినది. లక్ష్మణా! నాబ్రతుకు నాకే అసహ్యముగా ఉన్నది ఇన్నాళ్ళు కష్టపడి పెంచిన తల్లిని దుఃఖములో ముంచి ఆమెను వీడివచ్చిన నా బ్రతుకెందుకు? నావంటి కుమారుడు ఏ తల్లికిని కలుగకుండునుగాక!

మాస్మ సీమంతినీ కాచి జ్జనయే త్పుత్ర మీదృశమ్
సౌమిత్రే యోఽహ మంబాయా దద్మిశోక మనంతకమ్. 53-21

లక్ష్మణా! మాతల్లి పెంచిన శారిక "చిలుకా! శత్రువైన కైకేయి పాదమును కొరుకుము" అని చెప్పినదికదా! ఆ శారిక నాతల్లికి చేసినంత హితమునుకూడ నేను చేయజాలక పోయినాను. నేను మా తల్లికి శోకమును మాత్రమే చెందజేయగలిగితిని!

లక్ష్మణా! నాకు కోపము కలిగినచో ఒక అయోధ్యనేకాదు. ఈ భూమండలము నంతయు నా బాణములచే సాధింపగలను. కాని ఇది పరాక్రమమునకు సమయముకాదు. అధర్మమునకు భయపడి పట్టాభిషేకము మానుకొన్నాను.

ఏకోహ్యహ మయోధ్యాంచ పృథివీం చాపి లక్ష్మణ
తరేయ మిషుభిః క్రుద్ధో ననువీర్య మకారణమ్. 53-25

లక్ష్మణుడు: అన్నా! నీ విట్లు పరితపించుట సరికాదు. నీవు దుఃఖించుచుండుట చూచిన సీతాదేవికిని నాకును దుఃఖము కలుగుచున్నది. నిన్ను విడిచి నేను తండ్రినిగాని, శత్రుఘ్నునిగాని, సుమిత్రనుగాని చూచుటకు ఇష్టపడను. నిన్ను విడిచి స్వర్గమునుకూడ కోరను.

[లక్ష్మణునిచేత ఇట్లు పలికించుటకే శ్రీరాముడు ఇంతసేపు మాట్లాడుట. రాముడు చెప్పిన మాటలన్నియు లక్ష్మణుని బాధించుచున్న భావములే. ఆ మాటలను రాముడే బయటికి పలికి అవి సరియైన భావములు కావని లక్ష్మణునిచేతనే పలికించినాడు. ఇకమీద ఆ మాటలు లక్ష్మణుని నోట వచ్చుటకు అవకాశములేదు. శ్రీరాముని వాక్చాతుర్యమునందుగల విశేషములలో ఇది యొకటి.]

ఈ విధముగా మాటలాడుకొనుచు పరుండినారు. రాత్రి గడచిపోయి సూర్యోదయ మైనది.

సీతారామలక్ష్మణులు బయలుదేరి ప్రకృతి సౌందర్యమును తిలకించుచు ప్రయాణము చేసి గంగా యమునా సంగమ ప్రదేశమున ప్రయాగ సమీపమున నుండిన భరద్వాజాశ్రమము చేరుకొన్నారు. అప్పటికి ప్రొద్దు వ్రాలినది.

## సీతారామలక్ష్మణులు భరద్వాజాశ్రమమునకు పోవుట

భరద్వాజమహాముని హోమము చేయుచుండినాడు. ఆ కార్యకలాపము పూర్తియగువరకు వేచియుండి తదనంతరము సీతారామలక్ష్మణులు మునిని సందర్శించి నమస్కరించి తమ వృత్తాంతమును నివేదించినారు.

భరద్వాజుడు వారికి అతిథిమర్యాదలుచేసి ఫలమూలాదులిచ్చి సత్కరించి రామునితో అనుచున్నాడు.

భరద్వాజుడు: రామా! మా ఆశ్రమమునకు ఎంత కాలమునకు వచ్చినావు! ఈ నాటికి నిన్ను దర్శింప గలిగితిని. నిన్ను నిష్కారణముగా అడవికి పంపిన సంగతి విన్నాను. ఈ ప్రదేశము జనసమ్మర్దము లేక ప్రశాంతముగా ఉండును. మీ రిందే యుండి కాలము సుఖముగా గడపవచ్చును.

రాముడు: మహాముని! ఈ ప్రదేశము పురజనులకు, జానపదులకు సమీపముగా ఉండుట వలన మమ్ములను చూచుటకు వారు వచ్చుచుందురు. మా నివాసమునకు తగిన మరియొక ప్రదేశమును చూపింపు మని ప్రార్థించుచున్నాను.

భరద్వాజుడు: నాయనా! ఇక్కడికి పదిక్రోసుల దూరమున చిత్రకూట పర్వత మున్నది. అది గంధమాదన పర్వతమునకు సరివచ్చునది. ఆ చిత్రకూట పర్వత శిఖరము

లను దర్శించిన జనులకు పాపబుద్ధి వదలిపోవును. అక్కడ ఎందరో ఋషులు తపస్సు చేసి స్వర్గమున కరిగినారు. ఆ ప్రదేశము మీకు అన్నివిధముల అనుకూలముగా నుండును. మీ కిష్టమైనచో ఇక్కడనే ఉండవచ్చును.

ఈ మాటలలోనే రాత్రి యైనది. ఆ రాత్రి అచ్చటనే విశ్రమించి తెల్లవారగనే రాముడు ప్రయాణమునకు సిద్ధపడి భరద్వాజునితో

**రాముడు :** స్వామీ ! మీరు నిర్దేశించిన ప్రదేశమునకే వెళ్లదలచుకొని యున్నాము. అనుజ్ఞను వేడుచున్నాను.

**భరద్వాజుడు :** తథాస్తు. చిత్రకూట పర్వతము ఎంతో రమ్యముగా నుండును. ఫలమూలములకు కొరత యుండదు. అక్కడ ఒక ఆశ్రమమును నిర్మించుకొని సుఖముగా ఉండవచ్చును.

సీతారామలక్ష్మణులు చిత్రకూటమునకు బయలుదేరినారు. భరద్వాజుడు వారికి మంగళాశీర్వాదములు గావించి వారిని వెంబడించి దారి సూచించినాడు.

**భరద్వాజుడు :** రామా ! మీరు గంగాయమునాసంగమ ప్రదేశమునకు వెళ్లి అక్కడినుండి యమున ననుసరించి పోవలయును. ఒక తెప్పను నిర్మించుకొని మామూలు రేవున యమునను దాటిపోయినచో 'శ్యామము' అను పేరుగల ఒక పెద్ద వటవృక్షము మీకు గోచరించును. సీతాదేవి దానికి మ్రొక్కి తన కోర్కెలు తీర్పుమని ప్రార్థింప వలయును. కావలయునేని అక్కడ కొంతసేపు విశ్రమింపవచ్చును. లేక ప్రయాణము సాగింప వచ్చును.

అక్కడనుండి ఒక క్రోసెడు దూరము నడచిన యెడల మోదుగచెట్లు, రేగుచెట్లు, వెదురుపొదలు మున్నగు వృక్షములతో కూడిన ఒక నల్లని అడవి కానవచ్చును. ఆదారినే వెళ్ళినయెడల చిత్రకూటపర్వతము కనబడును.

ఈ విధముగా దారి చూపించి భరద్వాజుడు తన ఆశ్రమమునకు మరలినాడు.

## సీతారామలక్ష్మణులు చిత్రకూటమునకు పోవుట

**రాముడు :** లక్ష్మణా ! భరద్వాజమునికి మనమీద ఎంతో ప్రీతి. కావున మనము ధన్యులము.

సీతాదేవిని మున్నిడికొని ప్రయాణము చేయుచున్నారు. యమున ననుసరించి వెళ్ళి రేవుదగ్గర ఒక తెప్పను నిర్మించుకొని సీతాదేవి నెక్కించి తమ ఆయుధములను, సీతాదేవి వస్త్రాభరణములను తెప్పపైకి చేర్చి వారు యమునానదిని దాటినారు. సీతాదేవి యమునకు నమస్కరించి వనవాసవ్రతము పూర్తి యగునెడల వేయి గోవులు, నూరు మద్యభాండములను సమర్పింతు నని మ్రొక్కుకున్నది.

అక్కడనుండి భరద్వాజులవారు సూచించిన వటవృక్షమును సమీపించినారు. సీతాదేవి ఆ వటవృక్షమునకు నమస్కరించి "నా ప్రాణేశ్వరుడు వనవాసవ్రతమును పూర్తి కావించునట్లును కౌసల్యను సుమిత్రను మేము చూచునట్లును అనుగ్రహింపుము" అని ప్రార్థించి వృక్షమునకు ప్రదక్షిణము చేసినది.

ఆ తరువాత ప్రయాణమునకు వరుస మార్చుకొన్నారు. ముందు లక్ష్మణుడు, తరువాత సీత, ఆ తరువాత రాముడు, ఈ వరుసన నడచుచున్నారు. సీతాదేవి వన సౌందర్యమును చూచి ఆనందించుచు నడచినది. ఆమెకోరిన క్రొత్తక్రొత్త పుష్పములను లక్ష్మణుడు తెచ్చి ఇచ్చినాడు.

ఈ విధముగా వారు సంతోషముతో ప్రయాణము చేసి ఆ రాత్రి నదీతీరమున విశ్రమించి ఉదయమున లేచి కొంతదూరము నడచిపోగా చిత్రకూటపర్వతము కనబడినది. దారిలో వాల్మీకి ఆశ్రమమునకు వెళ్ళి ఆమహర్షికి నమస్కరించినారు.

**ఇతి సీతాచరామశ్చ లక్ష్మణశ్చ కృతాంజలిః**
**అభిగమ్యాశ్రమం సర్వే వాల్మీకి మభివాదయన్.**

వాల్మీకిమహర్షి వారికి స్వాగతమిచ్చి అతిథిమర్యాదలు చేసినాడు. సీతారామ లక్ష్మణులు వాల్మీకిని వీడ్కొని చిత్రకూటమునకు చేరినారు.

**రాముడు:** లక్ష్మణా! మన మిచ్చట నివాసము చేయుటకు ఒక పర్ణశాలను నిర్మించుకొన వలెను. దృఢమైన దారువులను తెచ్చి ఒక పర్ణశాలను నిర్మింపుము.

లక్ష్మణుడు రమ్యమైన పర్ణశాలను నిర్మించి నల్ల ఇఱ్ఱిమాంసమును తెచ్చి దానిని పక్వము చేసి వాస్తు శాంతి చేసినాడు. అందరు గృహప్రవేశము కావించినారు. సుఖముగా కాలము గడపుచున్నారు.

చిత్రకూట పర్వత ప్రదేశమున మాల్యవతీ నదీ తీరమున పర్ణశాలను నిర్మించుకొని అయోధ్యను విడిచివచ్చిన దుఃఖమును మరచిపోయి హాయిగా ఉన్నారు.

**సురమ్య మాసాద్యతు చిత్రకూటం**
**నదీం చతాం మాల్యవతీం సుతీర్థామ్**
**ననంద హృష్టో మృగపక్షి జుష్టాం**
**జహౌచ దుఃఖం పురవిప్రవాసాత్** 56-38

## సుమంత్రుడు అయోధ్యకు వెళ్లుట

సీతారామలక్ష్మణులు గంగానది దక్షిణతీరము చేరుట చూచి సుమంత్రుడు, గుహుడు మాటలాడుకొనుచు ఇద్దరును గుహుని ఇంటికి వెళ్లినారు.

రాముడు భరద్వాజాశ్రమమునకు చేరుట, అక్కడనుండి చిత్రకూట పర్వతమునకు వెళ్లుట మొదలైన సమాచారములను గుహుని చారులు తెలిసికొని గుహునికిని సుమంత్రునికిని తెలియపరిచినారు.

సుమంత్రుడు అయోధ్యకు ప్రయాణమై మూడవనాడు సాయంకాలమునకు అయోధ్య చేరినాడు. పట్టణ మంతయు శూన్యముగా కనబడినది. రామశోకాగ్నిచే దహింపబడినట్లు కానవచ్చినది.

రామ సంతాప దుఃఖేన దగ్ధా శోకాగ్నినా పురీ 57-7

సుమంత్రుడు వచ్చుట చూచి జను లందరు గుంపులుగుంపులుగా వచ్చి 'రాముడెక్కడ' అని అడిగినారు. "గంగను దాటినారు" అని సుమంత్రుడు చెప్పగా విని అందరు గొల్లున ఏడ్చినారు. సుమంత్రునికి దిక్కుతోపలేదు. తలవంచుకొని దశరథుని అంతఃపురమునకు వెళ్లినాడు. అక్కడకూడ, స్త్రీలు, పురుషులు హాహాకారములు చేసినారు. ఎవ్వరినోటగాని గట్టిగా మాటరాలేదు. ఒకరి ముఖము ఒకరు చూచుకొనుచు దుఃఖపడుచున్నారు. సుమంత్రుడు దీనుడై దశరథుని భవనములోని యేడు కక్ష్యాంతరములు దాటి, యెనిమిదవ కక్ష్యాంతరమున ప్రవేశించి అచ్చట విలపించుచుండిన దశరథుని సమీపించి రాముడు చెప్పుమన్న మాటలను చెప్పినాడు. దశరథుడు బదులేమియు పలుకజాలక మూర్ఛవచ్చి పడిపోయినాడు. సుమిత్ర, కౌసల్య ఇద్దరు దశరథుని లేవనెత్తి ఉపచారములు చేసినారు.

కౌసల్య : మహారాజా! సుమంత్రుడు మన రామునియొద్దనుండి వచ్చియున్నాడు. అతనితో పలుక వేమి ? జరిగిన తప్పు జరిగిపోయినది. ఇప్పుడు సిగ్గుపడి లాభమేమి ? ఎవ్వతె భయమువలన రాముని విషయమునుగురించి సుమంత్రుని అడుగలేక జంకుచుంటివో ఆ కైకేయి ఇచ్చటలేదు. కావున నిర్భయముగా భాషింపుము.

దేవ యస్యా భయాద్రామం నానుపృచ్ఛసి సారథిమ్
నేహ తిష్ఠతి కైకేయీ విస్రబ్ధం ప్రతిభాష్యతామ్ 57-31

ఈ మాట వినుటతోడనే దశరథునికి మరల మూర్ఛవచ్చి క్రిందపడినాడు. అందరి కన్నులలో అశ్రువులు నిండినవి. కొంత సేపటికి దశరథుడు మూర్ఛదేరి సుమంత్రునితో మాటలాడుచున్నాడు.

*దశరథుడు* : సుమంత్రా! నా రాముడు ఏ చెట్టుక్రింద నున్నాడు ? ఏమి తినుచున్నాడు? ఆహా! చక్రవర్తి జ్యేష్ఠకుమారునికి ఎట్టి కష్టము కలిగినది! దుర్భరమైన ఇట్టి కష్టమును సుకుమారులైన నా కుమారులు, నా కోడలు ఏవిధమున భరించుచున్నారో గదా!

సుమంత్రా! అరణ్యమున ప్రవేశించిన సీతారామలక్ష్మణులను దర్శించి నీవు కృతార్థుడవైతివి. నేను వారి చరిత్రను వినియైనను ప్రాణములతో ఉండెదను. చెప్పుము. రాము డేమని చెప్పినాడు? సీతాలక్ష్మణులు ఏమి చెప్పినారు?

**సుమంత్రుడు:** రాజా! శ్రీరాముడు నీకును, కౌసల్యాదేవికిని, అంతఃపుర స్త్రీల కందరకును నమస్కరించి తన ఆరోగ్యమును మీకు తెలుపు మని చెప్పినాడు. తన తల్లికి ఈ మాటలు చెప్పుమన్నాడు "తల్లీ! నీ వెల్లప్పుడు తండ్రిగారి పాదసేవ చేయుచుండుము. రాజునకును, కైకేయికిని, అనుకూలముగా ప్రవర్తించుచుండుము. భరతుడు 'రాజు' అను మాటను జ్ఞప్తియం దుంచుకొని రాజునకు తగిన మర్యాదను భరతుని పట్ల చూపుచుండుము. వయస్సులో భరతుడు చిన్నవాడైనను రాజు కాబట్టి అర్థజ్యేష్ఠు డను రాజధర్మమును మఱచిపోరాదు.

అర్థజ్యేష్ఠో హి రాజానో రాజధర్మ మనుస్మర 58-20

భరతునికి ఈ మాటలు చెప్పుమన్నాడు "భరతా! తల్లులయందు భేదభావము లేక నడచుకొనుము. నీవు యువరాజువై రాజుగారిని అనుసరించి యుండుము. దశరథుని ఆజ్ఞానుసారము యౌవరాజ్య పట్టాభిషేకము చేసికొని సుఖముగా ఉండుము. పుత్రశోకములో నున్న నా తల్లిని నీ తల్లివలెనే ఆదరింపుము."

రాజా! రాము డిట్లు పలికి పెద్దపెట్టున దుఃఖించినాడు. లక్ష్మణుడుమాత్రము కోపముతో బుసలుకొట్టుచు ఇట్లు పలికినాడు. "రాముడు ఏ అపరాధమును చేసినాడని అడవికి పంపినారు? రాజు కైకేయి మాటలకు లోబడి మమ్ములను ఇట్టి కష్టముల పాలు చేయుట ఏమి న్యాయము? ముందు వెనుకలు ఆలోచింపక తప్పుపని చేసి ఇప్పుడు అనుతాపపడిన ఏమిలాభము? నాకు దశరథుని యెడ పితృభావము లేదు. నాకు అన్నయైనను రాజు అయినను బంధువైనను తండ్రియైనను అన్నియు రాముడే.

అహం తావ న్మహారాజే పితృత్వం నోపలక్షయే
భ్రాతా భర్తా చ బంధుశ్చ పితా చ మమ రాఘవః 58-31

మహారాజా! సీతాదేవి మాత్రము మాట లేమియు పలుకలేదు. మాటిమాటికి నిట్టూర్పులు పుచ్చుచు, వాడిపోయిన ముఖముతో అయోమయముగా రాముని, రథమును, నన్నును చూచి కన్నీరు కార్చినది.

[మాటలతో పని యేమి! సీతాదేవి తన చూపులతోనే ఎన్నియో సంగతులు చెప్పినది. "రాజుగా రథములో వెళ్లవలసిన రాముని అడవిలో వదలిపెట్టి శూన్యరథమును తోలుకొని పోవుచుంటివా సుమంత్రా! ఇది నీవు చేయదగిన పనికాదు. మమ్ములను ఈవిధముగా బాధ

పెట్టుట మంచిదికాదు." ఇట్టి భావములను యెన్నింటినో తన చూపులతో వ్యక్తపరిచినది సీతాదేవి. ఆ భావములను మనము ఊహించుకొనవచ్చును.]

*దశరథుడు :* సుమంత్రా! ఆ సుకుమారుల వనవాసమును గురించి మరికొంచెము చెప్పుము.

*సుమంత్రుడు :* మహారాజా! రామలక్ష్మణులు జటలు ధరించినారు. జటలు, నారచీరలు, ధరించి గంగానదిని దాటి ప్రయాగవైపు వెళ్లినారు. నేను వారిని గంగానది ఉత్తర తీరమున వదలిపెట్టి రథమును అయోధ్యతట్టు మరలించినాను. రథాశ్వములు కన్నీరు కార్చినవి. వానిని నడిపించుకొని వచ్చుట నాకు ఎంతో కష్టమయినది. రాముడు నన్ను పిలుచునేమో యని ఆశపడి నేను కొన్నిదినములు గుహుని ఇంటనే వేచియుంటిని. తరువాత నా ఆశను వదలుకొని నేను బయలుదేరి వచ్చితిని.

/ మన రాజ్యములోని వృక్షములు సైతము రామ దుఃఖమును భరింపజాలక పుష్పసహితముగా మాడిపోవుచున్నవి. నదులలోను సరస్సులయందును జలములు వేడియెక్కిపోయినవి. అడవిమృగములు కూడ అరచుట మానినవి. అయోధ్యలో నర సంచారము లేదు. నన్నుచూచి పురజను లందరు బిగ్గరగా విలపించినారు. కుమారుని పోగొట్టుకొనిన కౌసల్యవలె అయోధ్య కానబడుచున్నది.

*దశరథుడు :* సుమంత్రా! ఎంతపని జరిగినది! కైకేయి వరములు కోరినప్పుడు మంచి చెడ్డలు తెలిసిన పెద్దలతో ఆలోచింపకపోయితిని! నా తెలివితక్కువ నన్నింతకు తెచ్చినది. నా ప్రాణములు నిలుచునట్లు లేవు. నన్ను రాముని చెంతకు చేర్చుము. నా ఆజ్ఞ ఇంకను చెల్లుబడి యగుచుండునేని, రాముని ఇక్కడికి తోడ్కొనిరమ్ము. లేదా! నన్ను రామునియొద్దకు తీసికొనిపొమ్ము.

> యద్యద్యాపి మమైవాజ్ఞా నివర్తయతు రాఘవమ్
> న శక్ష్యామి వినా రామం ముహూర్తమపి జీవితుమ్ 59-22

(కౌసల్యను చూచి) నేను రాముని చూడక బ్రతికియుండలేను.

ఈ మాటలుచెప్పి దశరథుడు మూర్ఛితుడై పడిపోయినాడు. దశరథుని స్థితి చూచి కౌసల్యకు దిగులు పుట్టినది. కౌసల్య సైతము రాముని తలచుకొని దుఃఖించుచున్నది. సుమంత్రునితో "నేను రాముని చూడక జీవించి యుండలేను. సుమంత్రా! నన్ను వారిచెంతకు కొనిపొమ్ము" అని విలపించినది.

*సుమంత్రుడు :* తల్లీ! దుఃఖపడకుము. రామలక్ష్మణులును, సీతాదేవియును అరణ్యమున సుఖముగా ఉన్నారు. సీతాదేవి రామునియందు మనస్సు నిలిపి ఇక్కడ

అయోధ్యలో ఇంటనుండునట్లే అడవిలో కూడ సంతోషముగా నున్నది. కైకేయిని గూర్చి ఒకమాట చెప్పినది. అది నా కిప్పుడు జ్ఞప్తికి రాలేదు.

[ఆ మాటసంగతి పొరపాటున చెప్పి మరల కౌసల్యా మనస్సును నొప్పించుటకు ఇష్ట పడక సర్దుకొన్నాడు. కౌసల్యకు ప్రీతికరమైన మాటలను మాత్రమే చెప్పుచున్నాడు. మాటలలో అట్టి మెలకువ అవసరము]

ధ్వం సయిత్వాతు తద్వాక్యం ప్రమాదా త్పర్యుపస్థితమ్
హ్లాదనం వచనం సూతో దేవ్యా మధుర మబ్రవీత్ 60-15

తల్లీ! సీతాదేవి ముఖము కొంచెమైనను వాడలేదు. ఆభరణములు ధరించి రామునితో ఆడుచు పాడుచు హాయిగా నున్నది. సీతా రామలక్ష్మణుల సచ్చరిత్రము లోకములో శాశ్వతముగా నిలిచి యుండగలదు. కావున వారిని గుఱించి గాని మనలను గుఱించిగాని దుఃఖపడవలసిన దేమియులేదు.

నశోచ్యాస్తే నచాత్మాన శ్శోచ్యో నాపి జనాధిపః
ఇదం హి చరితం లోకే ప్రతిష్ఠాస్యతి శాశ్వతమ్ 60-21

సుమంత్రుడు ఎంత ఊఱడించినను కౌసల్యా దుఃఖము తగ్గలేదు.

## కౌసల్యా - దశరథుడు

కౌసల్యా: (కన్నీరు కార్చుచు) నాథా! ఎంతపని చేసితివి! "దశరథుడు దయగలవాడు, గొప్పదాత. సదా ప్రియమునే పలుకువాడు" అని ముల్లోకములలో నిన్ను గూర్చి అనుకొనుచున్నారు గదా! అట్టి మహనీయుడవు ఇట్టి దయమాలిన పని ఎట్లు చేయగలిగితివి! సీతగాని రాముడుగాని లక్ష్మణుడుగాని ఘోరమైన అరణ్యములలో నివసింపగలరా! మహాబలుడైన రాముడు ఇనుపగుదియవంటి తనచేతిని తలగడగా పెట్టుకొని పండుకొనగలడా!

[గొప్ప కవిత్వము-రాముని భుజము ఇనుప గుదియవలె నున్న దనుట! రాము డెట్టి బలశాలియో! అందుకే 'మహాబలః' అన్నారు]

మహేంద్ర ధ్వజ సంకాశః క్వను శేతే మహాభుజః
భుజం పరిఘసంకాశ ముపధాయ మహాబలః. 61-7

వనవాసవ్రతము తీర్చి అయోధ్యకు వచ్చినను, రాముడు రాజ్యమును అంగీక రింపడు. భరతుడు అనుభవించి వదలిపెట్టిన ఎంగిలి రాజ్యమునకు రాముడు ఆశపడునా! ఇతర మృగములు భక్షించి వదలిపెట్టిన మాంసమును వ్యాఘ్రము భక్షించునా! అట్లే నరవ్యాఘ్రుడైన రాముడు ఇతరుడు రుచిచూచిన రాజ్యమును ఎన్నటికిని కోరడు.

న పరేణాశితం భక్ష్యం వ్యాఘ్రః ఖాదితు మిచ్ఛతి
ఏవ మేవ నరవ్యాఘ్రః పరలీఢం న మన్యతే. 61-16

రామునికి కోపము కలుగునేని మందరపర్వతమునైనను బ్రద్దలు చేయగలడు. కాని నీ మీద నున్న గౌరవమునుబట్టి అంతటి అవమానమును భరించి నిన్ను హత మార్చక విడిచినాడు. అట్టి మహాత్ముని అడవులపాలు చేసితివి. స్త్రీకి ప్రథమగతి భర్త; రెండవది పుత్రుడు; మూడవది జ్ఞాతులు. మరి నాల్గవగతి వేరొకటిలేదు.

గతిరేకా పతిర్నార్యా ద్వితీయా గతి రాత్మజః
తృతీయా జ్ఞాతయో రాజం శ్చతుర్థీ నేహ విద్యతే 61-24

పతివైన నీవు (కైకేయిమాటకు లోబడి) నాకు లేనట్లే అయినది. పుత్రుడు అరణ్యమునకు పోయినాడు. నిన్ను విడిచి నేను కుమారునితో వెళ్లుటకుకూడ వీలులేక పర్పడినది. నీవు నాకు అన్ని విధముల అన్యాయమే చేసితివి. నీవు రాజ్యమునే నాశనము చేసితివి. నీవు, నీ మంత్రులు, నేను, నాపుత్రుడు, పురజనులు, అందరము నీ క్రూర కార్యమువలన హతుల మయితిమి. నీ కుమారుడు (భరతుడు) నీ భార్య (కైకేయి) మాత్రము సంతోషింపగలరు.

హతం త్వయా రాజ్య మిదం సరాష్ట్రం
హత స్తథాత్మా సహమంత్రిభిశ్చ
హతా సపుత్రాస్మి హతాశ్చ పౌరా
స్సుతశ్చ భార్యా చ తవ ప్రహృష్టౌ. 61-26

కౌసల్య పలికిన దారుణవాక్యములను విన్న దశరథునికి మూర్ఛ వచ్చినది. కొంత సేపటికి తేరుకొన్నాడు. తాను చిన్ననాట చేసిన పాపకార్యము జ్ఞప్తికి వచ్చినది. పుత్రశోకమున కుమిలిపోవుచున్నాడు. దశరథుడు తల వాల్చుకొని కౌసల్యను ఊరడించుటకు ఆమెకు చేమోడ్పు గీలించి అనుచున్నాడు.

*దశరథుడు* : కౌసల్యా! నీకు కేలుమోడ్చి చెప్పుచున్నాను. నీవు ఎల్లప్పుడు ఎంతో దయ గలదానవు. శత్రువులనైతము దయతో చూచు స్వభావము గలదానవు. నన్ను కరుణింపుము. గుణవంతుడైనను గుణహీనుడైనను భర్తయే కదా స్త్రీలకు ప్రత్యక్షదైవము! నీవు మంచిచెడ్డలు తెలిసిన ధర్మపరురాలవు. నీవు ఎట్టి దుఃఖములో నున్నను నా మనస్సును బాధించు మాటలు పలుకుట నీవంటి దానికి తగదు.

ప్రసాదయే త్వాం కౌసల్యే రచితోఽయం మయాంజలిః
వత్సలా చా నృశంసా చ త్వం హి నిత్యం పరేష్వపి 62-7

భర్తా తు ఖలు నారీణాం గుణవాన్ నిర్గుణోఽపివా
ధర్మం విమృశమానానాం ప్రత్యక్షం దేవి దైవతమ్. 62-8
సా త్వం ధర్మపరా నిత్యం దృష్టలోక పరావరా
నార్హసే విప్రియం వక్తుం దుఃఖితాపి సుదుఃఖితమ్. 62-9

ఈ మాటలు విన్న కౌసల్యకు ఏడ్పు వచ్చినది. దశరథుని చేతులు పట్టుకొని తొట్రుపడుచు క్షమాపణ వేడుకొనుచున్నది.

కౌసల్య : నాథా! ప్రసన్నుడ వగుము. శిరసా నమస్కరించి యాచించుచున్నాను. భర్తవైన నీవు నన్ను యాచించునట్లు చేసినందుకు నాకు శిక్ష కావలసినదే! భర్తచే యాచింపబడిన భార్య ఉభయలోకములందును సుఖపడదు. నేను ధర్మము నెరుగుదును. నీవు సత్యవాది వనియును నాకు తెలియును. కాని శోకమోహమునబడి యేదో పిచ్చిపిచ్చిగా మాటలాడితిని. శోకము ధైర్యమును నాశన మొనరించును. శోకము సర్వమును నాశన మొనరించును. శోకమునకు సమానమైన శత్రువు లోకములోలేదు. నాథా! నన్ను క్షమింపుము.

ప్రసీద శిరసా యాచే భూమౌ నిపతితాస్మి తే
యాచితాస్మి హతా దేవ హంతవ్యాహం నహి త్వయా. 62-12

నైషా హి సా స్త్రీ భవతి శ్లాఘనీయేన ధీమతా
ఉభయో ర్లోకయో ర్వీర పత్యాయా సంప్రసాద్యతే. 62-13

జానామి ధర్మం ధర్మజ్ఞ త్వాం జానే సత్యవాదినమ్
పుత్ర శోకార్తయా తత్తు మయా కిమపి భాషితమ్ 62-14

శోకో నాశయతే ధైర్యం శోకో నాశయతే శ్రుతమ్
శోకో నాశయతే సర్వం నాస్తి శోక సమోరిపుః. 62-15

మన రాముడు వనవాసము నారంభించి అయిదు రాత్రులయినది. ఈ అయిదు రాత్రులును అయిదు సంవత్సరములుగా అనిపించుచున్నవి. రాముని తలచుకొన్న యెడల దుఃఖము పొంగివచ్చుచున్నది.

ఈ మాటలలో సూర్యాస్తమయ మైనది. రాత్రి వచ్చినది. దశరథునికి కొంచెము నిద్రపట్టినది కాని నిద్రపోవు స్థితిలోలేడు. వెంటనే మేలుకొన్నాడు. తాను చిన్ననాడు చేసిన పాపకార్యము జ్ఞప్తికి వచ్చినది. ఆ కథను కౌసల్యతో చెప్పుచున్నాడు.

*దశరథుడు* : కౌసల్యా! మన మంచి చెడ్డలు మన కర్మఫలములనుటకు సందియములేదు. ముందువెనుకలు ఆలోచింపక ఒక కార్యమును చేయువాడు శుద్ధమూఢుడు. పలాశ పుష్పముల అందమును చూచి ఫలములు సైతము అట్లే యుండునని

ఆశపడి మామిడితోటను నరికి మోదుగచెట్లను నాటి పెంచినవాడు ఫలకాలమున దుఃఖముపాలగును.

> కశ్చి దామ్రవణం ఛిత్త్వా పలాశాం శ్చ నిషించతి
> పుష్పం దృష్ట్వా ఫలే గృధ్ను స్సశోచతి ఫలాగమే. 63:8

నా పనియు అట్లే అయినది. నేను ఆలోచింపక ఒక తప్పుపని చేసి ఫలకాలములో రాముని త్యజించి వెనుక చింతించుచున్నాను.

> సోఽహ మామ్రవణం ఛిత్త్వా పలాశాం శ్చ న్యషేచయమ్
> రామం ఫలాగమే త్యక్త్వా పశ్చా చ్ఛోచామి దుర్మతిః 63-10

అంతయు నేను స్వయముగా చేసికొన్న అపరాధమే. తెలిసి చేసినను తెలియక చేసినను ఫలము ననుభవించి తీరవలయును. బాలుడు అజ్ఞానమున విషము మ్రింగునేని విషము పనిచేయకుండునా!

> తదిదం మేఽనుసంప్రాప్తం దేవి దుఃఖం స్వయం కృతమ్
> సమ్మోహా దిహ బాలేన యథాస్యా ద్భక్షితం విషమ్. 63-12

నా చిన్నతనమున నాకు 'శబ్దవేధి' అని ఒక బిరుదు ఉండినది. ఆ బిరుదును గొప్పగా భావించి నేను చేసిన అపరాధమునకు ఫలమే ఇప్పుడు సంభవించిన దుఃఖము. నేను యువరాజుగా నుండినప్పటి సంగతి. అప్పటికి మన పెండ్లికూడ కాలేదు.

ఒక వర్షాకాలములో జరిగిన సంఘటన. వర్షాకాలమునందు మదము, కామము, సహజముగా వృద్ధి యగును. నా శబ్దవేధిత్వమును ప్రదర్శించి అరణ్యమున వేటాడవలెనని నాకు కోరిక పుట్టినది. సరయూ వనమునకు రాత్రివేళ వెళ్లి ధనుస్సు నెక్కుపెట్టి వేటకు సిద్ధముగా నుంటిని. చీకటిమయముగా నుండినది. కుండను నీటిలో ముంచునప్పుడు కలుగు శబ్దమువంటి శబ్దమును విని ఏనుగు నీరు త్రాగుటకు నదికి వచ్చియుండునని ఊహించి బాణమును విడిచితిని. వెంటనే నాకొక రోదన శబ్దము వినవచ్చినది. "అయ్యో! నేను తపస్వినిగదా! ఎవ్వరును లేని సమయమున నీరు తీసికొని పోవుటకై వచ్చితిని. నా పైకి బాణ మెట్లు వచ్చినది! నే నెవ్వరికిని అపకారము చేయలేదే! నావంటివానిని వధించినచో ఎవ్వనికిగాని యేమి ప్రయోజనము! నేను చనిపోయిన పోవుదును. కాని నా తల్లిదండ్రుల గతి యేమిటి! పాపము! వారు వృద్ధులుగాను అంధులుగాను ఉన్నారుగదా! నేను మరణించిన పిదప వారిని కాపాడువా రెవరు? ఎవ్వడో బుద్ధిహీనుడు ఒక బాణముతో మా ముగ్గురిని వధించినాడు!"

ఈవిధముగా విలపించుచున్న అర్తుని రోదనము విని నాకు దిగులు పుట్టినది. వెళ్లి చూచినాను. ఆ మునికుమారుడు కుపితుడై నన్నుచూచి "రాజా! ఎంతపని

చేసితివి! నా తల్లిదండ్రులు వృద్ధులు - అంధులు. వారు దప్పిగొని నీటికి కనిపెట్టుకొని యున్నారు. నీవు వెళ్లి ఇచ్చట జరిగిన సంగతి చెప్పుము. లేనియెడల నా తండ్రి కోపించి నిన్ను దహింపగలడు. ఇదిగో! ఈ కాలిదారి ననుసరించి నడువుము. మా ఆశ్రమము కానవచ్చును. నీవుపోయి మా తండ్రిని ప్రార్థింపుము. నీ బాణ బాధను భరింపజాలక యున్నాను. దానిని తీసివేయుము" అని చెప్పినాడు. నా కేమియు తోపలేదు. బాణ మును తీసినయెడల అతడు మరణించుట నిశ్చయము. తీయకుండినయెడల బాధ భరింప రానిది. నా ఆందోళనమును మునికుమారుడు గ్రహించి "రాజా! భయపడకుము. నీకు బ్రహ్మహత్యా దోషము సంభవింపదు. నేను వైశ్యునికి శూద్రస్త్రీ యందు జన్మిం చిన వాడను" అని తెలియజేసినాడు. నేను బాణమును తీసివైచితిని. మునికుమారుడు ప్రాణములు విడిచినాడు. నాకు దుఃఖము వచ్చినది. మంచినీటికుండ నెత్తుకొని ఆశ్రమ మునకు నడచి అనాథదంపతులను చూచి చింతించినాను.

ఆ ఋషి నా కాలిచప్పుడు విని "కుమారా! ఎందు కింత ఆలస్యము! మేము దప్పి గొనియున్నాము. నాయనా! మంచినీరు త్వరగా తెమ్ము. నేనుగాని మీ తల్లిగాని యేదైనను పొరపాటు చేసియుందు మేని నీవు దానిని మనస్సున పెట్టుకొనవలదు. మా కాళ్లుగాని కన్నులుగాని అన్నియు నీవేకదా! మా ప్రాణములు సైతము నీ మీదనే ఆధారపడి యున్నవి. ఏమి తండ్రీ! పలుక వేమి" అని విలపించినారు.

కిం చిరాయసి మే పుత్ర పానీయం క్షిప్ర మానయ 64-7

త్వంగతి స్త్వగతీ నాంచ చక్షు స్త్వంహి నచక్షుషామ్
సమాసక్తా స్త్వయి ప్రాణాః కింత్వం నోనాభిభాషసే 64-10

ఈ మాటలు విని నాకు భయము పుట్టినది. నోట మాటరాలేదు. మెల్లిగా "నేను క్షత్రియుడను. నా పేరు దశరథుడు. నేను మీ కుమారుడను కాను. నా తెలివితక్కువ వలన మీ కొక గొప్ప ఆపద సంభవించినది. మీ కుమారుడు నీటియందు కుండను ముంచు చున్నప్పుడు కలిగిన శబ్దమును విని ఏనుగు నీరు త్రాగుటకు వచ్చియున్నదని భ్రమపడి బాణము విడిచితిని. మీ కుమారుడు నా బాణహతుడై మిమ్ములను తలచుకొని విలపించి నాడు. ఆరోదన శబ్దమును విని నేనక్కడ కరిగి జరిగిన ఘోరమును చూచితిని. మీ కుమారుడు బాణబాధను భరింపజాలక బాణమును తీసివేయు మనగా నేను తీసివైచితిని. అంతటితో ఆ బాలుడు మిమ్ములనే స్మరించుచు స్వర్గస్థుడైనాడు. నేను తెలియక చేసిన అపచారము. ఆపైన మీ చిత్తము!" అని ప్రార్థించినాను. ఆ మునికి పట్టరాని దుఃఖము, కోపము కలిగినవి. "ఈ అమంగళమును నీవే చెప్పుట మంచిదైనది. ఈ దుర్వార్త నాకు ఇతర విధముగా తెలిసియుండునేని నీ తల లక్ష పరియలుగా పగిలి

యుండును. ఈ పనిని నీవు బుద్ధిపూర్వకముగా చేసియుండిన యెడల ఇక్ష్వాకు వంశ మంతయు నిర్మూలమై యుండును. తెలియక చేసితివి కావున ఇంకను బ్రతికియున్నావు. జరిగిన దేదియో జరిగిపోయినది. నీవు మమ్ములను అక్కడికి తోడ్కొనిపొమ్ము" అన్నాడు. నేను ఆ ముసలి దంపతులను కుమారుని చెంతకు చేర్చి అతని కళేబరమును వారిచే తాకించినాను. కౌసల్యా! ఆ వృద్ధదంపతుల దుఃఖమునకు అంతము కనబడలేదు. కుమారుని తలచుకొని పలువిధములుగా ఆక్రందించినారు. అతనికి సంస్కారముచేసి ఉత్తమ లోకములకు పంపించినారు. ఇంద్రుడు వచ్చి ఆ బాలుని రథముపై నెక్కించుకొని స్వర్గమునకు కొనిపోయినాడు.

ముసలి వారిద్దరు నావైపు మరలినారు. ఆఋషి నాతో "దశరథుడా! నాకు కలిగిన ఒక్క కుమారుని వధించితివి. నన్నుకూడ వధింపుము. మరణమన్న నాకు భయముగాని దుఃఖముగానిలేదు. నీవు అజ్ఞానమువలన నా కుమారుని చంపితివి. నేను నిన్ను శపించుచున్నాను. నీ వీ శాపమును అనుభవింపక తప్పదు. నీవు నా కుమారుని వధించి నాకు పుత్రదుఃఖమును కలిగించితివి. కాబట్టి నీవుకూడ నా వలెనే పుత్రదుఃఖమున కాలము చేయగలవు.

> పుత్రవ్యసనజం దుఃఖం యదేత న్మమ సాంప్రతమ్
> ఏవం త్వం పుత్రశోకేన రాజన్ కాలం కరిష్యసి. 64-55

ఈ విధముగా నన్ను శపించి దంపతు లిద్దరు చితిని ఆరోహించి స్వర్గమున కరిగినారు.

కౌసల్యా! ఆ కథయంతయు ఇప్పుడు జ్ఞప్తికి వచ్చుచున్నది. నా పాపఫలము ఇప్పుడు సంప్రాప్తమైనది. ఇక నేను జీవింపను. నా కన్నులుకూడ కనిపించుటలేదు. నీవు కూడ నా కగపడుటలేదు. నన్ను నీ చేతితో స్పృశింపుము.

> చక్షుర్భ్యాం త్వాం నపశ్యామి కౌసల్యే సాధుమాం స్పృశ 64-62

నావంటి నిర్భాగ్యుడు తప్ప అట్టి కుమారుని ఎవ్వరైనను అరణ్యమునకు పంపుదురా! రాముని చూడజాలని నా బ్రతు కెందుకు? ఈ దుఃఖము నా ప్రాణములను హరించుచున్నది.

కౌసల్యా! రాముడు వనవాస వ్రతమును పూర్తి గావించి మరల అయోధ్యకు వచ్చినప్పుడు అతనిని సందర్శింపగల భాగ్యవంతులు దేవతలేగాని మానవమాత్రులు కారు.

> **నతే మనుష్యా దేవాస్తే యే చారు శుభ కుండలమ్**
> **ముఖం ద్రక్ష్యంతి రామస్య వర్షే పంచదశే పునః** **64-69**

[ఎవ్వరో ధన్యులు మాత్రమే శ్రీరాముని ముఖము చూడగలరు]

కౌసల్యా! నాకేమియు తెలియుటలేదు. ఇంద్రియము లేవిగాని నా స్వాధీనములో లేవు. నా మనస్సు నశించినది. ఇంద్రియములు పనిచేయుటలేదు. తైలము అయిపోయిన పిదప దీపకాంతులు అదృశ్యమైన ట్లున్నది నా స్థితి.

చిత్తనాశా ద్విపద్యంతే సర్వాణ్యే వేంద్రియాణి మే
క్షీణ స్నేహస్య దీపస్య సంసక్తా రశ్మయో యథా 64-74

ఇట్లు పరితపించుచు దశరథుడు "హా రామా! కౌసల్యా! సుమిత్రా! నా శత్రువైన కైకేయీ! నేను మరణించుచున్నాను" అని హాహాకారములు చేసి అర్ధరాత్రివేళ ప్రాణములు విడిచినాడు.

సూర్యోదయమైనది. ఆచారము ననుసరించి, వందిమాగధులు రాజు నుద్దేశించి స్తోత్రములు చేసినారు. ఎంతసేపైనను దశరథుడు లేవకుండుట చూచి అందరికిని సందేహము కలిగినది. కొంతమంది స్త్రీలు దశరథుని లేపుటకు ప్రయత్నించినారు. కాని లాభములేక పోయినది. వారు బిగ్గరగా ఏడ్చినారు. ఆరోదన ధ్వని విని కౌసల్య, సుమిత్ర మేలుకొనినారు. గొల్లున విలపించినారు. కైకేయికూడ వచ్చినది. మందిర మంతయు రోదనధ్వనులతో నిండినది.

కౌసల్య : (దశరథుని శిరస్సు అంకమున పెట్టుకొని) కైకేయి! నీ కోరిక తీరినది. రాజుగూడ మరణించినాడు. నీ కేమియు అడ్డులేదు. రాజ్యము నంతయు అనుభవించుచు సుఖముగా నుండుము.

ఇట్లు విలపించుచుండిన కౌసల్యను కొందరు స్త్రీలు దూరముగా కొనిపోయినారు.

వసిష్ఠుని ఆజ్ఞానుసారము దశరథుని కళేబరమును తైలద్రోణిలో పెట్టి భద్రపఱచినారు. దీనిని చూచి దశరథుని భార్య లందరు ఒక్కపెట్టున యేడ్వసాగినారు.

స్త్రీలు : నాథా! మేము నిన్నుసైతము పోగొట్టుకొని, భర్తను వధించిన కైకేయి పాలనలో ఉండగలమా? రాముడు అరణ్యమునం దున్నాడు. ఇచ్చట మాకు దిక్కెవ్వరు? భర్తను, సీతారామలక్ష్మణులను పరిత్యజించిన కైకేయి మఱెవరిని పరిత్యజింపదు!

ఇట్లు అనేక విధములుగా స్త్రీలందరు దుఃఖపడినారు. అయోధ్యా నగరమంతయు భర్తను కోల్పోయిన విధవవలె శూన్యముగా, కాంతిహీనముగా ఉన్నది. కైకేయిని దూషింపనివారు లేరు.

## దశరథుడు మరణించిన పిదప మంత్రులు పురోహితులు సమావేశ మగుట

రాత్రి ఎట్టెట్లో గడచి తెల్లవారినది. మంత్రులును రాజకర్తారులగు బ్రాహ్మణులును సభామంటపమున సమావేశమైనారు. అందరు వసిష్ఠుని పురస్కరించుకొని మంత్రాంగమును జరుపుచున్నారు.

మంత్రులు : మహర్షి ! దశరథుడు మరణించిన ఈరాత్రి నూఱు సంవత్సరములవలె అతికష్టముగా నడచినది. మహారాజు కుమారులెవ్వరును అందుబడిలో లేరు. ఇక్ష్వాకువంశస్థుని ఒకనిని తెచ్చి రాజుగా నియమించుట అత్యవసరము. రాజు లేనియెడల రాజ్యము నాశనమగుటలో సందేహములేదు. రాజులేని దేశమున ఉపద్రవము లనేకములు కలుగును. పెద్ద, పిన్న, అనుమాటయే ఉండదు. ధనమునకుగాని స్త్రీ జనములకు గాని రక్షణ యుండదు. నలుగురు కూడి సంతోషముగా ఉద్యానవనములలో విహరింపలేరు. నటనర్తకుల సభలు ఉండనే ఉండవు. కథలు చెప్పుకొని ఆనందించువారు కంటికి కనబడరు. స్త్రీలు సాయం సమయములందు పూదోటలలో విహరించుటకు వీలుండదు. రాత్రివేళలయందు తలుపులు తెరచుకొని నిర్భయముగా నిద్రించుట కుదురదు. వర్తక వ్యాపారములు సాగవు. చేపలు ఒకదానిని మరియొకటి భక్షించునట్లు మనుష్యులు ఒకరిని ఒకరు కాజేయుదురు.

మత్స్యా ఇవ నరా నిత్యం భక్షయంతి పరస్పరమ్ 67-31

దైవభక్తి ఉండదు. అందరు నాస్తికు లగుదురు. శరీరమునకు నేత్రము లెట్లో రాజ్యమునకు రాజు అట్టివాడు. రాజు, సత్యమును ధర్మమును నిల్వబెట్టువాడు. ప్రజలకు హితము చేకూర్చువాడు. ప్రజలకు తల్లియైనను తండ్రియైనను ప్రభువేగదా!

రాజా సత్యంచ ధర్మశ్చ రాజా కులవతాం కులమ్
రాజా మాతా పితా చైవ రాజా హితకరో నృణామ్ 67-34

రాజు లేనియెడల రాజ్యమంతయు చీకటి క్రమ్మినట్లగును.

మహర్షి ! దశరథుడు బ్రతికియుండినప్పుడుగూడ నీ మాటను జవదాటి యెరుగము. ఇప్పుడు వేరుగా చెప్పవలయునా ! రాజు లేనియెడల రాజ్యము అరణ్యప్రాయమగును. ఇక్ష్వాకు వంశమునకు జెందిన ఒక యోగ్యుని మాకు రాజుగా నియమించి అతనికి పట్టాభిషేకము గావింపుము.

స న స్సమీక్ష్య ద్విజవర్య వృత్తం
నృపం వినా రాజ్య మరణ్య భూతమ్

కుమార మిక్ష్వాకు సుతం వదాన్యం
త్వమేవ రాజాన మిహాభిషించ 67-38

వసిష్ఠుడు : మన కేల ఈ విచారము. భరతుడు మేనమామగారి ఇంట నున్నాడుగదా ! దూతలను పంపి భరతుని పిలిపింతము.

మంత్రులు : మీరు చెప్పినట్లే అగునుగాక !

సిద్ధార్థుడు, విజయుడు, జయంతుడు, అశోకుడు, నందనుడు అను మంత్రులను పిలిచి వసిష్ఠుడు చెప్పుచున్నాడు.

[మంత్రుల పేర్లు జయసూచకముగను ఆనందదాయకముగను ఉన్నవి !]

వసిష్ఠుడు : మంత్రులారా ! మీరు శోకమును విడిచి పరివారసహితులై భరతునియొద్దకు త్వరగా వెళ్లి భరతునితో ఈ మాటలు చెప్పవలయును. "వసిష్ఠుడును మంత్రులును వారి క్షేమమును నీతో చెప్పుచున్నారు. నీవలన ఒక ముఖ్యమైన కార్యము జరుగవలసి యున్నది. వెంటనే బయలుదేరి రావలసినదిగా నిన్ను కోరుచున్నారు."

ఈ మాటలు మాత్రమే చెప్పవలయును. రాముని అరణ్యవాసము గురించి గాని దశరథుడు మరణించిన విషయముగాని మీరు భరతునికి చెప్పగూడదు. కేకయరాజునకును భరతునికిని కానుకలుగా పట్టువస్త్రములను ఆభరణములను తీసికొనిపొండు.

ఈవిధముగా తగిన ఉత్తరువుల నిచ్చి వసిష్ఠుడు దూతలకు దారిబత్తెముల నిప్పించినాడు. దూతలు వారి ఇండ్లకుపోయి ప్రయాణమునకు సిద్ధ మైనారు.

అందరు వడిగల గుఱ్ఱములమీద ప్రయాణము సాగించినారు.

[అయోధ్యనుండి కేకయరాజధాని యైన రాజగృహమునకు మార్గమును అరువది యెనిమిదవ సర్గలో వివరించియున్నారు]

దూతలు బయలుదేరి హస్తినాపుర సమీపమున గంగానదిని దాటి కురుజాంగల దేశముమధ్య నడచి పాంచాలదేశమునకు వెళ్లి అక్కడినుండి పడమటి దిక్కుగా ప్రయాణము చేసినారు. శరదండా నదిని దాటి సత్యోపయాచన మను పుణ్యవృక్షమునకు ప్రదక్షిణముచేసి కుళింగాపట్టణము చేరినారు. అచ్చటినుండి బయలుదేరి ఇక్షుమతీ నదిని దాటి బాహ్లీకదేశమునకును సుదామనపర్వతమునకును మధ్యనుండిన మార్గము ననుసరించి నదులను అరణ్యములను దాటి కేకయరాజధాని యగు గిరివ్రజమును చేరినారు. అప్పటికి రాత్రి యైనది.

# భరతుని స్వప్నము

ఆరాత్రి భరతునికి ఒక దుస్స్వప్నము కలిగి దుఃఖపడుచుండినాడు. అతని దుఃఖము తీర్చి సంతోషము కలిగించుటకు అతని స్నేహితులు ఎన్నియో ప్రయత్నములు చేసినారు. కథలు చెప్పినారు. పాటలు పాడినారు. వీణలు వాయించినారు. నాట్యములు చేయించినారు. నాటకము లాడించినారు. హాస్యములు ప్రదర్శించినారు. ఏమి చేసినను భరతుని మనస్సు తేరుకొనలేదు. స్నేహితులకు దిగులు తోచి "నీ దుఃఖమునకు కారణమేమి?" అని అడిగినారు.

*భరతుడు*: మిత్రులారా! నాకొక భయంకర స్వప్నము కలిగినది. మా తండ్రి మాసిన వస్త్రమును ధరించి, తల విరియబోసుకొని, పర్వత శిఖరముపైనుండి గోమయ హ్రదమున పడినట్లు కానబడినాడు. నా తండ్రి ఆ కూపమునపడి, నూనె త్రాగుచు, వికారముగా నవ్వుచు, నువ్వుల అన్నమును తిని, శరీరమంతయు నూనె పూసికొని, వికారరూపముతో కనిపించినాడు. సముద్రము ఎండిపోయినట్లు, చంద్రుడు భూమి మీద పడినట్లు, వృక్షములు మాడిపోయినట్లు, ఇటువంటివాని నెన్నిటినో స్వప్నమున చూచితిని. స్వప్నము భయంకరముగా ఉన్నది. నాకుగాని, రామునికిగాని, రాజునకుగాని, లక్ష్మణునికిగాని మరణముకలుగు నని భయము తోచుచున్నది.

అహం రామోఽథవా రాజా లక్ష్మణోవా మరిష్యతి. 69-17

నాకేమియుతోచుటలేదు. దిగులుగా నున్నది. మా తండ్రినిగూర్చి నా మనస్సు వికలముగా నున్నది.

అయోధ్యనుండి వెళ్ళిన దూతలు భరతుని సమీపించి వసిష్ఠుడు చెప్పి పంపిన మాటలను యథాతథముగా చెప్పినారు.

పురోహితస్త్వాం కుశలం ప్రాహ సర్వేచ మంత్రిణః
త్వరమాణశ్చ నిర్యాహి కృతమాత్యయికం త్వయా. 70-3

వారు తెచ్చిన వస్త్రములు ఆభరణములు మున్నగు కానుకలను సమర్పించినారు.

*భరతుడు*: మా తండ్రియును, రామలక్ష్మణులును క్షేమముగా ఉన్నారా? ధర్మనిరతయైన రాముని తల్లి కౌసల్యకు క్షేమమేగదా! ధర్మజ్ఞయైన సుమిత్ర సుఖముగా ఉన్నదా! స్వలాభపరాయణయై ఎల్లప్పుడును కోపస్వభావముగల మా తల్లికి కుశలమే కదా! ఆమె ఏమి చెప్పిపంపినది?

ఆత్మకామా సదా చండీ క్రోధనా ప్రాజ్ఞమానినీ
అరోగా చాపిమే మాతా కైకేయీ కిమువాచహ. 70-10

**దూతలు:** ఎవ్వరి క్షేమమును నీవు కోరుచుంటివో వారి కందరికి క్షేమమే. లక్ష్మి నిన్ను వరించుచున్నది. ప్రయాణమునకు రథము సిద్ధము చేయింపుము.

కుశలాస్తే నరవ్యాఘ్ర యేషాం కుశల మిచ్ఛసి
శ్రీశ్చత్వాం వృణుతే పద్మా యుజ్యతాం చాపితే రథః. 70-12

**భరతుడు:** (కేకయరాజుతో) నేను వెళ్లివచ్చెదను. దూతలు నన్ను త్వర పెట్టుచున్నారు. మరల మీ రెప్పుడు తలచుకొనెదరో అప్పుడే తప్పక రాగలను. ఇప్పుడు నాకు సెలవు దయచేయుడు.

**కేకయరాజు:** నాయనా! సుఖముగా వెళ్ళిరమ్ము. అందరిని అడిగినానని చెప్పుము.

భరతునికి కానుకగా కేకయరాజు అనేక వస్తువాహనములను బహూకరించినాడు. వ్యాఘ్రములవంటి శునకములనుకూడ ఇచ్చి పంపినాడు.

## భరతుడు అయోధ్యకు వచ్చుట

భరతుని మనస్సు వికలమై యుండినది. దూతలు తన్ను త్వర పెట్టుటను, తనకు కలిగిన దుస్స్వప్నమును, తలచుకొని భరతుడు ఆందోళనపడి త్వరగా ప్రయాణము చేసినాడు. వస్తువాహనములను గురించి ఆలస్యమగునని వానిని నెమ్మదిగా తెమ్మని పరిజనులకు చెప్పి తాను ముందుగా వచ్చినాడు. ఏడు అహోరాత్రములు ఏకాయకి ప్రయాణము చేసి కొంతదూరమునుండి అయోధ్యను చూచినాడు. నగరము పాడుపడియున్నట్లు కనిపించినది. ఎక్కడను అలికిడిలేదు.

**భరతుడు:** సారథీ! అయోధ్యానగరము పూర్వమున్నట్లు కనబడుటలేదు. ఉద్యానములలో ఒక్క మానవుడైనను కనిపించుటలేదు. పుర మంతయు అరణ్యమువలె కానవచ్చుచున్నది!

అరణ్య భూతేవ పురీ సారథే ప్రతిభాతి మే.

మునుపటివలె రథములలో వెళ్లువారు కాని, వచ్చువారుకాని, కనుపించుట లేదు. ఎల్లప్పుడు స్త్రీలతోను, పురుషులతోను నిండియుండిన ఉద్యానవనములలో నరసంచారమను మాటలేదు. ఆకు లన్నియు రాలిపోయి చెట్లు సైతము దుఃఖముతో మాడిపోవుచున్నట్లు కనబడు చున్నవి. సారథీ! నాకేమో దిగులుగా నున్నది.

భరతుడు వ్యాకుల చిత్తుడై వైజయంతి అను ద్వారముగుండా పురప్రవేశము చేసినాడు.

**భరతుడు** : సారథీ ! ఏదియో గొప్పకారణము లేక నన్ను ఇంత త్వరగా పిలిపింపరు. రాజు మృతుడైనప్పుడు రాజధాని ఎట్లుండు నని మనము వినియున్నామో ఆలక్షణము లన్నియు ఇచ్చట కానవచ్చుచున్నవి. ఇండ్లు వాకిండ్లు పాడుబడి యున్నవి. ప్రజ అందరు కన్నీరు కార్చుచున్నారు.

ఇట్లు తలపోయుచు భరతుడు దీనుడై తలవంచుకొని తండ్రి భవనమునకు నడిచినాడు. తండ్రి అచ్చట కనబడలేదు. తల్లి ఇంటికి వెళ్లినాడు.

## భరతుడు కైకేయిని సందర్శించుట

కైకేయి సువర్ణాసనముపై కూర్చుండి యుండినది. కుమారుని చూచుటతోడనే సంతోషముతో లేచినది. భరతుడు తల్లికి నమస్కరించినాడు. కైకేయి కుమారుని కవుగిలించుకొని అంకపీఠమున కూర్చుండబెట్టుకొని భరతునితో మాటలాడుచున్నది.

**కైకేయి** : కుమారా ! ఊరినుండి ఎప్పుడు బయలుదేరితివి ? మీ తాతగారు, మేనమామ, అందరు క్షేమముగా ఉన్నారా ! నీవు ఆరోగ్యముగా ఉన్నావా !

**భరతుడు** : అమ్మా ! అందరికి కుశలమే. నాకు మా తాతగారిచ్చిన వస్తువాహనములు వెనుక వచ్చుచున్నవి. రాజదూతలు నన్ను త్వరపెట్టినందున నేను కొంచెము ముందుగా వచ్చితిని. సరేకాని ! ఈ పాన్పు శూన్యమై యున్నదేమి ? మా తండ్రి ఇందుండు నని ఆయన దర్శనము చేసికొనగోరి వచ్చినాను. నేను నా తండ్రికి నమస్కరింప వలయును. ఆయన ఎందున్నాడు ?

రాజ్యలోభ కారణమున కైకేయికి మతి చెడిపోయినది. తాను చెప్పబోవు ఘోర వార్త భరతునికి ప్రియముగా నుండునని భ్రమపడి ఉత్సాహముతో చెప్పుచున్నది.

**కైకేయి** : నాయనా ! పుట్టిన ప్రతిప్రాణికి ఏగతి కలుగునో నీ తండ్రికికూడ ఆగతియే కలిగినది. మహాత్ముడైన నీ తండ్రికి ఉత్తమలోకములు లభించినవి.

> యాగతి స్సర్వభూతానాం తాం గతింతే పితాగతః
> రాజా మహాత్మా తేజస్వీ యాయజూకస్సతాంగతిః. 72-15

పిడుగువంటి ఈవార్త విని భరతుడు క్రింద పడిపోయినాడు. తండ్రిని తలచుకొని విలపించినాడు. దుఃఖమును పట్టజాలక ముఖమును వస్త్రముతో కప్పుకొని ఏడ్చినాడు.

> బాష్పముత్సృజ్య కంఠేన స్వార్తః పరమపీడితః
> ఆచ్ఛాద్య వదనం శ్రీమద్వస్త్రేణ జయతాం వరః. 72-21

కైకేయి: (భరతుని లేవనెత్తి) రాజపుత్రుడవైన నీవు ఈ విధముగా నేలమీద పడి యుండుట సరికాదు. లే! నాయనా లెమ్ము. నీవంటి గొప్పవారు ఇట్లు శోకించుట తగదు.

భరతుడు: (తీరని దుఃఖముతో) అమ్మా! రామునికి పట్టాభిషేకము జరుగు నని, రాజు యజ్ఞము నేమైనను చేయుచున్నా డని, ఎన్నెన్నో ఆశలు పెట్టుకొని ప్రయాణము సంతోషముగా సాగించినాను. ఇట్టి ప్రమాదము జరుగునని ఊహింపలేక పోయితిని.

అభిషేక్ష్యతి రామం ను రాజా యజ్ఞం ను యక్ష్యతే
ఇత్యహం కృత సంకల్పో హృష్టో యాత్రామయాసిషమ్ 72-27

తల్లీ! నా తండ్రి ఏ జబ్బుతో మరణించినాడు? తండ్రికి చేతులార సంస్కారము చేయగలిగిన రామలక్ష్మణులు ఎంతో కృతార్థులు. నా తండ్రి బ్రతికియుండినచో నన్ను చూచి సంతోషించి ఆదరించి యుండును గదా! తండ్రితుల్యుడైన రామునికి నా రాకను చెప్పిపంపుము. నాకు అన్నయైనను తండ్రియైనను బంధువైనను సర్వము ఆ రాముడే. రాముడే నాకు గతి. నేను రాముని దాసుడను. అతని పాదములకు మ్రొక్కెదను.

యోమే భ్రాతా పితా బంధుర్యస్యదాసోఽస్మి ధీమతః
తస్యమాం శీఘ్ర మాఖ్యాహి రామస్యాక్లిష్ట కర్మణః 72-32

పితాహి భవతి జ్యేష్ఠో ధర్మమార్యస్య జానతః
తస్యపాదౌ గృహీష్యామి సహీదానీం గతి ర్మమ 72-33

తల్లీ! నా తండ్రి మరణించునప్పుడు ఏమి చెప్పినాడు?

కైకేయి: ఏమున్నది నాయనా! నీ తండ్రి 'హా రామా! హా సీతా! హా లక్ష్మణా!' అని ఆక్రందించి ప్రాణములు విడిచినాడు. ఆయన మరణసందేశము వినుము. "వారు మరల అయోధ్యకు వచ్చినప్పుడు సీతారామలక్ష్మణులను చూడగలిగిన వారు ఎంతో ధన్యులు" అని చెప్పినాడు.

సిద్ధార్థాస్తే నరా రామ మాగతం సహ సీతయా
లక్ష్మణంచ మహా బాహుం ద్రక్ష్యంతి పునరాగతమ్ 72-38

భరతునికి ఈ మాట అర్థము కాలేదు. ఆ విషయ మేమైయుండునా అని విషాదపడి తల్లిని అడుగుచున్నాడు.

భరతుడు : అమ్మా ! సీతారామలక్ష్మణులు ఎచ్చటికి వెళ్ళినారు ?

తాను చెప్పబోవుమాట భరతునికి ఆనందదాయకమని భ్రమపడి కైకేయి ఉత్సాహముగా చెప్పుచున్నది.

కైకేయి : రాముడు నారచీరలు ధరించి సీతాలక్ష్మణ సహితుడై దండకారణ్యమునకు వెళ్ళినాడు.

ఈ వార్త విని భరతుడు భయకంపితుడైనాడు. తమ వంశ గౌరవమునకు హాని కరముగా రాముడు తప్పుదారిని నడచియుండునేమో యని భరతుడు శంకించినాడు.

భరతుడు : తల్లీ! నీ మాటలు నాకు బోధపడుటలేదు. చేయగూడని తప్పు నేమైనను రాముడు చేసెనా ఏమి ? బ్రాహ్మణ ధనమును అపహరించెనా ? ఎట్టి అపరాధ మును చేయని వానిని బాధించెనా ? లేక పరస్త్రీని అపేక్షించెనా ? రామున కిట్టి ఘోరశిక్ష విధించి అరణ్యమునకు పంపవలసిన కారణ మేమి ?

కచ్చిన్న బ్రాహ్మణ ధనం హృతం రామేణ కస్యచిత్
కచ్చిన్నాఢ్యో దరిద్రోవా తేనాపాపో విహింసితః 72-44

కచ్చిన్న పరదారాన్వా రాజపుత్రోఽభిమన్యతే
కస్మాత్స దండకారణ్యే భ్రూణహేవ వివాసితః 72-45

కైకేయి తాను కావించిన ఘనకార్యమును తలచుకొని భరతునికి ప్రీతిదాయక మని సంతోషించుచు భరతునితో దానిని గురించి చెప్పుచున్నది.

కైకేయి : భరతా ! అట్టి దేమియు లేదు. రాముడు పరధనమును అపహరింపలేదు. ఎవ్వరిని గాని హింసింపలేదు. రాముడు పరదారలను కన్నెత్తియైన చూడడు.

న రామః పరదారాంశ్చ చక్షుర్భ్యా మపి పశ్యతి 72-49

ఇదంతయు నేను నీకొఱకు చేసిన కార్యము. నీ తండ్రి రామునికి యౌవరాజ్య పట్టాభిషేకము చేయబూనుకొనగా నేను అడ్డుతగిలి నీ తండ్రిని యాచించి రెండు వరములు పొందితిని. మొదటిది నీకు పట్టాభిషేకము చేయుట - రెండవది రాముని అడవికి పంపుట. నీ తండ్రి నా కోరిక తీర్చినాడు. రాముని అడవికి పంపించినాడు. సీతయును లక్ష్మణుడును రాముని అనుసరించి అరణ్యమునకు వెళ్ళినారు. పుత్ర శోక మును భరింపజాలక నీ తండ్రి కాలధర్మము నొందినాడు. కావున నీకిప్పుడు యౌవ రాజ్యమేగాక అసలు రాజ్యమే వచ్చినది. నీవు రాజువై భూమండలము నంతయు ఏలుము. ఈ నగరముగాని ఈ రాజ్యముగాని అన్నియు నీవేఅయినవి. ఇప్పుడు శోకము

నకును సంతాపమునకును సమయముకాదు. ధైర్యము వహింపుము. దశరథమహారాజు కళేబరమునకు త్వరగా సంస్కారము చేసి సామ్రాజ్య పట్టాభిషేకమును చేసికొనుము.

త్వయా త్విదానీం ధర్మజ్ఞ రాజత్వ మవలంబ్యతామ్
త్వత్కృతే హి మయా సర్వ మిదమేవం విధం కృతమ్ 72-52

మా శోకం మా చ సంతాపం ధైర్య మాశ్రయ పుత్రక
త్వదధీనా హి నగరీ రాజ్యం చైతదనామయమ్ 72-53

సంకాల్య రాజాన మదీన సత్త్వ
మాత్మాన ముర్వ్యా మభిషేచయస్వ 72-54

ఈ దారుణ వాక్యములను విని భరతుడు శోకమును భరింపలేకపోయినాడు.

*భరతుడు :* తండ్రిని అన్నను కోల్పోయి దుఃఖమున మునిగియున్నాను. నాకు రాజ్యముతో పనియేమి ? నీవు చేసిన పని పుండుమీద కారము చల్లినట్లున్నది. నీవు మా వంశమును నాశన మొనరించుటకై కాళరాత్రివలె మా ఇంట అడుగు పెట్టినావు ! నీవు అగ్ని వని తెలిసికొనజాలక మా తండ్రి నిన్ను కవుగిలించుకొని భస్మమైనాడు. మా తండ్రిని చంపినది నీవే ! నీవే మా అన్నను అడవులపాలు చేసినది !

రాముడు నిన్ను ఎంతగానో పూజించువాడు. తన తల్లికంటె మిక్కిలిగా నీకు శుశ్రూషలు చేయువాడు. కౌసల్య నిన్ను చెల్లెలివలె ప్రేమించుచున్నది. అట్టి కౌసల్య కుమారుని అరణ్యమునకు పంపించి సంతోషించుచుంటివా ! ఎట్టి పనికిమాలినపని కావించితివి ! రామునియందు నాకు గల భక్తిని నీవు గుర్తింపలేక ఇట్టి అనర్థమును తెచ్చి పెట్టితివి ! పిచ్చిదానా ! రామలక్ష్మణుల నెడబాసి ఈ రాజ్యభారమును నేను మోయ గలనా ? వృషభము మోయదగిన బరువును చిన్న దూడ మోయగలదా ! ఒకవేళ నా కట్టి శక్తి యున్నను నే నాపనిమాత్రము చేయను. నీ కోరిక సఫలము కానీయను.

నేను ఈక్షణముననే నిన్ను త్యజించి యుందును. కాని రామునికి నీ యెడ గల మాతృగౌరవమును స్మరించి ఆ మహనీయుడు కోపించు నని శంకించి అట్లు చేయకున్నాను.

ఇట్టి దుర్బుద్ధి నీకెట్లు కలిగినది ? పాపిష్ఠిదానా ! మా కుల సంప్రదాయమును గమనించితివా ! జ్యేష్ఠునికిగదా రాజ్యాభిషేకము జరుగవలయును. మీ పుట్టింటగూడ అదే ఆచారముగదా ! నేను నీ కోరికను ఎంతమాత్రము సఫలముకానీయను. నే నిప్పుడే అరణ్యమునకు వెళ్ళి నా రాముని తోడ్కొని వచ్చెదను. నేను రామదాసుడనై యుందును.

[భరతునికి కోపము ఎక్కువైనది]

నీవు రాజ్యభ్రష్టురాలవై నా చావునుకూడ చూచి ఏడ్చుచుండుము. నీవు చేసిన పాపమునకు నరకమే నీకు తగినచోటు. నీ మూలమున నాకెంత అపకీర్తి కలిగినది! నీవు నాకు తల్లి రూపములోనున్న ఘోరవైరివి. నీవు భర్తను చంపిన దానవు - నీ ముఖము చూడరాదు. నీవు ధర్మాత్ముడైన కేకయరాజు కొమారితవు కావు. తండ్రి కులమును ధ్వంసము చేయుటకు పుట్టిన రాక్షసివి. కౌసల్యవంటి సాధ్వికి ఎట్టి దుఃఖమును తెచ్చిపెట్టితివి!

తల్లికి కుమారునికన్న కావలసినవాడు కలడా! కోట్లకొలది సంతానము కలిగిన కామధేనువు రెండు ఎద్దులు అనుభవించుచుండిన బాధనుచూచి భరింపలేక కన్నీరు కార్చినదిగదా! అట్టియెడ ఒక్క కుమారుని కని అతనిని సైతము పోగొట్టుకొనిన కౌసల్య పుత్రశోకము నెట్లు భరింపగలదు!

నేను రాముని అరణ్యమునుండి తోడ్కొనివచ్చి కీర్తిని ఆర్జించెదను. రామునికి మారుగా నేనే తాపసవృత్తిలో అరణ్యమున నివసింతును. నీవు అగ్నిలో ఉరుకుము, లేక దండకారణ్యమునకు పొమ్ము, ఉరివేసుకొనియైనను మరణింపుము. నీ కింతకు మించిన గతి వేరులేదు. నేను శ్రీరామునికి పట్టాభిషేకము జరిపించి నా పాపమును పోగొట్టుకొందును.

భరతుడు దుఃఖమును భరింపజాలక క్రింద పడిపోయినాడు. మంత్రు లందరు చేరినారు. కొంత సేపటికి తేరి భరతుడు అనుచున్నాడు.

*భరతుడు* : నేను రాజ్యమును కోరలేదు. నా తల్లితో మంతనములు జరుపలేదు. రాముని అభిషేక వృత్తాంతము నా కేమియు తెలియదు. నేను శత్రుఘ్నునితోకూడి దూరదేశమున నివసించుచుంటిని. సీతారామలక్ష్మణులకు వనవాసము ఎట్లు ప్రాప్తించినదో అదికూడ నాకు తెలియదు.

ఈ ఆక్రందనములు విని కౌసల్య భరతుని కంఠస్వరమును ఆనవాలు పట్టినది.

**కౌసల్య** : సుమిత్రా! భరతుడు వచ్చినట్లున్నది. అతనిని ఒకమాటు చూడగోరుచున్నాను.

ఈ మాట చెప్పి వణకుచు భరతుని యొద్దకు బయలుదేటినది. ఇంతలో భరతశత్రుఘ్నులు కౌసల్య చెంతకు వచ్చి ఆమెను కవుగిలించుకొని పెద్దపెట్టున విలపించినారు.

**కౌసల్య** : భరతా! నీవు కోరిన రాజ్యమును మీతల్లి ఆర్జించి ఇచ్చినది! తీసికొనుము. నా కుమారుని అడవులపాలు చేసినది. నాయనా! దీనివలన మీ తల్లికి కలుగు

లాభ మేమో చెప్పుము. ఇక శీఘ్రకాలములోనే మీ తల్లి నన్నుకూడ అడవికి తరుమగలదు. అంతవర కెందుకు? నేనును సుమిత్రయు స్వయముగానే అడవికి పోయెదము. ఈ రాజ్య సర్వస్వము నీదే కదా! మమ్ములను రాముని యొద్దకు పంపుము.

## భరతుడు కౌసల్య యెదుట శపథములు చేయుట

కౌసల్య దీనాలాపములను విన్న భరతుడు చింతాక్రాంతుడై కౌసల్యతో అనుచున్నాడు.

*భరతుడు:* (అంజలి ఘటించి) తల్లీ! ఇక్కడ జరిగిన ఘోర వృత్తాంతమును గురించి నా కేమియు తెలియదు. రాముని యెడ నాకుగల భక్తి నీకు తెలియదా! రాముడు అరణ్యమునకు పోవుటకు నేనే గనుక సమ్మతించి యుందునేని నన్ను పాప సమూహములు చుట్టుకొనుగాక! నేను నేర్చిన విద్య నశించునుగాక భృత్యునిచేత పనులు చేయించుకొని అతనికి వేతన మీయనివానికి పట్టు దుర్గతి నాకు కలుగుగాక. రాజద్రోహికి సంభవించు పాపము నాకు సంభవించునుగాక. ప్రజలయొద్ద పన్నులు పుచ్చుకొని ప్రజలను చక్కగా రక్షింపని రాజునకు కలుగు పాపము నాకు కలుగునుగాక. యజ్ఞములు చేయించి బ్రాహ్మణులకు దక్షిణ లీయని వానిని పొందు పాపము నన్ను పొందునుగాక. యుద్ధమునుండి వెను దిరిగి పారిపోయిన యోధునకు పట్టు దుర్గతి నాకు కలుగునుగాక. చంద్ర సూర్యులకు సరివచ్చు తేజస్సుగల శ్రీరాముడు ప్రభువై సింహాసనమును అలంకరించునప్పుడు సందర్శించు మహాభాగ్యము నాకు కలుగకుండునుగాక.

[పాపిష్ఠులకు శ్రీరామప్రభువు కనిపించ డన్నమాట.]

మాచతం వ్యూఢ బాహ్వంసం చంద్రార్క సమతేజసమ్
ద్రాక్షీ ద్రాజ్యస్థమాసీనం యస్యార్యాను మతే గతః 75-29

మంచి పదార్థములను దేవతలకుగాని అతిథులకుగాని పెట్టక తానొక్కడే తిను వాడు పోవు దుర్గతిని నేను పొందుదునుగాక. గురువులకును మిత్రులకును ద్రోహము చేయువానికి సంభవించు పాపము నాకు కలుగునుగాక. మిత్రుడని విశ్వసించి తనతో చెప్పుకొన్న రహస్యమును బయల్పరిచినవానికి పట్టు దుర్గతి నా కగునుగాక! తన ఇంట భార్యా పుత్రులకుగాని భృత్యులకుగాని పెట్టకయే తా నొక్కడే తినువాడు పోవు పాపమున నేను పోవుదునుగాక! నా భార్యయందు నాకు సంతానము కలుగ కుండుగాక. నేను ఉన్మత్తునివలె ఈ భూమియందు సంచరించుచు బిచ్చమెత్తుదునుగాక!

నా ధర్మబుద్ధి నశించునుగాక ! నా ధనమంతయు చోరులపాలగుగాక ! ఇండ్లు తగుల బెట్టినవాడు, మిత్రద్రోహి, గురుద్రోహి ఏ పాపములను పొందుదురో ఆ పాపములు న న్నావరించునుగాక! తల్లి దండ్రులకు శుశ్రూషలు చేయనివానికి కలుగు పాపము నాకు కలుగునుగాక ! నేను బహుకుటుంబినై దరిద్రుడనై జీవించుచు జ్వరము మొదలైన రోగములతో పీడింపబడుచు ఎల్లప్పుడు దుఃఖ నిమగ్నుడనై యుందును గాక! నేను పాపినై రాజదండన భయమునొంది మోసముచేసి జీవింతునుగాక!

భరతుడు ఈ విధముగా ఒట్లు పెట్టుకొని పొంగివచ్చిన దుఃఖమును పట్టలేక క్రింద పడిపోయినాడు.

కౌసల్య భరతుని లేవనెత్తి ఒడిలో కూర్చుండబెట్టుకొని "భరతా ! నీ శపథముల వలన నా దుఃఖము మరింత వృద్ధి యగుచున్నది. భగవంతుని కృపవలన నీవును లక్ష్మణునివలె ధర్మమార్గము ననుసరించియుండుట చూడగలిగితిని" అని ఊరడించినది. ఇద్దరికి దుఃఖము వచ్చినది.

ఈ విధముగా రాత్రి గడచిపోయినది.

మరునాడు వసిష్ఠుడు భరతుని కలిసికొని అనుచున్నాడు.

వసిష్ఠుడు : భరతా ! ఇట్లు విలపించుచుండిన ఏమైనట్లు ! మహారాజునకు జరుపవలసిన ఉత్తరక్రియలు జరిపింపుము.

## దశరథునికి భరతుడు సంస్కారము చేయుట

దశరథుని కళేబరమును తైలద్రోణి యందుండి వెలుపలకుతీసి క్రింద పెట్టినారు. దశరథుడు నిద్రలో ఉన్నట్టు కనిపించినాడు.

ఆపీతవర్ణవదనం ప్రసుప్తమివ భూమిపమ్ 76-4

తండ్రిని తలచుకొని భరతశత్రుఘ్నులు విలపించినారు.

వసిష్ఠుడు :- భరతా ! లే నాయనా ! లేచి పని జరిపింపుము. ఇట్లెంత సేపు దుఃఖించుచుండెదవు ?

ఋత్విక్కులు, పురోహితులు, అందఱు వచ్చినారు. కళేబరమును పల్లకిలో పెట్టి మోపికొని పోయినారు. బంగారు, వెండి, వస్త్రములు, దారిలో వెదజల్లుచు కొందరు ముందు నడచినారు. సుగంధద్రవ్యములను చల్లి ధూపములు వేసినారు. ఈ విధముగా దశరథుని కళేబరమును కొనిపోయి చితిమీద పెట్టినారు. భరతుడు అగ్ని సంస్కారము

చేసినాడు. దశరథుని భార్యలు పల్లకీలలో వచ్చినారు. కౌసల్య మున్నగువారు దశరథునికి అప్రదక్షిణము చేసినారు. వారి విలాపములకు అంతము కనబడలేదు.

తరువాత అందరు సరయూనదికి వెళ్ళి దశరథునికి ఉదకదానము చేసి పురప్రవేశము చేసి పదిదినములు ఆశౌచమును పాటించినారు. భరతుడు ఆశౌచమును తీర్చుకొని పదునొకండవనాడును, పండ్రెండవనాడును జరుగవలసిన కర్మను పూర్తి కావించినాడు. బ్రాహ్మణులకును దాసదాసీ జనములకును విరివిగా దానములు చేసినాడు. పదమూడవదినము ఉదయమున అస్థిసంచయనమునకు భరతుడు చితియొద్దకు వెళ్ళి తండ్రిని తలచుకొని మిగుల దుఃఖించినాడు. శత్రుఘ్నుడును మిక్కిలి విలపించినాడు. ఇద్దరును తెలివిదప్పి పడిపోయినారు.

*భరతుడు* : (మూర్ఛదేరి) తండ్రి స్వర్గస్థుడైనాడు. రాముడు అరణ్యమునకు వెళ్ళినాడు. నే నిక జీవించి యుండలేను. నేను అగ్నిలోపడి ప్రాణత్యాగము చేయుదును. తండ్రియు అన్నయు లేని అయోధ్యలో అడుగుపెట్టను. తపోవనమునకు పోయెదను.

> హీనో భ్రాత్రా చ పిత్రా చ శూన్యా మిక్ష్వాకు పాలితామ్
> అయోధ్యా న్నప్రవేక్ష్యామి ప్రవేక్ష్యామి తపోవనమ్.

ఇట్లు విలపించుచు భరతుడు క్రిందపడిపోయినాడు.

*వసిష్ఠుడు* : ('ప్రకృతిమాన్ వైద్యః' అన్నారు. భరతుని లేవనెత్తి) భరతా! ఇది పదమూడనరోజు. ఇంకను అస్థిసంచయనము కావలసియున్నది. ఆలస్య మెందుకు? లోకములో జరామరణములులేని ప్రాణి ఉండునా! నీ విట్లు దుఃఖించుట తగదు.

సుమంత్రుడు శత్రుఘ్నుని లేవనెత్తి మంచిమాటలు చెప్పి కొంత ఊరట కలిగించినాడు. ఇద్దరును లేచి కొరవపనులను పూర్తిచేసినారు.

భరతుడు రాముని యొద్దకు వెళ్ళుటకు సంకల్పించినాడు.

*శత్రుఘ్నుడు* : రాముడు ఒక స్త్రీ మాటకు లోబడి అడవికి నడచుచుండగా లక్ష్మణు డనిఒక డున్నాడుగదా! ఆవీరుడు ఏమిచేయుచుండినట్లు! తండ్రిని నిగ్రహించి వనవాసమును మొదటనే మాన్పించి యుండవలసినది.

> బలవాన్ వీర్యసంపన్నో లక్ష్మణో నామయోఽప్యసౌ
> కిన్నమోచయతే రామం కృత్వాప్మ పితృనిగ్రహమ్. 78-3

**ఈ మాటలలోనే మంథర వచ్చినది. ఆభరణములను ధరించి అలంకారము కావించుకొని త్రాళ్లతో కట్టబడిన కోతివలె ఉన్నది.**

బభాసే బహుభిర్బద్ధా రజ్జు బద్ధేవ వానరీ. 78-7

ద్వారపాలకులు మంథరను పట్టుకొని శత్రుఘ్నునికి అప్పగించి "ఇంత పనికి ఈ దాసియే కారకురాలు. ఈ పాపిష్ఠిదానిని యథేచ్ఛగా శిక్షింపుము" అని చెప్పినారు.

శత్రుఘ్నుడు "దీనికి తగిన శాస్తి చేయవలెను" అని మంథరను పట్టుకొన్నాడు. మంథర బిగ్గరగా ఏడ్చినది. శత్రుఘ్నుని తీవ్రకోపమును చూచి మంథర చెలికత్తెలు తలా ఒకదారి పారిపోయి 'కర్తవ్య మేమి' అని ఆలోచించినారు. "కౌసల్య ఎంతో దయ గలది. ఆమెను శరణు వేడుదము. ఆమెతప్ప మనకు వేరు గతిలేదు" అని తేల్చుకొన్నారు. శత్రుఘ్నుడు కోపోద్రిక్తుడై మంథరను క్రింద పడవైచి యీడ్చుకొనిపోయినాడు. మంథర నగలన్నియు రాలి నేలమీద పడినవి. మంథరను రక్షించుటకు కైకేయి వచ్చినది. శత్రుఘ్నుడు కైకేయిని పరిపరి విధములుగా నిందించినాడు. కైకేయి భరతుని శరణు జొచ్చినది.

**భరతుడు :** (శత్రుఘ్నునితో) తమ్ముడా! ఓర్చుకొనుము. స్త్రీల నెవ్వరైనను వధింతురా!

అవధ్యా స్సర్వభూతానాం ప్రమదాః క్షమ్యతామితి. 78-21

ఆ ధర్మము ననుసరించియే నేను మా తల్లిని వధింపకున్నాను. నే నట్టిపని చేయుదు నేని 'మాతృఘాతుకుడు' అని రాముడు నన్ను నిందింప గలడు. ఈ కుబ్జను వధించితి మని రామునికి తెలిసినయెడల అతడు మనతో మాటలాడనుకూడ మాటలాడడు.

హన్యా మహమిమాం పాపాం కైకేయీం దుష్టచారిణీమ్
యదిమాం ధార్మికో రామో నాసూయే న్మాతృఘాతకమ్. 78-22

ఇమామపి హతాం కుబ్జాం యది జానాతి రాఘవః
త్వాంచ మాం చహి ధర్మాత్మా నాభిభాషిష్యతే ధ్రువమ్. 78-23

[రాముని ధర్మబుద్ధి ఇతరులనుగూడ సన్మార్గమున నడిపింపగలదు.]

భరతుని మందలింపు విని శత్రుఘ్నుడు మంథరను వదలిపెట్టినాడు. మంథర కైకేయి పాదముల నాశ్రయించి తన బాధను చెప్పుకొని విలపించినది. కైకేయి మంథరను ఊరడించినది.

## రాజకర్తారులు భరతునియొద్దకు వచ్చుట

పదునాలుగవ నాడు రాజకర్తారులు భరతునిచెంతకు వచ్చినారు.

**రాజకర్తారులు :** దశరథుడు స్వర్గస్థుడైనాడు. రామలక్ష్మణులు వనవాసము చేయుచున్నారు. ఈ రాజ్యమునకు నిన్ను రాజుగా కోరుచున్నాము. నీవు పట్టాభి

షేకము చేసికొనవలసినదిగా ప్రార్థించుచున్నాము. నీ అభిషేకమునకు కావలసిన ద్రవ్యము లన్నింటిని సిద్ధపరచుకొని ప్రజ లందరు నీ మాటకు ఎదురు చూచుచున్నారు. నీవు మా ప్రార్థన అంగీకరించి మమ్ముల రక్షింపుము.

**భరతుడు**: (అభిషేక ద్రవ్యములకు ప్రదక్షిణము చేసి) మీ రిట్లు ప్రార్థించుట సరికాదు. మా వంశమర్యాద ననుసరించి జ్యేష్ఠునకే రాజ్యాధికారము. కావున మన కందరికిని రాముడే రాజు. నేను చతురంగ బలములను వెంటబెట్టుకొని అభిషేక ద్రవ్యములను గైకొని అరణ్యమునకు ప్రయాణమై రామునికి అచ్చటనే పట్టాభిషేకము జరిపించి అయోధ్యకు పిలుచుకొని వచ్చెదను. రామునికి మారుగా నేను పదునాలుగు సంవత్సరములు వనవాసవ్రతము నాచరింతును. పనివారిని వెంటనే పిలిపించి మార్గమును చక్కజేయింపుడు.

జ్యేష్ఠస్య రాజతా నిత్య ముచితా హి కులస్యనః
నైవం భవంతో మాం వక్తు మర్హంతి కుశలా జనాః 79-7

రామః పూర్వోహి నో భ్రాతా భవిష్యతి మహీపతిః
అహం త్వరణ్యే వత్స్యామి వర్షాణి నవపంచ చ 79-8

యుజ్యతాం మహతీసేనా చతురంగ మహాబలా
ఆనయిష్యా మ్యహం జ్యేష్ఠం భ్రాతరం రాఘవం వనాత్ 79-9

అభిషేచనికం చైవ సర్వమేతదుపస్కృతమ్
పురస్కృత్య గమిష్యామి రామహేతో ర్వనం ప్రతి 79-10

తత్రైవ తం నరవ్యాఘ్ర మభిషిచ్య పురస్కృతమ్
ఆనేష్యామితువై రామం హవ్యవాహ మివాధ్వరాత్ 79-11

వనే వత్స్య మ్యహం దుర్గే రామో రాజా భవిష్యతి 79-12

**రాజకర్తలు**: భరతా! నీ ధర్మబుద్ధి దొడ్డది, లక్ష్మి నీకు ప్రసన్నయై నిన్ను సర్వదా విడువకుండునుగాక!

శిల్పులు, యంత్రకోవిదులు, వడ్రంగులు, సున్నపుపని చేయువారు, వెదురుపని చేయువారు, ఒక రేమిటి, అన్నిరకముల పనివారును గుంపులు గుంపులుగా కదలినారు. అడవులలోని వృక్షములను నరికి మార్గమును చక్కపరిచినారు. చెట్లు లేనిచోట్ల చెట్లు నాటినారు. మిట్టపల్లములను సరిచేసినారు. బావులు, చెఱువులు త్రవ్వినారు. వేదికలు నిర్మించినారు. అచ్చటచ్చట విడిది ప్రదేశములను ఏర్పాటు చేసినారు. శిబిరములను నెలకొల్పినారు.

గంగానదీతీరము వరకు ఈ విధముగా మార్గమును తీర్చి అచ్చటచ్చట పతాక లెత్తించి మార్గము నంతయు అలంకరించినారు.

[రాముని అయోధ్యకు కొనివచ్చుటకే యీ అలంకారము! శ్రీరాముడు నడచు దారి మనోహరముగా ఉండవలయును గదా!]

తెల్లవారుజామున వందిమాగధులు వారి ఆచారానుసారము భరతుని స్తుతించి మేల్కొలిపినారు. శంఖములు పూరించినారు. వాద్యములు ప్రయోగించినారు.

*భరతుడు:* ఆ వాద్యములను స్తోత్రములను నిలుపుడు. నేను రాజును కాను. (శత్రుఘ్నునితో) తమ్ముడా! కైకేయి లోకమున కెంత అపకార మొనరించి నదో చూడుము. రాజ్య మంతయు కర్ణధారుడు లేని ఓడవలె ఉత్పాత లాడు చున్నది.

ఈ విధముగా భరతుడు దుఃఖించుచుండినాడు.

## రా జ స భ

వసిష్ఠుడు రాజసభలో ప్రవేశించినాడు. దూతలను పంపించి పురజను లందరిని పిలిపించినాడు. భరత శత్రుఘ్నులను, పురప్రముఖులను సభకు రమ్మని చెప్పిపంపినాడు. అందరును సమావేశ మైనారు.

భరతుడు సభామందిరమునకు వచ్చినాడు. జనులందరు భరతునికి గొప్ప స్వాగత మిచ్చినారు.

అందరు తమతమ యోగ్యతకు తగినట్లు సభలో ఆసీను లైనారు.

*వసిష్ఠుడు:* భరతా! ధనధాన్య సమృద్ధమైన ఈ రాజ్యమును నీ వశముచేసి మీ తండ్రి స్వర్గస్థు డైనాడు. శ్రీరాముడు తండ్రి ఆజ్ఞను శిరసా వహించి అరణ్యమునకు వెళ్ళియున్నాడు. ఈ విధముగా మీ తండ్రియును, మీ అన్నయును నీకు ప్రసా దించిన రాజ్యమును నీవు పరిగ్రహించి శీఘ్రముగా పట్టాభిషిక్తుడవు కమ్ము.

ఈ మాటలు విన్న భరతుని మనస్సు రాముని వంకకు మరలినది. భరతునికి దుఃఖమువచ్చి నిండుసభలో విలపించినాడు. వసిష్ఠుని సైతము నిందించినాడు.

*భరతుడు:* ఈ రాజ్యము శ్రీరామునిది. ధర్మమార్గము ననుసరించువా డెవ్వడును రామ రాజ్యమును అపహరింపడు. దశరథునికి జన్మించినవాడు రాజ్యాపహారకుడగునా! రాజ్యమంతయు రామునిది. నేనుకూడ రామునివాడనే. ఈ విషయమున మీరు ధర్మము ననుసరించి పలుకవలయును.

కథం దశరథా జ్జాతో భవేద్రాజ్యాపహారకః
రాజ్యంచాహంచ రామస్య ధర్మం వక్తు మిహార్హసి. 82-12

ఇట్టి మహాపరాధమును చేయుదునేని నేను కులపాంసనుడ నగుదును. నా మూలమున ఇక్ష్వాకు వంశమున కంతయు చెడ్డపేరు రాగలదు.

[వంశమర్యాదను కాపాడుట ఎంత ప్రధానము !]

అనార్యజుష్ట మస్వర్గ్యం కుర్యాం పాపమహం యది
ఇక్ష్వాకూణా మహం లోకే భవేయం కులపాంసనః 82-14

నా తల్లి చేసిన అధర్మమునకు నేను లోబడను. అడవిలో నుండు రామచంద్రునికి నే నిచ్చటినుండి కృతాంజలినై నమస్కరించుచున్నాను. నేను శ్రీరాముని అనుసరింతును. రాముడు ముల్లోకములకును రాజుగా ఉండదగినవాడు.

ఈ మధుర వాక్యములను విని సభాసదు లందరు ఆనందబాష్పములు విడిచినారు. భరతుడు మరల మాటలాడుచున్నాడు.

*భరతుడు:* శ్రీరాముని అరణ్యమునుండి ఇచ్చటికి పిలుచుకొనివచ్చుటకు సాధ్యము కానియెడల లక్ష్మణునివలెనే నేనుకూడ రామునితో అరణ్యమున నివసించెదను.

యదిత్వార్యం నశక్ష్యామి వినివర్తయితుం వనాత్
వనే తత్రైవ వత్స్యామి యథార్యో లక్ష్మణ స్తథా 82-18

కాని శ్రీరాముని బలాత్కరించియైనను అయోధ్యకు తోడ్కొని వచ్చుటకు మీ అందరి సమక్షమున సకల ప్రయత్నములు చేయుదును.

సర్వోపాయంతు వర్తిష్యే వినివర్తయితుం బలాత్
సమక్షమార్యమిశ్రాణాం సాధూనాం గుణవర్తినామ్ 82-19

మార్గమును చక్కజేయింపు డని ఇదివరకే తెలిపియున్నాను. సుమంత్రా! సైన్యమును సిద్ధముగా ఉండు మని చెప్పుము. మన ప్రయాణమునకు కావలసినవి సిద్ధము చేయుము. లోకహితమునకై శ్రీరాముని తోడ్కొనిరావలయును.

ప్రయాణపు సంగతి విని అందరు ఉత్సాహముతో నున్నారు. సైనికులభార్యలు తమ భర్తలను తొందరపెట్టి పంపుచున్నారు. పురజను లందరు ప్రయాణమునకు సిద్ధ మైనారు.

## శ్రీరాముని తోడ్కొనివచ్చుటకు భరతుడు బయలుదేరుట

భరతుడు ప్రాతఃకాలముననే లేచి రథము నారోహించి బయలుదేరినాడు. మంత్రులు, పురోహితులు వారివారి రథములమీద భరతునికి ముందు వెళ్లుచున్నారు.

భరతునివెంట తొమ్మిదివేల ఏనుగులు, యోధులతో కూడిన అరువదివేల రథములు, లక్షమంది గుఱ్ఱపు రౌతులు వెళ్లుచున్నారు. సుమిత్రా కౌసల్యలతోపాటు కైకేయికి సైతము రాముని పిలుచుకొనివచ్చు యత్నము సంతోషము కలిగించినది. వారందరు వారికి తగిన వాహనములమీద ఉత్సాహముతో బయలుదేరినారు.

కైకేయీ చ సుమిత్రా చ కౌసల్యా చ యశస్వినీ
రామానయన సంహృష్టా యయు ర్యానేన భాస్వతా 83-6

[కైకేయి పేరు మొట్టమొదట చెప్పినారు. బహుశః ముందే నడచియుండును. ఆమెకు మోహము వదలిపోయినదన్నమాట, కాని ఏమిలాభము! జరుగవలసిన వన్నియు జరిగిపోయినవి. దశరథుడు మరణించనే మరణించినాడు]

అందరు శ్రీరాముని సందర్శించు ఉత్సాహముతో నడచుచున్నారు. శ్రీరాముని దివ్యమంగళరూపమును కల్యాణగుణములను తలచుకొని రాముని దర్శనము చేసికొనుటకు తహతహలాడుచున్నారు. సీతారామలక్ష్మణులను గురించిన మాటలనే మాటాడుకొనుచున్నారు. "రాముడు లోకశోకమును నశింపజేయువాడు. రామదర్శన మాత్రమున శోకము మాయ మగును" అని మాట్లాడుకొనుచున్నారు.

మేఘశ్యామం మహాబాహుం స్థిరసత్త్వం దృఢవ్రతమ్
కదా ద్రక్ష్యామహే రామం జగత శ్శోకనాశనమ్ 83-8

దృష్ట ఏవహి నశ్శోక మపనేష్యతి రాఘవః
తమ స్సర్వస్య లోకస్య సముద్య న్నివ భాస్కరః

ప్రజలు ఆనందపరవశులై ఒకరినొకరు కవుగిలించుకొనుచున్నారు.

[ఆ కాలమున అయోధ్యలో ఏ యే వృత్తులు, వ్యాపారములు, ఉండినవో యెనుబది మూడవసర్గ 12 మొదలు 15 వరకు శ్లోకములలో చెప్పియున్నారు]

రత్నములు సానబెట్టువారు, కుమ్మరులు, వస్త్రములు నేయువారు, ఆయుధములవలన జీవించువారు, నెమలి పింఛములతో విసనకఱ్ఱలు మొదలగునవి చేయువారు, అంపకోతగాండ్రు, తిన్నెలకు వన్నెలు తీర్చువారు, రత్నములకు బెజ్జములు వేయువారు, దంతపుపని చేయువారు, సున్నపుపనివారు, సుగంధద్రవ్యములను చేయువారు, బంగారు పనివారు, కంబళ్లు శోధించువారు, తలంటువారు, వైద్యులు, ధూపములు వేయువారు, మద్యములు చేయువారు, చాకలివారు, కుట్టుపని చేయువారు, నటులు, నాట్యము లాడించువారు, చెంబడివారు, ఇంకను ఇతరవృత్తులయందుండువారు అందరు భరతుని వెంబడించినారు. బ్రాహ్మణులు వేనవేలుగా ఎద్దుబండ్లమీద కదలినారు.

ఇట్లు ప్రయాణముచేసి గంగాతీరమునకు వచ్చి చేరినారు.

*భరతుడు :* ఈ పూట ఇచ్చట నిలిచి గంగానదిని రేపు దాటుదము. నా తండ్రికి స్వర్గ సుఖముకోరి గంగానదీ జలములతో నేను జలతర్పణము కావింతును.

సేనను అచ్చటచ్చట విడియించినారు. భరతుడు శ్రీరాముని తోడ్కొని వచ్చు విషయమే ఆలోచించుచున్నాడు.

[శ్రీరామునికి చెప్పవలసిన మాటలను కూర్చుకొనుచున్నాడు కాబోలు! రామునితో సంభాషించుట సామాన్యమైన పనికాదు. ఇట్టి క్లిష్టసమయములో దాని కష్టము వేరుగా చెప్పనక్కరలేదు]

## గుహుడు భరతుని కలిసికొనుట

గుహుడు భరతుని సైన్యమును చూచి తనవారితో అనుచున్నాడు.

*గుహుడు :* ఈ సైన్యము సముద్రమువలె కనబడుచున్నది. దీనికి అంతుపొంతు కాన రాలేదు. రథముపై కోవిదారధ్వజము కానవచ్చుచున్నది. భరతుడు స్వయముగా వచ్చినాడు. ఏదేని దుర్బుద్ధి పుట్టియుండునా! మనలను బంధించును కాబోలు! లేక వధించును కాబోలు! ఒకవేళ రాముని కడతేర్చుటకే వచ్చి యుండునా? శ్రీరాముడు నాకు స్నేహితుడుమాత్రమే కాదు, శ్రీరాముడు నాకు ప్రభువు - ఆయన పని మనము తప్పక చేయవలెను. మీ రెల్లరు మెలకువతో ప్రవర్తింపవలయును. గంగాతీరమునందలి రేవులను ఒకకంట కనిపెట్టి యుండవలయును. అయిదువందల ఓడలను సిద్ధపరిచి ఒక్కొక్క ఓడలో వందమంది యోధు లుండి అప్రమత్తులై కాపుకాయవలయును. రాముని విషయమున భరతునికి ద్రోహబుద్ధి లేనియెడల భరతుని సైన్యమును ఆవలి తీరమునకు దాటింపవచ్చును.

గుహుడు మధుమాంసములను పట్టించుకొని భరతుని చెంతకు వచ్చినాడు. సుమంత్రుడు (పాతపరిచయమునుబట్టి) గుహుని గుర్తించి అతని రాకను భరతుని కెరుకపరిచినాడు.

*సుమంత్రుడు :* భరతా! గుహుడు శ్రీరాముని స్నేహితుడు. ఈ దేశమునకు రాజు. దండకారణ్య విషయము చక్కగా ఎరిగినవాడు. రామలక్ష్మణుల వృత్తాంతము అతనికి తెలిసియుండును. గుహుడు ఇచ్చటికి వచ్చి నీ దర్శనమును కోరుచున్నాడు.

*భరతుడు :* సుమంత్రా! గుహుని వెంటనే ప్రవేశపెట్టుము.

గుహుడు నమ్రుడై వచ్చి భరతునితో మాటలాడుచున్నాడు.

*గుహుడు* : భరతా! నీకు స్వాగత మగునుగాక! నీ రాక మాకు ముందుగా తెలియక ప్రమత్తులమైయుండి మోసపోయితిమి. తెలిసినవెంటనే నిన్ను దర్శించుటకు వచ్చినాను. మీరందరు మా సదనమునకు విచ్చేసి మా ఆతిథ్యమును స్వీకరింపవల సిన దని వేడుచున్నాను. ఈ రాత్రి అచ్చట విశ్రమించి ప్రయాణము రేపు సాగించ వచ్చును.

*భరతుడు* : గుహుడా! నీ ప్రియవాక్యములే చాలును. మాకు ఆతిథ్య మిచ్చినట్లే అయి నది. భరద్వాజాశ్రమమునకు మార్గ మేది? ఈ అరణ్యమున దారి గోచరించుట లేదు. గంగానదిని దాటుటకూడ సులభ మని తోచుటలేదు.

*గుహుడు* : (ప్రాంజలియై) భరతా! మా వారు ధనుర్ధరులై నీవెంబడి రాగలరు. నేను కూడ నీ వెంట వచ్చెదను. కాని నీ సైన్యములను చూచి నాకు కొంచెము అను మానముగా నున్నది. రామునిగూర్చి దుర్మార్గ మేమియు తలపెట్టలేదుగదా!

*భరతుడు* : గుహుడా! హాతోస్మి! ఎట్టి విపరీతపుమాట వినవలసివచ్చినది! ఇట్టి కష్ట కాలము ఎన్నటికిని రాకుండునుగాక! నన్నుగురించి సందేహపడకుము. నా అన్న శ్రీరాముడు నాకు తండ్రితో సమానుడు. ఆ మహానుభావుని అయోధ్యకు తోడ్కొనిపోవుటకే ఈ ప్రయాణము. ఈ మాట సత్యము.

*గుహుడు* : భరతా! నీవు ధన్యుడవు. అప్రయత్నముగా హస్తగతమైన రాజ్యమును వదలుకొనువాడు నీవుతప్ప మరియొకడు లోకమున ఉండడు. కష్టములో నున్న నీ అన్నను తీసికొని వెళ్లదలచిన నీ దొడ్డబుద్ధి ఎంతయు ప్రశంసనీయము. నీ కీర్తి సమస్తలోకములందును వ్యాపించి శాశ్వతముగా నిలిచియుండగలదు.

> ధన్య స్త్వం నత్వయాతుల్యం పశ్యామి జగతీ తలే
> అయత్నా దాగతం రాజ్యం య స్త్వం త్యక్తు మిహేచ్ఛసి. 85-12
>
> శాశ్వతీ ఖలుతే కీర్తి ర్లోకా ననుచరిష్యతి
> య స్త్వం కృచ్ఛ్రగతం రామం ప్రత్యావయితు మిచ్ఛసి 85-13

ఈ మాటలలో సూర్యాస్తమయ మైనది. ఆరాత్రి అందరు గంగాతీరముననే విశ్రమించినారు. భరతునికి నిద్రపట్టలేదు. రామశోకమున తపించిపోవుచున్నాడు. గుహుడు ప్రక్కనఉండి ఊఅటమాటలు చెప్పుచున్నాడు. ఆనాడు సీతారామలక్ష్మ ణులు వచ్చినప్పటి మాటలు ఇద్దరు మాట్లాడుకొనుచున్నారు.

*గుహుడు* : భరతా! లక్ష్మణునికి అన్నమీద ఎంతభక్తి! రాముని రక్షించుటకు ఖడ్గమును చేతబూని రాత్రి యంతయు మేలుకొని కూర్చుండినాడు. నేనెంత దూరమో

చెప్పి చూచితిని. పాన్పుమీద శయనింపుమని వేడుకొన్నాను. రాముని రక్షణ విషయమున మేము జాగరూకులమై ఉందుమని చెప్పినాను. కాని లక్ష్మణుడు నామాట పట్టించుకొనలేదు. "సీతారాములు ఇట్టికష్టమున నుండగా నాకు నిద్ర పట్టునా! వారి స్థితిని చూచి నాకు బ్రతికియుండుట కూడ కష్టముగా ఉన్నది" అని చెప్పినాడు. వారినిగూర్చి ఎంతో దుఃఖపడినాడు. రాత్రి యంతయు అట్లే గడచిపోయినది. తెల్లవారగనే ఈ గంగాతీరముననే రామ లక్ష్మణులు జటలు దాల్చినారు. నేను వారి ముగ్గురిని గంగానది ఆవలితీరము నకు దాటించినాను.

ఈ మాటలు వినుట తోడనే భరతునికి మూర్ఛవచ్చి పడిపోయినాడు. చెంత నుండిన శత్రుఘ్నుడు భరతుని అవస్థను చూచి బిగ్గరగా విలపించినాడు. తల్లు లందరు చేరినారు. కౌసల్య భరతుని కవుగిలించుకొని భరతునితో పలుకుచున్నది.

*కౌసల్య:* నాయనా! నీకేమైన జబ్బు చేసినదా! మా ప్రాణము లన్నియు నీచేతిలో నున్నవి. నిన్ను చూచుకొనియే మే మందరము బ్రతికియున్నాము. రామ లక్ష్మణులను గురించి అశుభవార్త ఏదైనను నీ చెవిని పడినదా!

భరతుడు నెమ్మదిగాలేచి కౌసల్యకు ధైర్యముచెప్పి ఊరడించినాడు.

*భరతుడు:* గుహుడా! వారి సమాచారము ఇంకను చెప్పుము. ఆరాత్రి సీతారాములు ఎందు శయనించినారు? ఏమి భుజించినారు?

*గుహుడు:* భరతా! నే నెన్నిపదార్థములనో తెచ్చి ఆరగింపుమని ప్రార్థించితిని. కాని శ్రీరాముడు వానిని స్పృశింపలేదు. "మేము ఇచ్చువారమేగాని పుచ్చుకొను వారము కాము" అని చెప్పినాడు. లక్ష్మణుడు కొనివచ్చిన గంగాజలమును మాత్రము త్రాగి సీతారాములు ఉపవాసము చేసినారు. వారు త్రాగగా మిగి లిన జలమును లక్ష్మణుడు త్రాగినాడు.

సీతారాములు శయనించుటకు లక్ష్మణుడు దర్భలుతెచ్చి పరచినాడు. అదిగో! ఆ గారచెట్టు క్రిందనే సీతారాములు శయనించినది. ఆ దర్భలుకూడ అచ్చటనే యున్నవి చూడుము."

భరతుడు గారచెట్టుచెంతకు వెళ్ళి చూచినాడు. సీతారాములు శయనించిన ప్రదేశ మును తల్లులకు చూపించి చెప్పుచున్నాడు.

*భరతుడు:* (దుఃఖముతో) సమస్త భోగములను అనుభవింపదగిన శ్రీరామునికి ఎట్టి కష్టము ప్రాప్తించినది! ఇదియంతయు నిజముగా జరిగినదేనా! లేక నే నేమైన

కల గనుచుంటినా! సీతాదేవికి ఎట్టి కష్టము సంభవించినది! జనకమహారాజునకు కౌమారితయై దశరథ చక్రవర్తికి కోడలైన సీతాదేవి కరకు దర్భలమీద శయనింపవలసి వచ్చెనుగదా! (దర్భలను చూచి) ఇదిగో! మా శ్రీరాముడింద శయనించియుండును. పాపము! నేలమీద పడకకుదరక అటునిటు పొరలుటలో ఈ దర్భ లన్నియు నలిగియున్నవి. సీతాదేవి తన ఆభరణములతోనే పరుండియుండును. ఈ దర్భలమీద అచ్చటచ్చట బంగారు పొడి రాలియున్నది. ఆమె ఉత్తరీయము ఈ దర్భలలో చిక్కుపడినట్లు కనిపించుచున్నది. అచ్చటచ్చట పట్టుపోగులు కానవచ్చుచున్నవి.

ఆహా! సీతారాములకు ఎంతటి కష్టమును తెచ్చిపెట్టితిని! నా వంటి పాపి వేరొక్క డుండడు. లక్ష్మణుడు ఎంతో ధన్యుడు. కష్టకాలమున రాముని వెంబడి ఉన్నాడు. భర్తను అనుసరించి అరణ్యమునకు వచ్చిన సీతాదేవి సైతము ఎంతో ధన్యురాలు.

ధన్యః ఖలు మహాభాగో లక్ష్మణ శ్శుభలక్షణః
భ్రాతరం విషమే కాలే యో రామ మనువర్తతే. 88-20

సిద్ధార్థాఖలు వైదేహీ పతిం యానుగతా వనమ్ 88-21

[సుఖముగా నున్నప్పుడు అందరును మనవారే. కష్టకాలమున ఆదరించువారు అరుదు]

మనకు శ్రీరాముడు దూరమైనాడు. చెంతకు తెచ్చుకొనవలయును. రాముడు అడవికి పోవుటవలన రాజ్యము అనాయకముగా నున్నను రాముని ప్రభావమును తలచుకొని పరరాజులెవ్వరును దానివంక చూడలేదు.

["అయోధ్యకు రాజు లేకపోయినను అందువలన కలుగు ప్రమాదము ఏమియునులేదు. నేను రాజుకాకపోయినను ఇబ్బందిలేదు" అని భరతుడు సూచించుచున్నాడు]

ఇది మొదలు నేనుకూడ జటాజినములు ధరించి నేలమీద శయనించి ఫలమూలములనే ఆహారముగా గొనుచు కాలము గడపుదును.

అద్యప్రభృతి భూమౌతు శయిష్యేఽహం తృణేషువా
ఫలమూలాశనో నిత్యం జటాచీరాణి ధారయన్. 88-26

శ్రీరాముని ప్రతిజ్ఞను నేను పాలింపగలను. నేను శత్రుఘ్న సహితుడనై వనవాసమును పూర్తిచేసెదను. శ్రీరాముడు లక్ష్మణసహితుడై అయోధ్య కరిగి రాజ్యమును పాలించుగాక! ఈ నా కోరికను నా ఇష్టదేవతలు సఫలము చేయుదురుగాక.

అపి మే దేవతాః కుర్యురిమం సత్యం మనోరథమ్. 88-29

శ్రీరాముడు నా ప్రార్థన నంగీకరింపక వనములో నివసించుటయే నిశ్చయించుకొనినచో నేనుకూడ అతని వెంబడి వనములోనే ఉందును. రాము డందుకైనను సమ్మతింపకపోవునా !

మరునాడు ఉదయమున భరతుడు శత్రుఘ్నుని మేల్కొలుపుచున్నాడు.

*భరతుడు:* తమ్ముడా ! ఇంకను నిద్రపోవుచుంటివా ? వేగిరము లేచి గుహుని పిలుచుకొనిరమ్ము.

*శత్రుఘ్నుడు:* అన్నా ! నాకు నిద్రపట్టినదా! శ్రీరాముని గూర్చి తలపోయుచు మేల్కాంచియే ఉన్నాను.

ఈ మాటలలోనే గుహుడు వచ్చినాడు.

*గుహుడు:* భరతా ! రాత్రి సుఖముగా గడచినదా ! నీకుగాని నీ సైన్యమునకుగాని ఎట్టి బాధయును కలుగలేదుగద !

*భరతుడు:* గుహుడా ! నీవు మమ్ములను గొప్పగా ఆదరించితివి. రాత్రి సుఖముగనే వెళ్ళిపోయినది. మేమెల్లరము గంగానదిని దాటు ఉపాయము చూడుము.

## భరతుడు భరద్వాజాశ్రమమునకు పోవుట

గుహుడు ఓడలను తెప్పించినాడు. సామాన్యమైన నావలుగాక ప్రత్యేకముగా నిర్మింపబడిన "స్వస్తికములు" అను ఓడలనుకూడ తెప్పించినాడు. 'స్వస్తికము' అనగా పైన మూతగలిగి గాలి వచ్చుటకు కిటికీలు గలిగి దృఢముగా నుండు ఓడ. పతాకలు, గంటలు కట్టబడి చక్కగా అలంకరింపబడి యుండును.

**అన్యా స్స్వస్తిక విజ్ఞేయా మహాఘంటా ధరావరాః**
**శోభమానాః పతాకాభి ర్యుక్తవాతా స్సుసంహతాః** 89-11

భరత శత్రుఘ్నులు, వసిష్ఠాది వృద్ధులు, రాజపత్నులు, అందరు ఓడలలో ఎక్కినారు. బండ్లను, గుఱ్ఱములను, ఎద్దులను ఓడలలో ఎక్కించినారు. ఏనుగులను నదిలోదింపి మావటీలు వానిని ఆవలి తీరమునకు కొనిపోయినారు. కొందరు ఓడలలోను, కొందరు తెప్పలమీదను, కొందరు ఘటములసాయముతోను, మరికొందరు ఈదుచును అందరు గంగానదిని దాటి ప్రయాగవనము చేరుకొన్నారు.

భరద్వాజాశ్రమము క్రోసెడుదూర మున్నదనగా భరతుడు సైన్యములను నిలిపి, ఆయుధములను ఆభరణములను విసర్జించి, పట్టువస్త్రములను ధరించి, వసిష్ఠుని పురస్కరించుకొని మంత్రి సహితుడై నడచినాడు. ఆశ్రమ ప్రాంతమునకు వచ్చిన పిదప

మంత్రులను బయట నిలిపి వసిష్ఠుడును తానును ఆశ్రమమున ప్రవేశించినారు. భరతుడు భరద్వాజ మహర్షికి సాష్టాంగ నమస్కారము చేసినాడు. భరద్వాజుడు వారిరువురకును అర్ఘ్యపాద్యాదు లిప్పించి అతిథి సత్కారము జరిపించినాడు. ఉభయ కుశలోపరి,

*భరద్వాజుడు :* భరతా ! విశేషములేమి ? రాజ్యమును పాలించుచుండవలసినవాడవు అరణ్యమున కేల వచ్చితివి ? నా మనస్సు నేదియో కలత పెట్టుచున్నది. రాజ్యమును ఎల్లప్పటికి అకంటకముగా నీవు అనుభవింపదలచి, అరణ్యమున అవస్థపడుచుండు ఆ సీతారామ లక్ష్మణులకు అపకార మేమియు తలపెట్టలేదుగదా !

కచ్చి న్న తస్యాపాపస్య పాపం కర్తు మిహేచ్ఛసి
అకంటకం భోక్తుమనా రాజ్యం తస్యానుజస్య చ 90-13

ఈ మాటను వినిన భరతునికి కన్నులవెంట బాష్పములు స్రవించినవి. దుఃఖము పట్టలేక భరద్వాజునితో అనుచున్నాడు.

*భరతుడు :* హతోస్మి ! భగవంతు లగు మీరుసైతము ఇట్లు సందేహపడినచో మరి నాకు గతి ఏమి ? స్వామీ ! నా యందు దోషమేమియును లేదు. ఈ ఘోర పరిణామ మంతయు నేను లేనిసమయమున నాకు తెలియకయే జరిగిపోయినది. నేను శ్రీరాముని పాదములకు మ్రొక్కి అతనిని ప్రార్థించి అయోధ్యకు తోడ్కొని పోవుటకే వచ్చినాను. మీరు ప్రసన్నులై నా యెడ దయచూపించి శ్రీరాము డిప్పుడు ఎచ్చట నున్నాడో సెలవిండు.

*భరద్వాజుడు :* భరతా ! రఘువంశపు వాడవు అనిపించితివి. నీ శుద్ధభావము నాకు తెలియనిది కాదు. నీ సంకల్పమును దృఢము చేయుటకును నీ కీర్తిని వ్యాపింప జేయుటకును అడిగిన మాటయేగాని అన్యముకాదు.

జానే చైత న్మనస్థం తే దృఢీకరణ మస్త్వితి
అపృచ్ఛం త్వాం తథాత్యర్థం కీర్తిం సమభివర్ధయన్ 90-21

సీతారామలక్ష్మణులు ఇప్పుడు చిత్రకూటమున ఉన్నారు. ఈ నాడు మా ఆశ్రమమునందుండి రేపు బయలుదేరవచ్చును.

*భరతుడు :* స్వామీ ! మీ రిచ్చిన ఆతిథ్యము వలన కృతార్థుడ నైతిని. అదియే చాలును.

*భరద్వాజుడు :* (చిరునవ్వుతో) భరతా ! నీ సంగతి కాదు. నీవు దేనితోనైనను తృప్తి పడుదు వని నే నెరుగుదును. నీ సేనలకు భోజనము పెట్టవలయు నని కోరుచున్నాను. నీ సైన్యమును దూరముగా విడిచి వచ్చితివేమి ?

*భరతుడు :* ఆశ్రమశాంతికి భంగము కలిగింపగూడదని అట్లు చేసితిని. మరేమియుకాదు.

భరద్వాజుడు: సరే! ఇప్పుడైనను వారిని పిలిపింపుము.

సైన్యము వచ్చినది.

## భరద్వాజుని విందు

భరద్వాజుడు ఆచమనముచేసి విశ్వకర్మను ఆహ్వానించి సమస్తము సిద్ధము చేయించినాడు. నదు లన్నియు ఆశ్రమమునకు వచ్చినవి. కొన్ని నదులలో మద్యము, కొన్నిటియందు మేలైన పానీయములు ప్రవహించినవి. అప్సరసలు విచ్చేసినారు. కుబేరుని చైత్రరథవనము ఆశ్రమమునకు వచ్చినది. భక్ష్య భోజ్య చోష్య లేహ్యములతో కూడిన అన్నరాసులు ప్రత్యక్షమైనవి. పుష్పమాలికలు, సుగంధ ద్రవ్యములు సంపన్నములైనవి. అప్సరసలు ఆడినారు. గంధర్వులు పాడినారు. లోకములోని వృక్షము లన్నియు మధుఫల భరితములై వచ్చి నిలిచినవి. గృహములు ప్రాసాదములు హర్మ్యములు సిద్ధ మయినవి.

రాజభవన మొకటి ప్రత్యేకముగా సృజింపబడినది. అందులో పాన్పులు ఆసనములు వాహనములు మున్నగునవి అమర్పబడియుండినవి. రత్న సంపూర్ణమైన ఆ భవనములో భరతుడు ప్రవేశించినాడు. మంత్రులు పురోహితులు భరతునివెంట వెళ్ళినారు. ఆ భవనమున సింహాసనము ఛత్ర చామరములు మొదలైన రాచ దర్బారు లక్షణము లన్నియు కానవచ్చినవి. భరతుడు వాని కన్నిటికిని ప్రదక్షిణము చేసినాడు. శ్రీరాముని ధ్యానించి, అతనికి నమస్కరించి, సింహాసనమును పూజించి వింజామరమును చేతబూని మంత్రులకు ఉచితమైన ఆసనమున కూర్చుండినాడు.

ఆసనం పూజయామాస రామాయాభిప్రణమ్యచ
వాలవ్యజన మాదాయ న్యషీదత్సచివాసనే 91-39

మంత్రులు పురోహితులు సేనానాయకులు తదితరులు వారివారి యోగ్యతకు తగినట్లు ఆసీను లైనారు.

క్షీరాన్నములతో కూడిన నదులు భరతుని యెదుట ప్రవహించుచుండినవి. నదులకు ఇరుపార్శ్వముల యందు గొప్ప భవనములు ఉద్భవించినవి. కొన్నివేలమంది అప్సరసలు వచ్చినారు. నారదుడు తుంబురుడు గోపుడు వచ్చి భరతుని యెదుట గానము చేసినారు. పేరుబడిన అప్సరసలు నాట్యము ప్రదర్శించినారు. చైత్రరథ వనములోని తరువులు, లతలు కన్నులకు ఆనందము కూర్చినవి. వృక్షముల యందలి పుష్పములు పరిమళమును గుబాళించినవి.

భరతుని సైన్యము సంగతి ఇంచుక పరిశీలింతము.

లత లన్నియు స్త్రీ రూపములు దాల్చి సైనికులతో "మీ ఇష్టానుసారము పానముచేయుడు, భుజింపుడు" అని పలికినవి. ఒక్కొకనికి పదిమంది సుందరాంగులు నలుగులు పెట్టి స్నానములుచేయించినారు. మద్యపానము చేయించినారు. విందులు చేసినారు.

సైనికు లిట్లు భోగము లనుభవించి అనుచున్నారు.

సైనికులు : మేము అయోధ్యకు వెళ్లము. దండకారణ్యమునకు సైతము వెళ్లుటలేదు. భరతునికి క్షేమ మగునుగాక ! రాముడు సుఖముగా నుండుగాక ! స్వర్గ మనగా ఇదియే ! ఇదిగాక మరియొక స్వర్గ మున్నదా !

నైవాయోధ్యాం గమిష్యామో నగమిష్యామ దండకాన్
కుశలం భరత స్యాస్తు రామస్యాస్తు తథా సుఖమ్ 91.59

[తాము వచ్చిన పని మరచిపోయి ఆనందించుచున్నారు. మరి, భరతుని విషయము ఎట్లున్నది ? ఎక్కడ చూచినను కమ్మని భోజనము, మేలైన వస్త్రములు, ఆట పాటలు, వినోదములు, సమస్త భోగములు, కరగతము లైనవి. అట్టి యెడ ఆ ధీరుని ప్రవర్తన గమనింపదగియున్నది.

ఈ వైభవ మంతయు భరద్వాజ మహర్షి భరతునికి పెట్టిన పరీక్ష. మేనమామ ఇంట భరతునికి దుస్స్వప్నము కలిగినప్పుడు అతని మిత్రులు భరతునికి సంతోషము కలిగించుటకు చేసిన వినోదములు, నాట్యములు, ఆట పాటలు మున్నగువానిని బట్టి అతడు సుఖ పురుషుడని ఏర్పడుచున్నది. అట్టివానికి రాజ్యసంపద లభ్య మైనచో అతని కోరికలు, ముచ్చటలు, తీర్చుకొనుటకు అనేక అవకాశము లుండును.

భరద్వాజులవారు ఒక రాజసౌధమును నిర్మించినారు. దర్బారు సర్వ సుందరముగా మనోహరముగా అలంకరింపబడియున్నది. నారదుడు, తుంబురుడు, గోపుడు, స్వయముగా వచ్చి గానము చేసినారు. అప్సరసలు నాట్యము చేసినారు. రాజుగా నున్నచో ఇట్టి భోగములను ఎల్లప్పుడు అనుభవింపవచ్చు నని కన్నులకు కట్టినట్లు భరద్వాజులవారు భరతునికి చూపించినారు. భరతుని మనస్సు చలింపలేదు. భరతుడు పరీక్షలో ఉత్తీర్ణుడైనాడు. ధీరాత్ముడైన భరతునికి జేజేలు. సైనికులు అల్పమతులు కావున "భరతుడు ఎట్లు పోయినను సరే. రాముడు ఏమైనను సరే. మనము సుఖముగా నుండుటయే చాలును" అని భావించినారు.

సుఖములలో చిక్కుపడి కర్తవ్యమును మరచిపోవుట క్రొత్త విషయము కాదు.]

రాత్రి యంతయు ఇట్లు గడచిపోయినది. తెల్లవారుసరికి అన్నియు మాయమై పోయినవి. కొన్ని పూదండలు మాత్రము నలిగి అచ్చటచ్చట పడియుండినవి.

## భరతుడు భరద్వాజునియొద్ద సెలవు గైకొని చిత్రకూటమునకు పోవుట

మరునాడు ప్రొద్దున భరతుడు భరద్వాజునకు నమస్కరించి

**భరతుడు :** స్వామీ ! మీ ప్రసాదమువలన రాత్రి సుఖముగా గడచినది. నేను రాముని చెంతకు పోవలయును. సెలవు దయచేయుడు. చల్లనిచూపు చూచి నన్ను అనుగ్రహింప వేడుచున్నాను. శ్రీరాముని ఆశ్రమమునకు మార్గ మెద్ది ?

**భరద్వాజుడు:** భరతా ! అడవిలో రెండున్నర ఆమడ నడతువేని చిత్రకూటపర్వతము కనబడును. దాని ఉత్తరపార్శ్వమున మందాకినీనది ప్రవహించుచుండును. రామలక్ష్మణుల పర్ణశాల ఆ ప్రదేశమున ఉన్నది. దక్షిణముగాగాని నిర్భతి దిక్కునగాని సైన్యమును నడిపింపుము. ఆ మార్గము ననుసరించి వెళ్ళినయెడల శ్రీరాముని చూడవచ్చును.

కౌసల్య, సుమిత్ర, కైకేయి, భరద్వాజునికి నమస్కరించుటకు వెళ్లినారు. కౌసల్య, సుమిత్ర మునిపాదములకు నమస్కరించినారు. కైకేయి మిక్కిలి సిగ్గుపడి నమస్కారము చేసి మునికి ప్రదక్షిణము చేసి భరతునిప్రక్కన నిలబడినది.

భరద్వాజుడు ఊరకుండునా ! "మీతల్లులను పరిచయము చేయుము" అని భరతుని అడిగినాడు.

**భరతుడు :** నిద్రాహారములులేక కృశించి దీనయైయున్న ఈ సాధ్వియే కౌసల్య, దశరథమహారాజు పట్టమహిషి. మహాత్ముడగు శ్రీరాముని కన్నతల్లి. ఆమె వామహస్తమును పట్టుకొని యున్న ఆ తపస్వినియే సుమిత్ర. లక్ష్మణ శత్రుఘ్నుల తల్లి.

ఎవ్వతెవలన ఈ కష్టము లన్నియు ప్రాప్తించినవో ఆ క్రూరచిత్త ఇదిగో ఈమెయే నా తల్లి కైకేయి.

**భరద్వాజుడు :** భరతా ! కైకేయియందు దోషమున్నదని భావింపకుము. రాముని అడవికి పంపుటవలన ముమ్ముందు మిక్కిలి సుఖము కలుగును. ఈ కార్యము దేవతలకు, ఋషులకు, లోకమునకు, హితమునే చేకూర్చగలదు.

న దోషేణావగంతవ్యా కైకేయీ భరత త్వయా
రామ ప్రవ్రాజనం హ్యేత త్సుఖోదర్కం భవిష్యతి 92-29

దేవానాం దానవానాంచ ఋషీణాం భావితాత్మనామ్
హిత మేవ భవిష్యద్ధి రామప్రవ్రాజనాదిహ 92-30

భరతుడు భరద్వాజునికి ప్రదక్షిణము చేసి ఆ మహర్షి ఆశీర్వాదమును పొంది బయలుదేరినాడు. అందరు ఉత్సాహముతో ఉన్నారు. భరతుని సైన్యమును చూచి అరణ్యములోని ఏనుగులు, యెలుగుబంట్లు జింకలు మొదలైన మృగములు భయపడి దిక్కుతోపక పరుగిడుచున్నవి. భరతుని సైన్యము అపారముగా నున్నది.

కొంతదూరము ప్రయాణము చేసినపిదప భరతుడు వసిష్ఠునితో అనుచున్నాడు.

*భరతుడు :* భరద్వాజమహర్షి నిర్దేశించిన ప్రదేశము ఇదిగానే యుండును. ఎంతో మనోహరముగా నున్నది. ఈ వృక్షములమీది పుష్పములు తిలకింపుడు. దక్షిణ దేశములో పురుషులు తలవెండ్రుకలను పలకలుగా తీర్చి పుష్పములు ధరించునట్లు కనబడుచున్నది ఆ దృశ్యము.

కుర్వంతి కుసుమాపీడాన్ శిరస్సు సురభీ నమీ
మేఘప్రకాశైః ఫలకై ర్దాక్షిణాత్యా యథా నరాః 93-13

[ఈ అలంకార విశేషమును ఇప్పుడుకూడ కొన్నిచోట్ల చూడవచ్చును]

(శత్రుఘ్నుని చూచి) తమ్ముడా! చూచితివా! శ్రీరాముని సందర్శించు సంతోషమున మన రథాశ్వములు ఎంత వడిగా పరుగెత్తుచున్నవో! ఈ ప్రదేశము తాపసులు నివసించు ప్రదేశము కాబోలు! మిక్కిలి మనోహరముగా నున్నది. ఈ మార్గము స్వర్గమార్గ మని అనిపించుచున్నది.

[శ్రీరాముని చెంతకు తీసికొనిపోవు మార్గము స్వర్గ మార్గమువలె ఉండుటలో ఆశ్చర్యమేమున్నది! శ్రీరాముని సాన్నిధ్యమునకు మించిన స్వర్గ మొకటి కలదా!]

**అతిమాత్ర మయం దేశో మనోజ్ఞః ప్రతిభాతి మే**
**తాపసానాం నివాసోఽయం వ్యక్తం స్వర్గ పథో యథా** 93-18

*భరతుడు :* మన సైనికులు కొందరు బయలుదేరి రామలక్ష్మణులున్న ప్రదేశమును వెదకుదురు గాక!

సైనికులు వెదకుటలో ఒకచోట పొగ కనిపించినది. ఆ సంగతిని వారు భరతునికి తెలిపినారు. "రామలక్ష్మణులో ఇతర తాపసులో అక్కడ తప్పక ఉందురు" అని చెప్పినారు.

*భరతుడు :* (సైనికులతో) మన సైన్య మంతయు ఇక్కడనే ఆగి నిశ్శబ్దముగా ఉండవలయును. నేను మాత్రము సుమంత్రుని వసిష్ఠులవారిని కూడి నడచెదను.

సైన్యము అచ్చటనే నిలిచిపోయినది. సైనికులును, భరతుడును తమ చూపులు పొగవైపు ఆనించినారు.

## చిత్రకూటమున సీతారాములు

సీతారామలక్ష్మణులు చిత్రకూటము చేరి రమారమి ఒకనెల అయినది. సీతారాములు ఆనందముగా ఉన్నారు. మధురభాషణములతో కాలము సుఖముగా గడపుచున్నారు.

**రాముడు :** సీతా! ఈ పర్వతమును చూచితివా! ఎంతో రమణీయముగా నున్నది. దీనిని చూచి ఆనందించుటవలన రాజ్యము పోయినదనిగాని మిత్రులను వీడి వచ్చితినని గాని నా కెట్టి బాధయు కలుగుటలేదు. ఈ పర్వతప్రదేశములను తిలకింపుము.

కొన్ని ధవళములై వెండివలె శోభిల్లుచున్నవి. కొన్ని కెంపువర్ణముతో భాసించుచున్నవి. కొన్ని పసుపురంగుకలిగి (బంగారమువలె) రంజిల్లుచున్నవి. కొన్ని ఇంద్రనీల నిభములుగను కొన్ని పుష్యరాగముల చందమునను, కొన్ని మొగిలిపువ్వు రంగుతోను, మరికొన్ని నక్షత్రములవలెను ప్రకాశించుచున్నవి చూడుము.

సీతా! ఈ పర్వతము నా మనస్సును హరించుచున్నది. ఆ వృక్షసంపదను చూచితివా? ఇక్కడలేని వృక్షములుగాని పుష్పములుగాని లోకమునలేవు. ఆ సెలయేళ్లను తిలకింపుము. రమ్యముగా ప్రవహించుచున్నవి. ఇక్కడి మారుతము పుష్ప సుగంధములతోకూడి హాయిగా వీచుచున్నది. ఇక్కడ నీతోను, లక్ష్మణునితోను, ఎన్ని సంవత్సరము లున్నను, నాకు దుఃఖ మనుమాట తోపదు.

ఈ వనవాసమువలన రెండు ఫలములు చేకూరినవి. తండ్రి ఋణము తీర్చుట యొకటి. భరతునికి సంతోషము కలిగించుట మరియొకటి.

దేవీ! ఇచ్చట నీకు సంతోషముగా నున్నదా? మా పెద్ద లందరు ఈ వనవాసమును అమృత మని స్తుతించినారు. ఈ ప్రదేశమున నీలము, పసుపు, తెలుపు, యెఱుపు మున్నగు రంగులరాళ్లు వందలకొలది తళతళలాడుచున్నవి చూడుము.

[నవరత్నములు తళుకురాళ్లు మాత్రమే అన్నమాట]

శిలాశ్శైలస్య శోభంతే విశాలా శ్శతశోఽభితః
బహులా బహులై ర్వర్ణై ర్నీలపీతసితారుణైః 94-20

సీతా! ఇక్కడి ఓషధులు రాత్రివేళల మెఱయుచుండును. కొన్ని ప్రదేశములు గృహముల వలెను, మరికొన్ని ప్రదేశములు ఉద్యానవనముల వలెను ఎంతో అందము లొలుకుచున్నవి. ఇచ్చట ఫలమూలములకు కొరతలేదు. ఈ ప్రదేశము అలకాపురిని సౌగంధిక సరస్సును (కుబేరుని సరస్సు) ఉత్తర కురుదేశములను మించియున్నది.

వనవాసము పదునాలుగు సంవత్సరములు మన మిచ్చటనే సుఖముగాను, సంతోషముగాను గడపవచ్చును.

సీతారాములు పర్వతము పై నుండి దిగి మందాకినీ నదివైపు మరలినారు.

రాముడు : సీతా! ఈ నదిని చూడుము. హంసలు, పద్మములు ఎంత హృదయంగమములుగా నున్నవి! ఈ నదికి జింకలగుంపులు నీటికై వచ్చుచుండును. ఈ మందాకినీనది నాకెంతో ప్రీతికరముగా నున్నది. నదీతీరములయందలి వృక్షములు, పుష్పములను పత్రములను నదిలోనికి వెదజల్లుచున్నవి. నదీజలములు కొన్నిచోట్ల ముత్యముల ప్రోవులవలె కానబడుచున్నవి. మన మిక్కడ జలక్రీడలాడుకొనవచ్చును.

సీతా! నామాట శ్రద్ధతో వినుము. ఈ అడవి మృగములు పురజనులు గాను, చిత్రకూట పర్వతము అయోధ్యగాను, మందాకినీ నది సరయూనది గాను ఎల్లప్పుడు భావించుకొనుము.

త్వం పౌరజనవ ద్వ్యాళా నయోధ్యా మివ పర్వతం
మన్యస్వ వనితే నిత్యం సరయూ వదిమాం నదీమ్. 95-15

నీవును లక్ష్మణుడును నాకెంతో అనుకూలురై సంతోషము కలిగించుచున్నారు. ఇక్కడ త్రికాలములయందు స్నానములు చేయుచు మధురము లగు ఫలమూలముల నారగించుచు నీతోకూడ సుఖముగా నివసింపగలిగినందున నాకు అయోధ్యమీదికిగాని రాజ్యముపైకిగాని మనస్సు మరలుటలేదు.

ఇట్లు మాటాడుకొనుచు ఇద్దరు పర్వతప్రాంతముల విహరించి కొంతసేపైన పిదప ఒక గిరిప్రస్థమున కూర్చుండినారు. శ్రీరాముడు సీతాదేవిచే ఆహారము తినిపించుచు తియ్యని పలుకులు పలుకుచున్నాడు.

ఈ లోపల భరతుని సైన్యముల శబ్దము వినిపించినది. అడవిలోని ఏనుగులు మొదలైన మృగములు దిక్కుతోపక పరుగెత్తుచుండినవి.

[ఈ ఘట్టమున కొన్ని సంగతులు గమనింప దగియున్నవి. శ్రీరాముడు సీతాదేవికి చెప్పిన మాటలు పలుమారు చదువ దగియున్నవి. సన్నివేశమును గమనింతము.

శ్రీరాముని అయోధ్యకు తీసికొని పోవుటకు భరతుడు వచ్చుచున్నాడు. అతనివెంట అంతఃపుర స్త్రీలు, పురజనులు, సైన్యములు, నడచుచున్నారు. గుఱ్ఱములు, ఏనుగులు వచ్చుచున్నవి. అయోధ్యానగరము అడవికి నడచి వచ్చిన దన్నమాట. వీని నన్నిటిని చూచి రాజ్యము మీదికిగాని, రాజ్య భోగములమీదికిగాని, తనకుగాని, సీతాదేవికిగాని మనస్సు మరలు నేమో!

వనవాసమును గురించి తనకు దుఃఖ మేమియు లేదని శ్రీరాముడు సీతాదేవితో చెప్పినాడు. వనవాసము వలన అనేక శుభములు కలుగుననియు చెప్పినాడు.

సీతాదేవి మనస్సు ఎట్లున్నదో మరి! అందుకొరకు ఈ సంభాషణ సాగించినాడు.

రాళ్లను చూపించి రత్నము లన్నాడు. నీటి బిందువులను ముత్యములన్నాడు. అడవిని అలకాపట్టణ మన్నాడు. సీతాదేవిని రాణిగా సంబోధించినాడు. అర్థమైనదో కాలేదో అని వాచ్యముగా చెప్పినాడు. అడవి మృగములను పురజనులుగాను, చిత్రకూటమును అయోధ్యగాను, మందాకినీ నదిని సరయూ నదిగాను భావింపు మన్నాడు. "నీవు నేను మనసులు కలుపుకొని ఆడుచు పాడుచు కాలక్షేపము చేయుచున్నయెడల ఎన్ని సంవత్సరములైనను ఇక్కడ సుఖముగా గడపవచ్చును. అయోధ్యకంటె అడవియే మేలు" అని చెప్పుచున్నాడు.

ఈ విషయములు సీతాదేవికి తెలియనివికావు. వనవాసమునకు బయలుదేరునప్పుడు ఈ మాట లన్నియు సీతాదేవియే శ్రీరామునికి చెప్పినది. అయినను మరల జ్ఞప్తికి తెచ్చుకొనుచున్నారు. భరతుడు వచ్చు సమయమున సీతారాముల మనస్సులు వనవాసముమీద దృఢముగా ఆనియున్న వన్నమాట. శ్రీరాముని మాటలను మరియొకనూరు చదువుట మంచిది.]

## శ్రీరాముని పంపున లక్ష్మణుడు సాలవృక్షము నెక్కుట

సీతారాములు ఆశ్రమమునకు వచ్చినారు. భరతుని సైన్యపు టలికిడి మెండుగా నుండినది. రాముడు విని లక్ష్మణునితో అనుచున్నాడు.

**రాముడు:** లక్ష్మణా! గొప్ప శబ్దము వినవచ్చుచున్నది. కారణ మేమై యుండును?

లక్ష్మణుడు ఎత్తైన ఒక సాలవృక్షము నెక్కి నలుదిశలు పరికించినాడు.

ఉత్తరపువైపు ఒక గొప్ప సైన్యము కనబడినది.

**లక్ష్మణుడు:** రామా! అగ్నిని చల్లార్పుము. సీతాదేవిని గుహలో చేర్పుము. కవచమును ధరించి ధనుస్సును సజ్యము చేసి బాణములను గైకొనుము.

**రాముడు:** ఆసైన్య మెవరిదో గమనింపుము.

**లక్ష్మణుడు:** (కోపముతో మండిపడుచు) ఎవ్వరిదోకాదు ఆ భరతునిదే! రథముపై కోవిదారధ్వజము కనబడుచున్నది. పట్టాభిషేకము చేసికొని, అంతటితో తృప్తి జెందక, మనలను వధించుటకు అడవికికూడ వచ్చినాడు. మనము ఆయుధములను ధరించి సంసిద్ధులమై యుండవలయును. మన కష్టము లన్నింటికి కారకుడు ఈ భరతుడే! మన కింతటి అపకారము కావించిన భరతుని వధించుటలో దోష మేమియులేదు. నేను భరతుని వధించి నీకు రాజ్య మిప్పించెదను. కైకేయిని కూడ కడతేర్చెదను. అందరిని వధించి పుచ్చెదను. ఈ అడవి నంతయు వారి

రక్తముతో తడిపివేయుదును. నా ధనుర్బాణముల ఋణమును తీర్చుకొని యెదను.

రాముడు: (లక్ష్మణుని ఓదార్చుచు) తమ్ముడా! భరతుడు స్వయముగా వచ్చుచున్నాడు గదా! ఇప్పుడు ధనుర్బాణములతో పనియేమి? మనము పితృవాక్య పరిపాలనకు గదా అరణ్యమునకు వచ్చినది! ఇప్పుడు భరతుని వధించి రాజ్యమును గైకొనుటలో అర్థమేమైన గలదా! మొదటిమాట - నాకు రాజ్యముతో పని యేమి? మీకొరకేగాని నాకు రాజ్య మెందుకు? అందులో అధర్మము నవలంబించి ఇంద్ర పదవినైనను అంగీకరింపను. ఇంతకును, ఆలోచించి చూడగా భరతుడు మన దుర వస్థను విని దుఃఖపడి మనలను చూచుటకు వచ్చుచున్నట్లే కనబడుచున్నది. తల్లిని నిందించి తండ్రిని ప్రార్థించి నాకు రాజ్యమిప్పించుటకే వచ్చియుండును. మనకు కీడు చేయవలె నని భరతుడు మనసా కూడ తలపడు. భరతుని విషయమున నీకు సందేహ మెందుకు కలిగినది? ఇంతకు పూర్వ మెప్పుడైనను భరతుడు మనకు అపకారమును తలపెట్టియుండెనా? భరతునిగురించి పరుషముగా పలుకుట తగదు. భరతుని దూషించుట నన్ను దూషించినట్లే!

[తన భక్తులమీద శ్రీరామునికి ఎంతదయ! భక్తునికి కలిగిన అపకారము తనకైనట్లే భావించును శ్రీరాముడు.]

అస్మాసు మనసాప్యేష నాప్రియం కించి దాచరేత్. 97-13

విప్రియం కృతపూర్వం తే భరతే న కదాను కిం
ఈదృశం వా భయంతేఽద్య భరతం యోఽత్ర శంకసే. 97-14

న హితే నిష్ఠురం వాచ్యో భరతో నాప్రియం వచః
అహం హ్యప్రియముక్తస్స్యాం భరతస్యాప్రియే కృతే. 97-15

లక్ష్మణా! ఏదేని ఒక ఆపద కలిగినను తండ్రినిగాని అన్నదమ్ములనుగాని వధించుకొందురా ఎవ్వరైన? ఒకవేళ రాజ్యకాంక్షతో నీ విట్లు పలుకుచుంటివికాబోలు! భరతునితో "రాజ్యమును లక్ష్మణున కిమ్ము" అని మాటమాత్ర మన్న యెడల భరతుడు రెండవమాట పలుకకయే వెంటనే "సరే" అని రాజ్యమును నీ కీయడా! ఇంతమాత్రము నకు అంత కావలయునా!

యది రాజ్యస్య హేతోస్త్వ మిమాం వాచం ప్రభాషసే
వక్ష్యామి భరతం దృష్ట్వా రాజ్య మస్మై ప్రదీయతామ్. 97-17

ఉచ్యమానోఽపి భరతో మయా లక్ష్మణ తత్త్వతః
రాజ్యమస్మైప్రయచ్ఛేతి బాఢమిత్యేవ వక్ష్యతి. 97-81

ఈ మాటలు విన్న లక్ష్మణునికి మిగుల సిగ్గయినది. మాట తప్పించుటకు రామునితో అనుచున్నాడు.

లక్ష్మణుడు : రామా! ఒకవేళ మన తండ్రియే నిన్ను చూచుటకు వచ్చుచున్నాడు కాబోలు!

రాముడు : (లక్ష్మణుని సిగ్గును గుర్తించి) అవును. అట్లే అయియుండును. మనలను అయోధ్యకు తోడ్కొని పోవుటకే వచ్చుచుండును. తుదకు సీతనైనను తీసికొని పోవునేమో! మన తండ్రిగారి ఏనుగు 'శత్రుంజయము' సేనకు అగ్రభాగమున నడచుచున్నది చూడుము. కాని, తండ్రిగారి శ్వేతచ్ఛత్రముమాత్రము కానబడుటలేదు. కావున సందేహముగా నున్నది. ఇక చెట్టుమీదినుండి దిగుము.

లక్ష్మణుడు ఎట్లో తప్పించుకొని బయటపడినాడు.

## భరతుడు రామాశ్రమమునకు వచ్చుట

భరతుడు తన సైన్యమును దూరముగా నిలిపి శత్రుఘ్నునితో

భరతుడు : తమ్ముడా! నీవు బోయవారిని వెంటబెట్టుకొని అడవియంతయు వెదకుము. గుహుడుకూడ తనవారి సాయముతో వెదకగలడు. నేను వసిష్ఠుని, మంత్రులను కూడి అరణ్యమున నడచి రాముని ఆశ్రమమును వెదకెదను. సీతారామలక్ష్మణులను సందర్శించినగాని నాకు శాంతి లభింపదు. రాజచిహ్నములతో కూడిన శ్రీరామ పాదములకు శిరసా మ్రొక్కి రాజ్యమును రామునికి సమర్పించి శ్రీరామునికి పట్టాభిషేకము చేయువరకు నాకు శాంతి కలుగదు.

యావన్న చరణౌ భ్రాతుః పార్థివవ్యంజనాన్వితౌ
శిరసా ధారయిష్యామి నమే శాంతి ర్భవిష్యతి. 98-8

యావన్నరాజ్యే రాజ్యార్హః పితృపైతామహే స్థితః
అభిషేకజలక్లిన్నో నమే శాంతి ర్భవిష్యతి. 98-9

తమ్ముడా! సీతాదేవియును లక్ష్మణుడును ఎంత ధన్యులు! శ్రీరాముని సందర్శించుచు అతనికి పరిచర్యలు చేయగల భాగ్యము వారికి లభించినది. ఈ చిత్రకూట పర్వతముకూడ ఎంతో పుణ్యము చేసికొన్నది గనుకనే రాముడు ఇక్కడ నివసించుచున్నాడు. రాముడు ఇచ్చట నివసించుచున్నందున ఈ అరణ్యసీమయు కృతార్థ యైనది.

ఈమాటలు తమ్మునితో చెప్పి భరతుడు పాదచారియై అరణ్యములో ప్రవేశించినాడు. అట్లు నడచుటలో దూరముగా పొగ కనిపించినది.

[లక్ష్మణునిమాట విని అగ్నిని చల్లార్చియుండిన ఎంత చిక్కు!]

ఆ పొగ గోచరించిన చోటనే రామాశ్రమము ఉండునని సంతోషించి భరతుడు వడిగా నడచినాడు. వసిష్ఠునితో "స్వామీ! నేను ముందుగా వెళ్లుచున్నాను. మీరు మా తల్లులను పిలుచుకొని నెమ్మదిగా రండు" అని చెప్పినాడు. శత్రుఘ్నుడు, సుమంత్రుడు భరతుని వెంబడించినారు. కొంతదూరము నడచి ఆశ్రమమును గుర్తుపట్టినారు. అడవిలో మార్గమును తెలిసికొనుటకు వీలుగా చెట్లకు కట్టబడియుండిన దర్భలు, నారచీరలు కనబడినవి.

*భరతుడు* : (సంతోషముతో) భరద్వాజ మహర్షి సూచించిన ప్రదేశము ఇదిగానే తోచుచున్నది. మందాకినీనదియు సమీపముననే ఉండును. ఈ దర్భలను నారచీరలను లక్ష్మణుడే కట్టియుండును. ఈ గుర్తులు లేనియెడల, వేళకానివేళయందు నదికి జలముకొరకు రావలసియున్నచో ఇబ్బంది కలుగును.

ఇట్లు నడచుటలో మందాకినీనది కనిపించినది.

*భరతుడు* : ఎట్టి కష్టకాలము వచ్చినది! శ్రీరాముడు సమస్త భోగములను త్యజించి ఇట్లు అరణ్యవాసము చేయుచుండుటకు నేనే కారకుడను. అందరు నన్ను నిందించుచున్నారు - నేను సీతారామలక్ష్మణుల పాదముల నాశ్రయించెదను. రాముని ప్రార్థించి అయోధ్యకు తీసికొనిపోయెదను.

పర్ణశాల కనబడినది. పర్ణశాలలో జటామండలధారియై దర్భలు పరచుకొని కూర్చుండియున్న శ్రీరాముని భరతుడు చూచినాడు. సీతాదేవియును, లక్ష్మణుడును రాముని సమీపమున ఉన్నారు.

తంతు కృష్ణాజినధరం చీరవల్కల వాససమ్
దదర్శ రామ మాసీన మభితః పావకోపమమ్. 99-26

సింహస్కంధం మహాబాహుం పుండరీక నిభేక్షణమ్
పృథివ్యా స్సాగరాంతాయా భర్తారం ధర్మచారిణమ్. 99-27

ఉపవిష్టం మహాబాహుం బ్రహ్మాణమివ శాశ్వతమ్
స్థండిలే దర్భసంస్తీర్ణే సీతయా లక్ష్మణేన చ. 99-28

భరతునికి దుఃఖము వచ్చినది. అన్నదగ్గరకు పరుగెత్తుకొని వెళ్ళినాడు. మాటలు తడబడి పోవుచున్నవి. "నా వలన ఎంత కష్టము కలిగినది! నా బ్రతు కెందుకు!" అని విలపించినాడు.

మన్నిమిత్త మిదం దుఃఖం ప్రాప్తో రామ స్సుఖోచితః
ధిగ్జీవితం నృశంసస్య మమ లోక విగర్హితమ్. 99-36

ఇత్యేవం విలపన్ దీనః ప్రస్విన్న ముఖపంకజః
పాదావ ప్రాప్య రామస్య పపాత భరతోరుదన్. 99-37

భరతుని కన్నులనిండ అశ్రుషులు క్రమ్మినవి. శ్రీరాముని పాదములను చేరలేక విలపించుచునే క్రింద పడిపోయినాడు. "ఆర్యా" అని మాత్రము పలికినాడు. ఆ పైని మాట రాలేదు.

భరతుడు జటలు దాల్చి నారచీరలు కట్టుకొని కృశించి యున్నాడు. క్షణకాలము రాముడు భరతుని గుర్తుపట్టలేదు. ఆ తరువాత రాముడు భరతుని లేవనెత్తి కవుగిలించు కొని ఒడిలో కూర్చుండ బెట్టుకొన్నాడు.

జటిలం చీరవసనం ప్రాంజలిం పతితం భువి
దదర్శ రామో దుర్దర్శం యుగాంతే భాస్కరం యథా. 100-1

కథంచి దభివిజ్ఞాయ వివర్ణవదనం కృశమ్
భ్రాతరం భరతం రామః పరిజగ్రాహ బాహునా. 100-2

ఆఘ్రాయ రామస్తం మూర్ధ్ని పరిష్వజ్య చ రాఘవః
అంకే భరతమారోప్య పర్యపృచ్ఛ త్సమాహితః 100-3

రాముడు: నాయనా! నీవు అడవికి వచ్చుటకు కారణ మేమి! తండ్రి జీవించి యుండగా నీవు అడవికి రావచ్చునా! మన తండ్రికి క్షేమమేనా? లేక, దుఃఖమును భరింపజాలక లోకాంతరగతు డాయెనా! నీవు బలహీనుడవై రాజ్యమును పోగొట్టుకొనలేదుగదా!

నీ పరిపాలన చక్కగా ఉన్నదా! మన తల్లులు సుఖులై యున్నారా! మీ తల్లి కైకేయి సంతోషముగా నున్నదా! పురోహితుని పూజించుచున్నావా!

నీ మంత్రు లందరు శూరులుగాను, విద్యావంతులుగాను, సత్కులమున జన్మించిన వారుగాను, తెలివితేటలు గలవారుగాను ఉన్నారా?

కచ్చిదాత్మసమాశ్శూరా శ్శ్రుతవంతో జితేంద్రియాః
కులీనాశ్చేంగితజ్ఞాశ్చ కృతాస్తే తాత మంత్రిణః 100-15

భరతా! మంత్రులు మంచివారు కానియెడల రాజు చిక్కులపాలగుట నిశ్చయము.

అల్ప ప్రయత్నముతో ఎక్కువ లాభము నిచ్చు పనులను వెంటనే చేయవలెను. రహస్యములు వెలికి రాకుండునట్లు రక్షించుచున్నావా? వేయిమంది మూర్ఖులకన్న ఒక్క పండితుడు మేలని గమనించి, మూర్ఖులను చేరదీయకుంటివా? గొప్ప కార్యము

లకు గొప్పవారిని చిన్నపనులకు సామాన్యులను, వారివారి యోగ్యతలకు తగిన పనులయందు నియమించుచున్నావా ?

మంత్రుల విషయములో, వారిని పరీక్ష చేసి, వారి వంశపు మంచి చెడ్డలను విచారించి ఎన్నుకొనుచుంటివా.

అమాత్యానుపథాతీతాన్ పితృ పైతామహాన్ శుచీన్
శ్రేష్ఠాన్ శ్రేష్ఠేషు కచ్చిత్త్వం నియోజయసి కర్మసు. 100-26

[వంశమునకు ఎంత ప్రాధాన్యము నిచ్చినారో గమనింప దగియున్నది. మన మంచి మన బిడ్డలకు ఎంతో ఆధారము - రెండవ మాట చెప్పనవసరము లేదు. కాబట్టి మన బిడ్డల క్షేమము కొరకైనను మనము మంచిగా ఉండుట మన కర్తవ్యము.]

భరతా ! నీవు ప్రజలకు తీవ్రదండనలు విధించి బాధించుచుండగా నీ మంత్రులు ధైర్యమూని నిన్ను నివారించుచున్నారా ? నీవు పన్నులు ఎక్కువగా విధించుట లేదు గదా ? రాజద్రోహులను దండించు చుంటివా. నీ సేనాపతి సమర్థుడేనా? భృత్యులకు వేతనము లిచ్చుటలో ఆలస్యము చేయుటలేదుగదా ! సకాలమున జీతము లీయని యెడల పెక్కు అనర్థములు కలుగును.

కాలాతిక్రమణాచ్చైవ భక్తవేతనయో ర్భృతాః
భర్తుః కుప్యంతి దుష్యంతి సోఽనర్థస్సుమహాన్ స్మృతః 100-33

దూతలను చక్కగా పరీక్షించి ఎన్నుకొనుచుంటివా ! యోగ్యు లగువారినిగా చూచి చారులను నియమించుచుంటివా ?

నాస్తికు లగు బ్రాహ్మణులను సేవించుట లేదుగదా! అయోధ్యను చక్కగా పరిపాలించుచున్నావా ? నీ ప్రజలు సుఖముగా ఉన్నారా ! కృషికులు, గోరక్షణ చేయువారు నీయందు మంచిమనస్సు కలిగియున్నారా ?

వర్తకులను రక్షించుచున్నావా ? ప్రజల సుఖము వర్తకముమీద ఆధారపడి యుండును.

కచ్చిత్తే దయితా స్సర్వే కృషి గోరక్షజీవినః
వార్తాయాం సంశ్రితస్తాత లోకో హి సుఖమేధతే. 100-47

స్త్రీలకు రహస్యము లేవియు చెప్పవుగదా ! నాగవనమును రక్షించుచున్నావా !

అనుదినమును ఉదయమున ప్రజలకు సభయందు దర్శన మొసగుచుంటివా. ఆయుధశాలలు ఆయుధములతో నిండియున్నవా ? ధనమును వెచ్చించుటలో మెలకువ కలిగియున్నావా ?

నీ రాజ్యములోని అధికారులు లంచములు పుచ్చుకొని అన్యాయము చేయరు గదా? దరిద్రుడు, ధనికుడు అని పక్షపాతములు పెట్టుకొనక న్యాయమును విచారించుచున్నారా? న్యాయవిచారణ చక్కగా జరుపక, లేనినేరము మోపబడినవారిని రాజు తన ఇచ్చచొప్పున దండించునేని, అట్టి నిరపరాధుల కన్నీరు రాజుయొక్క పుత్రులను, పశుధనమును, సమస్త సంపదలను నశింపజేయును.

యాని మిథ్యాభిశస్తానాం పతంత్యస్రాణి రాఘవ
తాని పుత్ర పశూన్ ఘ్నంతి ప్రీత్యర్థ మనుశాసతః 100-59

భరతా! ధర్మార్థకామములను ఒకదానికొకటి హాని కలిగింపనట్లు యుక్తకాలములయందు సేవించుచున్నావా! పదునాలుగు రాజదోషములను విడిచిపెట్టితివా? రాజనీతిశాస్త్రమును అనుసరించుచుంటివా? మన పూర్వులు నడచిన సన్మార్గముననే నడచుచుంటివా? రాజు బుద్ధికుశలుడై ప్రజాక్రమశిక్షణ భారమును వహించి రాజ్యమును న్యాయబుద్ధితో పాలించినయెడల ఉభయలోకములందును క్షేమపడును.

రాజా తు ధర్మేణ హి పాలయిత్వా
మహామతి ర్దండధరః ప్రజానామ్
అవాప్య కృత్స్నాం వసుధాం యథా వ
దితశ్చ్యుత స్స్వర్గ ముపైతి విద్వాన్. 100-76

[యోగక్షేమముల నడుగు నెపమున శ్రీరాముడు భరతునికి చక్కని రాజనీతిని బోధించినాడు. భరతుని రాజుగానే భావించి శ్రీరాముడు మాటాడుచున్నాడు. తన స్థితిగతులను తెలుపుకొనుటకు భరతునికి అవకాశము చిక్కక తనకు తట్టని క్రొత్త చిక్కు సంభవించినది పాపము!]

ఈ మాటలు చెప్పి భరతుని కవుగిలించుకొని శ్రీరాము డనుచున్నాడు.

*రాముడు :* తమ్ముడా! ఈ జట లేమిటి! ఈ నారచీర లేమిటి! నీవు రాజ్యమును వదలిపెట్టి యీవేషముతో అడవికి వచ్చుట కేమికారణము?

*భరతుడు :* రామా! పుత్ర వియోగమును భరింపలేక మన తండ్రి స్వర్గస్థుడైనాడు. పాపిష్ఠురాలైన నా తల్లి తాను కోరిన రాజ్యమును పొందలేదు సరికదా, భర్తనుకూడ పోగొట్టుకొనినది. దాసుడనైన నన్ను అనుగ్రహింపుము. నీ విప్పుడే పట్టాభిషేకము చేసికొనుము.

తస్య మే దాస భూతస్య ప్రసాదం కర్తు మర్హసి
అభిషించ స్వ చాద్యైవ రాజ్యేన మఘవానివ. 101-8

ప్రజలందరు నీపట్టాభిషేకమును కోరుచున్నారు. విధవలైన మన తల్లులుకూడ దానినే కోరుచున్నారు. నీవు మమ్ముల నందరను అనుగ్రహించి మాకోర్కెను తీర్పుము. నేను మంత్రులతోకూడి శిరసా యాచించుచున్నాను. నీదాసుని మొర ఆలకింపుము.

ఏభిశ్చ సచివైః స్సార్థం శిరసా యాచితో మయా
భ్రాతు శ్శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తు మర్హసి. 101-12

ఈ మాటలు పలికి రాముని పాదములకు శిరసా మ్రొక్కి సాష్టాంగనమస్కారము చేసినాడు.

*రాముడు :* (నిట్టూర్పులు పుచ్చుచు భరతుని కవుగిలించుకొని) భరతా! నీయందు దోష మేమియు లేదని నే నెరుగుదును. నీవు అనవసరముగా నీ తల్లిని దూషించుట సరికాదు. దశరథుడు మన తండ్రి. మన మందరము వారి ఆజ్ఞకు లోబడవలసిన వారమే. నాకు రాజ్య మిచ్చుటకుగాని నన్ను అరణ్యమునకు పంపుటకుగాని మన తండ్రి సర్వాధికారి. రాజ్యమును నీకు ప్రసాదించి నన్ను అరణ్యావాసము చేయుమని ప్రజలయెదుట చెప్పి మనతండ్రి స్వర్గస్థుడైనాడు. మన మిద్దరము వారి ఆజ్ఞను పాలింపవలయును. వారిమాట ననుసరించి నీవు రాజ్యము నేలుము. నేను అరణ్యావాసము చేసెదను. ఇదియే ధర్మము.

*భరతుడు :* నీ సేవను పరిత్యజించి ధర్మవిహీనుడనైన నాకు రాజధర్మముతో పని యేమి?

కిం మే ధర్మా ద్విహీనస్య రాజధర్మః కరిష్యతి. 102-1

జ్యేష్ఠుడు రాజగుటకదా ధర్మము. మన వంశమున కనిష్ఠు డెన్నడైనను రాజ్యమును పాలించియున్నాడా! నీవు నాతో అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడవు కమ్ము.

ఇప్పుడు మనతండ్రికి జలతర్పణము చేయవలసియున్నది. నేనును శత్రుఘ్నుడును ఇదివరకే చేసితిమి. నీవును లక్ష్మణుడును చేయవలసియున్నది.

## రామలక్ష్మణులు దశరథునికి జలతర్పణము చేయుట

ఈమాట విన్న రామునికి మూర్ఛ వచ్చినది. పడిపోయినాడు. భరత లక్ష్మణ శత్రుఘ్నులును సీతాదేవియు శ్రీరామునికి శైత్యోపచారములు చేసినారు.

*రాముడు :* (మూర్ఛదేరి కన్నీరు కార్చుచు) భరతా! ఎట్టి కష్టము కలిగినది! తండ్రికి సంస్కారము చేయుటకు కూడ నోచుకొననైతిని! నావంటి పాపాత్ముడు లోకమున ఉండడు. తండ్రికి ఉత్తరక్రియలు కావించిన మీరు ధన్యాత్ములు. దశరథుడు లేని అయోధ్యలో నేను అడుగుపెట్టను. వనవాసవ్రతము పూర్తియైనతరువాతకూడ నేను అయోధ్యకు రాను.

[భరతుని ముందటికాళ్లకు బంధములు వేసినాడు శ్రీరాముడు!]

నిష్ప్రభానా మనేకాగ్రాం నరేంద్రేణ వినాకృతామ్
నివృత్త వనవాసోఽపి నాయోధ్యాం గంతు ముత్సహే. 103-11

లక్ష్మణా! గానుగుపిండి తెమ్ము. తండ్రికి ఉదకదానము చేయుదము.

ముందు సీతాదేవి, తరువాత లక్ష్మణుడు, ఆవెనుక రాముడు. ఈ వరుసన మందాకినీ నదికి నడచి జలతర్పణము చేసినారు. తరువాత సపిండీకరణము చేసినారు. గానుగుపిండిని రేగుపండ్లతో కలిపిపెట్టి శ్రీరాముడు దుఃఖనిమగ్నుడై "తండ్రీ! దీనిని అంగీకరింపుము. మా కిప్పుడు ఇదియే ఆహారము. మేము దేనిని భుజింతుమో దానినేగదా దేవతలకు పెట్టగలము" అని ప్రార్థించినాడు.

ఇదం భుజ్క్ష్వ మహారాజ ప్రీతో యదశనా వయమ్
యదన్నః పురుషో భవతి తదన్నా స్తస్య దేవతాః 103-30

జలతర్పణము గావించి అందరు ఆశ్రమమునకు వచ్చినారు. శ్రీరాముడు తమ్ములను ముగ్గురిని కవుగిలించుకొన్నాడు. అందరికి దుఃఖము వచ్చినది. బిగ్గరగా విలపించినారు. ఆ రోదనధ్వని ప్రజలకు వినబడినది. అన్నదమ్ములు కలిసికొని తండ్రిని గూర్చి విలపించుచున్నారని తెలిసికొన్నారు.

## కౌసల్య మున్నగువారును అయోధ్యాపురవాసులును రాముని సందర్శించుట

ఆ ధ్వనినిబట్టి అందరు పర్ణశాలవైపు పరుగెత్తుచున్నారు. శ్రీరాముడు అరణ్యమునకువచ్చి కొద్ది దినములే అయినను అందరికిని ఎంతకాలమో అయినట్లున్నది. రాముని సందర్శించు ఉత్సాహముతో ప్రజలందరు వాయువేగమున వచ్చుచున్నారు. వారి వేగమునకు వన్యమృగములు, పశులు, భయపడి పారిపోవుచున్నవి.

అచిరప్రోషితం రామం చిరవిప్రోషితం యథా
ద్రష్టుకామో జన స్సర్వో జగామ సహసాశ్రమమ్ 103-38

జను లందరు శ్రీరాముని సందర్శించి కైకేయీ మంథరలను నిందించుచు బాష్పనేత్రులై శ్రీరాముని యెదుట నిలబడినారు. శ్రీరాముడు వారినందరిని యథాయోగ్యముగా గౌరవించి ఊరడించినాడు.

కౌసల్య మున్నగు స్త్రీలను వసిష్ఠుడు తోడ్కొని వచ్చుచున్నాడు. వారు మందాకినీ రేవుదగ్గరకు వచ్చినారు.

కౌసల్య : సుమిత్రా ! ఈ రేవును చూడుము. సీతారామలక్ష్మణులు స్నానములు చేయుట ఇచ్చటనే అయియుండును. ఇక్కడనుండియే లక్ష్మణుడు ప్రతిదినము ఆశ్రమమునకు జలము కొనిపోవుచుండును కాబోలు.

ఈ మాటలలోనే, దర్భలపై ఉంచబడిన గానుగపిండి కానబడినది. కౌసల్యకు పట్టలేని దుఃఖము వచ్చినది.

కౌసల్య : ఆహా ! శ్రీరాముడు తన తండ్రికి ఇంతకంటె పెట్టజాలకపోయెనుగదా ! ఇంతకు మించిన దుఃఖ మేమున్నది ?

అతో దుఃఖతరం లోకే న కించి త్ప్రతిభాతి మా
యత్ర రామః పితు ర్దద్యా దింగుదిక్షోద మృద్ధిమాన్. 104-13

ఇట్లు విలపించుచు అందరు ఆశ్రమమునకు వచ్చి శ్రీరాముని చూచినారు. రాముడు తల్లులకు సాష్టాంగనమస్కారములు చేసినాడు. కౌసల్య రాముని చేరదీసికొని, రాముని శరీరముమీది ధూళిని తుడిచినది. లక్ష్మణుడుకూడ తల్లులకు నమస్కరించినాడు. సీతాదేవియు వారికి నమస్కారములు చేసి దుఃఖమును పట్టజాలక పోయినది. కౌసల్య సీతాదేవిని కవుగిలించుకొని "తల్లీ ! జనకమహారాజు పుత్రివై దశరథ చక్రవర్తికి కోడలవై శ్రీరామునికి పత్నివై యుండియు నీవు ఈ నిర్జన వనమునందుండి దుఃఖము ననుభవింపవలసివచ్చినదిగదా !" అని పలికి కన్నీరుకార్చినది.

విదేహ రాజస్య సుతా స్నుషా దశరథస్య చ
రామపత్నీ కథం దుఃఖం సంప్రాప్తా నిర్జనే వనే. 104-24

శ్రీరాముడు వసిష్ఠుని పాదములకు నమస్కారము చేసినాడు. అందరు ఆసీనులైనారు.

## రాజ్యము నంగీకరింపుమని భరతుడు శ్రీరాముని ప్రార్థించుట

భరతుడు అంజలి ఘటించి రాముని ప్రక్కన కూర్చుండియున్నాడు. భరతుడు శ్రీరామునితో పలుకు పలుకులను వినుటకు ప్రజ లందరు కుతూహలముగా ఉన్నారు.

కిమేష వాక్యం భరతోఽద్యరాఘవం
ప్రణమ్య సత్కృత్య చ సాధు వక్ష్యతి
ఇతీవ తస్యార్యజనస్య తత్త్వతో
బభూవ కౌతూహల ముత్తమం తదా. 104-31

రాత్రి గడచిపోయి సూర్యోదయ మైనది. అందరు కాల్యకృత్యములు తీర్చుకొని సమావేశమైరి. సభ నిశ్శబ్దముగా ఉన్నది. భరతుడు శ్రీరామునితో భాషించుచున్నాడు.

**భరతుడు**: రామా! నీవు నా తల్లిని గౌరవించి నాకీ రాజ్యమును ప్రసాదించితివి. ఆ రాజ్యమును నేను నీకు మరల ఇచ్చుచున్నాను. గ్రహింపుము.

సాంత్వితా మామికా మాతా దత్తం రాజ్య మిదం మమ
త ద్దదామి తవైవాహం భుజ్క్ష్వ రాజ్య మకంటకమ్. 105-4

రామా! నీవుతప్ప ఈ రాజ్యభారమును ఎవ్వరుగాని భరింపజాలరు. నీవు రాజ్యము నంగీకరింపనియెడల మన తండ్రి చేసిన కృషి అంతయు నిష్ఫల మగును. ప్రజలందరు నీ పట్టాభిషేకమును కన్నులార చూచి ఆనందించుటకు కనిపెట్టుకొని యున్నారు. నీవు మా అందరి కోరికను మన్నింపుము.

**రాముడు**: భరతా! ఒక సత్యమును చెప్పుచున్నాను వినుము. పురుషుడు ఎంతమాత్రమును స్వతంత్రుడుకాడు. దైవమెట్లు నడిపించునో అట్లు నడువవలసినవారమే గాని మన ఇష్టానుసారము నడచుటకు వీలులేదు.

నాత్మనః కామకారోఽస్తి పురుషోఽయ మనీశ్వరః
ఇతశ్చేతరత శ్చైనం కృతాంతః పరికర్షతి. 105-15

జననముతోడనే మరణముకూడ ఉండును. గడచిపోయిన కాలము మరలిరాదు. నీవు కూర్చుండియున్నను నడచుచున్నను నీ ఆయువు క్షీణించుచునే యుండును. నీవు నిన్నుగూర్చి చింతపడవలసియుండగా ఇతరునిగూర్చి దుఃఖించుట తగదు. వృద్ధుడైన పిదప పురుషు డేమియు చేయజాలడు.

ఆత్మాన మనుశోచత్వం కి మన్య మనుశోచసి
ఆయుస్తే హీయతే యస్య స్థితస్య చ గతస్య చ. 105-21

లోకములోని జనులు సూర్యుడు ఉదయించువేళ సంతోషింతురు. సూర్యాస్తమయమును చూచి ఆనందింతురు. కాని గడచిపోవుచున్న ప్రతిదినమును వారిఆయువును క్షీణింపజేయుచున్న దని గుర్తింపరు. ఇట్లే క్రొత్తక్రొత్తగా పుట్టు ఋతువులను చూచి మోహితులై ఆనందించుచుందురు.

నందం త్యుదిత ఆదిత్యే నందం త్యస్తమితే రవౌ
ఆత్మనో నావబుధ్యంతే మనుష్యా జీవితక్షయమ్. 105-24

ఎక్కడనుండియో కొట్టుకొనివచ్చిన రెండు కొయ్యలు సముద్రమున కలిసికొని కొంతకాలము కలిసియుండి, తరువాత విడిపడి దేశాంతరిన అది పోవునట్లు భార్యాపుత్రులు, మనచెంత కొంతకాల ముందురు. అట్లే సంపదలు కొంతకాల ముండును. కాని ఆ సంబంధము శాశ్వతము కాదు.

వెనుకకు మరలని ప్రవాహామువలె మన వయస్సు గతించిపోవుచునే యుండును. కావున ఆత్మకు సుఖము నిచ్చు ధర్మమునే అవలంబింపవలయును. అట్లు చేయువారే మనుష్యులుగా ఎన్నికపడుదురు.

[ఇతరులసంగతి వేరుగా చెప్పనక్కరలేదు]

వయసః పతమానస్య స్రోతసోవా నివర్తినః
ఆత్మా సుఖే నియోక్తవ్య స్సుఖభాజః ప్రజాస్స్మృతాః 105-31

ఒకని మరణమును గురించి మనము దుఃఖించవలసిన పనిలేదు. మన తండ్రి యజ్ఞ యాగాదులు చేసి బహుకాలము జీవించి స్వర్గస్థుడైనాడు. తమ్ముడా! దుఃఖమును విడిచి పెట్టుము. తండ్రి ఆజ్ఞను పాలింపుము. నీవు అయోధ్యకు మరలిపొమ్ము. నేనుకూడ తండ్రి ఆజ్ఞను పాలించి అరణ్యావాసము చేయుదును.

*భరతుడు*: రామా! నీవు మహానుభావుడవు - కష్టము కలిగినను దుఃఖపడవు. సుఖము కలిగినను సంతోషపడవు. నీవు సుఖదుఃఖములను జయించినవాడవు. నీవంటివాడు ఈలోకమున మరియొకడు లేడు. నీకు తెలియని విషయము లేదు.

కోహి స్యా దీదృశో లోకే యాదృశ స్త్వ మరిందమ
నత్వాం ప్రవ్యథయే ద్దుఃఖం ప్రీతిర్వా న ప్రహర్షయేత్. 106-2

అమరోపమ స త్త్వ స్త్వం మహాత్మా సత్యసంగరః
సర్వజ్ఞ స్సర్వదర్శీ చ బుద్ధిమాం శ్చాసి రాఘవ. 106-6

ఇట్టి గుణసంపన్నుడవగు నీవు కష్టపడుట సరికాదు. నేను దేశాంతరమున నుండగా, నా పేరుమీద మా తల్లిచేసిన పాపకార్యమునకు నేను సమ్మతింపను. నీవు నన్ను అనుగ్రహింపుము. నేను ధర్మబద్ధుడనై నా తల్లిని వధింపకున్నాను. నేను దశరథునికి జన్మించిన వాడను. అధర్మ మాచరింతునా! దశరథుడు నాకు తండ్రియనియు, యజ్ఞయాగాదులు చేసిన వృద్ధుడనియు, స్వర్గస్థుడాయెననియు, అతనిని గౌరవించి సభలో నిందింప జాలకున్నాను.

గురుః క్రియావాన్ వృద్ధశ్చ రాజా ప్రేతః పితేతి చ
తాతం న పరిగర్హేయం దైవతం చేతి సంసది. 106-11

రామా! ధర్మము నెరిగినవాడు ఒక స్త్రీ మాట ననుసరించి ఇంతపని చేయునా! వినాశకాలమున విపరీతబుద్ధి కలుగు నను లోకోక్తి మన తండ్రిచే నిరూపిత మైనది.

అంతకాలేహి భూతాని ముహ్యంతీతి పురా శ్రుతిః
రాజ్ఞైవం కుర్వతాలోకే ప్రత్యక్షం సా శ్రుతిః కృతా. 106-13

రామా! లెస్సగా ఆలోచనచేసి తండ్రిచేసినపని ధర్మమా అధర్మమా అను విషయమును నిర్ణయింపుము. తండ్రి కామక్రోధములకు లోబడి చేసిన అధర్మమును పుత్రుడవైన నీవు సవరింపుము. తండ్రి చేసిన తప్పును సరిదిద్దువాడే సరియైన పుత్రుడు. నీవు సుపుత్రుడ వనిపించుకొనుము. కైకేయిని, నన్ను, మన తండ్రిని, నీ మిత్రులను, బంధువులను, పురజనులను, జానపదులను, అందరిని కాపాడుము.

వనవాస మెక్కడ! క్షత్రియధర్మ మెక్కడ! జటలెక్కడ, రాజ్యపరిపాలన మెక్కడ! రామా! ధర్మము ననుసరింపవలెననిగదా చెప్పుచుంటివి. సరే! క్షత్రియుని ప్రథమ ధర్మము రాజ్యాభిషేకము చేసికొని ప్రజలను పాలించుటయేగదా! ప్రత్యక్షమైన ఈ ధర్మమును విడిచిపెట్టి నీవు మరేదియో ధర్మమును అనుసరించుట సరియగునా! ధర్మమును సాధింపగోరుదువేని, శ్రమపడి నాలుగు వర్ణములవారిని ధర్మమార్గమున పాలింపుము. అదియు అధికశ్రమతో కూడిన ధర్మము. రామా! నాలుగు ఆశ్రమములలోను గృహస్థాశ్రమము శ్రేష్ఠమని చెప్పబడియున్నదిగదా! అట్టి గృహస్థాశ్రమమును వదలిపెట్టుట ధర్మ మగునా!

రామా! జ్యేష్ఠుడ వగు నిన్ను అతిక్రమించి నేను రాజ్యపాలనము చేయుట ఏనాటి ధర్మము! మొదటిమాట, నేను రాజ్యపాలన చేయుటకు సమర్థుడనా? రామా! నిన్ను విడిచి బ్రతికియుండుటకుసైతము నేను ఇచ్ఛగింపను. రాజ్యమును నీవే పాలింపుము. స్వధర్మము నవలంబింపుము. మన గురువులు వసిష్ఠులవా రున్నారు. శాస్త్రవేత్త లగు బ్రాహ్మణు లున్నారు. ప్రజలందరు వచ్చియున్నారు. అభిషేకద్రవ్యము లన్నియు సిద్ధముగా నున్నవి. నీవిచ్చటనే పట్టాభిషేకము చేసికొని అయోధ్యకు వచ్చి రాజ్యమును పాలింపుము. నా తల్లి మాటలను విని మన తండ్రి చేసిన పాపకార్యఫలమునుండి మన తండ్రిని తప్పింపుము. నేను నీకు శిరసా మ్రొక్కి యాచించుచున్నాను. ఈ దాసునిపై కరుణచూపుము. మమ్ముల నందరిని అనుగ్రహింపుము. నా ప్రార్థన త్రోసిపుచ్చి నీవు వనవాసముమీదనే మనస్సు నిలుపుదువేని నేనుకూడ నిన్ననుసరించెదను.

[భరతుని ప్రార్థనకు సంబంధించిన శ్లోకములు కొన్ని ఉదాహరింపబడినవి]

సాధ్వర్థ మభిసంధాయ క్రోధాన్మోహాచ్చ సాహసాత్
తాతస్య యదతిక్రాంతం ప్రత్యాహరతు తద్భవాన్. 106-14

పితుర్హి సమతిక్రాంతం పుత్రో య స్సాధుమన్యతే
తదపత్యం మతం లోకే విపరీత మతోఽన్యథా. 106-15

తదపత్యం భవానస్తు మా భవాన్ దుష్కృతం పితుః
అభిపత్తా కృతం కర్మలోకే ధీర విగర్హితమ్. 106-16

కైకేయీం మాంచ తాతంచ సుహృదో బాంధవాంశ్చ నః
పౌరజానపదాన్ సర్వాం స్త్రాతు సర్వమిదం భవాన్ 106-17

క్వచారణ్యం క్వచక్షాత్రం క్వజటాః క్వచపాలనమ్
ఈదృశం వ్యాహతం కర్మ నభవాన్ కర్తుమర్హతి. 106-18

ఏషహి ప్రథమోధర్మః క్షత్రియస్యాభిషేచనమ్
యేన శక్యం మహాప్రాజ్ఞ ప్రజానాం పరిపాలనమ్. 106-19

కశ్చ ప్రత్యక్ష ముత్సృజ్య సంశయస్థ మలక్షణమ్
ఆయతిస్థం చరేద్ధర్మం క్షత్రబంధురనిశ్చితమ్. 106-20

అథక్లేశజమేవత్వం ధర్మం చరితు మిచ్ఛసి
ధర్మేణ చతురో వర్ణాన్ పాలయన్ క్లేశమాప్నుహి. 106-21

చతుర్ణా మాశ్రమాణాంహి గార్హస్థ్యం శ్రేష్ఠ మాశ్రమమ్
ప్రాహుర్ధర్మజ్ఞ ధర్మజ్ఞా స్తం కథం త్యక్తుమర్హసి. 106-22

ఇహైవ త్వాభిషించంతు సర్వాః ప్రకృతయస్సహ
ఋత్విజ స్సవసిష్ఠాశ్చ మంత్రవన్మంత్ర కోవిదాః 106-26

అభిషిక్త స్త్వ మస్మాభి రయోధ్యాం పాలనే వ్రజ
విజిత్య తరసా లోకాన్ మరుద్భిరివ వాసవః 106-27

ఆక్రోశం మమ మాతుశ్చ ప్రమృజ్య పురుషర్షభ
అద్య తత్ర భవంతం చ పితరం రక్ష కిల్బిషాత్ 106-30

శిరసా త్వాభియా చేఽహం కురుష్వ కరుణాం మయి
బాంధవేషు చ సర్వేషు భూతేష్వివ మహేశ్వరః 106-31

అథైత త్పృష్ఠతః కృత్వా వనమేవ భవా నితః
గమిష్యతి గమిష్యామి భవతా సార్థమప్యహమ్ 106-32

శ్రీరాముడు భరతుని మాటలను విన్నాడు. కాని రాముని మనస్సులో మార్పు కలుగలేదు. శ్రీరాముని ధర్మబుద్ధిని, స్థైర్యమును, చూచి ప్రజలు సంతోషించినారు. కాని అతడు అయోధ్యకు మరలుటలేదని దుఃఖించినారు.

భరతుడు ఎంతో సమంజసముగా భాషించినాడని ప్రశంసించి ప్రజలుకూడ శ్రీరాముని ప్రార్థించినారు.

రాముడు : భరతా ! నీ పలుకులు చక్కగా నున్నవి. కాని నా మాట వినుము: నీ తల్లి వివాహకాలమున మనతండ్రి నీ మాతామహునికి చెప్పినమాట యొకటి కలదు.

కై కేయికి జన్మించిన పుత్రునకు రాజ్య మిచ్చెద నని మన తండ్రి మాట ఇచ్చి యున్నాడు:

పురాభ్రాతః పితా న స్సమాతరంతే సముద్వహన్
మాతామహే సమాశ్రౌషీ ద్రాజ్యశుల్క మనుత్తమమ్ 107-3

అదిగాక నీ తల్లికి రెండు వరములిచ్చి యున్నాడు. మనమిద్దరము మన తండ్రి మాట సత్య మగునట్లు ప్రవర్తింపవలయును. మన తండ్రిని పున్నామనరకమునుండి తప్పించినప్పుడే మనము పుత్త్రుల మగుదుము. నీవు అయోధ్యకు వెళ్లి రాజ్యమును సంతోషముగా పాలింపుము. నేను దండకారణ్యమునకు వెళ్ళి సంతోషముగా వనవాసము చేయుదును. నీవు మానవులకు రాజువు కమ్ము. నేను వన్యమృగములకు రాజుగా నుందును. నీకు ఛత్రము చల్లని నీడ నిచ్చును. నాకు వృక్షములు చల్లని నీడ నీయ గలవు. నీకు శత్రుఘ్నుడు సహాయుడుగా నుండును. నాకు లక్ష్మణుడు సహాయుడుగా నుండగలడు.

ఇట్లు నడచుకొందుమేని మన నల్వురము మనతండ్రిని సత్యవంతునిగా చేయ గలము. తమ్ముడా! నీ వీ విషాదము మానుము.

త్వం రాజా భరత భవ స్వయం నరాణామ్
వన్యానా మహమపి రాజ రాణ్మృగాణామ్
గచ్ఛత్వం పురవరమద్య సంప్రహృష్ట
స్సంహృష్టస్త్వహమపి దండకాన్ ప్రవేక్ష్యే 107-17

ఛాయాంతే దినకరభాః ప్రబాధమానామ్
వర్షత్రం భరత కరోతు మూర్ధ్ని శీతామ్
ఏతేషా మహమపి కాననద్రుమాణామ్
ఛాయాంతా మతిశయినీం సుఖీ శ్రయిష్యే 107-18

శత్రుఘ్నః కుశలమతిస్తు తే సహాయ
స్సౌమిత్రి ర్మమ విదితః ప్రధాన మిత్రమ్
చత్వార స్తనయవరా వయం నరేంద్రం
సత్యస్థం భరత చ రామ మా విషాదమ్ 107-19

## జాబాలి (దశరథుని పురోహితులలో ఒకడు)

**జాబాలి:** రామా! నీవు బుద్ధిమంతుడవు కదా! ఎవ్వడో ప్రాకృతుడు పలుకునట్లు పలుకుచున్నా వేమి? తండ్రిమాట ఏమిటి! పాలించుట ఏమిటి! ఈ లోకమున ఎవ్వని కెవడు బంధువు? దేనిచేతగాని ఎవ్వరి కేమి పనియున్నది? పుట్టినప్పుడు

మనతోకూడ ఎవ్వరును పుట్టుటలేదు. మరణించినప్పుడు మనవెంట ఎవ్వరున వచ్చుటలేదు. తల్లి ఏమిటి? తండ్రి ఏమిటి? ఇవన్నియు అర్థములేని పిచ్చి మాటలు. ఒకనితో మరియొకనికి ఎట్టి సంబంధముగాని లేదు. తల్లి, తండ్రి గృహము, ధనము, ఇవన్నియు కేవల వాసస్థానములు. ఉన్నమట్టుకు సరి తరువాత సంబంధము పెట్టుకొనగూడదు. దశరథునితో ఉండిన సంబంధమ తీరిపోయినది. తండ్రి బీజమాత్రుడు. జన్మకు ప్రకృతియే కారణము. తః కాలము తీరినందున దశరథుడు ప్రాణులందరు వెళ్లు చోటునకే వెళ్ళినాడు నీవుమాత్రము లేని సంబంధమును కల్పించుకొని అనవసరముగా బాధపడ చున్నావు.

శ్రాద్ధకర్మల సంగతి చూడుము. ఎంత అన్నము దండుగ! మరణించినవాడ అన్నము తినునా! ఒకడు భుజించినది మరియొకనికి చెందుట నిజమైనచో దూర దేశమునకు వెళ్ళినవారికి శ్రాద్ధమును పెట్టిన సరిపోవలయునుగదా! వారికి దారి బత్తెములతో పనియుండదు. కాని అట్లు జరుగుట లేదేమి? దానము లిమ్మని, యజ్ఞ ములు చేయుమని, దక్షిణల నిమ్మని, ఎవ్వరో బుద్ధికుశలురు ద్రవ్యాకర్షణమునకు గ్రంథములలో వ్రాసియుంచినారు. అంతేకాని ఆ మాటలలో అర్థము లేదు. ఇహమును మించి పరమనునది ఏదియును లేదు.

ప్రత్యక్షముగా నుండుదానిని అవలంబింపుము. పరోక్షమును విసర్జింపుము. నా మాట లంగీకరించి అయోధ్యకు వెళ్ళి పట్టాభిషిక్తుడవై సుఖముగా నుండుము.

**రాముడు:** జాబాలీ! ఎట్టి దుర్వాక్యములు పలికితివి! ఆచారమును ధర్మమును విడనాడిన వానిని ఎవ్వరైనను గౌరవింతురా? ఒక మనుజుని కులగౌరవము, పరాక్రమము, యోగ్యత, మంచి చెడ్డలు మున్నగునవి అతని చారిత్రమే తెలియజెప్పుచున్నది.

కులీన మకులీనం వా వీరం పురుషమానినమ్
చారిత్ర మేవ వ్యాఖ్యాతి శుచింవా యదివాఽశుచిమ్ 109.4

నేనీ ధార్మికవేషము ధరించి నీవు చెప్పినట్లు అధర్మను నాచరింతునేని అందరు నన్ను నిందింపరా! నేనే అట్లు ప్రవర్తించినయెడల నా మాట వినువా డెవ్వడైనను ఉండునా? ఎవరి ఇష్టానుసారము వారు ప్రవర్తింపక యుందురా? రాజు ఎట్లుండునో ప్రజలుకూడ అట్లేకదా ఉందురు!

కామవృత్త స్త్వయం లోకః కృత్స్నః సముపవర్తతే
యద్వృత్తా స్సంతి రాజాన స్తద్వృత్తా స్సంతిహి ప్రజాః 109.9

జనులు అబద్ధమాడువానిని చూచి సర్పమును చూచినట్లు భయపడుదురు. సత్యమే పరమ ధర్మము. సత్యమే స్వర్గమునకు మార్గము. సత్యమే ఈశ్వరుడు. లక్ష్మి సైతము ఎల్లప్పుడు సత్యమునే ఆశ్రయించియుండును. సర్వమునకు సత్యమే ఆధారము. సత్యమునకు మించిన మహిమగలది లోకములో లేదు.

ఉద్విజంతే యథా సర్పా న్నరా దనృతవాదినః
ధర్మ స్సత్యం పరో లోకే మూలం స్వర్గస్య చోచ్యతే 109-12

సత్యమేవేశ్వరో లోకే సత్యం పద్మాశ్రితా సదా
సత్యమూలాని సర్వాణి సత్యాన్నాస్తి పరంపదమ్ 109-13

సత్య స్వరూపమైన తండ్రి ఆజ్ఞను నేను విధిగా పాలింపవలయును. క్షత్రియ ధర్మముతో నాకు పనిలేదు.

క్షాత్రం ధర్మ మహం త్యక్షే 109-20

జాబాలీ! నీవు యుక్తి యుక్తముగా చెప్పిన మాటలు సరియైనవి కావు. నేను నా తండ్రియెద్ద చేసిన ప్రతిజ్ఞను విడిచి భరతుడు కోరినట్లు చేయజాలను. నాకు సైతము కార్యాకార్య విచక్షణ కలదు. నేను వనవాసమును తప్పక జరుపుదును.

జాబాలీ! నీ వంటి నాస్తికుని చేరదీసి మా తండ్రి తప్పు చేసినాడు. నీ ముఖము చూడగూడదు.

**జాబాలి:** (భయపడి) రామప్రభూ! క్షమింపుము. నేను నాస్తికుడను కాను. ఆ సమయమున ఆ మాట లంటినిగాని నేను నిశ్చయముగ ఆస్తికుడనే. నిన్ను ఎట్లైన అయోధ్యకు తోడ్కొనిపోవుటకు చెప్పిన మాటలేగాని అన్యముకాదు.

**వసిష్ఠుడు:** రామా! జాబాలి నాస్తికుడు కాడు. ఇహపర ధర్మములను చక్కగా తెలిసినవాడు. నిన్ను అయోధ్యకు మరలించుటకు చెప్పిన హేతువాదములేగాని అవి మరేమియు కావు.

రామా! ఈ భూమండలమును వైవస్వతమనువు ఇక్ష్వాకువున కిచ్చినాడు. ఇక్ష్వాకువు అయోధ్యకు మొదటి రాజు. ఇక్ష్వాకు వంశక్రమమును వినుము.

[వసిష్ఠ మహర్షి శ్రీరాముని పూర్వులకు పెక్కు తరములుగా పురోహితుడు. శ్రీరామావతారము కొఱకు వేచియుండినాడు. ఇక్ష్వాకు వంశక్రమమును మొదటినుండియు వివరించి వంశమర్యాదను నిరూపింప సమర్థుడు. శ్రీరాముని తోడ్కొని పోవుటకు పూర్వుల చరిత్ర చెప్పుచున్నాడు.]

(1)

ఇక్ష్వాకు
|
కుక్షి
|
వికుక్షి
|
బాణుడు
||
అనరణ్యుడు
||
పృథు
|
త్రిశంకువు
|
దుందుమారుడు
|
మాంధాత
|
సుసంధి
|
ధ్రువసంధి ప్రసేనజిత్తు
|
భరతుడు
|
అసితుడు
|
సగరుడు
|
అసమంజుడు
|
అంశుమంతుడు
|
దిలీపుడు

(2)

దిలీపుడు
|
భగీరథుడు
|
కుకుత్థ్సుడు
|
రఘువు
|
ప్రవృద్ధుడు
|
శంఖణుడు
|
సుదర్శనుడు
|
అగ్నివర్ణుడు
|
శీఘ్రగుడు
|
మరువు
|
ప్రశుశ్రుకుడు
|
అంబరీషుడు
|
నహుషుడు
|
నాభాగుడు
|
అజుడు సువ్రతుడు
|
దశరథుడు

రామా! వంశక్రమేణ ఈరాజ్యము దశరథునికి సంక్రమించినది. ఆదశరథునికి 'రాముడు' అను పేరుగల జ్యేష్ఠపుత్రు డున్నాడు.

తస్య జ్యేష్ఠోస్తి దాయాదో రామ ఇత్యభి విశ్రుతః 110-34

రామా! నీవు జ్యేష్ఠపుత్రుడవు గనుక నీవు రాజువై ప్రజలను పాలింపుము. ఇక్ష్వాకు వంశమున జ్యేష్ఠపుత్రుడు ప్రభు వగుటయే మర్యాద. జ్యేష్ఠుని తప్పించి కనిష్ఠునికి పట్టాభిషేకము చేయు ఆచారములేదు.

ఇక్ష్వాకూణాంహి సర్వేషాం రాజాభవతి పూర్వజః
పూర్వజే నాపరః పుత్రో జ్యేష్ఠో రాజ్యేఽభిషిచ్యతే 110-35

నీవు మీ కులధర్మమును పాటించి పట్టాభిషేకము చేసికొనుము. రామా! పురుషునికి ఆచార్యుడు, తండ్రి, తల్లి అను ముగ్గురు గురువు లున్నారు. ఆచార్యుడు జ్ఞానదాత. నేను నీకు ఆచార్యుడను. కావున నామాట వినుము. నీ తల్లి కోరికను తీర్పుము. ప్రజలందరు నిన్నే రాజుగా కోరుచున్నారు. వారి ప్రార్థనలను త్రోసిపుచ్చకుము. తల్లికి శుశ్రూష చేయక నీవు అరణ్యవాసము చేయుట సరికాదు. నీవు యాచకుల కోరికలు మన్నించువాడవుగదా! భరతుడు నిన్ను యాచించుచున్నాడు. అతని ప్రార్థన అంగీకరింపుము. మేమందరము నీవే రాజు కావలయునని కోరుకొనుచున్నాము. మా కోరికలను తీర్పుము. దీనివలన నీ సత్ప్రవర్తనకు హాని కలుగదు.

## భరతుని ప్రాయోపవేశము

*రాముడు*: గురువర్యా! ధర్మసాధనమైన ఈ దేహమునకు తల్లిదండ్రులుకదా కారణభూతులు. వారెంతో కష్టపడి బిడ్డలను పెంచి పెద్దవారిని చేయుదురు. వారి ఋణమును తీర్చుట సులభముకాదు. వారి మాటను జరిపితీరవలయును. కావున నా తండ్రి కిచ్చిన మాటను తప్పను. నన్ను క్షమింపుడు.

ఈ సంవాదమును భరతుడు విన్నాడు. రాముని మరలించుటకు ప్రార్థనవలన సాధ్యము కాదని నిశ్చయించుకొని సుమంత్రునితో

*భరతుడు*: సుమంత్రా! నేలపై దర్భలు పరపుము. శ్రీరాముడు ప్రసన్నుడగువరకు నేను దర్భలపై పరుండెదను.

ఇహ మే స్థండిలే శీఘ్రం కుశా నాస్తర సారథే
ఆర్యం ప్రత్యుపవేక్ష్యామి యావన్మే న ప్రసీదతి 111-13

ఇచ్చిన అప్పును రాబట్టుకొనుటకు బ్రాహ్మణుడు, అప్పుపుచ్చుకొన్నవాని వాకిలికి అడ్డముగా పరుండునట్లు నేను నిరాహారుడనై ముఖముపై వస్త్రము కప్పుకొని రాముడు అయోధ్యకు వచ్చువరకు పర్ణశాల వాకిలికి అడ్డముగా పరుండి యుందును.

అనాహారో నిరాలోకో ధనహీనో యథాద్విజః
శేష్యే పురస్తాచ్ఛాలాయా యావన్న ప్రతియాస్యతి. 111-14

సుమంత్రుడు రామునివైపు చూచి అతని ఆజ్ఞను నిరీక్షించుచు ఏమిచేయుటకును తోపక ఊరకుండుటచూచి భరతుడు స్వయముగా దర్భలను పరచుకొని పరుండినాడు.

**రాముడు :** భరతా ! ఏమిటీ పని? అప్పిచ్చిన బ్రాహ్మణుడు చేయదగిన పనియేగాని రాజులిట్లు చేయవచ్చునా ? ఈ దారుణవ్రతమును విడిచిపెట్టి అయోధ్యకు పొమ్ము. లే ! నాయనా ! లెమ్ము.

**భరతుడు :** (దర్భశయనమున నుండియే) ప్రజలారా ! మీరైనను శ్రీరాముని ప్రార్థింపుడు. అయోధ్యకు రమ్మని వేడుకొనుడు.

**ప్రజలు :** శ్రీరాముని మేము చక్కగా ఎరుగుదుము. తండ్రి ఆజ్ఞను పాలించుటకు నిశ్చయించుకొని యున్నాడు. శ్రీరాముని మరలించుట మాకు సాధ్యమగు పని కాదు.

**రాముడు :** భరతా ! విన్నావా వారి మాటలు ! ధర్మతత్వమును అర్థము చేసికొన్న నీ స్నేహితులు ఏమనుచున్నారో చూడుము. నీవుకూడ బాగుగా ఆలోచింపుము. నాయనా ! భరతా ! లెమ్ము. లేచి నన్ను స్పృశించి జలమును స్పృశింపుము.

**భరతుడు :** (లేచి నీటిని స్పృశించి) ప్రజలారా ! మీరెల్లరు వినుడు. రాజ్యము కావలయునని నేను మా తండ్రిని కోరియుండలేదు. ఎట్లయినను రాజ్యము నిప్పింపుమని మా తల్లిని వేడుకొనలేదు. శ్రీరాముడు అరణ్యమున నివసించుటకు నేను సమ్మతింపలేదు. పితృవాక్యము అవశ్యము జరుగవలయు ననిన, నేనే పదునాలుగు సంవత్సరములు వనవాసము చేయుదును.

> యదిత్వవశ్యం వస్తవ్యం కర్తవ్యం చ పితుర్వచః
> అహమేవ నివత్స్యామి చతుర్దశ సమా వనే. 111-26

**రాముడు :** (పౌరజానపదులతో) నా తండ్రిమాటను మార్పుచేయుటకు నాకుగాని భరతునికిగాని అధికారములేదు. భరతుడు గుణసంపన్నుడనియు గురువును సత్కరించువాడనియు నేనెరుగుదును. భరతుడు మహాత్ముడు. సత్యసంధుడు. సర్వత్ర అతనికి మంగళము చేకూరగలదు.

> జానామి భరతం శాంతం గురుసత్కారకారిణమ్
> సర్వమేవాత్ర కల్యాణం సత్యసంధే మహాత్మని. 111-30

నేను వనవాసమును పూర్తిగావించి, మరల అయోధ్యకు వచ్చి ధర్మశీలుడగు భరతునిగూడి రాజ్యమును పాలింపగలను. భరతా ! నీవుకూడ నాకు తోడ్పడి తండ్రికి అసత్య దోషము కలుగకుండునట్లు చూడుము.

శ్రీరామ భరతుల సమాగమమును చూడవచ్చిన మహర్షులు ఈ సంవాదమును విని ఆశ్చర్యచకితులై ఆనందభరితులై అన్నదమ్ములను మిక్కిలి ప్రశంసించినారు. ధర్మాత్ములైన ఇట్టి సుపుత్రులను కన్న దశరథుని అదృష్టమును కొనియాడినారు. ఋషు లందరు రావణవధమునుకోరి ఏక కంఠముగా భరతునితో అనుచున్నారు.

**ఋషులు :** భరతా ! మీ తండ్రి స్వర్గములో నివసింపవలయునని కోరుదువేని రాముని మాటను అంగీకరింపుము. లేనిచో, కైకేయి ఋణమును తీర్చుకొనలేనివాడై మీ తండ్రి స్వర్గమునం దుండజాలడు.

ఈ మాటలకు రాముడు సంతసించి ఋషులను పూజించినాడు. ఋషులు వారివారి నెలవులకు వెళ్ళినారు.

ఋషుల మాటలు విన్న వెంటనే భరతుని గుండె జారిపోయినది. శరీరము కంపించినది. నాలుక యెండిపోయినది. నోట మాటరాలేదు.

**భరతుడు :** (అంజలి ఘటించి తొట్రుపడుచు) రామా ! ఈ గొప్పరాజ్యమును రక్షించుట నాకు సాధ్యముకాదు. ప్రజలెల్లరు నిన్నే రాజుగా కోరుచున్నారు. నీవువచ్చి నీ రాజ్యమును పాలింపుము.

ఈ మాటలు చెప్పి భరతుడు రాముని పాదములపై వ్రాలినాడు. రాముడు భరతుని లేవనెత్తి తొడపై కూర్చుండబెట్టుకొని అనుచున్నాడు.

**రాముడు :** నాయనా ! రాజ్యమును పాలించుటకు నీకు శక్తి లేకేమి ? నీవు బుద్ధిమంతుడవు. గురుశిక్ష పొంది యున్నావు. తెలివిగల మంత్రు లున్నారు. అన్ని కార్యములు నీవు మంత్రులతో ఆలోచించి చేయుచుండుము. కామము చేతనో లోభము చేతనో నీ తల్లి చేసినపనిని నీ మనస్సునం దుంచుకొనక ఆమె నెల్లప్పుడు మాతృభావముతో పూజించుచుండుము.

కామాద్వా తాత లోభాద్వా మాత్రతుభ్య మిదం కృతమ్
నతన్మసి కర్తవ్యం వర్తితవ్యంచ మాతృవత్ 112.19

## భరతుడు శ్రీరామ పాదుకలను గైకొనుట

**భరతుడు :** రామా ! హేమభూషితములైన ఈ పాదుకలపై నీ పాదము లుంచుము. ఈ పాదుకలే సమస్త ప్రపంచమునకు యోగక్షేమమును చేకూర్పగలవు.

అధిరోహార్య పాదాభ్యాం పాదుకే హేమ భూషితే
ఏతేహి సర్వలోకస్య యోగక్షేమం విధాస్యతః 112.21

పాదుకలమీద శ్రీరాముడు తన పాదములుంచి, ఆ పాదుకలను భరతునికిచ్చినాడు.

**భరతుడు :** (పాదుకలకు నమస్కరించి) రామా! ఈ పదునాలుగు సంవత్సరములు నేను జటలుదాల్చి నారచీరలు ధరించి ఫలమూలాశనుడనై నీ పాదుకలకు రాజ కార్యములు నివేదించుచు, పట్టణము వెలుపల నివసించుచు, నీ రాకకు ఎదురు చూచుచుందును. ఒక్కమాటమాత్రము ఇప్పుడే చెప్పుచున్నాను. పదునాలుగు సంవత్సరములు నిండిన మరుసటి దినము నీవు కానబడనియెడల నేను తప్పక అగ్ని ప్రవేశము చేసెదను.

చతుర్దశహి వర్షాణి జటాచీరధరో హ్యహమ్
ఫలమూలాశనో వీర భవేయం రఘునందన 112-23

తవాగమన మాకాంక్షన్ వసన్వై నగరాద్బహిః
తవ పాదుక యోర్న్యస్త రాజ్యతంత్రః పరంతప 112-24

చతుర్దశేతు సంపూర్ణే వర్షేఽహని రఘూత్తమ
నద్రక్షామి యదిత్వాం తు ప్రవేక్ష్యామి హుతాశనమ్ 112-25

శ్రీరాముడు భరతునిమాట అంగీకరించినాడు. శ్రీరాముడు భరత శత్రుఘ్నులను కవుగిలించుకొని భరతుని మరొక్కతూరి హెచ్చరించుచున్నాడు.

**రాముడు :** భరతా! కైకేయిపట్ల భక్తిగౌరవములతో ప్రవర్తింపుము. ఆమెపై కోపింపకుము. ఇట్లని నామీదను, సీతమీదను ఆన పెట్టుచున్నాను సుమా!

భరతుడు రామపాదుకలకు అలంకారముచేసి వానిని పూజించి శ్రీరామునికి ప్రదక్షిణముచేసి పాదుకలను శత్రుంజయమను ఏనుగు శిరస్సుమీద ఉంచినాడు.

శ్రీరాముడు గురువులను, మంత్రులను, ప్రజలను, యథాయోగ్యముగా గౌరవించి వీడుకోలిచ్చినాడు. రాముడు తల్లులకు నమస్కరించి వారికిని వీడుకోలిచ్చినాడు. కాని వారు మాత్రము దుఃఖించుచు అచ్చటనుండి కదలలేదు. రాముడు తానే వారిని వీడ్కొని పర్ణశాలలో ప్రవేశించినాడు.

## శ్రీరామపాదుకలతో భరతుడు అయోధ్యకు మరలివచ్చుట

భరతుడు రామపాదుకలను శిరస్సున దాల్చి శత్రుఘ్నునికూడి, రథము నారోహించినాడు. ప్రజ లందరు భరతునివెంట ప్రయాణ మైనారు.

భరతుడు భరద్వాజాశ్రమమునకు వచ్చినాడు. రథము నవరోహించి మహర్షికి నమస్కరించినాడు.

భరద్వాజుడు : భరతా ! నీవు వెళ్ళిన పని అయినదా ! శ్రీరాముని సందర్శించితివా ?

భరతుడు : స్వామీ ! నేనును వసిష్ఠ మహర్షియును అనేక విధములుగా వేడుకొన్నను రాముడు రాజ్యమును స్వీకరించుట కంగీకరింపలేదు. "నేను తండ్రి ఆజ్ఞను పాలించి తీరవలయును" అని వసిష్ఠులవారితో చెప్పినాడు. అంతట వసిష్ఠుల వారు "రామా ! హేమభూషితములైన నీ పాదుకల నిత్తువేని అవియే రాజ్యమునకు యోగక్షేమములను సమకూర్పగలవు" అని చెప్పినారు.

ఏతే ప్రయచ్ఛ సంహృష్టః పాదుకే హేమభూషితే
అయోధ్యాయాం మహాప్రాజ్ఞ యోగక్షేమకరే తవ 113-12

శ్రీరాముడు వసిష్ఠునిమాట అంగీకరించి తూర్పు ముఖముగా నిలుచుకొని పాదుకలపై తన పాదము లుంచి నేను రాజ్యము చేయగలందులకు ఆ పాదుకలను నాకు ప్రసాదించినాడు.

ఏవముక్తో వసిష్ఠేన రాఘవః ప్రాఙ్ముఖ స్థ్సితః
పాదుకే అధిరుహ్యైతే మమ రాజ్యాయ వై దదౌ 113-13

నేను శ్రీరాముని అనుజ్ఞ గైకొని పాదుకలతో అయోధ్యకు పోవుచున్నాను.

[పాదుకల విషయము త్రికాలజ్ఞుడైన వసిష్ఠమహర్షి చెప్పి చేయించినట్లు కనబడు చున్నది.]

భరద్వాజుడు : భరతా ! అన్న యెడ నీవు ప్రదర్శించిన అసమానమైన భక్తి ఎంతయో కొనియాడదగినది. సహజముగనే శీలవంతుడవైన నీ వంటివాడు ఈ విధముగా ప్రవర్తించుటలో ఆశ్చర్య మేమియు లేదు. నీరు పల్లమునకే పారుటలో చిత్ర మేమున్నది ! నీ వంటి గుణసంపన్నుని కన్నతండ్రి అమరుడు.

భరతుడు భరద్వాజునికి నమస్కరించి పలుమారు ప్రదక్షిణ మాచరించి అయోధ్యకు ప్రయాణ మైనాడు. యమునా గంగానదులను సంతరించి శృంగిబేరపుర మును సమీపించి అక్కడనుండి ప్రయాణమై అయోధ్యకు చేరినారు.

పట్టణమంతయు కాంతి విహీనముగా నున్నది. నరసంచార మను మాటలేదు. ఎక్కడ చూచినను మార్జాలములు గుడ్లగూబలు తిరుగుచుండినవి.

భరతుడు : సారథీ ! చూచితివా అయోధ్య ఎట్లున్నదో ! ఒక్క మానవుడుకూడ కనిపించుటలేదు. అశ్వములు, గజములు వీథులలో కనబడుటలేదు. ఒక మంచి పాటగాని మాటగాని వినబడుటలేదు. అయోధ్యను రామశోకము పీడించు చున్నది. పురజనులు పుష్పమాలలు ధరించి అలంకరించుకొని విహరించువారే

శ్రీ రామాయ నమః.

# శ్రీమద్వాల్మీకి రామాయణ కథామృతము

# అరణ్యా కాండము

## దండకారణ్య ప్రవేశము

ప్రవిశ్యతు మహారణ్యం దండకారణ్య మాత్మవాన్
దదర్శ రామో దుర్ధర్ష స్తాపసాశ్రమ మండలమ్. 1-1

శ్రీరాముడు దండకారణ్యము ప్రవేశించినాడు. అక్కడి ఆశ్రమములను అవలోకించినాడు. అత్యంతరమణీయములుగా నున్నవి. ఫలభరితములైన వృక్షములును పుష్పశోభితములైన లతా విశేషములును, వివిధ వర్ణ పర్ణములతో విరాజిల్లుచుండిన పక్షి సమూహములును కన్నులపండువు చేయుచుండినవి. వేదపారాయణ ధ్వని వీనుల విందుగా వినబడినది. ఋషులు తప మాచరించుచు కాలము గడపుచున్నారు. ఇట్టి ఆశ్రమ సమూహమును సమీపించినవెంటనే శ్రీరాముడు ధనుస్సును విజ్యము గావించినాడు.

దివ్యజ్ఞానులైన ఋషులు సీతారామలక్ష్మణులకు ఎదురువచ్చి స్వాగత మిచ్చి వారిని ఒక పర్ణశాలలో విడియించి అతిథిసత్కారము చేసినారు. ఋషు లందరు వారి కష్టసుఖములను రామునితో చెప్పుకొనుచున్నారు.

**ఋషులు :** (అంజలి ఘటించి) రామప్రభూ! నీవు ధర్మపరిపాలకుడవు. మా కెల్లరకు శరణ్యుడవు. రాజు దండధరుడై దుష్టులను శిక్షించి ప్రజలను తండ్రివలె రక్షించుచుండును.

ధర్మపాలో జనస్యాస్య శరణ్య స్త్వం మహాయశః
పూజనీయశ్చ మాన్యశ్చ రాజా దండధరో గురుః 1-18

రామా! మే మందరము నీ ఏలుబడిలోనివారము. నగరమునం దున్నను అరణ్యమం దున్నను నీవే మాకు రాజువు. నీవే మాకు రక్షకుడవు. మేము మీ బిడ్డలవంటి వారము. కోపమును విసర్జించి తపోవృత్తిలో ఉండువారము గనుక మేము మమ్ములను రక్షించుకొనజాలము. నీవే మమ్ములను రక్షింపవలయును.

[అరణ్యమున సైతము రాముని రాజుగానే భావించినారు]

తే వయం భవతా రక్ష్యా భవ ద్విషయవాసినః
నగరస్థో వనస్థోవా త్వం నో రాజా జనేశ్వరః 1-20

ఆ రాత్రి అక్కడ గడపి మరునాడు ఉదయము ఋషుల సెలవు గైకొని సీతారామలక్ష్మణులు అరణ్యములోనికి నడచినారు. భయంకరములైన వ్యాఘ్రాది క్రూర మృగములుండు కాంతారగర్భము జొచ్చినారు.

## విరాధ వధ

భయంకరస్వరూపుడగు రాక్షసు డొకడు వారికి ఎదురైనాడు. యమునికి సాటి వచ్చువాడు. మూడు సింహములను, నాలుగు పెద్దపులులను, రెండు తోడేళ్లను, పది జింకలను, ఒక ఏనుగు శిరస్సును శూలమున గ్రుచ్చి పట్టుకొని వచ్చుచున్నాడు. సీతారామలక్ష్మణులను చూచి వారిమీదికి దుమికి సీతాదేవిని ఎత్తుకొని బాహుమూలమున ఇరికించుకొని రామలక్ష్మణులతో అనుచున్నాడు.

*విరాధుడు :* మీరు జటావల్కలములు ధరించి తాపసులవేషము దాల్చియున్నారు. అడవికి పడతిని గూడివచ్చువా రుందురా! మీవలె ధనుర్బాణములు, ఖడ్గములు, ధరించి వత్తురా! మీ ప్రవర్తనము కేవల ధర్మవిరుద్ధముగా నున్నది. నా సంగతి ఎరుగరు కాబోలు! నేను ఋషుల మాంసమును భక్షించుచు ఈ అడవిలో సంచరించువాడను. నా పేరు విరాధుడు. ఈ చిన్నది నాకు భార్యగా ఉండదగినది. నేను మిమ్ముల నిద్దరిని చంపి మీ రక్తము పానము చేయుదును.

సీతాదేవి భయముతో కంపించినది. శ్రీరామునికి దుఃఖము వచ్చినది. నో రెండిపోయినది.

*రాముడు :* లక్ష్మణా! నా సీత విరాధుని చేతిలో చిక్కినది చూచితివా! ఇంతకంటె కష్టమేమి యుండును. కైకేయి కోరిక ఇప్పుడు పూర్తిగా ఫలించినది. కుమారునికి రాజ్య మిప్పించుటతో తృప్తి జెందక మనలను అడవికి పంపుమని వరము కోరుకొనుట ఇందులకే సుమా! కైకేయి ఎంత దూరదృష్టి గలది! ఆమె సంకల్పము ఫలించినది.

య దభిప్రేత మస్మాసు ప్రియం వరవృతంచ యత్
కైకేయ్యాస్తు సుసంవృత్తం క్షిప్ర మద్యైవ లక్ష్మణ. 2-18
యా నతుష్యతి రాజ్యేన పుత్రార్థే దీర్ఘదర్శినీ
య యాహం సర్వభూతానాం హితః ప్రస్థాపితో వనమ్. 2-19
అద్యేదానీం సకామా సా యా మాతా మమ మధ్యమా 2-20

లక్ష్మణా! సీతను పరపురుషుడు స్పృశించుటకంటె నాకు మరియొక దుఃఖ ముండునా! తండ్రి మరణముగాని రాజ్య హరణముగాని నా కింతటి దుఃఖము కలిగింపలేదు.

పరస్పర్శాత్తు వైదేహ్యా న దుఃఖతర మస్తి మే
పితుర్వియోగా త్సౌమిత్రే స్వరాజ్య హరణా త్తథా. 2-21

లక్ష్మణుడు : రామా! సర్వభూతములకును నీవు నాథుడవు. నీ కింకరుడ నగు నేను ఇచ్చటనే వున్నాను. నీవు అనాథునివలె పరితపించుట సరికాదు. ఈ రాక్షసుని ఇప్పుడే నా బాణాగ్నికి ఆహుతి కావించెదను. (నవ్వుచు, విరాధుని చూచి) విరాధా! ఈ అడవిలో నిర్భయుడవై తిరుగుచున్నావే! ఎవ్వడవు నీవు?

విరాధుడు : నా సంగతి కేమిలెమ్ము. మీ రెవ్వరో మొదట చెప్పుము. ఎక్కడికి ప్రయాణము?

రాముడు : మేము ఇక్ష్వాకు వంశస్థులము. సదాచారము పాటించి అడవికి వచ్చినవారము. నీ వీ దండకారణ్యమునం దుండుటకు కారణ మేమి?

విరాధుడు : నేను జయుని పుత్రుడను. మా తల్లి పేరు శతహ్రాద. నా పేరు విరాధుడు. నేను బ్రహ్మవలన ఒక వరము పొందియున్నాను. నాకు ఆయుధములవలన మరణము కలుగదు. ఈ అబల నిచ్చట విడిచిపెట్టి మీరు వెంటనే వెళ్ళి పోవుదురేని మీపైకి రాను.

ఈ మాటలు విన్న రాముడు కోపించి విరాధునిమీద ఏడు బాణములు ప్రయోగించినాడు. విరాధుడు సీతాదేవిని క్రింద వదలి శూలమును గైకొని రామలక్ష్మణులపైకి వచ్చినాడు. రాముడు రెండు బాణములు వేసి ఆ శూలమును రెండు ముక్కలుగా ఖండించినాడు. అంతట, విరాధుడు రామలక్ష్మణుల నిద్దరను ఎత్తుకొని అడవిలోనికి పోసాగినాడు.

రాముడు : లక్ష్మణా! ఈ రాక్షసుడు మనల నిట్లు మోసుకొనిపోవుటయు ఒకందుకు మేలే. అడవిలో మనకు దారి చూపిన ట్లయినది.

సీత : (బిగ్గరగా అరచుచు) అయ్యో! ఈ రాక్షసుడు వారి నిద్దరను ఎత్తుకొని వెళ్ళుచున్నాడే! నేను ఒంటరిగా చిక్కి పులులకు, తోడేళ్ళకు ఆహార మగుదును కాబోలు! ఓ రాక్షసోత్తముడా! నీకు నమస్కారము. వారిని విడిచిపెట్టి నన్ను తీసికొనిపొమ్ము.

సీతాదేవి దీనాలాపములను రామలక్ష్మణులు విని రోషించి రాక్షసుని వెంటనే వధింప నిశ్చయించుకొని తమ ఖడ్గములతో వాని యెడమచేతిని లక్ష్మణుడును, కుడిచే

తిని రాముడును ఖండించినారు. విరాధుడు క్రింద పడినాడు. రామలక్ష్మణులు వారి చేతులతోను కాళ్లతోను వానిని క్రుమ్మి త్రొక్కి, ముద్ద చేసినారు. కాని రాక్షసుడు మరణింపలేదు.

**రాముడు :** లక్ష్మణా! ఈవిధముగా మన మేమిచేసినను ఈ రాక్షస్సుడు మరణించునట్టు లేదు. ఆయుధములతో తనకు మరణము లేదని రాక్షసుడు చెప్పనే చెప్పినాడు. కావున వీనిని గోతిలో పాతిపెట్టుదము.

ఈ మాటలు వినుటతోడనే విరాధునికి పూర్వజన్మస్మృతి కలిగినది.

**విరాధుడు :** రామప్రభూ! నన్ను క్షమింపుము. నా అజ్ఞానము వలన ఇంతకుముందు మిమ్ములను గుర్తింపలేకపోయితిని. ఇప్పుడు గుర్తుకు వచ్చినారు. నేనొక గంధర్వుడను. నాపేరు తుంబురుడు. కుబేరుని శాపమువలన రాక్షసుడ నైతిని. నన్ను అనుగ్రహింపు మని కుబేరుని వేడుకొనగా "ఏనాడు శ్రీరాముడు నిన్ను వధించునో ఆనాడు నీకు శాపవిమోచనము కలుగును" అని కుబేరుడు చెప్పియున్నాడు. రామా! నీ అనుగ్రహామువలన నా శాపము తీరిపోయినది. మీకు మంగళ మగునుగాక! ఇక్కడికి ఒకటిన్నర యోజనము దూరమున శరభంగ మహాముని ఆశ్రమ మున్నది. ఆ ఋషి ధర్మాత్ముడు - వారి దర్శనమున మీకు మేలు చేకూరును. ఒక పల్లము త్రవ్వి నన్ను అందులో పాతిపెట్టుడు. రాక్షసుల కళేబరములు సమాధి చేయువారికి పుణ్యలోకములు కలుగును.

లక్ష్మణుడు పల్లము త్రవ్వినాడు. రామలక్ష్మణులు విరాధుని శరీరమును అందులో పాతిపెట్టి పూడ్చినారు. విరాధుడు స్వర్గమునకు పోయినాడు.

రామలక్ష్మణులు సీతాసమేతులై ప్రయాణము సాగించినారు.

[రాబోవు విషయములు ఈ ఘట్టమున సూచితము లైనవి. అడవిలో అడుగు పెట్టి పెట్టకమునుపే విరాధుడు సీతాదేవిని స్పృశించి హతు డైనాడు. రావణుడు కూడ అట్లే అయినాడు.]

భీమబలు డైన విరాధుని వధించి శ్రీరాముడు సీతాదేవిని కవుగిలించుకొన్నాడు. ప్రయాణము సాగుచున్నది. రాముడు లక్ష్మణునితో అనుచున్నాడు.

**రాముడు :** లక్ష్మణా! ఈ అరణ్యము అపాయముల నిలయముగా నున్నది. మనము త్వరగా శరభంగాశ్రమమునకు వెళ్లుట మేలు.

నేను అరణ్యమునకు బయలుదేరినప్పుడు మా అత్తగారుకూడ పాతివ్రత్యమును గూర్చి ఉపదేశించియున్నారు. ఆ మాటలను నేను మరచిపోలేదు.

[ఇక్కడకూడ, అనసూయాదేవి సీతాదేవికి అత్తగారి స్థానములోనే ఉన్నదను విషయము గమనింపదగియున్నది. అత్రిమహాముని శ్రీరాముని తన కుమారునివలె ఆదరించినాడు. అనసూయను నిర్దేశించి "మీ తల్లివంటిది" అని శ్రీరామునితో చెప్పినారు. కావున అనసూయ సీతాదేవికి అత్తగారి స్థానమున ఉన్నట్లు సూచితమైనది. కౌసల్య అనసూయవంటిదనియు ధ్వనించుచున్నది.]

పాణిప్రదాన సమయమున అగ్నిసన్నిధిలో మా తల్లిగారు నాకు ఉపదేశించిన పాతివ్రత్య ధర్మములను నేను జ్ఞప్తియందుంచుకొనియున్నాను. సావిత్రీదేవి పతిశుశ్రూషచేసి స్వర్గమును జయించినదిగదా! పూజ్యురాల వగు నీవుసైతము పతిశుశ్రూష ఫలముగా స్వర్గమును పొందగలవు.

**అనసూయ :** (ఆనందపరవశయై సీతాదేవిని మూర్కొని) సీతా! నీ చక్కని పలుకులు నా కెంతో ఆనందమును కలిగించినవి. నాయొద్ద ఎంతో తపోధనము కలదు. నీకు కావలసినదానిని కోరుకొనుము. ప్రసాదించెదను.

**సీత :** (చిఱునవ్వుతో) నీ ప్రీతివాక్కులే చాలును. నా కన్నియు ప్రసాదించినట్లే అయినది.

ఈ మాటలు విన్న అనసూయాదేవికి సీతాదేవి మీద మరింత ప్రీతి కలిగినది.

**అనసూయ :** సీతా! నీ మీద నాకు ఎక్కువ ప్రీతి కలిగినది. నిన్ను సత్కరింప గోరుచున్నాను. ఇవిగో చూడుము. దివ్యమైన ఈ పుష్పమాలికలు, వస్త్రములు, ఆభరణములు, అంగరాగము, పరిమళ గంధము, వీని నన్నింటిని స్వీకరింపుము. వీని కాంతి ఎన్నటికిని తరుగునదికాదు. ఇవి నీ సౌందర్యమునకు మెరుగుపెట్టగలవు. నీవీ అంగరాగము నలందుకొందువేని లక్ష్మీదేవి విష్ణుదేవుని రంజింపజేయునట్లు నీవు నీ భర్తను సంతోషపెట్టగలవు.

అనసూయాదేవి ఇంత ప్రీతితో ఇచ్చినదికావున సీతాదేవి ఈ ప్రీతిదానమును స్వీకరించినది. అనసూయాదేవికి నమస్కరించినది.

**అనసూయ :** సీతా! నీ స్వయంవరమును గురించి మున్ను వినియున్నాను. అయినను నీవు చెప్పగా వినగోరుచున్నాను. చెప్పుము.

**సీత :** మిథిలాధిపతి యైన జనకమహారాజు యజ్ఞము చేయుటకు భూమిని దున్నుచుండగా, నేను భూమినుండి ఉద్భవించి జనకునికి కొమారిత నైతిని. నాతల్లిదండ్రులు నన్ను ప్రీతితో పెంచినారు. నాకు పెండ్లివయస్సు వచ్చినది. నన్ను చూచి మా తండ్రి దుఃఖపడి విత్తనాశనము నొందిన దరిద్రునివలె దీనుడైనాడు. వివాహ యోగ్యురాలైన పుత్రిక అవివాహితగా ఇంటనుండుట తల్లిదండ్రుల కెంతో కష్టము గదా! అట్టివారు సరివారిలోనేగాక తక్కువవారిలో కూడ అవమాన పడుదురు. కన్య తండ్రి ఇంద్రుని యంతటివాడైనను ఇట్టి అవమానము తప్పదు. అట్టి తిరస్కారము తనకు శీఘ్రముగనే కలుగనున్న దని గ్రహించి, సర్వదా దుఃఖ నిమగ్నుడై, సముద్రమున పడినవాడు దరిజేరుటకు తెప్పలేక అవస్థపడునట్లు, మా తండ్రి చింతాక్రాంతుడై యుండినాడు.

పతి సంయోగ సులభం వయోదృష్ట్వాతు మేపితా
చింతా మభ్యగమద్దీనో విత్తనాశాదివా ధనః 118-34

సదృశా చ్చాపకృష్టాచ్చ లోకే కన్యాపితా జనాత్
ప్రధర్షణా మవాప్నోతి శక్రేణాపి సమో భువి 118-35

తాంధర్షణా మదూరస్థాం దృష్ట్వాచాత్మని పార్థివః
చింతార్ణవ గతః పారం నాససా దాప్లవో యథా 118-36

నేనేమో అయోనిజ నైతిని. నాకు తగిన వరు డెవ్వడును కానరాలేదు. ఆ తరువాత మా తండ్రి స్వయంవరము చాటించినాడు. మా ఇంట శివధను స్సున్నది. ఆ ధనుస్సును ఎక్కుపెట్టి వీర్యశుల్కము నిచ్చువానికి నన్నిచ్చి పెండ్లిచేయునట్లు చాటించినాడు. అనేక రాజులు వచ్చినారు. కాని ఒక్కరైనను ఆ ధనుస్సును కదలించలేకపోయినారు. ఆ ధనుస్సు ఎంతో బరువు. కదలింపజాలనివారు ఎక్కుపెట్టగలరా! వచ్చినవా రందరు ఆ ధనుస్సునకు ఒక నమస్కారము చేసి పోవుచుండినారు.

ఇట్లుండగా దీర్ఘకాలమునకు ధర్మాత్ముడైన విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వెంటబెట్టుకొని మా తండ్రి చేయుచుండిన యజ్ఞమును చూడవచ్చినాడు. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను మా తండ్రికి పరిచయము చేసి "వీరు దశరథమహారాజు పుత్రులు. మీ యొద్దనున్న శివధనుస్సును సందర్శించు కుతూహలముతో వచ్చియున్నారు" అని చెప్పినాడు. అంతట, మా తండ్రి, ధనుస్సును తెప్పించినాడు. రాముడు ఆ ధనుస్సును చేతికి తీసికొని ఒకక్షణమున ఎక్కుపెట్టి పూరించినాడు. ఆ యాకర్షణ వేగమునకు శివధనుస్సు విరిగి రెండుముక్కలైనది. పిడుగువంటి శబ్దము వినిపించినది.

అంతటితో నా తండ్రిని పీడించుచుండిన దిగులు తీరిపోయినది. వెంటనే నన్ను రామున కిచ్చుటకు సంకల్పించి మా తండ్రి జలకలశమును చేతికి తీసికొన్నాడు. అప్పుడు రాము డేమన్నాడో తెలియునా! "మా తండ్రి అభిప్రాయము తెలిసికొనక నేను అంగీకరింపను" అన్నాడు.

తతోఽహం తత్ర రామాయ పిత్రా సత్యాభిసంధినా
విశ్రితా దాతు ముద్యమ్య జలభాజన ముత్తమమ్ 118-50
దీయమానాం నతు తదా ప్రతిజగ్రాహ రాఘవః
అవిజ్ఞాయ పితుశ్ఛంద మయోధ్యాధిపతేః ప్రభోః 118-51

అప్పుడు మా మామగారిని పిలిపించి నన్ను రామునికిచ్చి పెండ్లిచేసినారు. ఇదీ నా స్వయంవరకథ. ఈ విధముగా నేను వీరశ్రేష్ఠుడైన శ్రీరామునికి భార్య నైతిని. నేను ధర్మమార్గము ననుసరించుచు నాభర్తయందు మిక్కిలి అనురాగము కలిగి యున్నాను.

ఏవం దత్తాస్మి రామాయ తదా తస్మిన్ స్వయంవరే
అనురక్తాస్మి ధర్మేణ పతిం వీర్యవతాం వరమ్ 118-54

అనసూయ : (సీతాదేవిని కవుగిలించుకొని) సీతా! స్వయంవర కథను ఎంత చక్కగా చెప్పితివి! నీ పలుకులు ఎంతో మధురముగా నున్నవి. నాకు మిక్కిలి సంతోష మైనది. ఇప్పుడు చీకటిపడుచున్నది. నీవిక రాముని యొద్దకు పొమ్ము. ఎల్లప్పుడును రాముని అనుసరించి యుండుము.

గమ్యతా మనుజానామి రామ స్యానుచరీభవ
కథయం త్యాహి మధురం త్వయాహం పరితోషితా 119-10

సీతా! నిన్ను చూడచూడ నాకు సంతోష మెక్కువయగుచున్నది. నా యెదుట అలంకరించుకొనుము. నేను చూచి ఆనందింతును.

సీతాదేవి చక్కగా అలంకరించుకొని అనసూయాదేవికి నమస్కరించి ఆమె మంగళాశీస్సులను బడసి రాముని యొద్దకు వెళ్లినది.

ఇట్టి అలంకారముతో తనచెంతకు వచ్చిన సీతాదేవినిచూచి శ్రీరాముడు మిక్కిలి సంతోషించినాడు. అనసూయాదేవి తనకు ప్రసాదించిన ప్రీతిదానమును గూర్చియు ఆమె తనతో జరిపిన సంభాషణమును గురించియు సీతాదేవి శ్రీరామునితో చెప్పినది. ఈ లోకమున దుర్లభమైన సత్కారము సీతాదేవికి లభ్యమైన దని రామలక్ష్మణులు సంతోషించినారు.

ఆ రాత్రియంతయు ఆశ్రమములోని ఋషులతో గడపి ఉదయమున ఋషుల యొద్ద సెలవుగైకొనుటకు వెళ్ళినారు.

**ఋషులు :** రామా ! ఈ మహారణ్యమున క్రూరరాక్షసులు నానా రూపములతో చరించుచున్నారు. మనుష్యులను భక్షించువారు, రక్తమునే ఆహారముగా గలవారు అనేకు లున్నారు. క్రూరమృగములు సైతము లెక్కలేక ఉన్నవి. మునులు కొంచెము ఏమరియున్నను రాక్షసులు వారిని వధించి భక్షించుచుందురు. మీరు సర్వదా జాగరూకులై యుండవలయును.

రామా ! ఇదిగో ! ఇదియే అరణ్యములోనికి మార్గము. అడవినుండి ఫలపుష్పములను కొనివచ్చుటకు మహర్షులు ఈ మార్గముననే వెళ్ళుచుందురు. మీరుకూడ ఆ దారి ననుసరించి నడచుటయే మంచిది.

[మహర్షులు నడచిన మార్గము ననుసరించుటవలన గొప్ప ఫలప్రాప్తి కలుగును]

ఏషపంథా మహర్షీణాం ఫలా న్యాహరతాం వనే
అనేన తు వనే దుర్గం గంతుం రాఘవ తే క్షమమ్. 119-21

మునులు కావించిన మంగళాచరణము గైకొని శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతుడై సూర్యుడు మేఘమండలమున ప్రవేశించునట్లు అరణ్యమున ప్రవేశించినాడు.

[రాముడు సూర్యునివలె నడచుచుండగా సీతాదేవి ఛాయాదేవివలె రాముని అనుసరించినది. "ఛాయేవాను గతాసదా" అని చెప్పిగదా జనకుడు సీతాదేవిని శ్రీరాముని కిచ్చి కన్యాదానము చేసినాడు !]

ఇతీవత్తైః ప్రాంజలిభి స్తపస్విభి
ర్ద్విజైః కృతః స్వస్త్యయనః పరంతపః
వనం సభార్యః ప్రవివేశ రాఘవ
స్సలక్ష్మణ స్సూర్య ఇవాభ్రమండలమ్. 119-22

ఓంతత్సత్.

కనబడుటలేదు. ఉత్సవములు లేవు. పట్టణకాంతిసైతము రామునివెంట అరణ్యమునకు పోయినట్లే తోచుచున్నది. శ్రీరాముడు మరల వచ్చి ఈ అయోధ్యకు వెలుగు నెప్పుడిచ్చునో గదా!

బహిర్యాత్రాం న గచ్ఛంతి చిత్రమాల్యధరా నరాః
నోత్సవాస్సంప్రవర్తంతే రామశోకార్దితే పురే 114-26

సహి నూనం మమ భ్రాత్రా పురస్యాస్య ద్యుతిర్గతా
నహి రాజ త్యయోధ్యేయం నాసారేవార్జునీ క్షపా 114-27

కదా సుఖలుమే భ్రాతా మహోత్సవ ఇవాగతః
జనయిష్య త్యయోధ్యాయాం హర్షం గ్రీష్మ ఇవాంబుదః 114-28

ఈవిధముగా విలపించుచు భరతుడు దశరథుని భవనమునకు వెళ్లి తల్లులను అచ్చట దింపి వసిష్ఠునితో అనుచున్నాడు.

*భరతుడు* : గురువర్యా! నేనిప్పుడే నందిగ్రామమునకు వెళ్లుచున్నాను. రాముని బాసిన దుఃఖమును సహించుచు రాముని రాక నిరీక్షించుచు అక్కడనే నివసించెదను.

*వసిష్ఠుడు* : భరతా! నీవు చెప్పినట్లే కానిమ్ము.

## పాదుకా పట్టాభిషేకము

భరత శత్రుఘ్నులు రథము నారోహించినారు. భరతుడు రామ పాదుకలను శిరసా వహించి నందిగ్రామమునకు వెళ్లి రథము దిగి వసిష్ఠునితో అనుచున్నాడు.

*భరతుడు* : శ్రీరాముడు నాకు న్యాసముగా ఇచ్చిన ఈ రాజ్యమును ఈ రామ పాదుకలే రక్షించుగాక. ఈ పాదుకలకే శ్వేతచ్ఛత్రమును పట్టింపుడు. ఇవి శ్రీరాముని పాదములనియే భావింపదగియున్నవి. ఈ పాదుకలు రాజ్యమును రక్షింపగలవు.

ఏతద్రాజ్యం మమ భ్రాత్రా దత్తం సన్న్యాస వత్స్వయమ్
యోగక్షేమ వహేచే మే పాదుకే హేమభూషితే 115-14

ఛత్రం ధారయత క్షిప్ర మార్యపాదా విమౌ మతౌ
ఆభ్యాం రాజ్యే స్థితో ధర్మః పాదుకాభ్యాం గురో ర్మమ 115-16

శ్రీరాముడు నాయెద్ద దాచియుంచిన ఈ రాజ్యమును రాముడు మరలివచ్చు వరకును పాలింతును. శ్రీరాముడు వచ్చిన క్షణమే ఈ పాదుకలను శ్రీరాముని పాదములకు నేను స్వయముగా తొడిగి పాదుకలతో కూడిన రామ పాదముల దర్శనము చేసికొనగలను.

క్షిప్రం సంయోజయిత్వాతు రాఘవస్య పునస్స్వయమ్
చరణౌ తౌతు రామస్య ద్రక్ష్యామి సహపాదుకౌ 115-18

అంతటితో ఈ భారమును వదిలించుకొని రాముని సేవ చేయుచుందును. శ్రీరామునికి రాజ్యము సమర్పించి నా పాపమును పోగొట్టుకొనెదను. శ్రీరాముడు వచ్చి పట్టాభిషేకము చేసికొని ప్రజలను సంతోషపెట్టునేని ఈ రాజ్యభోగమునకు నాలుగింతలుగా నాకు సంతోషమును కీర్తియును లభింపగలవు.

అభిషిక్తేతు కాకుత్స్థే ప్రహృష్ట ముదితే జనే
ప్రీతిర్మమ యశశ్చైవ భవే ద్రాజ్యా చ్చతుర్గుణమ్ 115-21

[భరతుని వాక్కు ఫలించినది. భరతుని కీర్తి ఈనాటికిని దేదీప్యమానముగా వెలుగుచున్నది. ఇకమీదకూడ అట్లే శాశ్వతముగా వెలుగగలదు]

భరతుడు జటావల్కములు ధరించి మునివలె నందిగ్రామమున నివసించుచు రాముని రాకకు ఎదురుచూచుచున్నాడు. శ్రీరామ పాదుకలకు పట్టాభిషేకము చేసి రాజ్యకార్యములను పాదుకలకు నివేదించుచు, పాదుకలకు సేవచేయుచు, సామంతులు తెచ్చిన కానుకలను మొదట పాదుకలకు సమర్పించుచు రాజ్యభారమును రామ పాదుకలమీద మోపి భరతుడు రాజ్యమును పాలించుచున్నాడు.

పాదుకే త్వభిషిచ్యాథ నందిగ్రామేఽవసత్తదా
భరత శ్శాసనం సర్వం పాదుకాభ్యాం న్యవేదయత్. 115-25

తతస్తు భరత శ్శ్రీమా నభిషిచ్యార్యపాదుకే
తదధీన స్తదా రాజ్యం కారయామాస సర్వదా. 115-26

తథాహి యత్కార్య ముపైతికించి
దుపాయనం చోపహృతం మహార్హమ్
స పాదుకాభ్యాం ప్రథమం నివేద్య
చకార పశ్చాద్భరతో యథావత్. 115-27

## శ్రీరాముడు చిత్రకూటమునుండి వెడలుట

చిత్రకూటపర్వతముచెంత రాముని ఆశ్రయించుకొని కొందరు ఋషులున్నారు. భరతుడు వచ్చివెళ్లినపిదప వారందరు ఆ యాశ్రమమును వదలిపెట్టి మరియొక ఆశ్రమమునకు వెళ్లదలచినట్లు కనబడినది. వారు రాముని వేలుపెట్టి చూపించుట, గుసగుసలాడుకొనుట, భయపడినట్లు ముఖములు పెట్టుట, ఇవన్నియు పల చేయుచున్నారో తెలియక శ్రీరాముడు కులపతియైన ఋషితో అనుచున్నాడు.

రాముడు : స్వామీ ! మీ బాధ ఏమిటి ? నా తమ్ముడుగాని నా భార్యగాని మీపట్ల అపరాధ మేమైనను చేసిరా ?

కులపతి : నాయనా ! అట్టి దేమియు లేదు. మంగళస్వరూపిణియగు సీతాదేవి అధర్మముగా ప్రవర్తించునా ! అందులో ఋషులపట్ల !

కుతః కల్యాణసత్త్వాయాః కల్యాణాభిరతే స్తథా
చలనం తాత వైదేహ్యా స్తపస్విషు విశేషతః. 116-9

రాక్షసులవలన మాకు విశేషముగా బాధలు కలుగుచున్నవి. రావణుని తమ్ముడు ఖరుడను రాక్షసు డొక డున్నాడు. వాడు అతిక్రూరుడు. మనుష్యులను వధించి భక్షించు వాడు. వాడు మా తపస్సులకు భంగము కలిగించుచున్నాడు. మమ్ములను అనేక విధములుగా బాధించుచున్నాడు. నీ విచ్చటికి వచ్చినది మొదలు ఆ రాక్షసునిబాధ ఎక్కువైనది. మా వారిని కొంత మందిని వధించినాడు. కావున మేము వేరొక ప్రదేశమునకు వెళ్లుట క్షేమకర మని ఆలోచించుచున్నాము. ఖరుడు నిన్ను సైతము బాధ పెట్టగలడు. నీ కిష్టమైనయెడల మీరుకూడ మాతో రావచ్చును.

రాముడు ఋషులకు కొంతధైర్యము చెప్పినాడు. కాని వారందరు ఇంకొక ఆశ్రమమునకు వెళ్ళిపోయినారు.

తరువాత రాముడుకూడ ఆలోచించినాడు. "ఇక్కడనున్నయెడల భరతుడు తల్లులు, ప్రజలు, అందరు జ్ఞప్తికి వచ్చుచుందురు. అదిగాక, భరతుని ఏనుగులు, గుఱ్ఱములు, ఆశ్రమప్రదేశమును త్రొక్కి పాడుచేసినవి. కావున మరియొక ఆశ్రమమునకు వెళ్లుటయే మేలు" అని నిశ్చయించుకున్నాడు.

## సీతారామలక్ష్మణులు అత్రిమహాముని ఆశ్రమమునకు పోవుట

సీతారామలక్ష్మణులు బయలుదేరి అత్రిమహాముని ఆశ్రమమునకు వెళ్లి మహామునికి నమస్కరించినారు. అత్రిమహాముని శ్రీరాముని తన కుమారునివలె ఆదరించినాడు. ఆ మహామునియు ఆయన భార్యయైన అనసూయాదేవియును సీతారామలక్ష్మణులను సత్కరించినారు.

అత్రి : సీతా ! అనసూయకు నమస్కరింపుము. అనసూయ మహత్త్వమును గురించి వినుము. పూర్వము పది సంవత్సరములు వర్షములేక క్షామము సంభవించినప్పుడు ఈమె ఫలమూలములను సృజించి ఋషుల కిచ్చి గంగానదినికూడ ప్రవహింపజేసినది. పదివేల సంవత్సరములు ఉగ్రతపస్సు చేసిన పుణ్యురాలు. ఒకప్పుడు

దేవకార్యమునకై పది రాత్రులను ఒక్క రాత్రిగా చేసిన మహా ప్రభావురాలు. రామా! అనసూయ నీకు తల్లివంటిది. కోపమును జయించిన సాధ్వి. సర్వ భూతములు నమస్కరింపదగినది. ఆమె కావించిన మహత్కార్యములను బట్టి ఆమెకు 'అనసూయ' అను పేరు వచ్చినది.

**రాముడు :** సీతా! విన్నావా మహర్షి మాటలు! నీ శ్రేయస్సుకొరకు ఆ మహామహు రాలిని సేవింపుము.

సీతాదేవి అనసూయకు ప్రదక్షిణము చేసి నమస్కరించి క్షేమము నడిగినది.

**అనసూయ :** సీతా! నిన్ను చూచి మిక్కిలి సంతోషమైనది. నీ భాగ్యమే భాగ్యము. నీవు ధర్మము ననుసరించి నడచుచున్నావు. భోగములను, బంధువులను, వదలి భర్త వెంట అరణ్యమునకు వచ్చుట గొప్ప సంగతి. భర్త నగరస్థుడైనను, వనస్థుడైనను, పాపియైనను, శుభుడైనను, ఎట్టివాడైనను భర్తను ప్రీతితో సేవించు భార్య ఉత్తమ లోకములను పొందగలదు. దుష్ట వనితలకు ఈ ధర్మ సూక్ష్మము తెలియక ఈ లోకమున నిందలపాలై, మరణించిన పిదప నరకము నకు పోవుదురు. మంచి చెడ్డలను గ్రహించిన నీవంటి పతివ్రతలు సద్గతి పొంద గలరు. నీవు ఇప్పుడున్నట్లే ఎల్లప్పుడును భర్తకు సహధర్మచారిణివిగా నుండుము. నీకు కీర్తియును, ధర్మఫలమును లభించును.

తదేవమేనం త్వ మనువ్రతాసతీ
పతివ్రతానాం సమయానువర్తినీ
భవస్వ భర్తు స్సహధర్మచారిణీ
యశశ్చ ధర్మంచ తత స్సమాప్స్యసి 117-28

**సీత :** పూజ్యురాలవగు నీవు ఇట్లుపదేశించుటలో ఆశ్చర్యమేమున్నది! స్త్రీకి భర్తయే దైవమని నేనుకూడ ఎరిగియున్నాను. నా భర్త ఆచారహీనుడైనను నేను పతిసేవ చేయవలసియుండగా రామునివంటి భర్తను సేవింపకుందునా! రాముడు సుగుణముల గని. సర్వభూతములయందును దయగలవాడు. జితేంద్రియుడు. స్థిరమైన అనురాగము గలవాడు. ధర్మాత్ముడు - తల్లి దండ్రులవలె ప్రియుడు.

యద్యప్యేష భవేద్భర్తా మ మార్యే వృత్త వర్జితః
అద్వైధ ముపచర్యవ్య స్తథాప్యేష మయా భవేత్ 118-3

కింపునర్యో గుణశ్లాఘ్య స్సానుక్రోశో జితేంద్రియః
స్థిరానురాగో ధర్మాత్మా మాతృవ త్పితృవ త్ప్రియః 118-4

# శరభంగాశ్రమము

ముగ్గురు ప్రయాణముచేసి శరభంగాశ్రమమును సమీపించినారు. దేవేంద్రుడు దేవతలతో కూడివచ్చి శరభంగమహామునితో సంభాషించుట రాముడు దూరము నుండి చూచి లక్ష్మణునితో అనుచున్నాడు.

*రాముడు* : (ఇంద్రుని రథమును చూపించి) లక్ష్మణా! అటు చూడుము. ఇంద్రుడు దేవతలనుగూడి ఆశ్రమమునకు వచ్చిన ట్లున్నది. సీతయును, నీవును ఒక్కక్షణ మిక్కడనే యుండుడు. నేను వెళ్ళి ఆ విషయము తెలిసికొని వచ్చెదను.

రాముడు వచ్చుట చూచి ఇంద్రుడు శరభంగునితో రహస్యముగా "రాముడు వచ్చుచున్నాడు. పని పూర్తియగుటకు ముందు నేనతనితో మాటలాడకూడదు. పని అయిన వెంటనే రాముని దర్శనము చేసికొందును" అని స్వర్గమున కరిగినాడు.

రాముడు సీతాలక్ష్మణ సమేతుడై వచ్చి, ఆశ్రమమున ప్రవేశించినాడు. మునికి ముగ్గురు నమస్కరించి వారి ఆతిథ్యము స్వీకరించినారు.

*రాముడు* : మునీంద్రా! మీతో మాటలాడి వెళ్ళినది ఇంద్రుడేనా?

*శరభంగుడు* : అవును, ఇంద్రుడే. నన్ను బ్రహ్మలోకమునకు తీసికొనిపోవుటకై వచ్చినాడు. కాని నీవంటి అతిథి ఆశ్రమమునకు విచ్చేయు సమయమున నేను వెళ్లుట సరికాదని ఇందే యున్నాను. నీ దర్శనము చేసికొనిన తరువాత బ్రహ్మలోకమునకు వెళ్ళదలచితిని. రామా! నా తపస్సుచే బ్రహ్మలోకమును, స్వర్గమును, ఇతర పుణ్యలోకములను ఆర్జింపగలిగితిని. వానిని నీకు సమర్పించెదను - గ్రహింపుము.

*రాముడు* : స్వామీ! నేనే సమస్తలోకములను సంపాదించుకొందును. మీరు నా కొక్క సహాయము మాత్రము చేసిన చాలును. ఈ అరణ్యమున మేము నివసించుటకు తగిన ప్రదేశమును నిర్దేశింపగోరుచున్నాను.

అహ మేవాహరిష్యామి సర్వలోకా న్మహామునే
ఆవాసం త్వహ మిచ్ఛామి ప్రదిష్ట మిహ కాననే 5-33

*శరభంగుడు* : నాయనా! ఇక్కడికి సమీపముననే సుతీక్ష్ణుని ఆశ్రమ మున్నది. అచ్చటికి వెళ్ళి వారిని అడిగినయెడల మీకు అనుకూలమైన ప్రదేశమును చూపగలరు. ఈ యేటిగట్టుననే పోవుదురేని మీకు సుతీక్ష్ణుని ఆశ్రమము కానవచ్చును. మీరు ఇప్పుడే పోవలదు. నేను నాదేహమును విసర్జించుట చూచి వెళ్ళుదురుగాక.

మంత్రవిదుడైన శరభంగుడు అగ్నిహోత్రమును ప్రజ్వరిల్లజేసి అగ్నిప్రవేశము చేసినాడు. సీతారామలక్ష్మణులు ఈ దృశ్యమును చూచి ఆశ్చర్యపడినారు. శరభంగుని శరీరము దగ్ధమైపోయినది. కొంతసేపటికి యౌవనరూపముతో గొప్ప తేజస్సుతో అగ్నిలో నుండి వెలుపలికివచ్చి శరభంగుడు బ్రహ్మలోకమున కరిగినాడు.

[అయోధ్యలో ఇట్టి చిత్రము కనబడునా!]

## శ్రీరాముడు ఋషులకు అభయ మిచ్చుట

శరభంగుడు దివంగతు డైనపిదప ఋషు లందరు గుంపుకూడి రాముని సన్నిధికి వచ్చినారు. వైఖానసులు, వాలఖిల్యులు, సంప్రక్షాళులు, సూర్యచంద్రుల కిరణములు మాత్రమే ఆహారముగా గలవారు, పత్రాహారులు, కంఠమువరకు నీటిలో మునిగి యుండువారు, జలాహారులు, వాయుభక్షులు, ఆకాశమున నిలిచియుండగలిగినవారు, ఇట్లు అనేక విధములుగా తపమాచరించు మునులు శ్రీరాముని సన్నిధికి వచ్చినారు.

**ఋషులు** : రామా! ఈ భూమండలమునకు నీవు నాథుడవు. ధర్మవేత్తవు. నీ పితృభక్తి, నీ సత్యము, నీ కీర్తి ముల్లోకములలో ప్రసిద్ధి కెక్కినవి. ఒక సంగతి నీతో మనవి చేసికొనుటకు వచ్చియున్నాము. క్షమింపుము. రాజు ప్రజలను రక్షింపవలయును. ప్రజలయొద్ద ఆఱవభాగము (ఆదాయములో) పన్ను తీసికొని ప్రజలను రక్షింపని రాజును అధర్మము ఆవరించును.

అధర్మస్తు మహాం స్తాత భవే త్తస్య మహీపతేః
యో హరే ద్బలిషడ్భాగం న చ రక్షతి పుత్రవత్ 6-11

ప్రజలను రక్షించు రాజు ఈ లోకమున కీర్తి పొంది, పిదప వుత్తమలోకములను పొందగలడు. రాజు మునులను సైతము రక్షింపవలయును. "మునులు పన్నులు చెల్లింపరుగదా. వారిని గురించిన బాధ్యత రాజు కెక్కడిది?" అని తలపరాదు. మునులు తపస్సుచేసి ఆర్జించిన ధర్మఫలములో నాలుగవభాగము రాజునకు చెందును.

యః కరోతి పరంధర్మం ముని ర్మూలఫలాశనః
తత్ర రాజ్ఞ శ్చతుర్భాగః ప్రజా ధర్మేణ రక్షితః. 6-14

రామా! నీవు నాథుడవుగా నుండియు ఈ వానప్రస్థు లందరు అనాథులవలె రాక్షసులచే వధింపబడుచున్నారు. ఇదిగో! ఇటు వచ్చి చూడుము. రాక్షసులచే వధింపబడిన మునుల కళేబరములు లెక్కలేక పడియున్నవి. ఇచ్చటనేకాదు-పంపాసరస్సు చెంతగాని, మందాకినీ తీరమునగాని, చిత్రకూటపర్వత ప్రాంతమునగాని, ఎక్కడచూచి

నను ఇక్లే యున్నది. ఈ రాక్షసుల బాధ దుర్భరముగా నున్నది. మేము నిన్ను శరణు వేడుచున్నాము. నీవుతప్ప మాకు వేరుగతిలేదు. ఈ రాక్షసుల బాధ నిర్మూలించి మమ్ము రక్షింపుము.

**రాముడు :** ఋషులారా! మీరు నన్ను ఆజ్ఞాపింపదగినవారుగాని వేడుకొనవలసినవారు కారు. మీ బాధ తప్పక తీర్చెదను. నేను తండ్రి ఆజ్ఞను పాలించుటకై అరణ్యమునకు నాపనికొరకే వచ్చినను మీకు వాటిల్లిన రాక్షసబాధ నివారించుటకుకూడ వచ్చిన ట్లయినది. కావున నా కీ వనవాసము తలవని తలంపుగా మహా ఫలవంతమయినది.

నైవ మర్హథ మాం వక్తు మాజ్ఞాప్యోహం తపస్వినామ్
కేవలే నాత్మకార్యేణ ప్రవేష్టవ్యం మయా వనమ్. 6-22

విప్రకారమపాక్రష్టుం రాక్షసై ర్భవతా మిమమ్
పితుస్తు నిర్దేశకరః ప్రవిష్టోహ మిదం వనమ్. 6-23

భవతా మర్థసిద్ధ్యర్థ మాగతోహం యదృచ్ఛయా
తస్య మేఽయం వనే వాసో భవిష్యతి మహాఫలః 6-24

నేను, నాతమ్ముడు మీ శత్రువులైన రాక్షసులను తప్పక వధింతుము. మీరు నిర్భయముగా నుండుడు.

## సుతీక్ష్ణ మహాముని ఆశ్రమము

రాముడు ఋషులకు అభయ మిచ్చినాడు. ఆ తరువాత సీతారామలక్ష్మణులు సుతీక్ష్ణ మహాముని ఆశ్రమమునకు ప్రయాణ మైనారు. మునులుకూడ వారివెంట కదిలినారు. నదులు, పర్వతములు, అడవులు దాటి సుతీక్ష్ణ మహాముని ఆశ్రమమునకు వచ్చినారు.

**రాముడు :** (మునికి నమస్కరించి) మహర్షీ! నేను రాముడను. మీ దర్శనమునకై వచ్చితిని. నన్ను ఆశీర్వదింపుడు.

రామోఽహమస్మి భగవన్ భవంతం ద్రష్టు మాగతః
త్వం మాఽభివద ధర్మజ్ఞ మహర్షే సత్యవిక్రమ. 7-6

**సుతీక్ష్ణముని :** (రాముని కవుగిలించుకొని) రామా! వచ్చితివా నాయనా! నేను నీకొరకే నిరీక్షించుచున్నాను. నీవు చిత్రకూటమునకు వచ్చినట్లు విన్నాను. నీ శుభదర్శనము కోరి స్వర్గమునకు పోవుట మాని ఇందే యున్నాను. నీ రాకవలన

ఈ యాశ్రమము సనాథమయినది. ఇంద్రు డిచ్చటికి వచ్చి, నా తపస్సుచే నేను సమస్త లోకములను జయించితి నని చెప్పినాడు. నీకు ఆ లోకముల నిచ్చెదను. స్వీకరింపుము. నీ భార్యతోను లక్ష్మణునితోను, ఆ లోకములలో హాయిగా విహరింపవచ్చును.

రాముడు : మహర్షీ ! ఆలోకము లన్నిటిని నేనే ఆర్జించుకొనియెదను. ఈ యరణ్యమున వాసయోగ్యమైన ప్రదేశమును చూపింతురేని అదియే చాలును.

సుతీక్ష్ణుడు : మా ఆశ్రమప్రదేశము మంచిదే. ఇచ్చట ఫలమూలములకు కొరతలేదు. ఎందరో ఋషులు ఇందున్నారు. అన్ని వసతులు అనుకూలముగనే యున్నవి. కాని ఒక్కచిక్కుమాత్రము కలదు. అడవిమృగములు నిర్భయముగా చరించుచు ఋషులకు బాధ కలిగించుచుండును. అది ఒక్కటే దోషము.

రాముడు : నేనిచ్చట వసింతునేని మృగములు వచ్చినప్పుడు వానిని నా బాణములతో వధింతును. ఆశ్రమమున మృగముల చంపిన యెడల మీకు కోపము కలుగ వచ్చును. అంతకంటె కష్టము నాకు మరియొకటి యుండదు. కావున వేరు ప్రదేశము చూచుకొనుటయే మంచిది.

ఈవిధముగా కొంతసేపు ముచ్చటించుకొని ఆరాత్రి ఆశ్రమమున గడిపి మరు నాడు, శ్రీరాముడు మహర్షిని సమీపించి సెలవు గైకొనుచున్నాడు.

రాముడు : మహర్షీ ! మీ దయవలన రాత్రి సుఖముగా గడచినది. మా వెంట వచ్చిన మునులు మమ్ములను త్వరపెట్టుచున్నారు. మాకును దండకారణ్యమునందలి ఆశ్రమము లన్నింటిని దర్శింపవలయు నని కోరిక యున్నది. మాకు అనుజ్ఞ దయ చేయుడు. ఎండ యెక్కకముందే బయలుదేరుట మేలు.

[ఇచ్చట వాల్మీకిమహర్షి ఒక ఉపమానమును చెప్పియున్నారు.

**అవిషహ్యాతపో యావ త్సూర్యో నాతివిరాజతే**
**అమార్గే ణాగతాం లక్ష్మీం ప్రాప్యే వాన్వయవర్జితః.** 8-8

అన్వయవర్జితుడు తప్పుదారి నడచి సంపాదించిన సంపదవలన ప్రకాశింపనట్లు సూర్యుడు మందముగా నుండగనే - అనగా ఎండ యెక్కకముందే - మేము ప్రయాణము చేయుట మంచిది అని రాము డనుచున్నాడు.

ఉండవలసినచోట ఉన్నప్పుడే సంపద ప్రకాశించును.]

సీతారామలక్ష్మణులు మహర్షికి నమస్కారము చేసినారు.

**సుతీక్ష్ణుడు :** (రామలక్ష్మణులను కవుగిలించుకొని) మీకు మార్గము శుభకర మగుగాక ! దండకారణ్యములోని ఆశ్రమము లన్నియు రమణీయములుగా నుండును. మీరు వెళ్లి అన్నింటిని చూచి మా ఆశ్రమమునకు మరియొక పర్యాయము రండు.

సీతారామలక్ష్మణులు మునికి ప్రదక్షిణముచేసి సెలవు తీసికొన్నారు. సీతాదేవి రామలక్ష్మణుల కిద్దరకు వారి ధనుర్బాణములను, ఖడ్గములను అందిచ్చినది. వారు ఆయుధములను గ్రహించినారు. అందరు బయలుదేరినారు.

తత శ్శుభతరే తూణీ ధనుషీ చాయతేక్షణా
దదౌ సీతా తయోర్భ్రాత్రోః ఖడ్గౌ చ విమల త్సరూ. 8-18

ఆబధ్య చ శుభేతూణీ చాపౌ చాదాయ సస్వనౌ
నిష్క్రాంతా వాశ్రమా ద్గంతు ముభౌ తౌ రామలక్ష్మణౌ. 8-19

## మునిధర్మమునుగూర్చి సీతాదేవి శ్రీరాముని హెచ్చరించుట

**సీత :** **నాథా !** ఒక్కమాట. మునిధర్మము మిక్కిలి గొప్పది. అతి సూక్ష్మమైన మార్గమున సంపాదింపతగినదేగాని సులభముకాదు. కామజన్యము లగు వ్యసనములను విడిచినవారికే మునిధర్మము సాధ్యము.

అయంధర్మ స్సుసూక్ష్మేణ విధినా ప్రాప్యతే మహాన్
నివృత్తేన తు శక్యోయం వ్యసనా త్కామజా దిహ. 9-2

కామమునుండి జనించు వ్యసనములు మూడు గలవని చెప్పుదురు. మొదటిది అనృతము పలుకుట. రెండవది పరదారాభిగమనము. మూడవది వైరకారణములేకయే రౌద్రమును అవలంబించుట. కడపటివి రెండును మొదటిదానికన్న బలవత్తరములు.

త్రీణ్యేవ వ్యసనాన్యత్ర కామజాని భవంత్యుత
మిథ్యావాక్యం పరమకం తస్మా ద్గురుతరా వుభౌ. 9-3

పరదారాభిగమనం వినా వైరంచ రౌద్రతా 9-4

మొదటి రెండు వ్యసనములు నీయందులేవు. ఆ విషయము నాకు చక్కగా తెలియును. ధర్మము, సత్యము నీయందు ప్రతిష్ఠితములై యున్నవి. నీవు జితేంద్రియుడవు.

తవ వశ్యేంద్రియత్వం చ జానామి శుభదర్శన. 9-9

మూడవ వ్యసనము మాత్రము నీ కిప్పుడు సంభవించియున్నది. ఋషులను రక్షించుటకుగా రాక్షసులను వధింతు నని ప్రతిజ్ఞచేసితివి. అందుకొరకే నీవును నీ తమ్ముడును ధనుర్బాణములను ధరించి దండకారణ్యమునకు వచ్చినారు. నీ ప్రతిజ్ఞను, మీ

ఆయుధములను తలచుకొని నామనస్సు బాధపడుచున్నది. మనము దండకారణ్యమునకు వెళ్లుట నాకు ఇష్టములేదు. రాక్షసులు నీకంట బడినచో బాణములను ప్రయోగింతువు. ధనుర్బాణములు చేత నుండినయెడల ఊరక యుండనిచ్చునా! క్షత్రియుని చేత ధనుస్సు ఉండుట అగ్నిహోత్రునియొద్ద కట్టె లున్నట్టే.

పూర్వము ఒకముని అడవిలో తప మాచరించుచు నియమబద్ధముగా కాలము గడపుచుండినాడు. అతని తపస్సునకు విఘ్నము కలిగించుటకై ఇంద్రుడు భటరూపమును దాల్చి ఒక ఖడ్గమును గైకొని ఆశ్రమమునకు వచ్చి "స్వామీ! ఈ ఖడ్గమును మీయొద్ద దాచి యుంచుడు" అని చెప్పి ఖడ్గమును ఆ మునిచేతి కిచ్చి వెళ్ళిపోయినాడు. పాపము! ఆముని ఏమరుపాటులేక ఖడ్గమును కాపాడుచుండినాడు. ఆశ్రమములో పెట్టినచో పోవునేమో యని భయపడి ఫలమూలములకు వెళ్ళినప్పుడుగాని ఇతర సమయములలోగాని ఆ ఖడ్గమును చేతబట్టుకొని వెళ్ళుచుండినాడు. న్యాసభూతముగా ఈయబడిన ఖడ్గమును కాపాడక ఎట్లుండగలడు? ఖడ్గమును ఒక క్షణమైనను వదలియుండుటలేదు. ఈ ఖడ్గసేవలో తపస్సుమాట మరచిపోయినాడు. కాలక్రమేణ, ఖడ్గసంయోగమువలన క్రూర స్వభావుడైనాడు. ఖడ్గముతో ప్రాణిహింస చేయసాగినాడు. ఈ విధముగా ప్రవర్తించి శస్త్ర సహవాసమువలన నరకమునకు పోయినాడు. ఆయుధ సంపర్కము అంత పని చేసినది. ఆయుధ సంపర్కము అగ్ని సంపర్కము వంటిదని పెద్దలందురు. నీకు తెలియని విషయముకాదు. నీయందు నాకు గల స్నేహము చేతను, గౌరవము చేతను నీకు జ్ఞప్తికి తెచ్చుచున్నానే గాని నీకు నేర్పుటకాదు.

స్నేహాచ్చ బహుమానాచ్చ స్మారయే త్వాం న శిక్షయే. 9-24

రాక్షసుడు నీ కంటబడిన యెడల, అతనికిని నీకును విరోధము లేకపోయినను, నీ ప్రతిజ్ఞను పాలించుటకు నీ వా రాక్షసుని వధింతువు. అపరాధము చేయనివారిని చంపుట నా కిష్టములేదు.

అపరాధం వినా హంతుం లోకాన్ వీర న కామయే. 9-26

[వీర! అని సంబోధించి అట్లు చేయుట వీరలక్షణము కాదని సూచించినది.]

ఆర్తిలో నున్న మునులను రక్షించుటమాత్రమే వీరు లగు క్షత్రియులు ధనుస్సుతో చేయవలసిన పని.

క్షత్రియాణాం తు వీరాణాం వనేషు నిరతాత్మనామ్
ధనుషా కార్యమేతావ దార్తానాం త్వభిరక్షణమ్ 9-27

[అంతేగాని ఏ రాక్షసుడో యే మునినో యెప్పుడో చంపినా డని, కనబడిన రాక్షసుల నందరను వధించుటకు ధనుస్సు ఉపయోగించుట ఏమి న్యాయము!]

నాథా! శస్త్ర మెక్కడ, అరణ్య మెక్కడ! క్షాత్ర మెక్కడ, తప స్సెక్కడ! ఇవి పరస్పర విరుద్ధములు. మనము దేశధర్మమును అవలంబింపవలయును.

[అడవికి తపస్సుకై వచ్చి ధనుర్బాణములతో పని పెట్టుకొనుట బాగుండునా! వనవాసమునకు వచ్చినవారము తాపసధర్మమునే అవలంబింపవలయును. క్షత్రియధర్మము నవలంబించుట తగదు.]

నాథా! శస్త్ర సేవనమువలన క్రూరబుద్ధి జనించును. వనవాస వ్రతమును పూర్తి గావించి మనము అయోధ్యకు వెళ్లినపిదప క్షత్రియధర్మమును అవలంబింపవచ్చును.

క్వ చ శస్త్రం క్వ చ వనం క్వ చ క్షాత్రం తపః క్వ చ
వ్యావిద్ధ మిద మస్మాభి ర్దేశధర్మస్తు పూజ్యతామ్ 9-27

తదార్య కలుషా బుద్ధి ర్జాయతే శస్త్రసేవనాత్
పునర్గత్వా త్వయోధ్యాయాం క్షత్రధర్మం చరిష్యసి 9-28

ఈ లోకమంతయు ధర్మముమీద ఆధారపడియున్నది. ధర్మమువలన అర్థము కలుగును. ధర్మమువలన సుఖము కలుగును. ధర్మమువలన సమస్తము కలుగును. ఈ లోకము ధర్మసార మన దగియున్నది. శరీరమును కర్శింపజేసి నియమప్రకారము వ్రతములు సలిపి ఎంతో సాధన చేసినగాని ధర్మము చేకూరదు. సుఖములోనుండి సుఖము ఎన్నటికిని కలుగదు. కావున ఎల్లప్పుడు శుచిమతివై ఈ తపోవనమున ధర్మము నాచరింపుము. నీకు తెలియని విషయము ముల్లోకములలో లేదు. అయినను స్త్రీచాపలమువలన నీతో అనుచున్నాను. ధర్మమును గురించి నీకు చెప్పగల సామర్థ్య మెవ్వరికి కలదు! నీవు, నీ తమ్ముడు నా మాటలు ఆలోచించుకొని మీ ఇష్ట మెట్లో అట్లు చేయుడు.

ధర్మాదర్థః ప్రభవతే ధర్మా త్ప్రభవతే సుఖమ్
ధర్మేణ లభతే సర్వం ధర్మసార మిదం జగత్. 9-30

ఆత్మానం నియమై స్తైస్తైః కర్శయిత్వా ప్రయత్నతః
ప్రాప్యతే నిపుణై ర్ధర్మో న సుఖా ల్లభ్యతే సుఖమ్. 9-31

నిత్యం శుచిమతి స్సౌమ్య చర ధర్మం తపోవనే
సర్వం హి విదితం తుభ్యం త్రైలోక్యమపి తత్త్వతః. 9-32

స్త్రీచాపలా దేత దుదాహృతం మే
ధర్మం చ వక్తుం తవ క స్సమర్థః
విచార్య బుద్ధ్యా తు సహానుజేన
య ద్రోచతే త త్కురు మా చిరేణ.

**రాముడు:** సీతా! మొత్తమునకు జనక మహారాజు కొమారితవనిపించుకొన్నావు. నా యెడ నీకుగల స్నేహమునకు అనుగుణముగా హితవాక్యములను పలికితివి.

హితముక్తం త్వయా దేవి స్నిగ్ధయా సదృశం వచః
కులం వ్యపదిశంత్యా చ ధర్మజ్ఞే జనకాత్మజే. 10-2

క్షత్రియుడు ధనుస్సు ధరించియుండగా ఆర్తనాదము వినబడగూడదని నీవే అన్నావు గదా! ఈ మునులెల్లరు ఆర్తులై నా యొద్దకు వచ్చి నన్ను శరణు కోరినారు. నేను వారికి అభయమిచ్చి "మీరు నా అపచారమును క్షమింపుడు. నేనుగా మీ యొద్దకు వచ్చి మీ సేవ చేయవలసియుండగా మీరు నా చెంతకు వచ్చి నన్ను ప్రార్థించుట నాకెంతో సిగ్గుగా నున్నది" అని వారితో చెప్పితిని.

ప్రసీదంతు భవంతో మే హ్రీరేషా హి మమాతులా
య దీదృశై రహం విప్రై రుపస్థేయై రుపస్థితః 10-9

వారిని రక్షింతునని ప్రతిజ్ఞ సైతము చేసితిని. నా ప్రతిజ్ఞను పాలింపక యుండజాలను. వలయునేని ప్రాణమునైనను వదులుకొందును. నిన్నుగాని లక్ష్మణునిగాని వదలగలను. కాని నా ప్రతిజ్ఞను మాత్రము విడువజాలను. అందులో బ్రాహ్మణుల కిచ్చిన ప్రతిజ్ఞను విడువగలనా!

అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్
న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః 10-19

ఒకరు కోరకపోయినను ఋషులను పాలింపవలసిన బాధ్యత నాకు కలదు. అట్టియెడ ప్రతిజ్ఞ సైతము చేసి ఇప్పుడా మాట కాదనగలనా! సీతా! నా యందు నీకుగల ప్రేమననుసరించి నీవు చెప్పిన మాటలకు సంతోషమైనది. ప్రియుడైనవానికే గదా ఎవ్వరైనను హితము నుపదేశించుట! అప్రియునికి ఉపదేశింతురా? నీ హితవాక్యములు నీ గొప్ప కులమునకు, నీ మంచి మనస్సుకు అనురూపముగా నున్నవి. నీవు నా సహధర్మచారిణివి.

[నేను అవలంబించిన ధర్మమును నీవుకూడ అనుసరింపవలయును అన్నమాట.]

నా ప్రాణమునకన్న అధికురాలవు.

మమ స్నేహాచ్చ సౌహార్దా దిదముక్తం త్వయాఽనఘే
పరితుష్టో స్మ్యహం సీతే న హ్యనిష్టోఽనుశిష్యతే. 10-21

సదృశం చానురూపం చ కులస్య తవ చాత్మనః
సధర్మచారిణీ మే త్వం ప్రాణేభ్యోఽపి గరీయసీ. 10-22

ఈ మాటలుచెప్పి శ్రీరాముడు సీతాదేవిని, లక్ష్మణుని వెంటబెట్టుకొని రమ్యమైన తపోవనములకు వెళ్ళినాడు. ముందురాముడు, తరువాత సీతాదేవి, ఆ తరువాత లక్ష్మణుడు ఈ వరుసన నడచినారు. వారివెంట మునులుకూడ వచ్చినారు.

[వనవాసవ్రతము నాచరించుటకు అరణ్యమునకు వెళ్లిన శ్రీరాముడు వారిని వీరిని వధించుటవలన వ్రతభంగమైనదేమో యని సంశయించువారి సందేహము సీతారాముల సంవాదమువలన తీరవచ్చును.]

## సీతారామలక్ష్మణులు తపోవనమున ప్రవేశించుట

సీతారామలక్ష్మణులు నదులను, సరస్సులను, మంచిమంచి వృక్షములను, అడవి మృగములను, పక్షులను తిలకించుచు అరణ్యమున నడచి సాయంకాలమునకు ఒక సరస్సు సమీపించినారు. ఆ సరస్సులోనుండి మధురగానము వినబడినది. కాని మనుష్యులెవ్వరును కానరాలేదు. రామలక్ష్మణులు ఆశ్చర్యచకితులై దానిని గురించి తెలిసికొనగోరి ధర్మభృతుడు అను ఋషిని అడిగినారు.

**రాముడు :** స్వామీ ! ఇది రహస్యము కాదేని ఈ అద్భుతమునుగూర్చి వినుటకు కుతూహలపడుచున్నాము.

వక్తవ్యం యది చేద్విప్ర నాతిగుహ్యమపి ప్రభో. 11-10

**ధర్మభృతుడు :** రామా ! పంచాప్సర మని ఈ తటాకమునకు పేరు. సార్వకాలికమైనది. ఈ సరస్సును మాండకర్ణి యను ఋషి తన తపస్సుచే నిర్మించినాడు. ఆయన పదివేల సంవత్సరములు నీటియందే యుండి వాయుభక్షణము చేయుచు తపస్సు చేసినాడు. ఇట్టి తీవ్రతపమునకు విఘ్నము కలిగింపగోరి ఇంద్రుడు అయిదుమంది అప్సరసలను పంపినాడు. మాండకర్ణిఋషి ఆ అప్సరసలకు లోబడి వారితో వాసము చేయుచున్నాడు. వారికొరకు ఈ జలములోపల ఒక ప్రాసాదమును కట్టించినాడు. తన తపశ్శక్తివలన యువకుడై వారితో క్రీడించుచు కాలక్షేపము చేయుచున్నాడు. ఆటపాటలు సర్వకాలములందును సాగుచునే యుండును. ఇప్పుడు మనకు వినబడుచున్న సంగీతము అచ్చటిదే.

ఇట్లు మాటలాడుకొనుచు ప్రయాణము సాగించి ఒక ఆశ్రమమండలమునకు వచ్చినారు. ఆ ప్రదేశమున అనేక ఆశ్రమము లున్నవి. అనేకమంది ఋషులు తపస్సు చేయుచుండినారు. సీతారామలక్ష్మణులు ఆ ప్రదేశమున కొంతకాలము గడపి ఆ ప్రాంతమున నుండిన ఆశ్రమములకు రెండవమారుకూడ వెళ్ళినారు. ఈ విధముగా ఒక ఆశ్రమమున పదుమూడు మాసములు, ఒకచోట ఒక సంవత్సరము, ఒకచోట నాలుగు

మాసములు, ఒకచోట అయిదు మాసములు, ఒక ఆశ్రమమున ఆరు మాసములు, ఒక చోట పదు మాసములు, ఒకచోట ఒకటింపాతిక మాసము, ఒకచోట ముప్పాతిక మాసము, ఒకచోట మూడు మాసములు, మరియొకచోట ఎనిమిది మాసములు, ఈ విధముగా కాలము గడపుటలో పది సంవత్సరములు సుఖముగా గడచిపోయినవి.

[మహర్షి రచనలోని సొగసు గమనింపదగియున్నది. పది సంవత్సరముల అరణ్యా వాసమును తొడుగులేక ఎంత సులభముగా వర్ణించినారు !]

ఆ తరువాత, సుతీక్ష్ణుడు చెప్పియుండిన మాట ననుసరించి వారి ఆశ్రమమునకు రెండవమారు వెళ్ళి, అచ్చట కొంతకాల ముండినారు.

## అగస్త్యాశ్రమము

ఇట్లుండగా ఒకనాడు శ్రీరాముడు మునితో అనుచున్నాడు.

**రాముడు :** మహర్షీ ! ఈ అరణ్యముననే అగస్త్యమహాముని ఉన్నారని వినియున్నాను. వారిదర్శనము చేసికొనవలయు నని ఆశపడుచున్నాను. వారి ఆశ్రమ మెందున్నదో సెలవిండు. ఆ మహామునికి శుశ్రూష చేయుటకు కుతూహల పడుచున్నాను.

**సుతీక్ష్ణుడు :** (సంతోషముతో) నాయనా! నేనుకూడ ఆమాటనే చెప్పదలచితిని. నీవును ఆ మాటనే అడిగితివి. సంతోష మైనది.

ఇచ్చటికి దక్షిణముగా నాలుగుయోజనముల దూరమున అగస్త్యుని తమ్ముని ఆశ్రమ మున్నది. అది మనోహరముగా నుండును. అచ్చట గొప్ప పిప్పలీవనముకూడ ఉన్నది. ఆ యాశ్రమమున ఒకరాత్రి విశ్రమించి ప్రొద్దుననే బయలుదేరి దక్షిణముగా ఒక యోజనము ప్రయాణము చేయుదురేని అగస్త్యాశ్రమము కానబడును. అగస్త్య మహాముని సందర్శనము కోరుదురేని ఇప్పుడే బయలుదేరుట మంచిది.

సీతారామలక్ష్మణులు బయలుదేరి ప్రయాణముచేసి అగస్త్యుని తమ్ముని ఆశ్రమము చేరినారు.

**రాముడు :** లక్ష్మణా ! సుతీక్ష్ణమహాముని చెప్పినట్లు ఈ ఆశ్రమ మెంత రమ్యముగానున్నదో చూచితివా ! వీరి అన్న అగస్త్యుడు మహాప్రభావుడు. తన తపస్సుచే మృత్యువునుసైతము నిగ్రహించినవాడు. దక్షిణదిక్కును ఋషులకు వాసయోగ్యముగా చేసిన మహాత్ముడు. ఒకప్పుడు ఈ ప్రాంతమున ఇల్వలుడు, వాతాపి. అను ఇద్దరు రాక్షసు లుండినారు. వారిద్దరు అన్నదమ్ములు. బ్రాహ్మణులను

వధించి భక్షించుటయే వారి పని. అందుకై వా రేమిచేయుచుండిరో ఎరుగుదువా! ఇల్వలుడు బ్రాహ్మణరూపమును ధరించి సంస్కృతము మాటలాడుచు శ్రాద్ధము పెట్టవలయు నని చెప్పుచు బ్రాహ్మణులను బ్రాహ్మణార్థమునకు పిలుచుచుండినాడు. వాతాపి మేషరూపము దాల్చియుండువాడు. ఇల్వలుడు ఆ మేషమును పచనము చేసి బ్రాహ్మణులకు వడ్డించువాడు. భోజనములు పూర్తియైనపిదప "వాతాపీ! నీ విక బయటికిరమ్ము" అని ఇల్వలుడు బిగ్గరగా అరచువాడు. వాతాపి మేకవలె అరచుచు బ్రాహ్మణుల శరీరములను చీల్చుకొని బయటకు వచ్చుచుండినాడు.

ఈ విధముగా అన్నదమ్ము లిద్దరు పెక్కువేలమంది బ్రాహ్మణులను వధించి భక్షించినారు. ఇట్లుండగా ఒకనాడు బ్రాహ్మణార్థమునకు అగస్త్యుని ఆహ్వానించినారు. భోజనములైనపిదప వారి పద్ధతిప్రకారము "వాతాపీ! బయటికిరమ్ము" అని ఇల్వలుడు అరచినాడు. అగస్త్యుడు నవ్వుచు "ఇంకెక్కడి వాతాపి! మేషరూపమున నుండిన వాతాపిని నేను జీర్ణించుకొన్నాను. వాడు యమునిచెంత కరిగినాడు" అన్నాడు. ఇల్వలుడు కోపించి అగస్త్యునిపైకి దూకినాడు. అగస్త్యుడు ఉగ్రుడై తనచూపుతో ఇల్వలుని భస్మము గావించినాడు. ఆ మహానుభావుని తమ్మునిదే ఈ యాశ్రమము.

['వాతాపి జీర్ణం' అని వాడుకలో ఉన్న మాట దీనిని బట్టి వచ్చినదే.]

ఈ మాటలలో సూర్యాస్తమయ మైనది. రామలక్ష్మణులు యథావిధిగా సంధ్యనుపాసించి ఆశ్రమములో ప్రవేశించి మునిని సందర్శించినారు. ఆరాత్రి అచ్చటనే యుండి ఉదయమున మునియొద్ద సెలవు గైకొని అగస్త్యాశ్రమమునకు బయలుదేరినారు. మార్గములోని వృక్షములను సరస్సులను చూచి ఆనందించుచు అగస్త్యాశ్రమము దగ్గరకు వచ్చినారు.

**రాముడు :** లక్ష్మణా! చూచితివా ఈ యాశ్రమము! అలసి వచ్చినవారి శ్రమను పారదోలగలదు.

ఆశ్రమో దృశ్యతే తస్య పరిశ్రాంత శ్రమాపహః 11-80

ఇచ్చటి మృగములుసైతము ఎంత శాంతముగా ఉన్నవో చూడుము. అగస్త్యుని ప్రభావము స్మరించి రాక్షసు లెవ్వరుగాని ఈ యాశ్రమమునకుకూడ రారు. దక్షిణ దిక్కునకు 'అగస్త్యదిక్కు' అను పేరు వచ్చినది. సూర్యుని మార్గమును నిరోధించుటకు పైకి పెరుగుచుండిన వింధ్యపర్వతము అగస్త్యుని ఆజ్ఞ ననుసరించి పెరుగుట మానినది. అగస్త్యునిశక్తి అట్టిది. మంచివారికి ఆయన మిక్కిలి మంచివాడు. నేనును ఈ మునీంద్రుని

సేవింతుమేని మనకు మేలు చేకూరును. అగస్త్యుని ఆరాధించుచు మనము మన వన వాసమును సుఖముగా పూర్తిచేసికొనవచ్చును. అనృతమాడువాడుగాని అయోగ్యుడు గాని ఈ యాశ్రమమున జీవించియుండజాలడు. అగస్త్యుని ప్రభావము అట్టి మహిమ గలది. దేవతలుసైతము ఇచ్చటికి వచ్చి ఆ మహనీయుని సేవించుచుందురు. మహర్షులు ఇచ్చట తప మాచరించి తపస్సిద్ధిని పొంది నూతనదేహములతో స్వర్గమునకు వెళ్లుదురు.

లక్ష్మణా! ఆశ్రమమునకు వచ్చినాము. నీవు ముందుగా వెళ్ళి నేను సీతా సహితుడనై వచ్చియున్నానని మహర్షికి నివేదింపుము.

లక్ష్మణుడు వెళ్లి అగస్త్యుని శిష్యులలో నొకనితో రామాగమమునుగూర్చి చెప్పి పంపినాడు.

*శిష్యుడు*: మహర్షీ! దశరథుని కుమారులు రామలక్ష్మణులట. మన ఆశ్రమమునకు వచ్చి తమ దర్శనమునకు వేచియున్నారు. రాముని భార్య యగు సీతాదేవికూడ వారి వెంబడి వచ్చియున్నది. సెలవైనచో ప్రవేశపెట్టెదను.

*అగస్త్యుడు*: నాభాగ్యవశమున ఇంతకాలమునకు శ్రీరాముడు నన్ను దర్శించుటకు వచ్చినాడు. నేనుకూడ బహుకాలముగా శ్రీరామునికొరకు నిరీక్షించుచున్నాను. వారిని అక్కడనే ఎందుకు నిలిపినారు? శీఘ్రముగా ప్రవేశపెట్టుడు.

సీతారామలక్ష్మణులు ఆశ్రమము లోపలికి ప్రవేశించినారు. అచ్చట బ్రహ్మకు, అగ్నికి, విష్ణుదేవునికి, ఇంద్రునికి, సూర్యునికి, చంద్రునికి స్థానములు ఏర్పాటు చేయబడి యున్నవి. ఇవిగాక శ్రీస్థానము, కుబేరస్థానము, ధాతృస్థానము, విధాతృస్థానము, వాయుస్థానము, శేషస్థానము, అనంతస్థానము, గాయత్రీస్థానము, వసుస్థానము, వరుణ స్థానము, కుమారస్వామిస్థానము, ధర్మస్థానము, ఇవి యన్నియు అమర్పబడియుండినవి. వీని నన్నింటిని తిలకించుచు నడచి అగస్త్యమహామునిని దర్శించినారు. అగస్త్యుడు వారికి ఎదురువచ్చి, వారి నమస్కారము లందుకొని వారికి అతిథిమర్యాదలు జరిపించినాడు. అందరు ఆసీనులైనారు.

*అగస్త్యుడు*: రామా! ఋషియైనవాడు అతిథిపూజ చేయనియెడల తప్పుసాక్ష్యము చెప్పినవానివలె పరలోకమున తనమాంసమును తానే తినవలసియుండును.

[తప్పుసాక్ష్యము చెప్పుట గొప్ప తప్పు.]

**అన్యథా ఖలు కాకుత్స్థ తపస్వీ సముదాచరన్**
**దుస్సాక్షీవ పరే లోకే స్వాని మాంసాని భక్షయేత్** 12-29

రామా! సమస్త లోకములకు నీవు ప్రభుడవు. ధర్మచారివి-పూజ్యుడవు. నీవంటి అతిథికి గొప్ప సత్కారము చేయవలయును.

ఇదిగో చూడుము. ఈ ధనుస్సు విష్ణుదేవునిదే. దీనిని విశ్వకర్మ నిర్మించినాడు. ఇదిగో! ఈ బాణము బ్రహ్మదత్తము. ఇది అమోఘమైనది. ఈ అక్షయ బాణ తూణీరములను దేవేంద్రుడు ప్రసాదించినాడు. ఈ ఖడ్గముకూడ ఆయన ప్రసాదమే.

ఈ ధనుస్సును గైకొని పూర్వము విష్ణుదేవుడు అసురులను వధించి దేవతలకు రాజ్యము కలుగజేసినాడు. నీవు వీని నన్నింటిని గ్రహింపుము. నీకు తప్పక జయము కలుగును.

శ్రీరాముడు ఆయుధములను గ్రహించినాడు.

*అగస్త్యుడు:* రామా! మీరాక ఆనందదాయక మయినది. సీతాదేవి మిగుల అలసియున్నట్లు కనబడుచున్నది. ఆమె మిక్కిలి సుకుమారి. నీయెడ ఆమెకు గల అపార ప్రేమ ననుసరించి నిన్ను అరణ్యమున కనుసరించి దుష్కర కార్యమును గావించినది. స్త్రీలందరు ఇట్లుండరు. సృష్ట్యాదినుండియు స్త్రీల తీరే వేరు. భర్త మంచిస్థితిలో నున్నంతకాలము అతనిని ప్రేమింతురు. కష్టకాలము వచ్చినప్పుడు భర్తను విసర్జింతురు. వారి స్వభావమే అట్టిది. మెరపుల చాంచల్యమును, ఆయుధముల కరకుదనమును, గరుడ వాయుదేవుల వేగమును స్త్రీలు అనుసరింతురు.

ఏషా హి ప్రకృతి స్త్రీణా మాసృష్టే రఘునందన
సమస్థ మనురజ్యంతి విషమస్థం త్యజంతి చ 13-5

శతహ్రదానాం లోలత్వం శస్త్రాణాం తీక్ష్ణతాం తథా
గరుడానిలయో శ్శైఘ్ర్య మనుగచ్ఛంతి యోషితః 13-6

నీ భార్యయందు మాత్రము అట్టి దోషము లేమియు లేవు. అరుంధతివలె కొనియాడదగినది. మీ రాకవలన మా ఆశ్రమము అలంకృత మైనది.

*రాముడు:* మునీంద్రా! మా గుణములు మీకు సంతోషము కలిగించుటవలన మేము ధన్యుల మైతిమి. మేమును ఒక ఆశ్రమమును నిర్మించుకొనదలచియున్నాము. మీరు మాయందు దయయుంచి ఉచితమైన ప్రదేశమును సూచించినయెడల మే మచ్చటికి వెళ్ళి కాలమును సుఖముగా గడపగలము.

[శేషించిన వనవాస కాలమును అగస్త్యాశ్రమమునందే పూర్తి చేసుకొనవచ్చు నని మునుపు చెప్పిన మాట లేమయినట్లో!]

**అగస్త్యుడు :** (ఒక క్షణము ధ్యానించి) రామా! ఇక్కడనుండి రెండు యోజనముల దూరమున 'పంచవటి' అను ప్రదేశమున్నది. ఫలమూలములు, మృగములు, నీటి వసతులు, మున్నగు అనుకూలము లన్నిటిని కలిగియున్నది. అచ్చటికి వెళ్ళి సుఖముగా నివసింపవచ్చును. నీకు నిర్ణయింపబడిన వనవాసకాలముకూడ పూర్తి కావచ్చినది. నీ ప్రతిజ్ఞను పాలించి నీవు అయోధ్యకరిగి పట్టాభిషిక్తుడవై సుఖముగా నుండగలవు.

తీర్ణప్రతిజ్ఞః కాకుత్స్థ సుఖం రాజ్యే నివత్స్యసి. 13-16

రామా! నీవు నీ తండ్రిని తరింపజేసితివి. నిన్ను కన్న నీతండ్రి ఎంతో ధన్యుడు. నా తపఃప్రభావమువలన నీ కథను తెలిసికొన్నాను. మీరు పంచవటికి వెళ్లుట మంచిది. ఆ ప్రదేశము కన్నులపండువుగా నుండును. సీతాదేవి సుఖముగా క్రీడింపదగిన చోటు. మా ఆశ్రమమునకు సమీపముగా నున్నది. జనసమ్మర్దములేదు. అక్కడ నుందువేని ఋషులను రక్షించుటకు కూడ వీలుగా నుండును.

భవానపి సదారశ్చ శక్తశ్చ పరిరక్షణే
అపి చాత్ర వసన్ రామ తాపసాన్ పాలయిష్యసి. 13-22

ఇదిగో! ఆ ఇప్పచెట్లు గుంపుగా నున్నవి చూచితివా! అక్కడనుండి ఉత్తరముగా పోయినయెడల ఒక వటవృక్షము కానవచ్చును. ఆ వృక్షమును సమీపించి మిట్ట నెక్కినచో పర్వతమునకు దగ్గరగా పంచవటి కనబడగలదు. అక్కడి వృక్షములు సర్వదా పుష్పించియుండును.

[అగస్త్యుడు దారికూడ చూపించి పంపినాడు. ఇంత జరిగిన పిమ్మట "మే మిందే మీ చెంత ఉండదలచితిమి" అని చెప్పుట బాగుండునా! దివ్యజ్ఞానముగల అగస్త్యుడు రాబోవు పనికి కావలసిన ఏర్పాటులు చేసినాడు.]

## సీతారామలక్ష్మణులు పంచవటికి పోవుట

రామలక్ష్మణులు ఆయుధము లన్నింటిని చేకొని సీతాసమేతులై బయలుదేరినారు. దారిలోని మఱ్ఱిచెట్టుమీద (అగస్త్యుడు సూచించిన మఱ్ఱిచెట్టు ఇదియే కాబోలు) ఒక పెద్ద గృధ్రరాజమును చూచి రాక్షసుడేమో యని శంకించి రామలక్ష్మణులు "ఎవ్వడవు నీవు?" అని అడిగినారు.

# జటాయువు

**జటాయువు :** నేను మీ తండ్రియైన దశరథమహారాజు సఖుడను.

**రాముడు :** నీ కుల మేమి ? నీ పే రేమి ? వినగోరుచున్నాను.

[జటాయువు చెప్పిన వంశక్రమమును తెలిసికొనుట మంచిది]

**జటాయువు :** ప్రజాపతులను ఆదినుండియు చెప్పుచున్నాను వినుము. కర్దముడు మొదటి ప్రజాపతి. తరువాతివారు విక్రీతుడు, శేషుడు, సంశ్రయుడు, స్థాణుడు, మరీచి, అత్రి, క్రతుడు, పులస్త్యుడు, అంగీరసుడు, ప్రచేతసుడు, పులహుడు, దక్షుడు, వివస్వతుడు, కాశ్యపుడు. (ఇతనికి 'అరిష్టనేమి' అను మరియొక పేరు కలదు.)

దక్షప్రజాపతికి అరువది పుత్రికలు కలిగినారు. వారిలో ఎనిమిదిమందిని అనగా అదితి, దితి, దనువు, కాళిక, తామ్రమ, క్రోధవశ, మను, అనల అనువారిని, కాశ్యపుడు వివాహ మాడినాడు. అందరను కుమారులను కనుడని కోరినాడు. అదితి, దితి, కాళిక అందుకు సమ్మతించినారు.

అదితికి ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, అశ్వినీదేవత లిద్దరు, మొత్తము ముప్పదిముగ్గురు దేవతలు జన్మించినారు.

దితికి దైత్యులు పుట్టినారు.

పూర్వకాలమున ఈ భూమియంతయు దైత్యులది. దనువునకు హయగ్రీవుడు కలిగినాడు. కాళికకు నరకుడు, కాలకుడు అను ఇద్దరు పుట్టినారు. తామ్రమకు అయిదుగురు పుత్రికలు కలిగినారు. (1) క్రౌంచి (2) భాసి (3) శ్యేని (4) ధృతరాష్ట్రి (5) శుకి అనువారు. క్రౌంచి గుడ్లగూబలను, భాసి భాసపక్షులను, శ్యేని డేగలను, గ్రద్దలను, ధృతరాష్ట్రి హంసలు, కలహంసలు, చక్రవాకములను, శుకి 'నత'ను కన్నారు. నత కొమారిత వినత.

క్రోధవశకు పదిమంది పుత్రికలు పుట్టినారు. (1) మృగి (2) మృగమంద (3) హరి (4) భద్రమద (5) మాతంగి (6) శార్దూలి (7) శ్వేత (8) సురభి (9) సురస (10) కద్రువ.

మృగికి జింకలు, మృగమందకు ఎలుగుబంట్లు, సృమరములు, చమరములు. హరికి సింహములు, వానరములు పుట్టినవి.

భద్రమదకు ఇరావతి అను పుత్రిక జనించినది. ఇరావతి పుత్రుడే ఐరావతము. దేవేంద్రుని వాహనము.

మాతంగికి ఏనుగులు, శార్దూలికి పులులు, కొండముచ్చులు; శ్వేతకు దిగ్గజములు కలిగినవి.

సురభికి రోహిణి, గంధర్వి అను ఇద్దరు కొమారితలు కలిగినారు. రోహిణికి గోవులు పుట్టినవి. గంధర్వికి గుఱ్ఱములు పుట్టినవి.

సురసకు నాగులు పుట్టినవి (పెక్కు ఫణములు గల దివ్య సర్పములు) కద్రువకు పన్నగములు పుట్టినవి. (సాధారణ సర్పములు)

మనుప్రజాపతికి మనుష్యులు పుట్టినారు. (బహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు) అనల పుణ్యఫలములు గల వృక్షములను ప్రసవించినది.

శుకి మనుమరాలైన వినత, సురస చెల్లెలైన 'కద్రువ' వీరి వృత్తాంతమును వినుము.

భూభారమును వహించుచున్న ఆదిశేషును కద్రువ కన్నది. వినతకు ఇద్దరు కుమారులు కలిగినారు. (1) గరుడుడు (2) అరుణుడు. నేను అరుణునికి జన్మించినాను. నాకు ఒక అన్న కలడు. మా అన్న పేరు సంపాతి. నా పేరు జటాయువు.

[జటాయువు కేవల పక్షి అని త్రోసిపుచ్చుటకు వీలులేదు. గొప్ప కులమున పుట్టి అనేక విషయములు తెలిసిన వ్యక్తి అని గ్రహించి గౌరవింపవలయును.]

నాయనా! మీకు ఇష్ట మగునేని మీకు తోడుగా ఉందును. ఈ అరణ్యములో మృగముల బాధ, రాక్షసుల బాధ మెండు. మీరు అన్నదమ్ము లిద్దను ఎచ్చటికైనను వెళ్ళినప్పుడు సీతాదేవిని రక్షింపుచుండగలను.

సోహం వాససహాయ స్తే భవిష్యామి యదిచ్ఛసి
ఇదం దుర్గం హి కాంతారం మృగ రాక్షస సేవితమ్. 14-33

సీతాం చ తాత రక్షిష్యే త్వయి యాతే సలక్ష్మణే. 14-34

శ్రీరాముడు జటాయువును పూజించి సంతోషముతో కవుగిలించుకొని తన తండ్రికిని జటాయువునకును ఉండిన స్నేహమును మరిమరి చెప్పించుకొని, విని ఆనందించి జటాయువుకు నమస్కరించినాడు.

[తండ్రియొక్క మిత్రుని తన తండ్రివలెనే గౌరవించినాడు]

జటాయుషం తం ప్రతిపూజ్య రాఘవో
ముదా పరిష్వజ్య చ సన్నతోభవత్
పితుర్హి శుశ్రావ సఖిత్వ మాత్మవాన్
జటాయుషా సంకథితం పునః పునః 14-34

సీతారామలక్ష్మణులు జటాయుసమేతులై పంచవటి చేరినారు.

# పంచవటియందు ఆశ్రమమును నిర్మించుకొనుట

రాముడు : లక్ష్మణా! అగస్త్యులవారు చెప్పిన పంచవటికి వచ్చినాము. నీవు అరణ్యవిషయమున నిపుణుడవుకదా! నాలుగువైపుల దృష్టిని సారించి ఆశ్రమమునకు తగిన ప్రదేశము చూడుము.

సర్వత శ్చార్యతాం దృష్టిః కాననే నిపుణో హ్యసి
ఆశ్రమః కతరస్మిన్నో దేశే భవతి సమ్మతః 15-3

సీతకు, నాకు, నీకు, అందరకును ఆనందము కలిగించు ప్రదేశము చూడుము. జలాశయమునకు సమీపముగా ఉండవలెను. వనసౌందర్యము, స్థలసౌందర్యము కలిగియుండవలెను. తెలిసినదా! సమిధలు, పుష్పములు, దర్భలు అందుబాటు కలదిగా, నీటివసతి యుండునదిగా ఒకమంచిప్రదేశమును చూడుము.

రమతే యత్ర వై దేహీ త్వ మహం చైవ లక్ష్మణ
తాదృశో దృశ్యతాం దేశ స్సన్నికృష్ట జలాశయః 15-4

వనరామణ్యకం యత్ర స్థలరామణ్యకం తథా
సన్నికృష్టం చ యత్ర స్యా త్సమిత్పుష్పకుశోదకమ్ 15-5

లక్ష్మణుడు: రామా ! ఈపని నావల్ల నగునా ! నీవే ఒకమంచి ప్రదేశమును చూపి ఆశ్రమమును నిర్మింపుమందువేని నిర్మింపగలను. ఇక్కడ నూరుసంవత్సరము లున్నను, నీవు చెప్పినపని చేయువాడనేకాని నేను స్వతంత్రించి ఏపనిని చేయువాడను కాను.

పరవానస్మి కాకుత్స్థ త్వయి వర్షశతం స్థితే
స్వయం తు రుచిరే దేశే క్రియతా మితి మాం వద 15-7

ఈ మాటకు రాముడు సంతోషించి ఒకమంచి ప్రదేశమును తానే నిర్దేశించి లక్ష్మణుని చేతులను తనచేతిలోనికి తీసికొని,

రాముడు: లక్ష్మణా ! ఈప్రదేశము అన్నిటికిని సౌకర్యముగా నుండును. వృక్షములు పుష్పములతో నిండియున్నవి. సువాసనల వెదజల్లు పంకజములతో నిండిన పుష్కరిణి సమీపముననే ఉన్నది. గోదావరీనదియు దగ్గరనే ఉన్నది. గుహలతోను చెట్లతోను శోభిల్లుచున్న పర్వతము మిక్కిలి దూరముగాక మరియు అంత సమీపముగాక తగినచోట ఉన్నది. ఇక్కడ మనము జటాయువుతోకూడ సుఖముగా నుండగల మని తోచుచున్నది. ఈ ప్రదేశమున ఒక ఆశ్రమము నిర్మింపుము.

లక్ష్మణుడు కొయ్యలను, వెదుళ్లను, ఆకులను, కావలసిన అన్నింటిని తెచ్చి ఒక ఆశ్రమమును నిర్మించినాడు. ఆశ్రమము చక్కగా, ధృఢముగా ఉన్నది. లక్ష్మణుడు

గోదావరిలో స్నానముచేసి తామరపూవులను, వన్యఫలములను తెచ్చి వాస్తుపూజను, శాంతిని చేసి ఆశ్రమమును రామునికి చూపించినాడు. శ్రీరాముడు దానిని చూచి మిక్కిలి సంతోషించినాడు.

**రాముడు :** (లక్ష్మణుని గాఢముగా కవుగిలించుకొని) లక్ష్మణా! నీవు చేసిన ఈ గొప్పపని నా కెంతో సంతోషమును కలిగించినది. నీకు పారితోషికముగా ఈ కవుగిలి నిచ్చుచున్నాను. నీవు ధర్మమును అనుసరించి నాకు శుశ్రూష గావించుచు, నా హృదయమును కనుగొని మన తండ్రికి మారుగా నీవు నన్ను పాలించుటవలన మన తండ్రి జీవించియున్నట్లే అనిపించుచున్నది.

ప్రీతోస్మి తే మహత్కర్మ త్వయా కృత మిదం ప్రభో
ప్రదేయో యన్నిమిత్తం తే పరిష్వంగో మయా కృతః. 15-28

భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ
త్వయా నాథేన ధర్మాత్మా న సంవృత్తః పితా మమ.. 15-29

సీతారామలక్ష్మణులు ఆశ్రమమున ప్రవేశించినారు. స్వర్గమున ఇంద్రు డున్నట్టు శ్రీరాముడు సీతాదేవితోను లక్ష్మణునితోను కూడి ఆశ్రమమున నివసించుచు కాలమును సుఖముగా గడపుచున్నాడు.

## హేమంత ఋతువు

ఇట్లుండగా శరదృతువు పోయి హేమంతఋతువు వచ్చినది. ఒకనాడు తెల్లవారుఝామున రాముడు స్నానముచేయుటకు గోదావరినదికి బయలుదేరినాడు. సీతాదేవికూడ వెంబడి వెళ్ళుచున్నది.లక్ష్మణుడు కలశము గైకొని వెంట నడచుచున్నాడు.

**లక్ష్మణుడు :** రామా! హేమంతఋతువు వచ్చినది. నీకు మిక్కిలి ప్రియమైన ఋతువు కదా! ఈ ఋతువువలననే సంవత్సరమున కంతయు అలంకారము కలుగుచున్నది. భూమి సస్యశ్యామలమై పంటలతో కళకళలాడుచుండును. పాడి సమృద్ధిగా నుండును. మనుష్యుల శరీరములు మాత్రము బిరుసెక్కి యుండును. జలములు చల్లగా నుండి స్పృశించుటకుకూడ వీలులేక యుండును. సూర్యుడు దక్షిణదిశను సేవించుచున్నందున ఉత్తరదిశ తిలకవిహీనయైన స్త్రీవలె ప్రకాశింపకున్నది.

[స్త్రీలు తిలకమును ధరించిన ప్రకాశించుచుందురు.]

సేవమానే దృఢం సూర్యే దిశ మంతక సేవితామ్
విహీన తిలకేవ స్త్రీ నోత్తరా దిక్ప్రకాశతే. 16-8

చలి దుర్భరముగా నున్నది. అరణ్యములో జనులు నివసింపజాలక యున్నారు. అన్నిటిని మంచు ఆవరించి యున్నందున దేనినిగాని చక్కగా చూచుటకు వీలులేక యున్నది. సూర్యుడు కాంతి తరిగియున్నాడు. ఈ పడమటిగాలివలన చలి ఎక్కువ యగుచున్నది. వృక్షములు పుష్పములు లేక మంచుతో నిండి కండ్లుమూసికొని నిద్రించుచున్నట్లు కనబడుచున్నవి. ఈ కాలమున ధర్మాత్ముడైన భరతుడు నీయందలి భక్తిచేత రాజ్యభోగములను విసర్జించి తపస్సుచేయుచు కందమూలములను ఆహారముగా గొనుచు చల్లని నేలమీద శయనించుచు కాలమును గడపుచున్నాడు.

త్యక్త్వా రాజ్యం చ మానం చ భోగాంశ్చ వివిధాన్ బహూన్
తపస్వీ నియతాహార శ్శేతే శీతే మహీతలే. 16-28

భరతుడుకూడ ఈ వేళయందు స్నానముచేయుటకు సరయూనదికి వెళ్ళుచుండును. పాపము! భరతుడు సుకుమారుడు. సుఖముగా పెరిగినవాడు. ఈ విధముగా అపరరాత్రులందు లేచి సరయూనదిలో మునిగి ఎంత బాధపడుచున్నాడోగదా!

అత్యంత సుఖ సంవృద్ధ స్సుకుమార స్సుఖోచితః
కథ న్న్వపర రాత్రేషు సరయూ మవగాహతే. 16-30

రామా! నీవు అరణ్యమున తాపసవృత్తియందున్నను భరతుడు పట్టణమున నిన్ననుసరించుచున్నాడు. కావున భరతుడు మహాత్ముడు. స్వర్గమును జయించినవాడైనాడు.

[మనము అరణ్యమునందుండి మునివేషమును ధరించి తాపసవృత్తియందుండుట సహజముగనే ఉన్నది. కాని భరతుడు పట్టణమున నుండి మునివృత్తి నవలంబించుట ఎంతో గొప్ప సంగతి!]

జిత స్స్వర్గ స్తవ భ్రాతా భరతేన మహాత్మనా
వనస్థమపి తాపస్యే య స్త్వా మనువిధీయతే. 16-33

మనుష్యులు తల్లిని అనుసరింతురని లోకములో నుండు వాడుకమాట భరతుని పట్ల అసత్యమైనది. దశరథునికి పత్నియై భరతునికి తల్లియైన కైకేయికి అట్టి క్రూర స్వభావ మెట్లు కలిగినదో!

రాముడు : లక్ష్మణా! ఆపుము. కైకేయిని ఎప్పుడుగాని నిందింపకుము. ఇప్పటివరకు చెప్పుచుండిన ఇక్ష్వాకు నాథుడైన ఆ భరతుని గుణగణములనే కీర్తింపుము.

న తేంబా మధ్యమా తాత గర్హితవ్యా కథంచన
తామేవేక్ష్వాకు నాథస్య భరతస్య కథాం కురు. 16-37

వనవాసముపై నా బుద్ధిని ఎంత దృఢముగా నిలిపినను, భరతునిమాట తలచుకొన్నప్పుడు నా మనస్సు చంచల మగుచుండును. ఆనాడు చిత్రకూటమున భరతుడు పలికిన అమృత వాక్కులు నా కెప్పుడును జ్ఞప్తికి వచ్చుచునే యున్నవి. నేను మరల భరతశత్రుఘ్నులను కలిసికొని మీ అందరితో కలిసి ఎన్నడు సుఖముగా నుండగలనో కదా!

నిశ్చితాపి హి మే బుద్ధి ర్వనవాసే దృఢవ్రతా
భరతస్నేహసంతప్తా బాలిశీ క్రియతే పునః 16-38

సంస్మరా మ్యస్య వాక్యాని ప్రియాణి మధురాణి చ
హృద్యా న్యమృతకల్పాని మనఃప్రహ్లాదనాని చ 16-39

కదా న్వహం సమేష్యామి భరతేన మహాత్మనా
శత్రుఘ్నేన చ వీరేణ త్వయా చ రఘునందన. 16-40

ఈ విధముగా మాటలాడుకొనుచు సీతారామలక్ష్మణులు గోదావరికి వెళ్ళి స్నానములు చేసి ఆశ్రమమునకు వచ్చినారు.

## శూర్పణఖ

అందరు పర్ణశాలలో కూర్చుండి సంతోషముగా సరససల్లాపము లాడుకొనుచుండగా రావణుని చెల్లెలైన శూర్పణఖ అను రాక్షసి ఆశ్రమ ప్రాంతమునకు వచ్చి శ్రీరాముని మోహనాకారమును చూచినది. రాముడు జటామండలధారియై మన్మథునివలె వెలుగుచున్నాడు. రాజలక్షణములతో విరాజిల్లుచున్నాడు.

సింహోరస్కం మహాబాహుం పద్మపత్ర నిభేక్షణమ్
ఆజానుబాహుం దీప్తాస్య మతీవ ప్రియదర్శనమ్. 17-7

గజవిక్రాంతగమనం జటామండల ధారిణమ్
సుకుమారం మహాసత్త్వం పార్థివవ్యంజనాన్వితమ్. 17-8

రామ మిందీవరశ్యామం కందర్ప సదృశ ప్రభమ్
బభూ వేంద్రోపమం దృష్ట్వా రాక్షసీ కామమోహితా. 17-9

శ్రీరాముని చూచి శూర్పణఖ మన్మథపరవశ యైనది.

*శూర్పణఖ :* జటలు దాల్చి తాపస వేషమును ధరించి యున్నావు. భార్యను గూడి యున్నావు. అంతేకాక ధనుర్బాణములను చేత బూనియున్నావు. నీ సమాచారము చిత్రముగా నున్నది. దీని అర్థ మేమిటి ? రాక్షస సేవితమైన యీ అరణ్యమునకు మీరు వచ్చిన కారణ మేమి ?

శ్రీరాముడు నిజమునే పలుకదలచుకొన్నాడు. అబద్ధమనునది రామునికి పనికిరాదు. మీదుమిక్కిలి మునివృత్తిలో నున్నాడు. అదిగాక స్త్రీలతో అనృత మాడ కూడదుకదా!

రాముడు : నేను దశరథమహారాజు జ్యేష్ఠపుత్రుడను. నా పేరు రాముడు. ఇతడు నా తమ్ముడు లక్ష్మణుడు. ఈమె నాభార్య సీత. మా తండ్రియాజ్ఞను పాలించుటకు అరణ్యమునకు వచ్చినాను. నీ వెవ్వతెవో చెప్పుము. ఇంత అందగత్తెవు రాక్షసివిగా తోచుటలేదు. ఇక్కడి కేల వచ్చితివి?

న హి తావ న్మనోజ్ఞాంగీ రాక్షసీ ప్రతిభాసి మే. 17-20

శూర్పణఖ : (మదనమోహితయై) రామా! నేను కామరూపిణిని. నా పేరు శూర్పణఖ. నన్నుచూచి అందరు భయపడుదురు. నేనొక్కతెనే యీఅరణ్యమున సంచారము చేయుచుందును. నేను రావణాసురుని చెల్లెలను. రావణుని పేరు నీవుకూడ వినియేయుందువు. కుంభకర్ణుడు నా తోడబుట్టినవాడే. అత డెల్లప్పుడు నిద్రలోనే యుండును. నాకు విభీషణు డని ఒకఅన్న కలడు. అతడు ధర్మాత్ముడు. వాని యందు రాక్షసగుణము లేవియు లేవు.

విభీషణస్తు ధర్మాత్మా న తు రాక్షస చేష్టితః 17-24

[ఈ మాటలు జ్ఞప్తియందుంచుకొనవలెను. విభీషణుడు కేవల రాజ్యకాముడై రాముని ఆశ్రయించెనని ఒక అపవాద మున్నది. అతడు సహజముగనే ధర్మాత్ముడుకావున అధర్మమార్గము ననుసరించిన అన్నను విసర్జించి రాముని ఆశ్రయించె నని ఈ మాటవల్ల తేటపడుచున్నది.]

వీరు లని ప్రసిద్ధిగాంచిన ఖరదూషణులు సైతము నా సహోదరులే. రామా! నిన్ను చూచినంతనే నామనస్సు నీపై లగ్నమయినది. నేను మావారి నందరిని వదలి వచ్చి నీకు భార్య నగుదును. నీవు నా భర్తవై యుండుము. ఈ సీత వికారస్వరూపము గలది. నీకు తగినభార్య కాదు. నేనే నీకు తగినభార్యను. ఈ సీతను, లక్ష్మణుని ఇప్పుడే కడదేర్చెదను. పిమ్మట మన మిరువురము ఈ వనమున సుఖముగా విహరింపవచ్చును.

రాముడు : (నవ్వుచు) నాకు ఎన్నడో పెండ్లియైనది. నాభార్యసైతము ఇందేయున్నది. నీవంటివారు సపత్ని పోరు భరింపలేరు. ఇదిగో! చూడుము. నాతమ్ము డున్నాడు. గుణవంతుడు, అందగాడు, ఒంటరివాడు. అతడే నీకు తగినభర్త. నీకు సవతి పోరుండదు.

పాపము! శూర్పణఖ రాముని వీడి లక్ష్మణునిచెంత కరిగినది.

శూర్పణఖ : లక్ష్మణా! నేను నీకు తగినభార్యను. మన మిద్దరము సుఖముగా విహరింతము.

**లక్ష్మణుడు :** (చిరునవ్వుతో) నే నేమో ఒకని దాసుడను. నన్ను పెండ్లాడి నీ వేమి సుఖపడగలవు? నీవుకూడ ఒక దాసివి కావలసినదే. కావున నీవు మా అన్ననే చేపట్టుము. ఆయనకు చిన్నభార్య వగుము. విరూపమైన సీతను విసర్జించి మా అన్న నిన్నే స్వీకరింపగలడు.

ఈ మాటలు పరిహాస వాక్యము లని తెలిసికొనలేక శూర్పణఖ మరల రాముని దగ్గరకు వచ్చినది.

**శూర్పణఖ :** రామా! ఈ ముసలిభార్యను కట్టుకొని నావైపుకూడ చూడవేమి! ఈ క్షణముననే నే నీ సీతను భక్షింతును. నాకు సపతిపోరు లేకుండ జేసికొందును. మనము సుఖముగా కాలము గడపవచ్చును.

ఈ మాట లని శూర్పణఖ సీతాదేవిపైకి పరుగెత్తినది. రాముడు ఆగ్రహించి లక్ష్మణునితో అనుచున్నాడు.

**రాముడు :** లక్ష్మణా! దుష్టులతో పరిహాసము పనికిరాదు. సీతకు ఆపద రానట్లు చూచుకొనవలెను. మదించియున్న ఈ రాక్షసిని విరూప గావింపుము.

లక్ష్మణుడు కత్తిదూసి శూర్పణఖ ముక్కు చెవులు ఖండించినాడు.

## శూర్పణఖ తన దుఃఖమును ఖరునితో చెప్పుట

శూర్పణఖ ఏడ్చుచు తన సోదరు డగు ఖరునియొద్దకు పరుగెత్తి తన దుఃఖమును తెలిపినది.

**ఖరుడు :** (కోపముతో) ఎవ్వడు నిన్నింతపనిచేసినది! కదలకయున్న కృష్ణసర్పమును వినోదమునకై వ్రేలితో కదలించినవా డెవ్వడు? యముని సన్నిధికి వెంటనే పోదలచుకొన్నవా డెవడో చెప్పుము. ఇంద్రుడు సైతము నా కపకార మొనరించుటకు భయపడి వెనుదీయునుగదా! నీ కిట్టి దుఃఖము కలిగించిన వానిని ఇప్పుడే వధించిపుత్తును. దేవదానవ గంధర్వు లెవ్వరును వానిని రక్షింపలేరు. నీవు నీ బాధ తీర్చుకొని వా డెవడో తెలియజెప్పుము. ---

**శూర్పణఖ :** (ఏడ్చుచు) రాముడు లక్ష్మణుడు అను ఇరువు రన్నదమ్ములు జటలు దాల్చి అడవికి వచ్చియున్నారు. వారి బలపరాక్రమములు ఇట్టి వని వర్ణింపజాలను. ఇరువురును మంచి రూపసంపన్నులు. వారు దేవతలో మానవులో చెప్పజాలను. వారివెంట ఒక సుందరి శరీరమునిండ ఆభరణములు ధరించియున్నది. ఆ స్త్రీ

మూలముననే నాకీ గతి పట్టినది. ఆ సీతారామలక్ష్మణుల వేడిరక్తమును నురుగుతోకూడ త్రాగినగాని నా తాపము చల్లారదు. నీవు వారిని వధింపుము.

## రాక్షస సంహారము

ఈ దీనాలాపములు విని ఖరుడు యమసములైన రాక్షసులను పదునాలుగు మందిని శత్రువులపైకి పంపినాడు. శూర్పణఖ వారివెంట వచ్చి సీతారామలక్ష్మణులను వారికి చూపించినది. శ్రీరాముడుకూడ వారిని చూచినాడు.

**రాముడు:** లక్ష్మణా! కొంచెము సేపు సీతను రక్షింపుచుండుము. ఈ రాక్షసులను వధించి ఇప్పుడే వచ్చెదను.

శ్రీరాముడు ధనుస్సును ఎక్కుపెట్టి రాక్షసులతో అనుచున్నాడు.

**రాముడు:** రాక్షసులారా! మేము కేవల తాపసులము. ఈ యరణ్యమున ఫలమూలములను భక్షింపుచు ధర్మము నాచరింపుచున్నాము. మీరు మమ్ముల నేల హింసించెదరు? సాధువులను బాధించుచున్న మీవంటి పాపాత్ములను వధించుటకే నేనీ ధనుర్బాణములను ధరించి వచ్చియున్నాను. నేను మిమ్ములను తప్పక వధింతును. ప్రాణములపై ఆశ గలదేని పారిపోవుడు.

**రాక్షసులు:** (ఆయుధములను గ్రహించి రామునిపైకి వచ్చి) ఖరునికి కోపము కలిగించినవాడు ప్రాణములతో ఉండజాలడు. నిన్నిప్పుడే వధించివుత్తుము. నీ వొక్కడవు, మే మిందర మున్నాము. మాచేత నీకు మరణము తప్పదు.

ఈ మాటలు చెప్పి రామునిమీద వారు శూలములు, ప్రయోగించినారు. రాముడు తన బాణములతో ఆ శూలములను ఖండించి రాక్షసుల నందరను వధించినాడు.

శూర్పణఖ ఆ ప్రదేశమునుండి పరుగెత్తిపోయి ఖరుని సమీపించి పడ్డినది.

**ఖరుడు:** నీ కొరకు అందరి రాక్షసులను ఇప్పుడేకదా పంపితిని! మరల ఏడ్చుచు వచ్చి నేలపై బడి పొరలాడుచున్నావేమి?

**శూర్పణఖ:** నీవు పంపిన రాక్షసు లందరు రామబాణమునకు గురియై హతులైనారు. రాముడు కావించిన ఈ మహాత్కార్యమును స్మరించి నేను భయపడుచున్నాను. నీకు పరాక్రమ మనునది వున్న యెడల ఈ దండకారణ్యమున రాక్షసకంటకుడుగానున్న రాముని వధింపుము. నా శత్రుడైన రాముని వెంటనే వధింపవేని, నేను నీ కన్నెదుటనే ప్రాణములు విడుతును. నీవు, నీ సైన్యములు, రాముని ఎదుట

నిలువలేరని తోచుచున్నది. నీవు శూరుడనని ప్రగల్భములాడుచు తిరుగుచున్నావే గాని నిజముగా నీవు శూరుడవుకావు. నీకు బలముకాని పౌరుషముకాని లేవు. నీ వీ జనస్థానమునం దుండతగవు. నీ బంధువుల నందరను వెంటబెట్టుకొని ఇక్కడి నుండి వేగిరము వెడలిపొమ్ము. లేకున్న రాముని చేత బడి నీవు మరణించుట నిశ్చయము. రామలక్ష్మణులు అసమాన పరాక్రమవంతులు. నీవు వారికి చాలవు.

**నిష్పత్త్వ స్యాల్పవీర్యస్య వాసస్తే కీదృశ స్త్విహ**
**అపయాహి జనస్థానా త్త్వరిత స్సహబాంధవః** 21-19

**రామతేజోభిభూతో హి త్వం క్షిప్రం వినశిష్యసి.** 21-20

శూర్పణఖ ఈ నిష్ఠుర వాక్యములను పలికి వక్షస్థ్సలము బాదుకొని బిగ్గరగా ఏడ్చినది. ఖరునికి కోపము వచ్చినది.

**ఖరుడు :** శూర్పణఖా ! ఏడువకుము. నేను రామలక్ష్మణులను ఈ క్షణముననే వధించెదను వారి వేడిరక్తమును నీ విప్పుడే త్రాగగలవు.

**శూర్పణఖ :** (సంతోషముతో) అన్నా! నే నేదో దుఃఖము పట్టలేక అన్నానుగాని నీవంటి శూరుడు లోకమునం దున్నాడా !

ఖరుడు తన సేనానాయకుడైన దూషణునితో అనుచున్నాడు.

**ఖరుడు :** దూషణా ! మన సైనికులు పదునాలుగు వేలమంది కలరుగదా ! వారి నందరిని కదలింపుము. నా రథమునుకూడ సిద్ధము చేయింపుము. ఆ రాముని సంగతి చూడవలయును.

దూషణుడు యుద్ధసన్నాహములు కావించినాడు. ఖరుడు రథమునెక్కి సైన్యమును బయలుదేరుమన్నాడు. సైన్యము ముందు నడచినది. ఖరుడు వెనుకనే పోయినాడు. ఖరునికి దుశ్శకునములు ఎదురైనవి. రక్తవర్ణ వర్షము కురిసినది. ఖరుని రథాశ్వములు కారణములేకయే పడిపోయినవి. ధ్వజముపై ఒక పెద్దగ్రద్ద వ్రాలినది. నక్కలు కూసినవి. ఆకాశము మాసిపోయినది. చీకట్లు క్రమ్మినవి. క్రూరమృగపక్షులు ఖరునికి ఎదురు వచ్చి రోదించినవి. ఖరుని యెడమ భుజ మదరినది. కన్నులవెంట బాష్పములు స్రవించినవి.

ఖరుడు ఈ దుశ్శకునములను లక్ష్యపెట్టలేదు.

**ఖరుడు :** (నవ్వుచు) సైనికులారా ! మీరు నిర్భయముగా నడువుడు. ఈ శకునములను చూచి బలహీను లెవరో భయపడుదురు. మనవంటి శూరులము వీనిని పట్టించు

కొనరాదు. నేను రామలక్ష్మణులను వధింపక వెనుకకు మరలను. యుద్ధమున పరాజయ మనుమాట మన కిదివరకెన్నడును కలుగలేదు. నేను కోపింతునేని ఇంద్రునికూడ వధింపగలను. ఈ మానవమాత్రులు మన కొక లెక్కకాదు.

ఖరునిమాటలవలన సైనికులకు ఉత్సాహము కలిగినది. రాక్షసు లందరు యుద్ధమునకు బయలుదేరినారు.

ఈ అపూర్వయుద్ధమును చూచుటకు ఋషులు, దేవతలు వచ్చి ఆకాశమున విమానములమీద ఉన్నారు. శ్రీరామునికి జయము కలుగునుగాకఅని ఆశీర్వదించినారు.

రాక్షససైన్యము కదలినది. అప్పుడు పుట్టిన ఘోరఉత్పాతములను రాముడు గమనించి లక్ష్మణునితో అనుచున్నాడు.

రాముడు: లక్ష్మణా! చూచితివా యీ ఉత్పాతములను! ఇవి రాక్షస సంహారమును సూచించుచున్నవి. నా బాణము లన్నియు పొగరాజుచు యుద్ధమును కోరుచున్నవి. యుద్ధము తప్పునట్లులేదు. నా కుడిభుజము అదరుచున్నది. నీముఖము కూడ కాంతియుతమై ప్రసన్నముగా నున్నది. మనకు జయము కలుగు ననుటకు సందేహములేదు. ఇదిగో! రాక్షసుల సింహనాదములుకూడ వినబడుచున్నవి. తెలివిగలవాడు ఆపద రాకముస్నే దానికి ప్రతీకారము చేయవలెను.

> అనాగత విధానం తు కర్తవ్యం శుభ మిచ్ఛతా
> ఆపదం శంకమానేన పురుషేణ విపశ్చితా 24-11

నీవు సీతను గుహలో చేర్చుము. ధనుర్బాణములను ధరించి గుహను రక్షింపుచుండుము. వెళ్లు నాయనా! త్వరగా వెళ్లుము. నీవు శూరుడవు. నీవే ఈ రాక్షసుల నందరను వధింపగలవు. అందులో సందేహ మేమియులేదు. కాని, వారిని నేనే స్వయముగా వధింపదలచితిని.

> త్వం హి శూరశ్చ బలవాన్ హన్యా హ్యేతా న్నసంశయః
> స్వయం తు హంతు మిచ్ఛామి సర్వానేవ నిశాచరాన్ 24-14

లక్ష్మణుడు సీతాదేవిని గుహలో భద్రపరిచి ధనుర్బాణములను దాల్చి గుహను రక్షించుచుండినాడు. శ్రీరాముడు కవచము ధరించి యుద్ధమునకు సిద్ధమైనాడు. ఋషులు, దేవతలు ఆకాశమున తమ విమానములయందుండి "ధర్మాత్ముడైన రాముడు ఒక్కడే వేలకొలది రాక్షసులతో యుద్ధము చేయుట చూచితీరవలెను" అని తలచినారు.

చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్
ఏకశ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి 24-23

శ్రీరాముడు అద్భుతమైన తేజస్సుతో వెలుగుచున్నాడు. రామునికి కోపము కలిగినది. "క్రుద్ధుడైన రుద్రుని చందమున భయంకరుడై యున్నాడు" అని ఋషులు, దేవతలు అనుకొనుచున్నారు.

ఇంతలోనే రాక్షససైన్యము సింహగర్జనలతో వచ్చినది. అడవిమృగములన్నియు భయపడి పారిపోవుచున్నవి. రణపండితుడైన శ్రీరాముడు తన దృష్టిని నాలుగుప్రక్కల సారించి రాక్షససైన్యమును చూచి కోప మూని రాక్షసులను సంహరింపబూనుకొని ధనుర్బాణములను దాల్చి యుద్ధసన్నద్ధుడై యుండినాడు.

శ్రీరాముని ఆశ్రమప్రాంతమునకు ఖరుడు వచ్చి రాముని చూచి తన రథమును రామున కభిముఖముగా తోలించి రామునిమీద వేయిబాణములు ప్రయోగించినాడు. మిగిలిన రాక్షసులుకూడ తమ ఆయుధములను రామునిపై ప్రయోగించినారు. మేఘములు కుండపోతగా వర్షము కురిపించునట్లు రాక్షసులు రామునిమీద బాణవర్షమును కురిపించినారు. నదుల ప్రవాహములు సముద్రమున బడి రూపు మాయునట్లు ఆబాణము లన్నియు రామునిచే ప్రతిహతములై లయమును పొందినవి. రాముడు నెత్తుట తడిసి, సంధ్యాకాలమున మేఘములతో కప్పబడిన సూర్యునివలెనె విరాజిల్లినాడు. రాముడు క్రుద్ధుడై ధనుస్సును మండలాకార మొనర్చి వేలసంఖ్య బాణములను ప్రయోగించినాడు. రాక్షసులు ఎక్కడివారక్కడనే చచ్చి పడిపోవుచున్నారు. చనిపోయిన గుఱ్ఱములకు ఏనుగులకు లెక్కలేదు. కార్చిచ్చు వనమును దహించునట్లు, శ్రీరాముడు రాక్షససైన్యమును తన బాణాగ్నిచే దహించుచున్నాడు. గరుత్మంతుని పక్షవేగమునకు వృక్షములు కూలునట్లు రామబాణాహతికి రాక్షసులు కుప్పలుగా కూలుచున్నారు.

చావక మిగిలిన రాక్షసులు ఖరుని శరణుజొచ్చినారు. సేనానాయకుడైన దూషణుడు వారికి ధైర్యము చెప్పి వారిని మరల యుద్ధమునకు పంపినాడు. రామునికిని రాక్షసులకును ఘోరయుద్ధము జరిగినది. శ్రీరాముడు గాంధర్వాస్త్రమును ప్రయోగించి వేనవేలుగా బాణములు వేసినాడు. రామబాణ హతులైన రాక్షసులు పడిపోవుట మాత్రము కానబడినదేకాని, రాముడు బాణము తీయుటగాని శరసంధానము చేయుటగాని ధనుస్సును ఆకర్షించుటగాని, బాణములను విడుచుటగాని ఎవ్వరును చూడజాలక పోయినారు.

నాదదానం శరాన్ ఘోరా న్నముంచంతం శిలీముఖాన్
వికర్షమాణం పశ్యంతి రాక్షసా స్తే శరార్దితాః 25-38

ఆకాశ మంతయు శరావృతమై అంధకారము క్రమ్మినది. భూమి యంతయు రాక్షసుల కళేబరములతో నిండిపోయినది. తన సైన్యము హత మగుట దూషణుడు చూచి అయిదువేలమంది పేరుబడిన వీరులను రామునిపైకి పంపినాడు. వారు వచ్చి రామునిమీద శరవర్షమును కురిపించినారు. ఆబోతు కన్నులు మూసికొని వర్షమును లెక్కచేయనట్లు రాముడు ఆ శరవర్షమును సరకుసేయక కోపము నవలంబించి రాక్షసులమీద బాణములు వేసినాడు.

ప్రతిగృహ్య చ తద్వర్షం నిమీలిత ఇవర్షభః
రామః క్రోధం పరం భేజే వధార్థం సర్వరక్షసామ్ 26.4

దూషణుడు స్వయముగా యుద్ధమునకు పూనుకున్నాడు. రాముడు దూషణుని ధనుస్సును ఖండించి రథాశ్వములను వధించినాడు. సారథినికూడ కడతేర్చినాడు. దూషణుడు విరథుడై ఒక ఇనుపగుదియను గైకొని రామునిపైకి వచ్చినాడు. ఆ పరిఘమును, దూషణుని చేతులను రాముడు ఖండించినాడు. దూషణుడు నేలమీద పడి ప్రాణములు విడిచినాడు.

దూషణుని అనుచరులైన అయిదువేల రాక్షసులను రాముడు అయిదువేల బాణములచే వధించినాడు.

ఈ రాక్షససంహారమును ఖరుడు చూచి రామునిపైకి పండ్రెండుమంది సేనాధ్యక్షులను పంపినాడు. రాముడు వారినికూడ కడతేర్చినాడు.

ఈ విధముగా పదునాలుగువేల రాక్షసవీరులను పదాతియైన రాముడు ఒక్కడే సంహరించినాడు.

చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్
హతా న్యేకేన రామేణ మానుషేణ పదాతినా 26.35

రాక్షససైన్యమున కంతయు ఖరుడు, త్రిశిరుడు మాత్రమే మిగిలినారు.

## త్రిశిరుని యుద్ధము

ఖరుడు యుద్ధమునకు బయలుదేరినాడు. సేనానాయకుడైన త్రిశిరుడు ఖరునితో "యుద్ధమునకు నన్ను పంపుము. నే నుండగా నీవు వెళ్ళుట యుక్తముకాదు. నేను రాముని వధించి రాక్షసులకు సంభవించిన శోకమును పోగొట్టెదను. నేను రాముని తప్పక వధింతును. లేనిచో రామునిచేత హతుడ నగుదును. నీవు క్షణకాలము యుద్ధమును విరమించి నేను చేయు యుద్ధమునకు సాక్షిమాత్రుడవై యుండుము" అని చెప్పినాడు.

అహం వాస్య రణే మృత్యు రేష వా సమరే మమ
వినివృత్య రణోత్సాహా న్ముహూర్తం ప్రాశ్నికో భవ. 27-4

త్రిశిరుడు ఖరుని ఆజ్ఞను పొంది యుద్ధరంగమునకు బయలుదేరినాడు. రామునికి త్రిశిరునికి ప్రచండయుద్ధము జరిగినది. సింహామునకును కుంజరమునకును జరుగు యుద్ధమువలె జరిగినది.

బభూవాతీవ బలినో స్సింహ కుంజరయో రివ. 27-10

త్రిశిరుడు రాముని లలాటమున మూడు బాణములు వేసినాడు.

రాముడు : ఓ త్రిశిరుడా! నీవు ఎంత బలశాలివి! నీబాణములు పుష్పముల ననుకరించు చున్నవి. నాబాణముల రుచి కొంచెము చూడుము.

శ్రీరాముడు బాణములు ప్రయోగించినాడు. త్రిశిరుని మూడుతలలు తెగి క్రింద పడినవి.

## ఖరుని యుద్ధము

ఖరుడు రాముని పరాక్రమమును తలచుకొని భయకంపితు డైనాడు. కాని రాముడు వేలకొలది రాక్షసులను వధించుటలో అలసట జెందియుండునని ఆశపడినాడు.

హంతారం సర్వసైన్యస్య పౌరుషే పర్యవస్థితమ్
పరిశ్రాంతం మహాసత్త్వం మేనే రామం ఖర స్తదా 28-12

ఖరుడు రామునితో యుద్ధము ప్రారంభించినాడు. ఖరుడు సామాన్యుడుకాడు. రాముని ధనుస్సును ముష్టిప్రదేశమున ఖండించి తన హస్తలాఘవమును ప్రదర్శించినాడు.

తతోఽస్య సశరం చాపం ముష్టిదేశే మహాత్మనః
ఖర శ్చిచ్ఛేద రామస్య దర్శయన్ పాణిలాఘవమ్ 28-15

ఖరుడు ఏడుబాణములను తీసి రాముని కవచముపై వేయగా కవచము భిన్నమై నేలమీద పడిపోయినది.

పపాత కవచం భూమౌ రామస్యాదిత్యవర్చసః 28-17

ఖరుడు రాముని శరీరమునిండ బాణములు గ్రుచ్చినాడు. రాముడు అగస్త్యదత్తమైన ధనుస్సును గైకొని ఖరుని ధ్వజమును ఖండించినాడు. ఖరుడు రామునిమీద బాణవర్షము కురిపించినాడు. రాముని శరీరము నెత్తుటితో తడిసిపోయినది. రాముడు క్రుద్ధుడై ఖరునిమీద ఆరుబాణములు వేసినాడు. యుద్ధము ప్రచండముగా సాగుచున్నది. ఖరుని ధనుస్సు విరిగిపోయినది. రథాశ్వములు హతములైనవి. ఖరుని సారథియు వధింపబడినాడు. ఖరుడు విరథు డైనాడు.

రాముడు సాధించిన ఈ మహాత్కార్యమును ఋషులు, దేవతలు అభినందించి శ్రీరామునికి అంజలి గావించి పూజించినారు.

ఖరుడు గదను గైకొని రామునిపైకి వచ్చినాడు.

**రాముడు :** ఖరుడా! నీవు గొప్ప సైన్యమును ప్రోగుచేసికొని సాధువులను బాధించుచు లోకకంటకుడవుగా ఉన్నావు. ప్రాణులను హింసించుచు పాపములు చేయువాడు త్రిలోకనాథుడైనను క్షేమపడజాలడు.

ఉద్వేజనీయో భూతానాం నృశంసః పాపకర్మకృత్
త్రయాణామపి లోకానా మీశ్వరోఽపి న తిష్ఠతి. 29-3

దుష్టసర్పమును వధించునట్లు లోకు లందరు అట్టివానిని వధింపజూతురు. దండకారణ్యమున తపస్సు చేసికొనుచుండిన ఋషులను నిష్కారణముగా చంపితివిగదా! పాపములు చేయువాని సంపదలు చిరకాలము నిలువవు. వేరు చెడినయెడల వృక్షము బ్రతికియుండగలదా!

న చిరం పాపకర్మాణః క్రూరా లోకజుగుప్సితాః
ఐశ్వర్యం ప్రాప్య తిష్ఠంతి శీర్ణమూలా ఇవ ద్రుమాః 29-7

ఎవ్వడుగాని పాపఫలమును అనుభవింపక తప్పదు. దుష్టులను వధించుటకే రాజాజ్ఞ ననుసరించి ఇచ్చటికి వచ్చియున్నాను.

పాపమాచరతాం ఘోరం లోకస్యాప్రియ మిచ్ఛతామ్
అహ మాసాదితో రాజ్ఞా ప్రాణాన్ హంతుం నిశాచర. 29-10

నిన్ను ఇప్పుడే వధించెదను. పూర్వము నీచే నిహతులైన ఋషు లెల్లరు ఆకాశమున విమానములలో నున్నారు. నీమరణమును వా రిప్పుడే చూచి ఆనందింపగలరు.

**ఖరుడు :** రామా! అల్పులైన రాక్షసులను కొందరను చంపి గొప్ప శూరుడవైనట్లు నిన్ను నీవే పొగడుకొనుచున్నావు. నిజమైన పరాక్రమవంతుడు ఇట్లు పలుకునా? నా గదతో నిన్నిప్పుడే వధించుచున్నాను. నిన్ను అనవలసిన మాటలు పెక్కులున్నవి. కాని సూర్యుడు అస్తమింపబోవు వేళయైనది. యుద్ధమునకు విఘ్నము కలుగునేమో యని ఊరకున్నాను. మా వారిని అనేకులను వధించియున్నావు. నే నిప్పుడు నిన్ను వధించి వారి అశ్రుప్రమార్జనము చేయుదును.

ఇట్లు మాటలాడుచు ఖరుడు రామునిమీద గదను ప్రయోగించినాడు. రాముని బాణములు ఆ గదను తునియలు గావించినవి.

**రాముడు :** (నవ్వుచు) ఖరుడా! చూచితివా నీగద ఏమైనదో! రాక్షసాధముడా! నేను నిన్ను వధించి ఈ దండకారణ్యమును నిష్కంటకము గావించెదను. ఇకమీద ఋషు లందరు నిర్భయముగా నివసింపగలరు.

**ఖరుడు :** రామా! నీకు మరణ మాసన్నమయినది గనుకనే నోటికి వచ్చినట్లు పలుకుచున్నావు. మృత్యుపాశబద్ధు డైనవానికి కార్యాకార్య విచక్షణత యుండదు.

ఇట్లు పలికి ఖరుడు ఒక సాలవృక్షమును పెల్లగించి రామునిపై విసరినాడు. రాముడు దానిని తన బాణముచే ఖండించి ఖరునిమీద బాణములు వేసినాడు. ఖరుని శరీరమునుండి రక్తము ప్రవాహముగా పారినది. ఖరుడు తన నెత్తుటివాసనతో రాముని పైకి వచ్చినాడు. అట్లు వచ్చిన ఖరుని జూచి రాముడు కొంచెము వెనుకకు అడు గిడి ఇంద్రుడు అగస్త్యుని కిచ్చిన బాణమును సంధించి ఖరునిపై వదలినాడు. ఖరుడు రామ బాణ హతుడై క్రిందపడి మరణించినాడు.

రాజర్షులు, బ్రహ్మర్షులు శ్రీరాముని పూజించి అనుచున్నారు.

**ఋషులు :** రామా! ఈ మహాత్కార్యమును తలపెట్టియే ఇంద్రుడు శరభంగాశ్రమమునకు వచ్చినాడు. ఈ రాక్షసులను సంహరించుటకే మునులు నిన్నిచ్చటికి ఉపాయముతో తీసికొని వచ్చినారు.

ఆనీత స్త్వ మిమం దేశ ముపాయేన మహర్షిభిః
ఏషాం వధార్థం క్రూరాణాం రక్షసాం పాపకర్మణామ్. 30-31

నీవు సాధించిన ఈ మాహాత్కార్యమువలన ఋషు లందరు దండకారణ్యమున సుఖముగా నుండగలరు.

ఈ ఉత్సవ సమయమున దేవతలు దుందుభులు మ్రోయించి పుష్పవర్షము కురిపించినారు.

**దేవతలు :** బలవీర్యములచే శ్రీరాముడు విష్ణుదేవునికి సరివచ్చుచున్నాడు. పదునాలుగు వేల రాక్షసులను, ఖరదూషణాదులను రాముడు ఒకటిన్నర ముహూర్త కాలములో సంహరించుట అద్భుతము.

అర్ధాధిక ముహూర్తేన రామేణ నిశితై శ్శరైః
చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్. 30-34
ఖరదూషణ ముఖ్యానాం నిహతాని మహాహవే. 30-35

ఈ విధముగా, ఆకాశమున గుమిగూడిన దేవతలు, ఋషులు, శ్రీరాముని ప్రశంసించి వారివారి నెలవులకు వెళ్ళినారు.

లక్ష్మణుడు సీతాదేవిని గుహలోనుండి ఆశ్రమమునకు తీసికొని వచ్చినాడు. శ్రీరాముడు ఆశ్రమము ప్రవేశించి లక్ష్మణుని పూజల నందుకొన్నాడు. శత్రువులను వధించి మహర్షులకు సుఖము చేకూర్చిన శ్రీరాముని సీతాదేవి చూచి ఆనందకందళిత హృదయముతో ఆలింగనము కావించుకొన్నది.

తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్
బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే. 30-39

రాక్షసులు హతులైనందుకును రామునికి యుద్ధమున ఎట్టి అపాయమును కలుగనందుకును సీతాదేవి సంతసించి భర్తను మాటిమాటికి కవుగిలించుకొన్నది.

తతస్తు తం రాక్షససంఘ మర్దనం
సభాజ్యమానం ముదితై ర్మహర్షిభిః
పునః పరిష్వజ్య శశిప్రభాననా
బభూవ హృష్టా జనకాత్మజా తదా. 30-41

## రాక్షస సంహారమును గురించి అకంపనుడు రావణాసురునకు చెప్పుట

రావణాసురుని చారుడైన అకంపనుడు లంకకు పరుగెత్తి జనస్థానమునందలి రాక్షసు లందరు మరణించిన వృత్తాంతమును రాక్షసేశ్వరుడైన రావణునికి తెలియ జేసినాడు.

**రావణుడు :** (కోపముతో) ఇంతటి ఘోరకార్యమును చేసినవా డెవ్వడు ? ఇంద్రుడుగాని కుబేరుడుగాని, యముడుగాని, విష్ణువుగాని, మరెవ్వడేగాని నాకు అపకార మొనర్చి సుఖింపగలడా ! నేను యమునికి యముడను. అగ్నిని సైతము దహింప గలను. రమ్యమైన నా జనస్థానమును హత మొనరించి చావుకు సిద్ధపడినవా డెవ్వడు.

**అకంపనుడు :** (భయకంపితుడై) మహా బలపరాక్రమములు గల రాముడు మనవారి నందరను సంహరించినాడు ప్రభూ !

**రావణుడు :** ఆ రాముడు ఇంద్రుని, దేవతలను వెంట గొనివచ్చెనా యేమి ?

**అకంపనుడు :** అట్టి దేమియు లేదు. అంతపనియు రాము డొక్కడే చేసినాడు. రామబాణములే పంచానన సర్పములై రాక్షసుల నందరను భక్షించినవి.

శరా రామేణ తూత్సృష్టా రుక్మపుంఖాః పతత్రిణః
సర్పాః పంచాననా భూత్వా భక్షయంతిస్మ రాక్షసాన్. 31-18

అగ్నికి వాయువు తోడైనట్లు రామునికి అతని తమ్ముడు లక్ష్మణుడు తోడై యున్నాడు.

*రావణుడు :* సరే ! నే నిప్పుడే జనస్థానమున కరిగి ఆ రామలక్ష్మణులను రూపుమాపెదను.

*అకంపనుడు :* యుద్ధమున నీవు రాముని జయింపలేవు. అతని పరాక్రమమును నేను కన్నులార చూచితిని. రాముడు కోపించి బాణమును ప్రయోగించునేని జల ప్రవాహములు సైతము ఎండిపోవును. అతడు సముద్రపు చెలియలికట్టను భేదించి లోకములను సముద్రజలములతో ముంచివేయగలడు. ఆకాశమును బ్రద్దలు చేయగలడు. మునిగిన భూమండలమును ఉద్ధరింపగలడు. లోకములను సంహరించి పునస్సృష్టి కావింపగలడు. ప్రభూ ! యుద్ధములో నీవు రామునికిచాలవు

రాముని కడతేర్చుటకు ఒక ఉపాయ మున్నది. శ్రద్ధగా వినుము. రాముని భార్య 'సీత' రాముని వెంటనే యున్నది. ఆమెకు సరివచ్చువారు గంధర్వస్త్రీలలోగాని అప్స రసలలోగాని ఎవ్వరునులేరు. నీవు వెళ్ళి సీతను అపహరింపుము. సీతను విడిచి రాముడు బ్రతికియుండలేడు. అంతే ! రాముని వధించుటకు ఇంతకుమించిన మార్గము లేదు.

*రావణుడు :* మంచిది ! నేను రేపు ఉదయముననే బయలుదేరి నీవు చెప్పినట్లు చేయుదును.

## రావణుడు మారీచుని ఆశ్రమమునకు పోవుట (మొదటి మారు)

మరునాడుదయమున రావణుడు రథము నెక్కి బయలుదేరినాడు. దారిలో మారీచుని ఆశ్రమ మున్నది. రావణుడు రథముదిగి మారీచుని ఆశ్రమమునకు వెళ్ళినాడు. మారీచుడు రావణునికి ఆతిథ్య మిచ్చి ఉచితమర్యాదలు చేసి,

*మారీచుడు :* రాజా ! కుశలమా ? నీ విట్లు తొందరపాటున వచ్చుట చూడగా నా కేమో సందేహముగా నున్నది.

*రావణుడు :* మారీచుడా ! ఎవ్వడో రాముడట ! జనస్థానమునందలి మన రాక్షసుల నంద రను సంహరించినాడు. ఆ రాముని భార్యను అపహరింపదలచి వచ్చినాను. అందుకు నీసహాయము కోరుచున్నాను.

*మారీచుడు :* ప్రభూ ! ఎవ్వడు నీ కీ దురాలోచన బోధించిన దుర్మార్గుడు ! వా డెవ్వడో నీకు పరమశత్రువు. నిన్ను సమూలముగా నాశన మొనరించుటకు చేసిన తంత్రమే గాని మరేమియు కాదు. నీవు తలపెట్టిన పని, పాము కోరలను పెరుకుటకు పామునోట చేయిపెట్టిన ట్లున్నది. రామునితో విరోధము పెట్టుకొని సాధింప లేవు. ఎందుకు ? కోరికోరి అనర్థమును తెచ్చుకొనుచున్నావు ! నామాట విని

లంకకు మరలిపోయి నీ భార్యలతో సుఖముగా నుండుము. రాముడు వనమున తన భార్యతో సుఖముగా నుండగలడు.

ప్రసీద లంకేశ్వర రాక్షసేంద్ర
లంకాం ప్రసన్నో భవ సాధు గచ్ఛ
త్వం స్వేషు దారేషు రమస్వ నిత్యం
రామః సభార్యో రమతాం వనేషు. 31-49

రావణుడు మారీచుని హితవాక్యములను విని లంకకు మరలిపోయినాడు.

## శూర్పణఖ రావణునితో జనస్థానవధనుగూర్చి చెప్పుట

జనస్థానమున రాక్షసు లందరతోపాటు ఖరుడుసైతము మరణించిన పిదప శూర్పణఖ లంకకు వచ్చి రావణాసురుని చూచినది. లంకేశ్వరుడు మంత్రులమధ్య కొలువు దీరియుండినాడు. ఇరువది చేతులతోను పది తలలతోను శోభిల్లుచున్నాడు. గొప్ప వీరుడైన రావణాసురుడు రాజలక్షణములతో విరాజిల్లుచున్నాడు.

వింశద్భుజం దశగ్రీవం దర్శనీయ పరిచ్ఛదమ్
విశాలవక్షసం వీరం రాజలక్షణ శోభితమ్. 32-8

రావణాసురునికి దేవత లన్న లక్ష్యములేదు. అతడు ఒకప్పుడు భోగవతీపట్టణమునకు వెళ్ళి వాసుకిని జయించి తక్షకుని భార్యను అపహరించినవాడు. ఒకమారు కైలాసముపై దండయాత్ర సలిపి కుబేరుని జయించి పుష్పకవిమానమును హరించి తెచ్చినవాడు. కుబేరుని చైత్రరథవనమును, అతని పుష్కరిణిని, ఇంద్రుని నందనవనమును ధ్వంసమొనరించిన పరాక్రమశాలి. సూర్యచంద్రులు ఉదయించునప్పుడు వారిని తన చేతులతో అడ్డగింపగలడు. యజ్ఞములను ధ్వంసముచేయువాడు. ఋషికంటకుడు. పదివేల సంవత్సరములు తపస్సు చేసి తన శిరస్సులను ఖండించి వానితో బ్రహ్మదేవుని అర్చించిన ధీరుడు.

దశవర్షసహస్రాణి తప స్తప్త్వా మహావనే
పురా స్వయంభువే ధీర శ్శిరాం స్యుపజహార యః. 32-17

దేవాసురుల యుద్ధమున వజ్రాయుధముచేతను ఐరావత దంతములవలనను కలిగిన గాయముల గుర్తులు రావణుని వక్షస్థలమున మెరయుచుండినవి. రావణుడు దుర్నిరీక్ష్యమైన తేజస్సుతో వెలుగుచు పుష్పకవిమానమున బంగారు సింహాసనము నలంకరించియున్నాడు. మంత్రులు రావణుని పరివేష్టించియున్నారు.

శూర్పణఖ రావణాసురునితో నిర్భయముగా మాటలాడుచున్నది.

శూర్పణఖ: రావణాసురా! నీవు కామభోగములలో తగుల్కొని నీకు సంభవించిన ఘోరవిపత్తును తెలిసికొనజాలకయున్నావు. కామవృత్తిలో నున్న రాజు శ్మశానాగ్నితో సమానుడు. అట్టి ప్రభువును ఎవ్వరును గౌరవింపరు. యుక్తకాలమున తన కార్యములను నిర్వర్తించుకొనని రాజు తన రాజ్యమును పోగొట్టుకొని నాశనమగుటకు ఎంతో కాలము పట్టదు. సముద్రమున మునిగియున్న పర్వతములు ప్రకాశింపనట్లు కామపరతంత్రుడైన రాజు ఎంతమాత్రము ప్రకాశింపడు. నీవు చపలుడవు. నీకు చారు లున్నట్టే తోచుటలేదు. నీవు బుద్ధిహీనుడవు. రాజువై యుండతగినవాడవు కావు. ఎక్కడనో దూరదేశమున జరుగు విషయములను సైతము రాజులు తమ చారులవలన తెలిసికొందురు గనుకనే రాజులను దీర్ఘచక్షువు లందురు.

యస్మా త్పశ్యంతి దూరస్థాన్ సర్వానర్థా న్నరాధిపాః
చారేణ తస్మా దుచ్యంతే రాజానో దీర్ఘచక్షుషః. 33-10

నీకు చారులే లేరాయేమి! నీ మంత్రులు పనికిమాలినవారుగా కనబడుచున్నారు. జనస్థానమున జరిగిన సమాచారము నీకు తెలిసినట్లే లేదు. నేను చెప్పుచున్నాను వినుము.

మనవారి నందరను, పదునాలుగువేల రాక్షసులను, ఖరదూషణులనైతము రాము డొక్కడే సంహరించినాడు. దండకారణ్యమున ఋషులకు అభయ మిచ్చి మన రాక్షసుల బాధను తప్పించినాడు. నీ విచ్చట హాయిగా కామవృత్తియందు కాలము గడపుచు కూర్చుండియున్నావు. రాజు క్రూరుడుగాను, ప్రమత్తుడుగాను, గర్విగాను, శఠుడుగాను ఉండునేని అతనికి ఆపద సంభవించినప్పుడు ఎవ్వరుగాని సహాయపడరు. తన స్వజనులుకూడ దూరమై అట్టిరాజును వధింపగలరు.

[ఈ శ్లోకమునందలి విషయము సూచిత మైనట్లు కనబడుచున్నది.]

అతిమానిన మగ్రాహ్య మాత్మసంభావితం నరమ్
క్రోధనం వ్యసనే హంతి స్వజనోఽపి మహీపతిమ్. 33-16

రాజు జాగరూకుడై ఎప్పటిపనులను అప్పుడు చక్కబెట్టుకొనవలెను. అట్లు చేయనియెడల త్వరలోనే రాజ్యమును పోగొట్టుకొని తృణప్రాయుడు కాగలడు. ఒక సత్యమును జ్ఞప్తియం దుంచుకొనుము. ఎండుకట్టెలుగాని, మట్టిబెడ్డలుగాని, తుదకు దుమ్ముగాని ఎందుకైనను పనికివచ్చునుగాని రాజ్యభ్రష్టుడైన రాజుమాత్రము అత డెట్టి సమర్థుడైనను ఎందుకును కొరగాడు.

శుష్కైః కాష్ఠై ర్భవే త్కార్యం లోష్టైరపి చ పాంసుభిః
న తు స్థానా త్పరిభ్రష్టైః కార్యం స్యా ద్వసుధాధిపైః 33-18

రాజునకు ఉండవలసిన లక్షణములు నీయం దొక్కటియును కనిపించుటలేదు. నీ సంగతి చూడగా నీవు త్వరలోనే రాజ్యమును కోల్పోయి నాశన మగుదు వని తోచు చున్నది.

పరావమంతా విషయేషు సంగతో
న దేశకాల ప్రవిభాగ తత్త్వవిత్
అయుక్తబుద్ధి ర్గుణదోష నిశ్చయే
విపన్నరాజ్యో నచిరా ద్విపత్స్యసే 33-23

శూర్పణఖ పలికిన నిష్ఠురవాక్యములను విని రావణాసురుడు దీర్ఘకాలము ఆలోచించి అనుచున్నాడు.

రావణుడు : (కోపముతో) ఎవ్వ డా రాముడు ! అత డెట్టివాడు. అతని వీర్యపరాక్రమము లెట్టివి ? అతడు దండకారణ్యమునకు వచ్చిన కారణ మేమి ? ఖరదూషణులనే వధించెనా ! రాముని ఆయుధము లెవ్వి ?

శూర్పణఖ : రాముడు మన్మథాకారుడు. జటాజినములు ధరించియున్నాడు. రాముని ధనుస్సు ఇంద్రధనుస్సుకు సాటివచ్చుచున్నది. బాణములు ప్రయోగించుటలో రాముని హస్తలాఘవమును వర్ణించుట నా తరముకాదు. ఒకటిన్నరముహూర్త కాలమున అన్నివేల రాక్షసులను వధించినవాడు. మనవారిలో ఒకడైనను మిగులలేదు. స్త్రీవధ చేయరా దని నన్నుమాత్రము దయదలచి విడిచిపెట్టినాడు.

రామునికి లక్ష్మణు డని ఒక తమ్ము డున్నాడు. రామునియెడ మిక్కిలి భక్తి ప్రేమలుకలవాడు. మంచి బుద్ధిమంతుడు, బలవంతుడు. రామునికి కుడిభుజమువంటి వాడు. రాముని బహిఃప్రాణ మని చెప్పదగినవాడు.

అమర్షీ దుర్జయో జేతా విక్రాంతో బుద్ధిమాన్ బలీ
రామస్య దక్షిణో బాహు ర్నిత్యం ప్రాణో బహిశ్చరః. 34-13

రామునికి ఒక భార్య కలదు. ఆమెపేరు సీత. అంతటి అందగత్తె ఈలోకమున కాదుగదా మరేలోకమునకూడ ఉండబోదు. వనదేవతవలె, అపరలక్ష్మీదేవివలె వెలుగు చున్నది.

సా సుకేశీ సునాసోరు స్సురూపా చ యశస్వినీ
దేవతేవ వనస్యాస్య రాజతే శ్రీరివాపరా. 34-15

సీత ఎవ్వనికి భార్యగా నుండునో ఆమె ఏ పురుషుని సంతోషముతో ఆలింగనము గావించునో, అట్టిభాగ్యశాలి ఇంద్రునికంటె అధికుడుగా జీవించియుండగలడు.

యస్య సీతా భవేద్భార్యా యం చ హృష్టా పరిష్వజేత్
అతిజీవేత్స సర్వేషు లోకేష్వపి పురందరాత్. 34-18

ఆ సీత నీకు తగినభార్య. నీ వామెకు తగిన భర్తవు. ఆమెను నీకొరకు తీసికొని వచ్చుటకు ఎంతో ప్రయత్నించినాను. ఆ ప్రయత్నములోనే నా కీ గతి పట్టినది. లక్ష్మణుడు నా ముక్కును చెవులను ఖండించినాడు. నీవు సీతను చూచుటయే తడవు, వెంటనే మన్మథబాణమునకు గురి కాగలవు. సీత నీకు భార్యగా నుండవలయు నని కోరిక గలదేని ఇప్పుడే బయలుదేరుము. కుడికాలు ముందుపెట్టి నడువుము. పని జయ మగును.

మన రాక్షసులను సంహరించిన రాముని వధించి, మృతులైనవారికి సుఖము చేకూర్పుము. నన్ను విరూపిణిగా చేసిన ఆ లక్ష్మణునికూడ నీ బాణములచే వధింపుము. రామలక్ష్మణులు నీచే హతులైనపిదప సీత అనాథురాలై నీవశము కాగలదు. నా మాట నీకు నచ్చినయెడల నేను చెప్పినట్లు నిర్భయముగా చేయుము. నీ ఆత్మశక్తిని గుర్తించి నీ బలపరాక్రమములను వినియోగించి సీతను తెచ్చుకొనుము.

విజ్ఞాయేహాత్మశక్తిం చ హ్రియతా మబలా బలాత్
సీతా సర్వానవద్యాంగీ భార్యార్థే రాక్షసేశ్వర. 34-26

[రామలక్ష్మణులను వధించి సీతను తెమ్మని చెప్పుచున్నది శూర్పణఖ. సీత స్వయముగా తన వెంటవచ్చుటకు ఇష్టపడనిచో బలమును వినియోగించి తెచ్చుకొనుమని చెప్పుచున్నదే కాని దొంగతనముగా తెమ్మని శూర్పణఖ చెప్పలేదు. రామలక్ష్మణులు వధింపబడిననేగాని తనకు వారి వలన కలిగిన అవమానము తీరదు. సీతను తస్కరించి తెచ్చు బుద్ధి రావణునికి అకంపనుడు కలిగించినాడు. రాముని పరాక్రమమును తలచుకొని రావణుడు భయపడి అకంపనుని ఉపాయమునే అనుసరించినాడు.]

## రావణుడు మారీచుని ఆశ్రమమునకు పోవుట (రెండవమారు)

రావణుడు మంత్రులకు సెలవిచ్చి కొలువు చాలించినాడు. తన కర్తవ్యమును గూర్చి తర్కించుకొని యానశాలకు వెళ్ళి రథమును సిద్ధము చేయుమని సూతునికి చెప్పినాడు. కామగమనమును కలిగిన రథము నారోహించి సముద్రతీరమున నుండిన ఆశ్రమములను, తామరకొలనులను, కదళీ నారికేళ వనములను, పలువిధములైన ఫల వృక్ష సమూహములతో కూడిన ప్రదేశములను, పట్టణములను తిలకించుచు రావణుడు ఆకాశమార్గమున ప్రయాణము చేసినాడు.

దారిలో ఒక గొప్ప వటవృక్ష మున్నది. దాని కొమ్మలు నూరు యోజనముల నిడివి గలవి. పూర్వము గరుత్మంతుడు గజకచ్ఛపములను ఆహారముగా తెచ్చుకొని

వానిని భక్షించుటకు ఈ చెట్టుకొమ్మపైన కూర్చుండినాడు. ఆ బరువు మోయజాలక ఆ కొమ్మ విరిగినది. ఆ కొమ్మను ఆశ్రయించుకొని వైఖానసులు, వాలఖిల్యులు అయిన ఋషులు తపస్సు చేసికొనుచుండినారు. గరుత్మంతుడు ఆ ఋషులమీద దయదలచి ఆ కొమ్మను, గజకచ్ఛపములను తీసికొనివెళ్ళి ఒంటికాలిమీద నిల్చబడి గజకచ్ఛపములను భక్షించి, అందుండిన నిషాదుల నందరిని చంపి, వారినికూడ భక్షించి, ఋషులకు బాధ కలుగనీయక తప్పించినాడు. గరుత్మంతుడు అక్కడనుండి ఉత్సాహముతో ప్రయాణము చేసి ఇంద్రుని భవనమున నుండిన అమృతమును తెచ్చినాడు. ఆ వటవృక్షము పేరు సుభద్రము. రావణుడు ఆకాశమార్గమునపోవుటలో ఆ వటవృక్షమునుకూడచూచినాడు.

ఈ విధముగా ప్రయాణము చేసి రావణుడు సముద్రపు ఆవలితీరము చేరినాడు. మారీచుని ఆశ్రమము అక్కడ నున్నది. మారీచుడు జటావల్కలములు ధరించి ఆహార నియమమును పాటించి ఆశ్రమమున కాలము గడపుచున్నాడు.

రావణుడు మారీచుని ఆశ్రమము ప్రవేశించినాడు. మారీచుడు రావణునికి ఆతిథ్య మిచ్చి రావణునితో అనుచున్నాడు.

***మారీచుడు*** : రాజా ! లంకలో అందరకు క్షేమమేనా ! మరల ఇంత శీఘ్రముగా వచ్చుటకు కారణ మేమి ?

***రావణుడు*** : మారీచా! నేను తీరనిదుఃఖములో నున్నాను. ఇప్పుడు నీవే నాకు పరమగతివి.

మారీచ శ్రూయతాం తాత వచనం మమ భాషతః
ఆర్తోఽస్మి మమ చార్తస్య భవాన్ హి పరమా గతిః. 36-1

[ముల్లోకములను తల్లడిల్లజేసిన రావణునినోట ఎట్టి ఆర్తనాదములు వెడలుచున్నవో గమనింపదగియున్నది. రావణుని తేజస్సు ఇప్పటికే నశించిన దని యీ దీనాలాపములు సూచించుచున్నవి. చెడుతలంపు కలిగినక్షణముననే తేజస్సుక్షీణించుననుటకు గొప్పనిదర్శనము]

నాయనా! మారీచా ! పదాతియైన ఒక్కమానవమాత్రుడు జనస్థానమునందలి మనవారి నందరను, పదునాలుగువేల రాక్షసులను సంహరించినాడు.

చతుర్దశ సహస్రాణి రక్షసా ముగ్రతేజసామ్
నిహతాని శరై స్తీక్ష్ణై ర్మానుషేణ పదాతినా 36.8

మనఖరుడు, దూషణుడు, త్రిశిరుడు, అందరు చనిపోయినారు. రాముడు తన దేశమునుండి తండ్రిచే తరుమబడి అడవికి వచ్చినవాడు. రాముడు అతిక్రూరుడు. ఇంద్రియలోలుడు. అధర్మపరుడు. లోకులకు కీడుచేయుటయం దాసక్తి కలిగినవాడు.

దుశ్శీలః కర్కశ స్తీక్ష్ణో మూర్ఖో లుబ్ధోఽజితేంద్రియః
త్యక్తధర్మో హ్యధర్మాత్మా భూతానా మహితే రతః 36-11

[రావణుడు తన దుర్గుణములను రామునికి ఆరోపించుచున్నాడు. రావణుని వర్ణింపదలతుమేని అతనినోట వచ్చిన యీ శ్లోకము చక్కగా సరిపడును]

ఎట్టివిరోధముగాని లేకయే రాముడు కేవల బలము నాశ్రయించి నా చెలియలి ముక్కు, చెవులు కోయించినాడు.

యేన వైరం వినారణ్యే సత్త్వ మాశ్రిత్య కేవలమ్
కర్ణనాసాపహరణా ద్భగినీ మే విరూపితా 36-12

[9-4 'వినావైరంచ రౌద్రతా' అని సీతాదేవి రామునికి చెప్పిన దోషమునే రావణుడు ఆరోపించుచున్నాడు]

మారీచా! రాముని భార్యను ఇప్పుడు తేవలయును. అందుకు నీ సహాయము అవసరము. మారీచుడా! నీవు యుద్ధమున నేగాక మాయలయందును పండితుడవు గదా! నీ విప్పుడు చేయవలసిన పనిని శ్రద్ధగా వినుము. వెండిబిందువులతో కూడిన బంగారు జింకరూపమును దాల్చి రాముని ఆశ్రమమున సీతకు కనబడునట్లు తిరుగుచుండుము. జింకను పట్టితెమ్మని రామలక్ష్మణులను సీత అడుగగలదు. ఇందుకు సందేహ మేమియు లేదు. నీవు పరుగెత్తి రామలక్ష్మణులను ఆశ్రమమునుండి దూరముగా తీసికొనిపొమ్ము. ఈలోపల నేను సీతను అపహరించెదను. ఆతరువాత యుద్ధము వచ్చినను భయపడవలసిన పనిలేదు. భార్యను కోల్పోయిన రాముడు దుఃఖముతో కృశించియుండును గనుక మన మతనిని సులభముగా జయింపవచ్చును.

సౌవర్ణ స్త్వం మృగో భూత్వా చిత్రో రజతబిందుభిః
ఆశ్రమే తస్య రామస్య సీతాయాః ప్రముఖే చర 36-18
త్వాం తు నిస్సంశయం సీతా దృష్ట్వా తు మృగరూపిణమ్
గృహ్యతా మితి భర్తారం లక్ష్మణం చాభిధాస్యతి 36-19
తత స్తయో రపాయే తు శూన్యే సీతాం యథాసుఖమ్
నిరాబాధో హరిష్యామి రాహు శ్చంద్రప్రభా మివ 36-20
తతః పశ్చా త్సుఖం రామే భార్యాహరణ కర్శితే
విస్రబ్ధః ప్రహరిష్యామి కృతార్థే నాంతరాత్మనా. 36-21

[ఇప్పటికి ఇంతవరకే తోచినదికాబోలు! రాముడుమాత్రము జింకను వెంబడించి లక్ష్మణుడు ఆశ్రమములోనే ఉండినయెడల ఏమికావలయునో అవల ఆలోచించియుండును. లేక, సమయము వచ్చినప్పుడు చెప్పవచ్చు నని ఇంతవరకే చెప్పినాడో! రావణుని ఆలోచనలను మనము తెలుసుకొనగలమా! రాబోవు సన్నివేశమును ఎంతచక్కగా ఊహించినాడు!]

రాముని పేరు వినుటతోడనే మారీచునికి భయము పుట్టినది. నోరు ఎండిపోయినది. పెదవులను నాలుకతో తడుపుకొన్నాడు. కండ్లు తేలవేసినాడు. ప్రాణము పోయినంత పని అయినది.

తస్య రామకథాం శ్రుత్వా మారీచస్య మహాత్మనః
శుష్కం సమభవ ద్వక్త్రం పరిత్రస్తో బభూవ హ 36-22
ఓష్ఠౌ పరిలిహన్ శుష్కౌ నేత్రై రనిమిషై రివ
మృతభూత ఇవా ర్తస్తు రావణం సముదైక్షత. 36-23

**మారీచుడు**: (అంజలిచేసి) రాజా! ఇచ్చకములు పలుకువారు సులభముగా దొరకుదురు కాని అప్రియమైన హితమును చెప్పువారు మిక్కిలి అరుదు. చెప్పినను విను వారు అంతకంటె అరుదు.

సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః
అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః. 37-2

నీవు చపలుడవు. నీకు చారులుకూడ లేరుకాబోలు! నీవు రాముని ప్రభావమును గుర్తించినట్లేలేదు. రాముడు కోపించునేని లోకమున రాక్షసు డనువాడు లేకుండ చేయ గలడు. సీత నిన్ను చంపుటకే పుట్టినట్లున్నది. నీవు కామలోలుడవు. నిరంకుశుడవు. నీవంటివానిని ప్రభువుగా బడసిన లంక సర్వనాశన మగుకాలము సమీపించిన దని తోచు చున్నది. నీయట్టి దుర్మార్గుడు రాజైనచో రాజ్యమును, ప్రజలను, తనను నాశన మొన రించుకొను ననుటకు సందేహములేదు.

త్వద్విధః కామవృత్తో హి దుశ్శీలః పాపమంత్రితః
ఆత్మానం స్వజనం రాష్ట్రం స రాజా హంతి దుర్మతిః. 37-7

నీ వన్నట్లు రాముడు తండ్రిచే అడవికి తరుమబడినవాడు కాడు. అధర్మపరుడు కాడు. క్రూరుడు కాడు. ధర్మము నాశ్రయించి తండ్రిని తరింపజేయుటకై అడవికి వచ్చినవాడు. రాముడు ధర్మవిగ్రహుడు. సత్యపరాక్రముడు. దేవతలకు ఇంద్రుడు ప్రభువైనట్లు ప్రజ లెల్లరకును రాముడు ప్రభువు.

రామో విగ్రహవాన్ ధర్మ స్సాధు స్సత్యపరాక్రమః
రాజా సర్వస్య లోకస్య దేవానాం మఘవా నివ. 37-13

సీతాదేవి తన తేజస్సు చేతనే తన్ను రక్షించుకొనగలదు. సీతను అపహరించుట సాధ్యమైనపనికాదు. సూర్యుని తేజస్సును సూర్యునియొద్దనుండి ఎవ్వరైనను అపహ రింపగలరా! రాముడు యమునివంటివాడు. రామబాణమునకు గురి కావలదు. రాముడు తన భార్యను తన ప్రాణములకంటె మిన్నగా ప్రేమించువాడు. సీతయు సర్వదా

రామునే అనుసరించియుండును. వా రిద్దరను విడదీయుపని పెట్టుకొనవలదు. నీకు దీని వలన లాభ మేమియు కలుగదు. నీవు సుఖముగా బ్రతికియుండదలతువేని రామునికి అపకారము తలపెట్టవలదు.

జీవితం చ సుఖం చైవ రాజ్యం చైవ సుదుర్లభమ్
య దీచ్ఛసి చిరం భోక్తుం మా కృథా రామవిప్రియమ్. 37-22

[శ్రీరాముని మనస్సునకు బాధ కలిగించు పనులు చేయువా రందరకు ఈనాడుకూడ ఇదేమాట]

రాజా! నీవు లంకకు మరలిపోయి, విభీషణుడు మున్నగు మంత్రిసత్తములతో చక్కగా ఆలోచించి, గుణదోషములను, బలాబలములను విమర్శించి, మంచిచెడ్డలు గమనించి, ఏది యుక్తమో దానిని చేయుము. నేను నీ క్షేమము కోరి మరిమరి చెప్పుచున్నాను. రామునితో విరోధము పెట్టుకొనవలదు. నామాట వినుము; క్షేమపడుదువు.

రాముని సంగతి నేను స్వయముగా ఎరుగుదును. ఒకప్పుడు నేను ఋషి మాంసమును తినదలచి దండకారణ్యమున సంచారము చేసినాను. విశ్వామిత్రుని యాగమునకు భంగము కలిగించినాను. తన యాగసంరక్షణకు విశ్వామిత్రుడు రాముని తోడ్కొని వచ్చినాడు. "రాముడు పసివాడుగదా! న న్నేమి చేయగలడు?" అని తలచి నేను ధైర్యముగా విశ్వామిత్రుని యజ్ఞవేదికపైకి దుమికినాను. రాముడు నామీద బాణమును ప్రయోగించినాడు. రామబాణము దెబ్బకు నేను నూరు యోజనముల కావల సముద్రమున పడి మూర్ఛిల్లి ఎంతోకాలమునకు మూర్ఛదేరి నెమ్మదిగా లంకకు చేరుకొన్నాను. ఆ సమయమున రాముడు దయదలచబట్టి ప్రాణముతో బయటపడినాను.

రాముని బాణవేగము నాకు చక్కగా తెలియును. రామునితో పోరుపెట్టుకొన్నయెడల నీవు చెడిపోవుట నిశ్చయము. అంతేకాదు; లంకలోని రాక్షసు లందరు నీ సహవాసదోషమువలన నాశనము కాగలరు. నిర్దోషు లెందరో నీ పాపములకు బలియగుదురు.

అకుర్వంతోఽపి పాపాని శుచయః పాపసంశ్రయాత్
పరపాపై ర్వినశ్యంతి మత్స్యా నాగహ్రదే యథా. 38-26

రాజా! హర్మ్యప్రాసాదములతో నిండి సమస్త సంపదలతో కళకళలాడుచున్న లంకాపట్టణ మంతయు బూడిద కాగలదు. ఎందుకువచ్చిన బాధ! పరదారాభిమర్శనము కంటె పాపము మరొక్కటికలదా! నీకు వేయిమంది భార్య లున్నారు. వారితో తృప్తిజెంది నీ కులమును, నీ గౌరవమును, నీ ప్రజలను, నీ రాజ్యమును, నీ ప్రాణమును రక్షించుకొనుము.

ప్రమదానాం సహస్రాణి తవ రాజన్ పరిగ్రహాః. 38-30

భవ స్వదారనిరత స్స్వకులం రక్ష రాక్షస
మాన మృద్ధిం చ రాజ్యం చ జీవితం చేష్టమాత్మనః. 38-31

నా అనుభవమును మరియొకటి చెప్పెదను. మారుపలుకక వినుము.

ఇదానీమపి యద్వృత్తం తచ్ఛృణుష్వ నిరుత్తరమ్. 39-1

రాముని బాణహతి రుచి చూచియు, నేను మరియొకమారు ఒక సాహసము గావించితిని. నేనును, నా స్నేహితు లిద్దరును జింకరూపములు దాల్చి దండకారణ్యమున కరిగి ఋషుల మాంసము తినుచు అరణ్యమున తిరుగుటలో రాముని ఆశ్రమప్రాంతమునకు వచ్చినాము. రాముని చూచి పాతపగను తీర్చుకొనదలచినాను.

[ఇచ్చట గమనింపదగిన ముఖ్యవిషయమొకటి కలదు. పాతపగ ఎట్లు కలిగినది ? విశ్వామిత్రుని యాగరక్షణకాలమున రాముడు మారీచునిపై బాణము ప్రయోగించుట ఒక కారణము. రెండవ కారణ మొకటి యున్నది. మారీచుని తల్లియైన తాటకను శ్రీరాముడు వధించియుండు సంగతిని మనము మరచిపోరాదు.]

రాముడు తాపసుడుగా పున్నాడుగదా యని ధైర్యముచేసి రామునిమీదికి ముగ్గురము బయలుదేరినాము. రాముడు మమ్ములను చూచి మూడు బాణములను ప్రయోగించినాడు. రామబాణప్రభావము నాకు తెలియును గనుక నేనెట్లో పరుగెత్తి తప్పించుకొన్నాను. కాని నా స్నేహితు లిరువురును నిహతులైనారు. నేను ప్రాణముతో బయటపడి వచ్చి యీ ఆశ్రమమున తపస్సు చేసికొనుచున్నాను.

శరేణ ముక్తో రామస్య కథంచి త్ప్రాప్య జీవితమ్
ఇహ ప్రవ్రాజితో యుక్త స్తాపసోఽహం సమాహితః. 39-13

రాజా ! జటావల్కలములు దాల్చి ధనుస్సు ధరించిన రాముడు పాశహస్తుడైన యమునివలె నాకు ప్రతివృక్షమందును కనబడుచున్నాడు. ఒకడుకాదు. అనేకవేల రాములు నా కంటికి కనిపించుచున్నారు. అరణ్య మంతయు రామమయముగా కానబడుచున్నది. జనసంచారములేని బయలుప్రదేశములందును రాముడే కానవచ్చుచున్నాడు. కలలో రాముని చూచి భయభ్రాంతుడనై మూర్ఛ నొందుచుందును. రాముని భయమువలన 'ర' అను అక్షరము వినబడునేని రాముడని భయకంపితుడనగుచున్నాను. 'రత్నములు' 'రథములు' అని విన్నప్పుడుకూడ నాకు భయము తోచుచున్నది.

['రా' అని దీర్ఘముకూడ అక్కరలేదు 'ర' అన్ననే చాలు ననుటను రత్నములు, రథములు అని ఉదాహరించుట సొంపుగా నున్నది.]

వృక్షే వృక్షే చ పశ్యామి చీరకృష్ణాజినాంబరమ్
గృహీత ధనుషం రామం పాశహస్త మివాంతకమ్. 39-14

అపి రామసహస్రాణి భీతః పశ్యామి రావణ
రామభూత మిదం సర్వ మరణ్యం ప్రతిభాతి మే 39-15

రామమేవ హి పశ్యామి రహితే రాక్షసాధిప
దృష్ట్వా స్వప్నగతం రామ ముద్భ్రమామి విచేతనః 39-16

రకారాదీని నామాని రామ త్ర స్తస్య రావణ
రత్నాని చ రథాశ్చైవ త్రాసం సంజనయంతి మే. 39-17

రాజా! రాముని ప్రభావము నాకు చక్కగా తెలియును. నీవు బ్రతికియుండ గోరుదువేని రామునితో వైరము పెట్టుకొనవలదు. నే నేదో తపస్సు చేసికొనుచు కాలము గడుపుచున్నాను. నన్నుమాత్రము ఈ పనిలోనికి దింపవలదు. రామునితో యుద్ధము చేయుదువో మానుదువో నీ ఇష్టము. నా యెదుటమాత్రము రామునిమాట ఎత్తవలదు. లోకమున మంచివా రనేకులు ఇతరులు చేసిన అపరాధమువలన సపరివారముగా నాశన మగుట కలదు. అట్లే నేనుకూడ నీ అపరాధమునకు బలి యగుదును. నీవు నీ ఇష్టానుసారము ప్రవర్తింపుము. నేనుమాత్రము నీ వెంబడి రాను.

రణే రామేణ యుద్ధ్యస్వ క్షమాం వా కురు రాక్షస
న తే రామకథా కార్యా యది మాం ద్రష్టు మిచ్ఛసి 39-19

బహవ స్సాధవో లోకే యుక్తా ధర్మ మనుష్ఠితాః
పరేషా మపరాధేన వినష్టా స్సపరిచ్ఛదాః 39-20

సోఽహం తవాపరాధేన వినశ్యేయం నిశాచర
కురు యత్తే క్షమం తత్త్వమహం త్వాం నానుయామి హ. 39-21

రావణా! రాము డేదో తప్పు చేసెనని యంటివి. ఖరుడు తన సైన్యమును తీసికొని రామునిపైకి వెళ్ళినందున రాముడు ప్రతియుద్ధముచేసి వారిని వధించినాడు. ఇందులో రాముడు చేసిన తప్పు ఏమైన కలదా! నీవే చెప్పుము. ఇప్పుడైనను నామాట నాలకించి లంకకు మరలిపొమ్ము.

మారీచుని హితవాక్యములు రావణుని మనస్సున కెక్కలేదు. చావగోరినవాడు ఔషధమును సేవించునా!

**రావణుడు :** మారీచా! అర్థములేని ఈ మాటలవలన లాభ మేమి? రాముడు న న్నేమియు చేయజాలడు. ఒక స్త్రీమాట విని తల్లిదండ్రులను, స్నేహితులను, రాజ్యమును, వదలిపెట్టి అడవికి నడచిన ఈ రాముడు న న్నేమి చేయగలడు? నేను సీతను

తప్పక అపహరింతును. ఆకార్యమును నీ కట్టెదుటనే చేయుదును. నన్ను మరలించుటకు నీవల్ల కాదు సరిగదా, దేవతలకు సైతము సాధ్యముకాదు.

ఈ కార్యమునందలి గుణదోషములను నిర్ణయింపు మనిగాని అపాయములు ఉపాయములు చెప్పు మనిగాని నేను ని న్నడుగుటలేదు.

దోషం గుణం వా సంపృష్ట స్త్వమేవం వక్తు మర్హసి
అపాయం వా ప్యుపాయం వా కార్యస్యాస్య వినిశ్చయే. 40-8

రాజు అడిగినప్పుడే మంత్రియైనవాడు దేనినైన చెప్పవలయునేగాని అడుగని యెడల చెప్పకూడదు. రాజునకు హితము చెప్పదలచుకొన్నప్పుడు మృదువుగా, వినయముగా, చెప్పవలయునేగాని పరుషముగాను, తిరస్కార భావముతోను, చెప్పుట సరి కాదు. అట్లు చెప్పినచో రాజు ఆలకించునా !

వాక్య మప్రతికూలం తు మృదుపూర్వం హితం శుభమ్
ఉపచారేణ యుక్తం చ వక్తవ్యో వసుధాధిపః. 40-10
సావమర్దం తు యద్వాక్యం మారీచ హిత ముచ్యతే
నాభినందతి తద్రాజా మానార్హో మానవర్జితమ్. 40-11

అగ్ని, ఇంద్రుడు, చంద్రుడు, వరుణుడు, యముడు, ఈ అయిదుగురి రూపములను రాజులు దాల్చియుందురు. అగ్నిదేవుని వేడిమి, ఇంద్రుని పరాక్రమము, చంద్రుని చల్లదనము, వరుణుని ప్రసన్నత, యముని దండనశక్తి ఇవన్నియు రాజులయందు ప్రతిష్ఠితములై యుండును. కావున రాజులను ఎల్లప్పుడు గౌరవించి పూజింపవలయును. నీవు రాజధర్మమును స్మరింపక మీ ఆశ్రమమునకు అభ్యాగతుడనుగా వచ్చిన నీప్రభువైన నన్ను నోటికి వచ్చినట్లు నిందించుచున్నావు. అట్లు చేయుట గొప్ప తప్పు.

నా ఆజ్ఞను నీవు నిర్వహింపవలెను. అంతే! నీవు బంగారుజింక రూపమును దాల్చి సీతకు కనబడునట్లు ఆమె యెదుట తిరుగుము. నేను చెప్పినట్లు రాముని దూరముగా కొనిపోయి "హాసీతా ! హాలక్ష్మణా" అని రాముని కంఠస్వరము ననుకరించి బిగ్గరగా కేక పెట్టుము. ఆ మాటలు విన్నవెంటనే అన్నయందు తనకుగల ప్రేమచేతను, సీతా ప్రేరణవల్లను లక్ష్మణుడు రాముని అనుసరింపగలడు. రామలక్ష్మణులులేని సమయముగా చూచి నేను సీతను అపహరించెదను.

అపక్రాంతే తు కాకుత్స్థే దూరం యాత్వా ప్యుదాహర
'హా సీతే లక్ష్మణే'త్యేవం రామవాక్యానురూపకమ్. 40-19
తచ్ఛ్రుత్వా రామపదవీం సీతయా చ ప్రచోదితః
అనుగచ్ఛతి సంభ్రాంతః సౌమిత్రి రపి సౌహృదాత్. 40-20

అపక్రాంతే చ కాకుత్స్థే లక్ష్మణే చ యథాసుఖమ్
ఆహరిష్యామి వైదేహీం సహస్రాక్ష శ్శచీ మివ. 40-21

మారీచా! ఈ పనిమాత్రము చేయుము. ఆ తరువాత నీ ఇష్టమువచ్చినచోటికి పొమ్ము. నీకు అర్ధరాజ్య మిచ్చెదను.

రాజ్యస్యార్ధం ప్రయచ్ఛామి మారీచ తవ సువ్రత 40-23

ఇప్పుడే బయలుదేరుము. నేనుకూడ నీ వెంట వచ్చెదను. రాముని వంచించి యుద్ధముతో పనిలేకయే సీతను తెచ్చుకొందము. కార్యము చక్కబెట్టుకొని మనము లంకకు పోవుదము.

[అర్ధరాజ్యము నిచ్చుటకు కాబోలు!]

మారీచా! తెలిసినదా! 'సరే' అనుము. నీవీ కార్యము చేయనియెడల నిన్నిప్పుడే వధింతును. నిన్ను బలాత్కరించియైనను నీ చేత ఈ పని చేయింతును.

న చేత్కరోషి మారీచ హన్మి త్వా మహ మద్య వై
ఏతత్కార్య మవశ్యం మే బలాదపి కరిష్యసి 40-26

రాజునకు ప్రతికూలముగా చరించువా డెప్పుడును సుఖపడడు. రామునివలన నీకు మరణము కలుగుట సందేహముగా ఉండవచ్చును కాని నా మాట వినవేని నాచేత నీకు మరణము కలుగుటలో సందియ మేమియునులేదు. ఈ రెంటిని చక్కగా పరిశీలించి నీ [illegible]ది మేలని తోచునో అట్లు చేయుము.

ఆసాద్య తం జీవితసంశయ స్తే
మృత్యుర్ధ్రువో హ్యద్య మయా విరుధ్య
ఏత ద్యథావ త్ప్రతిగృహ్య బుద్ధ్యా
య దత్ర పథ్యం కురు త త్తథా త్వమ్ 40-27

**మారీచుడు:** రాజా! నీకు వినాశము కలిగించు ఈ ఉపాయమును ఏ పాపాత్ముడు బోధించినాడు. రాజు తప్పుదారి త్రొక్కుచున్నప్పుడు మంత్రులు ఊరక యుండరాదు. రాజును సకలవిధముల నిగ్రహించి మంచిదారికి మరల్పవలెను. నీ మంత్రులు నిన్ను నిగ్రహింపకున్నారు కావున వారు వధ్యులు.

వధ్యాః ఖలు న హన్యంతే సచివా స్తవ రావణ
యే త్వా ముత్పథమారూఢం న నిగృహ్ణంతి సర్వశః 41-6

ధర్మమునకు, జయమునకు రాజేమూలము కావున రాజును ఎల్లైనను రక్షించుకొనవలెను. నీయట్టి దుర్మార్గుడు, ఇంద్రియలోలుడు రాజుగా ప్రాప్తించినందున రాక్షసు లందరు నశింతురనుటకు సందేహములేదు.

అవశ్యం వినశిష్యంతి సర్వే రావణ రాక్షసాః
యేషాం త్వం కర్కశో రాజా దుర్బుద్ధి రజితేంద్రియః 41-15

కాకతాళీయముగా నాకు సంభవించిన యీ ఆపదనుగూర్చి నేను చింతపడుట లేదు. నీవును నీ వారందరును నాశన మగుదురనిమాత్రము దుఃఖపడుచున్నాను.

తదిదం కాకతాళీయం ఘోర మాసాదితం మయా
అత్ర కిం శోచనీయ స్త్వం ససైన్యో వినశిష్యసి 41-16

రాముడు నన్ను వధించి, తరువాత నిన్నుకూడ త్వరలోనే వధింపగలడు. రామునిచే మరణము నొంది నేను కృతార్థుడ నగుదును.

[నీ చేత చచ్చుటకంటె నాకదియే మేలు !]

మాం నిహత్య తు రామస్తు నచిరా త్త్వాం వధిష్యతి
అనేన కృతకృత్యోఽస్మి మ్రియే యదరిణా హతః 41-17

రామునికంట నేను పడుటయే ఆలస్యము. నేను మరణించుట నిశ్చయ మని తెలిసికొనుము. నీవుకూడ అంతే. సీతను అపహరించిన వెంటనే నీవు, నీ బంధువులు అందరు హతు లగుట నిశ్చయము. నీకు చావు మూడినది గనుకనే నామాట చెవిని బెట్టకయున్నావు.

రావణా ! నేను బయలుదేరుచున్నాను. మరలివచ్చుట వుండదు. రాముడు బాణపాణియై నన్ను చూచుటతోడనే నా ప్రాణములు పోవును. బాణము ప్రయోగించుట కూడ పనిలేదు.

దృష్ట శ్చాహం పునస్తేన శరచాపాసి ధారిణా
మద్వధోద్యత శస్త్రేణ వినష్టం జీవితం చ మే. 42-2

రాజా ! నేను సిద్ధముగా వున్నాను. నీకు శుభ మగునుగాక.

రావణుడు: (మారీచుని కవుగిలించుకొని) మారీచా ! ఈ మాట నీకు తగియున్నది. ఇప్పుడుగదా నీవు నిజమైన మారీచుడవు. ఇంతకుముందు ఎవరో వేరురాక్షసుడవుగా నుంటివి.

ఇదానీమసి మారీచః పూర్వ మన్యో నిశాచరః. 42-6

ఈ రథము నెక్కుము. ఇద్దరము రాముని ఆశ్రమమునకు పోవుదము.

ఇద్దరు రథము నెక్కి దండకారణ్యమున కరిగి రాముని ఆశ్రమమును సమీపించి రథమునుండి దిగినారు.

రావణుడు : మారీచుడా! అదిగో! ఆ అరటిచెట్లనడుమ నున్నది చూడుము. అదియే రాముని ఆశ్రమము. నీవు నీ పనిలో నుండుము. నాపని నేను చేయుదును.

## మారీచుడు జింకరూపమును దాల్చి రామాశ్రమమునకు పోవుట

మారీచుడు బంగారుజింక రూపమును దాల్చినాడు. ఆ జింక మనోహరముగా నున్నది. సీతాదేవిని ఆకర్షించుటకు పచ్చికబయళ్ళలో తిరుగుచున్నది. అరటి చెట్లను, కొండగోగులను దాటుకొని ఆశ్రమమునకు సమీపముగా సీతాదేవి చూచుటకు వీలుగా విహరించుచున్నది.

మనోహరం దర్శనీయం రూపం కృత్వా స రాక్షసః
ప్రలోభనార్థం వైదేహ్యా నానా ధాతు విచిత్రితమ్. 42-20
విచరన్ గచ్ఛతే తస్మా చ్ఛాద్వలాని సమంతతః. 42-21

అక్కడి అడవిమృగములు జింకను వాసనచూచి భయపడి పారిపోవుచున్నవి. కాని, మారీచుడు తన స్వభావమును బయటపెట్టక మెలకువపడి ఆ మృగములను హింసింపలేదు.

కొంత సేపటికి సీతాదేవి పూలుకోయుటకు చెట్లచెంతకు వచ్చి పూలుకోసికొనుచు జింకను చూచినది. జింకశరీరము రత్నమయమై యుండినది. బిందువులు ముత్యముల వలెను, రత్నముల వలెను అందము చిందజేయుచుండినవి.

అనర్హారణ్య వాసస్య సా తం రత్నమయం మృగమ్
ముక్తామణి విచిత్రాంగం దదర్శ పరమాంగనా. 42-32

సీతాదేవి ఇట్టి జింకను ఇంతకుముం దెన్నడును చూడలేదు. దానిని చూచి ఆశ్చర్యచకితయైనది.

అదృష్టపూర్వం తం దృష్ట్వా నానారత్నమయం మృగమ్
విస్మయం పరమం సీతా జగామ జనకాత్మజా. 42-35

సీతాదేవి రామలక్ష్మణులను పిలిచి జింకను చూపించినది. దానిని చూచినంతనే లక్ష్మణునికి అనుమానము కలిగి రామునితో అనుచున్నాడు.

లక్ష్మణుడు : రామా! ఈ జింక మారీచు డనియే తోచుచున్నది.

తమేవైన మహం మన్యే మారీచం రాక్షసం మృగమ్. 43-4

కామరూపియైన మారీచుడు వేటకు వచ్చిన రాజుల నెందరనో ఈ రూపమున కడతేర్చి యున్నాడు. ఇట్టి మృగము ప్రపంచమున ఎందైన కలదా! ఇది పట్టి మాయ. ఇందులో సందేహమేలేదు.

సీతాదేవికి లక్ష్మణుని మాటలు నచ్చలేదు. జింక చర్మమును చూచి మోహించి సంతోషించి రామునితో పలుకుచున్నది.

ఏవం బ్రువాణం సౌమిత్రిం ప్రతివార్య శుచిస్మితా
ఉవాచ సీతా సంహృష్టా చర్మణా హృతచేతనా. 43-8

[చర్మమును చూచి మోహించువారికి ఎన్నో బాధలు కలుగుట నిశ్చయము. మెలకువ కలిగియుండుట మంచిది].

**సీత :** ఆర్యపుత్రా! సుందరమైన ఈ జింక నా మనస్సును హరించుచున్నది. దానిని పట్టి తెమ్ము. దానితో ఉల్లాసముగా క్రీడింపవచ్చును.

ఆర్యపుత్రాభిరామోఽసౌ మృగో హరతి మే మనః
ఆనయైనం మహాబాహో క్రీడార్థం నో భవిష్యతి. 43-9

మన ఆశ్రమమున ఎన్నియో మృగము లున్నవి కాని దీనికి సరివచ్చు మృగము లేదు. ఆహా! ఏమి రూపము! ఎంత కాంతి! ఇది నా హృదయమును హరించుచున్నది. దీనిని ప్రాణముతో పట్టుకొనగలుగుదువేని ఎంతో బాగుండును. మనము వనవాస వ్రతమును పూర్తిచేసికొని అయోధ్యకు వెళ్లి రాజ్యమును పొందినప్పుడు ఇది మన అంతఃపురమునకు అలంకారముగా నుండును. భరతుడు, మా అత్తలు (కైకేయి సైతము) దీనిని చూచి ఎంతో ఆశ్చర్యపడగలరు. ఇది ప్రాణముతో చిక్కనియెడల దానిని చంపి చర్మమును తెమ్ము. ఆ చర్మమును దర్భలమీద పరుచుకొని హాయిగా శయనింపవచ్చును.

అహో రూప మహో లక్ష్మీ స్స్వరసంపచ్చ శోభనా
మృగోద్భుతో విచిత్రాంగో హృదయం హరతీవ మే. 43-14

సమాప్త వనవాసానాం రాజ్యస్థానాం చ నః పునః
అంతఃపుర విభూషార్థో మృగ ఏష భవిష్యతి. 43-16

భరతస్యార్యపుత్రస్య శ్వశ్రూణాం మమ చ ప్రభో
మృగరూప మిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి. 43-17

నిహతస్యాస్య సత్త్వస్య జాంబూనదమయ త్వచి
శష్పబృస్యాం వినీతాయా మిచ్ఛా మ్యహ ముపాసితుమ్. 43-19

[సీతాదేవి మధురస్వప్నప్రపంచములో నున్నది. జింకను అయోధ్యకు కొనిపోయి కైకేయి మొదలైన వారి కందరకు చూపించి ఆనందింపదలచి యున్నది పాపము!]

నాథా! ఈవిధముగా అంగనలు స్వతంత్రించి కోరుట సరికాదని నాకు తెలియును. అయినను ఈ లేడి సౌందర్యమువలన పరవశనై అడుగుచున్నాను.

కామవృత్త మిదం రౌద్రం స్త్రీణా మసదృశం మతమ్
వపుషా త్వస్య సత్త్వస్య విస్మయో జనితో మమ. 43-20

శ్రీరాముడు సైతము మాయ జింకను చూచి ఆశ్చర్యపడినాడు. తనకుకూడ ఆశ పుట్టినది.

బభూవ రాఘవస్యాపి మనో విస్మయ మాగతమ్. 43-22

లోభిత స్తేన రూపేణ సీతయా చ ప్రచోదితః
ఉవాచ రాఘవో హృష్టో భ్రాతరం లక్ష్మణం వచః. 43-23

**రాముడు**: (సంతోషముతో) లక్ష్మణా! సీత ఈ జింకకై ఎంత ఆశగొని యున్నదో చూచితివా! నిజమునకు ఈ జింక నాకుకూడ ఎంతో ముచ్చటగా నున్నది. దీని అందమును చూచి మోహింపనివా రెవరైన ఉందురా!

మసారగల్లర్కముఖః శ్శంఖ ముక్తా నిభోదరః
కస్య నామాభిరూపోఽసౌ న మనో లోభయే న్మృగః. 43-28

లక్ష్మణా! రాజులు అడవిలో వేటాడి మృగముల చంపుదురు. అట్లు వేటాడుచున్నప్పుడు వారికి అడవిలో బంగారుగనులు, రత్నములగనుల, అప్పుడప్పుడు లభించును. గొంతెమకోర్కెలను కోరువారి ధనమును శుక్రుడు అపహరించి తన సంపదను వృద్ధి చేసికొనులాగున రాజులు అనాయాసముగా అడవిలో ధనమును సంపాదింతురు.

తత్సార మఖిలం నృణాం ధనం నిచయవర్ధనమ్
మనసా చింతితం సర్వం యథా శుక్రస్య లక్ష్మణ. 43-32

[మనము గొంతెమకోరికలు కోరుదుమేని మన ధనమును శుక్రుడు అపహరించునట! కావున అందరు జాగరూకులై మెలగవలెను. అట్టికోరికలు కోరకుండుట మేలు.]

లక్ష్మణా! మనకీమృగము అడవిలో లభ్యమైనది. దీనిచర్మముపై సీతను కూడి కూర్చుండి ఆనందింపవలె నను కోరిక నాకును కలిగినది.

ఏతస్య మృగరత్నస్య పరార్థ్యే కాంచన త్వచి
ఉపవేక్ష్యతి వైదేహీ మయా సహ సుమధ్యమా. 43-34

గగనమండలమున మృగశీర్ష నక్షత్రము ప్రకాశించునట్లు భూభాగమున ఈ మృగము ప్రకాశించుచున్నది. లక్ష్మణా! నీ వన్నట్లు ఈ మృగము మారీచుడే అగునేని దీనిని తప్పక చంపితీరవలయును. దీని చర్మముమీద సీతకు మనసు మరలినది. చర్మమే ప్రధానము గనుక ఈ జింకను వధింతును.

పశ్య లక్ష్మణ వైదేహీం మృగత్వచి గతస్పృహామ్
త్వచా ప్రధానయా హ్యేష మృగోఽద్య న భవిష్యతి. 43-47

నీవు ఆశ్రమమునందుండి మెలకువ కలిగి సీతను రక్షింపుచుండుము. నేను ఈ జింక చర్మమును గైకొని త్వరలో రాగలను. నీకు జటాయువు సహాయుడుగా నుండును. ప్రతిక్షణము ఆపదను శంకించుచు అప్రమత్తుడవై యుండి సీతను రక్షింపుచుండుము.

ప్రదక్షిణేనాతిబలేన పక్షిణా
జటాయుషా బుద్ధిమతా చ లక్ష్మణ
భవాప్రమత్తః పరిగృహ్య మైథిలీం
ప్రతిక్షణం సర్వత ఏవ శంకితః 43-50

[తప్పు సీతాదేవిమీదనే పెట్టుట సరికాదు. రాముడుసైతము మాయజింక మోహములో పడియుండునా !]

## శ్రీరాముడు మాయజింక ననుసరించి పోవుట

రాముడు ధనుర్బాణములను ధరించి జింకను వెంబడించినాడు. జింక పరుగెత్తుట కారంభించినది. ఒకక్షణము దగ్గరలో నున్నట్లు కనబడుచుండినది. మరుక్షణమున దూరముగా పారిపోవుచుండినది. ఒకమార్చు కంటికి కనబడుచుండినది. వెంటనే మాయ మగుచుండినది. ఈ విధముగా పరుగెత్తి ఆశ్రమమునుండి శ్రీరాముని మిక్కిలి దూరము తీసికొనిపోయినది.

దర్శనాదర్శనాదేవం సోఽపాకర్షత రాఘవమ్
సుదూర మాశ్రమస్యాస్య మారీచో మృగతాం గతః 44-8

[చర్మమోహితులై వెంటబడువారు ఇళ్లే ఇండ్లకు దూర మగుదురు. జాగ్రత్త కలిగి యుండుట మంచిది.]

ఆ జింక చేష్టలను చూచి రామునికి కోపము వచ్చినది. కాని దానిమాయలోనుండి తప్పించుకొనలేకపోయినాడు. ఏమి చేయుటకును తోపక ఒక చెట్టుక్రింద నిలబడినాడు. రాముడు ఉన్మాదుడైనాడు.

స తమున్మాదయామాస మృగరూపో నిశాచరః
మృగైః పరివృతో వన్యై రదూరా త్ప్రత్యదృశ్యత. 44-10

జింక దగ్గరగా కనబడినది. రాముడు దానిని పట్టుకొనబోయినాడు. ఆ జింక రామునికి కనబడకుండ దూరముగా పారిపోయినది. మరల కొంత సేపటికి చెట్లసందున

కనబడినది. ఇక లాభము లేదని రాముడు జింకను చంప నిశ్చయించుకొని బాణమును వదలినాడు. మారీచుడు ఒక తాటిచెట్టంత ఎత్తున ఎగిరి క్రిందపడినాడు. జింకరూపము పోయి తన రూపము వచ్చినది. చావబోవుచున్నాడు. రావణుని మాటలు జ్ఞప్తికి తెచ్చుకొని రాముని కంఠస్వరముతో "హా సీతా! హా లక్ష్మణా" అని పెద్ద కేక పెట్టి మారీచుడు ప్రాణములు విడిచినాడు.

## శ్రీరాముడు మారీచుని వధించి ఆశ్రమమునకు మరలుట

జరిగిన మోసమును రాముడు గ్రహించినాడు. లక్ష్మణుడు చెప్పిన మాట స్మృతికి వచ్చినది. సీతను తలచుకొన్నాడు. రామునికి దిగులు పుట్టినది. "ఈ మారీచుడు నాస్వరముతో 'హా సీతా! హా లక్ష్మణా' అని అరచి ప్రాణములు విడిచినాడు. ఈ మాటలు విని సీత ఏమగునో! లక్ష్మణు డేమి బాధపడునోగదా!" అని దిగులుపడుచు ఆశ్రమమునకు వడిగా నడచినాడు.

## సీతాదేవి ఆశ్రమమునుండి లక్ష్మణుని పంపుట

సీతాదేవి రాముని కంఠస్వరమును విన్నది. రాముడు అపదలో నున్నా డని శంకించి లక్ష్మణునితో అనుచున్నది.

సీత : లక్ష్మణా! రాముడు ఏదో ఆపదలో చిక్కుబడినట్లున్నది. నా ప్రాణములు నిలుచుటలేదు. వెంటనేపోయి నీ అన్నను రక్షింపుము.

రాముని ఆజ్ఞను స్మరించి లక్ష్మణుడు కదలలేదు. సీతాదేవికి కోపము వచ్చినది.

సీత : లక్ష్మణా! కదలవేమి? నీ అన్నకు మిత్రరూపమున నున్న శత్రువుగా వున్నావు. నీవు నామీద ఆశపడి మీ అన్న నాశనమును కోరుచున్నావు. కావుననే కదలక యున్నావు.

ఇచ్ఛసి త్వం వినశ్యంతం రామం లక్ష్మణ మత్కృతే
లోభా త్త్వం మత్కృతే నూనం నానుగచ్ఛసి రాఘవమ్. 45-6

నిజముగా మీ అన్నకొరకే అడవికి వచ్చినవాడ వైనయెడల ఆయన ఆపదలో నున్నప్పుడు ఇట్లుపేక్ష చేయుదువా.

లక్ష్మణుడు : అమ్మా! రామునికి భయమేమిటి! ఆపదయేమిటి! దేవతలుగాని రాక్షసులుగాని, మానవులుగాని, మరెవ్వరుగాని రాముని ఏమియు చేయజాలరు. రాముని క్షేమమునుగూర్చి నీవు దిగులుపడకుము. నీవు విన్నది రామునిగొంతు

కాదు. అది కేవల రాక్షసమాయ. ఖరదూషణాదులు చనిపోయినప్పటినుండియు రాక్షసులు మనమీద పగబూని మనలను మోసగించుటకై ఎన్నో మాయలు పన్నుచున్నారు. నీవు భయపడకుము. ఇక్కడ నిన్ను ఒంటరిగా విడిచిపోజాలను. ఇది మా అన్నగారి ఆజ్ఞ.

న్యాసభూతాసి వైదేహీ న్యస్తా మయి మహాత్మనా
రామేణ త్వం వరారోహే న త్వాం త్యక్తు మిహోత్సహే 45-17

ఈ మాటలకు సీతాదేవి కోపించినది. ఆమె కన్నులు ఎఱ్ఱబారినవి.

**సీత**: (పరుషముగా) నీవు చేయగూడనిపని తలపెట్టియున్నావు. కులపాంసనా! రామునికి గొప్ప ఆపద కలుగుటయే నీకు ప్రీతికరముగా నున్నట్లున్నది.

అనార్యాకరుణారంభ నృశంస కులపాంసన
అహం తవ ప్రియం మన్యే రామస్య వ్యసనం మహత్ 45-21

నీవు మోసగాడవు. కపటివి. నీవు అడవికివచ్చుట నాకోసమే. ఆ పనికి భరతుడు కూడ నిన్ను ప్రేరించియుండును. కానిచో ఒంటరిగా వచ్చుచున్న రాముని వెంబడి నీ వొక్కడవే వత్తువా!

సుదుష్ట స్త్వం వనే రామ మేక మేకోఽనుగచ్ఛసి
మమ హేతోః ప్రతిచ్ఛన్నః ప్రయుక్తో భరతేన వా 45-24

[పాపము! ఎక్కడనో ఉన్న భరతుడు సైతము నిందపాలైనాడు వీరు అడవికి బయలుదేఱినప్పుడు భరతుడు అయోధ్యలోకూడ లేడుగదా! శోకము, కోపము ఏ మాటలనైనను పలికింపగలవు]

లక్ష్మణా! మీరు ఏమిచేసినను నీ కోరికగాని భరతుని కోరికగాని సిద్ధింపదు. నేను రామునికి భార్యగానుండి పరపురుషుని ఆశింతునా! అట్టి ఆశలు వదలుకొనుము. రాముని విడిచి ఒక్క క్షణమైనను బ్రతికియుండజాలను. నీ యెట్టయెదుటనే ప్రాణములు విడిచెదను.

ఈ మాటలు విని జితేంద్రియుడైన లక్ష్మణుడు సీతాదేవికి అంజలి గావించి అనుచున్నాడు.

**లక్ష్మణుడు**: నీవు నాకు దైవమువంటిదానవు. నీ అపనిందలకు నేను బదులు చెప్ప దలచుకొనలేదు.

ఉత్తరం నోత్సహే వక్తుం దైవతం భవతీ మమ. 45-28

ఇట్టి తగనిమాటలాడుట స్త్రీలకు స్వభావముగానే కనబడుచున్నది. స్త్రీలు ధర్మమును విసర్జించినవారు. క్రూరస్వభావము గలవారు. మిత్రులమధ్య విరోధము

కలిగించువారు. నీ మాటలు తప్తబాణములవలె నా చెవుల సోకి నన్ను బాధించుచున్నవి. నీ నిందావాక్యములు నేను భరింపలేకున్నాను.

వాక్య మప్రతిరూపం తు న చిత్రం స్త్రీషు మైథిలి
స్వభావ స్త్వేష నారీణా మేవం లోకేషు దృశ్యతే. 45-29

విముక్తధర్మా శ్చపలా స్తీక్ష్ణ భేదకరా స్త్రియః
న సహే హీదృశం వాక్యం వైదేహి జనకాత్మజే. 45-30

శ్రోత్రయో రుభయో ర్మేద్య తప్త నారాచ సన్నిభమ్. 45-31

న్యాయమార్గ ప్రవర్తకుడ నగు నన్ను అన్యాయముగా దూషించినావు. నీ పరుష వాక్కులకు ఈ వనదేవతలందరు సాక్షులై యుందురుగాక! అన్న ఆజ్ఞలోనున్న నన్ను ఇట్లు శంకించుచున్న నీవు దహింపబడుదువు గాక.

ధిక్త్వా మద్య ప్రణశ్య త్వం యన్మామేవం విశంకసే
స్త్రీత్వం దుష్టం స్వభావేన గురువాక్యే వ్యవస్థితమ్. 45-32

నేను రామునియొద్దకు వెళ్ళుచున్నాను. ఈ వనదేవత లందరు నిన్ను రక్షింతురుగాక.

రక్షంతు త్వాం విశాలాక్షి సమగ్రా వనదేవతాః 45-33

తల్లీ! నాకు ఘోరమైన అపశకునములు కనిపించుచున్నవి. నేను మరల వచ్చి రామునితోకూడ నిన్ను చూడగలనా యని సందేహముగా నున్నది.

సీత : (రోదించుచు కోపముతో) లక్ష్మణా! నేను రాముని విడిచి ఉండజాలను. గోదావరిలో దూకెదను. ఉరినైనను వేసుకొందును. లేక విషము భక్షింతును. అగ్నిలోనైనను ప్రవేశింతును.

[సీతాదేవి అగ్నిప్రవేశము చేయవలసివచ్చుట గమనింపదగిన సంగతి.]

అంతే కాని, పరపురుషుని నా కాలితోకూడ స్పృశింపను.

న త్వహం రాఘవాదన్యం పదాపి పురుషం స్పృశే. 45-38

ఈమాటలు పలికి సీతాదేవి బిగ్గరగా ఏడ్చుచు ఉదరము బాదుకొన్నది. లక్ష్మణుడు కొన్ని ఊరడింపు మాటలు చెప్పినాడు కాని అవి ఏవియు ఆమె చెవి కెక్కలేదు. సీతాదేవి లక్ష్మణునితో పలుకుటకూడ మానినది.

లక్ష్మణుడు సీతాదేవికి నమస్కరించి వెనుకకు తిరిగి ఆమెను పలుమారు -చుచు రామునియొద్దకు బయలుదేరినాడు.

తతస్తు సీతా మభివాద్య లక్ష్మణః
కృతాంజలిః కించి దభిప్రణమ్య చ
అన్వీక్షమాణో బహుశశ్చ మైథిలీం
జగామ రామస్య సమీప మాత్మవాన్ 45-40

[సీతాదేవి లక్ష్మణుని శంకించి పలికిన ప్రతి అక్షరము రావణునిపట్ల యాథార్థమైనది. అచ్చట వేచియుండిన రావణుని నీడ సీతాదేవిని ఆవరించియుండునా! నీడలు ముందు నడచునని చెప్పుమాటలు ఇవేకాబోలు! సీతాలక్ష్మణుల సంభాషణ రాబోవు సంగతులను సూచించుచున్నట్లు అనిపించును.]

## రావణుడు రామాశ్రమమునకు వచ్చుట

లక్ష్మణుడు బయలుదేరుట చూచి రావణుడు సన్యాసిరూపముతో రామాశ్రమమునకు వచ్చినాడు. సన్నని కావివస్త్రము, శిఖ, ఛత్రము, పాదుకలు, దండము, కమండలువు, సన్యాసికి ఉండవలసిన లక్షణము లన్నిటితో ఆశ్రమమున ప్రవేశించినాడు. రావణునివలని భయమునకు చెట్లు కంపించినవి. గాలి బిగించినది. గోదావరి తన వేగమును తగ్గించుకొని నిశ్శబ్దముగా నడచుచున్నది. శనిగ్రహము చిత్రా నక్షత్రమును సమీపించునట్లు రావణుడు సీతాదేవిని సమీపించినాడు. సీతాదేవి తన భర్తను తలచుకొని దుఃఖించుచున్నది. రావణుడు వేదాధ్యయనము చేయుచు సీతాదేవిని సమీపించి అనుచున్నాడు.

**రావణుడు :** అమ్మాయి! ఎవరు నీవు? నీశరీరము సువర్ణమువలె ప్రకాశించుచున్నది. పసుపువన్నెపట్టుచీర ధరించి ఎంతో అందముగా పుష్పములతో నిండియున్న పద్మినివలె శోభిల్లుచున్నావు. నీవు హ్రీదేవతవా, కీర్తి దేవతవా, శ్రీదేవతవా, లక్ష్మివా, అప్సరసవా, ఐశ్వర్యదేవతవా చెప్పుము. నీ సౌందర్యము నామనస్సును హరించినది. నీయట్టి రూపలావణ్యవతి దేవతలలో గాని మానవులలో గాని నాకు కనబడలేదు.

నైవ దేవీ న గంధర్వీ న యక్షీ న చ కిన్నరీ
నైవంరూపా మయా నారీ దృష్టపూర్వా మహీతలే 46-22

నీ రూపసంపద, నీ లావణ్యము, నీ యౌవనము, నీ అరణ్యావాసము చూడ చూడ నాకు ఉన్మాదము కలుగుచున్నది. ఈ అరణ్యము నీకు తగినచోటుకాదు. ఇది రాక్షసులుండు ప్రదేశము. నీ విక్కడనుండి వెడలిపొమ్ము.

సా ప్రతిక్రామ భద్రం తే నైవం వస్తుమిహార్హసి
రాక్షసానామయం వాసో ఘోరాణాం కామరూపిణామ్. 46-24

నీవు రమ్యమైన ప్రాసాదములలోను, పట్టణములలోను, ఉద్యాన వనములలోను విహరించుచు హాయిగా ఉండవలసినదానవు. నీ భర్త ఎవడు? క్రూరమృగములతో నిండియున్న ఈ అరణ్యమున ఒంటరిగా ఎట్లున్నావు?

తమ ఆశ్రమమునకు వచ్చిన సన్యాసికి చేయవలసిన అతిథిసత్కారము చేసి సీతాదేవి అనుచున్నది.

సీత బ్రాహ్మణోత్తముడా! ఈ బ్రుసిపైన ఆసీనుడవై ఈ వన్యఫలముల నారగింపుము.

సీతాదేవి సన్యాసికి ఆతిథ్య మిచ్చి రామలక్ష్మణులకై ఎదురుచూచుచున్నది. ఎదుట శూన్యమైన అడవిబయలు కానబడినదేగాని రామలక్ష్మణులు కానరాలేదు.

తత స్సువేషం మృగయాగతం పతిం
ప్రతీక్షమాణా సహలక్ష్మణం తదా
నిరీక్షమాణా హరితం దదర్శ త
న్మహద్వనం నైవ తు రామలక్ష్మణౌ. 46-37

వచ్చినవాడు నిజమైన సన్యాసి యని నమ్మి సీతాదేవి - తన వృత్తాంతమును చెప్పుచున్నది.

సీత : బ్రాహ్మణోత్తముడా! నేను జనకమహారాజు పుత్రికను. నాపేరు సీత. నేను రాముని భార్యను. పండ్రెండు సంవత్సరములు అత్తవారింట సమస్త భోగములను అనుభవించినాను. పదుమూడవ సంవత్సరములో మా మామగారు నా భర్తకు రాజ్యాభిషేకము చేయదలిచినారు. మా మామగారి భార్యలలో ఒకతెయైన కైకేయి అనునామె తన భర్తను యాచించి వరములు పొంది నా భర్తను అడవికి పంపవలె ననియు, తన కుమారుడైన భరతునికి పట్టాభిషేకము చేయవలె ననియు కోరినది. "రామునికి పట్టాభిషేకము చేసినయెడల నేను ఆహారము భుజింపను. నీరు త్రాగను. ప్రాణముల విడుతును" అని కైకేయి పట్టుపట్టినది. మా మామగారు ఎంత వేడుకొన్నను ఆమె తనపట్టు వీడలేదు. నా భర్తకు ఇరువదియైదు సంవత్సరముల వయస్సు. నాకు పదునెనిమిదేండ్లు.

[ఇది ఎప్పటి మాట యైనది మూలమునుబట్టి యేర్పడలేదు. దీనినిబట్టి సీతారాముల వయస్సు నిర్ణయింపబూనుట సరికాదని తోచుచున్నది. ఇద్దరిమధ్య ఏడు సంవత్సరములు తేడా ఉన్నదనిమాత్రము తెలియును.]

**మమ భర్తా మహాతేజా వయసా పంచవింశకః**
**అష్టాదశ హి వర్షాణి మమ జన్మని గణ్యతే.** 47-10

నా భర్త ఈ లోకమున 'రాముడు' అని పేరుపడినాడు. మంచి గుణములు కలవాడు. సత్యవంతుడు. పరిశుద్ధుడు. విశాలాక్షుడు. మహాబాహుడు. సమస్తభూతములకు హితము చేయువాడు.

రామేతి ప్రథితో లోకే గుణవాం త్సత్యవాన్ శుచిః
విశాలాక్షో మహాబాహు స్సర్వభూతహితే రతః. 47-11

కామార్తుడైన మా మామగారు కైకేయికి ప్రీతి గలిగించుటకు రామునికి పట్టాభిషేకము చేయుట మానినారు.

కామార్తస్తు మహాతేజాః పితా దశరథ స్స్వయమ్
కైకేయ్యాః ప్రియకామార్థం తం రామం నాభ్యషేచయత్. 47-12

[పాపము! దశరథుడు ఎట్టి అపనిందపాలైనాడు! సీతాదేవికి అట్లే అనిపించినది కాబోలు!]

రాముడు అభిషేకము చేసికొనుటకు తండ్రియొద్దకు వెళ్ళినాడు. అప్పుడు కైకేయి నా భర్తను చూచి "నీ తండ్రిగారి ఆజ్ఞ యైనది. ఈ రాజ్యమును భరతునికీయవలయును. నీవు పదునాలుగు సంవత్సరములు వనవాసము చేయవలయును. నీవు నీతండ్రికి అసత్యదోషము కలుగకుండునట్లు చూడుము" అని చెప్పినది. దృఢవ్రతుడైన నా భర్త 'సరే' అన్నాడు. నా భర్త మహనీయుడు. ఇతరులకు ఇచ్చువాడేగాని ఒకరియొద్ద దేనినిగాని పుచ్చుకొనువాడు కాడు. ఎల్లప్పుడు సత్యమునే పలుకువాడు. అనృత మాడడు. ఇది రాముని దృఢవ్రతము.

దద్యా న్న ప్రతిగృహ్ణీయా త్సత్యం బ్రూయా న్నచానృతమ్
ఏత ద్బ్రాహ్మణ రామస్య ధ్రువం వ్రత మనుత్తమమ్. 47-17

రాముని తమ్ముడు లక్ష్మణుడు రామునికి తోడుగా నుండును. లక్ష్మణుడు మహాపరాక్రమశాలి. యుద్ధమున శత్రువులను వధించువాడు. ధర్మమునే అనుసరించు దృఢవ్రతుడు.

[లక్ష్మణుని నిందించినప్పుడు ఈ మాటలు అడుగున పడినవి]

స భ్రాతా లక్ష్మణో నామ ధర్మచారీ దృఢవ్రతః 47-19

లక్ష్మణుడు ధనుష్పాణియై మావెంట అరణ్యమునకు వచ్చినాడు. ధర్మనిరతుడు, జితేంద్రియుడు అయిన నా భర్త జటలు దాల్చి తాపసరూపముతో దండకారణ్యమునకు వచ్చినాడు. నేను, లక్ష్మణుడు నా భర్తవెంట వచ్చినాము. కైకేయినిమిత్తముగా మేము రాజ్యభ్రష్టులమై అరణ్యవాసము చేయుచున్నాము.

ఒక క్షణము నిలువుము. నా భర్త ఇప్పుడే రాగలడు. నీ పేరేమి! నీవేల ఈ దండకారణ్యమున ఒంటరిగా సంచరించుచున్నావు ?

**రావణుడు :** సీతా ! నేను రాక్షసగణములకు ప్రభువును. నా పేరు రావణుడు. నా పేరు విని ముల్లోకములవారును భయకంపితు లగుదురు. నిన్ను చూచి మోహించి వచ్చి యున్నాను నీవు నాతో వచ్చి నా పట్టపురాణివిగా నుండుము. లంకాపురి యని ప్రసిద్ధి కెక్కిన మహానగరము నాదే. లంకాపురి ఒక పర్వతముపై నున్నది. దానిచుట్టును సముద్ర మున్నది. మన మచ్చటికి వెళ్ళి రమ్యమైన ఉద్యానవనములలో సుఖముగా విహరించుచుండవచ్చును. నీవు ఈ అడవిలో నుండతగవు. నా వెంట రమ్ము. చక్కగా అలంకృతలైన అయిదువేల దాసీజనములు నీకు పరిచర్యలు చేయుచుందురు. సుఖముగా కాలము గడపవచ్చును.

**సీత :** (రావణుని తృణీకరించి కోపముతో) నీచుడా ! నీకు చావు మూడినది. నా భర్తను గురించిగాని నన్ను గురించిగాని నీ కేమియు తెలిసినట్లులేదు. రాముడు కదలింపరాని మహాపర్వతమువంటివాడు. కలత నొందని సముద్రమువంటివాడు. సత్యసంధుడు, మహాత్ముడు, జితేంద్రియుడు, సింహపరాక్రముడు, రాజపుత్రుడు. నిండుచంద్రునిబోలు ముఖము కలవాడు.

నే నెల్లప్పుడు నా భర్తను అనుసరించి యుండుదానను. సూర్యుని ప్రభను స్పృశించుటకు వీలు కానట్లు నన్ను స్పృశించుటకు నీకు అలవి కాదు. నీకు చావు దగ్గర పడినది గనుకనే రామునిభార్యను కోరుచున్నావు. సింహము నోటను, సర్పము నోటను చేయి పెట్టి కోరలు పెరుకజూచుచున్నావు. కాలకూటవిషమును మ్రింగగోరుచున్నావు. సూదితో కండ్లు తుడుచుకొనుచున్నావు. పదునైన కత్తిని నాలుకతో నాకుచున్నావు. మెడకు బండ కట్టుకొని సముద్రమును దాటగోరుచున్నావు. మండుచున్న అగ్నిని వస్త్రములో మూటగట్టుకొని పోవజూచుచున్నావు. నీచుడా ! నీకును రామునికిని సాటి యేమి ! నీవు నక్కవు; రాముడు సింహము. నీవు చిన్న ఊటవు; రాముడు మహాసముద్రము. నీవు కాకివి; రాముడు గరుత్మంతుడు.

నీవు నన్ను అపహరించినను జీర్ణము చేసికొనలేవు. వజ్రమును మ్రింగిన ఈగకు పట్టు గతియే నీకును పట్టగలదు. మహేంద్రప్రభావుడైన రాముడు ధనుర్బాణములను ధరించి నీ ప్రాణములను హరింపగలడు.

తస్మిం త్సహస్రాక్షసమ ప్రభావే
రామే స్థితే కార్ముక బాణ పాణౌ
హృతాపి తేఽహం న జరాం గమిష్యే
వజ్రం యథా మక్షికయావగీర్ణమ్. 47-48

ఈ మాటలు పలికి సీతాదేవి గడగడ వణకిపోయినది. రావణుడు తన ప్రభావ మును గురించి చెప్పుకొనుచున్నాడు.

**రావణుడు:** (బొమముడి వేసి) సీతా! నేను కుబేరుని తమ్ముడను, రావణుడను. నేను దశగ్రీవుడను సుమా! కుబేరుని జయించి అతని పుష్పక విమానమును కొనివచ్చిన వాడను. నామాట అన్నంతనే దేవతలు, గంధర్వులు, దానవులు, ముల్లోకములవా రందరు భయకంపితు లగుదురు. నా భయమువల్లనే కుబేరుడు తన పట్టణ మైన లంకాపురిని వదలిపెట్టి కైలాసపర్వతముపై నివసించుచున్నాడు.

యద్భయా_ర్తః పరిత్యజ్య స్వమధిష్ఠాన మృద్ధిమత్
కైలాసం పర్వతశ్రేష్ఠ మధ్యాస్తే నరవాహనః. 48-5

నన్ను చూచి సూర్యుడు, వాయుదేవుడు, మొదలైనవారు భయపడుదురు. లంకాపట్టణమున సమస్త సంపదలు కలవు. మనోహర మైన ఉద్యానవనము లున్నవి. నీవు నన్ను కూడియుండి సకలభోగముల ననుభవించుచు సుఖముగా ఉండవచ్చును. అక్కడ నుందువేని రాముడు నీకు జ్ఞప్తికికూడ రాడు.

భరతునికి రాజ్య మిచ్చి తన్ను అడవికి నడువు మని తండ్రి చెప్పినమాత్రముననే అడవికి నడచిన పరాక్రమహీనుడు నీ భర్త. రాజ్యభ్రష్టుడై మునివృత్తిలో నున్న రాముని కట్టుకొని నీ వేమి సుఖపడగలవు. నీవు నన్ను త్రోసిపుచ్చవలదు. తరువాత ఎంతో పరితపింపగలవు. రాముని గొప్పగా పొగడినావు. యుద్ధమున నీ రాముడు నా వ్రేలికి కూడ చాల డని తెలిసికొనుము. నీ అదృష్టమువలన నేను నీకు లభ్యపడినాను. అవకాశమును జారవిడుచుకొని ఊర్వశి మున్ముందు పురూరవసుని నిరాకరించి వెనుక బాధపడినట్లు నీవు బాధపడవలదు. ఈ తరుణమున నేనై నిన్ను వేడుకొనుచున్నాను. ఇప్పుడే మెలకువ గలిగి ప్రవర్తింపుము.

**సీతా:** దుర్మార్గుడా! కుబేరునికి తమ్ముడవై యుండియు ఇట్టి పాపకార్యము తల పెట్టితివా! నీకును నీ వారికిని వినాశకాలము వచ్చినది. రామునిభార్యను అపహరించి ఎవ్వడైనను జీవించియుండగలడా! అమృతమును త్రాగినను నీవు బ్రతికియుండ జాలవు.

రావణుడు చప్పట్లు చఱచి భయంకరరూపము దాల్చినాడు. పదితలలతోను ధనుర్బాణములతోను కానబడినాడు.

దశాస్యః కార్ముకీ బాణీ బభూవ క్షణదాచరః. 49-8

రావణుడు : సీతా ! నీ కేదో పిచ్చిపట్టిన ట్లున్నది. నా పరాక్రమమును కొంచెమైనను గుర్తింపకున్నావు. నేను నిరాలంబుడనై అంతరిక్షమున నిల్వబడి భూమినంతయు నా చేతులతో ఎత్తగలను. సముద్రమును త్రాగివేయగలను. నేను యమునికి యముడను. తెలిసినదా! ముల్లోకములందును ప్రసిద్ధిగాంచిన భర్త కావలయునని కోరిక కలదేని నన్ను కోరుకొనుము. నేనే నీకు తగినభర్తను. రాజ్యభ్రష్టుడైన రామునితో ఈ మహారణ్యమున అవస్థపడుట ఏల ? రాముడు మానవమాత్రుడు. పరిమితమైన ఆయుస్సు గలవాడు. రాముని విడిచిపెట్టుము. నీవు నా ఆశ్రయములో నుందువేని నీకు ఎవ్వనివల్లగాని భయము కలుగదు.

## సీతాపహరణము

ఈ మాటలు పలికి ఆకాశమున బుధుడు రోహిణిని పట్టుకొనునట్లు రావణుడు సీతాదేవిని పట్టుకొన్నాడు. ఎడమచేతితో తలవెండ్రుకలను, కుడిచేతితో ఊరువులను పట్టుకొని యెత్తి అంకమున పెట్టుకొని రథముపైకి చేర్చినాడు.

> జగ్రాహ రావణ స్సీతాం బుధః ఖే రోహిణీ మివ
> వామేన సీతాం పద్మాక్షీం మూర్ధజేషు కరేణ సః 49-17
> ఊర్వోస్తు దక్షిణేనైవ పరిజగ్రాహ పాణినా. 49-18
> అంకేనాదాయ వైదేహీం రథ మారోపయ త్తదా 49-21

['వైదేహి' అనుటలో సీతాదేవికి శరీరస్పృహ లేదని సూచితమైనది. ఎంతో అర్థవంతమైన పదము.]

సీతాదేవి 'రామా' అని విలపించినది. పొరలాడుచున్నది. రావణుని రథము ఆకాశమార్గమున పోవుచున్నది. సీతాదేవికి పిచ్చిపట్టినట్లైనది. దుఃఖము పట్టలేక ఏడ్చుచున్నది.

సీత : హా లక్ష్మణా ! అన్నగారి మనస్సునకు సర్వదా సంతోషమును చేకూర్చు నీవు, రాక్షసుడు నన్నిట్లు అపహరించుకొనిపోవుట తెలిసికొనజాలక యున్నావుగదా!

> హా లక్ష్మణ మహాబాహో గురుచిత్త ప్రసాదక
> హ్రియమాణాం న జానీషే రక్షసా మా మమర్షిణా. 49-24

రామా ! ధర్మమునకై సుఖమును, రాజ్యమును, పరిత్యజించి అడవికి వచ్చితివి. అధర్మప్రవర్తకుడైన ఈ రాక్షసుడు నన్ను అపహరించి కొనిపోవుచున్నాడు చూడుము నీవీ రాక్షసుని వధింపుము.

రావణా ! నీవు రాముని చేత బడి మరణింపగలవు. ఆహా ! కైకేయి కోరిక ఇప్పుడు పూర్తిగ ఫలించినది. ఆశ్రమమునందలి వృక్షములారా ! మిమ్ము వేడుకొనుచున్నాను. సీతను రావణుడు అపహరించి తీసికొనిపోవుచున్నాడని రామునికి తెలియజెప్పుడు పర్వతములారా ! ఓ గోదావరితల్లీ ! నేను మీకు నమస్కరించుచున్నాను. దయచేసి నా పాటును రామునికి తెలియజేయుడు. మృగపక్షిగణములను, ఇందుగల సమస్త ప్రాణులను శరణు వేడుచున్నాను. నా దురవస్థను రామునికి తెలియజెప్పుడు. రామునికి నా సంగతి తెలిసినయెడల నేను స్వర్గమునం దున్నను, యమలోకమునం దున్నను తనచెంతకు తెచ్చుకొనగలడు.

## సీతాదేవి జటాయువును చూచుట

చెట్టుమీద నుండిన జటాయువును చూచి సీతాదేవి విలపించినది.

*సీత :* జటాయూ ! ఈ రాక్షసుడు నన్ను అనాథనువలె అపహరించుకొనిపోవుచున్నాడు చూడుము. బలవంతుడైన ఈ రాక్షసుని ఎదుర్కొనుట నీకు సాధ్యముకాదు. నాకు సంభవించిన ఈ విపత్తునుగురించిమాత్రము రామలక్ష్మణులతో చెప్పుము.

జటాయువు సీతను, రావణుని చూచినాడు.

*జటాయువు :* రావణుడా ! శ్రీరాముడు సమస్తలోకములకు ప్రభువు. అందరకును హితము చేయువాడు ఈ సీతాదేవి రాముని ధర్మపత్ని. మహాపతివ్రత నీవు రామునిభార్యను కోరుట పెద్దతప్పు. నీవు సైతము ఒకరాజువుగదా ! నీ వంటివాడు పరదారలను స్పృశింపరాదు. నీవు నీ భార్యలను ఎట్లు రక్షించుకొందువో ఇతరుల భార్యలుకూడ అట్లు రక్షింపదగినవా రని ఎరుగవా !

యథాఽఽత్మన స్తథాన్యేషాం దారా రక్ష్యా విమర్శనాత్ 50-8

రాజుగా నుండువాడు ధర్మమును తప్పకూడదు. దుష్టుని యింట ఐశ్వర్యము చిరకాలము నిలిచియుండదు. రాముడు నీ కెట్టి అపకారమునైనను చేసియుండెనా ! ఖరుడు తనపైకి వచ్చినందున రాముడు యుద్ధమాడి రాక్షసులను వధింపవలసివచ్చినది. అందులో రాముని తప్పులేదు. సీతాదేవిని విడిచిపెట్టుము. తీక్ష్ణమైన తన చూపుతోనే రాముడు నిన్ను దహింపగలడు. నీవు సర్పమును కొంగున కట్టుకొని పోవుచున్నావు. కాలపాశమును కంఠమునకు తగిలించుకొన్నావు. ఎవ్వరుగాని మోయదగిన బరువునే ఎత్తుకొనవలెను. జీర్ణ మగునంతమాత్రమే తినవలయును.

స భార స్సౌమ్య భర్తవ్యో యో నరం నావసాదయేత్
తదన్నమపి భోక్తవ్యం జీర్యతే యదనామయమ్. 50-17

రావణుడా! నాకు అరువదివేల సంవత్సరములు వయస్సు. నేను ముసలివాడను. నీవు యువకుడవు. కవచమును, ధనుర్బాణములను ధరించి రథస్థుడవై యున్నావు. అయినను సీతాదేవిని తీసికొని క్షేమముగా వెళ్లజాలవు. హేతువాదముతో వేదమును ఖండింపజాలనట్లు నా సమక్షమున సీతాదేవిని తీసికొనిపోజాలవు.

న శక్తస్త్వం బలాద్ధర్తుం వైదేహీం మమ పశ్యతః
హేతుభి ర్న్యాయసంసిద్ధై ర్ధ్రువాం వేదశ్రుతీ మివ. 50-21

నీవు శూరుడ వయినయెడల ఒక క్షణము ఆగుము. యుద్ధమున ఖరుడు మరణించినట్లే నీవును మరణింపగలవు. రామునికి నిన్ను చంపుటకు ఎంతోసేపు పట్టదు.

ఆహా! రామలక్ష్మణులను తోడితెత్త మన్నను వారు మిక్కిలి దూరమున నున్నారు.

కిం ను శక్యం మయాఽహర్తుం గతౌ దూరం నృపాత్మజౌ. 50-24

రామలక్ష్మణులకు భయపడి నీ విట్లు పారిపోవుచున్నావు. కాని నేను ప్రాణముతో నుండగా నిన్ను వెళ్లనీయను. నా ప్రాణము నిచ్చియైనను రామకార్యమును చేయుదును.

అవశ్యం తు మయా కార్యం ప్రియం తస్య మహాత్మనః
జీవితేనాపి రామస్య తథా దశరథస్య చ. 50-26

రావణుడా! ఒక క్షణము ఆగుము. నేను నీతో యుద్ధమాడి నిన్ను వధింతును.

## జటాయువు రావణునితో యుద్ధమాడుట

ఈ మాటలను విని రావణుడు ఉగ్రుడైనాడు. ఇరువది కండ్లనుండియు నిప్పులు రాలినవి. రావణుడు జటాయువును మార్కొన్నాడు. ఇరువురకు ఘోరయుద్ధము జరిగినది. రావణుడు జటాయువుమీద తీక్ష్ణబాణము ప్రయోగించినాడు. జటాయువు వాని నన్నింటిని సహించి తన గోళ్లతోను, కాళ్లతోను రావణుని శరీరము నంతయు గాయ పరిచినాడు. రావణుడు బాణములు వేయుట మానలేదు. సీతాదేవి రావణుని రథమున కూర్చుండి కన్నీరుకార్చుచున్నది. జటాయువు సీతాదేవి దీనావస్థను చూచి రావణుని బాణములను సరకుగొనక యుద్ధము చేయుచున్నాడు. రావణుని ధనుస్సును కాళ్లతో మర్దించి విరిచినాడు. రావణుడు మరియొక ధనుస్సును గైకొని జటాయువుమీద బాణవర్షమును కురిపించినాడు. జటాయువు ఆ బాణములను తన రెక్కలతో నిగ్రహించి, తన కాళ్లతో ఆ ధనుస్సునుకూడ విరిచినాడు. రావణుని కవచమును సైతము తన రెక్కలతో భేదించినాడు. రథమునకు పూన్చియుండిన గాడిద

లను వధించినాడు. రథమును భగ్నము గావించినాడు. ఛత్రచామరములు పట్టుకొని యుండిన రాక్షసులను కడతేర్చినాడు. సారథి తలను తన ముక్కుతో త్రుంచినాడు. రావణుడు విరథుడై సీతాదేవిని అంకమున బెట్టుకొని నేలమీదికి దూకినాడు

స భగ్నధన్వా విరథో హతాశ్వో హతసారథిః
అంకేనాదాయ వైదేహీం పపాత భువి రావణః 51-20

జటాయువు సాధించిన ఈ మహత్కార్యమునకు సమస్త భూతములు జటాయువును పూజించినవి. జటాయువు అలసియుండుట గమనించి రావణుడు సీతాదేవి నెత్తుకొని ఆకసమున కెగిరినాడు. జటాయువు తోడనే ఎగిరి రావణుని వెన్నంటినాడు.

తం ప్రహృష్టం నిధాయాంకే గచ్ఛంతం జనకాత్మజామ్
గృధ్రరాజ స్సముత్పత్య సమభిద్రుత్య రావణమ్ 51-23

*జటాయువు :* (రావణుని అడ్డగించి) రావణుడా! నీవు, నీ బంధువులు, నీ సైన్యము సర్వనాశన మగుటకే సీతాదేవిని అపహరించుకొని పోవుచున్నావు. నీవు చేయునది దొంగపని. వీరుడు చేయు పని కాదు.

యథా త్వయా కృతం కర్మ భీరుణా లోకగర్హితమ్
తస్కరాచరితో మార్గో నైష వీరనిషేవితః 51-29

ఈ మాటలు పలుకుచు జటాయువు రావణుని వీపుమీద వ్రాలి తన గోళ్ళతో తుండముతో, ఱెక్కలతో మర్దించి రావణుని జుట్టునుకూడ పెరికినాడు. రావణుడు కోపోద్రిక్తుడై సీతాదేవిని వామాంకమునం దుంచుకొని జటాయువును కుడిచేతితో చరచినాడు. రావణుని ఎడమచేతులు పదింటిని జటాయువు తన తుండముతో కొరికి ఖండించినాడు. కాని పుట్టనుండి పాములు వెల్వడునట్లు చేతులు మరల మొలిచినవి. రావణుడు బాధకు తాళజాలక సీతాదేవిని క్రింద విడిచి జటాయువును కాళ్ళతోను చేతులతోను మర్దించినాడు. ఇర్వురకును తీవ్రయుద్ధము జరిగినది. రావణుడు ఖడ్గము గైకొని జటాయువు ఱెక్కలను, ప్రక్కలను, కాళ్ళను ఖండించినాడు. దానితో జటాయువు క్రింద పడిపోయినాడు. ప్రాణము కొనకు వచ్చుచుండినది.

సీతాదేవి దుఃఖించుచు జటాయువుచెంతకు పరుగెత్తుకొని వచ్చి జటాయువును మాటిమాటికి కవుగిలించుకొని దుఃఖపడినది.

[సీతాదేవి గొప్పతనము గమనింపదగియున్నది. జటాయువు ఎంత భాగ్యశాలి!]

తతస్తు తం పత్త్రరథం మహీతలే
నిపాతితం రావణవేగ మర్దితమ్
పునః పరిష్వజ్య శశిప్రభాననా
రురోద సీతా జనకాత్మజా తదా. 51-46

సీత : శకునములు, పక్షుల స్వరములు మనుష్యుల సుఖదుఃఖములను సూచించునుగదా!

నిమిత్తం లక్షణజ్ఞానం శకుని స్వరదర్శనమ్
అవశ్యం సుఖదుఃఖేషు నరాణాం ప్రతిదృశ్యతే. 52-4

మృగములు, పక్షులు అటువైపు వెళ్లుచున్నవి. నా ఆపదను రామునికి తెలియజేయుటకే వెళ్లుచున్నవి కాబోలు. పాపము! నాకు సహాయము చేయబూనుకొన్న జటాయువుకూడ పడిపోయినాడు. రామా! లక్ష్మణా! నన్ను రక్షింపుడు.

## రావణుడు సీతాదేవిని లంకకు కొనిపోవుట

సీతాదేవి ఈ విధముగా దుఃఖించుచున్నది. ఆమె పుష్పమాలలు, ఆభరణములు నలిగిపోయినవి. రావణుడు సీతాదేవిని సమీపించి ఆమె కేశములు పట్టుకొన్నాడు. ఇదియే రావణుని నాశనము చేయుపని.

జీవితాంతాయ కేశేషు జగ్రాహాన్తకసన్నిభః 52-10

ఈవిధముగా సీతాదేవి ధర్షింపబడినంతనే ప్రపంచ మంతయు చీకటిమయమైనది. గాలి బిగించినది. బ్రహ్మదేవుడు తన దివ్యజ్ఞానముచేత సీతాదేవి అవస్థను గ్రహించి "పని అయినది" అన్నాడు.

దృష్ట్వా సీతాం పరామృష్టాం దీనాం దివ్యేన చక్షుషా
కృతం కార్యమితి శ్రీమాన్ వ్యాజహార పితామహః 52-12

ఋషు లందరకు ఒకప్రక్క సంతోషము, ఒకప్రక్క దుఃఖము కలిగినది. "రామా! లక్ష్మణా!" అని విలపించుచున్న సీతాదేవిని రావణుడు తీసికొని ఆకసమున కెగిరినాడు.

సువర్ణచ్ఛాయగల శరీరముతో పసుపువన్నె పట్టుచీరను ధరించియున్న సీతాదేవి రావణుని అంకమున మేఘమునందలి మెరపుతీగెవలె ప్రకాశించినది. సీతాదేవి ఆభరణముల ధ్వని ఉరుములుగా వినబడినది.

రావణుడు సీతాదేవి నెత్తుకొని ఎగిరిపోవుచున్నాడు. సీతాదేవి శిరస్సునుండి పుష్పములు రాలి క్రిందపడుచున్నవి. ఆమె అందెయొకటి జారి నేలమీద పడినది. ఏనుగుకు కట్టిన బంగారుత్రాడువలె సీతాదేవి రావణుని అంకమున ప్రకాశించుచున్నది. ఆకాశమున తన తేజస్సుచే వెలుగు మహోల్కవలెనున్న సీతాదేవిని రావణుడు కొనిపోవుచున్నాడు.

తాం మహోల్కామివాకాశే దీప్యమానాం స్వతేజసా
జహారాకాశమావిశ్య సీతాం వైశ్రవణానుజః 52-34

ఆకాశమునుండి క్రిందపడు నక్షత్రములవలె సీతాదేవి ధరించియుండిన ఆభరణములు నేలమీద పడుచున్నవి. రావణుని వేగమువలన జనించిన గాలికి వృక్షములు తమ కొనకొమ్మలను ఆడించుచుండ వానిమీదనుండిన పక్షులు అరచుట చూడగా వృక్షములు తమ చేతుల నెత్తి భయపడవలదని సీతాదేవితో చెప్పుచున్నట్లు అనిపించినది.

ఉత్పన్నవాతాభిహతా నానా ద్విజగణాయుతాః
మా. భైరితి విధూతాగ్రా వ్యాజహ్రురివ పాదపాః 52-37

తామరకొలనులలోని కమలములు వాడిపోయి తమ చెలికత్తెకు సంభవించిన ఆపదను తలచుకొని దుఃఖించుచున్నట్లు కనబడినవి. అడవిలోని సింహములు, వ్యాఘ్రములు, ఇతర మృగములు, పక్షులు రావణునిమీద కోపించి అతని నీడ ననుసరించి సీతాదేవివెంట పరుగెత్తినవి.

కన్నీరువలెనున్న జలప్రవాహములను, పైకెత్తబడిన చేతులవలె నున్న శిఖరములను కలిగియున్న పర్వతములను చూడగా సీతాదేవినిగురించి పర్వతములు దుఃఖపడి ఏడ్చుచున్నట్లు కనబడినవి. సూర్యుడుసైతము ఆదుఃఖముతోనే కాంతి తరిగియుండినాడు. "రాముని భార్యను రావణుడు అపహరించుకొని పోవుచున్నాడుగదా! మరి, ధర్మ మెక్కడ నున్నది! సత్యము, ఆర్జవము, దయ ఎచ్చట నున్నవి?" అని సమస్త భూతములు గుంపులు గుంపులుగా కూడి దుఃఖించినవి.

నాస్తి ధర్మః కుత స్సత్యం నార్జవం నానృశంసతా
యత్ర రామస్య వైదేహీం భార్యాం హరతి రావణః 52-41
ఇతి సర్వాణి భూతాని గణశః పర్యదేవయన్. 52-42

సీతాదేవి దుఃఖమును చూచి వనదేవత లందరు దుఃఖించినారు. సీతాదేవి రామలక్ష్మణులను కనుగొనజాలక భయపడుచున్నది. ఆమెకు రోషము కలిగినది. రావణుని తృణీకరించి మాటలాడుచున్నది.

సీత : నీచుడా! మా రామలక్ష్మణులు లేనిసమయమున నన్ను తస్కరించి తీసికొని పారిపోవుచున్నావే! సిగ్గులేదా! ఇదియేనా నీ శూరత్వము-నీ శౌర్యము మండిపోనూ!

న వ్యపత్రపసే నీచ కర్మణాఽనేన రావణ
జ్ఞాత్వా విరహితాం యన్మాం చోరయిత్వా పలాయసే. 53-3
ధిక్తే శౌర్యం చ సత్త్వం చ యత్త్వం కథితవాం స్తదా. 53-9

కొంచె మాగుము. ఇట్లు పారిపోకుము. రాముని కంట బడుదువేని నీ వొక్కక్షణ మైనను జీవించియుండజాలవు. రామలక్ష్మణుల బాణవర్షమును నీవు సహింపలేవు. నీవు

నీ క్షేమమును కోరుకొని నన్ను విడిచిపెట్టుము. ఒక సంగతి మాత్రము గట్టిగా తెలిసికొనుము. నీవు నన్ను ఏ ఉద్దేశముతో అపహరించుచుంటివో ఆ పని మాత్రము ఫలింపదు. నీ ప్రయత్న మంతయు దండుగ.

యేన త్వం వ్యవసాయేన బలాన్మాం హర్తు మిచ్ఛసి
వ్యవసాయ స్స తే నీచ భవిష్యతి నిరర్థకః 53.14

నీ చావుమాత్రము నిశ్చయము. నీవు నీ మెడకు కాలపాశమును తగిలించుకొన్నావు. నీవు త్వరలోనే కాంచన వృక్షములను, వైతరిణీ రక్తనదిని చూడగలవు. నీ వెక్కడ దాగినను రామబాణమును తప్పించుకొనజాలవు. జనస్థానమున మీవారి నందరను రాముడు ఒక్క క్షణములో రూపుమాపిన మాటను మరువవలదు. తన భార్యను అపహరించిన నిన్ను రాముడు విడిచిపెట్టడు. సీతాదేవి మాటలను రావణుడు పట్టించుకొనలేదు. ప్రయాణమును సాగించుచున్నాడు.

## సీతాదేవి నగలమూటను వానరుల నడుమ వేయుట

ఇట్లు వెళ్ళుటలో ఒక పర్వతశిఖరముపై అయిదుగురు వానరు లుండుట సీతాదేవి చూచి "వీరు నా వృత్తాంతమును రామునికి చెప్పగలరు" అని ఊహించి తన ఉత్తరీయమున కొన్ని ఆభరణములను మూటగట్టి ఆ మూటను వానరులనడుమ వేసినది. రావణుడు తన గొడవలో వుండి దీనిని గుర్తింపలేదు.

తేషాం మధ్యే విశాలాక్షీ కౌశేయం కనకప్రభమ్
ఉత్తరీయం వరారోహా శుభా న్యాభరణాని చ 54.2

ముమోచ యది రామాయ శంసేయురితి భామినీ
వస్త్ర ముత్సృజ్య తన్మధ్యే నిక్షిప్తం సహభూషణమ్ 54.3

సంభ్రమాత్తు దశగ్రీవ స్తత్కర్మ న స బుద్ధవాన్. 54.4

దుఃఖించుచున్న సీతాదేవిని వానరులు రెప్పవాల్పక చూచినారు.

## రావణుడు సీతాదేవిని తీసికొని లంకకు చేరుట

రావణుడు పంపాసరస్సును దాటి లంకకు వెళ్లుచున్నాడు. సీతాదేవి విషసర్పమని గ్రహింపక రావణుడు సీతాదేవిని తన అంకమున పెట్టుకొని పోవుచున్నాడు. నదులను, పర్వతములను, సరస్సులను, అడవులను దాటుకొని శరవేగమున ఆకాశమార్గమున ప్రయాణము చేసి సముద్రమును దాటి రావణుడు లంకకు చేరినాడు. "రావణుడు ఇంతటితో సరి" అని ఆకాశమున నుండిన సిద్ధ చారణులు పలికినారు.

అంతరిక్షగతా వాచ స్ససృజు శ్చారణా స్తదా
ఏత దంతో దశగ్రీవ ఇతి సిద్ధా స్తదాబ్రువన్. 54-10

రావణుడు అంతఃపురమునకు వెళ్ళి సీతాదేవిని దించి రాక్షసస్త్రీలతో అనుచున్నాడు.

*రావణుడు :* మీరు జాగరూకులై మెలగవలయును. నా అనుజ్ఞ లేక పురుషులుగాని స్త్రీలుగాని సీతను చూడగూడదు. రత్నములుగాని వస్త్రములుగాని ఆభరణములుగాని సీత ఏమి కోరునో వాని నీయవలయును. తెలిసిగాని తెలియకగాని సీతను ఎవ్వరును ఏమియు అనకూడదు. అట్లు చేసినవారికి మరణదండన.

యా చ వక్ష్యతి వైదేహీం వచనం కించి దప్రియమ్
అజ్ఞానా ద్యది వా జ్ఞానా న్నతస్యా జీవితం ప్రియమ్. 54-16

ఈ ఉత్తరువు చేసి రావణుడు తన కర్తవ్యమునుగురించి చింతించుచు అంతఃపురమునుండి బయటికి వచ్చి మంచి బలశాలులైన ఎనిమిదిమంది రాక్షసులను పిలిచి వారితో చెప్పుచున్నాడు.

*రావణుడు :* ఇదివరలో ఖరు డుండిన జనస్థానమున కరుగుడు. రాముడు మనవారి నందరను వధించినాడు. రామునిమీద నేను కోపించియున్నాను. రాముడు మృతుడైనగాని నాకు నిద్రపట్టదు. మీ రచ్చటికి వెళ్ళి రాముని కనిపెట్టియుండి అతనిని వధించు ప్రయత్నము చేయుడు. రాముని గురించిన వార్తలు నా కప్పటప్పటికి తెలియ పరచుచుండవలెను. మీరు గొప్ప పరాక్రమవంతు లని మిమ్ములను పంపుచున్నాను. పనులను జాగరూకులై చేసి కృతకృత్యులు కాగోరుచున్నాను. మీకు జయ మగునుగాక !

రాక్షసులు బయలుదేరి జనస్థానమునకు వెళ్ళినారు. రావణుడు తాను కృతార్థుడైనట్లే భావించినాడు.

రావణుని మనస్సును సీతాదేవి ఆక్రమించినది. రావణుడు కామపీడితుడై సీతాదేవిని చూచుటకు అంతఃపురము ప్రవేశించినాడు. సీతాదేవి రాక్షసస్త్రీల నడుమ కూర్చుండి దుఃఖించుచున్నది. రావణుడు సీతాదేవిని బలవంతపెట్టి దేవతల గృహాము బోలు తన సౌధమును సీతాదేవికి చూపించినాడు.

[తన సంపదను చూచి సీతాదేవి మనస్సును మార్చుకొనగల దని రావణుడు ఆశపడియుండును.]

రావణుని అంతఃపురము ఎంతో అందముగా నున్నది. ఎక్కడ చూచినను హర్మ్యములు, ప్రాసాదములు లెక్కలేకయున్నవి. స్త్రీలు వేలసంఖ్యలో ఉన్నారు. స్తంభములలో వజ్ర వైడూర్యములు చెక్కబడి యున్నవి. రత్నములు, బంగారు, వెండి మున్నగువానికి కొరతలేదు.

రావణుడు సీతాదేవిని మేడమీదికి నడిపించినాడు. మేడ మెట్లు బంగారుతో నిర్మింపబడియున్నవి. కిటికీలు బంగారుతో చేయబడియున్నవి. సౌధమును, నడబావులను, తామర కొలనులను రావణుడు సీతాదేవికి చూపించి సగర్వముగా ఆమెతో అనుచున్నాడు.

రావణుడు : సీతా! నేను రాక్షసగణములకు ప్రభువును. నా ఆజ్ఞలో ముప్పదికోట్ల రాక్షస వీరులున్నారు. వారిలో ఒక్కొక్కరికి వేయిమంది సేవకులున్నారు. ఈ రాజ్యము, నా ప్రాణము నీ అధీనమున నున్నవి. నీవు నా ప్రాణమునకన్న అధికురాలవు.

[ఏది యెట్లున్నను రావణుని ప్రాణము సీతాదేవి చేతిలో ఉన్నదన్నమాట సత్యదూరముకాదు.]

యదిదం రాజతంత్రం మే త్వయి సర్వం ప్రతిష్ఠితమ్
జీవితం చ విశాలాక్షి త్వం మే ప్రాణై ర్గరీయసీ. 55-16

సీతా! ఉత్తమ స్త్రీలనేకులు నాకు భార్యలై యున్నారు. నీవుకూడ నాకు భార్యవై వారి కందరకు ఈశ్వరివిగా నుండుము. నన్ను అనుగ్రహింపుము. ఈ లంకాపురి చుట్టును నూరు యోజనముల సముద్ర మున్నది. దేవాసురులు కూడి వచ్చినను ఈ పట్టణమును ధర్షింపజాలరు. ఈ లోకమునగాని, దేవతలలోగాని నాకు సరివచ్చు వీరుడు లేడు. రాజ్యభ్రష్టుడై తాపస వృత్తియందున్న బలహీనుని రాముని అనుసరించి నీ వేమి సుఖపడగలవు! నేను నీకు తగిన భర్తను. యౌవనము ఎల్లకాల ముండదు. నీవు నాతోకూడ సుఖముగా నుండుము.

భజస్వ సీతే మామేవ భర్తాహం సదృశ స్తవ
యౌవనం హ్యధ్రువం భీరు రమస్వేహ మయా సహ. 55-22

సీతా! రామునిమాట మరచిపొమ్ము. రాముడు ఇచ్చటికి రాజాలడు సరికదా ఇచ్చటికి వచ్చుమాట మనసాకూడ తలపెట్టజాలడు. నా చేత జిక్కిన నిన్ను విడిపింప కలిగినవాడు ముల్లోకములలోనులేడు. నారాజ్య సర్వస్వమును నీవు పాలింపుము. దేవతలును సమస్త చరాచరములును నాకు చేయునట్లే నీకును సేవజేయగలరు. నీకు రాజ్య పట్టాభిషేకము చేయుదును. మన మిద్దరము సుఖముగా కాలము గడపవచ్చును

**అభిషేకోదక క్లిన్నా తుష్టా చ రమయస్వ మామ్.** 55-27

సీతా! నీ వింతకు ముందుచేసిన పాపము వనవాస రూపముగా తీరిపోయినది. నీ పుణ్యఫలము నిప్పుడు అనుభవింపుము.

దుష్కృతం యత్పురా కర్మ వనవాసేన తద్గతమ్
యశ్చ తే సుకృతో ధర్మ స్తస్యేహ ఫల మాప్నుహి. 55-28

పుష్పహారములు, అంగరాగములు, ఆభరణములు, అన్నియు సిద్ధముగా నున్నవి. నీవు చక్కగా అలంకరించుకొని నాతోకూడ సుఖముగా నుండుము. ఇదిగో! ఈ పుష్పక విమానమును చూడుము. ఇందులో నెక్కి మనము హాయిగా విహరింపవచ్చును. నీ విట్లు దుఃఖించుట బాగులేదు.

ఈ మాటలు విన్న సీతాదేవి కండ్లు అశ్రుపూరితములైనవి. చీరకొంగుతో ముఖమును కప్పుకొని విలపించుచున్నది.

ఏవం వదతి తస్మిం త్సా వస్త్రాంతేన వరాంగనా
పిధా యేందునిభం సీతా ముఖ మశ్రూణ్యవ ర్తయత్. 55-32

రావణుడు తన ప్రయత్నమును వదలుకొనలేదు. మరల అనుచున్నాడు.

*రావణుడు* : సీతా! ధర్మలోపము కలుగునేమో యని సిగ్గు పడుచున్నావు కాబోలు! దైవనిర్ణయము వలన ఈ స్థితి సంభవించినది గనుక ఇందులో ధర్మలోప మేమియు లేదు. ఈ మాటను ఋషులుకూడ అంగీకరించి యున్నారు.

అలం వ్రీడేన వైదేహి! ధర్మలోపకృతే న చ
ఆర్షోఽయం దైవనిష్యందో య స్త్వామభిగమిష్యతి. 55-34

సీతా! నీపాదములకు శిరసా మ్రొక్కుచున్నాను. నేను నీ దాసుడను. నన్ను అనుగ్రహింపుము. నే నీ మదనబాధ భరింపజాలక ఎంతో తగ్గిపోయి ఇట్లు నీచముగా యాచించుచున్నాను. రావణు డేనాడు గాని ఒక స్త్రీకి తలవంచి నమస్కారము చేసి యుండలేదు.

ఏతౌ పాదౌ మయా స్నిగ్ధౌ శిరోభిః పరిపీడితౌ
ప్రసాదం కురు మే క్షిప్రం వశ్యో దాసోఽహమస్మి తే. 55-35

ఇమా శ్శూన్యా మయా వాచ శ్శుష్యమాణేన భాషితాః
న చాపి రావణః కాఞ్చి న్మూర్ధ్నా స్త్రీం ప్రణమేత హ. 56-36

ఈ మాటలకు సీతాదేవి తన దైపోవునని రావణుడు నమ్మి సంతోషముగా నున్నాడు.

సీతాదేవి తనకును రావణునికిని నడుమ ఒక తృణము నుంచి నిర్భయముగా పలుకుచున్నదీ.

సీత : రాక్షసాధముడా! రాముడు ధర్మాత్ముడైన దశరథమహారాజు కుమారుడు. రాముడు నా భర్త. ఆ రాముడే నా దేవత. రాముడు ధర్మాత్ము డని ముల్లోకములందును పేరుబడినవాడు. ఇక్ష్వాకుమహావంశమున జన్మించినవాడు. మహాబలపరాక్రమ సంపన్నుడు. గొప్ప తేజస్సుతో కూడియుండువాడు. రాముడు నిన్ను ప్రాణములతో విడువడు. నీవు రాముని కంట బడియుందువేని అప్పుడే మరణించి ఖరుని అనుసరించియుందువు. గరుత్మంతునిపై కడరిన సర్పముల చందమున నీ రాక్షసు లందరు రామునిపైకి పోయి భస్మము కాగలరు. నీ విక ఎంతోకాలము బ్రతికియుండలేవు. రామునికి సాధ్యము కానిపని ఏదియును లేదు. చంద్రుని అంతరిక్షమునుండి క్రిందికి పడవేసి నాశన మొనరింపగలడు. సముద్రమును శోషింపజేయగలడు. సీతను విడిపించుకొనివెళ్లుట రామునికి ఒక పెద్ద పని కాదు. నీ దురాకృతమువలన లంకకు వైధవ్యము ప్రాప్తించుట నిశ్చయము.

లంకా వైధవ్య సంయుక్తా త్వత్కృతే న భవిష్యతి. 56-12

నా భర్త మహాప్రభావుడు. రామునికి దైవబలముకూడ కలదు. తనబలమునే ఆశ్రయించుకొని దండకారణ్యమున నిర్భయముగా నివసించుచున్నాడు. నీకు కాలము సమీపించినది గనుకనే నీ కిట్టి దుర్బుద్ధి పుట్టినది. నీ ఒక్కని తప్పువలన మీ.వారి కందరకును కాల మాసన్నమైనది. యజ్ఞవేదికపై చండాలుడు అడుగిడజాలనట్లు ధర్మనిరతుడైన రాముని ధర్మపత్నిని, పతివ్రతను అయిన నన్ను నీవు స్పృశింపజాలవు.

తథాఽహం ధర్మనిత్యస్య ధర్మపత్నీ పతివ్రతా
త్వయా స్ప్రష్టుం న శక్యాఽస్మి రాక్షసాధమ పాపినా. 56-19

నా శరీరమును బంధింపదలతువేని బంధింపుము. నన్ను భక్షింపదలతువేని భక్షింపుము. ఈ దేహమునుగాని నా ప్రాణమునుగాని రక్షించుకొనవలెనని నా కెంత మాత్రములేదు. అపవాదమును మాత్రము భరింపజాలను.

ఇదం శరీరం నిస్సంజ్ఞం బంధ వా ఖాదయస్వ వా
నేదం శరీరం రక్ష్యం మే జీవితం వాపి రాక్షస 56-21

న తు శక్ష్యే మ్యుపక్రోశం పృథివ్యాం దాతుమాత్మనః 56-22

ఈ మాటలు విన్న రావణునికి పట్టరాని కోపము వచ్చినది.

**రావణుడు :** సీతా! ఇదే చెప్పుచున్నాను వినుము. నీకు పండ్రెండు మాసములు గడు విచ్చుచున్నాను. ఈ లోపల నీమనస్సు మార్చుకొనుము. లేనిచో నా వంటల వారు నీ శరీరమును ముక్కలుగా తరిగి ప్రాతఃకాల భోజనమునకు వండగలరు.

శృణు మైథిలి మద్వాక్యం మాసాన్ ద్వాదశ భామిని
కాలేనానేన నాభ్యేషి యది మాం చారుహాసిని 56-24
తతస్త్వాం ప్రాతరాశార్థం సూదా శ్ఛేత్స్యంతి లేశశః 56-25

## రాక్షసస్త్రీలు సీతాదేవిని అశోకవనమునకు కొనిపోవుట

సీతాదేవితో ఈ మాటలు చెప్పి రావణుడు రాక్షస స్త్రీలతో అనుచున్నాడు.

**రావణుడు :** మీరు ఈ సీత గర్వమును అణచవలయును. ఈమెను అశోక వనమునకు కొనిపోయి గూఢముగా రక్షించుచుండుడు.

అశోకవనికామధ్యే మైథిలీ నీయతామియమ్
తత్రేయం రక్ష్యతాం గూఢం యుష్మాభిః పరివారితా. 56-30

మీరు సీతను కొంతసేపు బెదరించి, కొంతసేపు మంచిమాటలుచెప్పి సకల ప్రయత్నములు చేసి అమెను వంచి నా వశ మగునట్లు చేయవలెను.

రాక్షస స్త్రీలు సీతాదేవిని అశోకవనమునకు తీసికొనివెళ్ళినారు. రావణుని ప్రమదావనమైన అశోకవనము ఎంతో రమ్యముగా నున్నది. కాని సీతాదేవి తన కష్టమును, తన భర్తను తలచుకొని భయముతోను, దుఃఖముతోను మూర్ఛపోయినది.

న విందతే తత్ర తు శర్మ మైథిలీ
విరూపనేత్రాభి రతీవ తర్జితా
పతిం స్మరంతీ దయితం చ దైవతం
విచేతనాభూ ద్భయ శోక పీడితా. 56-36

[రాక్షసులు పెట్టిన ఆహారమును సీతాదేవి స్పృశింపలేదని సంపాతి చెప్పిన మాటలను బట్టి తెలిసికొనవచ్చును. ఈ విషయము కిష్కింధా కాండలో 62-7 మొదలు 10 వఱకుగల శ్లోకములనుబట్టి ఏర్పడుచున్నది. ఇది గమనింపదగిన సంగతి.]

## రామలక్ష్మణులు ఆశ్రమము చేరి సీతాదేవిని కానక దుఃఖితు లగుట

శ్రీరాముడు మాయజింక రూపమునం దున్న మారీచుని వధించి సీతాదేవిని వెంటనే చూడదలచి తహతహపడుచు ఆశ్రమమునకు వడివడిగా వచ్చుచున్నాడు. రాముని వెనుకవైపు నక్కల యరపులు వినబడినవి. సీతాదేవి క్షేమమునుగురించి రామునికి సందేహము కలిగినది.

రాముడు : (తనలో) మారీచుడు బంగారులేడియై నన్ను ఆశ్రమమునుండి బహుదూరము తీసికొని వచ్చినాడు. నా బాణహతుడై చావబోవుచు నా స్వరము నభినయించి "హా లక్ష్మణా! హతోస్మి" అని అరచినాడుగదా! ఆ కేకను సీతయును లక్ష్మణుడు వినియుందురు. సీత ఆర్తయై లక్ష్మణుని నా యొద్దకు పంపి యుండును. లక్ష్మణుడు సీతను ఒంటరిగా విడిచి వచ్చియుండును. దుశ్శకునములు కనబడుచున్నవి. నా సీతకు ఎట్టి ఆపద వాటిల్లినదోకదా! జనస్థాన రాక్షస సంహార కారణముగా రాక్షసులు మాపై పగవట్టియున్నారు. సీతను ఒంటరిదానిగా నొనర్చి చంపుటకే మారీచుడు జింక రూపమున వచ్చియుండును. లక్ష్మణుడును సీతయు ఎట్లున్నారో!

ఈవిధముగా తలపోయుచు రాముడు దిగులుపడి ఆశ్రమమునకు వచ్చుచున్నాడు. మృగములు, పక్షులు రామునికి అప్రదక్షిణముగా తిరిగి వికృతముగా అరచినవి.

రాముడు సీతాదేవిని లక్ష్మణుని తలచుకొనుచు వచ్చుచుండగా లక్ష్మణుడెదురు పడినాడు. లక్ష్మణుడు కాంతివిహీనుడై దీనుడై యున్నాడు.

తతో లక్ష్మణ మాయాంతం దదర్శ విగతప్రభమ్. 57-15

రాముడు సైతము అట్లే ఉన్నాడు. అన్నదమ్ములు కలిసికొన్నారు. రాక్షసులు సంచరించుచోట సీతాదేవిని ఒంటరిగా విడిచి వచ్చుచున్న లక్ష్మణుని చూచి రాముని మనస్సుకు బాధ కలిగినది. లక్ష్మణుని ఎడమచేతిని తనచేతిలోనికి తీసికొని రాముడు కొంతసేపు పరుషముగాను కొంతసేపు మృదువుగాను పలుకుచున్నాడు.

రాముడు : లక్ష్మణా! నీవు చేసినది ఎంతతప్పు! సీతను ఒంటరిగా వదలివచ్చుట ఏమియు బాగు లేదు. సీత క్షేమముగా నుండునని తోచుటలేదు. ఈ అపశకునములను చూడుము. జింకలు, నక్కలు, పక్షులు సూర్యునివైపు తిరిగి భయంకరముగా అరచుచున్నవి. మాయలేడిగా వచ్చిన రాక్షసుడు నన్ను మోసపుచ్చి దూరముగా తీసికొని వచ్చినాడు. నా బాణహతుడై నపిదప రాక్షస రూపముతోనే చనిపోయినాడు.

ఇప్పుడు నా కేదో దిగులుగా నున్నది. సీత నెవ్వడైన అపహరించియుండును; లేదా వధించియుండును. అట్లు కాదేని, సీత మార్గమధ్యములోనైన ఉండును. అంతే కాని ఆశ్రమమున మాత్రము ఉండదు. ఇందుకు సందియము లేనేలేదు.

మనశ్చ మే దీన మిహాప్రహృష్టం
చక్షుశ్చ సవ్యం కురుతే వికారమ్
అసంశయం లక్ష్మణ నాస్తి సీతా
హృతా మృతా వా పథి వర్తతే వా. 57-24

లక్ష్మణా! రాజ్యభ్రష్టుడనై దీనుడనై దండకారణ్యమునకు వచ్చిన నాకు దుఃఖ సహాయయైయున్న నా సీత యెందున్నది? సీతను విడిచి ఒకక్షణమేని బ్రతికియుండలేను. నాకు ప్రాణసహాయయై దేవకన్యవలెనుండు నా సీత యెందున్నది?

రాజ్యభ్రష్టస్య దీనస్య దండకా న్పరిధావతః
క్వసా దుఃఖసహాయా మే వైదేహీ తనుమధ్యమా. 58-3

యాం వినా నోత్సహే వీర ముహూర్త మపి జీవితుమ్
క్వ సా ప్రాణసహాయా మే సీతా సురసుతోపమా. 58-4

లక్ష్మణా! సీత లేనిచో నేను రాజ్యమునుగాని, దేవరాజ్యమునుగాని కోరను. నా ప్రాణములకన్న అధికురాలైన సీత ఇప్పుడు బ్రతికియున్నదో లేదో కదా! సీత కారణముగా నేను ప్రాణములు వదలుటవలన నా వనవాసవ్రతమును పూర్తి చేయని వాడ నగుట నా ప్రతిజ్ఞ అబద్ధ మగునుకాబోలు! లక్ష్మణా! సీతానిమిత్తముగా నాకు మరణము ప్రాప్తమైనపిదప నీవు అయోధ్య కరిగి నా వృత్తాంతమును చెప్పుదువేని కైకేయి విని తన మనోరథ మీడేరినందులకు సంతసించి సుఖముగా నుండగలదు.

సీతా నిమిత్తం సౌమిత్రే మృతే మయి గతే త్వయి
కచ్చి త్సకామా సుఖితా కైకేయీ సా భవిష్యతి. 58-7

మాతల్లి కొడుకును కోల్పోయి కైకేయి కొలువు కొలుచుచుండగలదా! లక్ష్మణా! సీత జీవించియుండిననే, నేను మన పర్ణశాల ప్రవేశింతును. లేకున్న నేను ప్రాణములు విడుతును. నేను ఆశ్రమమున కరుగుటతోడనే సీత చిరునవ్వుతో ఎదురు వచ్చి మధురముగా పలికెనా సరి! లేనిచో నేను మరణించుట నిశ్చయము.

లక్ష్మణా! సీత బ్రతికియున్నదా లేదా? చెప్పుము. నీవు ఏమరియుండగా రాక్షసులు సీతను భక్షించిరాయేమి?

బ్రూహి లక్ష్మణ వైదేహీ యది జీవతి వా న వా
త్వయి ప్రమత్తే రక్షోభి ర్భక్షితా వా తపస్వినీ. 58-11

నా వియోగమున సీత దుఃఖించుచుండును. ఆ మాయరాక్షసుడు నాగొంతుతో 'లక్ష్మణా' అని గట్టిగా అఱచినాడు. ఆ కేక విని నీకు భయము కలిగియుండును. సీత కూడ దానిని విని భీతిల్లి నిన్ను పంపియుండును. నన్ను చూచుటకు నీవు వడిగా వచ్చితివి. అంతేనా!

శ్రుతస్తు శంకే వైదేహ్యా స స్వర స్సదృశో మమ
త్ర స్తయా ప్రేషిత స్త్వం చ ద్రష్టుం మాం శీఘ్ర మాగతః 58-14

ఎటుచూచినను నీవు సీతను విడిచివచ్చుట గొప్ప తప్పు. రాక్షసులు మనమీద కసి తీర్చుకొనుటకు అవకాశ మిచ్చినావు. రాక్షసులు సీతను చంపియేయుందురు. నేను దుఃఖసముద్రమున మునిగియున్నాను. ఏమి చేయగలను! ఇట్టి దుఃఖము ననుభవింప వలసిన యోగ మున్నది కాబోలు!

అహోఽస్మి వ్యసనే మగ్న స్సర్వథా శత్రుసూదన
కి న్విదానీం కరిష్యామి శంకే ప్రాప్తవ్య మీదృశమ్. 58-17

లక్ష్మణా! నిన్ను నమ్మి వచ్చినందుకు నీ విట్లు చేయుట తగునా! సీతను విడిచి నీవు వచ్చుట చూచి నా సీతకు మరణము కలిగియుండు నని శంకించి నే నెంతయో బాధపడితిని సుమా!

దృష్ట్వైవాభ్యాగతం త్వాం మే మైథిలీం త్యజ్య లక్ష్మణ
శంకమానం మహత్పాపం యత్సత్యం వ్యథితం మనః 59-3

[సీతాదేవి జీవించియుండగా లక్ష్మణుడు కదలి రాకూడ దన్నమాట]

సీతను విడిచి నీ వొక్కడవే వచ్చుట దూరమునుండి చూచినాను. నా ఎడమ కన్ను, ఎడమ భుజము, హృదయము అదరుచున్నవి.

లక్ష్మణుడు: అన్నా! నేను బుద్ధిపూర్వకముగా రాలేదు. సీతాదేవి పరుషవాక్కులు పలికి నన్ను బలవంతపెట్టి పంపినది. మాయరాక్షసుడు నీ స్వరముతో "హా సీతా! హా లక్ష్మణా! నన్ను రక్షింపుడు" అని అరచుట సీతాదేవి విన్నది. ఆ యార్త నాదమును విని "పొమ్ము-పొమ్ము" అని సీతాదేవి నన్ను పలుమారు తొందర పెట్టినది. నే నెంతనోరమో చెప్పినాను "రామునికి భయము కలిగింపగల రాక్షసు డెవ్వడును ఈ లోకములోనే లేడు. నీవు విన్నది రాముని కంఠస్వరము కాదు. ఎవ్వడో మారుగొంతుతో కేక పెట్టినాడు. రాముడు దేవతలనుసైతము రక్షింపగలవాడు. అట్టి రాముడు "నన్ను రక్షింపుడు" అని ఎన్నడును అనడు. అట్టి నీచపుపలుకు రామునినోట రాదు. ఎవ్వడో రాక్షసుడు ఏదో దురుద్దేశమును తలపెట్టి ఈ పన్నాగమును పన్నినాడు. నీవు దుఃఖపడవలదు. రామునికి పరాజయము కలిగింపగలవాడు ముల్లోకములలో ఇంతవరకు పుట్టలేదు. ఇకమీద పుట్టబోడు. నీవు నిర్విచారముగా నుండుము. నన్ను త్వరపెట్టకుము" అని ఎంతో ధైర్యము చెప్పినాను. నామాట లన్నింటిని విని సీతాదేవి కన్నీరు కార్చుచు నన్ను దారుణముగా దూషించినది. "నీకు నామీద మన స్సున్నట్టున్నది. భరతునితో ఏదో సంకేతము చేసికొని మా వెంబడి వచ్చినట్టున్నది. నీవు దొంగ వేషముతో వచ్చిన శత్రువుగా నున్నావు. మీ అన్న నాశన మగునేని నీ కోరిక

తీర్చుకొనదలచితివి కాబోలు! అదిమాత్రము సాధ్యపడదు. నీ కట్టి దురుద్దేశ్యము లేనియెడల ఆపదలో చిక్కువడిన అన్నను రక్షించుటకు కదలవేమి" అని తీవ్రముగా పలికినది. ఈ మాటలు సహింపలేక నేను కోపించి ఆశ్రమమునుండి వచ్చినాను.

**రాముడు:** లక్ష్మణా! తప్పు చేసితివి. నీవు సీతను విడిచివచ్చుట చిన్న తప్పు కాదు. నా సామర్థ్యము నీ వెరిగియుండియు సీత కోపములో ఏదో అన్న దని నీ విట్లు రాదగునా!

జానన్నపి సమర్థం మాం రక్షసాం వినివారణే
అనేన క్రోధవాక్యేన మైథిల్యా నిస్సృతో భవాన్. 59-22

నీవు చేసినపని ఏమియు బాగులేదు. సీత కోపోద్రేకమున ఏవో మాట లని యుండవచ్చును. అంతమాత్రమునకే నీవు క్రోధపరవశుడవై నా ఆజ్ఞను మీరి గొప్ప తప్పు చేసితివి.

సర్వథా త్వవినీతం తే సీతయా యత్ప్రచోదితః
క్రోధస్య వశ మాపన్నో నాకరో శ్శాసనం మమ. 59-24

అదిగో! అటు చూడుము. ఆ మాయరాక్షసుడు నా బాణహతుడై చచ్చిపడి యున్నాడు. వాడు ప్రాణము విడుచువేళ అఱచిన అఱపును విని నీవు సీతను ఒంటరిగా విడిచి వచ్చియున్నావు.

శ్రీరాముడు ఆశ్రమమునకు బయలుదేరినాడు. ఆయన యెడమకన్ను అదరినది. నడకలో తొట్రుపాటు కలిగినది. శరీరము కంపించినది. ఈ అపశకునములను చూచి సీతాదేవి క్షేమమునుగూర్చి శంకించి దిగులుపడి ఆశ్రమమునకు వడివడిగా వచ్చినాడు.

ఆశ్రమము శూన్యమైయుండినది. సీతాదేవి కానరాలేదు. సీతను ఎవ్వరేని అపహరించియుందురా! లేక ఆమె మరణించియుండునా! ఏ రాక్షసుడైనను ఆమెను భక్షించియుండునా! ఆమె అరణ్యములోనికి వెళ్ళియుండునా? రామునికేమియు తోపలేదు.

ఒకవేళ ఫలములు పుష్పములు తెచ్చుటకు వెళ్ళియుండునా? పుష్కరిణికి పోయినదికాబోలు! జలము కొనివచ్చుటకు నదికి వెళ్ళినదేమో!

రాముడు ఎక్కడ వెదకినను సీతాదేవి కనిపింపలేదు. రామునికి పిచ్చిపట్టినట్లయినది. ఒకచెట్టునుండి మరియొక చెట్టుకు, ఒకకొండనుండి మరియొక కొండకు,

నదియొద్దకు పరుగెత్తుచున్నాడు. రాముడు శోకసముద్రమున మునిగిపోయినాడు. కదంబవృక్షమును, బిల్వవృక్షమును, అడవిలోని అన్నివృక్షములను పేరుపెట్టి పిలిచి "నా ప్రియురాలైన సీతను చూచితిరా" అని అడుగుచున్నాడు.

"అశోకవృక్షమా! నీవు శోకమును పోగొట్టుదానవుకదా! నే నిప్పుడు శోకమున మునిగియున్నాను. నా ప్రియురాలిని చూపి నన్ను నీ పేరుగలవానినిగా చేయుము" (అశోకునిగా చేయు మన్నమాట)

అశోక శోకాపనుద శోకోపహతచేతసమ్
త్వన్నామానం కురు క్షిప్రం ప్రియాసందర్శనేన మామ్. 60-17

రాము డిట్లు అన్నివృక్షములను, లతలను, పుష్పములను, జింకలను, ఏనుగులను, వ్యాఘ్రములను సీతాదేవి వృత్తాంతము నడుగుచున్నాడు.

శ్రీరాముడు ఉన్మత్తరాఘవు డయినాడు.

**రాముడు :** సీతా! ఎందు కిట్లు పరుగెత్తుచున్నావు! చెట్లచాటున నిలిచి నాకు కనబడుచున్నావులే! నాతో పలుకవేమి? సీతా! నిలునిలుము. నీకు నాపై కొంచెమైనను దయలేదు. నీ స్వభావమున హాస్య మెక్కువ లేదుకదా! ఇప్పు డేల యీ ఉపేక్ష?

తిష్ఠ తిష్ఠ వరారోహే న తేస్తి కరుణా మయి
నాత్యర్థం హాస్యశీలాసి కిమర్థం మా ముపేక్షసే. 60-27

సీతా! అదిగో! నీ పసుపుపట్టుచీర కానవచ్చుచున్నది. పరుగెత్తి లాభములేదు. నీకు నాయెడ నిజముగా అనురాగ మున్నచో నిలువబడుము.

అయ్యో! సీతలేదు కాబోలు! ఉన్నచో న న్నిట్లుపేక్షించునా! నేను లేని సమయము చూచి రాక్షసు డెవ్వడో సీతను ముక్కలు చేసి తినియుండును.

లక్ష్మణా! సీత ఎందైన కనిపించినదా! సీతా! నీ వెక్కడికి వెళ్లినావు?

ఈవిధముగా విలపించుచు రాముడు ఒక అడవినుండి మరియొక అడవికి పరుగిడుచు మనసు నిలకడ లేనివాడై అటునిటు తిరిగి అడవులలోను, కొండలమీదను, నదులచెంతను వెదకినాడు. సీతాదేవి కానరాలేదు. మరల పర్ణశాలచెంతకు వచ్చి విలపించుచున్నాడు.

**రాముడు :** లక్ష్మణా! ఏదీ నా సీత? నా సీతను ఎవడు అపహరించినాడు? సీతా! నీ వెంపుడు జింకపిల్లలు నీవు కనబడనందున ఎక్లేడ్చుచున్నవో చూడుము.

లక్ష్మణా! సీతనుబాసి నేను బ్రతికియుండలేను. నేనీ లోకమును విడిచి పరలోకమునకు వెళ్ళగా నా తండ్రి నన్నుచూచి "రామా! పదునాలుగు సంవత్సరములు వనవాసము చేసెద నని ప్రతిజ్ఞ చేసి అంతకుముందే పరలోకమునకు వచ్చితివా! నీవు అనృతవాదివి. క్రూరుడవు. ఛీ" అని నిందింపగలడు.

సీతా! తీవ్రమైన దుఃఖమునం దున్నాను. కీర్తి కపటవర్తనుని త్యజించిపోవునట్లు నీవు నన్ను వీడి ఎచ్చటి కరిగితివి? నిన్ను విడిచి నేను జీవింపజాలను.

**లక్ష్మణుడు :** రామా! ఇల్లెంతసేపు విలపించుచుందువు! దుఃఖపడకుము. సీతాదేవిని ఇంకను వెదకుదము. అడవిలో ఎందైన తిరుగుచుండును. తామరకొలనుకు పోయినది కాబోలు! స్నానార్థము నదివైపు వెళ్లినదేమో! నవ్వులాటకు ఎందైన దాగియుండును. వెదకిచూతము. ఈ అరణ్యము నంతయు గాలింతము. శోకమును విడిచిపెట్టుము.

రామలక్ష్మణు లిరువురు సీతాదేవిని వెదుకసాగినారు. అడవులు, కొండలు, నదులు సరస్సులు, గుహలు, ఎందెందో వెదకిరిగాని సీతాదేవి కానరాలేదు.

**రాముడు :** లక్ష్మణా! ఈ వెదకుటవలన ప్రయోజనమేమియు లేదు. సీత ఇక్కడెక్కడను లేదు.

**లక్ష్మణుడు :** రామా! దిగులుపడకుము. సీతాదేవి తప్పక కానవచ్చును.

**రాముడు :** తమ్ముడా! అడవు లన్నియు తిరిగినారము. కొండ లన్నియు వెదకినారము. సీత కానరాలేదుకదా! మరెక్కడనుండును!

రాముడు తెలివి తప్పి, చేష్టలు దక్కి, వేడి నిట్టూర్పులు పుచ్చుచు ఒకచోట కూలబడినాడు.

సంతప్తో హ్యవసన్నాంగో గతబుద్ధి ర్విచేతనః
నిషసా దాతురో దీనో నిశ్శ్వ స్యాశీత మాయతమ్. 61-29

రాముడు సీతాదేవిని తలచుకొని కన్నీరు కార్చుచున్నాడు. లక్ష్మణుడు అన్నను ఓదార్చుచున్నాడు.

**రాముడు :** (సీతాదేవిని తలచుకొని) సీతా! నీకు పుష్పము లన్న ఎంతో ప్రీతి. కావున నీ దేహమును అశోక శాఖలతో కప్పుకొని, నాకు కనిపింపక, నా శోకమును వృద్ధిచేయుచున్నావు.

[**సీతాదేవి లంకలో అశోకవనమునం దున్నది గదా!**]

త్వ మశోకస్య శాఖాభిః పుష్పప్రియతయా ప్రియే
అవృణోషి శరీరం తే మమ శోక వివర్ధనీ. 62-3

సీతా! అరటిస్తంభములవంటి నీ యూరువులు నాకు కానవచ్చుచున్నవి. వానిని మరుగుపడ జేయజాలవుసుమా!

సీతా! నీవు నవ్వుచు ఆ కొండగోగు చెట్లలో నున్నావు! నీ పరిహాసమును చాలింపుము. నేను ఎంతో అలసియున్నాను. నీవు పరిహాస ప్రియ వని నే నెరుగుదును. కాని ఆశ్రమమునందు ఎక్కువ పరిహాసము కూడదు. ఇది పరిహాసమునకు సమయముకాదు.

పరిహాసేన కిం సీతే పరిశ్రాంతస్య మే ప్రియే
అయం స పరిహాసోఽపి సాధు దేవి న రోచతే. 62-6

విశేషేణాశ్రమస్థానే హాసోఽయం న ప్రశస్యతే
అవగచ్ఛామి తే శీలం పరిహాసప్రియం ప్రియే. 62-7

సీతా! మన పర్ణశాల పాడుపడియున్నది. నీవు దాగియుండుట బాగులేదు. ఇక బయటికి రమ్ము.

లక్ష్మణా! నే నింతగా పిలుచుచున్నను సీత పలుకుటలేదు. సీత ఏమైనదోకదా! ఈ మృగములు కన్నీరు కార్చుచు, సీతను రాక్షసులు భక్షించి రని సూచించుచున్నవి. కైకేయి కోరిక ఇప్పుడు పూర్తిగా ఫలించినది. సీతను వెంటబెట్టుకొని వచ్చిన నేను సీతారహితుడనై మన అంతఃపురమున అడుగుపెట్టగలనా! సీతను కోల్పోయిన నన్ను చూచి లోకములోనివా రందరు నన్ను పరాక్రమహీనుడ ననియు, నిర్దయుడ ననియు తప్పక నిందింతురు. వనవాసమును పూర్తి చేసికొని వెళ్ళినపిదప జనకమహారాజునకు ఏమి సమాధానము చెప్పగలను! నేను అయోధ్యకు రాను. నన్నిక్కడ విడిచిపెట్టి నీ వయోధ్యకు పొమ్ము. భరతుని నా మారు కవుగిలించుకొని "రాముడు అనుజ్ఞ నిచ్చి నాడు. నీవు రాజ్యమును పాలింపుము" అని భరతునితో చెప్పుము. మన తల్లులకు నా నమస్కారములు చెప్పుము. నా తల్లిని ప్రేమతో చూచుకొను మని భరతునితో చెప్పుము. నాకును సీతకును వాటిల్లిన ఆపదను మా తల్లికి వివరింపుము. లక్ష్మణా! నావంటి పాపాత్ముడు లోకములో ఉండడు. నేను పూర్వజన్మమున ఎన్నో పాపములు చేసియుందును. కావుననే దుఃఖముమీద దుఃఖము న న్నలముకొనుచున్నది. రాజ్య భ్రంశము, బంధువుల యెడబాటు, తండ్రి మరణము, తల్లికి దూర మగుట, అన్నిటికిని తోడు ఈ సీతావియోగము. ఎన్ని కష్టములు వచ్చినను సీత కలదుగదా యని దుఃఖమును దిగమ్రింగి కాలము గడపుచుంటిని. ఇప్పుడు ఆ సుంత ఊరటయు నశించినది.

నా సీతను ఏ రాక్షసుడో అపహరించి ఆకాశమార్గమున పోవునప్పుడు సీత భయపడి ఎంత ఏడ్చినదో పాపము!

సా నూన మార్యా మమ రాక్షసేన
బలాద్ధృతా ఖం సముపేత్య భీరుః
అపస్వరం సస్వర విప్రలాపా
భయేన విక్రందితవత్యభీక్ష్ణమ్. 63-7

సీత రాక్షసునిచేత చిక్కి ఎంత బాధపడుచున్నదోగదా! లక్ష్మణా! సీత నన్ను కూడి ఈ శిలాతలమున కూర్చుండి నవ్వుచు సంతోషముగా మనతో ఎంతమధురముగా మాటలాడుచుండినది!

అస్మి న్మయా సార్థముదారశీలా
శిలాతలే పూర్వముపోపవిష్టా
కాంతస్మితా లక్ష్మణ జాతహాసా
త్వామాహ సీతా బహువాక్యజాతమ్. 63-12

గోదావరీనది సీతకెంతో ప్రియమైనది. సీత అక్కడికి వెళ్ళియుండునా! నా పిచ్చిగాని! నది కెప్పుడైన సీత ఒంటరిగా అరిగి యెరుగునా! తామరపూవులకోసమై పుష్కరిణికి పోయియుండునా! అదియు సమంజసము కాదు. ఇదివర కెన్నడును నన్ను విడిచి పూవులకు పోని సీత ఈనాడుమాత్రము ఒంటరిగా ఏల వెళ్ళియుండును! సీత ఒంటరిగా ఎచ్చటికిని వెళ్ళదు.

కర్మసాక్షి వగు ఓ సూర్యభగవానుడా! నీకు తెలియని విషయము లేదుగదా! నా సీత ఏమైనదో చెప్పుము. వాయుదేవుడా! నీ వెరుగనిది ఏమున్నది! నీవైనను తెలియు జేయుము.

లక్ష్మణుడు: రామా! ఇట్లు విలపించుటవలన లాభ మేమి? శోకమును విడిచి ధైర్యము నవలంబింపుము. సీతాదేవిని విసుగులేక వెదకుదము. ఉత్సాహవంతులు ఎంతటి ఆపదలైనను తరించి సుఖపడుట ఎరుగవా!

శోకం విముంచార్య ధృతిం భజస్వ
సోత్సాహతా చాస్తు విమార్గణేఽస్యాః
ఉత్సాహవంతో హి నరా న లోకే
సీదన్తి కర్మస్వతి దుష్కరేషు. 63-19

లక్ష్మణుడు ఎంతధైర్యము చెప్పినను రాముని దుఃఖము తగ్గలేదు.

**రాముడు :** (దీనముగా) లక్ష్మణా! నీవు త్వరగా గోదావరినది కరిగి చూడుము. సీత తామరపూవులకై వెళ్ళినదేమో!

లక్ష్మణుడు గోదావరిని సమీపించి "సీతాదేవి ఎందున్నది?" అని అడిగినాడు. కాని రావణుడు సీతాదేవిని అపహరించినసంగతి గోదావరీదేవిసైతము చెప్పలేదు. రావణునికి భయపడి పలుకలేదు.

రామునికి నిరాశ కలిగి మరల విలపింపసాగినాడు.

**రాముడు :** లక్ష్మణా! గోదావరితల్లికి నామీద దయరాలేదు. సీతలేక నేను జీవించియుండలేను. నాకు నిద్రపట్టదు. లక్ష్మణా! ఇటు చూడుము. ఈ మృగములు నన్ను మాటిమాటికి చూచుచున్నవి. సీతసంగతి నాకు చెప్పదలచుకొన్నవికాబోలు!

ఏతే మృగా మహావీర్యా మా మీక్షంతే ముహుర్ముహుః
వక్తుకామా ఇవ హి మే ఇంగితా న్యుపలక్షయే. 64-15

మృగములారా! సీత ఎందున్నది?

మృగము లన్నియు లేచి ఆకాశమును చూపించి దక్షిణదిక్కుగా పరుగెత్తి మరల రాముని చూచుచు సీతాదేవి వెళ్ళిన మార్గమును సూచించుచు పోవుట లక్ష్మణుడు గమనించి వాని అభిప్రాయమును గ్రహించి రామునితో అనుచున్నాడు.

**లక్ష్మణుడు :** అన్నా! ఈ మృగము లన్నియు దక్షిణదిక్కుగా పరుగెత్తుచున్నవి. మనము కూడ ఆవైపుననే వెళ్లుట మంచిది.

రామ లక్ష్మణులు దక్షిణ ముఖముగా బయలుదేరినారు. భూతలమును చూచుచు నడచుటలో దారిలో కొన్ని పుష్పములు రాలియుండుట చూచినారు. రాముడు వానిని గుర్తుపట్టి లక్ష్మణునితో అనుచున్నాడు.

**రాముడు :** లక్ష్మణా! ఈ పూలు సీతవేసుమా! నేనే వీనిని తెచ్చి సీత కిచ్చినాను. సీత ఈ పూవులను తలలో పెట్టుకొన్నది. ఈ ఆశ్చర్యమును చూచితివా! సూర్య భగవానుడు, వాయుదేవుడు, భూదేవి నాకు శుభమును చేకూర్పగోరి ఈ పుష్పములను కాపాడుచున్నారు!

అభిజానామి పుష్పాణి తానీమానీహ లక్ష్మణ
పినద్ధానీహ వైదేహ్యా మయా దత్తాని కాననే 64-26
మన్యే సూర్యశ్చ వాయుశ్చ మేదినీ చ యశస్వినీ
అభిరక్షంతి పుష్పాణి ప్రకుర్వంతో మమ ప్రియమ్. 64-27

శ్రీరాముడు లక్ష్మణునితో ఈమాటలు చెప్పి ప్రస్రవణ పర్వతమును చూచి అనుచున్నాడు.

*రాముడు :* ఓ పర్వతరాజమా ! నన్ను బాసి పరితపించుచుండు సర్వాంగసుందరి యైన ఒక తరుణి రమ్యమైన వనప్రదేశమున నీకు కనబడినదా ?

కచ్చి క్షితిభృతాం నాథ దృష్టా సర్వాంగసుందరీ
రామా రమ్యే వనోద్దేశే మయా విరహితా త్వయా, 64-29

[ఈ శ్లోకరచన అద్భుతము. వ్యాఖ్యాతలు దీనినిగురించి ఎంతో గొప్పగా వర్ణించి యున్నారు. ధ్వనికి చక్కని ఉదాహరణము. శ్రీరాముని ప్రశ్న ప్రతిధ్వనించి సీతను గురించి చెప్పుమని ఆ పర్వతము శ్రీరాముని ప్రశ్నించునట్లు తోపించుచున్నది. "క్షితిభృతాం నాథ" అను మాటలు రామునికిని, పర్వతమునకును అన్వయించుట ఒక విశేషము.]

ఓ పర్వతమా ! సీతను చూపుము. చూపవేని నీ సానువులను ధ్వంసము గావించెదను.

ఈమాటలు ప్రతిధ్వనించి పర్వత మేమో చెప్పుచున్నట్లు అనిపించినదే గాని సీతాదేవిని మాత్రము పర్వతము చూపలేదు.

ఏవముక్తస్తు రామేణ పర్వతో మైథిలీం ప్రతి
శంసన్నివ తత స్సీతాం నాదర్శయత రాఘవే. 64-32

రాముడు ఆగ్రహించి "పర్వతమా! నాబాణాగ్నిచే నిన్ను భస్మము కావింతును" అని బెదరించినాడు.

*రాముడు :* లక్ష్మణా ! ఇదిగో ! ఈనది మనకు సీత సమాచారము చెప్పనియెడల దీనిని శోషిల్ల జేయుదును.

ఇంతలో, రాముడు భూతలమున కొన్నిగుర్తులు చూచినాడు. రాక్షసుని పెద్ద పెద్ద అడుగుజాడలు, అటుయిటు పరుగెత్తుచుండిన సీతాదేవి పాదచిహ్నములు రామునికి కనబడినవి. ధనుస్సు విరిగి పడియుండినది. బాణములు లెక్కలేక పడియుండినవి. రథము విరిగియుండినది. వీనిని చూచి రాముడు లక్ష్మణునితో అనుచున్నాడు.

*రాముడు :* లక్ష్మణా ! చూడుము. సీత ఆభరణములనుండి కనకబిందువులు రాలియున్నవి. ఇవిగో సీత పుష్పమాలికలు. నేల రక్తసిక్తమై యున్నది. లక్ష్మణా ! రాక్షసులు సీతను తఱిగి తినియుందురు కాబోలు ! సీతకోసమై ఇద్దరు రాక్షసులు యుద్ధము చేసినట్లు కనబడుచున్నది. ఈ గొప్పధనుస్సు ఏ వీరునిదై యుండును ! ఈ కవచమును చూడుము. వైడూర్యమణులతో కూడి బాలభాస్కరునివలె ప్రకాశించు

చున్నది. ఈ ఛత్రమును చూడుము. శతశలాకములతో మెఱయుచున్నది. రథఖరములు చచ్చిపడియున్నవి. రథము భగ్నమైయున్నది. ధ్వజము నేలమీద కూలియున్నది. ఎన్ని బాణములు విరిగిపడియున్నవో చూడుము. సారథికూడ హతుడైనాడు. ఇటుచూడుము. ఇక్కడ మరియిద్దరు పడియున్నారు. చామర గ్రాహులై యుందురు. ఇదిగో! ఈ వంకచూడుము. రాక్షసుని అడుగుజాడలు కనిపించుచున్నవి. నాకు గల రాక్షసులమీది క్రోధము, ఇప్పుడు నూరింతలు పెరిగినది. రాక్షసులు సీతను అపహరించిగాని భక్షించిగాని యుందురు.

ఆహా! కాలప్రభావము! ధర్మముకూడ సీతను రక్షింపలేకపోయెనుగదా!

న ధర్మ స్త్రాయతే సీతాం హ్రియమాణాం మహావనే. 64-53

సీతలేకపోయినపిదప, నాకు సుఖముకలిగించువారు ఈలోకములో ఎవ్వరునులేరు.

లక్ష్మణా! ఈ లోకమున 'దయ' అనుమాట పనికిరాదు. లోకములను సృష్టింపగల శూరుడైనను దయాపరుడుగా ఉండునేని అతని సామర్థ్యమును గుర్తింపజాలక లోకులు అతనిని అవమానింతురు. అందరియెడ నేను దయగలిగి మృదువుగా వర్తించుచున్నందున దేవత లందరు నన్ను వీర్యహీనునిగా భావించుచున్నారు. లక్ష్మణా! సద్గుణముసైతము నన్ను కూడి దోషమే అయినది చూచితివా!

కర్తారమపి లోకానాం శూరం కరుణవేదినమ్
అజ్ఞానా దవమన్యేరన్ సర్వభూతాని లక్ష్మణ. 64-54

మృదుం లోకహితే యుక్తం దాంతం కరుణవేదినమ్
నిర్వీర్య ఇతి మన్యంతే నూనం మాం త్రిదశేశ్వరాః 64-55

మాం ప్రాప్య హి గుణో దోష స్సంవృత్తః పశ్య లక్ష్మణ. 64-56

ఇక నా పరాక్రమమును ప్రదర్శించెదను. చంద్రుని వెన్నెలను ఉదయసూర్యుడు హరించునట్లు నేను నా గుణములను ఉపసంహరించి నా తేజస్సును ప్రకాశింపజేయుదును. ఈ క్షణముననే సమస్తభూతములను, రాక్షసులను నాశన మొనరింతును. నా బాణములచే ఆకాశమును కప్పివేయుదును. ముల్లోకములలోను ఎవ్వడుగాని సంచరించుటకు వీలు కానట్లు కావించెదను.

మమాస్త్రబాణ సంపూర్ణ మాకాశం పశ్య లక్ష్మణ
నిస్సంపాతం కరిష్యామి హ్యద్య త్రైలోక్య చారిణామ్. 64-59

గ్రహముల సంచారమును నిలుపుదును. అగ్నిని, వాయువును, జలమును నశింపజేయుదును. కొండలు పిండిచేయుదును. సముద్రమును శోషిల్ల జేయుదును.

ముల్లోకములను క్షయము కావింతును. కుశలినియైన సీతను దేవతలు నాకు ఈయరేని నా విక్రమము నిప్పుడే ప్రదర్శింతును. సీతానిమిత్తము నా బాణములను ప్రయోగించి లోకమునందలి పిశాచములను రాక్షసులను రూపు మాపెదను. నా ప్రేయసియైన సీత ఎట్లుండినదో అదేరూపముతో నాకు లభింపదేని ఈ జగత్తు సర్వమును నాశన మొనర్రింతును.

న తాం కుశలినీం సీతాం ప్రదాస్యంతి మమేశ్వరాః
అస్మిన్ ముహూర్తే సౌమిత్రే మమ ద్రక్ష్యంతి విక్రమమ్. 64-63

ఆకర్ణపూర్ణై రిషుభి ర్జీవలోకం దురావరైః
కరిష్యే మైథిలీహేతో రపిశాచ మరాక్షసమ్. 64-66

తథారూపాం హి వైదేహీం న దాస్యంతి యది ప్రియామ్
నాశయామి జగత్సర్వం త్రైలోక్యం సచరాచరమ్. 64-71

శ్రీరాముడు ధనుస్సు గ్రహించి, శరసంధానము చేసి, లక్ష్మణునితో,

రాముడు: లక్ష్మణా! నేను శరసంధానము చేయుచున్నాను. నన్ను వారించుట ఎవ్వనికిని సాధ్యముకాదు. సీత పూర్వ మెట్లుండినదో అదేరూపముతో అనిందితయై యుండవలయును. అట్టి సీత నాకు లభింపదేని, ప్రపంచము నంతటిని తలక్రిందులు చేయుదును.

పురేవ మే చారుదతీ మనిందితాం
దిశంతి సీతాం యది నాద్య మైథిలీమ్.
సదేవ గంధర్వ మనుష్య పన్నగం
జగత్సశైలం పరివర్తయా మ్యహమ్. 64-75

## రాముని లక్ష్మణుడు నివారించుట

లక్ష్మణుడు: (అంజలిచేసి) రామా! నీవు ఎల్లప్పుడు సమస్త భూతములకును హితమునే కోరువాడవుగదా! ఇప్పు డేల ఈ క్రోధము? ఎవ్వడో ఒక్కడు అపరాధము గావించె నని, లోకము లన్నిటిని విధ్వంసము చేయబూనుట న్యాయమా!

ఏకస్య నాపరాధేన లోకాన్ హంతుం త్వమర్హసి. 65-6

ఇంతకును ఈ రథము, ఈ ఆయుధములు ఎవ్వనివో, వాని నెవ్వరు విరిచిరో, ఆ పని ఏల జరిగెనో తెలియవచ్చుటలేదు. ఈ గుర్తులనుబట్టి ఇక్కడ గొప్పయుద్ధము జరిగిన దని మాత్రము ఏర్పడుచున్నది. ఈ యుద్ధము ఒకనిదిగానే కనబడుచున్నది. సైన్యపు

జాడలు కనిపించుటలేదు. రాజులైనవారు అపరాధులను దండింపవలెనుగాని అందరిని వధించుట కలదా !

రామా ! నీవు సర్వదా సర్వభూతములకు శరణ్యుడవు. నీకు సంభవించిన ఆపద అల్పమని యెవ్వడుగాని భావింపడు. సీతాదేవిని అపహరించిన పాపాత్ముని వెదకుదము. సముద్రములలో, పర్వతములమీద, గుహలలో, దేవగంధర్వలోకములలో వెదకుదము. సీతాదేవిని సామోపాయమున పొందలేనియెడల ఆతరువాత నీ బాణములను ప్రయోగింపవచ్చును.

రామా ! దశరథుడు గొప్ప తపస్సుచేసి నిన్ను కన్నాడు. నీ సుగుణములను చూచి నిన్ను ప్రేమించి, నీ వియోగమును భరింపలేక స్వర్గస్థుడైనాడు. దైవయోగమున నీ కిప్పుడు కష్టము కలిగినది. నీ వంటి ధీరుడు దుఃఖమును సహింపజాలనిచో ప్రాకృతులు, బలహీనులు సహింపగలరా !

యది దుఃఖమిదం ప్రాప్తం కాకుత్స్థ న సహిష్యసే
ప్రాకృత శ్చాల్పసత్త్వశ్చ ఇతరః క స్సహిష్యతే. 66-5

మానవులకు ఆపదలు కలుగుట లోకస్వభావము. యయాతి స్వర్గమునుండి పతనము నొందలేదా ! వసిష్ఠునంతవాడు నూరుగురు తనయులను ఒక్కనాడు కోల్పోయెనుగదా ! భూమికిసైతము కంపము కలుగుచుండును గదా ! సూర్యచంద్రులకు గ్రహణము పట్టుటలేదా ! దేవతలుకూడా దైవమును అతిక్రమింపలేరు. ఇంద్రునికి సైతము ఆపద వచ్చినట్లు వినియున్నాముగదా !

సీతాదేవి అపహరింపబడినను, ఒకవేళ నశించినను, నీవొక సామాన్యునివలె దుఃఖపడుట సరికాదు. ఎన్ని కష్టములు వచ్చినను నీవంటి పండితులు దుఃఖింపరు.

త్వద్విధా న హి శోచంతి సతతం సత్యదర్శినః
సుమహత్స్వపి కృచ్ఛ్రేషు రామానిర్విణ్ణదర్శనాః 66-14

విషయమును విమర్శించి సత్యమును తెల్సుకొనవలెను. పూర్వజన్మమున మనము కావించిన కర్మములనుబట్టి మంచిచెడ్డలు కలుగుచుండును. పూర్వజన్మకర్మములను ఇప్పటి అనుభవముల వల్ల తెలిసికొనగలమే గాని, ముందుగా ఎరుగనేరము. ఈ సత్యమును నీవే నాకనేక పర్యాయములు బోధించియున్నావు. నీకు నీతులు బోధింపజాలిన వాడొకడున్నాడా !

త్వమేవ హి పురా రామ మామేవం బహుశోన్వశాః
అనుశిష్యాద్ధి కో ను త్వామపి సాక్షాద్బృహస్పతిః 66-17

రామా ! నీవు మహాప్రాజ్ఞుడవు. నీకు తెలియనిది లేదు. ఇప్పుడు శోకమునందున్నావు. కావున నీ జ్ఞానము మరుగుపడియున్నది. విషయమును నీ జ్ఞప్తికి తెచ్చుచుంటినేగాని నీకు నేర్పుటకాదు.

రామా ! నీ పరాక్రమమును నీ శత్రువుమీద ప్రకటింపుము. లోకములను నాశనము చేయుపని ఏల? నీకపకారము చేసినవా డెవ్వడో తెలిసికొని వానిని వధింపుము.

రాముడు లక్ష్మణుని మాట నంగీకరించి ధనుస్సును విజ్యము చేసినాడు.

**రాముడు :** లక్ష్మణా ! సీతాన్వేషణమునకు మార్గము నాలోచింపుము.

**లక్ష్మణుడు :** ఈ జనస్థానమును గాలించి చూతము. ఇక్కడి గుహాలయందును కొండలమీదను అడవులలోను వెదకుదము. నీవు ధైర్యము వహింపుము. నీవంటివారు కష్టములు ఓర్చుకొనవలయును.

## రామలక్ష్మణులు జటాయువును కలిసికొనుట

రాముడు ధనుస్సున బాణమును తొడిగి లక్ష్మణసహితుడై బయలుదేరినాడు. ఇద్దరు వనములలో వెదకుచు నడచుటలో జటాయువు పడియుండిన ప్రదేశమునకు వచ్చినారు. జటాయువుయొక్క పర్వతాకారమైన శరీరము రక్తసిక్తమై యుండినది. రాముడు (జటాయువును పోల్చుకొనలేక కాబోలు) ఈ ఆకారమును చూచి లక్ష్మణునితో అనుచున్నాడు.

**రాముడు :** లక్ష్మణా ! ఇతడే సీతను భక్షించియుండును. ఎవ్వడో రాక్షసుడు ఈ గృధ్ర రూపముతో వచ్చి ఈ పని చేసియుండును. వీనిని వధింతును.

[మాయలేడి జ్ఞప్తికి వచ్చినది కాబోలు ! రాక్షసులు కామరూపులుగదా !]

ఈ మాట చెప్పి రాముడు ధనుస్సును గైకొని ఆ గృధ్రమును సమీపింపగా జటాయువు నురుగుతోకూడిన రక్తము క్రక్కుచు దీనుడై రామునితో అనుచున్నాడు.

**జటాయువు :** రామా ! మహౌషధిని వెదకునట్లు ఈ అరణ్యములో నీ వెవ్వతెను వెదకుచుంటివో ఆ సీతాదేవిని, నా ప్రాణములను ఈ రెంటిని రావణుడు అపహరించినాడు.

యా మోషధిమివాయుష్మ న్నన్వేషసి మహావనే
సా దేవీ మమ చ ప్రాణా రావణేనోభయం హృతం 67-15

మీరు లేనిసమయమున రావణుడు సీతాదేవిని అపహరించుకొనిపోవుట నేను చూచి రావణుని అడ్డగించి అతనితో యుద్ధము చేసితిని. వాని రథమును ముక్కలు చేసి

నాను. ధనుస్సు విరిచినాను. కవచమును ఛేదించినాను. సారథిని వధించినాను. అదిగో అటు చూడుము. అన్నియు అచ్చటనే పడియున్నవి. రావణుడు నా రెక్కలు నరికి సీతాదేవిని తీసికొని ఆకాశమార్గమున వెళ్ళినాడు. రాక్షసుడు సన్నిదివరకే హతము చేసియున్నాడు. నీవు మరల నన్ను హత మొనర్పకుము.

రక్షసా నిహతం పూర్వం న మాం హంతుం త్వమర్హసి. 67-20

రామునికి పట్టరాని దుఃఖము వచ్చినది. సీతాదేవి సమాచారమును తెలియజేసిన జటాయువు హతుడై యుండుట చూచి రాముడు రెండింతలుగా దుఃఖించినాడు. ధనుస్సును కడగా పెట్టి రాముడు జటాయుష్షను చూచి విలపించినాడు. లక్ష్మణుడును దుఃఖార్తుడైనాడు.

రాముడు: లక్ష్మణా! ఎంతకష్ట మెంతకష్టము! నేనెంత దౌర్భాగ్యుడను! రాజ్యము పోయినది. వనవాసము వచ్చినది. సీతను కోల్పోయితిని. జటాయువు చనిపోవుచున్నాడు. నా దౌర్భాగ్యము అగ్నినినైతము దహింపగలదు. నా పాదము సోకునేని నిండుసముద్రముకూడ ఎండిపోగలదు. నేను దుఃఖపరంపరలలో చిక్కువడినాను. నన్ను మించిన అభాగ్యుడు లోకములో ఉండడు. నా దురదృష్టము వల్లనే పాపము మన జటాయువునకు ఇట్టి దురవస్థ కలిగినది.

ఈ విధముగా విలపించి శ్రీరాముడు తన తండ్రి సఖుడైన జటాయువు శరీరమును ఎంతో ప్రేమతో నిమిరి గాఢముగా కవుగిలించుకొన్నాడు.

[సీతారాముల కవుగిలిభాగ్యము ననుభవించిన జటాయువు ఎంత ధన్యుడు!]

రాజ్యాద్భ్రంశో వనే వాస స్సీతా నష్టా ద్విజో హతః
ఈదృశీయం మమాలక్ష్మీ ర్నిర్దహేదపి పావకమ్. 67-24

సంపూర్ణమపిచే దద్య ప్రవిశేయం మహోదధిమ్
సోఽపి నూనం మమాలక్ష్మ్యా విశుష్యే త్సరితాం పతిః 67-25

నా స్త్యభాగ్యతరో లోకే మత్తోఽస్మిం త్సచరాచరే
యేనేయం మహతీ ప్రాప్తా మయా వ్యసనవాగురా. 67-26

అయం పితృవయస్యో మే గృధ్రరాజో జరాన్వితః
శేతే వినిహతో భూమౌ మమ భాగ్య విపర్యయాత్ 67-27

[శ్రీరాముడే ఇట్టి మాటలను పలికినచో సామాన్యులమాట ఏమిటి?

రాముడు: జటాయుః! నీకు మాటలాడు శక్తి కలదేని సీత సమాచారము, రావణుని వృత్తాంతము చెప్పుము. రావణుని నివాస మెచ్చట? అత డెట్టివాడు?

జటాయువు : (దీనముగా) రాక్షసుడు తన మాయచేత మేఘములను కల్పించి, గాలిని పుట్టించి, గాఢాంధకారము గావించి సీతాదేవిని తీసికొని గగనమార్గమున వెళ్ళినాడు.

[ఈ చీకటి వల్లనే జటాయువు రావణాసురుని ముందుగా చూడజాలక పోయెను కాబోలు]

హృతా సా రాక్షసేంద్రేణ రావణేన విహాయసా
మాయా మాస్థాయ విపులాం వాతదుర్దిన సంకులామ్. 68-9

రావణుడు నా రెక్కలను ఖండించి సీతాదేవిని గైకొని దక్షిణదిశగా వెళ్ళినాడు.

రామా! నాకన్నులు తిరుగుచున్నవి. ఊపిరి ఆడుటలేదు. రావణుడు సీతాదేవిని అపహరించిన ముహూర్తము 'వింద' ముహూర్తము. అది మంచివేళ. నష్టవస్తువు స్వామిని తప్పక చెందును. నీవు సీతాదేవినిగూర్చి దుఃఖపడకుము. ఆ రాక్షసుని నీవు యుద్ధమున వధించి, సీతాదేవిని తెచ్చుకొని, సుఖముగా నుండగలవు.

న చ త్వయా వ్యథా కార్యా జనకస్య సుతాం ప్రతి
వైదేహ్యా రంస్యసే క్షిప్రం హత్వా తం రాక్షసం రణే. 68-14

రావణుడు విశ్రవసుని కుమారుడు. కుబేరుని తమ్ముడు..........రాముడు ఊకొట్టుచునేయున్నాడు. ఇంతలో మాట నిల్చినది. జటాయువు ప్రాణము పోయినది. రాముడు ఎంతో దుఃఖపడినాడు.

రాముడు : లక్ష్మణా! చూచితివా! ఈ గృధ్రరాజు నాకు ఉపకారము చేయబూనుకొని ప్రాణములు కోల్పోయినాడు. తన రాజ్యమును విడిచివచ్చి, నా నిమిత్తమై ప్రాణము అర్పించినాడు. సాధువులు, ధర్మవర్తనులు, శూరులు, శరణ్యులు మృగములలోను పక్షులయందునైతము కనబడుచున్నారు.

సర్వత్ర ఖలు దృశ్యన్తే సాధవో ధర్మచారిణః
శూరా శ్శరణ్యా స్సౌమిత్రే తిర్యగ్యోనిగతేష్వపి. 68-25

జటాయువు తన ప్రాణములను నాకుగా ధారవోసినాడు. అతని మరణమువలన నాకు కలిగిన దుఃఖము సీతాపహరణమువలన కలిగినదానికన్న మిన్నయై యున్నది. జటాయువు మన తండ్రివలె పూజింపదగినవాడు.

రాజా దశరథశ్శ్రీమాన్ యథా మమ మహాయశాః
పూజనీయశ్చ మాన్యశ్చ తథాఽయం పతగేశ్వరః 68-26

లక్ష్మణా! కట్టెలు తెచ్చి చితి పేర్చుము. మథనమున అగ్నిని సృజించి నా నిమిత్తమై మరణించిన జటాయువునకు అగ్నిసంస్కారము కావింతును.

జటాయూ! నేను అనుజ్ఞ నిచ్చినాను. నీవు నాచే సంస్కరింపబడి యజ్ఞములు చేసినవారు, ఆహితాగ్నులు, ఉత్తమ సన్యాసులు, భూదాన మొనర్చువారు ఏయే ఉత్తమలోకములను పొందుదురో ఆ లోకములు నీవు పొందుదువుగాక!

యా గతి ర్యజ్ఞశీలానా మాహితాగ్నేశ్చ యా గతిః
అపరావర్తినాం యా చ యా చ భూమి ప్రదాయినామ్ 68-29

మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకా ననుత్తమాన్
గృధ్రరాజ మహాసత్త్వ సంస్కృతశ్చ మయా వ్రజ. 68-30

ఇట్లు పలికి శ్రీరాముడు జటాయువు తనువును చితిమీద చేర్చి దహనము చేసి, ప్రియబంధువునకు చేసినట్లు సంస్కారము కావించి విలపించినాడు. ఒక రోహిని (కేసరీ మృగమును) చంపితెచ్చి దానిమాంసమును ముద్దలుచేసి రాముడు పిండప్రదానము చేసినాడు. వేదమంత్రములను జపించి జటాయువును స్వర్గమున కంపినాడు.

రామలక్ష్మణులు గోదావరి కరిగి స్నానములు చేసి జటాయువునకు జలతర్పణములు కావించినారు.

జటాయువు యుద్ధరంగమున మరణించి, ఈ లోకమున కీర్తి సంపాదించి రామునిచే సంస్కారము పొంది, పుణ్యలోకమున కేగెను.

[శ్రీరాముడు జటాయువును పితృతుల్యునిగా గౌరవించినాడు. తనకై ప్రాణము లర్పించిన ఒక పక్షియెడ రాము డెంత అనుగ్రహము చూపెనో గమనింపదగియున్నది. ఒక క్షణముక్రిందట తన దౌర్భాగ్యమునుగూర్చి నిందించుకొన్న రాముడు మరుక్షణమున జటాయువుతో "నేను అనుజ్ఞ ఇచ్చినాను. స్వర్గమునకు పొమ్ము" అని చెప్పి జటాయువును స్వర్గమునకు పంపగలిగినాడు. శ్రీరాముని మహానుభావత అట్టిది!]

## అ యో ము ఖి

రామలక్ష్మణులు సీతాదేవిని వెదకుచు, దండకారణ్యమును దాటి, జనస్థానమునకు మూడు క్రోసుల దూరమునందున్న క్రౌంచారణ్యమునకు వచ్చినారు. పిమ్మట తూర్పుగా మూడు క్రోసులు నడచి క్రౌంచారణ్యమును దాటి, మతంగాశ్రమ ప్రాంతమునకు వచ్చినారు. అక్కడి అడవి మిక్కిలి దట్టమైనది. భయంకరమైనది. అందు పాతాళమువంటి ఒక గుహ కానవచ్చినది. చీకటిమయమై యున్నది. ఆ గుహచెంత,

వికార స్వరూపిణియు, భయంకరాకారయు అయిన ఒక రాక్షసి కనబడినది. లక్ష్మణుడు ముందు నడచుచున్నాడు. ఆ రాక్షసి లక్ష్మణుని పట్టుకొని గాఢముగా కవుగిలించుకొని "నాథా! నా పేరు అయోముఖి. నీవు నా ప్రియుడవు. మన మీ పర్వతప్రాంత వనము లందు విహరించుచు కాలము సుఖముగా గడపుదము" అని చెప్పినది. లక్ష్మణుడు కత్తి దూసి దాని ముక్కు చెవులు ఖండించినాడు.

[ఈ పని లక్ష్మణునికి క్రొత్త కాదు.]

రాక్షసి విలపించుచు పాఱిపోయినది.

రామలక్ష్మణులు అడవిలో నడువసాగినారు.

లక్ష్మణుడు : రామా! నా ఎడమభుజ మదరుచున్నది. మనస్సు కలతపడినది. దుశ్శకునములు కనబడుచున్నవి. యుద్ధము తటస్థించునట్లు తోచుచున్నది. నీవు ధనుస్సును సజ్యము గావించి సంసిద్ధుడవై యుండుము. ఈ వంచులకపక్షి అఱపు మనకు జయమును సూచించుచున్నది.

## కబంధుడు

ఇంతలో ఆ యడవినంతయు విఱిచినట్లు గొప్పధ్వని యొకటి వినబడినది. ఈ ధ్వని ఎచ్చట పుట్టినదా యని చూచినారు. ఒకపొదలో ఒక రాక్షసుడు కనిపించినాడు. అతడే కబంధుడు. వానినోరు కడుపులోనున్నది. అతనికి తలగాని మెడగానిలేదు. వక్షస్థలమున ఒకకన్నుమాత్ర మున్నది. చేతులు ఒక్కొక్కటి ఒక యోజనము నిడివి. పెద్ద కోఱలతో ఘోరరూపముతో ఉన్నాడు. సింహములను, ఏనుగులను, ఎలుగుబంట్లను భక్షించుచున్నాడు. రామలక్ష్మణుల దారిని అడ్డగించి కబంధుడు తనచేతులతో వారిని ఆకర్షించినాడు. రాముడు ధైర్యము వీడలేదు. లక్ష్మణుడుమాత్ర మించుక జంకినాడు.

లక్ష్మణుడు : రామా! ఈ మహాభూతమునకు నన్ను బలియిచ్చి నీవు పొమ్ము. సీతాదేవి నీకు త్వరలోనే లభింపగలదు. నీవయోధ్యకు పోయి రాజ్య మేలుచున్నప్పుడు నన్ను మరచిపోకుము సుమా!

రాముడు : లక్ష్మణా! ఏమిమాటలివి! నీ వేమియు భయపడకుము. నీవంటి ధీరునికి ఇట్టి విషాదము తగునా!

ఇంతలో కబంధుడు రామలక్ష్మణులతో అనుచున్నాడు.

కబంధుడు: ఎవరు మీరు ? ధనుర్బాణములను ఖడ్గములను ధరించి ఇక్కడి కేల వచ్చినారు? నా ఆకలి తీర్చుటకేనా! మీరు నా నోటిదగ్గరకు వచ్చియున్నారు. ఇక ప్రాణములతో మరలి పోజాలరు.

ఈ మాటలు విన్న రామునికి సైతము నోట తడి యారిపోయినది.

రాముడు: లక్ష్మణా! సీతను కనుగొనకయే ప్రాణము విడువవలసిన కాలము వచ్చినది కాబోలు! కష్టములు ఒకదానివెంబడి మరియొకటి నన్ను తరుముకొని వచ్చుచున్నవి. ఆహా! కాలమున కెంత ప్రభావము! కాలమునకు సాధ్యముకాని పని లేదు. మన ప్రయత్నము లన్నియు ఇసుకతో కట్టిన ఆనకట్టలవంటివి. ఎంతటి శూరు లైనను, వీరు లైనను కాలమునకు కట్టుబడవలసినదే.

శూరాశ్చ బలవంతశ్చ కృతాస్త్రాశ్చ రణాజిరే
కాలాభిపన్నా సీదంతి యథా వాలుకసేతవః 69-50

కబంధుడు: ఆకలి నన్ను దహించుచున్నది. నా ఆకలి తీర్చుటకు వచ్చి మీ రేల నన్ను చూచుచు నిలబడియున్నారు ?

లక్ష్మణుడు: రామా! ఈ రాక్షసుడు మనలను మ్రింగజూచుచున్నాడు. వాని రెండు చేతులను ఖండించుటయే మనము చేయవలసిన పని.

కంబధుడు కోపించి నోరుతెరచి రామలక్ష్మణులను మ్రింగబోయినాడు. కబంధుని కుడిభుజమును రాముడును, ఎడమభుజమును లక్ష్మణుడును ఖండించినారు. కబంధుడు గట్టిగా అరచి తూలి, సోలి, దీనుడై "మీ రెవరు" అని అడిగినాడు.

లక్ష్మణుడు: ఈ వీరుని పేరు రాముడు. ఇక్ష్వాకు వంశస్థుడు. నేను ఆయన తమ్ముడను. నా పేరు లక్ష్మణుడు. మా యన్న భార్యను ఒక రాక్షసుడు అపహరించినాడు. మే మామెను వెదకుచున్నాము. నీ వెవ్వడవు? కబంధరూపమున ఈ యడవిలో ఎందు కున్నావు ?

లక్ష్మణుని మాటలు విన్నంతనే కబంధునికి పూర్వజన్మస్మృతి కలిగినది. ఇంద్రుడు తనతో చెప్పినమాటలు వానికి జ్ఞప్తికి వచ్చినవి.

కబంధుడు: (సంతోషముతో) పురుషశ్రేష్ఠులారా! మీకు స్వాగత మగును గాక! నా భాగ్యవిశేషమున, మీ దర్శనము లభించినది. నా సుకృతమువల్లనే నా భుజములు మీరు ఖండించినారు. నా కీ రూపము కలిగిన కారణమును వినుడు. పూర్వము నేను దివ్యరూపము గలవాడను. నా పరిహాస గుణము నన్నింతకు

తెచ్చినది. ఇప్పటి యీ భయంకర రూపమును దాల్చి ఋషులను భయపెట్టు చుండువాడను. ఒకనాడు 'స్థూలశిరుడు' అను ఋషిపైకి ఇట్లే వెళ్ళినాను. ఆయన కోపించి "నీకు ఎల్లప్పటికిని ఈ వికారరూపమే ఉండుగాక" అని శపించినాడు. ఈ శాపమునకు విమోచనము కలిగింపు డని నేను ప్రార్ధించినాను. "రాముడు నిర్జన మగు అరణ్యమున ఏనాడు నీభుజములు ఖండించి నీకు దహన సంస్కారము చేయునో ఆనాడు నీకు శాపవిమోచనము కలిగి నీదివ్య రూపమును పొందగలవు" అని ఆ ఋషీశ్వరుడు అనుగ్రహించినాడు.

రామా! నేను దనువు వంశస్థుడను. మా తండ్రి పేరు (శ్రీ) నాకు ఇంద్రుని శాపముకూడ ఒకటి కలదు. నేను గొప్పతపస్సు చేసి బ్రహ్మచే దీర్ఘాయువును పొందినాను. "నాకు దీర్ఘాయుః కలదుగదా! నన్ను ఇంద్రుడు మాత్ర మేమి చేయగలడు" అని గర్వించి ఇంద్రునితో యుద్ధమాడుటకు వెళ్ళినాను. ఇంద్రుడు నా మీద వజ్రాయుధమును ప్రయోగించినాడు. ఆ దెబ్బకు నా తల, నా తొడలు నా శరీరములోపలికి చొచ్చుకొని పోయినవి. ఇట్లయినపిమ్మట బ్రతికియుండుట కిచ్చగింపక నన్ను వధింపు మని ఇంద్రుని ప్రార్థించినాను. "బ్రహ్మదేవుని మాట అసత్య మగునా! నీకు బ్రహ్మదేవుడు దీర్ఘాయుః ప్రసాదించియున్నాడు గనుక నిన్ను వధించుటకు వీలులేదు. నీ విట్లు ఉండవలసినదే" అని ఇంద్రుడు చెప్పినాడు. "తినుటకు నోరుకూడ లేదుకదా! ఆహారము లేక నే నెల్లకాలము ఎట్లుండగలను" అని మొరపెట్టుకొనగా ఇంద్రుడు నాకీ దీర్ఘబాహువుల నిచ్చి కోరలు గల యీ నోటిని నా కడుపులో ఏర్పరచి "రామలక్ష్మణులు నీ చేతులను ఏనాడు ఖండింతురో ఆనాడు నీవు స్వర్గమునకు రాగలవు" అని ఇంద్రుడు సెలవిచ్చినాడు. శాపహతుడనై నే నీ అడవికి వచ్చి సింహములను, ఏనుగులను, వ్యాఘ్రములను, ఇతర మృగములను నా చేతులతో ఆకర్షించి వానిని తినుచు కాలము గడపుచున్నాను. ఆనాటినుండియు "రామలక్ష్మణులు ఎన్నడు వత్తురా" అని మీ కొరకు ఎదురు చూచుచున్నాను. రామా! నీవా ఆ రాముడవు! నీకు మంగళ మగుగాక! నీవుతప్ప మరి యెవ్వరును నన్ను వధింపలేరు. ఈ మాటనే నన్ను శపించిన మహర్షి చెప్పియున్నాడు. మీరు నాకు అగ్నిసంస్కారము కావించి కృతార్థుని చేయుడు. నేను మీకు మతిసాచివ్యము చేయుదును. మీ కొక మిత్రుని చూపెదను.

అహం హి మతిసాచివ్యం కరిష్యామి నరర్షభ
మిత్రం చైవోపదేక్ష్యామి యువాభ్యాం సంస్కృతోఽగ్నినా. 71-19

రాముడు: నా భార్యను అపహరించిన రావణుని పేరు మాత్రము తెలిసినది. అతని నివాసముగాని రూపముగాని ప్రభావముగాని తెలియలేదు. మేము ఆర్తిలో

నున్నాము. నీవు మా యందు దయ యుంచి మాకు సహాయము చేయవలయును. మేము నిన్నొక పల్లములో పెట్టి అగ్నిసంస్కారము చేయుదుము. నీవు మాకు సీత సమాచారము చెప్పి ఉపకార మొనర్పుము.

*కబంధుడు* : రామా! నా కిప్పుడు దివ్యజ్ఞానము లేదు. శాపమువలన ఆ శక్తి నశించినది. కావున సీతాదేవి వృత్తాంతము నాకు తెలియదు. మీరు నన్ను దహించిన పిదప, నేను నా నిజరూపమునుపొంది సీతావృత్తాంతమును మీకు చెప్పదగిన యతనిని సూచింపగలను. సూర్యాస్తమయవేళకు ముందే నాకు అగ్నిసంస్కారము కావింపుడు. మీకు ఉపయోగపడు మిత్రుని మీకు ఎరుకపరచెదను. అతడు కారణాంతరమున లోకమంతయు సంచరించియున్నాడు. అతనికి తెలియని దేమియు లేదు.

రామలక్ష్మణులు కబంధుని శరీరమును ఒక పల్లమునం దుంచి దహనము చేసినారు. కబంధుడు నిజరూపమును పొంది విమానము నెక్కిపోవుచు అంతరిక్షమున నిల్చి,

*కబంధుడు* : శ్రీరామా! సీతాదేవి సమాచారము తెలిసికొనుటకు నీ కొక ఉపాయమును చెప్పుచున్నాను వినుము. సంధి, విగ్రహము, మొదలైన ఆరు ఉపాయముల చేతనే రాజులు తమ కార్యములను చక్కబెట్టుకొందురు. కష్టములో నున్నవాడు తనవలెనే కష్టములో నున్నవానితో స్నేహము చేసికొని కార్యమును సాధింపగలడు.

**పరిమృష్టో దశాంతేన దశాభాగేన సేవ్యతే.** 72-8

నీవిప్పుడు కష్టములో నున్నావు. సుగ్రీవు డను ఒక వానరు డున్నాడు. వాలి తమ్ముడు. సుగ్రీవుడు వాలిచే తరుమబడి నలుగురు మంత్రుల గూడి పంపాసరస్సుచెంత నున్న ఋశ్యమూకపర్వతముమీద నివసించుచున్నాడు. సుగ్రీవుడు సత్యసంధుడు. వినీతుడు. బలపరాక్రమశాలి. సీతాన్వేషణమున నీకు సహాయపడగలడు. రామా! నీవు దుఃఖపడకుము. శీఘ్రముగా వెళ్ళి సుగ్రీవుని కలిసికొని అతనితో అగ్నిసాక్షిగా స్నేహము గావింపుము. అట్లైన ఎవరికిగాని ద్రోహబుద్ధి కలుగకయుండును.

**వయస్యం తం కురు క్షిప్ర మితో గత్వాద్య రాఘవ**
**అద్రోహాయ సమాగమ్య దీప్యమానే విభావసౌ.** 72-17

సుగ్రీవుడు సామాన్యుడు కాడు. అతడు వానరమాత్రుడుకదా యని అవమానింప దగదు. సుగ్రీవుడు వానరరాజు. కామరూపి. కృతజ్ఞుడు. అతడు మీ సహాయము నర్థింపగలడు.

స చ తే నావమంతవ్య స్సుగ్రీవో వానరాధిపః
కృతజ్ఞః కామరూపీ చ సహాయార్థీ చ వీర్యవాన్. 72-18

సుగ్రీవుడు సూర్యుని ఔరసపుత్రుడు. సుగ్రీవునికిని అతని అన్న వాలికిని వైర మేర్పడియున్నది. సుగ్రీవుడు పంపాసరస్సు సమీపమున ఋశ్యమూకపర్వతమున నివసించుచున్నాడు. నీవు వెళ్లి, అగ్నిసాక్షిగా సత్యప్రమాణముచేసి, అతనితో స్నేహము చేసికొనుట ముఖ్యము. సుగ్రీవుడు రాక్షసు లుండు ప్రదేశము లన్నియు చక్కగా ఎరిగిన వాడు. అతనికి తెలియని ప్రదేశము ఈలోకమున లేదు. అన్నిచోట్లను వెదకించి సీతా దేవి ఎందున్నదో తెలిసికొనగలడు. వానరసైన్యములను పంపి వెదకింపగలడు. నిర్మల యైన సీతాదేవిని రావణాలయమున కనుగొనగలడు.

స జ్ఞాస్యతి వరారోహాం నిర్మలాం రావణాలయే 72-26

సీతాదేవి పాతాళమందున్నను, మేరుపర్వతముపై నున్నను, సుగ్రీవుడు కనుగొని, రాక్షసులను వధించి, సీతాదేవిని తెచ్చి నీకు సమర్పింపగలడు.

రామా! అవిగో అటు పడమటిదిక్కున చెట్లు గుంపుగా కనబడుచున్నవి చూడుము. ఆదారిబట్టి ప్రయాణము చేయుడు. ఆ వనమునందలి వృక్షములు అన్ని ఋతువులలోను ఫలించును. ఆ చెట్లను దాటి కొండలమీదుగా, చెట్లగుండా, వెళ్ళినచో పంపాసరస్సు కనబడును. అక్కడ హంసలు, క్రౌంచపక్షులు, కన్నుల కానందము కలిగింపగలవు. పంపా సరోవరమున నానాజాతుల మీనవిశేషము లున్నవి. జలములు చల్లగాను స్వచ్ఛముగాను ఉండును. ఆ సరస్సుచెంత సాయంకాలమున సంచరించి, పుష్పమాలికలు ధరించియున్న అచ్చటి వృక్షములను వీక్షించి సరస్సునందలి శీతల నిర్మలోదకములను చూచినంతనే నీ దుఃఖము తీరిపోవును.

సాయాహ్నే విచరన్ రామ విటపీ న్మాల్యధారిణః
శీతోదకం చ పంపాయా దృష్ట్వా శోకం విహాస్యసి. 73-20

రామా! అక్కడి పుష్పములు వాడిపోవునవి కావు. చెట్లపైనుండి రాలునవి కావు. అక్కడ, మతంగ మహాముని శిష్యులైన మహర్షులు అనేకులు ఉండినారు. వారు తమ గురువుగారికి వన్యపదార్థములను కొనిపోవుటలో వారికి చెమట పట్టి, ఆ స్వేదబిందువులు క్రింద పడగా, వారి తపః ప్రభావముచేత ఆ బిందువు లన్నియు పుష్పము లైనవి. అవి వాడిపోవు.

మతంగ మహాముని శిష్యు లందరును స్వర్గస్థులైనారు. వారి పరిచారిణి శబరి మాత్రము ఇప్పుడుకూడ అచ్చటనే యున్నది. సర్వభూత నమస్కృతుడవైన నీ దర్శన భాగ్యమునకు వేచియున్నది. నీ దర్శనము చేసికొని స్వర్గమున కరుగగలదు.

తేషాం గతానా మద్యాపి దృశ్యతే పరిచారిణీ
శ్రమణీ శబరీ నామ కాకుత్స్థ చిరజీవినీ 73-25
త్వాం తు ధర్మే స్థితా నిత్యం సర్వభూత నమస్కృతమ్
దృష్ట్వా దేవోపమం రామ స్వర్గలోకం గమిష్యతి. 73-26

పంపాసరస్సు పడమటితీరమునకు వెళ్ళుదురేని, మీకు ఆశ్రమము కానబడును. ఆ యాశ్రమము రహస్యమైన ప్రదేశమునం దున్నది. ఆ యడవిలో ఎన్నో ఏనుగు లున్నవి. కాని, మతంగమహాముని ప్రభావముచే ఒక్క ఏనుగైనను ఆశ్రమమున అడుగు పెట్టదు. అక్కడి వనము రమ్యమై నందనవనము మొదలైన దివ్యవనములవలె ఆనందము గొలుపుచుండును. అక్కడికి వెళ్లినంతనే నీ దుఃఖము తీరిపోవును.

ఋశ్యమూక పర్వతము పంపాసరోవరమునకు ముందరితట్టుగా నుండును. ఋశ్యమూక పర్వత శిఖరమున శయనించినవాడు ధనమును పొందినట్లు కల గనునేని మేల్కాంచిన పిదప ఆ ధనమును తప్పక పొందగలడు.

శయానః పురుషో రామ తస్య శైలస్య మూర్ధని
య త్స్వప్నే లభతే విత్తం త త్ప్రబుద్ధోధిగచ్ఛతి. 73-32

కాని పాపము చేసినవాడుగాని, దురాచారుడుగాని ఆ పర్వతము నెక్కజాలడు. ఎక్కినచో మరణించుట నిశ్చయము.

రామా! ఆ పర్వత శిఖరమున ఒక గుహ కలదు. దాని ముఖద్వారము పెద్ద శిలతో మూయబడియుండును. ఆ గుహకు తూరుపుగా ఒక మడుగున్నది. అందలి జలములు చల్లగా, రుచ్యముగా నుండును. దాని చుట్టును ఫల పుష్ప భరితములైన వృక్షములు రమ్యదృశ్యములై యుండును. అక్కడికి పోవుట సులభము కాదు. సుగ్రీవుడు నలుగురు వానరులతో ఆ గుహయందు నివసించుచుండును. ఎప్పుడైన పర్వతముమీద సంచరించుచుండును. నీవు వెంటనే వెళ్ళి సుగ్రీవునితో స్నేహము చేసికొనుము. నీకు కార్యసిద్ధి యగును.

ఈ హితవాక్యములు పలికి కబంధుడు స్వర్గమునకు వెళ్ళినాడు.

[కబంధుని కథలో కొన్ని విశేషము లున్నవి. సాధువులను అవమానించుటవలన కలుగు ఆపద సూచితమైనది. అంతకన్న విశేషము మరియొక్కటి కలదు. బ్రహ్మను వరము కోరి కబంధుడు దీర్ఘాయువును సంపాదించినాడు. ఆ వరమే అతనికి ముప్పు తెచ్చినది. చావగోరినను చచ్చుటకుకూడ సాధ్యపడలేదు. తనకు ఏది మేలని తలచినాడో అదియే తనకు కీడయినది. మనకు ఏది మేలో మనము తెలిసికొనలేము. కావున, 'అదికావలయును ఇదికావలయును' అని పేరు బెట్టి దేనినిగాని కోరుకొనకూడదు. భగవంతుడు మనకు సర్వవిధములను క్షేమము నే

కలుగజేయు నని విశ్వసించి మన మంచిచెడ్డల నిర్ణయమును భగవంతునికే వదలిపెట్టినయెడల మనము సుఖముగా నుండవచ్చును. ఈ నీతి సంపాతి కథలోకూడ కానవచ్చును.]

రామలక్ష్మణులు పడమటిదిక్కుగా నడచి పంపాసరస్సుకు బయలుదేరినారు. ఆరాత్రి పర్వతముమీదనే విశ్రమించి మరునాడు పంపాసరస్సు పశ్చిమతీరమునకు చేరుకొన్నారు.

## శ బ రి

అక్కడయుండిన శబరి ఆశ్రమమును చూచినారు. ఆశ్రమము వృక్షసమూహములతో నిండి మనోహరముగానున్నది. రామలక్ష్మణులు శబరిని చూచినారు. శబరి కడు వృద్ధురాలు. జటాజినములు దాల్చియున్నది.

శబరి రామలక్ష్మణులకు నమస్కరించి వారికి అతిథి సత్కారము చేసినది. పంపాతీర వృక్షములనుండి తాను సేకరించిన మధురఫలములను వారికి నివేదించినది. రామలక్ష్మణులు వానిని ప్రీతితో గైకొని ఆరగించినారు.

**రాముడు** : శబరీ! నీ తపస్సు నిర్విఘ్నముగా జరుగుచున్నదా! నీ గురుశుశ్రూష ఫలించినదా! నీ మనస్సుకు శాంతి కుదిరినదా!

**శబరి** : రామప్రభూ! నీ దర్శన భాగ్యమువలన నా కన్నియు చేకూరినట్లే అయినది. దేవవరుడవైన నిన్ను పూజించుటవలన నా జన్మ సఫలమైనది. నీ చల్లని చూపు చేత నా పాపము లన్నియు నశించి నేను పునీతురాల నైతిని. నీ ప్రసాదమువలన నేను ఉత్తమ లోకములకు వెళ్లగలను.

> చక్షుషా తవ సౌమ్యేన పూతాస్మి రఘునందన
> గమిష్యా మ్యక్షయాన్ లోకాన్ త్వత్ప్రసాదా దరిందమ. 74-13

ఈ ఆశ్రమమునందుండిన మతంగముని శిష్యులు నీవు చిత్రకూటమునకు వచ్చినప్పుడే స్వర్గమునకు వెళ్ళినారు. వారు వెళ్లునప్పుడు నాతో చెప్పిన మాటలను మనవి చేయుచున్నాను. "శబరీ! నిన్ను చూచుటకు శ్రీరాముడు లక్ష్మణ సహితుడై ఈ యాశ్రమమునకు రాగలడు. నీవు శ్రీరాముని దర్శనము చేసికొని ఉత్తమలోకములకు పోగలవు" అని చెప్పినారు. అప్పటినుండియు మీ కొరకు పలువిధములైన మధుర ఫలములను సేకరించియుంచి మీ రాకకు నిరీక్షించుచున్నాను. ఈనాటికి ఆ మహాభాగ్యము చేకూరినది.

**రాముడు** : శబరీ! నీ ప్రభావమును కబంధుడు చెప్పగా విన్నాను. నీ కిష్టమగునేని ఇచ్చటి ప్రభావములను కన్నులార చూడగోరుచున్నాను.

ఈ మాటలు విని శబరి సంతోషించి రామలక్ష్మణులకు మతంగవనమును, ఆశ్రమమును చూపించుచున్నది.

*శబరి:* రామప్రభూ! నా గురువులు ఇక్కడ ఎన్నో యజ్ఞములు చేసినారు. ఇక్కడి మునులు వయోవృద్ధులై ఉపవాసములచేత కృశించి నడచుటకు వారికి శక్తి తగ్గినందున వారు సంకల్పమాత్రముననే సప్తసముద్రములను ఆశ్రమమునకే రప్పించియున్నారు. వారు ఆ సముద్రజలములలో స్నానము చేసి చెట్లమీద ఆరవేసిన వల్కలములు ఇప్పటికిని తడిగానే యున్నవి చూడుము. దేవపూజకుగా వారు తెచ్చిన విడిపువ్వులుగాని పుష్పమాలలుగాని ఇప్పటికిని వాడిపోలేదు చూడుము. ఇదంతయు వారి తపోమహిమ.

రామచంద్రమూర్తీ! నీ దర్శనమున కృతార్థురాల నైతిని. నాకు అనుజ్ఞ నిత్తువేని ఈ శరీరమును విడిచి మా గురువులచెంతకు పోగోరుచున్నాను.

*రాముడు:* శబరీ! నీవు నన్ను భక్తితో పూజించితివి. నీవు సుఖముగా ఉత్తమలోకముల కరుగుము.

శబరి తన శరీరమును అగ్నిహోత్రమున హోమము చేసి దివ్యశరీరమును పొంది స్వర్గమున కరిగినది. మహాత్ములైన ఆ ఋషుల ప్రభావమును తలచుకొని రామలక్ష్మణులు ఆశ్చర్యచకితు లైనారు.

*రాముడు:* లక్ష్మణా! ఈ మహాత్ముల ఆశ్రమమును సందర్శించితిమి. సప్తసముద్రములలో స్నానము చేసితిమి. పితృతర్పణముకూడ చేసితిమి. మన అశుభము లన్నియు నశించినవి. మనకు మేలుకాలము వచ్చినది. నామనస్సు ప్రసన్నముగా నున్నది. మనము సుగ్రీవుని త్వరగా కలిసికొనవలయును.

*లక్ష్మణుడు:* సుగ్రీవుని కలిసికొనుటకు నేనుకూడ కుతూహల పడుచున్నాను.

రామలక్ష్మణులు పంపాసరస్సుచెంతకు వెళ్ళినారు.

*రాముడు:* లక్ష్మణా! సుగ్రీవు డుండుట ఈ పర్వతము మీదనేగదా! ఈ పంపాసరోవరము ఎంతమనోహరముగ నున్నది!

రమణీయమైన పంపా సరస్సును తిలకించి రామలక్ష్మణుల మనస్సులు ప్రసన్నము లయినవి. వారు దుఃఖమును వీడి సుఖముగా నున్నారు.

తతో మహద్వర్త్మ సుదూర సంక్రమః
క్రమేణ గత్వా ప్రవిలోకయ న్వనం
దదర్శ పంపాం శుభదర్శకాననా
మనేక నానావిధ పక్షిజాలకామ్. 75-30

ఓం తత్సత్

శ్రీ రా మా య న మః

# శ్రీమద్వాల్మీకి రామాయణ కథామృతము

## కి ష్కిం ధా కాం డ ము

### శ్రీరాముని లక్ష్మణుడు ఊరడించుట

స తాం పుష్కరిణీం గత్వా పద్మోత్పలఝషాకులామ్
రామ స్సౌమిత్రి సహితో విలలా పాకులేన్ద్రియః 1-1

శ్రీరామలక్ష్మణులు పంపాసరోవరము చెంతకు వచ్చినారు. పంపా సరస్సు కమలములతోను నల్ల కలువలతోను నిండియుండి ఎంతో శోభిల్లు చుండినది. అది వసంతఋతువు. సరోవరవన మంతయు పుష్పములతో నిండి మనోహరముగా నున్నది. ఆ పుష్కరిణిని, ఆ వనమును, చూచిన రామునికి హాయి అనిపించినది. కాని ఆ సుఖము ఎక్కువసేపు ఉండలేదు. రాముడు విరహాతప్తుడై సీతాదేవిని తలచుకొని విలపింప సాగినాడు.

రాముడు : లక్ష్మణా ! ఈ సరోవరము, ఈవనము ఎంత హృదయంగమముగా నున్నవో చూడుము. ప్రతి వృక్షము పుష్పములతో నిండియున్నది. గాలికి పూవులు రాలుట చూడగా చెట్లు పుష్పవర్షమును కురియుచున్న ట్టున్నది. పసుపుగాను, నల్లగాను, నానా వర్ణములతోను కూడియున్న పుష్పములు రాలి క్రిందపడి ఈ పచ్చిక నేలమీద రత్న కంబళులు పరచినట్లు కానవచ్చుచున్నది. మంద మారుతము ఎంత మనోజ్ఞముగా నున్నది !

భరతుని గూర్చిన చింతవలనను సీతా వియోగమువలనను పరితపించుచున్న నాకు కొంత సుఖము కలిగించుచున్నను ఈ వసంతము సీతా విరహితుడ నైన నా శోకమును వృద్ధిచేయుచునే యున్నది.

అయం వసంత స్సౌమిత్రే నానా విహగ నాదితః
సీతయా విప్రహీణస్య శోకసందీపనో మమ. 1-22

శోక సంతప్తుడ నగు నన్ను మన్మథుడు మరింత పీడించుచున్నాడు. ఈ కోకిల, యీ నీరుకోడి నా బాధను చూచి నన్ను వెక్కిరించుచు అరచుచున్నవి. సీతను గానక నేను బ్రతికియుండుట ఎందుకా అని తోచుచున్నది. వసంతముపై సీతకు కూడ ఎంతో ప్రీతి.

కంటికి కానరాని సీతయు, కానవచ్చుచున్న ఈ వసంతము నన్ను అమితముగా బాధించుచున్నవి.

ఆ నెమలి తన రంగుల రెక్కలను విప్పుకొని, తన ప్రియురాలిని చెంత నుంచుకొని ఎట్లు నృత్యము చేయుచున్నదో చూడుము. తన భార్యను ఏరాక్షసుడుగాని అపహరింపలేదు గనుక అట్లు ఆనందముతో ప్రియురాలిని గూడి నృత్య మొనర్చుచున్నది.

మయూరస్య వనే నూనం రక్షసా న హృతా ప్రియా
తస్మా న్నృత్యతి రమ్యేషు వనేషు సహకాంతయా. 1-40

నా భార్యను రాక్షసుడు అపహరింపకుండిన, నేను సీతను గూడి ఈ మధుమాసమున సుఖముగా నుండువాడనుగదా! లక్ష్మణా! ఈ వనకారును ఈ వనమున గడపుట సులభముకాదు.

మమ త్వయం వనేవాసః పుష్పమాసే సుదుస్సహః 1-41

లక్ష్మణా! ఈ పుష్పములను చూచితివా! రాలిపడిపోయి వ్యర్థ మగుచున్నవి. సీత ఎందున్నదో అచ్చటగూడ ఈ వసంత ముండునుకాబోలు! పాపము! నావలెనే సీత సైతము ఈ వసంతమున బాధపడుచుండును.

వసంతో యది తత్రాపి యత్ర మే వసతి ప్రియా
నూనం పరవశా సీతా సాపి శోచ త్యహం యథా. 1-46

నా వియోగమును భరింపజాలక సీత తన ప్రాణములను విడిచియుండును. సీత నా యెడ గాఢానురాగము గలది. నాకును సీతయెడ దృఢమైన ప్రణయము కలదు. కావున మేము విడివడి జీవింపలేము.

మయి భావస్తు వై దేహ్యా స్తత్త్వతో వినివేశితః
మమాపి భావ స్సీతాయాం సర్వథా వినివేశితః. 1-51

పుష్పములమీదుగా వీచుచున్న ఈ చల్లనిగాలి సీతను తలచుకొనుచున్న నా శరీరమునకు వేడిగా నిప్పువలె సోకుచున్నది. లక్ష్మణా! ఈ తుమ్మెదను చూడుము. మదించిన ప్రియురాలిపైకి పోవునట్లు ఆ తిలకమంజరిపై కేగి వాలుచున్నది.

షట్పద స్సహసాఽభ్యేతి మదోద్ధూతా మివ ప్రియామ్. 1-58

ఆ మామిడిచెట్లను చూడుము. లెస్సగా అంగరాగము నలందుకొనిన విలాసవంతులవలె శోభిల్లుచున్నవి. కిన్నరు లిక్కడ విహరించుచున్నారు చూడుము.

ఏనుగులు, జింకలు నీటికై సరస్సునకు వచ్చుచున్నవి చూడుము. సరోవరము కమలములతో నిండియున్నది. కమలము లన్న సీతకు ఎంతో ఇష్టము. లక్ష్మణా! సీతా

విరహితుడనై బ్రతికియుండుటకు ఇష్టపడకున్నాను. మన్మథుని ప్రభావము చూచితివా! ఎందో యున్న సీతపైకి నా మనస్సును మరలించినాడు! సీత నన్నుగూడి యుండి నప్పుడు నాకు రమణీయములై యుండిన వన్నియు సీత నాచెంత లేనందున విపరీత ములై నాకు బాధ కలిగించుచున్నవి.

యాని స్మ రమణీయాని తయాసహ భవంతి మే
తా న్యే వారమణీయాని జాయంతే మే తయా వినా. 1-69

పద్మదళములను చూచినప్పుడు సీత నేత్రములు స్మృతికి వచ్చుచున్నవి. మంద మారుతము సోకినప్పుడు మనోహరమైన సీత నిశ్వాసము మనస్సునకు వచ్చుచున్నది.

లక్ష్మణా! ఈ జాజులు, మల్లెలు, మొగిలిపూవులు చూడుము. అచ్చటి లతలను చూచితివా! మదించిన స్త్రీలు తమ ప్రియులను వెంబడించునట్లు గాలికి కదులుచున్న చెట్లకొమ్మలను ఎట్లు వెంబడించుచున్నవో!

వాత విక్షిప్త విటపాన్ యథాసన్నాన్ ద్రుమా నిమాః
లతా స్సమనువర్తంతే మత్తా ఇవ వరస్త్రియః 1-84

కనబడిన ప్రతి పుష్పముపై ఆ తుమ్మెద ఎట్లు వ్రాలుచున్నదో చూడుము.

పూవులు నేలమీదరాలి రంగురంగుల పాన్పులవలె కన్పట్టుచున్నవి.

వివిధా వివిధైః పుష్పై స్తైరేవ నగసానుషు
వికీర్ణైః పీతరక్తా హి సౌమిత్రే ప్రస్తరాః కృతాః 1-90

ఈ వృక్షములు ఒకదానితో ఒకట పందెము వేసుకొని పూచుచున్నట్లున్నవి.

పుష్పమాసే హి తరవ స్సంఘర్షా దివ పుష్పితాః 1-91

అదిగో! ఆ కారండవ పక్షి ప్రియురాలితో కూడియున్నది చూడుము. వీనిని చూడ చూడ నాకు విరహబాధ యెక్కువ యగుచున్నది. సీత నాకు కనబడి నాతో ఇక్కడ ఉండునేని అంతే చాలును. నాకు ఇంద్ర పదవి లభించినను వలదు. అయోధ్యను సైతము కోరను.

యది దృశ్యేత సా సాధ్వీ యది చేహ వసేమ హి
స్పృహయేయం న శక్రాయ నాయోధ్యాయై రఘూత్తమ. 1-95

సీత కలదేని నాకు మరేమియు అక్కరలేదు. ఈ పంపాసరస్సునుండి వీచు మంద మారుతమును సేవించుచు సుఖముగా జీవింపగలను. మంగళకరమైన పంపోపవన మారు తమును ఎవరో ధన్యులు అనుభవించి ఆనందింపగలరే కాని అందఱకును సాధ్యమగునా!

పద్మసౌగంధికవహం శివం శోకవినాశనమ్
ధన్యా లక్ష్మణ సేవంతే పంపోపవన మారుతమ్. 1-104

సీతమాత్రము నన్ను విడిచి బ్రతికియుండగలదా ! జనకుడు తన తనయ క్షేమమునుగూర్చి నలుగురిలో నన్నడుగునేని, నే నేమి చెప్పగలను !

రాజ్యము గోల్పోయి నిర్భాగ్యుడనైన నన్ను అనుసరించి అడవికి వచ్చిన ఆ సాధ్వి ఇప్పు డెందున్నదో కదా ! ఎల్లప్పుడు నాకు ప్రియముగాను, హితముగాను సీత చిఱునగవుతో పలుకు మధురవాక్కులను మరల ఎన్నడు వినగలనో కదా! అరణ్యమున నేను మన్మథ కర్శితుడనై యున్నవేళలందు తాను యౌవనమధ్యస్థ యయ్యును తన కేమియు దుఃఖము లేనట్టును సంతోషముగా నున్నట్టును తోపింపజేసి నాతో ప్రియవాక్యములను పలుకుచుండెడిది.

స్మిత హాస్యాంతరయుతం గుణవ న్మధురం హితం
వైదేహ్యా వాక్య మతులం కదా శ్రోష్యామి లక్ష్మణ 1-110

ప్రాప్య దుఃఖం వనే శ్యామా సా మాం మన్మథకర్శితమ్
నష్టదుఃఖేవ హృష్టేవ సాధ్వీ సా ధ్వభ్యభాషత. 1-111

లక్ష్మణా ! సీతను విడిచి నేను జీవింపలేను. నీ వయోధ్య కరిగి భరతుని కలిసికొనుము.

[శ్రీరామునికి ఒక రకమైన వెఱ్ఱి పట్టినది. పశులు, మృగములు జంటలుగా నుండుటను చూచిన రాముని చిత్తమునకు అస్వస్థత ఏర్పడినది. రంగురంగుల పూవులను చూచి రత్నకంబళము లన్నాడు. క్రింద రాలిన పుష్పములను చూడగా పాన్పులు జ్ఞప్తికి వచ్చినవి. పూగుత్తులతో నిండిన చెట్లనుచూచి అంగరాగము నలందుకొన్న విలాసవంతులను స్మరించినాడు. సీతను కూడి సుఖముగా గడపిన కాలము జ్ఞప్తికిరాగా సీతను తలచుకొని తలచుకొని విలపించుచున్నాడు.

ఈ ఘట్టమున మనకు స్పష్టమగు విషయములు ఒకటి రెండున్నవి. సీతారాముల పరస్పరానురాగము సొంపుగా చిత్రింపబడియున్నది. రాముని విడిచి సీతగాని, సీతను విడిచి రాముడుగాని జీవింపలేనంత అనురాగము వారిది. సీతాదేవి త న్నెంత గాఢముగా ప్రేమించుచున్నదో రామునికి తెలిసియున్నది.

మరియొక విషయము గమనింపదగియున్నది. సీతాదేవి ప్రవర్తన చక్కగా చెప్పబడియున్నది. ఆమె మాటలు చిఱునవ్వుతోకూడిన మధుర వాక్కులు. వనవాసమున రాముడు మన్మథకర్శితుడై యుండినప్పుడు సీతాదేవి నవ్వుచు రామునికి హితవచనములు చెప్పి ఊఱట కలిగించెడిది. సీతాదేవికి శ్రీరామునియెడ గల ప్రేమ ఎంత పవిత్రమైనదో! రాముని వనవాస

వ్రతమునకు ఆమె ఎంత అనుకూలముగా ప్రవర్తించినదో, ఈ విషయములను గూర్చిన మాటలు రాముని వాక్కున వెల్వడుట చక్కగా నున్నది.]

లక్ష్మణుడు : రామా! నీవు పురుషోత్తముడవు. ఇట్లు దుఃఖించుట నీకు తగదు. వియోగము వలన కలుగు దుఃఖమును మనసుకు తెచ్చుకొని ప్రియజనులపట్ల స్నేహమును త్యజింపవలయును. స్నేహము (తైలము) అత్యధికమైనప్పుడు తడిసిన వత్తి యైనను దహింప బడుచున్నది గదా!

స్మృత్వా వియోగజం దుఃఖం త్యజ స్నేహం ప్రియేజనే
అతిస్నేహ పరిష్వంగా ద్వర్తి రార్ద్రాఽపి దహ్యతే. 1-116

రావణుడు పాతాళమున కేగినను, అంతకుమించిన మఱియొక ప్రదేశమున కరిగినను అతడు తప్పించుకొనలేడు. వాని వృత్తాంతము మాత్రము మన మెట్లైన తెలిసికొనవలయును. రావణుడు సీతాదేవినైనను తన ప్రాణములనైనను వదలుకొన వలయును.

రామా! శుభకరమైన ధైర్యమును అవలంబింపుము. దైన్యబుద్ధిని త్యజింపుము. ప్రయత్నము చేయనిచో పనులు ఫలించునా! ఉత్సాహమే బలము. ఉత్సాహమును మించిన బలము లేదు. ఉత్సాహ మున్నచో మనము సాధింపలేని పని యుండదు. కావున ఉత్సాహము నవలంబించి సీతాదేవిని సాధింతము. రామా! కామవశుడవు కావలదు. శోకమును వెనుకకు నెట్టి కార్యమునకు పూనుకొనుము. నీవు మహాత్ముడవు. నీ ప్రభావమును నీవు గుర్తింపకున్నా వేమి!

స్వాస్థ్యం భద్రం భజస్వార్య త్యజ్యతాం కృపణా మతిః
అర్థోహి నష్టకార్యార్థై ర్నాయత్నే నాధిగమ్యతే. 1-120

ఉత్సాహో బలవా నార్య నా స్త్యుత్సాహా త్పరం బలమ్.
సోత్సాహ స్యాస్తి లోకేస్మి న్న కించిదపి దుర్లభమ్. 1-121

ఉత్సాహవంతః పురుషా నావసీదంతి కర్మసు
ఉత్సాహమాత్ర మాశ్రిత్య సీతాం ప్రతిలభేమ హి. 1-122

త్యజ్యతాం కామవృత్తత్వం శోకం సన్న్యస్య పృష్ఠతః
మహాత్మానం కృతాత్మాన మాత్మానం నావబుధ్యసే. 1-123

ఈ మాటలతో రాముడు శోకమోహములను వదిలి, ధైర్యమును అవలంబించి నాడు. రామలక్ష్మణులు పంపాసరస్సును వీడి తమ ప్రయాణమును సాగించినారు. సీతాదేవికోసమై ఆ వన మంతయు వెదకినారు. కాని ఆమె కనబడలేదు. శ్రీరాముడు

మరల మరల దుఃఖించుట చూచి లక్ష్మణుడు శ్రీరామునికి ధైర్యము చెప్పుచున్నాడు. ఇద్దఱు సుగ్రీవుని కలిసికొను ప్రయత్నములో నున్నారు.

## సుగ్రీవుడు రామలక్ష్మణులను చూచి భయపడుట

సుగ్రీవుడు ఋశ్యమూకపర్వత ప్రాంతమున సంచరించుచుండి రామలక్ష్మణులను చూచి భయపడి దిగులునొంది, ఉన్నచోట నుండక తిరుగుచున్నాడు. ఏమి చేయుటకును తోపలేదు. తన స్థితినిగూర్చి సుగ్రీవుడు సహచరులతో ఆలోచించినాడు.

*సుగ్రీవుడు :* ఈ వీరుల నిద్దఱను వాలి పంపియుండును. వీరి నారచీరలు, జటలు చూడగా ఈ వీరులు మాఱువేషముతో వచ్చియుందు రని తోచుచున్నది.

సుగ్రీవుని మాటలు విని వారందఱు నిలుకడలేక ఒక కొండమీదనుండి మఱియొక కొండమీదికి ఎగురుచు తిరుగుచు తుదకు ఒకచోట చేరినారు. సుగ్రీవుని సచివుడైన హనుమంతుడు సుగ్రీవునితో అనుచున్నాడు.

*హనుమంతుడు :* రాజా ! నీ భయమును వదలుము. మన ముండుట ఋశ్యమూక పర్వతముపైన గదా ! వాలివలన మన కిక్కడ అపాయ మేమియు కలుగదు. వాలి ఇక్కడకు రాలేడు. మన భయమునకు కారణము లేదు. మనము భయభ్రాంతుల మగుట వానర చాపల్యమును ప్రకటించుటయేగాని వేరుకాదు.

*సుగ్రీవుడు :* హనుమా ! తేలిక పలుకులు పలికితివేగాని, ఆ వీరుల ఆకారములను ధనుర్బాణములను, ఖడ్గములను నీవు గమనించినట్లు లేదు. వారిరువురును దేవతలవలె ఉన్నారు. వారిని చూచి భయపడనివా రుందురా! వాలి ఇక్కడికి రాజాల డంటివి. సరే! కాని రాజులకు ఎందరో స్నేహితు లుందురు. వీ రిద్దరు వాలి స్నేహితులు కాబోలు. మనము నమ్మి ఏమఱుపాటుగా ఉండకూడదు. వాలి సామాన్యుడు కాడు. పనులను తెలివితో చక్కబెట్టుకొనువాడు. కావున వీరి సమాచారమును మనము కనిపెట్టవలయును.

హనుమా ! నీవు ప్రాకృతుని వేషము దాల్చి వారిచెంత కరిగి వా రెవరో, ఎట్టి వారో, ఇక్కడికి వచ్చిన కారణ మేమో, అన్ని వివరములు కనుగొని రమ్ము.

దీర్ఘబాహూ విశాలాక్షౌ శరచాపాసిధారిణౌ
కస్య న స్యా ద్భయం దృష్ట్వా హ్యేతౌ సురసుతోపమౌ 2-20

వాలి ప్రణిహితా వేతౌ శంకేఽహం పురుషోత్తమౌ
రాజానో బహుమిత్రాశ్చ విశ్వాసో నాత్ర హి క్షమః 2-21

కృత్యేషు వాలీ మేధావీ రాజానో బహుదర్శనాః
భవంతి పరహంతార స్తే జ్ఞేయాః ప్రాకృతై ర్నరైః 2-23
తౌ త్వయా ప్రాకృతేనైవ గత్వా జ్ఞేయౌ ప్లవంగమ. 2-24

## సుగ్రీవు పంపున హనుమంతుడు రామలక్ష్మణులను సందర్శించుట

సుగ్రీవుని ఆజ్ఞానుసారము హనుమంతుడు భిక్షు రూపమును ధరించి రామలక్ష్మణు లున్న ప్రదేశమునకు వచ్చి వారిని దర్శించి నమస్కరించి వారిని ప్రశంసించినాడు.

**హనుమంతుడు**: పురుషోత్తములారా ! మీరు రాజర్షులవలెను, దేవతల చందమునను ప్రకాశించుచున్నారు. మీరు రాజ్యము లేలవలసినవారు, ఈ జటావల్కలములు ధరించి ఇచ్చటికి వచ్చుట ఎట్లేర్పడినది.

రాజ్యార్హా పమరప్రఖ్యౌ కథం దేశ మిహాగతౌ
పద్మపత్రేక్షణౌ వీరౌ జటామండల ధారిణౌ 3-11

మీ రూపములు చూడగా సూర్యచంద్రులు భూమికి దిగివచ్చిరో అన్నట్లు కన్పట్టుచున్నది. మీరు చక్కని అలంకారములతో ఉండదగినవారు కదా ! మీ సుందరాంగములు ఆభరణ విరహితములుగా నున్న వేల ! మీ రీ భూమండలమునకు చక్రవర్తులుగా నుండదగినవారివలె కనబడుచున్నారు. మీ ధనుస్సులు ఇంద్రుని వజ్రాయుధ కాంతితో మెరయుచున్నవి. మీ బాణములు పొగ లీనుచున్నవి. మీ ఖడ్గములు సర్పసన్నిభములై వెలుగుచున్నవి.

నే నింతసేపు మాటలాడుచున్నను మీరు ఒక్క పలుకైనను పలుక రేమి ?

సుగ్రీవు డను వానర ప్రభు వొక్కడు కలడు. అతడు ధర్మాత్ముడు. తన అన్నయైన వాలివలన అతనికి అపకారము కలిగి ఇప్పుడు దుఃఖములో నున్నాడు. నిలుచుటకు చోటులేక దేశమెల్లెడ తిరుగుచున్నాడు. ఆ మహాత్ముడు నన్ను మీ సన్నిధికి పంపగా వచ్చియున్నాను. సుగ్రీవుడు మీ సఖ్యమును కోరుచున్నాడు. నా పేరు **హనుమంతుడు.** నేను సుగ్రీవుని సచివుడను. వాయుదేవుని పుత్రుడను. నేను కామరూపిని. ఇప్పుడు మీకు కనబడుచున్న ఈ భిక్షురూపము మిమ్ములను కలిసికొనుటకై నేను ధరించినది. నేను వానరుడను.

యువాభ్యాం సహ ధర్మాత్మా సుగ్రీవ స్సఖ్య మిచ్ఛతి. 3-22

[ఈ మాట సుగ్రీవుడు తనతో చెప్పకపోయినను, హనుమంతుడు బుద్ధిమంతు డగుటచే రామలక్ష్మణుల ప్రభావమును వారి దర్శన మాత్రమున గ్రహించి వారి స్నేహమువలన తన ప్రభువు దుఃఖము తీఱిపోవు నని నిశ్చయించుకొని ఈ మాట చెప్పినాడు.]

రాముడు: (సంతోషముతో) లక్ష్మణా! నేను సుగ్రీవుని కలిసికొనవలయు నని కోరు చుండగా ఆ సుగ్రీవుని మంత్రియే మనకడకు వచ్చియున్నాడు. ఇతడు మనకు కావలసినవాడు. మాట నాణెమును చక్కగా నేర్చినవాడు. నీ వితనితో మధుర ముగా మాటాడుము.

త మభ్యభాష సౌమిత్రే సుగ్రీవసచివం కపిమ్
వాక్యజ్ఞం మధురై ర్వాక్యై స్స్నేహయుక్త మరిందమ. 3-27

[తాను మాటలాడక లక్ష్మణుని మాటలాడ మనుచున్నాడు. సుగ్రీవుడు రాజు కావున అతనితో తానే మాటలాడవచ్చును. మంత్రితో సంభాషించుటకు లక్ష్మణుడు చాలును. మరియొకమాట; రాముని కష్టసుఖములను హనుమంతునికి తెలియజేయవలసియున్నది. తన సంగతులు తానే చెప్పుకొనుట సమంజసము కాదు. అందులో కొన్ని ఇబ్బందు లుండును. కావున లక్ష్మణుని మాటలాడ మనుచున్నాడు శ్రీరాముడు.]

లక్ష్మణా! ఋగ్యజుస్సామ వేదములను చక్కగా అధ్యయనము చేసినవాడు తప్ప ఈ హనుమంతుడు సంభాషించినట్లు సంభాషింపజాలడు. వ్యాకరణము అనేక పర్యాయములు కూలంకషముగా చదివియున్నా డనుటకు సందేహము లేదు. ఇంతసేపు మాటలాడినను ఒక్క అపశబ్దమైనను రాలేదు చూడుము. ఇతని ముఖమందుగాని, చూపులలోగాని కనుబొమలలోగాని ఇతర అవయవములందుగాని ఒక్క దోషమైనను కనిపింపలేదు. మాటలు ఎంత సొగసుగా నున్నవో చూచితివా! అవి స్థిరముగా, స్పష్టముగా ఉన్నవి. వాక్యములను పొడవుగా సాగదీయుటగాని వడివడిగా పరుగెత్తించుటగాని లేదు. అతని కంఠస్వరమును గమనించితివా! రొమ్ము గ్రుద్దుకొని గట్టిగా అరచుటగాని, వినబడి వినబడకుండునట్లు గుసగుస లాడుటగాని లేదు. మధ్యమ స్వరమున పలుకుచున్నాడు. పలుకులు మంగళకరముగాను మనోహరముగాను ఉన్నవి. చంపుటకు కత్తి నెత్తిన శత్రువు మనస్సు సైతము ఇట్టి శుభవాక్యములు విన్నంతనే మెత్తబడును. ఇట్టి దూత కలడేని ప్రభువు కార్యములు తప్పక చక్కబడగలవు.

నానృగ్వేద వినీతస్య నాయజుర్వేద ధారిణః
నా సామవేద విదుష శ్శక్య మేవం ప్రభాషితుమ్. 3-28

నూనం వ్యాకరణం కృత్స్న మనేన బహుధా శ్రుతమ్
బహు వ్యాహరతాఽనేన న కించి దపశబ్దితమ్. 3-29

న ముఖే నేత్రయోర్వాపి లలాటే చ భ్రువో స్తథా
అన్యేష్వపి చ గాత్రేషు దోష స్సంవిదితః క్వచిత్. 3-30

అవిస్తర మసందిగ్ధ మవిలంబిత మద్రుతం
ఉరస్థం కంఠగం వాక్యం వర్తతే మధ్యమే స్వరే. 3-31

సంస్కారక్రమసంపన్నా మద్రుతా మవిలంబితాం
ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయ హారిణీమ్. 3-32

అనయా చిత్రయా వాచా త్రిస్థాన వ్యంజనస్థయా
కస్య నారాధ్యతే చిత్త ముద్యతాసే ररే రపి. 3-33

ఏవం గుణగణై ర్యుక్తా యస్య స్యుః కార్యసాధకాః
తస్య సిద్ధ్యంతి సర్వార్థా దూతవాక్య ప్రచోదితాః 3-35

**లక్ష్మణుడు :** హనుమంతుడా! సుగ్రీవుని సుగుణములు మేము వినియున్నాము. మే మిప్పుడు అతనినే వెదకుచున్నాము. సుగ్రీవుని విషయమున నీవు చెప్పినట్లే చేయుదుము.

ఈ మాటలు విని హనుమంతుడు ఆనందించి రామునికి సుగ్రీవునితో పని కల దని గ్రహించి సుగ్రీవునికి రాజ్యప్రాప్తి కలుగు నని నిర్ణయించుకొన్నాడు.

**హనుమంతుడు :** (రామునితో) తమ్ముని వెంటబెట్టుకొని ఈ ఘోరారణ్యమునకు వచ్చిన కారణ మేమైయుండును.

**లక్ష్మణుడు :** దశరథు డను దొడ్డరాజు కలడు. ఎన్నియో యజ్ఞములు, దానములు చేసిన పుణ్యుడు. ఈయన ఆ దశరథమహారాజు జ్యేష్ఠపుత్రుడు. పేరు రాముడు. దశరథుని కుమారులలో అధికుడు. ఇతడు రాజ్యభ్రష్టుడై వనవాసవ్రత మాచరించుటకు అరణ్యమునకు వచ్చినాడు. ఈయన భార్య యైన సీతాదేవియును నేనును ఈయన వెంట వచ్చినాము.

సూర్యుడు అస్తమించునప్పుడు సూర్యప్రభ సూర్యుని ఎట్లనుసరించునో, సీతా దేవియు అట్లే రాముని అనుసరించి అడవికి వచ్చినది. నేను రాముని తమ్ముడను. నా పేరు లక్ష్మణుడు. మా అన్న గుణసంపదను చూచి అయనకు దాసుడనై నేనును అడవికి వచ్చితిని.

మా అన్న భార్యను ఒక రాక్షసుడు అపహరించినాడు. ఆ రాక్షసు డెట్టివాడో తెలియలేదు. సుగ్రీవునియొద్ద కరిగినయెడల సంగతి తెలియగల దని కబంధుడు చెప్పగా సుగ్రీవుని వెదకికొనుచు వచ్చినాము.

మాకు సుగ్రీవుడే శరణ్యుడు. మా శ్రీరాముడు పూర్వ మెంతమందికో ఎన్నో దానములు చేసి లోకనాథు డని పేరు పడియున్నాడు. అట్టి లోకనాథుడు ఈనాడు

సుగ్రీవుని నాథునిగా కోరుచున్నాడు. సర్వలోకశరణ్యు డైన శ్రీరాముడు ఈనాడు సుగ్రీవుని శరణు కోరుచున్నాడు. ఎవ్వని అనుగ్రహ మున్న యెడల ప్రజ లెల్లరు ఆనంద మును పొందగలరో అట్టి రాముడు ఇప్పుడు సుగ్రీవుని అనుగ్రహమునకు ఎదురుచూచు చున్నాడు. దశరథ చక్రవర్తి జ్యేష్ఠపుత్రుడు వానరరాజును శరణు వేడుచున్నాడు.

ఈవిధముగా దుఃఖమున మునిగి శరణు జొచ్చిన మమ్ము సుగ్రీవుడు అనుగ్ర హింపదగియున్నది.

[ఇట్టి దీనాలాపములు లక్ష్మణుని నోట ఎట్లు వచ్చినవా యని తోపక మానదు. శ్రీరాముని కష్టమును తొలగించుటకై లక్ష్మణుడు ఎంతైన తగ్గుటకు వెనుదీయడు !]

అహం చైవ హి రామశ్చ సుగ్రీవం శరణం గతౌ. 4-17

ఏష దత్త్వా చ విత్తాని ప్రాప్య చానుత్తమం యశః
లోకనాథం పురా భూత్వా సుగ్రీవం నాథ మిచ్ఛతి. 4-18

సర్వలోకస్య ధర్మాత్మా శరణ్య శ్శరణం పురా
గురు ర్మే రాఘవ స్సోఽయం సుగ్రీవం శరణం గతః. 4-20

యస్య ప్రసాదే సతతం ప్రసీదేయు రిమాః ప్రజాః
స రామో వానరేంద్రస్య ప్రసాద మభికాంక్షతే. 4-21

శోకాభిభూతే రామే తు శోకార్తే శరణం గతే
కర్తు మర్హతి సుగ్రీవః ప్రసాదం హరియూథపః. 4-24

**హనుమంతుడు :** మీవంటి బుద్ధిసంపన్నులను, జితేంద్రియులను, సుగ్రీవుడే వచ్చి సందర్శింప తగియున్నది. మీరై అతనికి దర్శన మిచ్చుటకు వచ్చుట అతని భాగ్య మనవల యును. సుగ్రీవుడునైతము రాజ్యభ్రష్టుడై భార్యను కోల్పోయి అడవిలో నున్నాడు. అతనికి ప్రాప్తించిన కష్టము లన్నియు అతని అన్నయైన వాలివలన కలిగినవి.

సుగ్రీవుడు మీకు తప్పక సహాయము చేయగలడు. మే మందరము సీతాదేవిని అన్వేషింతుము.

**లక్ష్మణుడు :** రామా ! వింటివిగదా హనుమంతుని మాటలు ! సుగ్రీవునికిని మనతో పని యున్నది. కావున మనకార్యముకూడ తప్పక సిద్ధించును. ఈ మాటను హను మంతుడు స్పష్టముగా చెప్పుచున్నాడు. ఈ వీరుడు అన్నృత మాడువాడు కాడు.

నానృతం వక్ష్యతే వీరో హనుమా న్మారుతాత్మజః 4-32

# రామలక్ష్మణులు సుగ్రీవుని కలిసికొనుట

అందరు సుగ్రీవుని సన్నిధికి బయలుదేరినారు. హనుమంతుడు భిక్షురూపమును విసర్జించి తన వానరరూపముతో రామలక్ష్మణులను తన వీపుపై నెక్కించుకొని సుగ్రీవుని చెంతకు కొనిపోయి వారి నచ్చట దింపి వారి రాకను సుగ్రీవునికి తెలియపరిచి వారి వృత్తాంతమును చెప్పుచున్నాడు.

*హనుమంతుడు :* ప్రభూ ! రామలక్ష్మణు లిచ్చటికే వచ్చియున్నారు. శ్రీరాముడు ఇక్ష్వాకు వంశస్థుడు. ధర్మాత్ముడు. తండ్రిని సత్యవంతుని చేయుటకై అరణ్యమునకు వచ్చినవాడు. ఆయన భార్య సీతాదేవియును, తమ్ముడు లక్ష్మణుడును రాముని వెంట అరణ్యమునకు వచ్చినారు. రామలక్ష్మణులు లేని సమయము చూచి రావణుడు వారి పర్ణశాలకు వచ్చి సీతాదేవిని అపహరించి కొనిపోయినాడు. శ్రీరాముడు నిన్ను శరణు కోరుచున్నాడు. నీ సఖ్యము కోరి వచ్చియున్నాడు. రామలక్ష్మణులు పూజనీయులు. వారిని గౌరవించి వారితో స్నేహము చేసి కొనుట మంచిది.

సుగ్రీవుని వేధించుచుండిన రామభయము హనుమంతుని మాటలతో వదలి పోయినది. సుగ్రీవుడు సంతోషించి సుందర మనుష్యరూపమును దాల్చి రామలక్ష్మణుల చెంతకు వచ్చినాడు.

*సుగ్రీవుడు :* రామప్రభూ ! మీ సుగుణములను మీ పరాక్రమమును వాయుపుత్రుడు చెప్పగా విన్నాను. నా సఖ్యము కోరి వచ్చియున్నా రని చెప్పినాడు. కేవల వానరమాత్రుడ నైన నన్ను ఇంత గౌరవించి మీరు నా స్నేహమును కోరుట నాకు శుభకరము. నిజముగా నాతో స్నేహము గావింపదలతువేని ఇదిగో ! నాచేయి జాపుచున్నాను. నా చేతిలో చేయి వేసి మన సఖ్యమును స్థిరము చేయుము.

> రోచతే యది వా సఖ్యం బాహు రేష ప్రసారితః
> గృహ్యతాం పాణినా పాణి ర్మర్యాదా బధ్యతాం ధ్రువా. 5-12

శ్రీరాముడు సుగ్రీవుని చేతిలో చేయి వేసి సుగ్రీవుని గాఢముగా కవుగిలించు కున్నాడు. ఇంతలో హనుమంతుడు అగ్ని మథించి పుష్పములతో పూజించి ఆ యగ్నిని రామసుగ్రీవుల మధ్య ఉంచినాడు. రామసుగ్రీవులు అగ్నికి ప్రదక్షిణము గావించి అగ్ని సాక్షిగా స్నేహము చేసికొన్నారు. స్నేహితు లిద్దరు ఒకరినొకరు మాటిమాటికి చూచు కొని ఆనందము ననుభవించినారు.

పర్ణపుష్పభరితమైన ఒక సాలవృక్ష శాఖను సుగ్రీవుడు తెచ్చి క్రింద పరిచినాడు. దానిమీద రామసుగ్రీవులు కూర్చుండినారు. పుష్పములతో నిండియుండిన ఒక చందన వృక్షశాఖను హనుమంతుడు తెచ్చి దానిపై లక్ష్మణుని కూర్చుండబెట్టినాడు.

*సుగ్రీవుడు :* రామా! మనము స్నేహితుల మైనాము. మన సుఖదుఃఖములు ఇద్దరికిని సమానములు. నేను దుఃఖములో మునిగియున్నాను. భయ పీడితుడనై, యున్నాను. నాభార్యను నా అన్న యగు వాలి అపహరించినాడు. వాలిభయము వలన ఈ అరణ్యమున తిరుగుచున్నాను. వాలిభయమునుండి న న్నెట్లయినను తప్పింపవలయును.

*రాముడు :* సుగ్రీవా! స్నేహితునికి ఉపకార మొనర్చుటయే స్నేహమునకు ఫల మని నే నెరుగుదును. నీ భార్య నపహరించిన వాలిని నేను తప్పక వధింతును.

ఉపకారఫలం మిత్రం విదితం మే మహాకపే
వాలినం తం వధిష్యామి తవ భార్యాపహారిణమ్. 5-26

*సుగ్రీవుడు :* ప్రభూ! నీ అనుగ్రహ మున్నచో, నేను నా భార్యను, నా రాజ్యమును తప్పక పొందగలను. నీవు వాలిని వధించు ప్రయత్నములో నుండుము.

రామసుగ్రీవులు సఖ్యము గావించుకొన్న సమయమున, సీతాదేవికిని, వాలికిని, రావణాసురునికిని ఎడమకన్ను లదరినవి.

సీతా కపీంద్ర క్షణదాచరాణాం
రాజీవ హేమ జ్వల నోపమాని
సుగ్రీవ రామ ప్రణయ ప్రసంగే
వామాని నేత్రాణి సమం స్ఫురన్తి. 3-52

*సుగ్రీవుడు :* రామప్రభూ! నీ దుఃఖమును గురించి హనుమంతుడు నాకు తెలిపినాడు. మీరులేని సమయమున రాక్షసుడు మీపర్ణశాలకు వచ్చి సీతాదేవిని అపహరించిన సంగతి విన్నాను. సీతాదేవి ఎందున్నను నేను తెచ్చి నీకు సమర్పింపగలను. నీవు శోకమును విడువుము. అట్టే ఊహించి చూడగా, మేము చూచిన వనిత సీతా దేవియే నని తోచుచున్నది. రాక్షసుడు ఒక యువతిని కొనపోవుచుండుట చూచి నాము. ఆమె 'రామా! లక్ష్మణా' అని ఆక్రందించుచుండినది. నేను, నామంత్రులు ఇక్కడ కూర్చుండియుండగా ఆమె తన ఉత్తరీయమున ఆభరణములు ముడిచి ఆ మూటను మా మధ్య వేసినది. ఆ మూటను తెచ్చెదను. గుర్తుపట్టగలవేమో చూడుము.

**రాముడు :** సుగ్రీవా ! ఆలస్య మెందుకు ? త్వరగా తీసికొనిరమ్ము.

సుగ్రీవుడు గుహలోనికి వెళ్ళి నగలమూటను తెచ్చినాడు. రాముడు దానిని విప్పి చూచి దుఃఖపరవశుడై నగలను తన వక్షస్థలమునం దుంచుకొని దీనముగా విలపించి "లక్ష్మణా ! ఈ యుత్తరీయమును, ఈ నగలను చూచి గుర్తింపుము" అన్నాడు.

**లక్ష్మణుడు :** (ఆభరణములను చూచి) అన్నా ! ఈ బాహుపురులను, కుండలములను నేను గుర్తింపలేను. అనుదినము పాదాభివందనము చేయువాడ నగుటచే ఈ అందెలను మాత్రము గుర్తింపగలను.

**నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే**
**నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్.** 6.22

[ఈ శ్లోకము చాల గొప్పది. ధ్వని ప్రధాన మగు కవిత్వమహిమ గలది. లక్ష్మణుడు సీతాదేవిని కన్నెత్తియైన చూడలే దని సొంపుగా చిత్రింపబెడినది. లక్ష్మణుని శీలసంపద వ్యక్త మగుచున్నది. ఈ శ్లోకము మాటిమాటికి చదివి ఆనందింపదగియున్నది.]

**రాముడు :** సుగ్రీవా ! నీవు చూచితినంటివి గదా ! రాక్షసుడు సీతను ఎచ్చటికి క్రొని పోయినాడు. అతని నివాస మెక్కడనో చెప్పుము. వాని నిప్పుడే వధించి వచ్చెదను.

**సుగ్రీవుడు :** రామా ! ఆ రాక్షసు డెక్కడివాడో అతని పరాక్రమ మెట్టిదో ఆ వివరములు నాకు తెలియవు. నేను సకల ప్రయత్నములు చేసి నీకు సీతాదేవి లభించునట్లు చేయుదును. రావణుని వధించి నీకు సంతోషము కలిగింతును. నీవంటి ధీరుడు ఇట్లు దుఃఖించుట సరికాదు. నన్ను చూడుము. నేనుకూడ భార్యను కోల్పోయినవాడను గదా ! నేను ధైర్యమును విడువలేదు. నావంటి వానర మాత్రుడు ధైర్యమును వీడకయుండగా నీయట్టి మహాత్ములు, ధృతిమంతులు, ఎంత ధైర్యముగా ఉండవలయునో చెప్పుము.

ఈ శోకమును త్యజింపుము. ధైర్యమును అవలంబింపుము. కష్టములు కలుగుట మానవులకు సహజము. ఒక వ్యసనముగాని, ద్రవ్యనాశనముగాని, ఆపదగాని తటస్థించి నప్పుడు ధృతిమంతుడు చక్కగా ఆలోచించి కర్తవ్యమును చేయవలెగాని దుఃఖించు చుండినచో లాభ మేమి ? నేను నీకు నమస్కరించి నిన్ను ప్రార్థించుచున్నాను. శోకమును వదలివేయుము. శోకము వలన సుఖము, తేజస్సు తరిగిపోవును. రామా ! వయస్యభావముతో నేను చెప్పుచున్న హితమును వినుము.

**యే శోక మనువర్తంతే న తేషాం విద్యతే సుఖమ్**
**తేజశ్చ క్షీయతే తేషాం న త్వం శోచితు మర్హసి.** 7.12

కన్నీటితో తడిసిన ముఖమును రాముడు తన కొంగుతో తుడుచుకొన్నాడు

ముఖ మశ్రు పరిక్లిన్నం వస్త్రాన్తేన ప్రమార్జయత్. 7-15

రాముడు : (సుగ్రీవుని కవుగిలించుకొని) సుగ్రీవా! నీవంటి స్నేహితుడు లభ్య మగుట సులభము కాదు. అందులో ఇట్టి కష్టకాలమున దొరుకుట అరుదు. నీ హిత వాక్యముల వలన నాకు ధైర్యము కలిగినది. సీతను అన్వేషించు ప్రయత్నము చేయుము. నీకుగా నేను వాలిని తప్పక వధింతును. నే నిదివర కెన్నడును అబద్ధ మాడి ఎరుగను. ఇక మీద చెప్పను. నేను ప్రమాణము చేసి చెప్పుచున్నాను. వాలిని తప్పక వధించెదను.

సుగ్రీవుడు : (సంతోషముతో) రామా! నీ సహాయముతో దేవరాజ్యమును సైతము. పొందవచ్చును. ఈ వానర రాజ్యమును పొందుట ఒక పెద్ద పనికాదు. నీవంటి మహనీయుడు అగ్నిసాక్షిగా నాకు మిత్రు డైనందున, నన్ను మా బంధు మిత్రులు పూజింపగలరు. నేనుకూడ నీకు తగిన వయస్యుడ నని నీవు క్రమముగా తెలిసికొన గలవు. నా గుణములను నేనే చెప్పుకొనజాలను. రామప్రభూ! నీ యట్టి మహాత్ములకు కలిగిన ప్రేమ స్థిరముగా నుండగలదు. వారికిగల వెండి, బంగారు, వస్త్రములు, ఆభరణములు, సర్వ సంపదలు భేదభావము లేక మిత్రులు అనుభవింతురు. ధనవంతు డైనను, దరిద్రు డైనను, దుఃఖితు డైనను, సుఖితు డైనను, నిర్దోషి యైనను, దోషి యైనను మిత్రులు వారి మిత్రుని వదలరు. మిత్రులు తమ మిత్రుని కొరకు తమ ధనమును, తమ సుఖమును, తుదకు తమ ప్రాణములను సైతము త్యాగము చేయుదురు.

రజతం వా సువర్ణం వా వస్త్రాణ్యాభరణాని చ
అవిభక్తాని సాధూనా మవగచ్ఛన్తి సాధవః. 8-7

ఆఢ్యోవాపి దరిద్రోవా దుఃఖిత స్సుఖితోపి వా
నిర్దోషో వా సదోషో వా వయస్యః పరమా గతిః. 8-8

ధనత్యాగ స్సుఖత్యాగో దేహత్యాగోఽపి వా పునః
వయస్యార్థే ప్రవర్తన్తే స్నేహం దృష్ట్వా తథా విధమ్. 8-9

రామా! వాలి వలన నేను మిక్కిలి బాధపడుచున్నాను. నా కష్టములను నీవు తీర్పవలయును.

రాముడు : సుగ్రీవా! భయపడకుము. నేను వాలి నిప్పుడే వధింతును.

సుగ్రీవుడు : రామప్రభూ! మనము అగ్నిసాక్షిగా స్నేహము చేసికొని యున్నాము. నిన్ను నా ప్రాణమునకన్న ఎక్కువగా భావించుచున్నాను. నీవు నా మిత్రుడ వని విశ్వసించి నా కష్టములను నీతో చెప్పుకొన్నాను. వాలి మిక్కిలి దుర్మా ర్గుడు. నా భార్యను అపహరించినవాడు. నా స్నేహితులను బంధించినాడు. నన్ను వధించు ప్రయత్నములో నున్నాడు. నాకు ఈ నలుగురు మంత్రులు మాత్రమే మిగిలి యున్నారు. నా స్థితి మూడు మాటలలో చెప్పెదను. వాలి చనిపోయినగాని నా దుఃఖము తీరదు.

రాముడు : సుగ్రీవా! నీకును వాలికిని వైర మెట్లు కలిగినది? ఆ వైరకారణము విని బలా బలములు వివుర్శించి నీ దుఃఖమును తీర్పగలను. వాలివలన నీకు కలిగిన అవ మానమునకు నా మనస్సు పరితపించుచున్నది. నేను బాణమును వదలుటయే తరువాయి. వాలి హతుడైనట్లే భావింపుము.

సుగ్రీవుడు తన కథను ప్రారంభించినాడు.

సుగ్రీవుడు : రామా! మా తండ్రి చనిపోయిన పిదప, రాజ్యము మా అన్నకు సంక్ర మించినది. నే నెల్లప్పుడు మా అన్న మాటలోనే వుండి అతనిని అనుసరించు చుండినాను. దుందుభి కుమారుడు 'మాయావి' అను రక్కసునికిని వాలికిని ఒక స్త్రీ నిమిత్తము విరోధము కలిగినది. ఒకనాటి రాత్రి మాయావి కిష్కింధకు వచ్చి వాలిని యుద్ధమునకు పిలిచినాడు. మాయావి గర్జన శబ్దమును విని వాలి నిద్రనుండి లేచి వెంటనే యుద్ధమునకు బయలుదేరినాడు. నేను, అంతఃపురస్త్రీలు ఎంత వారించినను నిలువక బయలు వెడలినాడు. నేనుకూడ వాలి వెంబడి వెళ్లి నాను. మమ్ములను చూచి మాయావి భయపడి పరుగెత్తినాడు. వాలి మాయా విని తరిమినాడు. కొంత సేపటికి మాయావి ఒక బిలమున ప్రవేశించినాడు.

వాలి నన్ను చూచి "సుగ్రీవా! నేను లోపలికి వెళ్ళి మాయావిని వధించి వచ్చువరకు నీవు ఈ బిలద్వారముచెంత వేచియుండుము" అన్నాడు. మా అన్న చెప్పి నట్లే నేను బిలద్వారము చెంత వేచియుండినాను. ఈ విధముగా ఒక సంవత్సరము గడచిపోయినది. కాని వాలి రాలేదు. వాలి చనిపోయి యుండునని భయము తోచి నది. తరువాత కొంతకాలమునకు బిలములోనుండి నురుగుతో కూడిన రక్తము ప్రవ హించుట కానవచ్చినది. మాయావి గర్జన శబ్దము, వాలి ఆర్తనాదము వినబడినవి. వీనిని గమనించి మా అన్న మరణించియుండు నని నిర్ణయించుకొని మాయావి బయటికివచ్చు అవకాశము లేకుండుటకై బిలద్వారమున కడ్డముగా ఒక పెద్ద బండను బిగించినాను. మా అన్న మరణమును తలచుకొని దుఃఖించి జలతర్పణము చేసి కిష్కింధకువచ్చినాను.

వాలి మరణవార్తను దాచుటకు నే నెంత ప్రయత్నించినను సాధ్యపడలేదు. మంత్రు లెట్లో కనుగొన్నారు. నాకు పట్టాభిషేకము చేసినారు.

నేను రాజ్యపాలన చేయుచుండగా వాలి వచ్చినాడు. నన్ను చూచి కోపోద్రిక్తుడై నాడు. నా మంత్రులను బంధించి నన్ను పరుషముగా నిందించినాడు. ఆ సమయమున వాలిని నిగ్రహించుటకు నాకు శక్తి యుండియు అన్నగదా యని గౌరవించి రాజ్యమును గైకొనుమని ప్రార్థించినాను. వాలికి శిరసా నమస్కరించి "అన్నా! దేశము అరాచకముగా నుండు నని మంత్రులు నన్ను బలవంత పెట్టినందున రాజ్యమును అంగీకరించినాను. నా తప్పును మన్నింపుము" అని ఎన్ని విధములుగానో బ్రతిమాలుకొన్నాను. వాలికి కోపము తగ్గలేదు. నలుగురి యెదుట నన్ను అనరానిమాట లన్నాడు. పురజనులను, తనకు హితులైన మంత్రులను, తన స్నేహితులను ప్రోగుచేసి "నేను వీనిని బిలద్వారముచెంత వేచియుండు మని చెప్పి శత్రువును సంహరించుటకు బిలములో ప్రవేశించినాను. నేను మాయావిని, అతని బంధువులను తెగటార్చి వచ్చి చూడగా బిల ద్వారము మూయబడియున్నది. 'సుగ్రీవా! సుగ్రీవా!' అని ఎన్ని మారులో కేక పెట్టినాను. సుగ్రీవుడు పలుకలేదు. నాకు దుఃఖము వచ్చినది. బిలద్వారమునకు బిగించియుండిన బండను నా కాళ్లతో చేతులతో కొట్టికొట్టి దారి చేసికొని బయటపడినాను. నేను తన అన్న నను మాటకూడ మరచిపోయి ఈ పాపాత్ముడు నన్ను బిలములో ఘంచినాడు," అని తీవ్రముగా పలికి నాకు ఒక్క వస్త్రమునుమాత్ర మిచ్చి నన్ను రాజ్యమునుండి తరిమినాడు. నా భార్యను అపహరించినాడు.

వాలి భయమువలన నేను భూమినంతయు చుట్టి. తుదకు ఈ ఋశ్యమూక పర్వతముమీద చేరినాను. ఒక కారణమున వాలి ఇక్కడ అడుగు పెట్టజాలడు. కావున ఈ పర్వతముపై తలదాచుకొనుచున్నాను. ఇది నా కథ. నీవు నన్నెట్లైన రక్షింపవలయును.

రాముడు : సుగ్రీవా! భయపడకుము. నీ భార్యను అపహరించిన ఆ దుర్మార్గుడు నా కంట పడుటయే తడవు. అతడు హతుడైనట్లే భావింపుము.

యావ త్త్వం నాభిపశ్యామి తవ భార్యాపహారిణమ్
తావ త్స జీవే త్పాపాత్మా వాలీ చారిత్రదూషకః. 10-33

నా అనుభవమును బట్టి నీ దుఃఖమును అర్థము చేసుకొన్నాను. నిన్ను శోక సముద్రమునుండి దరిజేర్చి నీ కోరిక తీర్పగలను.

ఆత్మానుమానా త్పశ్యామి మగ్నం త్వాం శోకసాగరే
త్వా మహం తారయిష్యామి కామం ప్రాప్స్యసి పుష్కలమ్. 10-34

*సుగ్రీవుడు :* రామా ! నీవు కోపింతువేని సమస్తలోకములను నీ బాణాగ్నిచే దహింప గలవు. సరే ! వాలి బలమును గురించి చెప్పుచున్నాను. శ్రద్ధగా వినుము.

వాలి సూర్యోదయమునకు ముందే నాలుగు సముద్రములను చుట్టివచ్చును. గొప్ప పర్వత శిఖరములను బంతివలె పైకి ఎగురవేసి పట్టుకొనగలడు. ఎంత పెద్ద వృక్షమునైనను చేతులతో విరువగలడు. దుందుభి అను రాక్షసు డొకడు మహిషాకారు డుండినాడు. అతనికి వేయి ఏనుగుల బల ముండినది. దుందుభి యుద్ధ ప్రియుడు ఒకానొకనాడు దుంధుభి సముద్రునిమీదికి యుద్ధమునకు బయలుదేరినాడు. సముద్రుడు "దుందుభీ ! నీతో నేను యుద్ధము చేయలేను. హిమవంతుడైనచో నీతో సమానముగా యుద్ధము చేయగలడు" అన్నాడు. సముద్రుడు భయపడిపోయినా డని ఊహించి దుందుభి శరవేగమున హిమవంతుని దరిసి యుద్ధము కోరినాడు. హిమవంతుడు "దుందుభీ ! న న్నేల బాధించెదవు ? యుద్ధ మన్న నేమియో తెలియనివాడను. ఇది సాధువులు తపస్సు చేయు ప్రదేశము" అని చెప్పినాడు. దుందుభి కోపించి "నీ వేమో శక్తి చాలకయో, భయమువలననో యుద్ధమునకు పూనుకొనుటలేదు. మరి నాతో యుద్ధమాడు వాని నైన చెప్పుము" అని అడిగినాడు. హిమవంతుడు "దుందుభీ ! వానరరాజైన వాలి నీకు సాటివచ్చు వీరుడు. నీ వతనితో యుద్ధము చేయుము" అని చెప్పినాడు.

ఆ మాటనుబట్టి దుందుభి కిష్కింధకు వచ్చి వాలిని యుద్ధమునకు పిలిచినాడు. ఇంద్రుడు ప్రసాదించిన కాంచనమాలను ధరించి వాలి యుద్ధమునకు వెడలి వచ్చినాడు. ఇద్దరికి ఘోర యుద్ధము జరిగినది తుదకు వాలి దుందుభిని పట్టి పైకెత్తి నేలమీదికి బలముగా విసరికొట్టినాడు. దానితో దుందుభి హతుడైనాడు. దుందుభి కళేబరమును వాలి తన చేతులతో ఎత్తి విసరివేయగా, అది ఒక యోజనదూరము పోయి పడినది. దుందుభి నోటినుండి కారుచుండిన రక్తబిందువులు గాలికి కొట్టుకొనిపోయి మతంగాశ్ర మములో పడినవి. ఆశ్రమమున రక్తము పడుటచూచి మతంగ మహామునికి కోపము కలిగినది. ఆయన వెలుపలికి వచ్చి చూడగా దుందుభి కళేబరము కానవచ్చినది. ఇదంతయు వాలి చేసినపని యని మహర్షి గ్రహించి వాలిని శపించినాడు. "ఈ వనము నకు యోజనదూరములో ఎక్కడగాని వాలి అడుగుపెట్టినయెడల తప్పక మరణింప గలడు. వాలికి సంబంధించినవా రెవరుగాని ఇకమీద ఇక్కడ ఉండకూడదు. ఒక్కదినము గడువిచ్చుచున్నాను. అందరును వెళ్లిపోవలయును. రేపు ఇక్కడ ఎవ్వరైనను ఉందురేని ఱాయి కాగలరు" అని శపించినాడు.

ఈ సంగతి వాలి తెలిసికొని మునిచెంతకు వచ్చి ప్రార్థించినాడు. మతంగ మహా ముని వాలివైపు చూడకయే ఆశ్రమములోనికి వెళ్లినాడు. శాపహతుడై వాలి ఆశ్రమమునుండి మరలినాడు.

ఆ భయమువలననే ఇప్పుడుకూడ ఇక్కడికి రాజాలక యున్నాడు. కావున నేనిక్కడ చేరి ఇంకను బ్రతికియున్నాను.

ఇదిగో చూడుము. ఆ దుందుభి కళేబరము ఇచ్చటనే యున్నది. రామా! వాలి అట్టి బలశాలి. అతని బలమునుగూర్చి మరొక్క విషయము చెప్పుచున్నాను వినుము.

అవిగో! సప్త సాలవృక్షము లున్నవి చూచితివా! వాలిబాణము ఒకవృక్షమును భేదించి పోగలదు. వాలిబలము అట్టిది. వాలిని వధించుట సులభముకాదు.

లక్ష్మణుడు: సుగ్రీవా! రాముని ప్రభావమును గురించి నీకు నమ్మకము కలుగుటకు రాము డిప్పు డేమి చేయవలయునో చెప్పుము.

సుగ్రీవుడు: రాముడు బాణమును ప్రయోగించి ఒక సాలవృక్షమును భేదించుట యొకటి; దుందుభి కాయమును కాలితో ఎత్తి ఎనిమిదివందల చేతుల దూరము విసరుట యొకటి. వీనిని కావించినయెడల చాలును.

(రామునితో) రామప్రభూ! వాలిని తలచుకొని భయపడుచున్నాను. వాలి కృత్యములను స్మరించి దిగులొందియున్నాను. వాలి బలము కన్నులార చూచి యున్నాను. యుద్ధమున నీ పరాక్రమమును నేను చూడలేదుగనుక శంకించుచున్నాను. నా భయము ననుసరించి చెప్పినమాటలేగాని నిన్ను భయపెట్టుటకుగాని అవమానించు టకుగాని చెప్పుటలేదుసుమా! నీ ఆకారమే నీ అపారశక్తిని సూచించుచున్నది.

స ఖల్వహం త్వాం తులయే నావమన్యే న భీషయే
కర్మభి స్తస్య భీమైస్తు కాతర్యం జనితం మమ. 11-80

కామం రాఘవ తే వాణీ ప్రమాణం ధైర్య మాకృతిః
సూచయంతి పరం తేజో భస్మచ్ఛన్నమివానలమ్. 11-81

రాముడు: (నవ్వుచు) సుగ్రీవా! నా పరాక్రమమును నీవు విశ్వసించునట్లు ఇప్పుడే చేసెదను. చూడుము.

ఈ మాటచెప్పి శ్రీరాముడు దుందుభి కళేబరమును తన కాలి వ్రేలితో ఎత్తి సునాయాసముగా పదియోజనముల దూరము విసరివేసినాడు.

రాఘవో దుందుభేః కాయం పాదాంగుష్ఠేన లీలయా
తోలయిత్వా మహాబాహు శ్చిక్షేప దశయోజనమ్. 11-84

*సుగ్రీవుడు*: సరే! వాలి విసరివేసినప్పుడు, ఈ కళేబరము తడిగా, మాంసముతో బరువుగా ఉండినది. ఇప్పుడేమో ఎండిపోయి తేలికగా ఉన్నది. అప్పుడు వాలి యుద్ధము చేసి అలసియుండినాడు. ఇప్పుడు నీవు సంతోషముగా నుండి విసరినావు. కావున దీనినిబట్టి బలాబలములు నిర్ణయించుటకు వీలులేదు. ఒక సాలవృక్షమును ఒక బాణముతో భేదించినయెడల చాలును.

శ్రీరాముడు ఒకబాణమును ప్రయోగించినాడు. ఆ బాణము ఒక వృక్షమును కాదు, సప్తసాలవృక్షములను భేదించి, పర్వతమును భేదించి, భూమిలో ప్రవేశించి, భూమిని భేదించుకొనివచ్చి శ్రీరాముని తూణీరమున యథాస్థానమున చేరినది.

స నిసృష్టో బలవతా బాణ స్స్వర్ణ పరిష్కృతః
భిత్త్వా సాలాన్ గిరిప్రస్థే సప్త భూమిం వివేశ హ. 12-3

ప్రవిష్టశ్చ ముహూర్తేన ధరాం భిత్త్వా మహాజవః
నిష్పత్యచ పున స్తూర్ణం స్వస్థానే ప్రవివేశహ. 12-4

ఈ అద్భుత దృశ్యమును చూచి సుగ్రీవుడు శ్రీరామునికి సాష్టాంగనమస్కారము చేసినాడు.

*సుగ్రీవుడు*: రామప్రభూ! నా శోకము తీరిపోయినది. నీవు వాలిని ఇప్పుడే వధింపుము.

[వేడి చల్లారకపూర్వమే పని యగుట మంచిదని కాబోలు!]

**రాముడు**: (సుగ్రీవుని కవుగిలించుకొని) సుగ్రీవా! ఇప్పుడే కిష్కింధకు బయలు దేరుదము. నీవు కొంచెము ముందుగా వెళ్ళి వాలిని యుద్ధమునకు పిలువుము.

## సుగ్రీవుడు వాలిని యుద్ధమునకు పిలుచుట

అందరును కిష్కింధకు వెళ్ళి చెట్లచాటున చేరినారు. సుగ్రీవుడు గర్జించి వాలిని యుద్ధమునకు పిలిచినాడు. వాలి వచ్చినాడు. వాలి సుగ్రీవులకు ఘోరయుద్ధము జరిగినది. శ్రీరాముడు ధనుస్సును సజ్యము చేసి బాణము వేయుటకు సిద్ధముగా నున్నాడు. శ్రీరాముడు వాలి సుగ్రీవులను చూచినాడు. ఇద్దరును ఒక్కలాగే ఉన్నారు. ఇతడు వాలి, ఇతడు సుగ్రీవుడు అని పోల్చుకొనలేక శ్రీరాముడు బాణమును ప్రయోగింప నొల్లక ఊరకున్నాడు. సుగ్రీవుడు వాలిచే మర్దింపబడినాడు. సుగ్రీవుని శరీరము రక్తసిక్తమైనది. రాముని జాడ కనబడలేదు. చేయునదేమియులేక సుగ్రీవుడు

ఋశ్యమూకమునకు పరుగుతీసినాడు. వాలి యుద్ధభూమినుండి వెనుకకు మరలినాడు. శ్రీరాముడు లక్ష్మణునితోను హనుమంతునితోను కూడి సుగ్రీవునియొద్దకు వచ్చినాడు.

సుగ్రీవుడు సిగ్గుపడి భూమిని అవలోకించుచు, దీనముగా రామునితో అనుచున్నాడు.

*సుగ్రీవుడు* : రామా! ఎంతపని చేసితివి! నీ పరాక్రమమును ప్రదర్శించి, నన్ను పురికొల్పి పంపించి, వాలిచే దెబ్బలు తినిపించితివి. "ఈ కార్యము నావల్లకాదు" అని అప్పుడే చెప్పియుండినయెడల నేను వెళ్లకయే ఉండునుగదా!

[నాకీ దెబ్బలైనను తప్పియుండును]

ఆహ్వయ స్వేతి మా ముక్త్వా దర్శయిత్వా చ విక్రమమ్
వైరిణా ఘాతయిత్వా చ కి మిదానీం త్వయా కృతమ్. 12-26

తా మేవ వేళాం వక్తవ్యం త్వయా రాఘవ తత్త్వతః
వాలినం న నిహన్మీతి తతో నాహ మితో వ్రజే. 12-27

*రాముడు* : సుగ్రీవా! కోపగింపకుము. నేను బాణము ప్రయోగింపని కారణము వినుము. నీవును వాలియును ఒక్క తీరుననే ఉన్నారుగదా! మీ ఇర్వురలో నాకు భేదము కనిపింపలేదు. నా అజ్ఞానమువలన నీకు అపాయము కలిగినచో మరేమున్నది! నీకు అభయ మిచ్చి నేనే నిన్ను వధించిన యెడల ఆ పాపము నన్ను చుట్టుకొనదా! అంతకు మించిన ఘోరకృత్య మొకటికలదా! అదియును గాక, యీ అరణ్యమున నేనుగాని, లక్ష్మణుడుగాని, సీతగాని నీ అధీనములో నున్నాము. నీవేగదా మాకు రక్షకుడవు! నీకు ఆపద కలిగెనేని మాగతి ఏమి? ఈ చిక్కులను తలచుకొని నేను బాణమును విడువలేదు. నీవు మరల ఇప్పుడే యుద్ధమునకు బయలుదేరుము. ఒక్క బాణముతో వాలిని వధింతును. భయపడకుము. నేను నిన్ను పోల్చుకొనుటకు వీలుగా ఒక ఆనవాలును ధరింపుము. అంతే.

లక్ష్మణా! పుష్పభరితమైన గజపుష్పలతను కొనివచ్చి సుగ్రీవుని గ్రీవము నలంకరింపుము.

లక్ష్మణుడు గజపుష్పమాలను తెచ్చి సుగ్రీవుని కంఠము నలంకరించినాడు. అందరు కిష్కింధకు బయలుదేరినారు.

## సుగ్రీవుడు వాలితో యుద్ధమాడుటకు రెండవమారు పోవుట

సుగ్రీవుడు, లక్ష్మణుడు ముందు నడచుచున్నారు. తరువాత రాముడు, రాముని వెనుక సుగ్రీవుని మంత్రులు మార్గమునందలి వనసౌందర్యమును తిలకించుచు, మాటలాడుకొనుచు వెళ్లుచున్నారు. చెట్లు దట్టముగా నున్న ఒక ప్రదేశమునుచూచి దాని విషయము చెప్పు మని శ్రీరాముడు సుగ్రీవుని అడిగినాడు.

*సుగ్రీవుడు* : రామా! ఇది సప్తజను లని ప్రసిద్ధిగాంచిన మునుల ఆశ్రమము. ఏడు రాత్రుల కొక మారు వాయు భక్షణము మాత్రము చేయుచు ఆ మహనీయులు ఏడు వందల సంవత్సరములు తపస్సుచేసి శరీరములతో స్వర్గమున కరిగినారు. ఈ ఆశ్రమమునకు మహాప్రభావ మున్నది. ఎవ్వరుగాని అందులో ప్రవేశించుటకు వీలులేదు. మృగములుగాని పక్షులుగాని ఆశ్రమములోనికి వెళ్ళినయెడల మరల వెలుపలకు వచ్చుట యుండదు. ఆశ్రమమున ఎల్లప్పుడు మంచి సంగీతము వినబడుచుండును. త్రేతాగ్నులు సర్వదా వెలుగుచుండును.

రామా! నీవును లక్ష్మణుడును కృతాంజలులై ఆ మహర్షుల నుద్దేశించి నమస్కారము గావింపుడు. అట్లు చేసినవారికి శరీరములలో ఎట్టి బాధయును ఉండదు.

సుగ్రీవుడు చెప్పినట్లు రామలక్ష్మణులు నమస్కారము చేసినారు. అందరు ఉత్సాహముగా నడచి కిష్కింధ చేరి అందరు చెట్లచాటున ఉన్నారు.

> సర్వే తే త్వరితం గత్వా కిష్కింధాం వాలిపాలితామ్
> వృక్షై రాత్మాన మావృత్య వ్యతిష్ఠన్ గహనే వనే. 14-1

*సుగ్రీవుడు* : రామప్రభూ! కిష్కింధకు వచ్చితిమి. నీవు నీ ప్రతిజ్ఞను మరచిపోక వాలిని వధింపుము.

> ప్రతిజ్ఞా యా త్వయా వీర కృతా వాలివధే పురా
> సఫలాం తాం కురు క్షిప్రం లతాం కాల ఇవాగతః. 14-6

*రాముడు* : సుగ్రీవా! నీకు గజపుష్పమాల చిహ్న మున్నది గనుక ఇప్పుడు చిక్కేమియు లేదు. వాలిని ఒక్క బాణమున కడతేర్తును. ఎంతో కష్టములో నున్నప్పుడు కూడ నే నెన్నడు అబద్ధమాడి ఎరుగను. ఇకమీదకూడ ఆడను. నా ప్రతిజ్ఞ తప్పక పాలింతును. సందేహము వలదు.

> అనృతం నోక్తపూర్వం మే వీర కృచ్ఛ్రేఽపి తిష్ఠతా
> ధర్మలోభపరీతేన న చ వక్ష్యే కథంచన. 14-14

సుగ్రీవా! వాలిని యుద్ధమునకు పిలువుము.

సుగ్రీవుడు గర్జించి వాలిని యుద్ధమునకు పిలిచినాడు. సుగ్రీవుని గర్జన శబ్దమును వాలి విన్నాడు. వాలి ముఖము రోషావేశమున ఎఱ్ఱబారినది. రాహుగ్రస్తుడైన సూర్యుని వలె కాంతి విహీనుడై వాలి యుద్ధమునకు బయలుదేరినాడు.

తార : (వాలిని కవుగిలించుకొని) నాథా! కోపమును విడువుము. యుద్ధము రేపు చేయ వచ్చును. నీ విప్పుడు బయలుదేరుట నా కిష్టములేదు. నా ప్రార్థన నంగీకరింపుము. ఇంతకు ముందే నీచే తాడితుడైన సుగ్రీవుడు మరల వచ్చుటకు కారణ మేమి? సుగ్రీవుని ఆటోపమునకును అతని గర్జనమునకును గొప్ప కారణ ముండును. అతనికి మంచి సహాయ సంపద లభించియుండును. సుగ్రీవుడు తెలివిగలవాడు. సహాయము చేయవచ్చినవాని పరాక్రమమును చక్కగా పరీక్షించి తోడితెచ్చు కొనియుండును. ఇది కేవలము అనుమానమును బట్టి చెప్పుచున్నమాట కాదు. మన అంగదుడు చారులవలన తెలిసికొని చెప్పినమాట. అయోధ్యారాజ కుమారులు రామలక్ష్మణులు సుగ్రీవునికి సహాయులుగా వచ్చియున్నారు. రాముడు ప్రఖ్యాత వీరుడు. సాధువులకు ఉనికిపట్టు. ఆశ్రితులకు పరమగతి. ఆర్తులకు ఆశ్రయ వృక్షము. కీర్తి అతనియందే నెలకొనియున్నది.

నివాసవృక్ష స్సాధూనా మాపన్నానాం పరాగతిః
ఆర్తానాం సంశ్రయశ్చైవ యశస శ్చైక భాజనమ్. 15-19

శ్రీరాముడు జ్ఞానవిజ్ఞాన సంపన్నుడు-గుణవంతుడు-మహాప్రభావుడు. యుద్ధమున దుర్జయుడు. అట్టి రామునితో విరోధము వలదు. హితకరమైన నామాట వినుము. ఈ సమయమున నీ తమ్ముడు నీకంటె బలవంతుడుగా నున్నాడు. నీవు సుగ్రీవుని పిలిపించుకొని అతనికి యౌవరాజ్య పట్టాభిషేకము చేయుము. రామ సుగ్రీవులతో స్నేహము చేసికొనుట మనకు మేలు. ఎట్లైనను సుగ్రీవుడు నీ తమ్ముడే కదా! అక్కడ ఉన్నను ఇక్కడ ఉన్నను భేద మేమున్నది? సుగ్రీవునికంటె కావలసిన బంధువు మరొక్కడున్నాడా! కావున నీవు సుగ్రీవుని పిలిపించి సత్కరించి నీకు రెండవవానిగా చేసికొనుము. తమ్మునితో స్నేహము చేసికొనుటకన్న నీ కిప్పుడు వేరుగతి లేదు. నేను వేడుకొని చెప్పుచున్నాను. నా మాట వినుము. రామ సుగ్రీవులతో విరోధము వలదు.

యౌవరాజ్యేన సుగ్రీవం తూర్ణం సా ధ్వభిషేచయ
విగ్రహం మా కృథా వీర భ్రాత్రా రాజన్ బలీయసా. 15-23

అహం హి తే క్షమం మన్యే తేన రామేణ సౌహృదమ్
సుగ్రీవేణ చ సంప్రీతిం వైర ముత్సృజ్య దూరతః. 15-24

లాలనీయో హి తే భ్రాతా యవీయా నేష వానరః
తత్ర వా సన్నిహస్థో వా సర్వథా బంధు రేవ తే. 15-25

భ్రాతు స్సౌహృద మాలంబ నాన్యా గతి రిహాస్తి తే. 15-28

వాలి: తారా! శత్రువు సింహగర్జన మొనర్చి యుద్ధమునకు పిలువగా వీరుడు సహించి ఊరకుండగలడా! దానికన్న మరణమే మేలు. నే నిప్పుడే సుగ్రీవుని హీన గ్రీవునిగా నొనరింతును. రాముని తలచుకొని నీ వెంతమాత్రము దిగులు పెట్టు కొనవలదు. రాముడు ధర్మజ్ఞుడు. నన్ను వధించి పాప మొనర్చునా!

ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ కథం పాపం కరిష్యతి. 16-5

తారా! నాయందలి ప్రీతిచే నీవు పలుకుచున్నావు. నీ విక నిలువుము. నన్ను గూర్చి దిగులు పడకుము. నే నిప్పుడే పోయి ఆ సుగ్రీవుని సంగతి యేమియో చూచెదను. నేను సుగ్రీవుని వధింపను. వాని దర్పమును మాత్రము అణచెదను. అంతే.

పాపము! ఈ మాటలకు మారాడలేక, తార వాలిని కవుగిలించుకొని నెమ్మ దిగా దుఃఖించుచు వాలికి ప్రదక్షిణము చేసి, మంగళాచరణములు గావించి శోకముతోనే అంతఃపురము ప్రవేశించినది.

వాలి యుద్ధమునకు వెడలి సుగ్రీవు డుండిన స్థలము చేరినాడు.

## వాలి సుగ్రీవుల యుద్ధము - వాలి మరణము

వాలి సుగ్రీవులకు ఘోర యుద్ధము జరిగినది. వృక్షములతో, పిడికిళ్లతో జిగీషచే విజృంభించి మర్దించుకొన్నారు. సుగ్రీవుని బలము క్షీణింపగా అన్న యాటోపమునకు తాళలేక సుగ్రీవుడు రాముని సాయ మాశించి మాటిమాటికి దిక్కులు చూచుచున్నాడు.

హీయమాన మథోఽపశ్య త్సుగ్రీవం వానరేశ్వరమ్
వీక్షమాణం దిశ శ్చైవ రాఘవ స్స ముహుర్ముహుః. 16-31

శ్రీరాముడు సుగ్రీవుని దీనావస్థను గమనించి వాలి వక్షస్స్థలమున బాణమును వేసినాడు. వాలి నేలమీద కూలినాడు. ఇంద్రు డిచ్చిన కాంచనమాల ప్రభావమున అతని శరీరమునుండి ప్రాణములుగాని తేజస్సుగాని తొలగలేదు. కాని, రామబాణహతుడైన వాలికి ఉత్తమగతియే లభించినది.

త దస్త్రం తస్య వీరస్య స్వర్గమార్గప్రభావనమ్
రామబాణాసనక్షిప్త మావహ త్పరమాం గతిమ్. 17-8

శ్రీరాముడు లక్ష్మణ సహితుడై వాలిని సమీపించినాడు.

## వాలి శ్రీరాముని నిందించుట - రాముని ప్రత్యుత్తరము

వాలి: రామా! నీవు గొప్ప కులమున జన్మించితివి. పరాక్రమవంతుడవు. మంచివాడ వని పేరుపడి యున్నావు. నేను ఇతరునితో యుద్ధము చేయుచుండగా నామీద బాణము ప్రయోగించి నన్ను వధించితివి కదా! దీనివలన నీ కేమి లాభ మొరిగినది చెప్పుము.

త్వం నరాధిపతేః పుత్రః ప్రథితః ప్రియదర్శనః
కులీన స్సత్త్వసంపన్న స్తేజస్వీ చరితవ్రతః 17-14

పరాఙ్ముఖ వధం కృత్వా కోనుప్రాప్త స్త్వయా గుణః 17-15

నీవంటి దయామయుడు, ధర్మజ్ఞుడు లేడని నీ వర్తనమును సమస్త జనులును కీర్తించుచున్నారే! దమశమాది గుణములు, అపరాధులను దండించుట ఇవి కదా రాజుల ధర్మము!

[ఈ మాటలోనే, అపరాధ మొనర్చిన వాలిని దండించుట తప్పుకాదని వాలియే చెప్పుచున్నాడు. శ్రీరాముడు 'రాజు' అనికూడ ఒప్పుకున్నాడు.

దమ శ్శమః క్షమా ధర్మో ధృతి స్సత్యం పరాక్రమః
పార్థివానాం గుణా రాజన్ దండశ్చాఽప్యపరాధిషు. 17-17

తార ఎంత చెప్పినను చెవినిబెట్టక నీ గుణములను, నీ కులమును స్మరించి సుగ్రీవునిపైకి వచ్చితిని. నీవు గడ్డితో కప్పబడిన కూప మని గ్రహింపలేకపోయితిని.

తృణైః కూప మివాఽవృతమ్. 17-20

రామా! నీ ధర్మవేషమును చూచి మోసపోయితిని. నీ దేశమునకుగాని, నీకు గాని నే నేదేని అపకార మొనర్చితినా? నీతో యుద్ధ మాడ వచ్చితినా? నేను వానరు డను. నీవు నరుడవు. వైరమునకు భూమి, సువర్ణము, వెండి కారణము లందురు. అట్టి వైరకారణములు మన కేవియును లేవు గదా! నీవు కేవల ధనుస్సునే ఆశ్రయించి నీ ఇష్టము వచ్చినవానిని వధించువాడవుగా నున్నావు. నీకు ధర్మబుద్ధి కొంచెమైనను లేదు. ఇట్టి తప్పుపని చేసి నలుగురు పెద్దల యెదుట సమాధాన మేమి చెప్పగలవు? నా మాంసముగాని యెముకలుగాని మీకు పనికిరావు. నా చర్మము సైతము మీవంటి వారికి పనికిరాదు గదా! నన్నేల వధించితివి! నీవంటి పాపి మహాత్ముడైన దశరథునికి ఎట్లు జన్మించినాడు!

శఠో నైకృతికః క్షుద్రో మిథ్యాప్రశ్రితమానసః
కథం దశరథేన త్వం జాతః పాపో మహాత్మనా. 17-41

నిరపరాధులైన నావంటి వారిమీద నీ పరాక్రమమును ప్రదర్శించితివేగాని, నీ కపకార మొనర్చినవారిపై ప్రయోగింపజాలక యున్నావు. నీవు నా కంటబడి యుందు వేని ఈ పాటికి ప్రాణములు విడిచి యమునిచెంత నుండియుందువు. పానముచేసి ఒడలు మరచి నిద్రించుచున్న వానిని క్రూరసర్పము కరచునట్లు నీవు నన్ను వధించితివి.

దృశ్యమాన స్తు యుద్ధ్యేథా మయా యది నృపాత్మజ
అద్య వైవస్వతం దేవం పశ్యే స్త్వం నిహతో మయా. 17-45

త్వయాఽదృశ్యేన తు రణే నిహతోఽహం దురాసదః
ప్రసుప్తః పన్నగే నేవ నరః పానవశం గతః. 17-46

సుగ్రీవుని ప్రీతికొరకు నన్ను వధించితివి. కాని నాతో ఒక్కమాట మాత్రము చెప్పియుందువేని, ఒక్క దినములో సీతాదేవిని తెచ్చి నీతో చేర్చియుందును. రావణుని వధించి సీతాదేవిని నీకు సమర్పించియుండనా!

నేను మరణించినపిదప సుగ్రీవునికి రాజ్యము సంక్రమించుట న్యాయమే. కాని నీ నన్ను వధించుటమాత్రము న్యాయముకాదు. నా మాటల కేమైన సమాధానము ఉందేని చెప్పుము.

రాముడు : వాలీ! ధర్మమన నేమో, అర్థమన నేమో, కామమన నేమో, సదాచార మన ఎట్టిదో తెలిసికొనకయే నీవు నీ అజ్ఞానమువలన నన్ను నిందించుచున్నావు.

ధర్మ మర్థంచ కామంచ సమయం చాపి లౌకికమ్
అవిజ్ఞాయ కథం బాల్యా న్మా మిహాఽద్య విగర్హసే. 18-4

నీకు స్వయముగా తెలియకపోయినను తెలిసినవారిని అడిగి తెలిసికొన్నవాడవు కావు. కేవల వానర చాపల్యమున మాటలాడితివి.

మృగములు, పశులు, మానవులు గల ఈ భూమండల మంతయు ఇక్ష్వాకులది. దానిని ధర్మాత్ముడైన భరతుడు పాలించుచున్నాడు. మేమును, ఇతర రాజులమును ధర్మవృద్ధికొరకు సంచరించుచున్నాము. ధర్మము తప్పినవాడు శిక్ష ననుభవింపవలయును. మేము భరతుని ఆజ్ఞ ననుసరించి దోషులను యథావిధి శిక్షించుచున్నాము.

తే వయం ధర్మవిభ్రష్టాన్ స్వధర్మే పరమే స్థితాః
భరతాజ్ఞాం పురస్కృత్య నిగృహ్ణీమో యథావిధి. 18-11

నీవు ధర్మమును అతిక్రమించితివి. తమ్ముడు కొడుకువంటివాడు కదా! ధర్మ సూక్ష్మములను గ్రహించుట సులభము కాదు. హృదయమునం దుండు ఆత్మకుగాని ఈ సూక్ష్మము అర్థము కాదు.

సూక్ష్మః పరమదుర్జ్ఞేయ స్సతాం ధర్మః ప్లవంగమ
హృదిస్థ స్సర్వభూతానా మాత్మా వేద శుభాఽశుభమ్. 18-15

నీవొక చపల వానరుడవు. బాల్యమునుండియు వానరుల నడుమ పెరిగిన వాడవు. పుట్టుగ్రుడ్డివాడు పుట్టుగ్రుడ్డివానితో ఆలోచించునేని ఏమి కానబడును! నేను నిన్ను వధించిన కారణమును వినుము. నీవు కేవల కామమును ఆశ్రయించి, నీకు కోడలువంటిదైన తమ్ముని భార్యను అపహరించితివి. ఇంతకన్న గొప్పనేరము కలదా! నీ నేరమునకు శిక్ష విధించి నిన్ను వధించితిని. ఇది నీ పాపమునకు శాస్త్రము విధించిన శిక్ష.

ఔరసీం భగినీం వాపి భార్యాం వా ప్యనుజస్య యః
ప్రచరేత నరః కామా త్తస్య దండో వధ స్మృతః. 18-22

నాకును సుగ్రీవునికిని గల స్నేహము, నాకును లక్ష్మణునికిని గల స్నేహము వంటిది. నిన్ను వధింతు నని వానరుల యెదుట ప్రతిజ్ఞ చేసితిని. నా ప్రతిజ్ఞను పాలింప వలయునుగదా! ఎటు చూచినను, నిన్ను వధించుట ధర్మయుక్తమై యున్నది. అందులో అధర్మ మేమియును లేదు.

సర్వథా ధర్మ ఇత్యేవ ద్రష్టవ్య స్తవ నిగ్రహః. 18-29

నీవు చక్కగా ఆలోచింతువేని నేను చేసినది తప్పు కాదని నీకే బోధయగును. ధర్మ శాస్త్రవేత్తలు చెప్పిన మాట వినుము. "తప్పు చేసినవారు రాజదండనము ననుభ వింతురేని వారు నిర్మలులై స్వర్గమునకు పోగలరు. రాజు అపరాధిని దండింపక విడుచు నేని ఆ నేరము వలన కలిగిన పాపము రాజు నాపాదించును" అని చెప్పబడియున్నది. ఈ నీతి ననుసరించి మా పూర్వుడైన మాంధాత ఒక శ్రమణునికి శిక్ష విధించి యున్నాడు. ఇంకను ఎందరో మహనీయులు ఇట్లు గావించియున్నారు. పాపమునకు శిక్ష విధించి ప్రాయశ్చిత్తము చేసినయెడల, పాపవినాశన మగును. అపరాధియు, ప్రభువు ఉభయులును క్షేమపడుదురు. యుక్తాయుక్తముల నాలోచించియే నిన్ను వధించి యున్నానుగాని నా ఇచ్ఛవచ్చినట్లు చేసిన పని కాదు.

యుక్తియుక్తముగా నున్న మరియొక కారణమును కూడ వినుము. అడవి మృగములను వలలు వేసి మాటుననుండి పాశములతో బంధించి రాజులు వేటాడుట వినియున్నావుగదా! అట్లే వానరుడవైన నిన్ను వేటాడి వధించితిని. నీతో యుద్ధమాడ వలసిన పనిలేదు. వేటాడుటయే చాలును. అదియే యుద్ధము.

తస్మా త్త్వం నిహతో యుద్ధే మయా బాణేన వానర
అయుధ్య న్ప్రతియుధ్య న్వా యస్మా చ్ఛాఖామృగో హ్యసి. 18-41

దేవతలే మనుష్యరూపమున రాజులై, ధర్మమును రక్షింపుచు, భూమియందు సంచరించుచుందురు గావున రాజులను ఆక్షేపింపరాదు.

ఈ నీతివాక్యములను విన్న వాలికి కనువిప్పు కలిగినది. తా నొనర్చిన అపరాధము మనస్సునకు వచ్చి శ్రీరాముడు తనకు విధించిన దండన న్యాయసమ్మత మని గ్రహించి తన అజ్ఞానమువలన రాముని నిందించినందుకు పరితపించినాడు.

వాలి : రామా ! నీవు చెప్పినదే సరియైనమాట. అందులో సందేహములేదు. నా అజ్ఞానమువలన ఎంతో నిష్ఠురముగా మాటాలాడి తప్పుచేసితిని. నన్ను క్షమింపుము.

యదయుక్తం మయా పూర్వం ప్రమాదా దుక్త మప్రియమ్
తత్రాపి ఖలు మే దోషం కర్తుం నార్హసి రాఘవ. 18-48

రామా ! నన్నుగూర్చిగాని, తారను గూర్చిగాని నా కేమియు చింతలేదు. నా కుమారుడు అంగదుని గురించి మాత్రము విచారముగా నున్నది. అంగదునిపై నా కెంతో ప్రీతి. ఏక పుత్రుడు; పసివాడు. నా మరణమువలన అంగదుడు దిగులుపడగలడు. నీవు వానిని రక్షింపవలయును. భరతుని యందును, లక్ష్మణుని యందును ఎంత ప్రీతి నెరపుచున్నావో అంగదుని యందును, సుగ్రీవుని యందును అట్టి ప్రేమనే చూపుము.

నా దోషమునుబట్టి సుగ్రీవుడు తారను అవమానించును కాబోలు ! అట్లు జరుగకుండ చూడవలయును. ఇదియే నా ప్రార్థన.

రాముడు : వాలీ ! నీవేమియు పరితాపపడకుము. నీవు నిన్నుగురించిగాని, మమ్ములను గూర్చి గాని చింతపడకుము. నీవు నాచే శిక్ష ననుభవించితివి గనుక నీ పాపము నశించినది. నీవు బాధపడకుము. నేనుగాని సుగ్రీవుడుగాని అంగదుని పుత్రవాత్సల్యముతో చూడగలము. అంగదునిగూర్చి దిగులుపడకుము.

## తార యుద్ధభూమికి వచ్చుట

వాలికి వాటిల్లిన ఆపదనుగూర్చి విని, తార అంగదునితోకూడ అంతఃపురము నుండి బయలుదేరినది. రామ బాణమునకు భయపడి వానరు లందరు తారచెంతకు పరుగెత్తుకొని వచ్చినారు.

తార : వానరులారా ! మీ రిట్లు పరుగులిడుచున్నా రేల ! రాజ్యకాంక్షవలన సుగ్రీవుడు అన్నను చంపించినాడు. వాలి మీ ప్రభువుకదా ! ప్రభువును విడిచి పారిపోవుట తగునా !

**వానరులు :** వాలి హతుడైనాడు; కాని నీ కుమారుడు బ్రతికియున్నాడుగదా! నీవు అంగదుని రక్షించుకొనక ఇప్పుడు యుద్ధభూమికి పోవనేల! వెనుకకు మరలుము. నగర ద్వారములను భద్రపరచుకొనుము. అంగదునికి పట్టాభిషేకము జరిపింపుము. అంగదుడు రాజైనచో వానరు లందరు అతనినే అనుసరించి యుండగలరు. నీ వట్లు చేయుటకు సమ్మతింపవేని కిష్కింధను వదలి దూరదేశమునకు పొమ్ము. వాలివలన అపకారము పొందినవారు, సుగ్రీవుని అనుచరులు ఇక్కడ అనేకు లున్నారు. వారు నీ కేదేని అపాయము గావింపగలరు. నీవు నిన్ను నీ కుమారుని రక్షించుకొనుము.

**తార :** వానరులారా! ఏమిటి మీ మాటలు! మహనీయుడైన అటువంటి భర్తనే పోగొట్టుకొన్నాను! నాకు కుమారునితోగాని రాజ్యముతోగాని పని యేమి? నా శరీరముతో సైతము నాకు పనిలేదు.

పుత్త్రేణ మమ కిం కార్యం కిం రాజ్యేన కి మాత్మనా
కపిసింహే మహాభాగే తస్మిన్ భర్తరి నశ్యతి. 19-18

నేను నా భర్త పాదములనే ఆశ్రయించెదను.

శిరమును, రొమ్మును బాదుకొనుచు తార యుద్ధభూమికి వచ్చినది. బాణ హతుడై పడియున్న భర్తను చూచినది. ధనుస్సు నూని నిల్వబడియుండిన రాముని చూచినది. లక్ష్మణుని సుగ్రీవునికూడ చూచి అందరను దాటుకొని వాలిని సమీపించినది. అంగదుడు తార వెంబడి వచ్చినాడు.

**తార :** నాథా! నీవు నాతో పలుకవేమి? ఈ భూమియే నీకు ప్రియురాలైనది. కావుననే నీవు భూమిని కవుగిలించుకొని యున్నావు.

ఆహా! నా హృదయము ఎంత స్థిరమైనది! ఇట్టి శోకము సంభవించినను పగిలి ఖండ ఖండములు కాలేదే!

నాథా! సుగ్రీవుని భార్యను అపహరించి ఆతని తరుమగొట్టినందుకే నీ కీ దుస్థితి కలిగినది. నేను ఎంతసూర మో ప్రార్థించితినిగదా! నా మాటను త్రోసిపుచ్చి వచ్చితివి. నాకెట్టి దుర్గతి పట్టినది! పరమ కోపనుడైన సుగ్రీవుని చెంత అంగదుడు సుఖముగా నుండగలడా!

అంగదా! నీ తండ్రి నిప్పుడే కన్నులార చూడుము. ఇక మనకు కనిపింపడు.

నాథా! రాముడు నిన్ను వధించి సుగ్రీవుని ఋణము తీర్చుకొన్నాడు. సుగ్రీవా! నీ కోరిక తీరినది. మీ అన్న హతుడైనాడు. నీవు ఈ రాజ్యమును, నీ భార్యను, పొంది సుఖముగా నుండుము.

నాథా ! నీ భార్యలను, నీ ప్రియపుత్రుని విడిచి వెళ్లుచుంటివా ! నే నేమైన నీకు అప్రియ మొనర్చి యుందునేని నన్ను క్షమింపుము.

తార అనేక విధములుగా దుఃఖించుచు భర్తతో మరణించుటయే మేలని నిశ్చయించుకొని ప్రాయోపవేశము చేయ నుద్దేశించి భర్త ప్రక్కన పడిపోయినది.

**హనుమంతుడు :** (తారను ఊరడించుచు), ప్రతి ప్రాణియు కర్మఫలము ననుభవింపవలయును. తన్ను గూర్చి తాను దుఃఖింపవలసియుండగా మరియొక్కరిని గురించి దుఃఖించుటలో అర్థములేదు. దేహములు నీటిబుడగలవంటివి.

శోచ్యా శోచసి కం శోచ్యం దీనం దీనాఽనుకంపసే
కస్య కో వానుశోచ్యోఽస్తి దేహేఽస్మి న్బుద్బుదోపమే. 21-3

నీ కుమారుడు అంగదు డున్నాడు - అతని హితమును గూర్చి ఆలోచింపుము. తారా ! నీవు పండితురాలవు. భూతముల రాకపోకలను గురించి తెలిసినదానవు. మరణించిన వాలికి ఏది మేలో దానిని చేయవలయునుగాని ఇట్లు దుఃఖించుటవలన లాభ మేమి ? గొప్పగా బ్రతికిన వాలి స్వర్గమునకు వెళ్లగలడు. నీవు వాలిని గూర్చి దుఃఖించుట సరికాదు. వానరు లందరకు ఇప్పుడు నీవే నాథురాలవు. నీ సహాయముతో అంగదుడు వానరరాజ్యమును పాలింపగలడు.

పుత్రుని కన్న ఫలమును వాలికి చేకూర్పవలసియున్నది. వాలికి సంస్కారము చేయించి అంగదునికి పట్టాభిషేకము జరిపింపుము. సింహాసనగతు డైన పుత్రుని చూచినంతనే నీకు శాంతి లభించును.

[హనుమంతుని వాక్చాతుర్యము గమనింపదగియున్నది. అంగదునికి పట్టాభిషేకము చేయు మనుచున్నాడు.]

సంస్కార్యో హరిరాజశ్చ అంగదశ్చాభిషిచ్యతామ్
సింహాసన గతం పుత్త్రం పశ్యంతీ శాంతి మేష్యసి. 21-11

**తార :** హనుమంతుడా ! అంగదుని వంటి కొడుకులు నూరుగురికంటెను, హతుడైన వాలి కవుగిలింతయే నాకు అధికము. వాలి విషయముగాని, అంగదుని విషయము గాని చూచుకోవలసినది నేనుకాదు. అన్నిటికిని వాలి వెనుకటివాడు సుగ్రీవుడే అధికారి. అంగదునిగూర్చి నీవు చెప్పిన మాట సరికాదు. కుమారునికి హితము చేయవలసినవాడు తండ్రియే కాని తల్లికాదు. నాకు మాత్రము వాలితోడి మరణమే తగియున్నది.

అంగదప్రతిరూపాణాం పుత్త్రాణా మేకత శ్శతమ్
హతస్యాప్యస్య వీరస్య గాత్ర సంశ్లేషణం వరమ్. 21-18

న చాహం హరిరాజస్య ప్రభవా మ్యంగదస్య వా
పితృవ్య స్తస్య సుగ్రీవ స్సర్వకార్యే ష్వనంతరః. 21-14

న హ్యేషా బుద్ధి రాస్థేయా హనూమ న్నంగదం ప్రతి
పితా హి బంధుః పుత్రస్య న మాతా హరిసత్తమ. 21-15

వాలి ప్రాణము కొసకు వచ్చుచున్నది. ఊపిరి యాడుట తగ్గినది. నాలుగువైపులను దృష్టి సారించినాడు. సుగ్రీవుడు అంగదుని ముందు నిలువబడియున్నాడు.

**వాలి:** సుగ్రీవా! నేను నీకు ఎంతో అపచారము చేసినాను. తెలిసి చేసినదికాదు. విధి నన్ను లాగి నాచే అట్లు చేయించినది. మన మిద్దరము ఏకకాలమున సుఖముగా నుండకూడ దని దైవసంకల్పము కాబోలు! నాకు మరణ మాసన్నమైనది. నీ విప్పుడే ఈ రాజ్యమును గ్రహింపుము. నాకు ఒక్క కోరిక మాత్రము కలదు. నీ వెట్లైనను దానిని నెరవేర్పవలయును. అంగదుడు తండ్రిలేని బిడ్డ యగుచున్నాడు. నా ప్రాణము వానిమీదనే యున్నది. వానిని నీ సొంతకొడుకుగా చూచుకొనుము. అంగదుడు మంచి పరాక్రమశాలి. రాక్షసులను వధించుటలో ముందడుగు వేయగలడు.

తార బుద్ధిమంతురాలు. తార మాటలు ఎన్నడుగాని పెడచెవిని పెట్టవలదు.

రామకార్యమును శ్రద్ధగా చేయుము. అట్లు చేయనిచో ధర్మమును తప్పినవాడవు కాగలవు. అంతేకాదు - రాముడు నిన్ను వధింపగలడు.

సుగ్రీవా! నా కాంచనమాలను ఇప్పుడే గైకొనుము. నేను మరణింతునేని దీని ప్రభ తొలగిపోవును.

ఈ మాటలు విని సుగ్రీవునికి దుఃఖము వచ్చినది. ఆ దుఃఖముతోనే కాంచనమాలను గ్రహించినాడు.

వాలి అంగదునికి హితవాక్యములు చెప్పుచున్నాడు.

**వాలి:** నాయనా! అంగదా! దేశకాలములను గమనింపుచు, ప్రియా ప్రియములను సుఖ దుఃఖములను ఓర్పుతో సహించి, ఎల్లప్పుడును సుగ్రీవునిమాటలో నుండుము.

దేశకాలౌ భజ స్వాద్య క్షమమాణః ప్రియాప్రియే
సుఖదుఃఖ సహః కాలే సుగ్రీవ వశగో భవ. 22-20

నావలెనే సుగ్రీవుడుకూడ నిన్ను ప్రేమింపగలడు. సుగ్రీవుని శత్రువులతో ఎప్పుడుగాని చేరవలదు. అట్టిశత్రువులకు సంబంధిచిన వారితో సైతము స్నేహము చేయవలదు. సర్వకాలములందును స్వామికార్యమును శ్రద్ధతో చేయుచుండుము.

ఇంద్రియ నిగ్రహము కలిగియుండుము. ఎవ్వరితో గాని అమితస్నేహము పెట్టుకొన వలదు - అట్లని స్నేహము చేయకయే యుండవలదు.

మాస్యాఽమిత్రైర్గతం గచ్ఛే ర్మా శత్రుభి రరిందమ
భర్తు రర్థపరో దాంత స్సుగ్రీవవశగో భవ. 22-22

న చాతిప్రణయః కార్యః కర్తవ్యోఽప్రణయశ్చ తే
ఉభయం హి మహా న్దోష స్తస్మా దన్తరదృ గ్భవ. 22-23

ఈ చరమోపదేశము చేసి వాలి ప్రాణము విడిచినాడు.

వానరు లందరు వాలిని కీర్తించుచు విలపించినారు.

**వానరులు:** ఈ కిష్కింధ సౌభాగ్యమంతయు వాలితోనే పోయినది. వాలివంటి వీరుడు మరియొక్కడున్నాడా! గోలభు డను గంధర్వునితో పదునైదు సంవత్సరములు అహోరాత్రము లనక యుద్ధము చేసి పదునారవపట వానిని వధించిన వీరాగ్రేసరుడు. వాలి బ్రతికియుండగా భయ మనునది ఎట్టిదో ఎరుగము. అట్టి వీరునికి మరణ మెట్లు కలిగెనోకదా!

ఇట్లు పరిపరివిధములుగా వానరులు దుఃఖించినారు.

## తారా విలాపము

**తార:** నాథా! నామాట పెడచెవినిబెట్టి, ఇచ్చటికి వచ్చి, ఈ కటికినేలపై శయనించి యున్నావు. విధివిధానమేకాని సుగ్రీవునిచే నీకు మరణము కలుగుటయేమి! నీచేతనే ఎందరో హతులై పడినచోట నీవు పడియున్నావే! నీ ప్రియురాలనైన నన్ను అనాథను చేసితివిగదా! తెలివిగలవాడు తన కొమారితను శూరుని కీయ గూడదను మాటలో ఎంతో సత్యమున్నది. శూరుని భార్యగా నున్నందున గదా నాకీ వైధవ్యము ప్రాప్తించినది. నా గర్వము అణగినది. నేను దరి గానని దుఃఖ సముద్రమున మునిగినాను. పుత్రు లెంద రున్నను, ధన ధాన్య సంపదలు పుష్కలముగా నున్నను పతిని గోల్పోయిన స్త్రీని 'విధవ' అని యందురుగదా!

పతిహీనా తు యా నారీ కామం భవతు పుత్రిణీ
ధనధాన్యై స్సుపూర్ణాఽపి విధవే త్యుచ్యతే జనైః. 23-12

నీ శరీరమంతయు రక్తసిక్తమై యున్నది. దేహముమీద దుమ్ముతో రక్తము కలిసి యుండుటవలన చేతులు జారిపోవుచున్నవి. నిన్ను గాఢముగా కవుగిలించుకొన జాలకున్నాను. సుగ్రీవుని కోరిక ఫలించినది. నీ వక్షస్థలమున రామబాణము నాటుకొని యున్నందున నిన్ను మనసార కవుగిలించుకొనుటకుకూడ వీలులేక యున్నది.

ఈ మాట విని నీలుడు వాలి దేహమునుండి బాణమును పెరికినాడు. రక్తము ప్రవహించినది. తార వాలి శరీరముమీద పడి దుఃఖించినది. తార అంగదుని చూచి "కుమారా! నీ తండ్రి అంత్యదశను చూడుము. పాపమువలన కలిగిన విరోధము ఈ విధముగా పరిపూర్తి యైనది. యముని సన్నిధి కరుగుచున్న నీ తండ్రికి నమస్కరింపుము" అని చెప్పినది.

అంగదుడు తండ్రికి నమస్కరించి, తండ్రిని తలచుకొని విలపించినాడు.

*తార :* నాథా! నన్ను విడిచి పోవుచుంటివా! నీ కాంచనమాల కనబడుటలేదేమి? నీ ప్రాణములు పోయినను నీ ముఖకాంతి తరుగలేదుకదా!

తార దుఃఖమునకు అంతము కనబడలేదు. సుగ్రీవునికికూడ దుఃఖము వచ్చినది. ధనుస్సు చేతబట్టుకొని నిలువబడియున్న రాముని సమీపించి సుగ్రీవుడు అనుచున్నాడు.

*సుగ్రీవుడు :* రామా! నీ ప్రతిజ్ఞను పాలించి, వాలిని వధించి, నాకు రాజ్యప్రాప్తి కలిగించితివి. కాని నాకు దీనివలన సంతోష మేమియు కలుగలేదు. తార దుఃఖమును చూడజాలకున్నాను. అన్నను చంపించిన నన్ను చూచి అంగదుడు కూడ నన్ను గూర్చి సందేహముతో నుండును. నాకు రాజ్యముతో పనిలేదు. ఇంతకుముందు అన్న చనిపోవుట మే లనిపించినది. కాని నేను చేసిన పని మంచిది కాదని ఇప్పుడు తెలియవచ్చినది. నా అకార్యమును తలచుకొని విచారపడుచున్నాను. నేను ఋశ్యమూక పర్వతముననే నివసింతును. మహాత్ముడైన వాలిని చంపించిన పాపాత్ముడను.

మా అన్న చేతులలో నేను ఎన్నిమారులో చిక్కితిని. కాని ఆ మహనీయుడు "నిన్ను చంపను. వెళ్ళిపొమ్ము" అని పంపుచుండినాడు. అట్టి ఉదారుని నేను చంపించినాను. నా వంటి పాపి లోకమునం దుండడు. సౌదర్యమునుగాని ధర్మమునుగాని గుర్తింపక నేను కామక్రోధములకు లోబడి నా కపిత్వమును ప్రదర్శించితిని. నా పాపము నెవరు భరింపగలరు! నేను రాజ్యము పాలించుటకు తగను. అగ్ని ప్రవేశము చేసెదను. ఈ వానరు లందరు నీ ఆజ్ఞ శిరసావహించి సీతాన్వేషణము చేయగలరు. రామా! నాకు సెలవిమ్ము.

ఈ విధముగా సుగ్రీవుడు విలపించుచున్నాడు.

తార మాటిమాటికి శ్రీరాముని వైపు చూడజొచ్చినది. వాలిని కవుగిలించుకొని పడియున్న తారను మంత్రులు ఊరడించి లేపినారు. తార రాముని చూచి ఆకారమును బట్టి అతడే రాము డని గుర్తించి రాముని సమీపించి మాటలాడుచున్నది.

తార : రామా ! నీవు అప్రమేయుడవు. నిన్ను దరియ నెవ్వరికిని సాధ్యముకాదు. నీవు జితేంద్రియుడవు; ధార్మికుడవు. నీ కీర్తికి క్షయములేదు. నీవు విచక్షణుడవు. నీకు భూదేవి కున్నంత ఓర్పు కలదు.

త్వ మప్రమేయ శ్చ దురాసద శ్చ
జితేంద్రియ శ్చోత్తమ ధార్మిక శ్చ
అక్షయ్యకీర్తి శ్చ విచక్షణ శ్చ
క్షితి క్షమావాన్ క్షతజోపమాక్షః. 24-31

ఒక్క బాణమున నీవు నా భర్తను వధించితివి. ఆ బాణముచేతనే నన్ను కూడ వధించి నా భర్త చెంతకు చేర్పుము. నా జీవితేశ్వరుడు నన్ను బాసి స్వర్గమునందుకూడ సుఖముగా నుండజాలడు. సీతాదేవిని బాసి నీ వెట్లు బాధపడుచుంటివో అట్లే నన్ను బాసి వాలి పరితపించుచుండును. యౌవనమునం దున్న పురుషునికి భార్యా విరహము వలన ఎట్టి తాపము కలుగునో నీకు తెలియనిది కాదు. కావున, నన్ను వధించి వాలి యొద్దకు పంపుము.

త్వం వేత్థ యావ ద్వనితా విహీనః
ప్రాప్నోతి దుఃఖం పురుషః కుమారః. 24-36

నన్ను వధించినందున స్త్రీ హత్యా దోషము కలుగు నని శంకింపవలదు. నేను వాలి ఆత్మను అను భావముతో నన్ను వధింపుము. నీకు స్త్రీ వధ దోషము సంభవింపదు. భార్యాదానము చేసిన పుణ్యముకూడ నీకు లభ్య మగును. దానిని మించిన దానము లేదని పెద్ద లందురు. అట్టి ఉత్తమ దానము చేయుదువేని వాలి వధవలన నీకు కలిగిన పాపము నశింపగలదు.

త్వం చాపి మాం తస్య మమ ప్రియస్య
ప్రదాస్యసే ధర్మ మవేక్ష్య వీర
అనేన దానేన నలప్స్యసే త్వ
మధర్మయోగం మమ వీర ఘాతాత్. 24-39

రామా ! నేను వాలిని విడిచి బ్రతికియుండజాలను.

రాముడు : తారా ! శూరుని భార్యవై యుండి ఇట్లు పలుక తగునా ! బ్రహ్మ విధించిన ప్రకారము లోకమున సుఖదుఃఖములు కలుగుచుండును. విధిని తప్పించుటకు ముల్లోకములలో ఎవ్వరికిని సాధ్యముకాదు. నీకు సంతోష కాలము త్వరలోనే రాగలదు. నీ కుమారుడు అంగదుడు యువరాజు కాగలడు.

త్రయోహి లోకా విహితం విధానం
నాతిక్రమంతే వశగా హి తస్య
ప్రీతిం పరాం ప్రాప్స్యసి తాం తథైవ
పుత్త్రస్తు తే ప్రాప్స్యతి యౌవరాజ్యమ్. 24-43

తారాంగద సుగ్రీవులు దుఃఖమునం దుండగా వారితో సమానముగా శ్రీరాముడు కూడ దుఃఖించినాడు.

[శ్రీరాముని గొప్ప గుణములలో ఇదియెకటి. ఒకరికి దుఃఖము కలిగినప్పుడు తాను గూడ వారితో సమానముగ దుఃఖించును. ఒకనికి సంతోషము కలుగుట చూచి అసూయపడక వానితో సమముగా తానుకూడ సంతోషింపగలడు.]

శ్రీరాముడు అందరను ఊరడించుచున్నాడు.

రాముడు : దుఃఖముతో మన మెంత పరితపించినను మరణించిన వాలికి సుఖము కలుగదు. అనంతరము జరుగవలసిన కార్యమును జరిపించుటయే ఇప్పటికి తగినపని. లోక మర్యాద ననుసరించి కన్నీరు విడుచుట అయినది.

లోకమున కాలమును మించిన శక్తిలేదు. మన చేతిలో ఏమియునులేదు. కాలము నతిక్రమించుటకు ఎవ్వరికిని సాధ్యముకాదు. కాలమునకు బంధుత్వములేదు. కారణములేదు. కాలుడు స్వతంత్రుడేగాని ఒకనికి లోబడియుండువాడుకాడు. ధర్మార్థ కామములు మనకు కాలనియోగమువలన సమకూరునవిగా పండితుడు గ్రహింపగలడు. కాలమునకు అందరము కట్టుబడవలసినదే.

లోకవృత్త మనుష్ఠేయం కృతం వో బాష్పమోక్షణమ్. 25-3

నియతిః కారణం లోకే నియతిః కర్మసాధనమ్
నియతి స్సర్వభూతానాం నియోగేష్విహ కారణమ్. 25-4

న కర్తా కస్యచి త్కశ్చి న్నియోగే చాపి నేశ్వరః
స్వభావే వర్తతే లోక స్తస్య కాలః పరాయణమ్. 25-5

న కాలః కాల మత్యేతి న కాలః పరిహీయతే
స్వభావం చ సమాసాద్య న కశ్చి దతివర్తతే. 25-6

న కాల స్యాస్తి బంధుత్వం న హేతు ర్న పరాక్రమః
న మిత్రజ్ఞాతి సంబంధః కారణం నాత్మనో వశః. 25-7

కిం తు కాలపరీణామో ద్రష్టవ్య స్సాధు పశ్యతా
ధర్మ శ్చార్థశ్చ కామశ్చ కాలక్రమ సమాహితాః. 25-8

వాలి తన కర్మఫలముగా స్వర్గమునకు వెళ్ళినాడు. వాలిని గూర్చి దుఃఖింపవలసిన పనిలేదు. అతనికి జరుగవలసిన సంస్కారముము జరిపింపుడు.

**లక్ష్మణుడు :** సుగ్రీవా! నీ విక వాలికి జరుగవలసిన సంస్కారము జరిపింపుము. ఈ పట్టణమంతయు నీ యధీనమున నున్నది. తగిన ఉత్తరువుల నిచ్చి కార్యమును చేయుము. ఇట్లు దుఃఖించుచుండకుము. అంగదునికి ధైర్యము చెప్పి ఊరడింపుము. వాలి దహనమునకు కావలసిన చందనాది కాష్ఠములను తెప్పింపుము. సంస్కారమునకు కావలసిన ద్రవ్యములు, పుష్పమాలలు, వస్త్రములు, ఆజ్యము, తైలము, గంధద్రవ్యములు, ఇంకను కావలసిన అన్ని వస్తువులను అంగదునిచేత తెప్పింపుము.

తారుడా! నీవు త్వరగా వెళ్ళి మేలుపల్లకిని గొనిరమ్ము. వాలిని మోయదగిన వారిని సిద్ధముచేయుము.

తారుడు పల్లకిని తెచ్చినాడు.

**రాముడు :** లక్ష్మణా! వాలి శరీరమును పల్లకిలో పెట్టించి సంస్కారమునకు ఏర్పాటు కావింపుము.

సుగ్రీవుడు, అంగదుడు, వాలికళేబరమును పట్టియెత్తి పల్లకిలోనుంచినారు. పల్లకిని పుష్పమాలలతోను, మేలివస్త్రములతోను చక్కగా అలంకరించినారు.

**సుగ్రీవుడు :** రత్నములను, ధనమును ధారాళముగ వెదజల్లుచు, పల్లకిముందు కొందరు నడువుడు. గొప్ప రాజులకు సంస్కారము ఏవిధముగా జరుగవలయునో ఆవిధమున వాలికి శ్రద్ధతో జరుపవలయును.

స్త్రీలు, పురుషులు విలపించుచు పల్లకివెంబడి నడచినారు. నదియొద్దున చితి పేర్చినారు. తార మరలమరల విలపించుచున్నది. సుగ్రీవుడు, అంగదుడు వాలికళేబరమును చితిమీద చేర్చినారు. అంగదుడు తండ్రికి అగ్నిసంస్కారము కావించినాడు. అందరు ఏటియొద్దకు వచ్చి జలతర్పణములు చేసినారు.

సుగ్రీవుడు వాలికి దహనకర్మ జరిపించి రామలక్ష్మణుల చెంతకు తడివస్త్రములతోనే వచ్చి నిలువబడినాడు. ఇతర వానర ప్రముఖులుకూడ వచ్చి రామునికి నమస్కారముచేసి నిలువబడినారు.

## సుగ్రీవుని పట్టాభిషేకము

**హనుమంతుడు :** రామప్రభూ! నీ ప్రసాదమువలన సుగ్రీవునికి రాజ్యము ప్రాప్తించినది. నీ అనుమతితో సుగ్రీవుడు నగరము ప్రవేశించి, నానావిధములైన సుగంధ

ద్రవ్యములతోను, ఓషధుల రసములతోను యథావిధిగా పట్టాభిషేకము చేసికొని నిన్ను రత్నములతో, పుష్పములతో, పూజింపగలడు. నీవు కిష్కింధకు దయచేసి మా సపర్యల నందుకొని మమ్ములను కృతార్థుల చేయుమని వేడుచున్నాను.

రాముడు : హనుమంతుడా! నేను తండ్రియాజ్ఞను పాలించి వనవాసవ్రతమును చేయుచున్నాను. ఈ పదునాలుగు సంవత్సరములు గ్రామమునగాని, నగరమునగాని అడుగుపెట్టుటకు వీలులేదు. మీరందఱు వెళ్లి సుగ్రీవునికి వెంటనే పట్టాభిషేకము జరిపింపుడు.

సుగ్రీవా! నీవు పట్టాభిషిక్తుడవు కమ్ము. అంగదునకు యౌవరాజ్య పట్టాభిషేకము చేయుము. కార్తికమాసము వచ్చుటతోడనే రావణవధనుగూర్చి తగు ప్రయత్నములు చేయుము. ఇదియే మన ఏర్పాటు. జ్ఞప్తియం దుంచుకొనుము.

వానరు లందఱు కిష్కింధకు వెళ్లి సుగ్రీవునికి యథాశాస్త్రముగా పట్టాభిషేకము కావించినారు.

గజో గవాక్షో గవయ శ్శరభో గంధమాదనః
మైందశ్చ ద్వివిద శ్చైవ హనుమాన్ జాంబవా న్నళః 26-34
అభ్యషించంత సుగ్రీవం ప్రసన్నేన సుగంధినా
సలిలేన సహస్రాక్షం వసవో వాసవం యథా. 26-35

సుగ్రీవుడు అంగదునికి యౌవరాజ్యపట్టాభిషేకము జరిపించినాడు. వానరు లందఱు ఆనందించి రామలక్ష్మణులను కొనియాడినారు. కిష్కింధయంతయు ఆనందమయమైనది. సుగ్రీవుడు వానరరాజ్యముతోపాటు తన భార్యయైన రుమనుసైతము పొంది సుఖముగా నున్నాడు. సుగ్రీవుడు శ్రీరాముని సన్నిధికి వచ్చి కిష్కింధయందు జరిగిన విశేషములను నివేదించి రామలక్ష్మణుల సెలవు గైకొని నగరమున కరిగినాడు.

తరువాత రామలక్ష్మణులు ప్రస్రవణగిరికి వచ్చి అక్కడ ఒక గుహలో నివసించుచున్నారు.

## శ్రీరాముడు సీతాదేవిని తలచుకొని విలపించుట

రాముడు : లక్ష్మణా! ఈ గుహ రమ్యముగాను, విశాలముగాను ఉన్నది. గాలి తగు మాత్రముగనే వీచుచున్నది. ఈ వర్షఋతువును ఇచ్చట సుఖముగా గడపవచ్చును. ఇక్కడ కొండలు, సెలయేళ్లు, వృక్షములు, లతలు, ఎంతో మనోహరముగా నున్నవి. తామరకొలనుకూడ సమీపముననే యున్నది. ఈశాన్యదిశ వైపున

దిగుటకు అనుకూలముగా నున్నందున ఈ గుహ నివాసయోగ్యముగానుండును. పడమట ఎత్తుగా నున్నది గనుక గాలి విసరు అధికముగా నుండదు. గుహా ద్వారమున శిలలు నునుపుగా కంటికి ఇంపుగా నున్నవి. నది తూర్పుతట్టు ప్రవహించుచున్నది. నదీతీరములందలి నానాజాతి వృక్షములను చూడగా వస్త్రాభరణములతో అలంకృతయైన స్త్రీవలె కనబడుచున్నది.

తీరజైః శోభితా భాతి నానారూపైః స్తతస్తతః
వసనాభరణోపేతా ప్రమదే వాభ్యలంకృతా. 27-19

పక్షిసంఘములతోను చక్రవాకముల జంటలతోను హంససారసములతోను కూడియున్న ఈ నది, చక్కగా అలంకరించుకొని నవ్వుచున్న సుందరాంగివలె ప్రకాశించుచున్నది.

[శ్రీరాముని ఉపమానములు విరహవేదనను సూచించుచున్నవి]

లక్ష్మణా ! ఆ కలువలను చూడుము. కొన్ని నీలవర్ణములుగాను, కొన్ని రక్తవర్ణములుగాను, కొన్ని తెలుపురంగు గలవిగాను చక్కగా భాసిల్లుచున్నవి. మద్దిచెట్లు చందన వృక్షములు, చేతులార నాటి పెంచినట్లు పంక్తులుతీరి ఎంతో ముచ్చటగానున్నవి. లక్ష్మణా ! ఈ ప్రదేశమంతయు రమణీయముగా నున్నది. ఇచ్చట మనము సుఖముగా నివసింపవచ్చును. సుగ్రీవుని కిష్కింధయు సమీపముననే యున్నది - అదిగో చూడుము. కిష్కింధలోని గీత వాద్యముల శబ్దములు, వానరుల హర్షనాదములు వినబడుచున్నవి. సుగ్రీవుడు తన భార్యను, రాజ్యమును పొంది స్నేహితుల నడుమ ఆనందించుచున్నాడు; ఇందుకు సందేహము లేదు.

లబ్ధ్వా భార్యాం కపివరః ప్రాప్య రాజ్యం సుహృ ద్వృతః
ధ్రువం నందతి సుగ్రీవ స్సంప్రాప్య మహతీం శ్రియమ్ 27-28

రామలక్ష్మణులు ప్రస్రవణగిరిగుహాయందు నివసించుచు కాలము గడుపుచున్నారు. ఆ ప్రదేశము రమ్యముగా నున్నను రామునికి మాత్రము కొంచమైనను సుఖము కలుగుటలేదు. సీతాదేవిని తలచుకొని తలచుకొని దుఃఖించుచున్నాడు. రాత్రులయందు నిద్ర పట్టుటలేదు. చంద్రుని చూచినప్పుడు తాపము వృద్ధియగుచుండినది. దివారాత్రములు శోకపీడితుడై బాధపడుచున్నాడు.

శ్రీరాముని స్థితిని చూచి లక్ష్మణునికి దుఃఖము కలిగినది. అన్నను ఊరడించుచున్నాడు.

**లక్ష్మణుడు:** రామా! నీ దుఃఖమును చాలింపుము. నీ వెల్లప్పుడు శోకమగ్నుడవై యుండుట సరికాదు. శోకమువలన పనులు చెడిపోవును. ఈ మాట నీకు తెలియనిది కాదు. నీవు క్రియాపరుడవు. ధర్మపరుడవు. నీ విట్లైనచో రావణుని వధించుట సాధ్యమగునా! శోకమును త్యజింపుము. కార్యదీక్ష వహింపుము. రావణుని పరివార సమేతముగా నిర్మూలింపుము. భూమండలమును తలక్రిందులు చేయగల శక్తి నీకు కలదు. ఈ రావణుడు నీకొక లెక్క కాదు.

శరత్కాలము వచ్చువరకు ఓర్పుతో వేచియుండుము. అటుమీద రావణుని నిర్మూలింపుము. నిద్రించుచున్న నీ అమోఘ శక్తిని మేల్కొలుపుటకై చెప్పుచున్నాను కాని మరేమియు కాదు.

> అలం వీర వ్యథాం గత్వా నత్వం శోచితు మర్హసి
> శోచతో వ్యవసీదంతి సర్వార్థా విదితం హి తే 27-34
>
> సముస్మూలయ శోకం త్వం వ్యవసాయం స్థిరం కురు
> తత స్సపరివారం తం నిర్మూలం కురు రాక్షసమ్ 27-37
>
> పృథివీ మపి కాకుత్స్థ ససాగరవనాచలామ్
> పరివర్తయితుం శక్తః కి మంగ పున రావణమ్. 27-38
>
> **అహం తు ఖలు తే వీర్యం ప్రసుప్తం ప్రతిబోధయే.** 27-40

[అంతమాత్రము ధైర్యము చెప్పువా డున్నచో ఎంత ఉత్సాహమైన కలుగును.]

**రాముడు:** లక్ష్మణా! నీ పలుకు లెంతో హితవుగా నున్నవి. అనురాగము, స్నేహముగల మిత్రుడు, హితుడు, వీరుడు చెప్పదగిన వచనములను పలికితివి. సర్వకార్యములను నాశనమొనరించు శోకమును వదలిపెట్టుచున్నాను. పరాక్రమము నవలంబించెదను.

సుగ్రీవుని అనుగ్రహమును, నదుల ప్రసాదమును కాంక్షించుచు శరత్కాలమున కెదురు చూచుచుందును. మనవలన ఉపకారము పొందిన సుగ్రీవుడు మనకు సహాయపడకుండునా!

**లక్ష్మణుడు:** రామా! సుగ్రీవుడు నీకోరికను తప్పక నెరవేర్చును. ఈ వర్షాకాలమును మాత్రము ఓర్పుతో భరింపుము.

**రాముడు:** లక్ష్మణా! ఆకాశమును కప్పివైచిన ఈ మేఘమండలమును చూచితివా! పర్వతపంక్తివలె కన్పట్టుచున్నది. సూర్యకిరణములచే సముద్రజలమును త్రాగి ఆకాశము గర్భముదాల్చి నవమాసములు మోసి వర్షమును ప్రసవించుచున్నది.

మేఘసోపానపంక్తులమీద ఆకాశమున కెక్కి సూర్యునికి పుష్పమాలలు వేసి అలంకారము చేయవచ్చు నని అనిపించుచున్నది. తెల్లని మేఘములు సంధ్యారాగమున ఎఱ్ఱబారియుండుట చూడగా ఆకాశమునకు గాయము తగిలి తెల్లని వస్త్రముతో కట్టుకట్టుకున్నట్టు కనబడుచున్నది. మందమారుతము నిట్టూర్పులుగాను, సంధ్య రక్తచందనపు మైపూతగాను కలిగి తెల్లని మేఘములతో కూడిన ఆకాశము విరహవేదనకు గురియైనట్లు తోచుచున్నది. ఎండకు తపించిన భూమిమీద క్రొత్తగా వర్షము పడుటవలన కలిగిన ఆవిరిని చూడగా, భూదేవి సీతవలెనే కన్నీరు కార్చుచున్నట్టు కానవచ్చుచున్నది. పరుపుద్ది, మొగలి మొదలైన పుష్పముల సుగంధములతో నిండియున్న ఈ పర్వతముపై జలధారలు పడుట చూడగా, శత్రువులను జయించి సుగంధజలములతో అభిషేకము చేసికొన్న సుగ్రీవుడు తలపునకు వచ్చుచున్నాడు.

నల్లని మేఘములలోని మెరపు రావణాంకగతయైన సీత చందమున నున్నది.

చంద్రుడును నక్షత్రములును లేక మేఘములతో చీకటియైనరాత్రి కాములకు ప్రియముగానుండును. ఈ పుష్పములు, ఋతువులు, ఈ ప్రకృతి సౌందర్యము నా విరహబాధను వృద్ధిచేయుచున్నవి: ఈ మయూరములను చూడుము. కొన్ని నాట్యమాడుచున్నవి. కొన్ని కేకారవములు చేయుచున్నవి. కొన్ని ఊరక చూచుచు నిలువబడి యున్నవి. వీనిని చూడగా ఈ అడవిలో సంగీతసభ జరుగుచున్నట్లు కనబడుచున్నది.

వర్షాకాలము రాబోవు నని భరతుడు ఇంటికి కావలసిన సామగ్రిని ఆషాఢపూర్ణిమకు ముందే సేకరించియుండును. నే నెచ్చటికైనను వెళ్ళివచ్చినప్పుడు అయోధ్యాపురవాసులు నాకు స్వాగత మిచ్చి, కావించు జయధ్వానములనుబోలు ధ్వనితో సరయూనది ఈ కాలమున వేగముగా ప్రవహించుచుండును.

సుగ్రీవుడు తన కోరిక లన్నింటిని తీర్చుకొని ఈ వర్షాకాలములో సుఖముగా నున్నాడు. నేను రాజ్యమును, భార్యను కోల్పోయి ప్రవాహ వేగమునకు గురియైన ఏటిగట్టువలె క్షీణించిపోవుచున్నాను.

**అహం తు హృతదార శ్చ రాజ్యాచ్చ మహత శ్చ్యుతః**
**నదీకూల మివ క్లిన్నం అవసీదామి లక్ష్మణ.** 28-58

నేను శోకమును భరింపజాలకున్నాను. వర్షఋతువును గడపుట సులభముగా **లేదు. రావణుడు అసాధ్యుడై**న శత్రువు. లక్ష్మణా! మన మీ కష్టములను ఎన్నటికైన **దాటుగలమా!**

శోకశ్చ మమ విస్తీర్ణో వర్షాశ్చ భృశ దుర్గమాః
రావణశ్చ మహాన్ శత్రు రపారం ప్రతిభాతి మే. 28-59

సుగ్రీవుడు దీర్ఘకాలము భార్య నెడబాసి యుండినవాడగుట ఇప్పుడు మన విషయమును గురించి గమనింపకున్నాడు. వర్షాకాలమున ఆత డెట్లున్నను శరత్కాలమున నైన మన సంగతి పట్టించుకొనునా!

[శ్రీరామునికి విరహవేదన కలిగినది. దేనిని చూచినను మన్మథ వికారము కలుగుచున్నది. సీతాదేవి జ్ఞప్తికి వచ్చుచున్నది. భరతుడు, అయోధ్య, సరయూనది, సంగీత సభలు స్మృతికి వచ్చుచున్నవి.

ఈ ఘట్టమున మనము గుర్తింపవలసిన విషయము శ్రీ వాల్మీకి మహర్షి రచనమునందలి సొగసు. వర్షాకాల ప్రారంభమునుండి శరత్కాలము వచ్చువఱకు జరుగు పనులేమియును లేవు. అంతదీర్ఘకాలము జరిగినదని ఒక్కమాట చెప్పినయెడల కాలము గడచిన సంగతి మన మనస్సునకు రాదు. ఈ సర్గలు చదివినచో కాలగమనము మన కన్నులకు కట్టినట్లుండును.]

**లక్ష్మణుడు :** రామా! ఊరడిల్లుము. సుగ్రీవుడు తనమాట నిలబెట్టుకొని నీ కోర్కెను తప్పక తీర్పగలడు. శరత్కాలము దనుక ఓర్చి యుండుము.

## సుగ్రీవుడు ప్రమత్తుడై యుండుట - హనుమంతుని హెచ్చరిక

సుగ్రీవుడు రాజ్యభారమును మంత్రులపై మోపి అంతఃపురమును వీడక రుమతోను, తారతోను కాలక్షేపము చేయుచున్నాడు. మేఘములు, మెఱుపులు పోయి ఆకాశము నిర్మలమైనది. హనుమంతుడు దీనిని గ్రహించి రామకార్యమునుగూర్చి సుగ్రీవునికి జ్ఞప్తి చేయుచున్నాడు.

**హనుమంతుడు :** ప్రభూ! నీకు రాజ్యము లభించినది. నీవు కీర్తిని ఆర్జించితివి. మిత్ర కార్యము మాత్రము మిగిలియున్నది. దానినికూడ పూర్తిచేయుము. మిత్రులను దూరముచేసికొన్న రాజు సుఖపడజాలడు. తన పను లన్నిటిని వదలుకొని మిత్రకార్యమును నెఱవేర్చువానికి ఎన్నడును అనర్థము కలుగదు. సీతాదేవిని వెదకు ప్రయత్నము చేయుము. శ్రీరాముడు మహనీయుడు. నీ మనస్సననుసరించి యుండువాడు. కావున కాలము మించిన దని నీతో చెప్పడు. ఆయన చెప్పకమునుపే మనము చేయుట మేలు. శ్రీరాముడు చెప్పువఱకు మనము కదలకున్నచో, ఆ తరువాత మనము చేసినను, కాలమును అతిక్రమించి తప్పు చేసినవారమే అగుచున్నాము.

న హి తావ ద్భవే త్కాలో వ్యతీత శ్చోదనా దృతే
చోదితస్య హి కార్యస్య భవే త్కాల వ్యతిక్రమః 29-20

ఉపకారము చేయనివాని కార్యము సైతము నీవు చక్కచేయువాడవు కదా! రామునివలన సహాయము పొంది ఆయనకు ప్రత్యుపకారము చేయు విషయములో నీకొకరు చెప్పవలసిన దేమున్నది! శ్రీరాముడు తన బాణప్రయోగముచే సమస్త విశ్వమును వశపరచుకొనగలడు. కాని నీవు వాగ్దానము చేసినందున నీకొరకు ఎదురు చూచుచున్నాడు. నీ నిమిత్తము శ్రీరాముడు వాలిని వధించినమాట మరువవలదు. మనము సీతాన్వేషణము చేయవలసియున్నది. వానర సైన్యములను పిలిపింపుము. కాలాతీతము కానీయకుము.

హనుమంతుని నీతివాక్యములు విని సుగ్రీవుడు తన సేనాపతియైన నీలుని పిలిచి ఉత్తరువు లిచ్చుచున్నాడు.

**సుగ్రీవుడు :** నీలుడా! మన సైన్యము లన్నిటిని రప్పింపుము. దూతలను పంపివారినిగా పంపి మనవారి నందరను పిలిపింపుము. పదునైదు దినములలోపల రానివానికి మరణదండన విధించుచున్నాను. దీనినిగురించి సందేహము లేదు.

ఈ యేర్పాటు కావించి సుగ్రీవుడు మరల అంతఃపురములోనికి ప్రవేశించినాడు.

## శరత్కాలము - శ్రీరాముని విరహవేదన

శరత్కాలము వచ్చినది. ఆకాశము నిర్మలమయినది. శరద్రాత్రులందు చంద్రుడు వెన్నెలతో కూడి ప్రకాశించుచున్నాడు. శ్రీరామునికి సీతా వియోగబాధ అధికమైనది. సీతాదేవి వృత్తాంతము తెలియలేదు. సుగ్రీవుడేమో కామపరాయణుడై యున్నాడు. ఈ విషయములు తలపునకు రాగా శ్రీరాముడు శోకోపహతుడై మూర్ఛిల్లి కొంత సేపటికి తేరి సీతాదేవిని తలచుకొని విలపించుచున్నాడు.

**రాముడు :** (తనలో) ఈ విరహవేదన భరింపజాలకున్నాను. సుకుమారియైన సీత సైతము ఈ శరత్కాలమున ఎంతో బాధపడుచుండును.

వన్యఫలములకై వెళ్ళియుండిన లక్ష్మణుడు గుహకు వచ్చి ఒంటరిగా కూర్చుండి దుఃఖించుచుండిన అన్నను చూచి ఊరడించుచున్నాడు.

**లక్ష్మణుడు :** రామా! ఇకెంత సేపు దుఃఖపడుచుందువు. దుఃఖించుటవలన పని అగునా! మనము పౌరుషమును ఉత్సాహమును అవలంబించి ధైర్యముగా నుండవలసిన సమయమున దుఃఖించుట తగదు. నీవు నాథుడవై యుండగా సీతాదేవిని వశము

చేసికొనుట ఎవనికి సాధ్య మగును. అగ్నిని చేతపట్టుకొన్నవాడు మాడి మసియై పోవడా !

రాముడు : లక్ష్మణా ! నీవు చెప్పినదే సరి; నేను కార్యదీక్షవహింతును. ఇంద్రుడు భూమికి కావలసిన వర్షమును కురిపించి తన కార్యమును నెరవేర్చినాడు. పర్వతములు వర్షముచే శుభ్రముగా కడుగబడి పలురంగుల శిలలతో ప్రకాశించుచున్నవి. నదులు తమ పులినప్రదేశములను లజ్జావతు లగు నవవధువుల జఘనములవలె నించించుక ప్రకటించుచున్నవి.

దర్శయంతి శర న్నద్యః పులినాని శనై శ్శనైః
నవసంగమ సంవ్రీడా జఘనానీవ యోషితః 30-28

[శ్రీరాముని విరహవేదన తీవ్రత యీ ఉపమానముపలన సూచిత మగుచున్నది]

హంసలు, చక్రవాకములు నదుల ఇసుకతిన్నెలమీద క్రీడించుచున్నవి. శరత్కాలలక్ష్మి పరిపరి విధములుగా తన కాంతులను వెదజల్లుచున్నది. దిక్కులు ప్రకాశించుచున్నవి. రాజులు దండయాత్రలు సాగించు కాలము వచ్చినది. కాని, సుగ్రీవుడు కనబడుటలేదు. అతడు మన విషయమై ఎట్టి ప్రయత్నమును కూడ చేసినట్టులేదు.

సీతను తలచుకొని పరితపించుచున్న నాకు ఈ వర్షాకాలము నాలుగు మాసములు నూరు సంవత్సరములవలె కష్టముగా గడచినవి.

చత్వారో వార్షికా మాసా గతా వర్షశతోపమాః
మమ శోకాభిభూతస్య సౌమ్య సీతా మపశ్యతః 30-64

పాపము ! సీత ఉద్యానవనమునకు వచ్చినట్లు ఈ అరణ్యమునకు నా వెంట వచ్చినది.

## శ్రీరాముడు లక్ష్మణుని సుగ్రీవునియొద్దకు పంపుట

రాముడు : లక్ష్మణా ! రాజ్యభ్రష్టుడనై అడవికి వచ్చి ప్రియురాలిని గోల్పోయి దుఃఖములో నున్నాను. రాజైన సుగ్రీవునికి నా మీద దయరాలేదు. "రాముడు దిక్కులేనివాడు. రాజ్యమును పోగొట్టుకొని రావణునిచే అవమానింపబడి నన్ను శరణు జొచ్చినాడు" అని భావించి సుగ్రీవుడు నన్ను నిర్లక్ష్యము చేసి పరిభవించుచున్నాడు చూచితివా ! సీతను వెదకుటకు శరత్కాలమున వచ్చెద నని ఆ దుర్మార్గుడు మనకు మాట ఇచ్చి ఆ సంగతినే మఱచిపోయిన ట్టున్నాడు. తనపని చక్కజేసికొని హాయిగా కూర్చుండియున్నాడు.

లక్ష్మణా ! నీవు కిష్కింధకుపోయి నా మాటగా సుగ్రీవుని కిట్లు చెప్పుము. "అర్థిజనులకును, ఉపకారము చేసినవారికిని ఆశలు కల్పించి ప్రతిజ్ఞలు చేసి తమ మాట చెల్లింపనివారు పురుషాధములు. మంచిదిగాని చెడ్డదిగాని, తనమాట నిలబెట్టుకొనువాడు వీరుడు. అట్టివాడే పురుషోత్తముడు. కృతఘ్నుల కళేబరములను నక్కలు సైతము స్పృశింపవు. నా బాణవేగమును రుచిచూడదలచుకొన్నచో చూడుము" అని సుగ్రీవునితో చెప్పుము.

లక్ష్మణా ! సుగ్రీవుడు పానమత్తుడై క్రీడించుచుండి దీనులమైన మన సంగతినే పట్టించుకొనకున్నాడు. నీవు వెళ్లి నా కోపస్వరూపమును సుగ్రీవుని కెఱుకపఱచి, "వాలి హతుడై పోయినదారి మూయబడలేదు. సుగ్రీవా ! నీ మాటమీద నిలువుము. లేనియెడల వాలి పోయిన మార్గముననే పోగలవు" అని స్పష్టముగా తెలియ జెప్పుము

లక్ష్మణా ! కాలము మించిపోవుచున్నది. నీవు పోయి సుగ్రీవునికి చెప్పవలసిన మాటలు చెప్పి మనకార్యము సఫల మగునట్లు చూడుము.

ప్రియావిహీనే దుఃఖార్తే హృతరాజ్యే వివాసితే
కృపాం న కురుతే రాజా సుగ్రీవో మయి లక్ష్మణ 30-66

అనాథో హృతరాజ్యోఽయం రావణేన చ ధర్షితః
దీనో దూరగృహః కామీ మాం చైవ శరణం గతః 30-67

ఇత్యేతైః కారణైః సౌమ్య సుగ్రీవస్య దురాత్మనః
అహం వానరరాజస్య పరిభూతః పరంతప 30-68

కృతార్థా హ్యకృతార్థానాం మిత్రాణాం న భవంతి యే
తాన్ మృతానపి క్రవ్యాదాః కృతఘ్నాన్నోపభుంజతే. 30-73

న చ సంకుచితః పంథా యేన వాలీ హతో గతః
సమయే తిష్ఠ సుగ్రీవ మా వాలిపథ మన్వగాః 30-81

శ్రీరాము డిట్లు దీనముగా పలుకుట చూచి లక్ష్మణుడు ఉగ్రమూర్తి అయినాడు.

లక్ష్మణుడు : రామా ! ఈ చపలవానరుడు తనమాటమీద ఉండువాడుకాడు. ఎడతెఱిపి లేక గ్రామ్యసుఖములలో మునిగితేలుచు నీవు చేసిన మేలు మరచిపోయినాడు. మన మాట అనుకొనుటయే లేదు. ఇట్టి గుణహీనుడు రాజుగా నుండదగడు. మొదటిమాట, వానిని ప్రాణముతో ఉండనీయకూడదు. సుగ్రీవుని నే నిప్పుడే వధించి పుత్తును. సీతాన్వేషణకార్యమును వానరవీరుల సహాయముతో అంగదుడు చేయగలడు.

న ధారయే కోప ముదీర్ణ వేగం
నిహన్మి సుగ్రీవ మసత్య మద్య
హరిప్రవీరై స్సహ వాలిపుత్రో
నరేంద్ర పత్న్యా విచయం కరోతు. 31-4

రాముడు : (లక్ష్మణుని కోపమును తగ్గింపదలచి) తమ్ముడా! ఇట్లు పలుకదగునా! మిత్రుని వధించువా రెవరైన నుందురా! సుగ్రీవునియెడ ఎంతో ప్రీతి జూపుచుండు వాడవుగదా! కాలము కొంచెము మించినమాట నిజమే యగునుగాక. ఈ చిన్న విషయమునకై ఇంతకోప మెందుకు! నీవు సౌమ్యుడవుకదా! నీవు వెళ్ళి సుగ్రీవునికి చెప్పవలసినమాటలు మృదువుగా చెప్పి మనపని సానుకూలము చేసికొనిరమ్ము.

సామోపహితయా వాచా రూక్షాణి పరివర్జయన్
వక్తు మర్హసి సుగ్రీవం వ్యతీతం కాలపర్యయే. 31-8

## లక్ష్మణుడు సుగ్రీవునియొద్దకు పోవుట

ఇంద్రధనుస్సుతో సరివచ్చు తన ధనుస్సును ధరించి, లక్ష్మణుడు కోపోద్రిక్తుడై కిష్కింధకు బయలుదేరినాడు. దారిలో అడ్డముగా నున్న చెట్లను చేతులతో పెల్లగించి వేయుచు, పాదములక్రింద పడిన శిలలను పిండిచేయుచు, పెద్దపెద్ద అంగలు వేయుచు, విసరుగా నడచుచున్నాడు. "తాను సుగ్రీవునితో ఏమాటలు చెప్పవలయును? సుగ్రీవుని మాటలకు తానేమి బదులు పలుకవలయును?" అను విషయములను మననము చేసికొనుచు నడక సాగించినాడు. నగరమువెలుపల తిరుగుచుండిన కొందరు వానరులు కోపమూర్తియగు లక్ష్మణుని చూచి చెట్లను, పర్వత శిఖరములను, చేతికి తీసికొన్నారు. దీనిని చూచి లక్ష్మణుని కోపము రెండింత లయినది. వానరులు నాలుగుదిక్కులకు పరుగులుదోలి సమాచారమును సుగ్రీవునికి నివేదించినారు. కాని సుగ్రీవుడు వారి మాటలను చెవినివేసికొనలేదు. తారను గూడి కాలము గడపుచు తన లోకమున నున్నాడు. సుగ్రీవుని మంత్రులు విషయ మేమో తెలిసికొని రమ్మని కొందరు వానరవీరులను పంపినారు. వారివెంట అంగదుడు వచ్చినాడు.

లక్ష్మణుడు : (కోపముతో) అంగదా! సుగ్రీవునితో ఇట్లు చెప్పుము. "అన్నగారికి దుఃఖము కలిగినందున తపించుచు లక్ష్మణు డిచ్చటికి వచ్చి ద్వారమున వేచియున్నాడు. అతని మాటను విని నీ కిష్టముగా నున్నచో అతడు కోరినట్లు చేయుము" ఈ మాటలు సుగ్రీవునితోచెప్పి వేగిరము రమ్ము.

అంగదుడు సుగ్రీవుని చెంత కరిగి లక్ష్మణుని సందేశమును అందజేసినాడు కాని సుగ్రీవు డీలోకమునలేదు. పానమత్తుడై పడియున్నాడు.

న నిద్రా మద సంవీతో వానరో న విబుద్ధవాన్
బభూవ మదమత్తశ్చ మదనేన చ మోహితః. 31-38

వానరులు కిలకిల శబ్దములు చేసి సుగ్రీవుని మేల్కొలిపినారు. సుగ్రీవుని కన్నులు ఎఱ్ఱగా నుండినవి. మత్తు వదలలేదు. ఈలోపల మంత్రులు వచ్చినారు.

మంత్రులు : ప్రభూ! రామలక్ష్మణు లని నీ కిద్దరు మిత్రు లున్నారు. వారు సత్యసంధులు, మహానుభావులు. వారిలో నొకడైన లక్ష్మణుడు వచ్చి ద్వారముచెంత వేచి యున్నాడు. కోపముతో మండిపడుచున్నాడు. నీవు పరివార సమేతుడవై వెళ్లి శిరసా నమస్కారము గావించి అతని కోపమును చల్లార్పుము. ధర్మాత్ముడైన రాముడు చెప్పినట్లు వర్తింపుము. నీ విచ్చిన మాట నిల్వబెట్టుకొనుము.

లక్ష్మణుని కోపకారణము సుగ్రీవుని మనస్సునకు రాలేదు.

సుగ్రీవుడు : లక్ష్మణు డేల ఆగ్రహించెనో తెలియుటలేదు. నే నెప్పుడుగాని ఒక తప్పుపని చేసి ఎరుగను. తప్పుమాటకూడ అనియుండలేదు. నా విరోధు లెవ్వరైనను నామీద లేనిపోని తంటాలను చెప్పియుందురు. వానిని లక్ష్మణుడు చెవిని వేసికొని యుండును.

అసుహృద్భి ర్మమామిత్రై ర్నిత్య మంతర దర్శిభిః
మమ దోషా నసంభూతాః శ్రావితో రాఘవానుజః 32-4

మీ రందరు ఆలోచించి సంగతి తెలిసికొనుడు. రాముని చూచిగాని, లక్ష్మణుని చూచిగాని నేను భయపడ నవసరములేదు. కాని ఒక మిత్రునికి కోపము కలుగుట ఆందోళన కలిగించుచున్నది. స్నేహితుని సంపాదించుట సులభమే కాని స్నేహమును కాపాడుకొనుట మాత్రము కష్టము. మనస్సులు చంచలములు గనుక ఒక స్వల్ప భేదము కలిగినను స్నేహము చెడును.

సర్వథా సుకరం మిత్రం దుష్కరం పరిపాలనమ్
అనిత్యత్వా చ్చ చిత్తానాం ప్రీతి రల్పేపి భిద్యతే 32-7

శ్రీరామునివలన ఎంతో ఉపకారము పొందియున్నాను. అందుకు తగిన ప్రత్యుపకారము చేయుట నాకు సాధ్యము కాదు. గనుక ఆ విషయమై భయమగుచున్నది.

హనుమంతుడు : ప్రభూ! నీకు సుఖమును కలిగించుటకై శ్రీరాముడు వాలిని వధించినాడు. నీ మీద రామునికి వచ్చిన కోపము ప్రణయకోపమే గాని మరేమియు కాదు. నీవు ప్రమత్తుడవుగా నుండి శరత్కాలము వచ్చిన విషయమునుగూడ గమనింపకున్నావు. కావుననే లక్ష్మణుడు వచ్చియుండును. భార్యను కానక

రాముడు దుఃఖములో నున్నాడు. నీ మాటను నీ స్మృతికి తెచ్చుటకు లక్ష్మణుని పంపినాడు. వారి కోపమును నీవు ఓర్చుకొనవలయును. కాలాతీత మైనందున నీ వలన తప్పు జరిగినది. నీవు వెళ్ళి లక్ష్మణునికి నమస్కరించి అతని క్షమాపణ వేడుకొనుట యుక్తము. తప్పు చేసినవాడు చేయదగినపని అది ఒక్కటే.

[దాసరి తప్పులు దండముతో సరి అనుమాట ఇట్టిదే]

కృతాపరాధస్య హి తే నాన్య త్పశ్యా మ్యహం క్షమమ్
అంతరే ణాంజలిం బద్ధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్ 32-17

మంత్రియైనవాడు ప్రభువున కేదిమేలో దానినే చెప్పవలయును. కావున ఉన్న సంగతి నేను నిర్భయముగా చెప్పుచున్నాను. శ్రీరాముని పరాక్రమము నీకు తెలియనిది కాదు. ఆయన కోపించి బాణము ప్రయోగించునేని జగత్తంతయు ఆయన వశము కాగలదు. అట్టి రామునకు కోపము కలిగింపవలదు. అదిగాక ఆ మహనీయుని వలన నీ వెంతో ఉపకారమును పొందియున్నావు. ఆయన పాదములకు శిరసా మ్రొక్కి భార్య తన భర్తకు వశురాలైనట్లు నీవు రాముని వశమున నుండుము. మీకు జరిగిన పర్పాటును అతిక్రమింపకుము.

తస్య మూర్ధ్నా ప్రణమ్య త్వం సపుత్త్రః ససుహృజ్జనః
రాజం స్తిష్ఠస్వ సమయే భర్తు ర్భార్యేవ తద్వశః 32-21

[హనుమంతుడు రామసుగ్రీవులకు అగ్నిసాక్షిగా స్నేహము కలిపినాడు. పెండ్లియంత పని చేసినాడు. రామసుగ్రీవులు ఒకనిచేతి నొకరు పట్టుకొని అగ్నికి ప్రదక్షిణము చేసినవారు కావుననే కాబోలు భార్యాభర్తల ఉపమానమును హనుమంతుడు సూచించుట. రామునికి కలిగిన కోపమును ప్రణయకోప మన్నాడు.

సర్వథా ప్రణయా త్క్రుద్ధో రాఘవో నాత్ర సంశయః 32-12

రామసుగ్రీవుల మైత్రి ఎంత గొప్పదో! రాముడు కవుగిలించ లిచ్చి సుగ్రీవుని ఎన్ని పర్యాయములో ఆదరించియున్నాడు. సుగ్రీవుడు ఎంతో అదృష్టవంతుడు. అతని భాగ్యమే భాగ్యము.]

లక్ష్మణుడు సుగ్రీవుని అంతఃపురము చేరువ నున్నాడు. లోపలినుండి సంగీతము వినబడినది. మంచి రూపసంపదగలిగిన యువతులు నిండియున్నారు. లోపలినుండి అందెల చప్పుడు, గజ్జెల చప్పుడు విని లక్ష్మణుడు సిగ్గుపడినాడు.

కూజితం నూపురాణాంచ కాంచీనాం నినదం తథా
సన్నిశమ్య తత శ్శ్రీమాన్ సౌమిత్రి ర్లజ్జితోఽభవత్. 33-24

లక్ష్మణుడు కోపించి టంకార మొనర్చి ఆ యువతు లుండుచోటు వీడి ఏకాంత మైన మఱియొక చోటికి కదలినాడు.

లక్ష్మణుని అల్లెత్రాటి మ్రోత విని సుగ్రీవుడు భయపడి తారతో సంప్రతించు చున్నాడు.

*సుగ్రీవుడు :* తారా ! నీ కేమైనను బోధపడినదా ! లక్ష్మణుడు సహజముగా ఎంతో మృదుస్వభావుడు గదా ! ఇప్పు డేల ఇట్లు కోపించుచున్నాడు ! నే నేదేని పొరపాటు చేసియుందునా ! నీకు జ్ఞాపక మున్నచో చెప్పుము. లేక, నీవే స్వయము ముగా వెళ్ళి లక్ష్మణుని ప్రసన్నుని జేయుట మేలైన పని. గొప్పవారు స్త్రీల ముందర కోపింపరు. నిన్ను చూచినంతనే లక్ష్మణుని కోపము మాయ మగును. ఆ పిమ్మట నేను వెళ్ళి కలిసికొనుట సులభముగా నుండును.

త్వద్దర్శన విశుద్ధాత్మా న స కోపం కరిష్యతి
నహి స్త్రీషు మహాత్మానః క్వచి త్కుర్వంతి దారుణమ్. 33-35

## తార లక్ష్మణునితో సంభాషించుట

తారసైతము మద్యపానము చేసి కైపులో నుండినది. సోలుచు, తూలుచు, పడకటింటి లక్షణములతో లక్ష్మణుని చెంతకు వచ్చినది.

సా ప్రస్ఖలంతీ మదవిహ్వలాక్షీ
ప్రలంబ కాంచీగుణహేమసూత్రా
సలక్షణా లక్ష్మణ సన్నిధానం
జగామ తారా నమితాంగయష్టిః 33-37

తారను చూచుటతోడనే లక్ష్మణుని కోపము మాయమయినది. సిగ్గుతో తల వంచుకొన్నాడు. తార మత్తులో నుండి సిగ్గువిడిచి మాటాడుచున్నది.

**తార :** రాజపుత్రా ! ఎందు కీ కోపము ! నీ ఆజ్ఞను తిరస్కరించినవా రెవరు ? అంత నిర్భయముగా నీ మాట కాదన్నవా డెవడు ?

ఈ మాటలతో లక్ష్మణుని కోపము పూర్తిగా చల్లారినది.

**లక్ష్మణుడు :** **తారా !** నీ భర్తయైన సుగ్రీవుడు ఎల్లప్పుడు మత్తులో నుండి **మా మాటయే** మరచిపోయినాడు. నాలుగు మాసములు గడువు నిర్ణయించుకొని **దాని సంగతియే** అనుకొన్నట్టులేదు. మద్యపానమువలన ధర్మార్థకామములు **నశించును.**

నహి ధర్మార్థసిద్ధ్యర్థం పాన మేవం ప్రశస్యతే
పానా దర్థశ్చ ధర్మశ్చ కామశ్చ పరిహీయతే 33-45

సుగ్రీవుడు మావలన ఉపకారము పొంది మా కిచ్చిన మాటను తప్పినప్పుడు మే మేమి చేయవలయునో నీవే చెప్పుము.

తార : సుగ్రీవు డెల్లప్పుడు మీ క్షేమమునే కోరుచున్నాడు. మీకు కావలసినవాడుకదా! అతనిమీద ఇంతగా కోపింపదగునా! ఏదేని పొరపాటు జరిగియున్నను, మీవంటి గొప్పవారు క్షమింపవలయును. నీకు కోప మేల కలిగెనో నాకు తెలియును. మీరు సుగ్రీవునికి చేసిన మేలు నాకు తెలియనిదికాదు. దానికతడు బదు లేమి చేయవలయునో దానినికూడ ఎరుగుదును. సుగ్రీవుడు కామవశుడై యున్న విషయమును సైతము గుర్తించినాను. నీ కోపమును చూడగా నీకు కామ తంత్రము సంగతి తెలిసినట్లే లేదు. కామరతు డైనవాడు దేశకాలములనుగాని ధర్మాధర్మములనుగాని లెక్కచేయడు.

న కామతంత్రే తవ బుద్ధి రస్తి
త్వం వై యథా మన్యువశం ప్రపన్నః
న దేశకాలౌ హి న చార్థధర్మా
వపేక్షతే కామరతి ర్మనుష్యః 33-54

కామవృత్తియందుండి సిగ్గు విడిచిన నీ సోదరుడగు సుగ్రీవుని క్షమింపుము. గొప్ప ఋషులు సైతము మన్మథుని జయింపనేరరన్న, చపలచిత్తులైన వానరు లేమి చేయ గలరో యోచింపుము.

ఇంతకును, సుగ్రీవు డిట్టి అవస్థయందున్నను మీ మాటను మరచిపోలేదు. మీ కార్యసిద్ధికొరకు వానరు లందరకును ఇంతకుమునుపే ఉత్తరువు లిచ్చియున్నాడు. కోట్లకొలది వానరలు నానాదేశములనుండి వచ్చుచున్నారు.

లక్ష్మణా! అంతఃపురములోనికి రమ్ము. మిత్రుల భార్యలను చూచుటలో దోషములేదు.

త దాగచ్ఛ మహాబాహో చారిత్రం రక్షితం త్వయా
అచ్ఛలం మిత్రభావేన సతాం దారావలోకనమ్ 33-60

లక్ష్మణుడు లోపలికి వెళ్లి స్త్రీలనడుమ నున్న సుగ్రీవుని చురచుర చూచినాడు. సుగ్రీవునికి దిగులుపుట్టి సువర్ణాసనమునుండి లేచినాడు. రుమ మున్నగు అంతఃపుర కాంత లందరు లేచి నిలబడినారు. సుగ్రీవుడు అంజలి ఘటించి లక్ష్మణుని యెదుట నిలిచినాడు.

శ్రీరాముని సందేశమును సుగ్రీవునితో లక్ష్మణుడు చెప్పుచున్నాడు.

లక్ష్మణుడు : (కోపముతో) సుగ్రీవా! బలవంతుడు, కులీనుడు, దయాపరుడు, జితేంద్రియుడు, కృతజ్ఞుడు, సత్యవాది అయిన రాజును మాత్రమే లోకము పూజించును. అధర్మ పరుని, ఉపకారముచేసిన మిత్రుని కిచ్చినమాట పాలింపని వానిని, పాపిష్ఠు డని లోకులు నిందింతురు గుఱ్ఱము విషయమున అబద్ధము చెప్పిన వానికి నూరు గుఱ్ఱములను చంపిన పాపము చుట్టుకొనును. గోవు విషయమున అబద్ధము చెప్పిన వానికి వేయి గోహత్యలు చేసిన పాపము చుట్టుకొనును. మనుష్యుని విషయమున అబద్ధ మాడినవాడు తననూ, తన వారినీ వధించినంత పాపము పొందును.

కృతఘ్నుని వధించుట దోషముకాదు. కృతఘ్నుని గూర్చి బ్రహ్మచెప్పిన గీతమును వినుము. "బ్రహ్మహత్య చేసినవానికి, సురాపాన మొనర్చిన వానికి, చోరునకు, భగ్నవ్రతునికి పెద్దలు ప్రాయశ్చిత్తమును విధించియున్నారు. కాని కృతఘ్నునికి మాత్రము ప్రాయశ్చిత్తమే లేదు."

బ్రహ్మఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా
నిష్కృతి ర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః. 34-12

వానరుడా! నీవు దుర్మార్గుడవు. కృతఘ్నుడవు. అసత్యవాదివి. రాముడు నీకు చేసిన ఉపకారము నీకు జ్ఞప్తియందున్నచో సీతాదేవిని వెదకుటకు నీవు తగిన ప్రయత్నము చేసియుందువు. నీ వట్లు చేయక గ్రామ్యసుఖములందు తగుల్కొని మాట తప్పితివి. నీవు కప్పయెలుగున అరచు సర్పమని రాముడు గుర్తింపజాలక పోయినాడు.

న త్వాం రామో విజానీతే సర్పం మండూక రావిణమ్. 34-15

నీ విట్టి దురాత్ముడ వని తెలియక రాముడు నీ కీ రాజ్యమును ప్రసాదించినాడు. రాముడు చేసిన ఉపకారమును నీవు మరతువేని నిన్ను వధించి వాలిచెంతకు పంపగలను. వాలి హతుడై పోయిన మార్గము మూయబడలేదు. నీవు మాట తప్పినయెడల వాలి పోయిన మార్గముననే పోగలవు. రామకార్యమును మనసాకూడ తలపెట్టక సుఖముగా నున్నావు. రామబాణ మహిమ నీకు తెలిసినట్లులేదు.

తార : లక్ష్మణా! శాంతింపుము. సుగ్రీవునిగూర్చి పరుషముగా పలుకకుము. సుగ్రీవుడు కృతఘ్నుడుకాడు. మోసగాడుగాని, క్రూరుడుగాని కాడు. రాజ్యమును, రుమను, నన్ను రామప్రసాదము వల్లనే సుగ్రీవుడు పొందగలిగినాడు. దీర్ఘ కాలము ఒంటరిగా నుండి కష్టపడి, ఈనాటికి సుఖము ననుభవించుచు కాల

గమనమును మరచిపోయినాడు. విశ్వామిత్రుడు మేనకనుగూడి కాలగతిని విస్మరించి పదిసంవత్సరములను ఒక్కదినముగా గడపినాడుగదా !

ప్రాప్తకాలం న జానీతే విశ్వామిత్రో యథా మునిః. 35-6
ఘృతాచ్యాం కిల సంసక్తో దశవర్షాణి లక్ష్మణ
అహోఽమన్యత ధర్మాత్మా విశ్వామిత్రో మహామునిః. 35-7

అంతటి మహానుభావుడే అట్లైనయెడ, సామాన్యవానరుని సంగతి ఒకలెక్కయా! సుగ్రీవుని తప్పును క్షమింపుము. నీవంటి గొప్పవారు మంచి చెడ్డలు విమర్శింపకయే కేవల ప్రాకృతునివలె కోపగింతురా ! లక్ష్మణా ! నీవు శాంతించి సుగ్రీవుని అనుగ్రహింపుము. నా ప్రార్థన అంగీకరింపుము. రామకార్యమునకుగా సుగ్రీవుడు రుమను, నన్ను, రాజ్యమును, ధనధాన్యములను, ఐశ్వర్యమును, సమస్తము త్యాగము చేయుటకు సర్వసిద్ధుడై యున్నాడు. యుద్ధమున రావణుని వధించి సీతారాముల సమాగమమును సుగ్రీవుడు తప్పక సమకూర్పగలడు. వానరసైన్యము కోట్లలెక్కన ఇప్పుడే రాగలదు. సైన్యసహాయములేక రావణుని సంహరించుట అసాధ్యమని వాలి నాతో చెప్పియున్నాడు. మీ కార్యార్థము వానరసైన్యమును పిలిపించుటకు తగిన యేర్పాటులను సుగ్రీవుడు ఇంతకుమునుపే చేసియున్నాడు.

లక్ష్మణా ! నీవు ప్రసన్నుడవై మమ్ములను పీడించుచున్న భయమును పోగొట్టుము.

తార పలుకులను విని, మృదుస్వభావుడైన లక్ష్మణుడు శాంతించినాడు. మాటలాడుటకు సుగ్రీవునికి కొంత ధైర్యము కలిగినది. మత్తు వదలిపోయినది. కంఠమున నుండిన పుష్పమాలను తీసివైచినాడు.

*సుగ్రీవుడు :* లక్ష్మణా ! శ్రీరాముని అనుగ్రహమువలన నాకు రాజ్యము లభించినదను సంగతి నేను మరచిపోలేదు. నేను మీకుగా ఎంతచేసినను మీకు తగిన ప్రత్యుపకారము కానేరదు. శ్రీరాముడు తన తేజస్సుచేతనే రావణుని వధించి సీతాదేవిని తెచ్చుకొనగలడు. నేను కేవల సహాయమాత్రుడను.

సీతాం ప్రాప్స్యతి ధర్మాత్మా వధిష్యతి చ రావణమ్
సహాయమాత్రేణ మయా రాఘవ స్స్వేన తేజసా 36-7

సప్తసాల వృక్షములను ఒక్కబాణముతో భేదించిన శ్రీరామునికి మరియొక్కని సహాయము కావలసియున్నదా ! లక్ష్మణా ! నేను మీ భృత్యుడను. మీ వెంట నడచుటకు

సిద్ధముగా నున్నాను. నేను చేసిన పొరపాటును క్షమింపుము. లోకమున తప్పు చేయని వా డుండునా!

యది కించి దతిక్రాంతం విశ్వాసా త్ప్రణయేన వా
ప్రేష్యస్య క్షమితవ్యం మే నకశ్చి న్నాపరాధ్యతి 36.11

ఈ మాటలతో లక్ష్మణుని కోపము పూర్తిగా తీరిపోయినది.

**లక్ష్మణుడు :** సుగ్రీవా! నీ యట్టి వినయసంపన్నుడు నాథుడుగా నున్నందున రాముడు సనాథుడే అయినాడు. నీ ప్రభావమునుబట్టి, నీ గుణములనుబట్టి, నీవు వానర రాజ్యమును పాలించుటకు తగినవాడవే. నీ సహాయముతో రాముడు తన శత్రువును త్వరలోనే వధింపగలడు. ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, వీరుడు చెప్పదగిన మాటలను చెప్పితివి. నీవును మా అన్నయును తప్ప మరెవ్వరుగాని ఇట్లు మాటలాడలేరు.

[తప్పును ఒప్పుకొని వినయముగా మాటలాడువారు అరుదు.]

దోషజ్ఞ స్సతి సామర్థ్యే కోఽన్యో భాషితు మర్హతి
వర్జయిత్వా మమ జ్యేష్ఠం త్వాం చ వానరసత్తమ 36.17

సుగ్రీవా! నీవు వెంటనే వచ్చి మా అన్నను ఊరడింపుము. రాముని దుఃఖమును చూచి, ఆయన దీనాలాపములను విని సహింపజాలక, నీతో పరుషముగా పలికితిని. నీ వా మాటలను మనస్సునం దుంచుకొనక నన్ను క్షమింపుము.

య చ్చ శోకాభిభూతస్య శ్రుత్వా రామస్య భాషితమ్
మయా త్వం పరుషా ణ్యుక్త స్తచ్చ త్వం క్షంతు మర్హసి 36.20

[ఈ మాట లన్నవాడు లక్ష్మణుడేనా అనిపించును!]

హనుమంతుడు ప్రక్కన ఉన్నాడు.

**సుగ్రీవుడు :** హనుమంతుడా! మనవారి నందరను పిలిపింపుము. మహేంద్రగిరి, హిమాలయశైలము, వింధ్యపర్వతము, మున్నగు పర్వతములమీద నున్నవారిని అడవులలో నుండువారిని, గుహలలో నివసించువారిని, సమస్త వానరులను, భల్లూకములను పిలిపింపుము. ఇంతకుమునుపే నేను దూతలను పంపియున్నాను. వారినందరను త్వరగా కదలిరమ్మని చెప్పుటకు మేటిదూతలను పంపుము. పది దినములలో రానివానికి మరణదండన విధించుచున్నాను.

హనుమంతుడు దూతలను పంపినాడు. పర్వతములమీద, సముద్రతీరమున, అడవులయందు, గుహలలో, నదీతీరములందు నివసించు వానరులను, భల్లూకములను,

దూతలు పిలిచి వచ్చినారు. హిమాలయమునకు వెళ్ళిన దూతలు అక్కడి ఫలమూల ములను పుష్పములను తెచ్చి సుగ్రీవునికి కానుకగా సమర్పించినారు.

[పోయివచ్చితి మనుటకు గుర్తుగాకూడ ఇవి ఉపయోగపడునుగదా]

దూతలు పోయివచ్చి, అందరు బయలుదేరి వచ్చుచున్నారని సుగ్రీవునికి నివేదించినారు.

*లక్ష్మణుడు :* (మృదువుగా) సుగ్రీవా! రాముని సన్నిధికి పోవుదమా ?

## సుగ్రీవుడు శ్రీరామునియొద్దకు వచ్చుట

సుగ్రీవుడు తన అంతఃపుర స్త్రీలను లోనికంపినాడు. పల్లకీ తెమ్మని వానరులకు ఆజ్ఞ నిచ్చినాడు. పల్లకి రాగా దానిలో లక్ష్మణుని కూర్చుండబెట్టి తానును కూర్చుండి నాడు. సైన్యములను గూడి, శంఖ భేరీ నినాదములతో లక్ష్మణ సుగ్రీవులు పల్లకిలో బయలుదేరి రాముని సన్నిధికి వచ్చి దిగినారు. సుగ్రీవుడు శ్రీరామునికి సాష్టాంగ నమస్కారము చేసినాడు. శ్రీరాముడు సుగ్రీవుని లేవనెత్తి, కవుగిలించుకొని కూర్చుండ బెట్టి, తాను సంతోషించి సుగ్రీవునితో అనుచున్నాడు.

*రాముడు :* సుగ్రీవా! రాజైనవాడు కాలమును గుర్తించి ఆయా కాలమునకు తగినట్లు ధర్మార్థ కామములను సేవింపవలయును. అట్లుగాక ధర్మమును అర్థమును విడిచి కామమును మాత్రమే సేవించువాడు చెట్టు చివరకొమ్మమీద పరుండి నిద్రించినవానివలె ముందు క్రిందపడి తరువాత మేల్కాంచును.

ధర్మ మర్థం చ కామం చ య స్తు కాలే నిషేవతే
విభజ్య సతతం వీర స్స రాజా హరిసత్తమ 38-20

హిత్వా ధర్మం తథాఽర్థం చ కామం య స్తు నిషేవతే
స వృక్షాగ్రే యథా సుప్తః పతితః ప్రతిబుధ్యతే 38-21

శత్రువులను వధించుట యందును మిత్రులను సంపాదించుట యందును జాగ రూకుడైన ప్రభువునకు ధర్మార్థ కామములు ఫలించును. శత్రువినాశనమునకు ప్రయ త్నింపవలసిన కాలము వచ్చినదిగదా! ప్రస్తుత కర్తవ్యమును గూర్చి మంత్రులతో ఆలోచింపుము.

*సుగ్రీవుడు :* రామప్రభూ ! నీ ప్రసాదమువలన నాకు రాజ్యమును, కీర్తియును, ప్రాప్తిం చిన సంగతి నేను మరచిపోలేదు. ఉపకారికి ప్రత్యుపకారము చేయనివాడు అధముడనికూడ నే నెరుగుదును. నేను నీ పనియందే ఉన్నాను. దేవ గంధర్వ

పుత్రు లగు వానరులు కోట్లకొలది ఇప్పుడే రాగలరు. వా రందరు గొప్పవీరులు. రావణుని, వాని బంధువులను వధించి సీతాదేవిని తెచ్చి నీకు సమర్పింపగలరు. ఈ మాటలకు రాముడు సంతోషించి సుగ్రీవుని కవుగిలించుకొన్నాడు.

రాముడు : సుగ్రీవా ! ఇంద్రుడు వర్షించుటలోగాని, సూర్యుడు తన ప్రభచే చీకటిని పారదోలుటలోగాని ఆశ్చర్య మేమియు లేదు. అట్లే, నీ వంటివాడు మిత్రునికి ప్రత్యుపకారము చేయుటలో ఆశ్చర్యపడవలసిన దేమియు లేదు. అవి సహజ గుణములు. నీ సహాయముచే నేను శత్రువును జయించుట కష్టముకాదు.

ఈ మాటలలోనే వానరసైన్యములు కోట్లకొలది వచ్చి భూమిని ఆక్రమించినవి. వచ్చిన సైనికు లందరు పేరుబడిన వీరులు. మేరుపర్వతమునుండి శతవలి పదివేలకోట్ల వానరులతో వచ్చినాడు. తార తండ్రియైన సుషేణుడు, రుమతండ్రి తారుడు, హనుమంతుని తండ్రి కేసరి, కొండముచ్చుల ప్రభువైన గవాక్షుడు, కోట్లకొలది సైన్యములతో దిగినారు. ధూమ్రుడు రెండువేలకోట్ల భల్లూకములను వెంటబెట్టుకొని వచ్చినాడు. పనసుడు, నీలుడు, గవయుడు, దరీముఖుడు, అశ్వినీదేవతల తనయులైన మైంద ద్వివిదులు, ఋక్షరాజైన జాంబవంతుడు, గజుడు, రుమణ్వుడు, గంధమాదనుడు, యువరాజైన అంగదుడు, మఱియొక తారుడు, ఇంద్రజానుడు, రంభుడు, హనుమంతుడు, నళుడు, దధిముఖుడు, శరభుడు, కుముదుడు, వహ్ని, రంహుడు మున్నగు దండనాయకులు వారి వారి సైన్యములతో వచ్చి సుగ్రీవుని యెదుట నిలిచినారు. వచ్చినవారిని లెక్కపెట్టుట కాని పని. అందరును వచ్చి రాజైన సుగ్రీవునికి నమస్కరించినారు. సుగ్రీవుడు ఈ సైన్యమును రామునికి సమర్పించి,

సుగ్రీవుడు : రామప్రభూ ! ఈ వానరవీరు లందరు గొప్ప పరాక్రమవంతులు. భూమిమీదనే గాక నీటియందును వీరు సంచరింపగలరు. అందరు స్వామిభక్తి పరాయణులు. నీ ఆజ్ఞకు లోబడియుందురు. ఈ సైన్య మంతయు నీదే.

వీరి ప్రస్తుతకర్తవ్యమును నే నెరుగుదును. అయినను, నీకు తోచిన విధమున వీరిని ఆజ్ఞాపింపుము.

> య న్మన్యసే నరవ్యాఘ్ర ప్రాప్తకాలం త దుచ్యతామ్
> త్వ త్సైన్యం త్వ ద్వశే యుక్త మాజ్ఞాపయితు మర్హసి. 40-7
> కామ మేషా మిదం కార్యం విదితం మమ తత్త్వతః
> తథాపి తు యథాతత్త్వ మాజ్ఞాపయితు మర్హసి. 40-8

రాముడు : (సుగ్రీవుని కవుగిలించుకొని) సుగ్రీవా ! మన మిప్పుడు రెండువిషయములు తెలిసికొనవలయును. సీత బ్రదికియున్నదా అనునది యొకటి. రావణుని

నివాసస్థల మెచ్చట అనునది మఱియొకటి. ఇవి తెలిసిన పిదప మనము చేయ వలసిన కార్యమునుగూర్చి ఆవల నిర్ణయించుకొనవచ్చును. సుగ్రీవా ! ఒకమాట వినుము. ఈ కార్యమునకు అధిపతి నేనుగాని, లక్ష్మణుడుగాని కాము. అన్నిటి కిని నీవే ప్రభుడవు. ఆజ్ఞ నీయవలసినవాడవు నీవే. నీకు తెలియని దేమియు లేదు. నీవు మా మేలు కోరువాడవు. నీ యిష్టానుసారము వీరిని ఆజ్ఞాపింపుము.

## సుగ్రీవుడు వానరవీరులను నాలుగు దిక్కులకు పంపుట

### తూర్పు దిక్కు

*సుగ్రీవుడు* : వినతా! నీవు లక్షమంది వీరులను వెంటబెట్టుకొని తూర్పుదిక్కునకు పొమ్ము. మీరు సీతాదేవిని వెదకవలయును. రావణుని నివాస స్థానమును తెలిసికొన వలయును. పర్వతశిఖరములు, అరణ్యములు, నదులు శోధింపుడు. గంగ, సరయువు, కౌశికి, యమున, సరస్వతి, శోణ, మున్నగు నదులచెంత వెదకుడు.

మహి, కాలమహి, బ్రహ్మమాల, విదేహ, మాళవ, కాశి, కోసల, మగధ, పుండ్ర, వంగదేశములలో పర్యటించి జాగరూకులై వెదకుడు. సముద్ర మధ్యమున నుండు పర్వతములందు చూడుడు. పట్టణములందు వెదకుడు.

మందరపర్వత శిఖరముమీద అనేక విచిత్రరూపములుగల మనుష్యు లున్నారు. నరవ్యాఘ్రములు కొందరు సముద్రద్వీపములలో నున్నారు. అచ్చట చూడుడు.

యవద్వీపము సువర్ణరూప్యకము అను దీవు లున్నవి. యవద్వీపమును దాటిపోయి నచో, శిశిరపర్వతము కనబడును. అది దేవదానవులు సంచరించు ప్రదేశము. సముద్ర మును దాటి ఆవలితీరమునకు పోవుదురేని రక్తవర్ణముగల జలములతో ప్రవహించు శోణనది కానవచ్చును. సిద్ధులు చారణులు అక్కడికి వచ్చుచుందురు. అక్కడి రేవుల లోను, అడవులలోను వెదకవలయును. అటుపై ప్లక్షద్వీపము, ఇక్షుసముద్రము కాన వచ్చును. అక్కడ అసురులు నీడలను పట్టి మ్రింగుదురు.

ఇక్షుసముద్రమును దాటుదురేని ఎఱ్ఱని మధుసముద్రము, శాల్మలీద్వీపము కన బడును. గరుత్మంతుని నివాసము అందున్నది. విశ్వకర్మచే నిర్మింపబడినది; కైలాసము వలె శోభిల్లుచుండును. ఆ శాల్మలీద్వీపమునందు మందేహు లను రాక్షసు లున్నారు. వారు ప్రతిదినము సూర్యోదయ కాలమున గాయత్రీమంత్ర ప్రభావముచే సముద్రమున పడిపోవుచుందురు. సూర్యుని వేడికి మరల పైకి వచ్చుచుందురు.

శాల్మలీద్వీపమున కావల క్షీరసముద్ర మున్నది. ఆ సముద్రమధ్యమున తెల్లని ఋషభపర్వతము కనబడును. అక్కడ సుదర్శన మను సరోవరము కలదు. అందులో వెండి తామరపూవులు సువర్ణ కేసరములతో విరాజిల్లుచుండును. దేవతలు అప్సరసల గూడి అచ్చట విహరించుచుందురు.

క్షీరసముద్రమును దాటిపోవుదురేని మంచినీటి సముద్రము కానవచ్చును. ఔర్వుని కోపమున పుట్టిన బడబాగ్ని దానిలో నున్నది. సముద్రమునందలి జంతువులు బడబాగ్నిని చూచి భయపడి అరచుచుండును. ఆ శబ్దమును మీరు వినగలరు.

అక్కడికి పదుమూడు యోజనముల దూరమున కనకపర్వతము కనబడును. అక్కడి శిల. లన్నియు పసిడిశిలలే. ఆ పర్వతముమీద సహస్రఫణముల ఆదిశేషుడు కనిపింపగలడు. ఆ పర్వతశిఖరముమీద ఆదిశేషుధ్వజము మూడు బంగారు తలలుగల తాళవృక్షము వేదికతో కూడినది కనిపించును. దానినే తూర్పుదిక్కునకు యెల్లగా త్రిమూర్తులు నిర్ణయించియున్నారు.

దాని కావల, ఉదయ పర్వత మున్నది. దాని శిఖరము నూరు యోజనముల ఎత్తుగానుండి స్వర్గమును స్పృశించుచుండును. అక్క డి వనము మనోహరముగా నుండును. ఆ పర్వతముమీద సౌమనస మను ఒక శిఖర మున్నది. ఒక యోజనము వెడల్పు పది యోజనములు నిడివి కలది. పూర్వము త్రివిక్రమావతారమున విష్ణుమూర్తి ఆ సౌమనసముమీదనే మొదటియడుగు పెట్టి రెండవ అడుగును మేరుపర్వత శిఖరముమీద పెట్టినాడు.

తత్ర పూర్వపదం కృత్వా పురా విష్ణు స్త్రివిక్రమే
ద్వితీయం శిఖరే మేరో శ్చకార పురుషో త్తమః 40-58

సూర్యుడు జంబూద్వీపపు ఉత్తరభాగమున ప్రదక్షిణముగా చుట్టివచ్చి సౌమనస శిఖరమునకు వచ్చినంతనే మనకు కానవచ్చును. ఆ సౌమనస శిఖరముమీద వైఖానసులు, వాలఖిల్యులు అను మహర్షు లుందురు. అక్కడి ద్వీపము పేరు సుదర్శనము. ఉదయగిరి తేజస్సు సూర్యుని తేజస్సుతో కలిసినందున ఉదయసంధ్య ఎఱ్ఱగా నుండును. భూమికిని, సమస్తలోకములకును మొదటి ద్వారముగాను, సూర్యునికి ఉదయస్థానముగాను బ్రహ్మదేవుడు ఈ తూర్పుదిక్కును నిర్ణయించినందుననే ఈ దిక్కునకు "పూర్వదిశ" అను పేరు వచ్చినది.

ఉదయపర్వతమునకు తూర్పుగా నుండు ప్రదేశములో సూర్యచంద్రుల సంచారము లేదు గనుక అక్కడ చీకటిగా నుండును. దేవతలుమాత్రమే అక్కడికి పోగలరు.

ఇప్పుడు నేను చెప్పిన ప్రదేశములలో చక్కగా వెదకుడు. అంతకు మించి వెళ్లుటకు వానరులకు సాధ్యముకాదు. సూర్యసంచారములేక హద్దులులేక యుండు అవలిప్రదేశముసంగతి మనకు తెలియదు.

అభాస్కర మమర్యాదం న జానీమ స్తతః పరమ్ 40-68

మీరు ఉదయపర్వతమువరకు వెళ్లి, సీతాదేవిని, రావణుని వాసస్థానమును కనుగొని ఒక మాసములోపల తిరిగిరావలయును. ఎవ్వరుగాని గడువు మీరకూడదు. గడువులోపల రానివారికి మరణదండన విధించుచున్నాను. మీరు కార్యమును సాధించి వత్తురేని ఇక్కడ సమస్తభోగముల ననుభవించుచు సుఖముగా నుండవచ్చును.

దక్షిణ దిక్కు

సుగ్రీవుడు ఈ విధముగా కొంతమందిని తూర్పుదిశకు పంపించి దక్షిణదిశ కరుగుటకు మేటివీరులను ఏర్పరచినాడు. నీలుడు, హనుమంతుడు, జాంబవంతుడు, సుహోత్రుడు, శరారి, శరగుల్ముడు, గజుడు, గవాక్షుడు, సుషేణుడు, ఋషభుడు, మైందుడు, ద్వివిదుడు, విజయుడు, గంధమాదనుడు, ఉల్కాముఖుడు, అసంగుడు, అంగదుడు మున్నగు మేటి వీరులను పిలిచి, అంగదుని నాయకత్వమున వారిని దక్షిణ దిశకు పంపుచున్నాడు.

*సుగ్రీవుడు :* వీరులారా! మీరు దక్షిణదిశకు వెళ్లి వెదకుడు. వేయి శిఖరములతో కూడిన వింధ్యపర్వత మున్నది. నర్మదానది, గోదావరి, కృష్ణవేణి, వరదానది, మేఖలానది, ఉత్కలానది మున్నగు నదులను చూచి దశార్ణవదేశము నందలి పట్టణములను, అశ్వవంతిని, అవంతీనగరములను శోధింపుడు.

విదర్భ, ఋషికదేశము, మాహిషికదేశము, కౌశికదేశము వీనినిచూచి దండకారణ్యము, గోదావరినది, ఆంధ్ర, పుండ్ర, చోళ, కేరళ, పాండ్యదేశములందు చక్కగా వెదకుడు.

తరువాత అయోముఖ మను సహ్యపర్వతమునకరిగి అక్కడి చందనవనములను వెదకుడు. అటుపైన కావేరీనది కానబడును. కావేరి నీరు నిర్మలమైయుండును. ఆ నదిని అప్సరసలు పూజింతురు. ఆ తరువాత మలయపర్వతము కనబడును. ఆ పర్వత శిఖరము మీదనే మహాప్రభావుడైన అగస్త్యమహర్షి నివసించుచుండును. వారిని దర్శించి వారి అనుగ్రహమును పొంది ప్రయాణము సాగింపుడు. మీకు తామ్రపర్ణి నది కానవచ్చును. ఆ నదియందు మొసళ్లు కలవు. దానిని మెలకువతో దాటుడు. తరువాత పాండ్య నగరమును చూడగలరు. కొంతదూరమున సముద్రము కానవచ్చును.

సముద్రతీరమును చేరిన పిదప మీ రందరు ఆలోచించుకొని తరువాత జరుగవలసిన కార్యక్రమమును నిర్ణయించుకొనవలయును. మహేంద్రపర్వతము సముద్రము చేరువనే యున్నది. అది రమ్యముగా నుండును. అచ్చటికి దేవతలు, యక్షులు, సిద్ధులు, చారణులు అప్సరసలు వచ్చుచుందురు. దేవేంద్రుడు ప్రతి పర్వదినమునను అచ్చటికి వచ్చుచుండును.

[సముద్రస్నానమునకై కాబోలు]

ఆ సముద్రమునకు ఆవలితీరమున నూరుయోజనముల వైశాల్యము గల ఒక ద్వీప మున్నది. ఆ ద్వీపమునందు చక్కగా వెదకవలయును. సమస్తప్రయత్నములు చేసి సీతాదేవిని అచ్చట శ్రద్ధగా వెదకవలయును. ఆ ద్వీపమే రావణాసురుని నివాసస్థానము.

తత్ర సర్వాత్మనా సీతా మార్గితవ్యా విశేషతః
స హి దేశ స్తు వధ్యస్య రావణస్య దురాత్మనః 41-25

రాక్షసాధిపతే ర్వాస స్సహస్రాక్షసమ ద్యుతేః 41-26

ఆ సముద్ర మధ్యప్రదేశమున అంగారక యను ఒక రాక్షసి కలదు. అది నీడను పట్టుకొని ఆకర్షించి ప్రాణులను భక్షించును. దానిని కనిపెట్టి పొండు. ఆ ద్వీపము నంతయు శోధించి సీతాదేవి అచ్చట ఉండునది లేనిది నిస్సంశయముగా తెల్సుకొనవలెను.

ఆ ద్వీపమును దాటి నూరుయోజనములు వెళ్లుదురేని 'పుష్పితకము' అను ఒక పర్వతము సముద్రమున కనిపించును. అక్కడికి సిద్ధచారణులు వచ్చుచుందురు. దానికి రెండు శిఖరములు కలవు - ఒకటి బంగారు శిఖరము, రెండవది వెండిశిఖరము. బంగారు శిఖరమును సూర్యుడు సేవించును. వెండిశిఖరమును చంద్రుడు సేవించును. ఆ పర్వతము కృతఘ్నులకు, నృశంసులకు, నాస్తికులకు కనబడదు. మీరు ఆ పర్వతమునకు శిరసా నమస్కరించి సీతాదేవిని వెదకుడు.

ఆ పర్వతము దాటి పదునాలుగుయోజనములు వెళ్లినచో సూర్యవంత మను ఒక పర్వతము కానవచ్చును. ఆపై, వైద్యుత మను మఱియొక పర్వత మున్నది. అక్కడి వృక్షములు సర్వదా ఫలభరితములై యుండును. ఆ ఫలములను తిని, మధువును సేవించి ప్రయాణము సాగించవచ్చును.

అటుతరువాత కుంజర మను పర్వత మున్నది. అక్కడనే విశ్వకర్మ అగస్త్య మహర్షికి ఒక భవనమును నిర్మించియున్నాడు. ఆ భవనము శోభాయమానముగా నుండును. అక్కడ భోగవతి యను పట్టణ మున్నది. అది సర్పరాజైన వాసుకి నెలవు. సీతాదేవిని అక్కడ వెదకుడు.

అక్కడినుండి సాగిపోవుదురేని ఋషభపర్వతమును చూడగలరు. ఆ పర్వత ప్రాంతవనమున అనేక వర్ణముల చందనవృక్షము లున్నవి. మీరు ఆ చందనమును స్పృశింపరాదు. రోహితులు అను గంధర్వులు ఆ వనమును రక్షింపుచుందురు ఐదుగురు గంధర్వులు అచ్చట నివసించుచుందురు. శైలూషుడు, గ్రామణి, శిగ్రుడు, శుభ్రుడు, బభ్రుడు అనువారు. భూలోకమున అగణ్యము లగు పుణ్యకర్మలు చేసి పుణ్యలోకములను సాధించిన మహనీయులు ఆ ఋషభపర్వతమునందు వసించుచుందురు. అటుమీద పితృలోకము, యముని రాజధానియు నున్నవి. అక్కడ చీకటిమయమై యుండును. మీ రక్కడికి పోజాలరు.

వానరవీరులారా ! నేను చెప్పిన చోటు లన్నింటిని చక్కగా వెదికి సీతాదేవి వృత్తాంతమును తెలిసికొని రండు. ఎవడు ఒక్క మాసములోపల తిరిగివచ్చి 'కనబడినది సీత' అని చెప్పగలుగునో అతడు నాతో సమానుడై అన్ని భోగముల ననుభవించుచు సుఖముగా నుండగలడు.

యస్తు మాసా న్నివృత్తోఽగ్రే దృష్టాసీతేతి వక్ష్యతి
మత్తుల్యవిభవో భోగై స్సుఖం స విహరిష్యతి 41-48

సీతాదేవిని సందర్శించివచ్చినవానికంటె నాకు కావలసినవాడు మరియొకడుండడు. నా ప్రాణమునకన్న అతడె అధికుడు. అత డెన్ని తప్పులు చేసినను నావాడుగానే ఉండగలడు.

మీ రందరు బలసంపన్నులు. పరాక్రమవంతులు. గొప్పవంశమున జన్మించినవారలు. మీరు సకల ప్రయత్నములు చేసి సీతాదేవిని వెదకి కార్యవిజయమును సాధింపుడు.

## పడమటి దిక్కు

సుగ్రీవుడు తార తండ్రియైన సుషేణునికి నమస్కరించి చెప్పుచున్నాడు.

*సుగ్రీవుడు :* మామా ! నీవు రెండులక్షల వానరులను వెంటబెట్టుకొని పశ్చిమదిశ కరిగి సీతాదేవిని వెదకుము. బాహ్లికదేశముతో గూడిన సురాష్ట్రము, శూర, కుక్షి దేశములను వెదకవలయును. పడమటితట్టు ప్రవహించు నదములను అక్కడి ఋషుల ఆశ్రమములను, అరణ్యములను, పర్వతములను వెదకి వానిని దాటుకొని పోగా మీకు ఒక నిర్జలప్రదేశము కనబడును. ఎక్కడచూచినను బండలు, కొండలు తప్ప మరేమియు కనబడదు. ఆ తరువాత పడమటి సముద్రము కనిపించును. సముద్రతీరమున మొగలిపొదలు, కొబ్బరిచెట్లు మొదలైన చెట్లు కానవచ్చును.

మురచీపట్టణము, జటీనగరము, అవంతి, అంగలోప అను పట్టణములను చూచి వెదకుడు. అలక్షిత మను ఒక వనముకలదు. అందును వెదకుడు.

సింధునది సముద్రమును కలియుచోట హేమగిరి అను ఒక పెద్ద పర్వతము సముద్ర మధ్యమున నున్నది. దానిమీద రెక్కలుగల సింహము లున్నవి. ఆ సింహములకు ఆహార మేమో తెలియునా! తిములు ఏనుగులు. ఆ తిములను, ఏనుగులను అవి పట్టుకొనిపోయి తమ గూండ్లలో పెట్టుకొనును. (ఆ గూండ్లు ఎంత పెద్దవో!) ఆ సముద్రమున నే పారియాత్ర పర్వత మున్నది. ఆ పర్వతశిఖరముమీద ఇరువది నాలుగుకోట్ల గంధర్వులు నివసించుచుందురు. మీరు వారి చేరువకు పోవలదు. అక్కడి చెట్లయందలి ఫలములనుకూడ కోయరాదు. ఆ వనమును గంధర్వశూరులు కాపాడుచుందురు. మీరు ఆ ప్రదేశమునందుకూడ మెలకువతో వెదకుడు. మీరు ధర్మము నవలంబించి జాగరూకులై మెలగుదు రేని, మీకు గంధర్వులవలన భయము కలుగదు.

అక్కడనుండి కొంతదూర మరుగుదు రేని వజ్రము అను ఒక పర్వతము కనబడును. ఆ వజ్రగిరి గుహలలో సీతాదేవిని వెదకుడు. సముద్రము ముప్పాతిక పాలు దాటుదు రేని ఒక పర్వతము కనిపించును. దాని పేరు చక్రవంతము. వేయి ఆకులుగల చక్రాయుధమును పూర్వము ఈ పర్వతముమీద నే విశ్వకర్మ నిర్మించినాడు. ఒక దేవాసుర సంగ్రామమున హయగ్రీవుడు, పంచజనుడు అను వారిని విష్ణుదేవుడు ఆ పర్వతము మీద సంహరించినాడు. హయగ్రీవవధకు ఫలముగా చక్రము, పంచజన సంహారమునకు ఫలముగా పాంచజన్యము, ఈ రెండును (శంఖ చక్రములు) విష్ణుమూర్తికి లభించినవి.

తత్ర పంచజనం హత్వా హయగ్రీవం చ దానవమ్
ఆజహార తత శ్చక్రం శంఖం చ పురుషోత్తమః. 42-28

అక్కడి కిరువది యోజనముల దూరమున వరాహగిరి అనుపర్వతము సముద్రమున కనిపించును. దానిమీద ప్రాగ్జ్యోతిష మను నగర మున్నది. అదే నరకాసురుని వాసస్థానము. అక్కడ సీతాదేవిని వెదకవలయును.

దానిని దాటిపోయినచో మేఘవంత మను పర్వతము కానవచ్చును. అక్కడి ప్రదేశము లన్నియు బంగారుమయములు. దేవతలు ఇంద్రునికి పట్టాభిషేకము చేసినది ఆ పర్వతముమీద నే. దానిని ఇంద్రుడు పాలించుచుండును.

దానిని దాటిపోవుదు రేని అరువదివేల పర్వతముల పంక్తి యొకటి కానబడును. సావర్ణిమేరుపర్వతము ఆ పంక్తి నడుమ నున్నది. సూర్యదేవుని వరప్రభావమున అక్కడి వృక్షములు సువర్ణద్యుతు లీనుచుండును. అచ్చటి దేవ దానవ గంధర్వులు బంగారు

కాంతితో వెలుగుచుందురు. విశ్వేదేవతలు, మరుత్తులు, అష్టవసువులు, సాయం సంధ్యా సమయములలో ఈ సావర్ణి మేరుపర్వతమును చేరి సూర్యునికి ఉపస్థానము చేయుదురు. వారి పూజ లందుకొని సూర్యుడు అస్తగిరి చేరి అదృశ్యు డగుచుండును. ఈ మేరుపర్వతమునకు అస్తగిరి పదివేల యోజనముల దూర మున్నను సూర్యభగవానుడు ఒక్క ఘడియలో అస్తగిరి చేరుకొనగలడు. ఆ పర్వతశిఖరమున పాశహస్తుడైన వరుణుని భవన మున్నది. దానినికూడ విశ్వకర్మయే నిర్మించినాడు. మేరుపర్వతమునకును అస్త గిరికిని మధ్య పదితలల తాళవృక్ష మున్నది. అది బంగారుమయమై అనేక చిత్రవర్ణములతో ప్రకాశించుచుండును. గొప్ప తపస్వియైన మేరుసావర్ణి యుండు సావర్ణి మేరు పర్వతమునను, అచ్చటి రహస్యప్రదేశములందును, సరోవరములయందును చక్కగా వెదకవలయును. సావర్ణిమహర్షికి సాష్టాంగనమస్కారము చేసి సీతాదేవి వృత్తాంత మును అడిగి తెలిసికొనుడు. సూర్యు డుదయించి ఉదయపర్వతము మొదలు అస్తగిరి పర్యంతముగల ప్రదేశములందు ప్రకాశించి చీకటిని పోగొట్టును. వానరులు అంతవరకే పోగలరు. సూర్యసంచారములేని ఆవలిప్రదేశము సంగతి మనకు తెలియదు.

మీరు అస్తాద్రివరకు వెళ్ళి సీతాదేవిని వెదకి రావణుని నివాసమును తెలిసికొని ఒక నెలలోపల రావలయును. గడువులోపల రానివానికి మరణదండనము.

మీ రందరు గొప్ప పరాక్రమవంతులు. అందరు మా మామయగు సుషేణుని మాటలోనుండి కార్యమును సాధించుకొనిరండు. సీతాదేవి కనబడినచో మన మందరము కృతార్థుల మగుదుము. వీరులారా! నేను చెప్పిన విషయములేకాక మీరుకూడ దేశ కాలములను గమనించి కార్యాకార్యములను నిర్ణయించుకొని జరుపదగిన పనులను జరుపుడు. పోయిరండు.

## ఉత్తర దిక్కు

సుగ్రీవుడు శతవలిని పిలిచి ఉత్తరదిశనుగూర్చి చెప్పుచున్నాడు.

*సుగ్రీవుడు* : శతవలీ! నీవు ఒక లక్షమంది వానరవీరులను వెంటబెట్టుకొని నీ మంత్రులను కూడి హిమవత్పర్వతశోభితమైన ఉత్తరదిశకు వెళ్లి సీతాదేవిని వెదకుము. మీరు కృతకృత్యులై వత్తురేని మనము శ్రీరాముని ఋణము తీర్చుకొన్నవార మగుదుము. శ్రీరాముడు సర్వభూతములకు పూజనీయుడు. మనయందు మిక్కిలి ప్రీతిగలవాడు. కావున రామకార్యము శ్రద్ధాభక్తులతో చేయదగి యున్నది.

మీరు నదుల దరులలో, అరణ్యములలో, పర్వతములమీద, అన్నిచోట్లలో వెదక వలయును. మ్లేచ్ఛ, పుళింద, శూరసేన, ప్రస్థల, భరత, మద్ర, దక్షిణకురు, కాంభోజ, యవన, శక, ఆరట్టక, బాహ్లిక, ఋషిక, పౌరవ, టంకణ, చీన, పరమచీన, విహార, దరద దేశము లన్నింటిని చక్కగా వెదకుడు. హిమవత్పర్వతమునందు మాటిమాటికి వెదకుడు. అక్కడి అడవులు, నదులు, పర్వతమధ్యప్రదేశములు అన్నియు పరీక్షింపుడు.

ఆ తరువాత సోమాశ్రమము చూచుకొని కాళ మను పర్వతమున కరుగుడు. ఆ పర్వతమునందు బంగారుగను లున్నవి. అక్కడినుండి సుదర్శనపర్వతమున కరుగుడు. ఆపైని దేవసఖపర్వత మున్నది.

దాని కావల నూరుయోజనములవరకు గల ప్రదేశమున కొండలుగాని నదులు గాని, చెట్లుగాని ఉండవు. ఆ ప్రదేశము శూన్యముగా నుండును. అచ్చట ప్రాణిసంచారములేదు. ఆ ప్రదేశమును వేగిరముగా దాటవలయును.

ఆ తరువాత కైలాసపర్వతము కనబడును. ఆ పర్వతమును చూచినంతనే మీకు సంతోషము కలుగును. ఆ కైలాసపర్వతముమీదనే కుబేరుని భవన మున్నది. దానిని విశ్వకర్మ నిర్మించినాడు. ఆ భవనపు ఆవరణమున ఒక తామరకొలను కలదు. అందులో కమలములు, కలువలు నిండియుండును. హంసలు కారండవములు కనులపండువు కావించును. అక్కడికి అప్సరసలు వచ్చుచుందురు. అదియే యక్షరాజైన కుబేరుని నిలయము.

ఆపై మీకు క్రౌంచ పర్వతము కానవచ్చును. దాని బిలముగుండ వెళ్ళుట అమితకష్టము. మీరు మెలకువతో పోవలయును. ఆ బిలమున మహర్షు లుందురు.

క్రౌంచపర్వత శిఖరమును చూచి అనంతరము, చెట్టు చేమ లేని కామపర్వత మును కనుగొనగలరు. ఆ తరువాత సమస్త పక్షులతోకూడిన మానసపర్వతము కాన వచ్చును. అక్కడికి దేవతలుగాని, దానవులుగాని, రాక్షసులుగాని ఎవ్వరును వెళ్ళలేరు. ఆ ప్రదేశము లన్నియు మీరు జాగరూకులై వెదకవలయును.

క్రౌంచపర్వతమును దాటిన పిదప మీకు మైనాకపర్వతము గోచరించును. దానవరాజైన మయుని భవన ముండునది అచ్చటనే. ఆ భవనమును మయుడే స్వయముగా నిర్మించుకొన్నాడు. అక్కడ కిన్నరస్త్రీ లుందురు.

అక్కడనుండి పోవుదురేని మీ కొక ఆశ్రమము కనిపించును. అణిమాది సిద్ధులు గల మహర్షులు అచ్చట నివసించుచుందురు. మీరు వారికి నమస్కరించి సీతాదేవి వృత్తాంతము నరయుడు. వైఖానస మను సరోవరము అచ్చటనే యున్నది. అది అత్యంత రమ్య

ముగా నుండును. కుబేరుని వాహనమైన సార్వభౌమ మను ఏనుగు ఆడయేనుగులతో కూడి అక్కడ విహరించుచుండును.

ఆ సరోవరమున కావల చంద్ర సూర్యుల సంచారములేదు. నక్షత్రము లుండవు మేఘము లుండవు. అంతయు నిశ్శబ్దముగా, శూన్యముగా నుండును.

సూర్య చంద్రుల సంచారము లేకపోయినను అక్కడి సిద్ధపురుషులు స్వయం ప్రకాశులు కావున ఆ ప్రదేశ మంతయు వెలుగు గలిగియుండును.

ఆ ప్రదేశమున కావల శైలోద అను నది కలదు. దాని తీరములందలి కీచకములు పొడవుగా నుండి కలిసికొనియుండుటవలన సిద్ధులు వానిమీదుగనే ఇవతలి తీరమునుండి ఆవలకు రాకపోకలు సాగించుచుందురు.

దానికి ఆవల ఉత్తరకురుదేశ మున్నది. పుణ్యవంతులుమాత్రమే అక్కడ నివసింతురు. బంగారు కమలములతోకూడిన నీలవైడూర్యముల వన్నెలు గల తామరతీగలతో అలంకృతములైన నదులు వేనవేలుగా అందు ప్రవహించుచుండును. అక్కడి జలాశయములు పుష్పములతో నిండి రమణీయములై యుండును. అక్కడి నదులలో ముత్యములు, రత్నములు కలవు. నదుల మధ్యప్రదేశములలో కాంచనమయ పర్వతములు ప్రకాశించుచుండును. అక్కడి వృక్షములందు, సువాసనల వెదజల్లు పుష్పములు, రుచ్యములైన ఫలములు ఎల్లప్పుడును లభించును.

అక్కడి వృక్షములు కల్పతరువులు. కోరినవారి అన్ని కోరికలను తీర్పగలవు కొన్ని వృక్షములు నానావిధములైన వస్త్రముల నిచ్చును. మరికొన్ని వృక్షములు నవరత్నములను, ఆభరణములను, స్త్రీలకుగాని పురుషులకుగాని కావలసినవాని నన్నింటిని ప్రసాదించుచుండును మరికొన్ని వృక్షములు శయ్యల నిచ్చును. మరికొన్ని పుష్పమాలలను, తినుబండములను, పానీయములను పుష్కలముగా ఇచ్చును. మరికొన్ని వృక్షములు రూపయౌవనసంపన్న లగు కాంతలను ప్రసాదించును.

మనఃకాంతాని మాల్యాని ఫలం త్యత్రాపరే ద్రుమాః
పానాని చ మహార్హాణి భక్ష్యాణి వివిధాని చ 43.50

స్త్రియశ్చ గుణసంపన్నా రూప యౌవన లక్షితాః 43.51

అక్కడికి గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, సిద్ధులు, నాగులు, విద్యాధరులు తమ స్త్రీలను కూడివచ్చి క్రీడించుచుందురు. అక్కడ వీనుల కింపుగా సంగీతము వినబడుచుండును. అక్కడ యుండువారు ఎల్లప్పుడు సంతోషముతో కాలము గడపుదురు.

ఉత్తరకురుదేశమున కావల ఉత్తరసముద్ర మున్నది. ఆ సముద్రమధ్యమున సోమ గిరి యను పర్వత మున్నది. ఇంద్రలోకమునకు, బ్రహ్మలోకమునకు పోగలిగినవారి కే ఆ పర్వతము కానబడును. అక్కడ సూర్యసంచారము లేకపోయినను ఆ పర్వత కాంతి చేత నే ఆప్రదేశము ప్రకాశించుచుండును.

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఆ సోమగిరిపై నెలకొని యుందురు. బ్రహ్మర్షులు వారిని సేవించుచుందురు. ఆ సోమగిరిని ప్రవేశించుట దేవతలకును సాధ్యముకాదు. కావున మీరు ఆ పర్వతమును దర్శించి వెంటనే మరలిరండు. వానరులు అంతవర కే పోగలరు. ఆవలిప్రదేశము సంగతి మనకు తెలియదు.

వీరులారా! నేను చెప్పిన ప్రదేశములలో వెదకుడు. చెప్పని ప్రదేశములయం దును వెదకి కార్యమును సాధించుకొనిరండు. అట్లు కావింతురేని శ్రీరామునికి సంతో షము కలిగించినవా రగుదురు. అంతకంటె మిక్కిలిగా నాకును సంతోషము కలిగించిన వా రగుదురు. మీరుకూడ భార్యలను, బంధువులనుకూడి సుఖముగా నుండగలరు.

ఈ విధముగా సుగ్రీవుడు వానరవీరులకు చెప్పవలసిన మాటలు చెప్పి కార్య మును సాధింపగలవాడు హనుమంతుడే యని నిర్ణయించుకొని హనుమంతునితో ప్రత్యే కముగా కొన్ని మాటలు చెప్పుచున్నాడు.

*సుగ్రీవుడు :* హనుమంతుడా! నీవు భూమియందుగాని, నీటియందుగాని, ఆకాశమునందు గాని, స్వర్గమందుగాని ఎదురులేనివాడవై సంచరింపగలవు. అసురలోకము, గంధర్వలోకము, నాగలోకము, దేవలోకము, అన్ని లోకములు నీ వెరుగుదువు. గమనమునగాని, పరాక్రమమునగాని, తేజస్సునగాని, నీ తండ్రి యగు వాయు దేవునితో సరివచ్చువాడవు. తేజస్సున నీకు తుల్యు డగు ప్రాణి ఈ లోకమున నాకు కానరాలేదు. కావున ఈ మహత్కార్యము నీవలన నే చక్కబడవలయును. నీవు నీతికోవిదుడవు. బలము, బుద్ధి, పరాక్రమము, దేశకాలానుసరణము మున్నగు గుణములలో నీకు సాటిరాగలవారు లేరు.

త్వయ్యేవ హనుమ న్నస్తి బలం బుద్ధిః పరాక్రమః
దేశకాలానువృత్తిశ్చ నయశ్చ నయపండిత. 44-7

## శ్రీరాముడు తన అంగుళీయకమును హనుమంతుని కిచ్చుట

సుగ్రీవుని మాటలను శ్రీరాముడు విన్నాడు. కార్యసాధకుడు హనుమంతుడే నని శ్రీరాముడు గ్రహించి హనుమంతుని చూచి సంతోషించి సీతాదేవికి అభిజ్ఞానముగా తన నామాంకితమైన అంగుళీయకము నిచ్చి చెప్పుచున్నాడు.

**రాముడు:** హనుమంతుడా! ఈ యంగుళీయకమును గైకొనుము. దీనిని చూచి నీవు నాయొద్దనుండి వచ్చినవాడ వని సీత తెలిసికొని నిన్ను విశ్వసించి, నిస్సందేహాము గాను, నిర్భయముగాను నీ సందేశమును గ్రహించును. నీ ఉత్సాహము, నీ బల పరాక్రమములు, సుగ్రీవుని పలుకులు ఈ కార్యసిద్ధి నీ వలననే కాగల దని సూచించుచున్నవి.

దదౌ తస్య తతః ప్రీత స్స్వనామాంకోపశోభితమ్
అంగుళీయ మభిజ్ఞానం రాజపుత్ర్యాః పరంతపః 44-12

అనేన త్వాం హరిశ్రేష్ఠ చిహ్నేన జనకాత్మజా
మ త్సకాశా దనుప్రాప్త మనుద్విగ్నానుపశ్యతి. 44-13

వ్యవసాయశ్చ తే వీర సత్త్వయుక్తశ్చ విక్రమః
సుగ్రీవస్య చ సందేశ స్సిద్ధిం కథయతీవ మే. 44-14

హనుమంతుడు ఉంగరమును గ్రహించి శిరస్సున దాల్చి, అంజలి ఘటించి శ్రీరాముని చరణారవిందములకు నమస్కరించి ప్రయాణమునకు సిద్ధ మగుచున్నాడు.

**రాముడు:** హనుమంతుడా! నేను నీ బలము నాశ్రయించి యున్నాను సుమా! నీవు మహా పరాక్రమవంతుడవు - వాయుదేవుని కుమారుడవు: నీవు సర్వప్రయత్న ములు చేసి సీత లభించునట్లు చూడుము.

అతిబల బల మాశ్రిత స్తవాహం
హరివర విక్రమ విక్రమై రనల్పైః
పవనసుత యథాభిగమ్యతే సా
జనకసుతా హనుమం స్తథా కురుష్వ. 44-17

వానరవీరులు నాలుగు దిక్కులకు బయలుదేరినారు.

**రాముడు:** సుగ్రీవా! ఈ భూగోళ విశేషములు సవిస్తరముగా చెప్పితివిగదా! నీ కెట్లు తెలియును

**సుగ్రీవుడు:** రామప్రభూ! ఆ కథ చెప్పెదను వినుము.

పర్వత బిలమున వాలి మరణించె నని భావించి, నేను బిల ద్వారమును బంధించి కిష్కింధకు వచ్చుట, మంత్రుల ప్రోద్బలముతో రాజ్యము నంగీకరించుట, నేను రాజ్య పాలన చేయుచుండగా వాలి మరల వచ్చుట మున్నగు విషయములు చెప్పితినిగదా! నన్ను, నా మంత్రులను చంపుటకు వాలి ఉద్యమింపగా మేము ప్రాణభీతితో పరు గెత్తుటలో నేను భూమండల మంతయు సంచరించి నాలుగు దిశలను చూచితిని. నా అవస్థను చూచి, మతిమంతుడైన హనుమంతుడు మతంగాశ్రమము సంగతియు,

వాలి కీయబడిన శాపమును గూర్చియు నా జ్ఞప్తికి తెచ్చినాడు. అప్పటినుండియు నీ దర్శన మగువరకు ఋశ్యమూక పర్వతముపై నివసించుచుంటిని. ఈ భూమండల విశేషము లన్నియు నా కిట్లు తెలియవచ్చినవి.

సీతాన్వేషణ పరాయణులై వానరులు నలుదిశలకు పోయినపిదప శ్రీరాముడు లక్ష్మణుని గూడి ప్రస్రవణగిరిపై నివసించుచు వారి రాక కెదురుచూచుచున్నాడు.

## దక్షిణదిశ కరిగినవారు తప్ప మిగిలినవానరులు గడువులో మరలి వచ్చుట

సుగ్రీవుని ఆజ్ఞానుసారము వానరులు అన్నిప్రదేశములలోను సీతాదేవికొరకు ఆయాదిక్కుల వెదకుచున్నారు. పగ లంతయు ఎవనిమట్టుకు వాడు తిరిగి వెదకుట, రాత్రి కాగనే అందరు ఒకచోట కలిసికొని మంచిచెడ్డలు మాటలాడుకొనుట, ఈవిధముగా తిరిగినారు. తూర్పుదిశ కరిగిన వినతుడు, ఉత్తరదిశ కేగిన శతవలి, పశ్చిమదిశకు చనిన సుషేణుడు వారివారి సైన్యములతో గడువు లోపలనే వచ్చి తమ వృత్తాంతమును సుగ్రీవునికి చెప్పినారు.

వానరులు : ప్రభూ ! మీరు చెప్పిన ప్రదేశము లన్నింటిని ఎంతో మెలకువతో వెదకితిమి. కాని సీతాదేవి మాకు కనిపింపలేదు. సీతాదేవి ఏ దిక్కుకు కొనిపోబడెనో ఆ దిశకే హనుమంతు డరిగియున్నాడు. ఆ మహాత్ముడు సీతాదేవిని తప్పక చూచిరాగలడు.

ఉదార సత్త్వాభిజనో మహాత్మా
స మైథిలీం ద్రక్ష్యతి వానరేంద్రః
దిశం తు యామేవ గతా తు సీతా
తా మాస్థితో వాయుసుతో హనూమాన్. 47-14

[కార్యమును సాధింపలేకపోయినను వీరు గడువులోపలనే ఊరు చేరినారు !]

## దక్షిణదిశ కరిగిన వానరుల కష్టములు

దక్షిణదిశ కరిగినవారు ఎన్నో చిక్కులలో పడినారు. వింధ్యాపర్వత మంతయు వెదకినారు. అక్కడి అరణ్యములు, గుహలు, సామాన్యమైనవి కావు. వెదకుట మిక్కిలి కష్టమైనది.

స తు దేశో దురన్వేషో గుహాగహనవా న్మహాన్. 48-6

అక్కడనుండి ఒక శూన్య ప్రదేశమునకు వచ్చినారు. అచ్చట జనసంచారములేదు. జంతువులులేవు. తుదకు నీరుకూడలేదు. కండుమహర్షి కుమారుడు పదునారువత్సరముల బాలుడు అచ్చట మరణించినందున కండుమహర్షి ఆ ప్రదేశమును శపించినాడు.

ఆ శాపమువల్ల దేశ మంతయు శూన్యమయిపోయినది. వానరులు అక్కడనుండి పోయి, తీగలు పొదలు దట్టముగానుండు ఒక భయంకర ప్రదేశమును చూచినారు. అక్కడ ఒక రాక్షసుడు కనబడినాడు. అతడు వానరులపైకి వచ్చి అందరను చంపెద నని భయపెట్టి నాడు. అంగదుడు వానిని చూచి అతడు రావణుడే అని తలచి చేతితో ఒక మంచి దెబ్బ కొట్టినాడు. ఆ దెబ్బకు రాక్షసుడు రక్తము క్రక్కి ప్రాణములు విడిచినాడు.

వానరులు సీతాదేవిని ఆప్రదేశమున వెదకి ఆమెను కానక అక్కడనుండి ఒక గుహాను జొచ్చి అందులో వెదకినారు. ఎన్నిచోట్ల వెదకినను సీతాదేవిజాడ కనబడలేదు. వానరులకు దుఃఖము వచ్చినది. అందరు దిగులుపడి ఒక చెట్టుక్రింద కూర్చుండినారు.

*అంగదుడు* : మనము విసువులేక అడవులలో, కొండలలో, గుహలలో, ఎక్కడెక్కడనో వెదకినాము. సీతాదేవిగాని, ఆమెను అపహరించిన రాక్షసుడుగాని మనకు కానరాలేదు. కాల మేమో ఎక్కువగా గడచిపోయినది! సుగ్రీవు డన్ననో ఉగ్ర శాసనుడు! కావున మన మింకను వెదకవలయును. సోమరితనము, విచారము, నిద్ర అన్నిటిని విసర్జించి వెదకవలెను. విసుగు నొందక ఉత్సాహముతో పని చేసి నచో కార్యసిద్ధి యగునని పెద్దలు చెప్పియున్నారు.

అనిర్వేదం చ దాక్ష్యం చ మనస శ్చాపరాజయః
కార్యసిద్ధి కరా ణ్యాహు స్తస్మా దేత ద్బ్రవీ మ్యహమ్. 49-6

దిగులుపడి కూర్చుండినచో పను లగునా! లెండు! లేచి ఈ యడవు లన్నియు వెదకుదము.

*గంధమాదనుడు*: (దప్పి, అలసటవలన మాట సరిగా పలుకలేక) అంగదుడు చెప్పినట్టే చేయుదము.

అందరు లేచి వింధ్యపర్వతమెక్కి అక్కడ నంతయు వెదకి క్రిందికి దిగి కొంచెము సేపు విశ్రమించి మరల బయలుదేరినారు. గుహ లన్నిటిని తిరిగిచూచినారు. ఇట్లు తిరుగు టలో సుగ్రీవుడు పెట్టిన నెలగడవు దాటిపోయినది. ఇంకను వెదకుచునే యున్నారు. అచట విశాలమైన బిల మొకటి కనపడినది.

## ఋక్షబిల ప్రవేశము

ఆ బిలము పేరు ఋక్షబిలము. వానరు లందరును అలసిపోయి ఆకలిదప్పులతో బాధపడుచున్నారు. క్రౌంచములు, హంసలు, సారసములు, చక్రవాకములు, ఆ బిలము

నుండి బయటికి వచ్చుట చూచినారు. వాని రెక్కలు తడిసియుండినవి. అందరు ఆ బిలము సమీపించినారు.

హనుమంతుడు : (కాంతారవనకోవిదుడు) మనము మిక్కిలి అలసియున్నాము. ఈ పక్షుల రెక్కలు తడిసియుండుట చూడగా ఇం దేదో జలాశయ మున్నట్టు తోచుచున్నది. బిలద్వారము చేరువగా తరువులు చక్కగా పెరిగియున్నవి.

వానరు లెల్లరు బిలము ప్రవేశించినారు. అంధకారబంధురమై యున్నది. మార్గము కనిపింపలేదు. ఒకరినొకరు పట్టుకొని నెమ్మదిగా అడుగుమీదఅడుగు పెట్టుచు నడువసాగినారు. కొంతదూరము వెళ్ళుసరికి వెలుతురు కనిపించినది. మనోహరమైన ఒక ఉద్యానవనము వారి కంటబడినది. వృక్షము లన్నియు విరియబూచియుండినవి. అచ్చటి వేదికలు వైడూర్యమణులతో నిర్మింపబడి యుండినవి. ఒక సరోవరము కాన వచ్చినది. ఆ సరస్సున బంగారు తామరపూవులు, బంగారు చేపలు, బంగారు తాబేళ్లు ఉన్నవి. అచ్చట ఒక దివ్యభవనము గోచరమైనది. దానికి బంగారు కిటికీలు, ముత్యాల తోరణములు, వెండినేల అమర్చబడియున్నవి. ఎక్కడ చూచినను బంగారు, వెండి, రత్నములు, ముత్యములు కనబడుచుండినవి. సుగంధద్రవ్యములు రాసులురాసులుగా నుండినవి. వస్త్రములకు లెక్కలేదు. తినదగిన ఫలమూలములు సమృద్ధిగా నుండినవి. వీనిని తిలకించుచు నడచుటలో వానరులకు ఒక తాపసస్త్రీ కానవచ్చినది. ఆమె అపార తేజస్సుతో వెలుగుచుండినది.

హనుమంతుడు : (ఆమెకు నమస్కరించి) తల్లీ ! నీ వెవ్వతెవు. ఈ విలువగల వస్తు సమూహము లెవ్వరివి ? మే మెంతో అలసిపోయి ఆకలిదప్పులతో బాధపడుచు, ముందు వెనుకలు చూడక నీటికొరకు ఈ బిలమున ప్రవేశించినాము. ఇక్కడి చిత్రములను, వైభవమును చూచి మోహితుల మైనాము. ఈ సువర్ణ వృక్షము లేమిటి! ఈ సరోవరమున బంగారు కమలము లెట్లు పుట్టినవి ! ఈ తపోబల మెవ్వరిది ! మాకేమియు తెలియుటలేదు. నీవు చెప్పుదువేని వినగోరుచున్నాము.

తాపసి : మయు డను దానవుడు తన మాయచే ఈ సువర్ణవనమును సృజించినాడు. పూర్వము, ఈ మయుడే దానవులకు శిల్పిగా నుండువాడు. అతడు గొప్ప తపస్సుచేసి బ్రహ్మవలన వరము పొంది ఈభవనమును నిర్మించుకొని అప్సరస యగు హేమను ప్రేమించి ఆమెను గూడి ఇక్కడ నివసించుచుండినాడు. ఇంద్రుడు కోపించి తన వజ్రాయుధమును మయునిపై ప్రయోగించినాడు. అంతట మయుడు ఈ భవనమును వీడిపోయినాడు. ఆ తరువాత ఈ వనమును, భవనమును బ్రహ్మదేవుడు హేమ కిచ్చినాడు. హేమ నాకు ప్రియసఖి. నేను

మేరుసావర్ణి పుత్రికను. నా పేరు స్వయంప్రభ. నేను ఈ వనమును, ఈ సుందర భవనమును, రక్షించుచున్నాను.

వానరులారా! మీ రిచ్చటి కెట్లు వచ్చితిరి? మీరు వచ్చిన పని యేమి? ముందు ఈ ఫలమూలములను ఆరగించి, మంచినీరు త్రాగి, మీ ఆకలిదప్పులను తీర్చుకొని ఆ తరువాత మీ వృత్తాంతమును తెలియజేయుడు.

వానరు లందరు తమ ఆకలిదప్పులను తీర్చుకొన్నారు

స్వయంప్రభ : వానరులారా! మీకు శ్రమ తీరినచో మీ విషయమును తెలుపుడు. నేను వినతగిన దైనయెడల వినగోరుచున్నాను.

> వానరా యది వః ఖేదః ప్రణష్టం ఫలభక్షణాత్
> యది చైత న్మయా శ్రావ్యం శ్రోతు మిచ్ఛామి కథ్యతామ్. 52-2

[మాట ఎంత సొంపుగాను, ఆదరముగాను ఉన్నది! ఒక్క సంగతి ముఖ్యముగా గమనింపదగియున్నది. అలసి సొలసి యున్నవారిని ఆదరించుట ముఖ్యము. ఈ విషయమును గృహిణులు మరచిపోగూడదు. మరియు విషయమును మంచిమాటలతో అడిగి గ్రహింపవలయును. త్వరపడరాదు]

హనుమంతుడు : సమస్తలోకములకు ప్రభువైన శ్రీరాముడు దశరథ చక్రవర్తి జ్యేష్ఠ పుత్రుడు. శ్రీరాముడు తన భార్య సీతాదేవితోను తన తమ్ముడు లక్ష్మణుని తోను దండకారణ్యమునకు వచ్చినాడు. ఇట్లుండగా, సీతాదేవిని రావణాసురుడు అపహరించి కొనిపోయినాడు. సీతాదేవిని వెదకుటకుగా, శ్రీరాముని స్నేహితుడును వానర రాజ్యాధిపతియును అగు సుగ్రీవుడు మమ్ములను దక్షిణదిశకు పంపినాడు. మేమందరము తిరిగితిరిగి అలసిపోయి ఒక చెట్టుక్రింద కూర్చుండినాము. అచ్చట నుండగా ఈ బిలము కానవచ్చినది. నెమ్మదిగా వచ్చి ఇందు చేరినాము. నీవు కడు దయతో మమ్ములను ఆదరించి మా ఆకలిదప్పులు తీర్చి మమ్ములను రక్షించితివి. మేము నీకు ప్రత్యుపకార మేమైన చేయగలమా అని ఆలోచించుచున్నాము.

స్వయంప్రభ : నాకు ప్రత్యుపకారముతో పనిలేదు. నేను కేవలము ధర్మమునే అనుసరించి యుండుదానను. మీ విషయము విని నాకు సంతోషము కలిగినది. నాకు మరేమియు అక్కరలేదు.

హనుమంతుడు : ఓ ధర్మచారిణీ! మేమందరము నిన్ను శరణు వేడుకొనుచున్నాము. మే మిచ్చట నుండుటలో సుగ్రీవుడు మాకు నిర్ణయించిన గడువు దాటిపోయినది.

మన్ముల నెట్లయినను ఇచ్చటనుండి బయటికి చేర్చి రక్షింపవలయును. మేము గొప్ప పనిమీద వచ్చియున్నాము. ఇక్కడ చిక్కుపడిపోదుమేని తీరని బాధల పాలగుదుము.

*స్వయంప్రభ :* ఇక్కడికి వచ్చినవారు ప్రాణములతో బయటపడుట సులభముకాదు. అయినను నా తపఃప్రభావముచే మిమ్ములను బయటికి చేర్చెదను. మీరు కన్నులు గట్టిగా మూసికొనవలయును. కన్నులు తెరచినయెడల బయటికి పోలేరు.

వానరు లందరు తమ కన్నులను చేతులతో గట్టిగా మూసికొన్నారు. స్వయంప్రభ ఒక్క క్షణములో అందరను బయటకు చేర్చి,

*స్వయంప్రభ :* (వానరులను ఊరడించుచు) ఇదిగో చూచితిరా! ఇది వింధ్యపర్వతము. అదిగో అది ప్రస్రవణశైలము. అల్లదే సముద్రము. గుర్తు తెలిసినదా! నా కిక సెలవు. మీకు మంగళ మగునుగాక!

ఈ మాటలు చెప్పి స్వయంప్రభ తన నెలవుకు వెళ్లిపోయినది.

## వానరుల సమస్య

వానరులకు పెట్టిన గడువు ఎన్నడో దాటిపోయినది. వచ్చిన పని కాలేదు. అందరు దిగులుపడి వింధ్యపర్వతముమీద కూర్చుండినారు. వృక్షములు పూచియుండినవి. వసంతఋతువు సమీపించిన దని గ్రహించి వానరులు భయభ్రాంతులైనారు.

*అంగదుడు :* (కపివృద్ధులను చూచి) ప్రభువు మనకు నిర్ణయించిన కాలము దాటిపోయినది. సుగ్రీవుడు చండశాసను డగుట మీకు తెలియనిదికాదు. అతని చేతిలో మనకు మరణము తప్పదు. స్వాభావికముగనే సుగ్రీవుడు అమిత క్రూరుడు. మనము తప్పు చేసి అక్కడ కరిగినచో అతడు మనలను క్షమింపడు. కావున మన మిందే ప్రాయోపవేశము చేయుట మే లని తోచుచున్నది. అక్కడి కేగి ఆలుబిడ్డలను, ధనధాన్యములను, గృహములను విడిచిపెట్టుకొని అందరియెదుట మరణదండన అనుభవించుటకంటె ఇక్కడ మరణించుటయే మేలు.

వధే నాప్రతిరూపేణ శ్రేయా న్మృత్యు రిహైవ నః 53-30

మిత్రులారా! నన్ను యువరాజును చేసినది సుగ్రీవుడుకాదు. ఆ శ్రీరాముని దయవలన నాకు యౌవరాజ్యాభిషేకము జరిగినది. సుగ్రీవునికిని నాకును గల పూర్వవైరమును స్మరించి అతడు నన్ను తప్పక వధించును. అచ్చటికి వెళ్ళి మన స్నేహితులకు, బంధువులకు దుఃఖము కలిగించుటకంటె ఇచ్చట మరణించుటయే మేలు.

**వానరులు :** అవును. నీవుచెప్పినదే సరియైన మాట. సహజముగనే సుగ్రీవుడు క్రూరుడు. శ్రీరాముడు సీతాదేవియెడ అత్యంతానురాగము కలిగియున్నవాడు. మనము సీతాదేవి వృత్తాంతమును తెలిసికొనకపోవుదుమేని శ్రీరాముని ప్రీతికొరకైనను సుగ్రీవుడు మనలను వధింపగలడు. కాబట్టి మన మక్కడికి వెళ్లుట సరికాదు. మనము సీతాదేవిని ఇంకను వెదకుదము. ఆమె కానబడునేని కిష్కింధకు వెళ్ళ వచ్చును. కానరానిచో ఇక్కడనే మరణింతము.

**తారుడు :** ఈ విషాదమును చూనుడు. మన మక్కడికి వెళ్ళనక్కరలేదు. ఇక్కడ ఛావను గూడ అక్కరలేదు. ఈ ఋక్ష బిలములోనికి వెళ్ళి అక్కడ సుఖముగా నుండ వచ్చును. ఆ బిలములోని కెవ్వరును రాలేరు. మన మట్లు కావింతుమేని మనకు రామునివలనగాని, సుగ్రీవునివలనగాని, తుదకు ఇంద్రునివలనగాని ఎట్టి భయము కలుగదు.

వానరు లందరు అంగదుని మాటలకు తల లూపుచున్నారు. దీనిని హనుమంతుడు గమనించినాడు. "అంగదుడు తెలివిగలవాడు. బలపరాక్రమ సంపన్నుడు. వానరు లంద రను తన పక్షమునకు మరలించుకొని సుగ్రీవుని రాజ్యమును అపహరింపజాలినవాడు. కావున ఈ వానరులలో భేదము కలిగించి అంగదునిమీద దండోపాయము ప్రయోగించు టయే ఇప్పటి కర్తవ్యము" అని ఆలోచించి అంగదునితో అనుచున్నాడు.

**హనుమంతుడు :** అంగదా! నీవు నీ తండ్రిని మించినవాడవు. నీ తండ్రివలెనే కపిరాజ్య మును పాలింప సమర్థుడవు. (అని తలచుచున్నావు కాబోలు!) కాని ఒకమాట మాత్రము జ్ఞప్తియందుంచుకొనుము. ఈ వానరులు చపలచిత్తులు. ఆలుబిడ్డలను విడిచిపెట్టి నీ ఆజ్ఞలో నుందు రని నమ్మవలదు.

> నిత్య మస్థిరచిత్తా హి కపయో హరిపుంగవ
> నాజ్ఞాప్యం విషహిష్యంతి పుత్త్రదారాన్ వినా త్వయా. 54-9

నీ ఎదుటనే చెప్పుచున్నాను వినుము. నీవు సామదానభేదదండోపాయముల నన్నింటిని ప్రయోగించినను నేనుగాని, జాంబవంతుడుగాని, నీలుడుగాని, సుహోత్రుడు గాని, మరెవ్వరుగాని నీవైపు చేరము. సుగ్రీవునుండి మమ్ములను వేరుచేయుట నీ తరము కాదు. దుర్బలుడుగా నుండువాడు ప్రబలునితో విరోధము పెట్టుకోగూడదు.

> విగృహ్యాసన మప్యాహు ర్దుర్బలేన బలీయసః
> ఆత్మరక్షాకర స్తస్మా న్న విగృహ్ణీత దుర్బలః. 54-12

ఆ వనితయే సీతాదేవి అయి యుండును.

రావణుని సంగతి వినుడు. రావణుడు విశ్రవసుని పుత్రుడు. కుబేరుని తమ్ముడు. లంకేశ్వరుడు. లంకాపట్టణము నూరు యోజనముల దూరమున సముద్రమునం దున్నది. సీతాదేవి ఆ లంకాపురియం దున్నది. రాక్షసస్త్రీలనడుమ దీనయైయున్నది. మీరు సముద్రమును లంఘించి లంకకు పోవుదురేని సీతాదేవిని చూడవచ్చును. మీకు జయము తప్పక కలుగు నని నా దివ్యజ్ఞానమువలన తెలిసికొనగలిగితిని.

ఆకాశమార్గము మెట్లుమెట్లుగా నున్నది. ధాన్యముచే జీవించు పిచ్చుకలవంటివి మొదటి మార్గమున తిరుగుచుండును. చెట్ల పండ్లను తిని జీవించు కాకులు మున్నగు పక్షులు రెండవ మార్గమున చరించుచుండును. క్రౌంచపక్షులు, గోరువంకలు మొదలగునవి మూడవ మార్గమున సంచరించును. డేగలు నాల్గవ మార్గమునను, గృధ్రములు అయిదవ మార్గమునను సంచారము చేయుచుండును. హంసలు ఆరవ మార్గమునను, వైనతేయులైన అరుణుడు, గరుత్మంతుడు ఏడవ మార్గమునను సంచరింతురు. నేను ఆ కులమున పుట్టినవాడనే. అరుణుడు మా తండ్రి. మాకునైతము గరుత్మంతునివలెనే బలము, దివ్యదృష్టియు కలవు. నాకు సీతాదేవి ఇక్కడనుండియే కనిపించుచున్నది.

ఇహస్థోఽహం ప్రపశ్యామి రావణం జానకీం తథా
అస్మాక మపి సౌపర్ణం దివ్యం చక్షు స్తథా బలమ్. 58-29

మాకు నూరు యోజనముల దూరపు చూపుకలదు. మీరు శ్రమపడి రావణుని సంగతి తెలిసికొని, అతనిని శ్రీరామునిచేత చంపింతురేని నా తమ్ముని అతడు వధించి నందుకు బదులు తీర్చుకొన్న ట్లగును.

మీరు సముద్రమును తరించు ఉపాయమును ఆలోచింపుడు. నేను మా తమ్మునికి జలతర్పణము చేయవలసియున్నది. కావున మీరు నన్ను సముద్రతీరమునకు చేర్ప వలయును.

వానరులు సంపాతిని సముద్రదరికి చేర్చినారు. సంపాతి జటాయువునకు జల తర్పణము చేసిన పిమ్మట సంపాతిని మరల పర్వతము చెంతకు తెచ్చినారు.

సీతాదేవి వృత్తాంతము తెలిసినందున వానరు లందరు ఆనంద భరితు లైనారు.

*జాంబవంతుడు:* సంపాతీ! మా కెల్లరకు నీవే గతి. సీతాదేవిని గురించి నీకు తెలిసిన వివరములను చెప్పుము.

*సంపాతి:* నేను రెక్కలు కోల్పోయి ఇక్కడ పడినసంగతి విన్నారుగదా! నాకు ఆహారముకూడ మరొకరు తెచ్చిపెట్టవలసిన స్థితిలో చిక్కుకొన్నాను.

నా కుమారుడు సుపార్శ్వుడు అక్కడక్కడ తిరిగి నాకు ఆహారము సేకరించి తెచ్చుచుండును. ఒకనాడు ఏమి జరిగినదో తెలియునా! నేను ఆకలితో బాధ పడుచున్నాను. కాని మా వాడు ఎంతసేపటికిని రాలేదు. తుదకు సాయంకాల మైన పిదప వట్టిచేతులతో వచ్చినాడు. నాకు కోపమువచ్చి వానిని కసరుకొన్నాను. అప్పుడు వాడు "నాయనా! నేనెప్పటివలెనే ఆహారమును వెదకికొనుచు పైకెగిరి మహేంద్రపర్వతము ద్వారముచెంత కనిపెట్టుకొని యుండగా, ఆకాశ మార్గమున ఒక నల్లని వాడు ఒక యువతి నెత్తికొని ఎగిరిపోవుచుండుట చూచి, వారిరువురను నీ-ఆహారమునకై తే దలచి వారిని అడ్డగించినాను. అంతట ఆ నల్లనివాడు సవినయముగా నన్ను ప్రార్థించి దారివిడువు మని కోరినాడు. అంత దీనముగా యాచించినందున నేను వారికి దారి వదలి పోనిచ్చినాను. ఆవల, ఆకాశములోని భూతములు నాతో 'రావణుడు సీతాదేవిని కొనిపోవు తొందరలో నిన్ను ప్రాణముతో విడిచిపెట్టినాడు. దేవుని దయవల్ల నీవు బ్రతికి బయట పడినావు' అన్నారు. ఈ కారణమున ఇంత ఆలస్యమైనది. నీకు ఆహారము తేక యే వట్టిచేతులతో రావలసివచ్చినది. నన్ను క్షమింపుము" అని మా వాడు నాతో చెప్పినాడు.

శ్రీరామునికింత అపకారము జరిగినసంగతి తెలిసినను నే నేమియు చేయలే కున్నాను. మీకు వాక్సహాయము మాత్రము చేయగలను. శ్రీరాముని కార్యము నా కార్యమే కాని వేరు కాదు.

వాఙ్మతిభ్యాం తు సర్వేషాం కరిష్యామి ప్రియం హి వః
యద్ధి దాశరథేః కార్యం మమ త న్నాత్ర సంశయః 59-25

[రామకార్యమును తన కార్యముగా చూచుకొన్న సంపాతి గొప్పతనమును మనము మరచిపోరాదు]

వానరులారా! మీ రందరును సమర్థులు. మీకు సాధ్యముకాని పనిలేదు. కార్య దీక్ష వహింపుడు. మీరందరు నిశ్శబ్దముగా నుండి నా మాటలను శ్రద్ధగా వినుడు.

నా రెక్కలు కాలినందున ఈ పర్వతముమీద పడినసంగతి చెప్పితినిగదా! ఆరు దినములవరకు నాకు నా యొడలే తెలియలేదు. తరువాత కన్నులు తెరచి చూతును గదా! సర్వము అయోమయముగా నుండినది. కొంతకాలమునకు ఈ కొండను, ఆ నదిని, ఆ సముద్రమును చూచి ఇది వింధ్యపర్వతమని పోల్చుకొన్నాను.

ఇక్కడ నిశాకర మహర్షి ఆశ్రమ మొకటి యుండినది. ఇది ఎనిమిదివేల సంవత్సరముల నాటిమాట. నిశాకరుడు మహాప్రభావ సంపన్నుడు. నేను, నా తమ్ముడు ఆ యాశ్రమమునకు తరచుగా వెళ్ళి మహర్షి ని సేవించుచుండువారము.

నేను మూర్ఛ దేరిన పిదప ఆ మహర్షి దర్శనము చేసికొనదలచి మెల్లగా శరీరము నీడ్చుకొనుచు ఆశ్రమము చేరి ఒక చెట్టుక్రింద కూర్చుండినాను. నిశాకరమహర్షి స్నానము చేసి ఆశ్రమములోనికి పోవుచుండినారు. వ్యాఘ్రములు, సింహములు, ఏనుగులు, సర్పములు, ఇంకను అనేక జంతువులు ఆయనను వెంబడించి ఆశ్రమము వరకు వచ్చి వీడ్కోలిచ్చి మరలిపోయినవి.

[ఎట్టి దృశ్యము ! మహర్షుల తపఃప్రభావము ఎంత దొడ్డదియో !]

మహర్షి నా వైపు చూచెను గాని, అచ్చట నిలువకయే, ఆశ్రమము ప్రవేశించినారు.

కొంతసేపటికి మరల నా యొద్దకువచ్చి "ఏమోయీ ! ఇట్లేల వేమి ! నిన్ను గుర్తింపలేక పోయినాను. నీ రెక్కలు కాలిపోయిన వేమి? నీ శరీరమునిండ ఈ గాయము లెట్లు కలిగినవి ? సంపాతి, జటాయువు అను రెండు గృధ్రములు మనుష్య రూపము లతో ఆశ్రమమునకు వచ్చుచుండిరికదా ! వారిలో పెద్దవాడవు సంపాతివికదా నీవు ! నీ సంగతి వివరముగా చెప్పుము" అని అడిగినారు. జరిగిన సంగతి సవిస్తరముగా ఆయనతో చెప్పుకొని "స్వామీ ! నేను ఈ దిక్కుమాలిన బ్రతుకు బ్రతకలేను. పర్వతము పైనుండి క్రిందపడి మరణింపగోరుచున్నాను సెలవిండు" అని ప్రార్థించినాను.

రాజ్యేన హీనో భ్రాత్రా చ పక్షాభ్యాం విక్రమేణ చ
సర్వదా మర్తు మేవేచ్ఛన్ పతిష్యే శిఖరా గ్గిరేః 61-17

మహర్షి కొంతసేపు ధ్యాననిష్ఠలోనుండి నాతో "సంపాతీ ! నీకు రెక్కలు మరల మొలవగలవు. నీకు క్రొత్తగా బలపరాక్రమములు సైతము లభ్య మగును. నీ విప్పుడు మరణించుటకు వీలులేదు. నీ వలన ఒక గొప్ప కార్యము జరుగవలసియున్నది. దశరథ చక్రవర్తికి రాముడు అను కుమారుడు పుట్టగలడు. రాముడు తన భార్యను, తన తమ్ముని, వెంటబెట్టుకొని పితృవాక్య పరిపాలనము చేయుటకు అరణ్యమునకు రాగలడు. ఆయనభార్య సీతాదేవిని రావణుడు అపహరింపగలడు. సీతాదేవి మహా పతివ్రత. రావణాసురుడు పెట్టించిన అన్నము ఆమె తినదు. ఇంద్రు డీసంగతి తెలిసి కొని సీతాదేవికి అమృత తుల్య మగు పరమాన్నమును పంపును. ఆ పరమాన్నము ఇంద్రుడు పంపిన దని సీతాదేవి తెలిసికొని దానిలోని అగ్రభాగమును శ్రీరామునికి

తీసియుంచి "నా ప్రభువైన శ్రీరాముడు లక్ష్మణసహితుడై బ్రదికియున్నను లేక దేవత్వమును పొందినను ఈ పరమాన్నము వారికి చెందునుగాక" అనిచెప్పి ఒక పాలు వేర్పరచి ప్రక్కన పెట్టగలదు.

సా చ కామైః ప్రలోభ్యంతీ భక్ష్యై ర్భోజ్యై శ్చ మైథిలీ
న భోక్ష్యతి మహాభాగా దుఃఖే మగ్నా యశస్వినీ 62-7

పరమాన్నం తు వైదేహ్యా జ్ఞాత్వా దాస్యతి వాసవః
య దన్న మమృత ప్రఖ్యం సురాణామపి దుర్లభమ్. 62-8

త దన్నం మైథిలీ ప్రాప్య విజ్ఞా యేంద్రా దిదం త్వితి
అగ్ర ముద్ధృత్య రామాయ భూతలే నిర్వపిష్యతి. 62-9

యది జీవతి మే భర్తా లక్ష్మణేన సహ ప్రభుః
దేవత్వం గచ్ఛతో ర్వాపి తయో రన్న మిదం త్వితి. 62-10

[ఈ ఘట్టమున గమనింపదగినవి రెండు విషయములు. మొదటిది, శ్రీరామునికి పెట్టకయే సీతాదేవి భుజింపదు. రెండవది, రావణుని అన్నము తిన్నయెడల రావణుని చంపించుట పాడికాదు. కావున ఉపవాసములైనను చేయునుగాని, రావణుని అన్నము మాత్రము సీతాదేవి తినదు. అన్నము పెట్టినవానిని చంపగూడదను లోకమర్యాద ఇప్పటికిని కలదు.]

సంపాతీ! రావణుడు అపహరించికొనిపోయిన సీతాదేవిని వెదకుచు రామదూతలైన వానరులు రాగలరు. సీతాదేవి వృత్తాంతమును ఆ వానరులకు నీవు చెప్పవలయును. కావున నీ విందేయుండుము. నీవు ఆ కార్యమును చేసినతోడనే నీకు రెక్కలు మొలుచును. నేను నీకు రెక్కల నిప్పుడే ఇయ్యగలను. కాని నీవిచ్చట నే ఉండి-చేయవలసిన కార్య మున్నందున నీకు రెక్కలిప్పుడిచ్చుట నా కిష్టములేదు.

నోత్సహేయ మహం కర్తు మద్యైవ త్వాం సపక్షకమ్
ఇహస్థ స్త్వం తు లోకానాం హితం కార్యం కరిష్యసి. 62-13

[అవునుమరి, రెక్కలు అప్పుడే ఇచ్చినయెడల వానరులు వచ్చువేళకు ఎక్కడికైన ఎగిరిపోయినట్లైన ఎంతో ఇబ్బందికదా! ఇందులో ఒక విశేష మున్నది. మనకు కావలసినవారు వారిచేతనైన పనినికూడ చేయక, మన చిక్కులను వెంటనే సవరింపలే దని మనము కొరతపడరాదు. ఏదో గొప్ప ఉద్దేశమును మనసునం దుంచుకొని ఉపేక్షగా నున్నా రని మనము సరిపెట్టుకొనుట యుక్తము.]

సంపాతీ! రామకార్యమును చేయవలసినది నీ వొక్కడవేకాదు; సమస్త ప్రాణులు, దేవతలు, మహర్షులు, ఇంద్రుడు అందరును చేయవలసినదే. నాకుకూడ రామలక్ష్మణుల దర్శనము చేసికొనవలయు నని కుతూహల మున్నది. కాని ఈ శరీరమును అంత దీర్ఘ

# హనుమంతుడు సముద్రలంఘనమునకు పూనుకొనుట

హనుమంతుడు జాంబవంతునిచే ప్రోత్సహింపబడి తన బలపరాక్రమములను తెలిసికొని సముద్రలంఘనమునకు పూనుకొని వానరులకు సంతోషము కలుగునట్లు తన శరీరమును పెంపుచేసినాడు.

త్రివిక్రమావతారమున విజృంభించిన విష్ణుదేవుని చూచి ప్రజలు అచ్చెరువొంది నట్లు వానరు లందరు హనుమంతుని అద్భుతరూపమును చూచి అబ్బురపడి తమ దుఃఖ మును వీడి హర్ష ధ్వానములు చేసినారు. అందరు హనుమంతుని స్తుతించినారు.

హనుమంతుడు వానరవృద్ధులకు నమస్కరించి అనుచున్నాడు.

*హనుమంతుడు*: నేను వాయుదేవుని పుత్రుడను. నా వేగము గరుత్మంతుని వేగమును మించియుండును. నేను ఉదయపర్వతమునుండి సూర్యునివెంట బయలుదేరి మధ్యాహ్నములోపలనే అస్తగిరికి చేరి మరలివచ్చి సూర్యునికి ఎదురు రాగలను. నా వేగమునకు సముద్రము ఎండిపోగలదు. భూమి బ్రద్దలగును. కొండలు పిండి యగును. నా వేగమునకు లతావృక్షముల పుష్పములు నన్ననుసరించిరాగలవు. ఆకాశమున నా మార్గము స్వాతీనక్షత్రమార్గము ననుకరించును. నా రూపము త్రివిక్రమావతారమున విజృంభించిన విష్ణుదేవుని రూపమును విడంబింపగలదు. నాశక్తి గరుత్మంతునికి, వాయుదేవునికి మాత్రమే కలదు.

భవిష్యతి హి మే పంథా స్స్వాతేః పంథా ఇవాంబరే. 67-20

భవిష్యతి హి మే రూపం ప్లవమానస్య సాగరే
విష్ణో ర్విక్రమమాణస్య పురా త్రీన్ విక్రమా నివ. 67-26

వానరులారా! మీరందరు ఆనందముతో నుండుడు. నాకు మంచి శకునములు కానవచ్చుచున్నవి. నా మనస్సు జయమునే సూచించుచున్నది. నేను సీతాదేవిని తప్పక చూచిరాగలను. వజ్రపాణియైన ఇంద్రుని గాని, స్వయంభువుడైన బ్రహ్మనుగాని నేను జయించి వారి చేతులనుండి అమృతమునైనను కొనిరాగలను. అవసరమగునేని లంకను పెల్లగించుకొని తేగలను.

*జాంబవంతుడు*: నాయనా! వెళ్ళిరమ్ము! నీకు శుభమగునుగాక! నీ కార్యసిద్ధికై మేము దేవతలను ప్రార్థించుచుందుము.

ఋషుల అనుగ్రహమువలనను వానరవృద్ధుల ఆశీర్వాద బలమువలనను గురువుల ప్రసాదమువలనను నీ వీ మహాసముద్రమును దాటుము.

[సంసార సాగరమును దాటుటకుకూడ ఇవే ముఖ్యసాధనములు]

ఋషీణాం చ ప్రసాదేన పపివృద్ధ మతేన చ
గురూణాం చ ప్రసాదేన ప్లవస్వ త్వం మహార్ణవమ్. 67-34

హనుమా! మా అందరి ప్రాణములు నీచేతిలో నున్నవి. నీవు మరలి వచ్చువరకు మేము ఒంటికాలిమీద నిలవబడి యుందుముసుమా!

[ఒంటికాలిమీద నిలవబడి యుందు మన్న మాట ఇక్కడనుండి వచ్చినదే]

స్థాస్యామ శ్చైక పాదేన యావ దాగమనం తవ
త్వ ద్గతాని చ సర్వేషాం జీవితాని వనౌకసామ్. 67-35

*హనుమంతుడు:* (విజృంభించి) ఇప్పటి నా వేగమును ఈ భూమి సహింపజాలదు. మహేంద్రగిరిశిఖరములు దృఢముగా నున్నవి, కావున నేను పర్వతము నెక్కి లంఘనమున కుద్యమించెదను.

హనుమంతుడు పర్వత మెక్కి దాని శిఖరములమీద విహరింప సాగినాడు. ఆ వేగమునకుకొండ శిఖరములు నలిగి అందుండి జలము ప్రవాహములై పారినది. పర్వతముమీది జంతువులు దిక్కు తోపక పరుగెత్తినవి. అచ్చట విలాసముగా విహరించు చుండిన విద్యాధరులు, నాగ గంధర్వ దంపతులు భయపడి పారిపోయినారు. పర్వతము మీద తపస్సు చేయుచుండిన ఋషులునై తమ వెళ్ళిపోసాగినారు.

హనుమంతుడు సముద్ర లంఘనమునకు కావలసిన వేగమును అలవరచుకొని సమాహితచిత్తుడై మనస్సుచే లంకాపురము ప్రవేశించినాడు.

[శరీరముతో వెళ్లుటయే మిగిలియున్నది. కార్య విజయమునకు పూనిక ఎంతో అవసరము. ముమ్ముందు మనస్సును స్థిరము చేసికొనవలయును.]

స వేగవా న్వేగ సమాహితాత్మా
హరిప్రవీరః పరవీర హంతా
మన స్సమాధాయ మహానుభావో
జగామ లంకాం మనసా యశస్వీ 67-50

ఓం తత్సత్

శ్రీ రా మా య న మః

# శ్రీమద్వాల్మీకి రామాయణ కథామృతము

## సుందరకాండము

### హనుమంతుడు సముద్రమును లంఘించుట

తతో రావణనీతాయా స్సీతాయా శ్శత్రుకర్శనః
ఇయేష పదమన్వేష్టుం చారణాచరితే పథి. 1.1

రావణునిచే అపహరింపబడిన సీతాదేవి ఎందున్నదో వెదకుటకై శత్రుకర్శనుడైన హనుమంతుడు, చారణులు చరించు ఆకాశమార్గమున ప్రయాణము చేయుటకు సిద్ధమైనాడు.

[హనుమంతుని సముద్ర లంఘనమును వాల్మీకిమహర్షి సుందరకాండముయొక్క మొదటి సర్గలో వర్ణించియున్నారు. ఈ సర్గ రామాయణములోని సర్గ లన్నిటిలో పెద్దది. సముద్రమును లంఘించి ఆవలి తీరము చేరుట సామాన్యమైన పని కాదని తెలియజేటయుకే యీ సర్గను అంత నిడివి చేసిరా అని తోచును. దారిలో ఎన్ని విఘ్నములు కలిగినను తన పట్టును సడలింపక హనుమంతుడు కార్యదీక్షాపరుడై ప్రయాణము సాగించుట గమనింపదగియున్నది]

పై కెగురుటకు అనుకూలముగా హనుమంతుడు మున్ముందు చేసిన కార్యమును గమనింపవలయును.

సూర్యునికి ఇంద్రునకు వాయుదేవునికి బ్రహ్మదేవునికి సమస్త భూతములకు చేతులు మొగిడ్చి నమస్కరించినాడు. తూర్పువైపు తిరిగి తన తండ్రియైన వాయుదేవునికి ప్రత్యేకముగా నమస్కరించి తన దేహమును పెంచినాడు.

[దేహమును పెంపు చేయుటకు వాయుదేవుని సాహాయ్యము ముఖ్యము. అదిగాక వాయుదేవుడు తన తండ్రిగదా ! కావుననే ప్రత్యేక నమస్కారము]

స సూర్యాయ మహేంద్రాయ పవనాయ స్వయంభువే
భూతేభ్యశ్చాంజలిం కృత్వా చకార గమనే మతిమ్. 1.8

అంజలిం ప్రాఙ్ముఖః కృత్వా పవనాయాత్మయోనయే
తతో హి వవృధే గంతుం దక్షిణో దక్షిణాం దిశమ్. 1.9

ఈవిధముగా రూపమును పెంచి పర్వతముమీద విహరించుచుండగా చెట్లనుండి పూవులు రాలి హనుమంతునిమీద పడినవి. అప్పుడు హనుమంతుడు పుష్పమయమైన కొండవలె కనిపించినాడు.

హనుమంతుడు పర్వతముపై సంచరించు వేగమునకు పర్వతము బ్రద్దలైనది. అందులోనుండిన సువర్ణ శిలలు నీలములు వెండి రాతితునుకలు బయటపడినవి. గుహలలో దాగియుండిన భూతములు వికృతముగా విలపించినవి. సర్పములు వెలుపలికివచ్చి కోపించి కొండశిలలను కరచినవి. కొండమీద ఉండిన ఓషధులు ఆ సర్పముల విషమును హరింప జాలక పోయినవి. అక్కడ విలాసముగా విహరించుచుండిన విద్యాధరులు పర్వతము ముక్కలై పోవునేమో అని భయపడి వారు తెచ్చుకొన్న తినుబండములను పాత్రలను వారియొద్దనుండిన కత్తులను కటారులను ఎక్కడివక్కడ వదలిపెట్టి పై కెగిరిపోయి తమ ప్రియురాండ్రతో ఆకాశమున నిల్వబడి యీ చిత్రమును కాంచుచుండగా వారికి ఋషుల మాటలు వినిపించినవి. "ఈ హనుమంతుడు రామ కార్యార్థియై సముద్రమును లంఘించుటకు ప్రయత్నించుచున్నాడు" అని ఋషులు పలుకుట విని విద్యాధరులు హనుమంతునివైపు చూచినారు.

పై కెగురుటకై హనుమంతు డుపక్రమించుచున్నాడు. సింహగర్జన చేసి వాలమును విదల్చి చేతులను బిగియపట్టి నడుము సన్నము చేసికొని కాళ్ళను ముడుచుకొన్నాడు. చెవులు కుంచించి ఆకాశమువైపు దృష్టిని నిలిపి ఊపిరి బిగపట్టి పాదములు పర్వతముమీద దృఢముగా ఆనించి తన స్నేహితులతో అనుచున్నాడు.

*హనుమంతుడు :* శ్రీరాముని వింటినుండి బాణ మేవిధముగా వాయువేగముతో పోవునో అదేవిధముగా నేను లంకకు పోవుచున్నాను.

[మధ్యేమార్గమున నిలువక అన్నమాట]

యథా రాఘవనిర్ముక్త శ్శర శ్శ్వసనవిక్రమః
గచ్ఛే త్తద్వ ద్గమిష్యామి లంకాం రావణపాలితామ్ 1-39

సీతాదేవి లంకలో లేనిచో ఆ వేగముతోనే స్వర్గమున కరిగి చూచెదను. అక్కడ గూడ కనిపించనిచో మరల లంకకు పోయి రావణుని బంధించితెచ్చెదను. మిత్రులారా! నే నెట్లైనను సాధించి సీతాదేవిని తేగలను. లేనియెడల రావణసమేతముగా లంకను పెల్లగించి తెచ్చెదను.

ఈ మాటలు వానరులతో చెప్పి హనుమంతుడు ఆకాశమున కెగిరినాడు. "నేను గరుత్మంతుడనే" అని భావించినాడు. హనుమంతుడు పై కెగిరిన వేగమునకు కొన్ని

చెట్లు పైకి లేచి అతనిని వెంబడించుట చూడగా, దూరప్రయాణము చేయు బంధువును సాగనంపుటకు వచ్చుచున్నట్లు తోపించినది. హనుమంతుని అనుసరించిన పుష్పములు సముద్రములో పడగా సముద్రము నక్షత్రములతో కూడిన ఆకాశమువలె కనబడినది.

హనుమంతుడు ఆకాశగమనము సాగించుచున్నాడు. అయిదువ్రేళ్ళతో కూడిన ఆయన బాహువులు పంచానన సర్పములవలె శోభిల్లుచుండినవి. కన్నులు నిప్పుల కరణి మెరయుచుండినవి. ముఖము, ముక్కు యెఱ్ఱబడినవి. వాలము ఇంద్రధ్వజము చంద మున తేజరిల్లుచుండినది.

తోకతోకూడిన హనుమంతుడు ఉత్తరదిక్కునుండి, దక్షిణదిశకు పోవుట చూడగా లంకకు చేటును సూచించు తోకచుక్కవలె వెలుగుచుండినాడు.

> ఖే యథా నిపతంత్యుల్కా హ్యుత్తరాంతాద్వినిస్సృతా
> దృశ్యతే సానుబంధా చ తథా స కపికుంజరః. 1-65

హనుమంతుని వేగమునకు నీళ్ళు పైకి ఎగిరినప్పుడు సముద్రములోని చేపలు, తాబేళ్లు, మొసళ్ళు మున్నగు జంతువులు బయటబడుట చూడగా, ధరించిన వస్త్రమును విప్పినప్పుడు దేహమునందలి అవయవములు ఎట్లు బయల్పడునో ఆ విధముగా కనబడినది.

> వస్త్రాపకర్షణేనేవ శరీరాణి శరీరిణామ్. 1-74

ఎగిరిపోవుచున్న హనుమంతునిచూచి అందరు గరుత్మంతు డని భావించినారు. హనుమంతుడు రెక్కలుకలిగిన పర్వతమువలె కనబడినాడు. మేఘముల నడుమనుండి పోవుచున్నాడు. హనుమంతునిపై దేవతలు పుష్పవర్షము కురిపించినారు. రామకార్యార్థియై పోవుచున్న హనుమంతునియెడ సూర్యుడును, వాయుదేవుడును ఎంతో అనుకూలముగా వర్తించినారు. ఋషులు, దేవతలు మున్నగువారు హనుమంతుని ప్రశంసించినారు.

ఇక్ష్వాకువంశమువాడైన సగరునివలన సముద్రుడు వృద్ధిపొందినవాడు గనుక ఆవంశస్థుడైన శ్రీరాముని పనికై పోవుచున్న హనుమంతునికి సాహాయ్యము చేయుట తన కర్తవ్యమని తలచి సముద్రుడు హనుమంతుని అలుపుతీర్చుట కొక ఉపాయ మాలోచించి, నీటిలో మునిగియున్న మైనాకపర్వతమును పిలిచి "మైనాకుడా! పైకిగాని, క్రిందికిగాని, ప్రక్కలకుగాని సంచరించుటకు నీకు శక్తికలదుగదా. ఇప్పుడు ఒక పని చేయుము. నీవు పైకి లేచి హనుమంతుని కాతిథ్య మిమ్ము. ఎంత అలసియున్నాడో పాపము! నీ శిఖరముపై కొంత విశ్రమించి తరువాత సుఖముగా పయనము సాగింప గలడు. సరేకదా!"

మైనాకుడు బంగారు శిఖరములతో వెల్వడినాడు (ఆకర్షణీయముగా ఉండుటకు కాబోలు). తనదారి కడ్డముగా నిల్వబడియున్న ఆ పర్వతమును హనుమంతుడు చూచి దానిని విఘ్నకారిగా తలచి తన రొమ్ముతో ఒక త్రోపుత్రోయగా మైనాకుడు హనుమంతుని వేగతీవ్రతను గ్రహించి సంతోషించి మనుష్యరూపమును ధరించి హనుమంతునితో,

**మైనాకుడు :** హనుమంతుడా! నీ వెంతో దూరము పోవలసినవాడవు. కొంచెము సేపు నా శిఖరముమీద విశ్రమించి నేను తెచ్చిన మధురములైన యీ కందమూలములను ఆరగించి అలసట తీర్చుకొనిపోరాదా! సముద్రుడు కోరగా వచ్చితిని. ఇది సముద్రుడు రామునకు చేయు పూజ. అదిగాక నీవు నాకును కావలసినవాడవే. ఇంద్రుని వజ్రాయుధము తాకుడునుండి మీ తండ్రి యగు వాయుదేవుడు నన్ను తప్పించి నా రెక్కలను కాపాడి నన్నీసముద్రములో దాచినాడు. ఆ వాయుదేవుని కుమారుడవగు నిన్ను గౌరవించుట నా ధర్మము. ఏమందువు ?

**హనుమంతుడు :** మైనాకుడా! నీ తియ్యని పలుకులవల్లనే నాకు ఆతిథ్యము జరిగినట్లయినది. నీ ఆతిథ్యమును స్వీకరింపలేదని కోపము చేయకుము. నాకేమో ముమ్మరమైన పనిసమయము. ప్రొద్దా! సాగిపోవుచున్నది. త్వరగా పోవలయును. అదిగాక దారిలో నిలవక వెళ్లుదునని మా వారికి మాట ఇచ్చి వచ్చితిని. కాబట్టి ఇప్పుడు నిలువజాలను. మరియేమియు అనుకోవలదు.

ఈ మాటలు చెప్పి మర్యాదను పాటించి పర్వతమును చేతితో స్పృశించి హనుమంతుడు నవ్వుచు (శ్రమలేదని తెలుపుటకు కాబోలు) ప్రయాణము సాగించినాడు.

మైనాకుడును సముద్రుడును సంతసించి "నీకు జయ మగునుగాక" అని శుభాశంసనములు పలికినారు. హనుమంతుడు వారిని వీడ్కొని దూరముగా పైకెగిరి వాయుమార్గమున పోవుచుండినాడు. ఈ ద్వితీయ విఘ్నమును జయించిన హనుమంతుని దేవతలు కొనియాడిరి (సముద్రమే ప్రథమ విఘ్నము). మైనాకుడు చేసిన మంచి పనికి ఇంద్రుడు సంతోషించి మైనాకునితో "ఇకమీద నా వలన నీ కెట్టి భయమును ఉండదు. నీ ఇచ్చవొచ్చిన సుఖముగా ఉండుము" అనిచెప్పి అభయ మిచ్చినాడు.

హనుమంతుడు ఎగిరిపోవుచున్నాడు.

## సురస

అప్పుడు దేవతలు గంధర్వులు సిద్ధులు మహర్షులును సర్పములకు తల్లి యగు సురసను చూచి "సురసా! నీవు భయంకరమగు రాక్షసీరూపమును దాల్చి హనుమంతునికి

కొంచెము విఘ్నము కలిగింపుము. అతని బలపరాక్రమములను బుద్ధిబలమును పరీక్షింప వలయును. నిన్ను జయించి పోగలడా ? లేక దుఃఖించుచు కూర్చుండునా? చూడవల యును" అన్నారు. సురస వల్లె యని రాక్షసీరూపముతో వచ్చి నోరు పెద్దదిగా తెరచి "హనుమంతుడా! దేవతలు నాకు ఆహారముగా నిన్ను పంపినారు. నా నోటిలో ప్రవేశింపుము" అన్నది. హనుమంతుడు సురసకు నమస్కరించి సంతోషముతో "నే నిప్పుడు రామకార్యార్థినై పోవుచున్నాను. శ్రీరాముని భార్య యగు సీతాదేవిని రావణుడు అపహరించి కొనిపోయినాడు. నేను శ్రీరాముని పంపున సీతాదేవియొద్దకు వెళ్లుచున్నాను. నీవును శ్రీరాముని రాజ్యములో నున్నదానవే గనుక శ్రీరామునికి నీవును సాయము చేయవలెనుగదా! కావున నన్ను పోనిమ్ము! మరియొక మాట వినుము. నేను సీతాదేవిని సందర్శించి ఆమె వృత్తాంతమును శ్రీరామునికి నివేదించి వెంటనే మరలివచ్చి నీ నోటిలో ప్రవేశింతును. నేను మాట తప్పువాడను కాను సరేనా" అన్నాడు.

సురస : హనుమంతుడా! నీకు తెలియదుకాబోలు! నా కొక వర మున్నది. నా యొద్దకు వచ్చినవా రెవ్వరును నన్ను తప్పించుకొని పోలేరు. నా నోటిలోనికి రావలసినదే! దీనికి తిరుగులేదు.

ఈ మాట లనుచు, సురస తన నోటిని పెద్దదిచేసినది. ఆ నోరు పట్టరానట్లు హనుమంతుడు తన శరీరమును పెంపుచేసినాడు. సురస తన నోరు మరింత పెంచినది. ఈ విధముగా పెంచుటలో సురస నోరు నరకలోకమంత పెద్దది అయినది. అప్పుడు హనుమంతుడు తన శరీరమును చిన్నదిచేసి అంగుష్ఠమాత్రుడై తటాలున సురస నోట దూరి వెంటనే బయటికివచ్చి ఆకాశమున కెగిరి సురసతో "దాక్షాయణీ! నీకు నమస్కారము చేయుచున్నాను. బ్రహ్మదేవుడు నీకిచ్చిన వరము ననుసరించి నేను నీ నోట ప్రవేశించితిని. బ్రహ్మ వరము సత్యమయినది, నేను సీతాదేవియొద్దకు పోవుచున్నాను" అన్నాడు. అప్పుడు సురస నిజరూపమును దాల్చి "హనుమంతుడా! సుఖముగా పోయి రమ్ము నీకు కార్యసిద్ధి యగునుగాక! సీతాదేవిని శ్రీరామునితో చేర్చుము" అని ఆశీర్వదించినది.

ఈ మూడవ విఘ్నమును కూడ జయించిన హనుమంతుని సర్వభూతములు ప్రశంసించినవి.

## సింహిక

హనుమంతుని ప్రయాణము సాగిపోవుచున్నది. గరుత్మంతునివలె వాయు మార్గమున ఎగిరిపోవుచున్నాడు. అప్పుడు సింహిక అను రాక్షసి హనుమంతుని భక్షింప

దలచి అతని నీడను గ్రహించి ఆకర్షింప సాగినది. హనుమంతుని వేగము అతనికి తెలియకయే తగ్గిపోయినది. దీనికి కారణ మేమై ఉండునా యని అన్నిప్రక్కల చూచి నాడు. సముద్రములో పైకి లేచియున్న సింహిక అతనికంట బడినది. "నీడనుబట్టి ఆకర్షించు రాక్షసి దక్షిణసముద్రములో ఉన్నది అని సుగ్రీవుడు సూచించిన రాక్షసి ఇదియే ఐయుండును" అని హనుమంతుడు ఆలోచించి తన శరీరమును పెంచినాడు. సింహిక తననోటిని పెంచి పాతాళ మంతది చేసి నోరుతెరచి హనుమంతుని పట్టుకొనబోయినది. హనుమంతుడు సింహిక జీవస్థానములను గుర్తించి, తన శరీరమును చిన్నదిచేసి, సింహిక నోట ప్రవేశించి, దాని ఆయువుపట్లను గోళ్ళతో చీల్చి, వెంటనే బయటికివచ్చి, తన దేహమును పెంచి, సింహిక గుండెను పగులదన్నినాడు. సింహిక స్మృతి తప్పి జీవములు విడిచి సముద్రములో పడిపోయినది. ఆకాశమునందలి భూతములు హనుమంతుడు చేసిన యీ గొప్ప కార్యమును అభినందించి "వానరేంద్రుడా! ఈ సింహికను వధించి నీవు మహాత్కార్యమును సాధించితివి. నీవు కోరిన పనిని జయావహముగా జరిపించుకొనుము. నీ కున్నట్లు ధైర్యము, సూక్ష్మములను గ్రహించుశక్తి, మతి, సామర్థ్యము ఈ నాలుగు గుణములు ఎవ్వరియం దుండునో వారు తమ పనులను సాధించు కొనగలరు. (కార్యసిద్ధికి ఇవి ముఖ్య సాధనములు.)

భీమ మద్య కృతం కర్మ మహత్సత్త్వం త్వయా హతమ్.
సాధయార్థమభిప్రేత మరిష్టం ప్లవతాం వర. 1-188

యస్య త్వేతాని చత్వారి వానరేంద్ర యథా తవ
ధృతి ర్దృష్టి ర్మతి ర్దాక్ష్యం స కర్మసు న సీదతి. 1-189

హనుమంతుడు ఉత్సాహము నవలంబించి ఆకాశమార్గమున గరుత్మంతునివలె సంచరించి, నూరు యోజనముల సముద్రమును లంఘించి, దక్షిణ తీరమునందుండిన లంకాద్వీపమును మలయపర్వత వనములను చూచినాడు. ఆకాశము నడ్డగించు మహా మేఘమువలె తన శరీర ముండుట గమనించి అట్టిరూపము రాక్షసుల కండ్లబడినయెడల వచ్చిన పనికి భంగము కాగల దని యోచించి హనుమంతుడు తన శరీరమును చిన్నదిగా చేసి తన సహజరూపమును పొందెను.

["ఆత్మజ్ఞానమువలన మోహమును బాసి మానవుడు యథారూపమును పొందినట్లు" అన్నారు వాల్మీకిమహర్షి. వేదాంతసారమును సగము శ్లోకములో గొప్పగా చెప్పినారు. అందరును శ్రద్ధగా చదివి గ్రహింపదగిన విషయములు ఇందుల్లో నెన్నియో ఇమిడియున్నవి.]

తత శ్శరీరం సంక్షిప్య త న్మహీధర సన్నిభమ్
పునః ప్రకృతి మాపేదే వీతమోహ ఇవాత్మవాన్. 1-196

త్రివిక్రమావతారమున విజృంభించి బలిచక్రవర్తి పరాక్రమమును హరించిన విష్ణుదేవుడు మరల వామనరూపము నొందినట్లు హనుమంతుడు తన పూర్వరూపమును పొందెను.

త ద్రూప మతిసంక్షిప్య హనుమా న్ప్రకృతౌ స్థితః
త్రీ న్క్రమానివ విక్రమ్య బలివీర్యహరో హరిః. 1.197

ఈ విధముగా చిన్నశరీరము గలవాడై లంబపర్వతశిఖరమున హనుమంతుడు వ్రాలినాడు. ఆ వేగమునకు చెట్లనుండి పూవులు రాలి హనుమంతుని శరీరమును కప్పివేసినవి. హనుమంతుడు పుష్పగిరివలె కనబడినాడు.

[పుష్పవృష్టి కురిసి శుభమును సూచించిన దన్నమాట.]

## హనుమంతుడు తన కర్తవ్యమును గూర్చి ఆలోచన చేయుట

త్రికూట పర్వత శిఖరమునం దుండిన లంకాపట్టణమును హనుమంతుడు చూచినాడు. ఇంతటిపని చేసినను హనుమంతుడు అలసట పొందలేదు. ఒక్క నిట్టూర్పైనను విడువలేదు.

అనిశ్శ్వసన్ కపి స్తత్ర న గ్లాని మధిగచ్ఛతి. 2.3

"అనేక నూర్ల యోజనములైనను దాటగలను. ఇది నాకొక లెక్కయా" అని హనుమంతుడు అనుకొన్నాడు.

పర్వతశిఖరముమీదినుండి అడవులగుండ, పచ్చికబయళ్ళ మీదుగా, నడచి లంకకు చెందిన ఉద్యానవనములను తిలకించుచు, పట్టణమును సమీపించినాడు. లంకాపట్టణము విశ్వకర్మచే నిర్మింపబడినది. ఇదివరకు కుబేరునిది. స్వర్గమునందలి అమరావతి పట్టణమువలె శోభిల్లుచున్నది. సీతాదేవిని అపహరించి తెచ్చియున్నందున పట్టణ రక్షణకు ప్రత్యేకమగు ఏర్పాటులు చేయబడియుండినవి.

హనుమంతుడు పట్టణపు ఉత్తరద్వారముచెంత చేరి ఆలోచించుచున్నాడు. "లంకాపురిని రక్షించుటకు ఎన్ని యేర్పాటులో చేయబడియున్నవి. రావణుడు తక్కువవాడుగా కనబడలేదు. నడుమ ఈ విశాల సముద్ర మొకటి యున్నది. ఈ సముద్రమును దాటి వానరు లిక్కడికి రాగలరా! ఒకవేళ రాగలిగినను ఏమి లాభము! యుద్ధమాడి యీ లంకను జయించుట దేవతలకును సాధ్యము కాదని తోచుచున్నది. ఈ దుర్గములను భేదించు ఉపాయమే ఊహింపలేకున్నాను.

శ్రీరాముడైనను ఇక్కడికి వచ్చి యేమి సాధింపగలడు? రాక్షసుల విషయమున సామోపాయము పనిచేయదు. రాక్షసు లందరు సిరిసంపదలు పుష్కలముగా కలిగి

యున్నందున దానముతో పని జరుగదు. భేదోపాయమునకు అవకాశమే కనబడుటలేదు. యుద్ధమున వారిని సాధింపలేము. మొదటిమాట, మావారిలో ఇక్కడికి రాగలిగినవా రెంద రున్నారు! ఉందురేని అంగదుడు, నీలుడు, మా ప్రభువైన సుగ్రీవుడు, నేను. మేము నలుర్వము మాత్రమే రాగలము. సరే! ఈ ఆలోచన లన్నియు ఇప్పు డెందుకు! సీతాదేవి బ్రదికి యున్నదా లేదా అని ఆమె సమాచారము ముందు తెలిసికొని ఆమెను సందర్శించి అటుపైన ఆలోచించుకొనవచ్చును.

యావ జ్జానామి వైదేహీం యది జీవతి వా న వా
తత్రైవ చింతయిష్యామి దృష్ట్వా తాం జనకాత్మజామ్. 2-31

ఈ పట్టణములోనికి ప్రవేశింపవలెగదా! ఈ రూపముతో ప్రవేశింప వీలులేదు. సీతాదేవిని వెదకునప్పుడు ఈ రాక్షసులకు నేను కనిపింపకూడదు. కావున శరీరమును చిన్నది చేసికొని రాత్రివేళ పురిలో ప్రవేశించుట మంచిది. దీనికి ఉపాయ మేమి? శ్రీరాముని కార్యము చెడకూడదు. ఎవ్వరును లేనప్పుడు సీతాదేవిని ఏకాంతముగా సందర్శింపవలయును.

దూత తెలివితక్కువవా డగునేని, ఫలించుటకు సిద్ధముగా నున్న పనులు సైతము సూర్యుని ఉదయముతో చీకటి నశించునట్లు నశింపగలవు. చక్కగా సర్వవిధములైన ఆలోచనలచే నిశ్చితమైన విషయముగూడ వివేకహీనుడైన దూత చేతిలోపడి చెడిపోవును. మాకంటె తెలిసినవా రెవరును లేరని గర్వించు భృత్యులు కార్యములను నాశనము చేయుదురు.

భూతాశ్చార్థా విపద్యంతే దేశకాల విరోధితాః
విక్లబం దూత మాసాద్య తమ స్సూర్యోదయే యథా. 2-39

అర్థానర్థాంతరే బుద్ధి ర్నిశ్చితాపి న శోభతే
ఘాతయంతి హి కార్యాణి దూతాః పండితమానినః. 2-40

కావున నే నిప్పుడు చక్కగా ఆలోచించి శ్రీరాముని కార్యము చెడిపోవని విధమున చేయవలయును. నేను చేత కాని వాడను కారాదు. సముద్రలంఘనము వ్యర్థము కాకూడదు. అన్నింటిని గమనింపవలయును. నేను రాక్షసుల కండ్లలో పడుదునేని శ్రీరాముని కార్యమునకు హాని కలుగును. నేను రాక్షసరూపము దాల్చినను వీరు నన్ను కనిపెట్టగలరు. ఇక వానరరూపములోనే ఉన్నచో చెప్పవలయునా!

హనుమంతు డీవిధముగా ఆలోచించి రాత్రివేళ చిన్న రూపముతో వానరుడుగానే ప్రవేశింపవలయునని నిశ్చయించుకొని సూర్యాస్తమయముకొరకు వేచి యుండినాడు.

[అంతప్రొద్దు ఉండగానే వచ్చినాడు. ఎంత వేగమో!]

సూర్యాస్తమయ మైనది. హనుమంతుడు తన శరీరమును పిల్లి యంతటి చిన్నది చేసికొని ప్రదోషకాలమున లంకలో ప్రవేశించినాడు.

సూర్యే చాస్తం గతే రాత్రౌ దేహం సంక్షిప్య మారుతిః
పృషదంశకమాత్ర స్సన్ బభూ వాద్భుతదర్శనః. 2-49

గొప్ప గొప్ప మిద్దెలు మేడలు గలిగి సంపదలతో నిండియుండిన లంకాపురిని హనుమంతుడు చూచి ఆలోచనలోపడినాడు.

తాం సమీక్ష్య పురీం రమ్యాం రాక్షసాధిపతే శ్శుభామ్
అనుత్తమా మృద్ధియుతాం చింతయామాస వీర్యవాన్. 3-13

*హనుమంతుడు :* (తనలో) రావణుని భటులు ఈ లంకాపురిని ఎంత జాగరూకులై రక్షించు చున్నారు! దీనిని సాధించుట ఒకరితరమా! మా వారిలో ఇక్కడికి రాగల వారెందరున్నారు! కుముదుడు, అంగదుడు, సుషేణుడు, మైందుడు, ద్వివిదుడు, సుగ్రీవుడు, కుశపర్వుడు, ఋక్షుడు, కేతుమాలి, నేను-అంతే! అందరు కలిసి పది మందికంటె ఎక్కువలేరు. వా రెందరైన నేమి? రామలక్ష్మణు లున్నారుగదా! అంతటి పరాక్రమవంతులు ఈ లంకను సాధింపలేకపోవుదురా! ఈ విధముగా తర్కించుకొని ఊరట జెందినాడు.

## లంకిణి

లంకాపురిలో అడుగు పెట్టబోవుచుండగా లంకానగరాధిదేవత యగు లంకిణి హనుమంతుని చూచినది. కామరూపిణి యైన లంకిణి వికారమైన ముఖముతోను భీతిని గొల్పు కన్నులతోను హనుమంతుని యెదుట నిల్చబడి పెద్దగొంతుపెట్టి,

*లంకిణి :* ఎవడవు నీవు. ఇక్కడి కేల వచ్చితివి? నేను నీప్రాణములను హరింపకమునుపే నీ సమాచారమును చెప్పుము.

*హనుమంతుడు :* నా సంగతి కేమిలెమ్ము! ముందు నీ సంగతిని వినిపింపుము. నీ వెవ్వతవు. వికృతములైన ఈ చూపు లేమి? ద్వారమున కడ్డముగా నిల్చబడి నన్ను బెదరించుచున్నా వెందుకు?

*లంకిణి :* (కోపముతో) నే నెవతెనో యెరుగవేమో! రావణాసురుని ఆజ్ఞ ననుసరించి యీ పట్టణమును రక్షించుచున్న లంకనే నేను. నన్ను కాదని యీ నగరములో అడుగిడుటకు నీకు సాధ్యముకాదు. నిన్నిప్పుడే కడతేర్చెదను.

**హనుమంతుడు :** అంత కోప మెందుకు? బురుజులు ప్రాకారములు ద్వారములు కలిగి రమ్యముగా కన్పట్టుచున్న లంకాపట్టణమును చూడవలయు నని నాకు కుతూహలము కలిగి వచ్చితిని. ఇక్కడి అడవులు వనములు ఉపవనములు హర్మ్యములు మున్నగువానిని చూచిపోవుద మని వచ్చితిని.

[ఈ ప్రదేశము లన్నింటిలోను వెదకవలయునన్నమాట.]

ద్రక్ష్యామి నగరీం లంకాం సాట్టప్రాకారతోరణామ్
ఇత్యర్థ మిహ సంప్రాప్తః పరం కౌతూహలం హి మే. 3-33

వనాన్యుపవనానీహ లంకాయాః కాననాని చ
సర్వతో గృహముఖ్యాని ద్రష్టు మాగమనం హి మే. 3-34

**లంకిణి :** నన్ను జయించినగాని నీవు లోపలికి పోవుటకు వీలులేదు.

**హనుమంతుడు :** మంగళస్వరూపిణి యగు ఓ లంకా! శమింపుము. నే నీ పట్టణ మంతయు చూచి నా దారిని నేను పోయెదను. అంతే.

దృష్ట్వా పురీ మిమాం భద్రే పునర్యాస్యే యథాగతమ్. 3-37

మాటలు చాలించి, లంకిణి గట్టిగా అరచి, అరచేతితో హనుమంతుని కొట్టినది. హనుమంతుడు కోపించి తన యెడమ పిడికిలితో లంకిణిని ఒక పోటు పొడిచినాడు. స్త్రీ గనుక వధింపలేదు. హనుమంతుని దెబ్బతో లంకిణి విలవిల తన్నుకొని క్రిందపడి హనుమంతునికి నమస్కరించి "వానరోత్తముడా! నన్ను దయదలచి రక్షింపుము. నీ వంటి మహనీయులు స్త్రీలను వధింపకూడ దని ఒక నియమ మున్నదిగదా! నీవు దానిని పాటించి నన్ను రక్షింపుము.

ఈ పట్టణరూపముగా కనబడుచున్న లంకను నేనే. నీవు నన్ను జయించినావు. బ్రహ్మదేవుడు నాకు వరము ప్రసాదించినప్పుడు ఒక మాట చెప్పియున్నాడు. 'ఏనాడు ఒక వానరుడు వచ్చి నిన్ను జయించునో ఆనాడే రాక్షసులకు భయము ప్రారంభమైన దని తెలిసికొనుము' అని. ఆ సంఘటన మిప్పుడు జరిగినది. సీత కారణముగా రాక్షసుల కందరకు చేటుకాలము వచ్చినది. శాపమునకు గురియైన యీ లంకలోనికి నీవు స్వేచ్ఛగా ప్రవేశించి నీ యిష్టమువచ్చిన చోట్ల సంచరించి పతివ్రతయైన సీతాదేవిని వెదకుము.

ప్రవిశ్య శాపోపహతాం హరీశ్వర
శుభాం పురీం రాక్షసముఖ్యపాలితామ్
దిదృక్షయా త్వం జనకాత్మజాం సతీమ్
విమార్గ సర్వత్ర గతో యథాసుఖమ్. 3-51

## లంకాపురీ ప్రవేశము

ఇట్లు లంకను నిర్జించి హనుమంతుడు ద్వారముగుండ ప్రవేశింపక ప్రాకారము మీదుగా ఎగిరి లంకలో ప్రవేశించి, శత్రువు తలపై ఎడమకాలు పెట్టినాడు.

అద్వారేణ మహాబాహుః ప్రాకార మభిపుప్లువే 4-2
ప్రవిశ్య నగరీం లంకాం కపిరాజ హితం కరః
చక్రేఽథ పాదం సవ్యం చ శత్రూణాం స తు మూర్ధని. 4-3

[శత్రు పట్టణమును ద్వారముగుండ ప్రవేశింపగూడ దని శాస్త్రము. శత్రుదేశము ప్రవేశించునపుడు మొదట ఎడమకాలు పెట్టుట శత్రువు తలపై కాలు పెట్టినట్లే అని శాస్త్రము. కావుననే హనుమంతుడు వామపాదమును పెట్టినాడు. గృహప్రవేశ శుభసమయములో క్రొత్తకోడలిచేత ముందు కుడికాలు పెట్టించుట ఆచారముగదా]

హనుమంతుడు లంకలో ప్రవేశించి రాజవీథులలో నడచుచున్నాడు. ఇల్లిల్లు తిరిగి పరీక్షగా చూచినాడు. స్త్రీలు హాయిగా పాటలు పాడుకొనుచున్నారు. కొందరు రాక్షసులు వేదమంత్రములను పఠించుచున్నారు. హనుమంతుడు రావణసైన్యమును చూచినాడు. ఈ విధముగా చూచుచు వెళ్ళుచుండగా రావణుని అంతఃపురము కనబడినది. బంగారు కట్టడములు కలిగి ప్రాకారావృతమై ముత్యపుసరములతో అలంకరింపబడి సర్వత్ర అగరుచందనము మున్నగు సువాసనలు వెదజల్లుచుండిన రావణుని అంతఃపురము లోనికి హనుమంతుడు ప్రవేశించినాడు.

స హేమ జాంబూనద చక్రవాళం
మహార్హ ముక్తామణి భూషితాంతమ్.
పరార్థ్య కాలాగరు చందనాక్తం
స రావణాంతఃపుర మావివేశ. 4-29

చంద్రోదయ మైనది. చల్లని ప్రభు వగుటచేత లోకుల దుఃఖమును పారదోలుచున్నవాడును, సముద్రమును వృద్ధిపొందించువాడును, పంచభూతములకు కాంతి నిచ్చువాడును అయిన శీతాంశుని హనుమంతుడు చూచినాడు.

లోకస్య పాపాని వినాశయంతం
మహోదధిం చాపి సమేధయంతం
భూతాని సర్వాణి విరాజయంతం
దదర్శ శీతాంశు మథాభియాంతమ్. 5-2

[అయిదవ సర్గలోని చంద్రవర్ణన నిదర్శనాలంకారములతో ఉపమాలంకారములతో నిండి మనోహరముగా నున్నది. ప్రత్యేకముగా చదివి ఆనందింపదగిన ఘట్టము.]

అలంకృతలైన స్త్రీలను, నిదురించుచుండినవారిని, నవ్వుచు, ఆడుచు, పాడుచు ఉండినవారిని, కోపమున నిట్టూర్పులు పుచ్చుచుండిన కామినులను, మంచి అందగత్తెలను, హనుమంతుడు చంద్రుని వెలుగులో చూచినాడు. సీతాదేవి వారిలో నున్నదేమో తెలిసికొనగోరి అందరను పరీక్షించినాడు. కాని సీతాదేవి కనిపింపలేదు. హనుమంతునికి ఉత్సాహము తగ్గినది. దుఃఖము వచ్చినది.

సీతామపశ్య న్మనుజేశ్వరస్య
రామస్య పత్నీం వదతాం వరస్య
బభూవ దుఃఖాభిహతశ్చిరస్య
ప్లవంగమో మంద ఇవాచిరస్య. 5-27

## హనుమంతుడు రావణుని భవనమునందు సీతాదేవిని వెదకుట

దిగులుపడి కూర్చున్నచో యేమైనట్టు? వెదకుటకు మరల ప్రారంభించినాడు. ఎన్నో గృహములు వెదకినాడు. ప్రహస్తుడు, మహాపార్శ్వుడు, విభీషణుడు, కుంభకర్ణుడు మున్నగు అనేక రాక్షసుల భవనము లన్నిటిని గాలించినాడు. వానిని దాటుకొని రావణుని ప్రాసాదము చేరుకొన్నాడు. అది అత్యంత శోభాయమానముగా నుండినది. పల్లకీలు లతాగృహములు క్రీడాలయములు మున్నగు వైభవములతోగూడి భూలోక స్వర్గమువలె నున్నది. లంకకు ఆభరణ మనదగియున్నది.

లంకాభరణమిత్యేవ సోఽమన్యత మహాకపిః. 6-15

కుబేరుని పుష్పకవిమాన మందే ఉన్నది. వరశిల్పియైన మయుడు ధనాధిపతియగు కుబేరునికై నిర్మించిన పుష్పక విమానమునకు కొరత ఏముండును! అత్యంత రమణీయముగాను మనోహరముగాను ఉండినది. దానిలో కూర్చుండువారు ఎక్కడికి పోదలచుకొందురో అక్కడికి కొనిపోగలశక్తి ఆ విమానమున కున్నది. స్వామి హృదయమును గ్రహించి వాయువేగముతో ప్రయాణము చేయగలది.

మనస్సమాధాన విచార చారిణమ్. 8-4

మన స్సమాధాయ తు శీఘ్రగామినం
దురావరం మారుతతుల్య గామినమ్. 8-5

హనుమంతుడు ఎన్నిచోట్లనో చూచినాడు, కాని సీతాదేవి కానరాలేదు. ఇంకను వెదకుచున్నాడు. రావణుని భవనమునకు అంత మనునది కనబడలేదు. ఆవరణములో లెక్కలేనన్ని మేడ లున్నవి. అరయోజనము వెడల్పు యోజనము నిడివి కలిగియున్నది.

అర్ధయోజన విస్తీర్ణ మాయతం యోజనం హి తత్
భవనం రాక్షసేంద్రస్య బహు ప్రాసాద సంకులమ్. 9-2

హనుమంతుడు అన్నిచోట్లను వెదకుచు రావణు డుండు స్థానము చేరు కొన్నాడు. నాలుగు ప్రక్కలను రాక్షసులు కావలి కాయుచుండినారు. హనుమంతుడు నెమ్మదిగా రావణుని అంతఃపురములో ప్రవేశించినాడు. కుబేరునికిని, ఇంద్రునికిని గల సంపద లన్నియు రావణుని భవనమున ఉండినవి.

యా హి వైశ్రవణే లక్ష్మీ ర్యా చేంద్రే హరివాహనే
సా రావణగృహే సర్వా నిత్యమేవానపాయినీ. 9-8

తిరుగుచుండిన హనుమంతునికి మద్యముల వాసనలు, పిండివంటల వాసనలు వచ్చినవి. ఆ వాసనల ననుసరించి హనుమంతుడు పోయి రావణు డుండు ప్రదేశమును ఊహింపగలుగుట చూడగా తన తండ్రియైన గంధవహుడు కుమారునికి 'ఇటు రమ్ము' అని దారిచూపించి నట్లయినది.

స గంధ స్తం మహాసత్త్వం బంధు ర్బంధుమివోత్తమమ్
ఇత ఏహీత్యువాచేవ తత్ర యత్ర స రావణః. 9-21

హనుమంతుడు రావణుని అంతఃపురములో తిరుగుచున్నాడు. అక్కడి దీపములు నిశ్చలముగా వెలుగుచుండుట చూడగా, అవి ధ్యాననిష్ఠలో నున్నట్లు తోపించినవి. జూదములో ఓడిపోయి అవమానముతో క్రుంగి అటు ఇటు కదలకయుండు వారి వలె కనబడినవి.

ప్రధ్యాయత ఇవాపశ్య త్ప్రదీప్తాం స్తత్ర కాంచనాన్
ధూర్తానివ మహాధూర్తై ర్దేవనేన పరాజితాన్. 9-32

ఒక వేయిమంది స్త్రీలు నిద్రించుచుండినారు. అందరు అందగత్తెలు. రాజర్షుల స్త్రీలు, గంధర్వస్త్రీలు వీరువారు అనక అనేక స్త్రీలను రావణుడు అపహరించి తెచ్చి యున్నాడు. అట్లు అపహరించుట కొక కారణమున్నది. రావణుడు యుద్ధప్రియుడు. స్త్రీలను అపహరించినచో వారి బంధువులు వచ్చి తనతో యుద్ధము చేయగలరని ఆశపడి అట్లుచేసినాడు. కొందరు స్త్రీలు రావణుని మోహించి తమంతట తామే వచ్చినారు.

యుద్ధకాంక్షేన తా స్సర్వా రావణేన హృతా స్త్రియః
సమదా మదనేనైవ మోహితాః కాశ్చి దాగతాః. 9-69

అచ్చట ఉండిన ప్రతి స్త్రీ యును రావణుని మోహించి వచ్చినదే గాని ఒక్క సీతాదేవి తప్ప ఇతరుని భార్యగాని ఇతరుని ప్రేమించిన స్త్రీ గాని యెవ్వరును లేరు.

న తత్ర కాచి త్ప్రమదాః ప్రసహ్య
వీర్యోపపన్నేన గుణేన లబ్ధాః
న చాన్యకామాపి న చాన్యపూర్వా
వినా వరార్హాం జనకాత్మజాం తామ్. 9-70

హనుమంతుడు ఆ స్త్రీల నందరను పరీక్షించి, రావణుని శయనమందిరమునకు దారి తీసినాడు. రావణుడు నిద్రించుచుండినాడు. మందరపర్వతమువలె కనబడినాడు. అతనికి నలుప్రక్కల అతని భార్య లుండినారు. వా రందరు అనేక అవస్థలలో ఉన్నారు. వీణలు మృదంగములు మున్నగు వాద్యములను వాయించుచుండినవారు వానిని పట్టుకొనియే నిద్రించినారు. కొంతమందికి ఒంటినిండ చీరలుకూడ లేవు. హనుమంతుడు అందరను పరీక్షగా చూచుచున్నాడు. వారిలో ఒక స్త్రీ ప్రత్యేకముగా ఒక పర్యంకము మీద శయనించి యున్నది [మండోదరి]. ఆమె రూపము, యౌవనము, తేజస్సు, అలంకారము, అన్నింటిని చూచి హనుమంతుడు ఆశ్చర్యచకితు డైనాడు.

తాసా మేకాంతవిన్యస్తే శయానాం శయనే శుభే
దదర్శ రూపసంపన్నా మపరాం స కపి స్త్రియమ్. 10-50

ఆమెను చూచి సీతాదేవి అని భావించినాడు. హనుమంతుడు ఆనందపరవశు డై చప్పట్లు చరచినాడు. తోకను ముద్దు పెట్టుకొన్నాడు. నవ్వినాడు, ఆడినాడు, పాడినాడు. గంతులు వేసినాడు. స్తంభముల నెక్కి క్రిందికి దూకినాడు. కోతిచేష్టలు ఎన్ని కలవో అన్నింటిని చేసినాడు.

హర్షేణ మహతా యుక్తో ననంద హరియూథపః. 10-54

ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం
ననంద చిక్రీడ జగౌ జగామ
స్తంభా నరోహ న్నిపపాత భూమౌ
నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్. 10-55

[అసత్యమును చూచి మానవులు ఆవిధముగా చిందులు త్రొక్కి సంతోషింతురు!]

హనుమంతుడు మరల ఆలోచించినాడు.

హనుమంతుడు: (తనలో) ఛీ! ఇట్లుకూడ యెందైన ఉండునా! నా తెలివితక్కువవలన ఇట్లు పొరపడితినిగాని శ్రీరాముని బాసిన సీతాదేవికి నిదుర పట్టునా! ఇట్లు అలంకరించుకొని మద్యమును సేవించి రావణుని అంతఃపురమునం దుండునా! ఈ స్త్రీ సీతాదేవి కానే కాదు. ముమ్మాటికిని కాదు.

న రామేణ వియుక్తా సా స్వప్తు మర్హతి భామినీ
న భోక్తుం నాప్యలంకర్తుం న పాన ముపసేవితుమ్. 11-2

నాన్యం నర ముపస్థాతుం సురాణామపి చేశ్వరమ్
న హి రామసమః కశ్చి ద్విద్యతే త్రిదశేష్వపి. 11-3

హనుమంతుడు ఆ చోటును వీడి పానశాలకు బయలుదేరినాడు.

అక్కడకూడ స్త్రీలు వేల లెక్కన ఉన్నారు. మద్యమును సేవించి మైమరచి నిద్రించుచుండినారు. హనుమంతుడు అందరను చూచినాడు. అంతఃపుర మంతయు నిశ్శేషముగా వెదకినాడు. కాని సీతాదేవి కానరాలేదు.

హనుమంతునికి ఒక ధర్మసందేహము కలిగినది. నిద్రించి విచ్చలవిడిగా శయనించియున్న పరస్త్రీలను చూచుట పాపము కదా అని తోచినది. "ఇందరిని చూచినను నా మనస్సు చలింపలేదు. అన్నిటికిని మనస్సు గదా ప్రధానము. కావున ఇందులో ధర్మలోప మేమున్నది! అదిగాక సీతాదేవిని స్త్రీల నడుమనే వెదకవలయును గాని లేళ్ళ నడుమ వెదకుట పొసగునా! కాబట్టి నేను చేసిన పనిలో తప్పు లేదు" అని సమాధానపరచుకొన్నాడు.

న హి మే మనసః కించి ద్వైకృత్య ముపపద్యతే
మనో హి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే. 11-41

శుభాశుభా స్వవస్థాసు తచ్చ మే సువ్యవస్థితమ్
నాన్యత్ర హి మయా శక్యా వైదేహీ పరిమార్గితుమ్. 11-42

స్త్రియో హి స్త్రీషు దృశ్యంతే సదా సంపరిమార్గణే
యస్య సత్త్వస్య యా యోని స్తస్యాం తత్పరిమృగ్యతే. 11-43

న శక్యా ప్రమదా నష్టా మృగీషు పరిమార్గితుమ్. 11-44

## హనుమంతుని విషాదము

సీతాదేవిని ఇంకను వెదకుటకు పూనుకొన్నాడు. ఎంత వెదకినను కనబడలేదు. హనుమంతునికి సందేహము కలిగినది. ఒకవేళ సీతాదేవి మరణించినది కాబోలు! కానిచో ఎందుకు కనబడదు? రావణుడు తన కోర్కెను తీర్చుకొనజాలక, సీతాదేవిని వధించి యుండునా? లేక భీకరరూపిణులైన రాక్షసస్త్రీలను చూచి సీతాదేవి భీతిల్లి అసువుల బాసి యుండునా? సీతాదేవిని సందర్శింపకయే సుగ్రీవునియొద్దకు పోవుట ఎట్లు? నా శ్రమ అంతయు వ్యర్థమైనట్లేనా!

దృష్ట మంతఃపురం సర్వం దృష్టా రావణ యోషితః
న సీతా దృశ్యతే సాధ్వీ వృథా జాతో మమ శ్రమః. 12-6

నేను కార్యమును సాధింపక మరలిపోవుదునేని, మావా రందరు "ఏమోయి వీరుడా! ఇంత దూరము పోయి యేమి చేసివచ్చితివి" అని అడిగినప్పుడు నేను వారి కేమి చెప్పగలను.

అయినను ఇట్లు దుఃఖించుట వలన లాభ మేమి? విసువు జెందక పనులు చేయ వలయును. అట్లు చేసినగాని యే కార్యమును సిద్ధింపదు. కావున ఉత్సాహము నవలంబింతును.

అనిర్వేద శ్శ్రియో మూల మనిర్వేదః పరం సుఖమ్
అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః. 12-10

కరోతి సఫలం జంతోః కర్మ య త్తత్కరోతి సః
తస్మా దనిర్వేదకృతం యత్నం చేష్టేఽహ ముత్తమమ్. 12-11

ఇట్లు నిశ్చయించుకొని హనుమంతుడు మరల బయలుదేరినాడు. పానశాలలు కుసుమాలయములు చిత్రశాలలు క్రీడామందిరములు పాతాళగృహములు మున్నగు అన్ని ప్రదేశములలో వెదకినాడు. అంతఃపురములో హనుమంతుడు చూడని చోటు బెత్తెడైనను లేదు. ఎందరెందరో స్త్రీలు కానవచ్చిరిగాని సీతాదేవి మాత్రము కనబడలేదు.

హనుమంతునికి దుఃఖము ముంచుకొని వచ్చినది. సముద్రలంఘనము సైతము వ్యర్థమైనది కదా అని చింతించినాడు.

అంతఃపురమునుండి బయటికి వచ్చినాడు. ఏమి చేయుటకును తోపలేదు.

**హనుమంతుడు:** (తనలో) సంపాతికూడ చెప్పినాడుగదా సీతాదేవి లంకలో నున్నదని. ఆమె యేమైనట్టు! రావణునికి లోబడియుండునా! ఛీ! ఎంతమాట. రాము బాణమునకు భయపడి రావణుడు వేగముగ వెళ్లుచుండగా అతని చేతినుండి జారిపోయి సముద్రములో పడియుండును కాబోలు! అట్లు కాదేని రాక్షస స్త్రీలు ఆమెను భక్షించి యుందురు. ఒకవేళ రావణుడామెను ఎక్కడైన దాచి యుండునా? సీతాదేవి కనబడలేదని శ్రీరామునితో ఎట్లు చెప్పగలను. చెప్పక యుందునేని బాగుండునా! ఎటుచూచినను చిక్కుగానే ఉన్నది.

వినష్టా వా ప్రణష్టా వా మృతా వా జనకాత్మజా. 13-17

రామస్య ప్రియభార్యస్య న నివేదయితుం క్షమమ్
నివేద్యమానే దోష స్స్యా ద్దోష స్స్యా దనివేదనే. 13-18

సీతాదేవి కనబడలేదని శ్రీరామునితో చెప్పుదునేని ఆయన ఆ మాట విన్న వెంటనే ప్రాణములు విడువగలడు. అంతట లక్ష్మణుడు సైతము మరణించును.

ఈ వార్త విని భరతుడు, శత్రుఘ్నుడు, కౌసల్య, సుమిత్ర, కైకేయి అందరు అసువుల బాయుదురు. మా సుగ్రీవుడు మాత్రము బ్రతికియుండగలడా! అతడు చనిపోయిన తోడనే వానరు లందరు ప్రాణములు విడువగలరు. నేను కిష్కింధకు పోయినచో ఇంత హానియు కలుగు ననుటకు సందేహములేదు. నేను పోని పక్షమున వారందరు కొంత ఆశ పెట్టుకొని బ్రతికియైనను ఉందురు. కావున, నే నిక్కడనే ప్రాయోపవేశము కావింతును. లేనిచో నీటిలో పడి ప్రాణములు విడిచెదను.

అదియును సరికాదు. మరణించుటవలన లాభ మేమి? ప్రాణ మున్నచో దేని నైనను సాధింపవచ్చునుగాని చనిపోయినట్లైన ఏమిచేయగలము. "బ్రతికి యుండిన శుభముల బడయవచ్చు" అనిగదా చెప్పియున్నారు.

వినాశే బహవో దోషా జీవన్ భద్రాణి పశ్యతి
తస్మాత్ప్రాణాన్ ధరిష్యామి ధ్రువో జీవిత సంగమః. 13-47

రావణుని చంపనైనను చంపుదును. లేదా యజ్ఞపశువును కొనిపోవునట్లు శ్రీరామునియొద్దకు తీసికొనిపోయెదను.

## హనుమంతుడు అశోకవనమునకు పోయి వెదకుట

ఈ లంక నంతయు మరల వెదకి చూచెదను. అదిగో అశోకవనము కనబడుచున్నది. అక్కడికి పోయి వెదకెదను. వసువులకు, రుద్రులకు, వాయువులకు ఇతర దేవతలకు నమస్కరించి వెదకుట ప్రారంభించెదను.

ఇట్లు పరిపరి విధముల తలపోసి హనుమంతుడు ఉత్సాహమును సమకూర్చుకొని లేచి లక్ష్మణ సమేతుడైన శ్రీరామునికిని, సీతాదేవికిని, రుద్ర, ఇంద్ర, యమ, వాయువులకును చంద్ర సూర్యాది దేవతలకును తనప్రభువైన సుగ్రీవునికిని నమస్కరించి బయలుదేరినాడు.

నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యై చ తస్యై జనకాత్మజాయై
నమోఽస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో
నమోఽస్తు చంద్రార్కమరుద్గణేభ్యః. 13-59

హనుమంతుడు "శ్రీరామునికొరకును రావణునికొరకును నేను నాశరీరమును చిన్నదిచేసికొంటిని. దేవతలు నాకు కార్యసిద్ధిని కలిగింతురుగాక" అని ప్రార్థించినాడు.

సంక్షిప్తోఽయం మయాత్మా చ రామార్థే రావణస్య చ. 13-64
సిద్ధిం మే సంవిధాస్యంతి దేవా స్సర్షిగణా స్త్విహ. 13-65

[మనము మన శరీరములను కుంచించి అనగా అహంభావమును విడిచి దేవతలను ప్రార్థించినచో మనకు కార్యసిద్ధి కలుగును. ఈ ఘట్టమున మనము జ్ఞప్తియందుంచుకొనవలసిన సంగతులు కొన్ని కలవు. ఎన్ని కష్టములు కలిగినను ఉత్సాహమును విడువకూడదు. మనకు ప్రాణముపై విసువు పుట్టు పరిస్థితులు సంభవించుచుండును. కాని మనము ఓర్చుకొనవలయును. శుభములు తప్పక కలుగు ననుటకు దృష్టాంతములు కలవు. వానరులందరు ప్రాయోపవేశమునకు సిద్ధమైనప్పుడు సంపాతి మాటలవలన ఉత్సాహము కలిగినది. అట్లే ఆంజనేయుడు ప్రాయోపవేశము మాట అనుకొన్న పిదపగదా అశోకవనమును గురించి తట్టినది - రాబోవు మరియొక విషయము ఈ సందర్భమున నేగమనింపవచ్చును. సీతాదేవికూడ ప్రాణత్యాగము చేసిన మేలని తలచి శింశుపావృక్షము చెంతకు పోయినప్పుడు గదా ఆమెకు హనుమంతుడు కనబడి శుభవార్త నందించినాడు

కావున ధైర్యమును వీడక ప్రయత్నములు చేయవలయును. ఏనాటికైనను శుభములు చేకూరగలవు.]

రావణుని అంతఃపురమునుండి హనుమంతుడు అశోకవన ప్రాకారముపైకి దూకి వనములో ప్రవేశించినాడు. అది వసంతఋతువు. చెట్లు ఫల పుష్ప భరితములై ఉండినవి. హనుమంతుని వేగమునకు చెట్లమీది పక్షులు ఎగిరిపోవుటలో పూవులన్నియు హనుమంతునిపై రాలినందున అతడు పూవుల కొండవలె కనబడినాడు.

[జయసూచకముగా పుష్పవృష్టి కురిసిన దన్నమాట]

చెట్లలోనుండి పత్రములు ఫలములు పూవులు రాలిపోయి చెట్లు మోడులవలె ఉండుట చూడగా జూదమాడి ఓడిపోయినవారు తమ వస్త్రాభరణములను క్రింద పెట్టినట్లు తోపించినది.

నిర్ధూతపత్త్రశిఖరా శ్శీర్ణపుష్పఫలా ద్రుమాః
నిక్షిప్త వస్త్రాభరణా ధూర్తా ఇవ పరాజితాః. 14-15

[ఈ సూత్రము ననుసరించియే కాబోలు పాండవులు జూదములో ఓడిపోయి తమ వస్త్రాభరణములను క్రింద పెట్టినట్లు చెప్పి యున్నారు]

అశోకవనము కన్నుల పండువుగా ఉన్నది. అనేకవిధములైన వృక్షములతో కూడి మనోహరముగా ఉన్నది. చెట్లకు చిన్న గంటలు కట్టబడి యున్నవి. గాలి వీచినప్పుడు అవి శ్రావ్యముగా మ్రోగుచుండును. చెట్లక్రింద వేదికలు అమర్చబడి యున్నవి. ఉద్యానవనమునందు ఎన్నో జలాశయములు సెలయేళ్ళు తామరకొలనులు శోభిల్లుచున్నవి.

పత్రములు దట్టముగా గలిగి కుసుమభరితమైన ఒక శింశుపావృక్షముమీద హనుమంతుడు కూర్చుండినాడు. సమీపమున ఒక సెలయేరు ప్రవహించుచున్నది.

తామరకొలనుకూడ ప్రక్కనే ఉన్నది. సీతాదేవి ఆ ప్రదేశమునకు రాగలదని హనుమంతుడు ఊహించినాడు. సంధ్యోపాసనము చేయుటకు అక్కడికి ఆమె తప్పక వచ్చునని భావించినాడు.

ఇమాం సా రామమహిషీ నూన మేష్యతి జానకీ. 14-44

సంధ్యాకాలమనా శ్శ్యామా ధ్రువమేష్యతి జానకీ
నదీం చేమాం శివజలాం సంధ్యార్థే వరవర్ణినీ. 14-49

"మంగళకర మగు ఈ అశోకవనము సీతాదేవికి ఎంతో తగియున్నది. సీతాదేవి బ్రదికియున్నచో ఈ నది యొద్దకు తప్పక రాగలదు" అని ఆలోచించుకొని హనుమంతుడు ఎవ్వరికిని కనిపింపక పత్రముల పుష్పముల నడుమ కూర్చుండినాడు. నాలుగువైపుల దృష్టిని సారించినాడు. ఎత్తుగా ఉండిన చైత్యప్రాసాదము కనబడినది. వేయి స్తంభములమీద నిల్వబడి యున్నది. దానికి పగడముల మెట్లు, బంగారు వేదికలు ఉన్నవి.

## హనుమంతుడు సీతాదేవిని చూచుట

అట్లు పరికించుటలో హనుమంతునికి సీతాదేవి ఒక ప్రదేశమునందు కనబడినది. రాక్షసస్త్రీలు చుట్టుముట్టి యున్నారు. సీతాదేవి ఉపవాసములు చేసి కృశించియున్నది. ధూమావృతమైన అగ్నిజ్వాలవలెనూ శుక్లపక్ష ప్రారంభమునందలి చంద్రరేఖవలెనూ కనబడినది. నలిగిన వస్త్రమును ధరించి యున్నది. ఆమె ఒంటిమీద ఆభరణములు లేవు. తలవెండ్రుకలకు సంస్కారములేక పెనచుకొని జడకట్టి యుండినవి. సీతాదేవి కాంతి తరిగి తల వంచుకొని దుఃఖించుచు నిట్టూర్పులు పుచ్చుచున్నది. ఏ వైపు చూచినను రాక్షసస్త్రీలే గాని తనవా రెవ్వరును లేరు.

తతో మలినసంవీతాం రాక్షసీభి స్సమావృతామ్. 15-18

ఉపవాస కృశాం దీనాం నిశ్శ్వసంతీం పునః పునః
దదర్శ శుక్లపక్షాదౌ చంద్రరేఖా మివామలామ్. 15-19

పీతేనైకేన సంవీతాం క్లిష్టే నోత్తమ వాససా. 15-21

నీల నాగాభయా వేణ్యా జఘనం గతయైకయా. 15-25

[సీతాదేవిని శుక్లపక్ష ప్రారంభమందలి చంద్రరేఖతో పోల్చుట యెంతో సొంపుగా నున్నది. శీఘ్రకాలముననే నిండు చంద్రునివలె ప్రకాశింపగలదు.]

హనుమంతుడు సీతాదేవిని చూచి ఆమె సీతాదేవియే అని కొన్ని కారణములను బట్టి నిశ్చయించినాడు.

హనుమంతుడు : (తనలో) రాక్షసుడు కొనిపోవునప్పుడు మేము చూచిన వనిత ఇక్లే ఉన్నది. చెట్టుకొమ్మకు కట్టబడియున్న ఆభరణములు చూడగా శ్రీరాముడు నాతో చెప్పిన గుర్తులకు సరిపోవుచున్నవి. సీతాదేవి మూట గట్టి మా నడుమ వేసిన నగలు మాత్ర మిప్పుడు వెల్తిగా ఉన్నవి. సీతాదేవి ఉత్తరీయముసైతము మేమప్పుడు చూచిన పసుపురంగుదిగానే ఉన్నది. కొంచెము నలిగి దీర్ఘకాలము విడువక ధరించియున్నందున ఇంచుక భేద మున్నను ఆ ఉత్తరీయము ఇదియే అనుటకు సందేహములేదు. ఇవన్నియు చూడగా, శ్రీరాముని మనస్సును ఆక్రమించుకొనియున్న సీతాదేవి యీమెయే అనుటకు సందేహములేదు.

[సీతాదేవి ఎట్లున్నది అని చెప్పుటకు వాల్మీకిమహర్షి అనేక ఉపమానములను చెప్పియున్నారు. కొన్ని మాత్రము ఇందు సూచింపబడినవి.

స్మృతిమివ సందిగ్ధామ్—సందేహములతో గూడిన అర్థములుగల స్మృతివలె.

ఋద్ధిం నిపతితా మివ—తరిగిపోయిన సంపదవలె.

విహతామివ చ శ్రద్ధాం—తగ్గిపోయిన శ్రద్ధరీతి.

ఆశాం ప్రతిహతా మివ—ఫలశూన్యమైన ఆశవోలె.

సోపసర్గాం యథాసిద్ధిం—విఘ్నమేర్పడిన కార్యసిద్ధి చందమున.

బుద్ధింస కలుషా మివ—కలుషితమైన బుద్ధిచాడ్పున.

అభూతే నాపవాదేన } — ఆధారములేని అపవాదములవలన
కీర్తిం నిపతితా మివ } — దెబ్బతిన్న కీర్తిభంగి.

ఇట్టి ఉపమానములు అనేకము చెప్పియున్నారు.]

అట్లుండిన సీతాదేవిని చూచి హనుమంతుడి ట్లనుకొనుచున్నాడు.

హనుమంతుడు : (తనలో) ఎవ్వతెనుగూర్చి శ్రీరాముడు నాలుగు విధములుగ పరితపించుచున్నాడో ఆ సీతాదేవి యీమెయే. దయ, అనుతాపము, దుఃఖము, మన్మథతాపము ఈ నాలుగును శ్రీరాముని పరితపింపజేయుచున్నవి.

ఒకానొక కాంతకు కష్టము వచ్చినదిగదా అని 'దయ', ఆశ్రితురాలిని రక్షింపలేక పోయితినిగదా అని 'అనుతాపము', భార్య అపహరింపబడినదిగదా అని 'దుఃఖము', ప్రియురాలిని ఎడబాసియుండుటవలన 'మన్మథతాపము'.

స్త్రీ ప్రణష్టేతి కారుణ్యా దాశ్రితే త్యానృశంస్యతః
పత్నీ నష్టేతి శోకేన ప్రియేతి మదనేన చ. 15-50

ఆహా! సీతారాములు ఒకరికొకరు ఎంత తగియున్నారు! సౌందర్యము అంగసౌష్ఠవము ఇద్దరికిని ఎంత చక్కగా కుదిరియున్నది! పరస్పరము హృదయములలో స్థిరవాసమేర్పరచుకొని యున్నారు గనుక ఇర్వురును బ్రదికియున్నారు గాని లేనిచో ఒక్కక్షణమేనియు ఒకరిని విడిచి ఒకరు జీవించి యుండగలరా! ఎటు చూచినను ఈ సీతాదేవిని బాసి శ్రీరాముడు బ్రదికియున్నాడనగా అది యెంతో గొప్ప సంగతి. శ్రీరాముడు అసాధ్యమైన కార్యమును చేయుచున్నాడన్నమాట.

దుష్కరం కురుతే రామో య ఇమాం మత్తకాశినీమ్
సీతాం వినా మహాబాహు ర్ముహూర్త మపి జీవతి. 15-54

ఇట్లు తలపోయుచుండిన ఆంజనేయుని మనస్సు తన ప్రభువైన శ్రీరాముని మీదికి మరలినది. ఆంజనేయుడు శ్రీరాముని సీతాదేవిని ప్రశంసించినాడు. ఇంతలోనే దుఃఖము ముంచుకొనివచ్చినది. సీతాదేవిని చూచి కన్నీరు కార్చినాడు. "రామ పత్నియైన సీతాదేవికే ఇట్టి కష్టము కలిగిన దనగా విధిని తప్పించుకొనుటకు ఎవ్వనికిని సాధ్యము కాదు" అని చింతించినాడు.

మాన్యా గురువినీతస్య లక్ష్మణస్య గురుప్రియా
యది సీతాఽపి దుఃఖార్తా కాలో హి దురతిక్రమః. 16-3

హనుమంతుడు: (తనలో) రామలక్ష్మణుల పరాక్రమము తనకు తెలిసియున్నది గనుక ఏనాటికైనను వారు వచ్చి శత్రువును వధించి తన్ను రక్షింతురని నమ్మి ప్రాణముతో ఉన్నది. ఈ సీతాదేవికొరకేగదా శ్రీరాముడు వాలిని వధించుట! కబంధుని వధించుటకూడ అందులకేగదా! ఈ చల్లని తల్లి వల్లనేగదా మా సుగ్రీవునికి రాజ్యము లభించినది! ఈమెకొరకేగదా నేను ఈ సముద్రమును లంఘించి వచ్చితిని! ఈ సీతాదేవి నిమిత్తమై శ్రీరాముడు జగత్తును తలక్రిందులు చేసినను అదియు యుక్తమనియే తోచుచున్నది. త్రైలోక్య రాజ్యమును, సీతాదేవిని తులదూచినచో త్రైలోక్యరాజ్యము సర్వము సీతాదేవిలో పదునారవ పాలునకుకూడ సరిరాదు.

యది రామ స్సముద్రాంతాం మేదినీం పరివర్తయేత్
అస్యాః కృతే జగచ్చాపి యుక్త మిత్యేవ మే మతిః. 16-13

రాజ్యం వా త్రిషులోకేషు సీతా వా జనకాత్మజా
త్రైలోక్యరాజ్యం సకలం సీతాయా నాప్నుయా త్కలామ్. 16-14

ఆహా! కాలప్రభావము! రామపత్ని యగు సీతాదేవి రాక్షసస్త్రీల చేతులలో చిక్కినది గదా! పాపము, సమస్త భోగములను పరిత్యజించి అడవికి వచ్చి భర్తకు

శుశ్రూష చేయుచు సుఖముగా నుండిన సీతాదేవికి ఎట్టికష్టము ప్రాప్తించినది. ఈమె అవస్థను చూడగా నాకే బాధగా ఉన్నది [మమాపి వ్యథితం మనః - 16-28]

సీతాదేవి తన్ను పరివేష్టించియున్న రాక్షసస్త్రీలను చూచుటలేదు. ఫల పుష్ప భరితములైన చెట్లనైనను చూచుటలేదు. ఏకాగ్రచిత్తముతో ఎల్లప్పుడు శ్రీరాముని ధ్యానించుచునే ఉన్నది. ఇందుకు సందేహములేదు.

నైషా పశ్యతి రాక్షస్యో నేమా న్పుష్పఫలద్రుమాన్
ఏకస్థ హృదయా నూనం రామమేవానుపశ్యతి 16-25

అయ్యో! పాపము, భోగముల నన్నింటిని వదలుకొని బంధువులకు దూరమై ఇట్లు దుఃఖమున మునిగిపోయికూడ జీవించి యున్న దనగా ఏనాటికైనను శ్రీరాముని కలిసికొనగల నను ఆశతో బ్రదికియున్నదన్నమాట.

కామభోగైః పరిత్యక్తా హీనా బంధుజనేన చ
ధారయ త్యాత్మనో దేహం తత్సమాగమ లాలసా. 16-24

ఈ సీతారాముల సమాగమము చేకూర్చుట యుక్తము. శీల సంపన్న యగు సీతాదేవిని శ్రీరాముడు చూడదగియున్నది. రాజ్యమును గోల్పోయిన రాజు తన రాజ్యమును మరల పొంది సంతసించునట్లు శ్రీరాముడు సీతాదేవిని మరల పొంది సంతోషింపగలడు.

ఇమాం తు శీల సంపన్నాం ద్రష్టు మర్హతి రాఘవః. 16-22

అస్యా నూనం పునర్లాభా ద్రాఘవః ప్రీతి మేష్యతి
రాజా రాజ్య పరిభ్రష్టః పునః ప్రాప్యేవ మేదినీమ్. 16-23

[ఉపమానము చక్కగా ఉన్నది. సీతాదేవి భూదేవి కొమార్తెగదా! సీతాదేవి తన చెంత నుండినప్పుడే శ్రీరాముడు ప్రభువు అనిపించుకొనగలడు. 'మా జానకి చెట్టబట్టగా మహారాజు వైతివి' అని త్యాగయ్యగారు పలికియున్నారు!]

హనుమంతు డిట్లు పరిపరి విధములుగా తలపోసినాడు. సీతాదేవి కనబడినదిగదా అని సంతోషించి ఆనందబాష్పములను విడిచినాడు. శ్రీరామునికి నమస్కరించి యెవ్వరికిని కానరాకుండునట్లు చెట్టుమీద కూర్చుండినాడు.

హర్షజాని చ సోఽశ్రూణి తాం దృష్ట్వా మదిరేక్షణామ్
ముమోచ హనుమాం స్తత్ర నమ శ్చక్రే చ రాఘవమ్. 17-31

సీతాదర్శన సంహృష్టో హనుమాన్ సంవృతోఽభవత్. 17-32

[ఇక్కడ గమనింపదగిన విషయము - మండోదరిని చూచినప్పుడు ఆమెయే సీతాదేవి అని భ్రమపడి చప్పట్లు చరచి, ఆడి, పాడి, గంతులువైచి, యెంతో అల్లరిచేసిన ఆంజనేయుడు వాస్తవిక సీతాదేవిని చూచినప్పుడు మాట పలుకు లేక, యెంతో జాగరూకుడై యెవ్వరికిని కానరాకుండునట్లు దాగి కూర్చుండినాడు. నిజము గ్రహించినవారు శాంత చిత్తులై ఉందురు - అల్లరి చేయరు]

సీతాదేవిని వెదకుటకు ప్రదోషకాలమున ప్రారంభించిన ఆంజనేయుడు ఇంత సేపటికి ఆమెను చూడగలిగినాడు. రాత్రి ఇంకను కొంచెము మిగిలియుండినది. పురిలో అలికిడి ప్రారంభమైనది. బ్రహ్మరాక్షసులు వేదాధ్యయనము చేయుచున్నారు. మంగళ వాద్యములు మ్రోగినవి.

## రావణాసురుడు అశోకవనమునకు వచ్చుట

రావణాసురుడు నిద్రనుండి మేల్కాంచినాడు. సీతాదేవిపై మనస్సు మరలి నందున అశోకవనమునకు బయలువెడలినాడు. మేలైన వస్త్రములను ఆభరణములను ధరించినాడు. అతనివెంబడి ఒక వందమంది స్త్రీలు వచ్చుచున్నారు. కొందరు కరదీపిక లను, కొందరు చామరములను, కొందరు వీవనలను, మరికొందరు మద్య పాత్రములను పట్టుకొని వచ్చుచున్నారు. ఒక వనిత ఛత్రము పట్టినది. రావణుడు మెల్లగా నడచు చున్నాడు.

[సీతాదేవితో ఎట్లు భాషింపవలయునో ఆలోచించుచున్నాడు కాబోలు.]

స చ కామపరాధీనః పతిస్తాసాం మహాబలః
సీతాసక్తమనా మందో మదాంచితగతిర్బభౌ. 18-19

రావణుని భార్యల అందెల చప్పుడు, మొలనూళ్ల చప్పుడు విని హనుమంతుడు తలయెత్తి చూచినాడు. రావణుడు కనిపించినాడు. రావణుని నేత్రములు ఎఱ్ఱబడి యుండినవి. మదనతాపము, పానము, గర్వము-వీనివలన ఎఱ్ఱబడినవి. రావణుడు మన్మ థునివలె శోభిల్లుచుండినాడు. నురుగువంటి సన్నని తెల్లని వస్త్రములను ధరించి ఉత్త రీయమును విలాసముగా పైకీడ్చుకొనుచు నడచుచున్నాడు.

[ఢక్కా మస్లిన్లను మించిన బట్టలు ఆకాలములోనే ఉన్నవి!]

కామదర్పమదైర్యుక్తం జిహ్మతామ్రాయతేక్షణమ్
సమక్షమివ కందర్ప మపవిద్ధశరాసనమ్. 18-23

మథితామృతఫేనాభ మరజో వస్త్రముత్తమమ్
సలీల మనుకర్షంతం విముక్తం సక్తమంగదే. 18-24

వచ్చుచున్నవాడు రావణుడే అని హనుమంతుడు గురుతుపట్టి ఏమి జరుగునో చూచుటకు క్రిందికొమ్మకు దిగి దాగి కూర్చుండినాడు.

రావణాసురుడు వచ్చుటచూచి సీతాదేవి గడగడ వణకిపోయినది. చేతులతో శరీరమును కప్పికొని దుఃఖించుచున్నది. సంకల్ప మను అశ్వములను పూన్చి, మనస్సు అను రథము నెక్కి శ్రీరాముని సన్నిధికి పోవుచున్నట్లు కనబడినది సీతాదేవి.

సమీపం రాజసింహస్య రామస్య విదితాత్మనః
సంకల్ప హయ సంయుక్తై ర్యాంతీ మివ మనోరథైః. 19-7

ఉపవాసము, శోకము, చింత, భయము వీనివలన కృశించి సీతాదేవి దీనయై ఉన్నది. శ్రీరాముడు త్వరగా వచ్చి రావణునికి తగినశిక్ష విధించిన బాగుండు నని ఇష్ట దేవతలను ప్రార్థించుచున్నట్లు కనబడినది.

ఉపవాసేన శోకేన ధ్యానేన చ భయేన చ
పరిక్షీణాం కృశాం దీనా మల్పాహారాం తపోధనామ్. 19-21
అయాచమానాం దుఃఖార్తాం ప్రాంజలిం దేవతామివ
భావేన రఘుముఖ్యస్య దశగ్రీవ పరాభవమ్. 19-22

## రావణుని వేడికోలు

రావణాసురుడు సీతాదేవిని చూచినాడు. పతివ్రతయైన ఆ దీనురాలిని, తపస్వినిని చూచి రావణుడు తన కోరికను తెలుపుచున్నాడు.

స తాం పతివ్రతాం దీనాం నిరానందాం తపస్వినీమ్
సాకారై ర్మధురై ర్వాక్యై ర్న్యదర్శయత రావణః 20-1

**రావణుడు :** సీతా! నీ దివ్యరూపమును చూచిన నాకు నీమీద మనస్సు లగ్నమైనది. నన్ను అనుగ్రహింపుము. అందువల్ల ధర్మలోపము కలుగు నని భయపడితివి కాబోలు! అట్టి దేమియు లేదు. నేను రాక్షసుడను కదా! పరస్త్రీలను అపహరించుట, వారిని కోరుట మాకు స్వధర్మము ; నీవేమో నన్ను ప్రేమింపకున్నావు. కావున నేను నిన్ను స్పృశింపను. నీవుగా నన్ను వలచి నన్ను రక్షింపుము.

ఏవం చైతదకామాం తు న త్వాం స్ప్రక్ష్యామి మైథిలి
కామం కామ శ్శరీరే మే యథా కామం ప్రవర్తతామ్. 20-6

[ఈ పట్టున మనమొక సంగతి గమనింపవలయును. సీతాదేవి పాతివ్రత్యమును గూర్చి యెట్టివారికిని ఎట్టి సందేహములు గాని కలుగుటకు వీలులేనట్లు వాల్మీకి మహర్షి అనేక విధములుగా అనేకచోట్ల చెప్పియున్నారు. రావణుడు సీతాదేవిని కొనివచ్చినప్పుడు ఒక

సంవత్సరము గడువు పెట్టినాడు. అంతవరకును స్పృశింపనని మాట ఇచ్చినాడు. ఇప్పటివరకు ఆమాటను పాటించినట్లు ఈ ఘట్టమున తేటపడుచున్నది. సీతాదేవి ఆమెగా తనను ప్రేమించు వరకు ఆమెను స్పృశించుటలేదని ఇచ్చట చెప్పినాడు. ఈమాట లన్నింటిని ఆంజనేయుడు వినుచున్నాడు గనుక సీతాదేవి శీలమును గురించి సొంతముగా తెలిసికొనగలిగినాడు. ఇట్టివే యుద్ధకాండములో కూడ కొన్ని సన్నివేశము లున్నవి. వానిని గమనించుట ముఖ్యము.]

**రావణుడు :** సీతా! ఇక్కడ నీకు వచ్చిన భయ మేమియు లేదు. నీకీ దుఃఖ మేల? కేశ సంస్కారము లేకుండుట, కటికి నేలమీద శయనించుట, మలిన వస్త్రములను ధరించి యుండుట, ఉపవాసము లుండుట, మున్నగునవి నీకు తగినవి కావు. హాయిగా నన్ను చేపట్టుము. మేలి వస్త్రములను ధరించి, చక్కగా అలంకరించు కొని, పుష్పములు అగరు చందనములు మొదలైన సుగంధ ద్రవ్యములను ఉపయోగించుచు, ఆటపాటలతో సుఖముగా కాలము గడపక యిట్లుండుట యే మాత్రము బాగులేదు. సీతా! ఒక సత్యమును మరచిపోకుము. ఇప్పుడు మంచి ప్రాయమున ఉన్నావు. కాని కాలము గడచుకొలది నీ యౌవనము క్షీణించును. పారిపోయిన ప్రవాహము తిరిగిరానట్లు గడచిపోయిన ప్రాయము మరలిరాదు సుమా!

> ఇదం తే చారు సంజాతం యౌవనం హ్యతివర్తతే
> యదతీతం పునర్నైతి స్రోతః శ్శీఘ్రమపా మివ. 20-12

సీతా! నీ అందమును చూచి, యే పురుషుడు మోహింపడు? బ్రహ్మదేవుడు సైతము నిన్ను మోహింపక విడుచునా! నీ అవయవములలో వేనిని చూచినను నా చూపులు అక్కడినుండి మరలివచ్చుటలేదు. నీ ఈ దుఃఖమును వీడి నా పట్టపురాణివి కమ్ము. నా సర్వస్వమును నేను నీ కీయగలను. నా రాజ్యమును సైతము నీ కిచ్చెదను.

[స్త్రీల నిమిత్తము ఐశ్వర్యము కోలుపోయెడివారు ఎందరో గదా!]

సీతా! ఇంకొక మాట వినుము. నేను సమస్త విశ్వమును జయించి నీ తండ్రి యగు జనకుని కిత్తును.

> విజిత్య పృథివీం సర్వాం నానానగర మాలినీమ్
> జనకాయ ప్రదాస్యామి తవ హేతో ర్విలాసిని. 20-18

నా కెదురుగా నిలువబడి యుద్ధము చేయగలవాడు ముల్లోకములలో లేడు. నీవు నన్ను అనుగ్రహించి నాకు భార్య వగుము. నీ చేతిమీదుగా నీ యిష్టమువచ్చినట్లు భూదానములు చేయుము. నా ధనము నంతయు యథేచ్ఛగా వెచ్చింపుము. నీ బంధువు లను సంతోషపెట్టుము. నా ఐశ్వర్యమును నా కీర్తిని మనసుకు తెచ్చుకొనుము.

సుందరీ! సంపదలు కోల్పోయి, నారచీరలు ధరించి, అడవిలో సంచరించుచు, కటికినేలమీద శయనించి, వ్రతములు సలుపుచున్న రాముడు నీ కెందుకేని ఉపయోగ పడునా! మొదటి మాట, రాముడు బ్రదికియున్నాడా అనునదికూడ సందేహాస్పదము.

కిం కరిష్యసి రామేణ సుభగే చీరవాససా
నిక్షిప్తవిజయో రామో గతశ్రీ ర్వనగోచరః. 20-26
వ్రతీ స్థండిలశాయీ చ శంకే జీవతి వా న వా. 20-27

ఒకవేళ రాముడు బ్రదికియే ఉన్నను నిన్ను చూడగలడా! నా చేతినుండి నిన్ను కొనిపోగలడా!

తపస్సులోగాని బలములోగాని పరాక్రమమునందుగాని నాకు సాటి రాగలడా నీ రాముడు? నా మాట వినుము. నన్ను వరించి సమస్త భోగములను అనుభవించుచు హాయిగా ఉండుము.

## సీతాదేవి రావణుని తృణీకరించుట

సీతాదేవి ఒక తృణమును గైకొని రావణునికిని తనకును నడుమ నుంచి మనస్సులో శ్రీరాముని ధ్యానించి రావణునికి జవాబు చెప్పుచున్నది.

సీత: నన్ను మరచిపోయి నీ మనస్సును నీ భార్యలమీదికి మరలింపుము. నేను పతివ్రతను నన్ను బాధపెట్టకుము. నీ భార్యలను నీవు రక్షించుకొనునట్లే ఇతరుల భార్యలు కూడ రక్షింపదగినవారని తెలిసికొనుము. ఈ అర్థమును చక్కగా గ్రహింపుము.

నివర్తయ మనో మత్తః స్వజనే క్రియతాం మనః. 21-3

యథా తవ తథాఽన్యేషాం దారా రక్ష్యా నిశాచర
ఆత్మాన ముపమాం కృత్వా స్వేషు దారేషు రమ్యతామ్. 21-7

ఇంద్రియ చాపల్యముగలవాని ఆయువూ, సంపదా నశించిపోవును. ఇక్కడ నీకు బుద్ధిచెప్పువా రెవ్వరును లేరా! నీకు భయపడి వారెవ్వరును నీకు హితము చెప్పరు కాబోలు. ఒకవేళ చెప్పినను నీవు వినిపించుకొందువా?

ఇహ సంతో న వా సంతి సతో వా నానువర్తసే
తథా హి విపరీతా తే బుద్ధి రాచార వర్జితా. 21-9

రాక్షసులకు వినాశకాలము వచ్చినది గనుక అట్టి హితుల మాటలు నీ చెవి కెక్కుట లేదని తోచుచున్నది. నీవంటి బుద్ధిహీనుడు, దుర్మార్గుడు రాజుగానుండునేని రాజ్యము నాశన మగుట తథ్యము. సమస్త సంపదలతో తులతూగుచుండు ఈ లంక నీ ఒక్కని అపరాధమువలన శీఘ్రకాలముననే సర్వనాశనము కాగలదు.

నేను నీ ధనమునకును భోగములకును లోబడునట్టిదానను కాను. సూర్యుని కాంతిని సూర్యునియొద్దనుండి వేరు చేయజాలనట్లు నీవు నన్ను శ్రీరాముని యొద్దనుండి వేరు చేయజాలవు.

**శక్యా లోభయితుం నాహ మైశ్వర్యేణ ధనేన వా**
**అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా.** 21-15

రాక్షసుడా! నా హితవాక్యమును వినుము. నన్ను శ్రీరాముని చెంతకు చేర్పుము. నీవు బ్రతుకదలచుకొందువేని రామునితో స్నేహము చేసికొనుము. శ్రీరాముడు శరణాగతవత్సలుడు గనుక నిన్ను క్షమింపగలడు. నీవు పరిశుద్ధహృదయముతో నన్ను రామునికి సమర్పింతువేని బ్రతుకుదువు. లేనిచో నీ చావు తప్పదు సుమా!

**విదిత స్స హి ధర్మజ్ఞ శ్శరణాగతవత్సలః**
**తేన మైత్రీ భవతు తే యది జీవితు మిచ్ఛసి.** 21-20

**ప్రసాదయస్వ త్వం చైనం శరణాగతవత్సలమ్**
**మాం చాస్మై ప్రయతో భూత్వా నిర్యాతయితు మర్హసి.** 21-21

రాముని కోపమునకు తిరుగులేదు. ఆయన బాణమునకు అడ్డులేదు. నా రాముడు లంకను, నిన్ను తన బాణాగ్నిచే దగ్ధముచేసి నన్ను చేకొని పోగలడు. నీవు నీ పరాక్రమమును గురించి గొప్పలు చెప్పుకొంటివి. నీవు అధముడవు. రామలక్ష్మణులు లేని సమయము చూచి తస్కరించి నన్ను తెచ్చితివి. ఆ రామలక్ష్మణుల శరీరగంధము ఆఘ్రాణించి యుందువేని పులులవాసన చూచిన కుక్కవలె పరుగెత్తియుందువు. రాక్షసాధముడా! రామబాణమును నీవు తప్పించుకొనలేవు.

సీతాదేవి పరుషవాక్యములను విన్న రావణునికి కోపము వచ్చినది.

**రావణుడు :** సీతా! పురుషుడు స్త్రీలను ఎంత యెక్కువగా బుజ్జగించునో అంతగా వారికి స్వాధీను డగును. ఎంతప్రీతిగా మాటలాడునో అంత తిరస్కారమును పొందును.

**యథా యథా సాంత్వయితా వశ్య స్త్రీణాం తథా తథా**
**యథా యథా ప్రియం వక్తా పరిభూత స్తథా తథా.** 22-2

ఇప్పుడు నీవు నన్ను అనిన ప్రతిపదమునకు నీవు వధింపదగియున్నావు. కాని నీమీద నాకుగల కామము నా కోపమును అణచివేయుచున్నది. కామమున కున్న యీ దుర్గుణము కారణముగా నీ విప్పుడు బ్రతికిపోయితివి. సరే! ఒకమాట చెప్పుచున్నాను, వినుము. నేను నీకు నిర్ణయించిన గడువులో రెండు నెలలు మాత్రమే మిగిలి యున్నది. ఈలోపల నీవు నీ మనసు మార్చుకొన్ననిచో నిన్ను ముక్కలుగా తరిగించి ప్రాతఃకాలభోజనమునకు వంటయింటికి పంపగలను.

ద్వౌ మాసౌ రక్షితవ్యౌ మే యోఽవధి స్తే మయా కృతః 22.8

ఊర్ధ్వం ద్వాభ్యాం తు మాసాభ్యాం భర్తారం మా మనిచ్ఛతీం
మమ త్వాం ప్రాతరాశార్థ మాలభంతే మహానసే. 22.9

**సీత :** ఓరీ రాక్షసాధమా! ఇచ్చట నీ మేలుకోరువా రెవ్వనులేరా! శ్రీరాముని భార్య నగు నన్ను, నీవు తప్ప ముల్లోకములలో మనసాకూడ కోరువా రెవ్వరునులేరు. శ్రీరాముని మహిమ నీకు తెలిసినట్లేలేదు. నీ వెక్కడికి పోయినను ఆయన నిన్ను దండింపక మానడు. రాముని కంటబడుదువేని నీవు బ్రదుకవు. అనార్యుడా! మోహదృష్టులతో చూచిన నీ వికృతములైన కనుగ్రుడ్లు ఊడి పడలేదే! నీవాడిన దుర్భాషలకు నీ నాలుక చీలికలు కాలేదే! దుర్మార్గుడా! నేనే నిన్ను భస్మ మొనరింపగలను. కాని రాముని ఆజ్ఞ లేదని ఊరుకొన్నాను. నా తపస్సును వ్యయపరచకున్నాను.

అసందేశాత్తు రామస్య తపస శ్చానుపాలనాత్
న త్వాం కుర్మి దశగ్రీవ భస్మ భస్మార్హ తేజసా. 22.20

'నేను శూరుడను. కుబేరుని తమ్ముడను' అని గొప్పలు చెప్పుకొంటివి కాని నీవు చేసినది దొంగపని.

ఈ మాటలకు రావణునికి అమితమైన కోపము వచ్చి కన్ను లెఱ్ఱబారినవి. ఆభరణములు ధరించి యుండినను, శ్మశానమునందుండు మంటపమువలె భయంకరుడై ఉండినాడు.

శ్మశానచైత్య ప్రతిమో భూషితోఽపి భయంకరః. 22.29

**రావణుడు :** సీతా! నే నెంత చెప్పినను వినక దరిద్రుడైన ఆ రామునే అనుసరించుచున్నావు. నేను నిన్నిప్పుడే వధించిపుచ్చెదను.

[ఇట్లు బెదరించినాడే కాని అంతపని చేయునా కాముకుడు!]

రావణుడు వికారరూపిణులైన రాక్షసస్త్రీలతో "సీత మనస్సును మీ రెట్లయినను మార్పవలయును. మంచి మాటలు చెప్పిగాని భయపెట్టిగాని ఆమెను వంచుటకు ప్రయత్నింపుడు." అని చెప్పి సీతాదేవిని మరియొక్కమారు బెదరించినాడు.

అంతలో రావణుని భార్య ధాన్యమాలిని రావణుని కవుగిలించుకొని 'మహారాజా! కామసూత్రములు నీకు తెలియనివి కావు. నీ మీద ప్రేమలేని యీ సీతతో మాటలెందుకు. మనము పోవుదము రండు" అన్నది. రసజ్ఞుడైన రావణుడు నవ్వుచు తన అంతఃపురమునకు మరలిపోయినాడు.

## రాక్షసస్త్రీలు సీతాదేవిని తర్జించుట

రాక్షసస్త్రీలు సీతాదేవిని రావణునివశము చేయుటకు పూనుకొన్నారు.

ఒకరాక్షసి : సీతా ! రావణుడు సామాన్యుడు కాదు. బ్రహ్మమానసపుత్రుడు పులస్త్యుడు. పులస్త్యుని మానసపుత్రుడు విశ్రవసుడు. రావణుడు విశ్రవసుని కుమారుడు. వంశము గొప్పది. రావణుడు రాక్షసేశ్వరుడు. అట్టి మహనీయుని భార్య వగుట కేల వెనుదీయుచుంటివి ?

మరొక రాక్షసి : రావణుడు ఇంద్రుని జయించినవాడు తెలియునా ! మండోదరిని సైతము విసర్జించి నిన్ను పట్టపురాణిని చేయుటకు సమ్మతించినాడుగదా. నీకు వచ్చిన కష్ట మేమి ?

మరియొక రాక్షసి : సీతా ! నీవు మానవాంగనవు గనుక మానవుడగు రాముడే భర్తగా ఉండిన మే లని భావించుచుంటివిగాని అట్టిది యెంతమాత్రము వల్లకాదు. రావణుని చేతినుండి తప్పించుకొనుటకు నీకు సాధ్యముకాదు. మొదటి మాట. రావణు డేమి తక్కువ ! రాజ్యమును కోల్పోయి నీ ముచ్చట ఒక్కటి యైనను తీర్పలేని ఆ రాముని పట్టుకొని యెందుకు ప్రాకులాడుట.

సీత : మీరేల న న్నిట్లు బాధించెదరు ? నన్ను భక్షింతు మని బెదరించుచున్నారు. అట్లు చేసినను సంతోషమే కాని మీరు చెప్పిన పనిని మాత్రము చేయను. నేను పతివ్రతను. శచీదేవి, అరుంధతి, రోహిణి, లోపాముద్ర, సుకన్య, సావిత్రి, శ్రీమతి, మదయంతి, దమయంతి మున్నగువారు తమ తమ భర్తలను ఏ విధముగా అనుసరించుచుండిరో నేనును అట్లే నా జీవితేశ్వరుని శ్రీరాముని అనుసరించుదానను. నా భర్త దీనుడైనను రాజ్యహీనుడైనను అతడే నాకు అధికుడు. సూర్యునియెడ సువర్చల కెట్టి ప్రేమ గలదో అట్టి ప్రేమ నాకు శ్రీరామునియం దున్నది.

దీనో వా రాజ్యహీనో వా యో మే భర్తా స మే గురుః
తం నిత్య మనురక్తాఽస్మి యథా సూర్యం సువర్చలా. 24-9

ఈ మాటలు విని రాక్షసస్త్రీలు కోపించి సీతాదేవిని బెదరించుటకు మరల ప్రారంభించినారు. కొందరు గొడ్డండ్లు తీసికొని సీతాదేవిపైకి వచ్చినారు. సీతాదేవి తన నేత్రములనుండి ప్రవహించుచుండిన కన్నీటిని తుడుచుకొనుచు హనుమంతు డున్న చెట్టు చెంతకు వచ్చినది. రాక్షసస్త్రీలు ఆమెను వెంబడించినారు.

హనుమంతుడు సమస్తము చూచుచు, మాటలు వినుచున్నాడు.

వినత : (రాక్షసి) సీతా ! నీ పతిభక్తి ప్రదర్శించినంతవరకు చాలును. ఇంకను ఎక్కువగా చూపనక్కరలేదు. ఎందులోను 'అతి' దుఃఖమునకే దారితీయును. లోక మర్యాద ననుసరించి నీవు ఇప్పటివరకు పలికిన మాటలు బాగుగనే ఉన్నవి. ఇకపైని అట్టిమాటలు చాలించి నా మాట గైకొని రావణుని స్వీకరింపుము.

సీతే పర్యాప్త మేతావ ద్భర్తు స్స్నేహో నిదర్శితః
సర్వత్రాతికృతం భద్రే వ్యసనాయోపకల్పతే. 24-21

పరితుష్టాస్మి భద్రం తే మానుష స్తే కృతో విధిః. 24-22

ఇంతటినుండియు సకలభోగముల ననుభవించుచు లోకము లన్నిటికి రాణివిగా ఉండుము. మేము చెప్పినట్లు చేయనిచో నిన్ను భక్షింపగలము. తెలిసినదా.

వికట : (రాక్షసి) సీతా ! ఎందు కిట్లేడ్చుచు కూర్చుండెదవు. దానివలన లాభ మేమియు లేదు. నిన్ను రక్షించుటకు ఇక్కడి కెవ్వరైనను రాగలరా ! నీ భర్తమీది ఆశను వదలుకొనుము. రావణునికి భార్యవై సుఖముగా ఉండుము.

మరొక రాక్షసి ఒక శూలము గైకొని సీతాదేవిమీదికి వచ్చి, "ఈ సీతమాంసము రుచిగా ఉండును" అని బెదరించినది.

ప్రఘస : (రాక్షసి) ఎందు కిన్ని మాటలు ? సీతను గొంతుపిసికి చంపుదము. సీత చని పోయినదని మన ప్రభువుతో చెప్పుదుమేని 'అట్లైన మీరు భక్షింపుడు' అని చెప్ప గలడు. అప్పుడు కమ్మగా తినవచ్చును.

వేరొక రాక్షసి : ఆ మాట కేమిగాని నేను చెప్పెదను వినుడు. ఈ సీత శరీరమును ముక్కలు చేసి మన మందరము పంచుకొని మాంసము తిని మద్యములు సేవించి నికుంభిలకు పోయి ఉత్సాహముతో నాట్య మాడుదము.

తోడేళ్ళచే బాధింపబడుచున్న లేడి చందమున సీతాదేవి గడగడ వణకిపోయి నది. చెట్టుకొమ్మను పట్టుకొని శ్రీరాముని ధ్యానించుచు దుఃఖపడుచున్నది. లక్ష్మణుడు, కౌసల్య, సుమిత్ర మున్నగు బంధువులు జ్ఞప్తికి వచ్చినారు. తనలో తలపోయుచున్నది.

సీత : (తనలో) కాలము కానప్పుడు మరణము సైతము రాదని చెప్పుమాట సత్యము. కానిచో శ్రీరాము నెడబాసి నే నింకను ప్రాణముతో నున్నానుగదా ! నే నెంతో పాపిష్ఠురాలను గనుకనే శ్రీరాముని చూడజాలకున్నాను. ఎవ్వరో గొప్ప పుణ్యముచేసికొన్న ధన్యులకుగాని శ్రీరాముడు కనిపింపడు. [అందరికి కనబడునా శ్రీరాముడు !]

తం పద్మదళపత్త్రాక్షం సింహ విక్రాంత గామినం
ధన్యాః పశ్యంతి మే నాథం కృతజ్ఞం ప్రియవాదినమ్. 25-16

నేను జన్మాంతరమున ఎంతపాపము చేసితినోగదా ! ఈ రాక్షసస్త్రీలబారినుండి తప్పించుకొని ఎన్నటికైనను శ్రీరాముని చూడగలనా ! నే నిక ప్రాణముతో నుండ లేను. మరణమైనను కోరినప్పుడు వచ్చునా ! ఇంతకును నా నాథుని ఆజ్ఞలేక అసువుల బాయుటకు కూడ స్వతంత్రురాలను కాను. ఛీ ! పాడుజీవితము.

ధిగస్తు ఖలు మానుష్యం ధిగస్తు పరవశ్యతాం
న శక్యం యత్పరిత్యక్తు మాత్మచ్ఛందేన జీవితమ్. 25-20

సీతాదేవి పాపము, పిచ్చిపట్టినదానివలె నేలమీదపడి పొరలుచు ఏడ్చుచున్నది.

*సీత :* నే నెంత దౌర్భాగ్యురాలను. కావుననే శ్రీరాముని బాసి బ్రదికియున్నాను. రాక్షసస్త్రీలారా ! నే నీ దుఃఖమును భరింపలేను. నన్నుచంపి పుణ్యము కట్టుకొనుడు. రావణుని నా యెడమకాలితో నైనను స్పృశింపను. మీ రెంత బెదరించినను లాభము లేదు. నా గ్రహచారము కానిచో శ్రీరాముడు వచ్చి నన్ను రక్షింపకుండునా ! నా భర్త యెంతమంది రాక్షసులను వధించినాడు ! ఈ రావణుడు ఆయన కొక లెక్కయా ! నడుమ సముద్ర మున్నమాట వాస్తవము. కాని రామబాణమునకు అదియొక ఆటంకమా ! నే నిక్కడ ఉన్నట్టు ఆయనకు తెలియదు కాబోలు. పాపము నా సంగతి చెప్పగలిగిన జటాయువు సైతము రావణునిచే హతుడైనాడు. నే నిందున్న సమాచారము శ్రీరామునికి తెలియునేని లంకను, రావణుని రూప నామ రహితముగా ఊదివేయడా ! నే నిప్పుడేడ్చుచున్నట్టే లంకలో ప్రతి ఇంటను భర్తలను కోల్పోయిన స్త్రీలు విలపింపకుందురా! ఇంతకన్నను ఎక్కువగనే విలపింతు రనుటకు సందేహములేదు.

తతో నిహతనాథానాం రాక్షసీనాం గృహే గృహే
యథాహమేవం రుదతీ తథా భూయో న సంశయః. 26-24

ఇక శీఘ్రకాలములోనే లంకాపురి వీధులనిండా పడియున్న పీనుగులను గ్రద్దలు భక్షింపగలవు. లంకాపుర మంతయు విశాల శ్మశానము కాగలదు. ఇంటింట పుట్టు రోదనధ్వనులను త్వరలోనే వినగలను. శకునములుకూడ అట్లే సూచించుచున్నవి. నాకు రావణుడు నిర్ణయించిన గడువు సైతము దగ్గరపడుచున్నది. ఆ పాపిష్ఠుడు ముందువెనుకలు చూడక నన్ను వధించినను వధింపగలడు. నేను స్వయముగా మరణింత మన్నను నా కిక్కడ విషమునైనను ఇచ్చువారు లేరు. శ్రీరాముని చూడక యెట్లుండగలను. నే నిక్కడ ఉండు సమాచారము రామలక్ష్మణుల కెట్లు తెలియగలదు. వార

నాకొరకు దేశమంతయు వెదకియే ఉందురు. వెదకకయే నన్ను వదలుకొందురా! అయినను ఇక్కడ నేనుండు సంగతి తెలిసికొనజాలక యుందురు. అట్లు కాదేని శ్రీరాముడు నన్ను బాసిన దుఃఖముతో దేహమును త్యజించి స్వర్గమున కరిగి యుండునా! ఆహా! శ్రీరాముని సందర్శింపగలిగిన దేవతలు ఎంత ధన్యులు!

శ్రీరాముడు బ్రదికియే ఉండును. ధర్మరతుడైన శ్రీరాముడు రాజర్షివలె ఉన్నాడు కాబోలు! వైరాగ్యమును అవలంబించినవారికి భార్యతో ఏమి పని యుండును? ఎదుట కనపడుచున్నంతకాలమే ప్రేమ - కంటికి దూరమైనచో ప్రేమ అడుగంటును.

దృశ్యమానే భవే త్ప్రీతి స్సౌహృదం నా స్త్యపశ్యతః. 26-42

కాని ఈమాట కృతఘ్నులపట్లనే వర్తించును. మా రాముడు అట్టివాడు కాడు.

నాశయంతి కృతఘ్నాస్తు న రామో నాశయిష్యతి. 26-43

ఒకవేళ రామలక్ష్మణులు కందమూలఫలను భక్షించుచు అరణ్యమున సంచరించుచు ఆయుధములను విసర్జించి మునివృత్తిని అవలంబించియుందురా!

అట్లుగాక రావణుడు రామలక్ష్మణులను కపటోపాయమున వధించెను కాబోలు.

శ్రీరాముని విడిచి, నేనిక బ్రదుకజాలను. ప్రియాప్రియములను జయించిన మహాత్ములు ఎంత ధన్యులు! నేను వారికి చేతులెత్తి నమస్కారము చేయుచున్నాను. అట్టి శక్తి నాకు లేదు. నేను శ్రీరాముని మీది ప్రేమను వదలుకొనజాలకున్నాను. నాకు ప్రియమును చేకూర్చు శ్రీరాముని బాసి ఉండజాలను.

ధన్యాః ఖలు మహాత్మానో మునయ స్త్యక్తకిల్బిషాః
జితాత్మానో మహాభాగా యేషాం న స్తః ప్రియాప్రియే. 26-49

ప్రియా న్నసంభవే ద్దుఃఖ మప్రియా దధికం భయమ్
తాభ్యాం హి యే వియుజ్యంతే నమ స్తేషాం మహాత్మనామ్. 26-50

సాఽహం త్యక్తా ప్రియార్హేణ రామేణ విదితాత్మనా
ప్రాణాం స్త్యక్ష్యామి పాపస్య రావణస్య గతా వశమ్. 26-51

ఈ పాపిరావణాసురుని అధీనములో ఉండలేను. ప్రాణములు త్యజించెదను.

సీతాదేవి మాటలను రాక్షసస్త్రీలు విన్నారు. ఆమె ప్రాణత్యాగము చేసికొనుటకు సిద్ధపడినదని రావణునికి నివేదించుటకు కొందరు బయలుదేరినారు. మరికొందరు సీతాదేవిని బెదరించుటకు ఆమెపైకి వచ్చినారు. అప్పటివరకు నిద్రించుచుండిన త్రిజట అను వృద్ధ రాక్షసి నిద్రనుండి లేచి యీ ఆటోపమును చూచి రాక్షసస్త్రీలను మందలించి తన స్వప్న వృత్తాంతమును వారికి తెలియజెప్పినది.

# త్రిజట స్వప్న వృత్తాంతము

*త్రిజట :* శ్రీరాముడు ధవళ పుష్పమాలికలు, శ్వేతాంబరములు ధరించి లక్ష్మణునిగూడి, వేయి హంసలతో కూర్పబడిన పల్లకి నెక్కి లంకాపురికి వచ్చినాడు. సీతాదేవి తెల్లని చీర ధరించి శ్వేత పర్వతము నెక్కినది. వెలుతురు సూర్యునితో కూడి యున్నట్లు సీతారాములు కలిసికొన్నారు. రామలక్ష్మణులు పెద్ద యేనుగు నెక్కి లంకలో సంచరించుచున్నారు. సీతాదేవిని సమీపించి ఆమెనుకూడ ఏనుగు మీద ఎక్కించుకొన్నారు. ఆ తరువాత వారందరు పుష్పక విమానముమీద ఉత్తరదిక్కుగా పయనించినారు.

రావణుడు గన్నేరుపూల మాలికను ధరించి ఒంటినిండ నూనె పూసుకొని రక్తాంబరములు ధరించి మద్యము సేవించి గతస్పృహుడై నేలమీద ఉన్నాడు. నల్లబట్టలు ధరించి యుండిన ఒక స్త్రీ రావణుని ఈడ్చుకొని పోవుచున్నది. రావణుడు స్పృహ తప్పి గాడిదలు పూన్చిన రథముపై కూర్చుండి యున్నాడు. ఆ తరువాత ఒక గాడిద నెక్కి దక్షిణదిశకు పోయినాడు. గాడిదమీదినుండి తలక్రిందుగా పడి, పిచ్చిపట్టినట్టు దుర్వాక్యము లాడుచు పోయిపోయి ఒక దుర్గంధకూపమున పడినాడు. నల్లబట్టలు ధరించిన ఒక స్త్రీ ఆ రావణుని మెడకు త్రాడు కట్టి దక్షిణదిశకు ఈడ్చుకొని పోయినది.

కుంభకర్ణుడు, రావణుని కుమారులు మున్నగువారందరు రావణునివలెనే ఉన్నారు.

విభీషణుడు మాత్రము ధవళ పుష్పమాలికలు శ్వేతాంబరములు ధరించి యేనుగుపై నున్నాడు.

రాముని దూతయగు వానరుడొకడు లంకాపురిని దహించినట్లుకూడ కనబడినది.

ఇది నా స్వప్న వృత్తాంతము. ఇకమీద సీతాదేవిని ఎవరుగాని బెదరింపవలదు. అభయ మీయు మని ఆమెను ప్రార్థింపుడు. ఆమె మిమ్ములను తప్పక అనుగ్రహింప గలదు.

రావణ వినాశము, రాఘవ విజయము త్వరలోనే చూడగలము. అటు చూచితిరా! సీతాదేవి యెడమ కన్ను, ఎడమ భుజము, ఎడమ తొడ యెట్లు అదరుచున్నవో! చెట్టుమీది పక్షి సల్పుచున్న ధ్వనిసైతము శ్రీరాముడు శీఘ్రముగా రాగల డని సూచించుచున్నది.

[చెట్టుమీద హనుమంతు డుండుటవలన ఈ మాటలో ఒక విశేష మున్నది]

## సీతాదేవి ఆత్మహత్యకు పూనుకొనుట

సీతాదేవికి దుఃఖము తగ్గలేదు. విలపించుచునే ఉండినది.

సీత: గడువు రెండు నెలలు మాత్రమే మిగిలియున్నది. ఈ లోపల శ్రీరాముడు రానిచో గర్భమునుండి వెలుపలికి రాజాలని ప్రాణిని శస్త్రచికిత్సకుడు ఖండించునట్లు ఈ రాక్షసుడు నన్ను ముక్కలుగాఁ తరిగింపగలడు.

నూనం మమాంగా న్యచిరా దనార్య
శ్శస్త్రైః శ్శితై శ్ఛేత్స్యతి రాక్షసేంద్రః
తస్మిన్ననాగచ్ఛతి లోకనాథే
గర్భస్థ జంతో రివ శల్యకృన్తః. 28.6

[శస్త్రచికిత్స అప్పటికే యెంతదూరమో అభివృద్ధి జెందినట్లు కనబడుచున్నది.]

ఆహా! నా వ్రతములకు నా పాతివ్రత్యమునకు ఫలమేలేదా! అన్నియు కృతఘ్నునకు చేసిన మేలువలె నిరర్థకములేనా!

రామా! ఇక నేను బ్రతికియుండలేను.

సీతాదేవి శ్రీరాముని ధ్యానించినది. ఆమె వణకుచున్నది. ఆమెకు నోరెండి పోయినది. శింశుపావృక్షము చెంతకు వచ్చినది.

ఇతీవ దేవీ బహుధా విలప్య
సర్వాత్మనా రామ మనుస్మరంతీ
ప్రవేపమానా పరిశుష్క వక్త్రా
నగోత్తమం పుష్పిత మాససాద. 28.17

సీతాదేవి దుఃఖమును భరింపజాలక ప్రాణములు త్యజించుటకు నిశ్చయించుకొని జడను మెడకు కట్టుకొని "దీనితో ఉరిపోసుకొని యమలోకమునకు పోయెదను" అని తలచి చెట్టుకొమ్మను పట్టుకొన్నది.

శోకాభితప్తా బహుధా విచింత్య
సీతాఽథ వేణ్యుద్గ్రథనం గృహీత్వా
ఉద్బధ్య వేణ్యుద్గ్రథనేన శీఘ్ర
మహం గమిష్యామి యమస్య మూలమ్. 28.18

ఆ సమయమున సీతాదేవికి ఎడమకన్నదరుట మున్నగు శుభశకునములు కనిపించినవి.

## హనుమంతుడు తన కర్తవ్యమునుగూర్చి మరల ఆలోచించుట

హనుమంతుడు చెట్టుమీదనుండి జరిగిన విషయము లన్నిటిని చూచినాడు. త్రిజట స్వప్నవృత్తాంతముకూడ విన్నాడు. సీతాదేవి పరిస్థితిని తలచుకొని అనేక విధములుగా ఆలోచించినాడు.

హనుమంతుడు : సీతాదేవి దర్శన మైనది. లంకాపురమును చూచితిని. రావణుని ప్రభావము కూడ గ్రహించితిని. సీతాదేవి తన నాథుని ఎప్పుడెప్పుడు చూడగలుగుదునా అని బాధపడుచున్నది. ఆమెకు శ్రీరాముని క్షేమవార్త చెప్పి కొంత శాంతిని కలుగజేయుట యుక్తము. ఆ మాత్రము మాటనైనను చెప్పకయే మరలి పోవుదునేని ఎన్నో దోషములు సంభవించును. ఇప్పటి స్థితిని చూడగా తనను రక్షించువా రెవ్వరును లేరని నిరాశజెంది సీతాదేవి ప్రాణములు విడుచునట్లున్నది.

ఈమె వృత్తాంతము వినుటకు తహతహపడుచున్న శ్రీరామునికి అనునయ వాక్యము లేవైనను చెప్పవలయునుగదా.

సీతాదేవితో ఎట్లైనను మాటలాడవలయును. ఈ రాక్షసస్త్రీల యెదుట ఆమెతో సంభాషించుట మంచిపనికాదు. ఉచితమైన మార్గమును వెదకి సూర్యోదయములోపల ఆమెతో మాటలాడనిచో ఆమె ప్రాణత్యాగము చేయగలదు. "సీత యేమి చెప్పినది" అని శ్రీరాముడు నన్నడిగినప్పుడు బదులు చెప్పవలయునుగదా ! "నే నామెతో మాట లాడలేదు" అని చెప్పుదునేని శ్రీరాముడు నన్ను దహించివేయడా !

సీతాదేవి ప్రాణత్యాగము చేసికొనినపిమ్మట, సుగ్రీవుని సైన్యము వచ్చిమాత్ర మేమి ప్రయోజనము.

నే నిందే వుండి సమయము చూచుకొని ఆమె ననునయించెదను. రాక్షసస్త్రీలకు తెలియరాకుండునట్లు భాషింపవలయును. నేను చిన్న వానరరూపముతో ఉన్నాను [కావున వీరు నన్ను గుర్తింపజాలరు]. మనుష్యులవలె సంస్కృతమున భాషింతునేని రాక్షసుల కర్థము కాకుండును. కాని నేను బ్రాహ్మణునివలె సంస్కృతము మాట్లాడుదు నేని "ఈ కోతి సంస్కృతము మాటలాడుట యెట్టిది ! ఇది తప్పక రావణమాయగానే ఉండును" అని తలచి సీతాదేవి భయపడవచ్చును. కావున సాధారణ భాష వాడుటయే మంచిది. అప్పటికిని సీతాదేవి నన్ను చూచి భయపడగలదు. "కోతులు భాషించుట యేమి ? ఇది రాక్షసమాయతప్ప అన్యముకాదు" అని ఊహించి సీతాదేవి గట్టిగా కేకలుపెట్టును. అంతట రాక్షసస్త్రీ లందరు నా పైకి రాగలరు. నన్ను పట్టుకొనుటకు ప్రయత్నము చేయుదురు. నేను ఊరకుండుట పొసంగునా ! చెట్లను విరిచి కొమ్మలను,

బోదెలను గైకొని నలువైపుల విజృంభింతును. వారు కావలివారిని పిల్తురు. నేను వారితో యుద్ధమాడుట వారిని వధించుట జరుగును. నేను అలసిపోయినచో సముద్రమును లంఘించి మరలిపోగలనా! ఒకవేళ ఈ రాక్షసు లందరు ఏకమై నన్ను బంధించినచో ఏమి జరుగవలెను ?

సీతాదేవికి శ్రీరాముని సమాచార మెట్లుతెలియును ? శ్రీరామునికి సీతాదేవి వృత్తాంతము తెలియుట యెట్లు ? ఇంతజరిగిన పిదప రాక్షసులు సీతాదేవిని వధించినను వధింపగలరు. ఆవల శ్రీరాముడు, సుగ్రీవుడు వచ్చిమాత్రము ప్రయోజన మేమి ?

యుద్ధములో జయాపజయములు నిర్ణయించుటకు వీలులేదు. నేను యుద్ధములో మరణింతునేని మరల ఈ సముద్రమును దాటిరాగలవా డెవ్వడైనను ఉన్నాడా ?

సీతాదేవితో మాటలాడుటయా, మాటలాడకయే మరలిపోవుటయా - గట్టి సమస్య యేర్పడినది.

దూత తెలివితక్కువవాడైనచో, కాగలపనికూడ చెడిపోవును. శ్రీరాముని కార్యము చెడకుండునట్లును, సముద్రలంఘనము వ్యర్థము కాకుండునట్లును సీతాదేవికి భయము కలుగకుండునట్లును ఏదేని ఉపాయ మాలోచించి నేను సీతాదేవితో తప్పక భాషింపవలయును.

## హనుమంతుడు శ్రీరామ కథను కీర్తించుట

**హనుమంతుడు :** వినియు వినుటతోడనే సంతోషమునుకలిగించు మాట లేమిటి ? నేను శ్రీరాముని కీర్తించెదను. శ్రీరాముడు సీతాదేవికి చెప్పుమన్న మాటలను నెమ్మదిగా పలికెదను. బంధువుల సమాచారము చెవి కింపుగా నుండును.

ఇట్లు పరిపరి విధములుగా తలపోసి హనుమంతుడు దశరథుని కథ ప్రారంభించినాడు. శ్రీరాముడు సీతాదేవి లక్ష్మణుడు అరణ్యమునకు వచ్చుట, ఖరదూషణాదుల సంహారము, రావణుడు సీతాదేవిని అపహరించుట, రామసుగ్రీవుల మైత్రి, వాలివధ, సుగ్రీవ పట్టాభిషేకము, సీతాన్వేషణమునకు వానరవీరులు వచ్చుట, సంపాతి మాటలను పురస్కరించుకొని తాను సముద్రలంఘనము చేయుట, సీతాదేవిని సందర్శించుట మున్నగు సంగతులను వినిపించినాడు.

## సీతాదేవి హనుమంతుని చూచుట

సీతాదేవి యీ పల్కులు విని సంతోషించి నెమ్మదిగా తల యెత్తి శ్రీరాముని ధ్యానించుచు అటునిటు చూడగా ఉదయసూర్యునిభంగి తేజరిల్లుచున్న హనుమంతుడు చెట్టుమీద కనిపించినాడు.

సా తిర్య గూర్ధ్వం చ తథా వ్యధస్తా
న్నిరీక్షమాణా తమచింత్యబుద్ధిమ్
దదర్శ పింగాధిపతే రమాత్యం
వాతాత్మజం సూర్య మివోదయస్థమ్. 31.19

[సీతాదేవి దుఃఖమును పోగొట్టి ఆమెకు ఊరట కలుగజేసిన హనుమంతుని చీకటిని పోగొట్టి వెలుగు నిచ్చు ఉదయ సూర్యునితో పోల్చుట యెంతో సమంజసముగా ఉన్నది]

హనుమంతుడు ధవళ వస్త్రమును ధరించి తేజస్సుతో కూడియున్నాడు. కపి రూపమును చూచి సీతాదేవి భీతిల్లి మూర్ఛపోయినది. కొంత సేపటికి తేరి ఇది అంతయు స్వప్న మని భావించినది.

[లంకలో శ్రీరాముని వార్త చెప్పువా రున్నారా! కావున స్వప్న మని భావించి యుండును]

సీత : (తనలో) స్వప్నములో కోతిని చూచితినిగదా! ఇది అశుభమును సూచించు నని పెద్దలు చెప్పుదురు. రామలక్ష్మణులకును మా తండ్రియగు జనకునికిని క్షేమము కలుగునుగాక!

నా పిచ్చిగాని, నాకు స్వప్నము వచ్చునా! నిద్రలో నున్నగదా స్వప్నము. సుఖ మున్నగదా నిద్ర! శ్రీరాముని బాసిన నాకు సుఖ మెక్కడిది? కావున ఇది స్వప్నము కాదు.

కాదుగాని నేను విన్న మాటలకు అర్థ మేమి? నే నెల్లప్పుడు 'రామ! రామ!' అని మనస్సులో స్మరించుచు నోటితో ఉచ్చరించుచున్నాను. గనుక అందుకు తగినట్లు రామకథను వినుచున్నాను - అంతే!

రామేతి రామేతి సదైవ బుద్ధ్యా
విచింత్య వాచా బ్రువతీ తమేవ
తస్యానురూపాం చ కథాం తమర్థ
మేవం ప్రపశ్యామి తథా శృణోమి. 32-11

కాని యీ కపిరూపము నాకు స్పష్టముగా కనబడుచున్నది. నేను విన్నపల్కులు అతడు పలికినవే. నేను ఇంద్రాది దేవతలకు నమస్కరించెదను. ఈ వానరుని వాక్యములు సత్య మగునుగాక!

## సీతా హనుమంతుల సంవాదము

హనుమంతుడు చెట్టు దిగి సీతాదేవికి నమస్కరించి ఆమెతో మాటలాడు చున్నాడు.

హనుమంతుడు : తల్లీ, నీ వెవ్వతెవు. నలిగిన చీరను ధరించి చెట్టుకొమ్మను పట్టుకొని ఇట్లున్నా వేమి. నీ నేత్రములనుండి దుఃఖాశ్రువులు స్రవించుచున్న కారణ మేమి.

కిమర్థం తవ నేత్రాభ్యాం వారి స్రవతి శోకజమ్. 33-4

[పతివ్రతల కన్నులనుండి అకారణముగా అశ్రువులు స్రవింపవు. ఆ కన్నీటికి ఒక అర్థ ముండును. 'కిమర్థం అన్నమాటకు ఏ ప్రయోజనమును కోరి' అని చెప్పుట సరియని తోచుచున్నది. ఈ భావమే 'కారణము' అను మాటలో సూచిత మైనది]

తల్లీ, నీవు దేవతవా! నీ రోదనము, నీ నిట్టూర్పులు, నీవు భూమిని స్పృశించుట, మున్నగు వానిని చూడగా నీవు దేవతాస్త్రీవి కావని తెలియుచున్నది. నీ లక్షణములనుబట్టి నీవు రాజపుత్రి వనియు, రాజమహిషి వనియు తేటతెల్ల మగుచున్నది. రావణాసురునిచే అపహరింపబడిన సీతాదేవివి నీవేనా!

నీ దుఃఖము, నీ రూపము, నీ తాపసవేషము చూడ నీవు తప్పక రామమహిషివే అయియుందువు.

యథా హి తవ వై దైన్యం రూపం చాప్యతిమానుషమ్
తపసా చాన్వితో వేష స్త్వం రామమహిషీ ధ్రువమ్. 33-13

సీత : (సంతోషముతో) నేను దశరథ చక్రవర్తి కోడలను. జనకమహారాజు కొమారితను. నా పేరు సీత. నేను శ్రీరాముని భార్యను. నాకు వివాహ మైనపిదప పండ్రెండు సంవత్సరములు నా భర్తతో సుఖముగా గడపితిని. మా మామగారు నా భర్తకు పట్టాభిషేకము చేయబూనుకొన్నారు. అప్పుడు నా భర్త సవతి తల్లి యగు కైకేయి అడ్డుతగిలి మా మామగారిని నిర్బంధించి మమ్ములను అడవులపాలు చేసినది. తండ్రిమాటను శిరసావహించి నా భర్త అడవికి వచ్చినాడు. ఎవడు దేనిని కోరునో నా జీవితేశ్వరుడు దానిని ఇచ్చువాడేగాని ప్రాణముమీదికి వచ్చినను ఒకరియొద్ద దేనినిగాని పుచ్చుకొనువాడుకాడు. ఒకనికి అప్రియమైన మాటకూడ పలుకడు. నా భర్త సత్యపరాక్రముడు.

దద్యా న్న ప్రతిగృహ్ణీయా న్నబ్రూయా త్కించి దప్రియమ్
అపి జీవిత హేతోర్వా రామ స్సత్యపరాక్రమః 33-25

పతివ్రత నగు నేను శ్రీరామునిగూడి అడవికి వచ్చితిని. శ్రీరాముని యందలి భక్తిచే ఆయన తమ్ముడగు లక్ష్మణుడు మా వెంట వచ్చినాడు. మేము దండకారణ్యమునందుండగా రావణాసురుడు నన్ను అపహరించి తెచ్చినాడు. అతడు నాకు నిర్ణయించిన గడువు రెండు మాసములు మాత్రమే మిగిలియున్నది. ఆ గడువు దాటినపిదప ఈ దేహమును పరిత్యాగము చేయుదును.

హనుమంతుడు : (దుఃఖముతో) తల్లీ! నేను శ్రీరాముని దూతను. శ్రీరాముడు కుశలియై యున్నాడు. నీ క్షేమమును తెలియగోరుచున్నాడు. లక్ష్మణునికిని క్షేమమే. లక్ష్మణుడు నీకు సాష్టాంగనమస్కారము చేసినాడు.

సీత : (సంతోషముతో) "మానవుడు బ్రతికియుండునేని నూరు సంవత్సరముల కైనను ఆనందమును పొందగలడు" అను లోకోక్తి నాపట్ల నిజమే అయినది. నాకు సంతోషముగా ఉన్నది.

కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మే
ఏతి జీవంత మానందో నరం వర్షశతాదపి. 34-6

ఇద్దరును దుఃఖమును వీడి పరస్పరము నమ్మికతో మాటలాడు కొనుచున్నారు. హనుమంతుడు సీతాదేవిని కొంచెము సమీపింపగా సీతాదేవికి సందేహముకలిగి రావణుడే యీ వానరరూపముతో వచ్చియుండు నని అనుమానించి చెట్టుకొమ్మను విడిచిపెట్టి క్రింద కూర్చుండినది.

హనుమంతునివైపు చూచుటకూడ మానినది. హనుమంతుడు సీతాదేవికి నమస్కరించినాడు. కొంత సేపటికి,

సీత : (నిట్టూర్పులు పుచ్చుచు) నీవు రావణుడవే అగుదువేని ఇక్కడనుండి పొమ్ము. నన్ను బాధింపకుము. నీవు దొంగవేషముతో వచ్చి నన్ను తెచ్చితివి. నే నిప్పటికే ఎంతో దుఃఖములో నున్నాను. నీ వేల న న్నింకను తపింపజేసెదవు.

నా సందేహము సరికా దని తోచుచున్నది. వానరుడా! నిన్ను చూచుటవలన నా మనస్సు ప్రసన్నముగా నున్నది. నీవు నిజముగా రామదూత వైనచో నీకు మంగళ మగునుగాక.

అథవా నైతదేవం హి యన్మయా పరిశంకితమ్
మనసో హి మమ ప్రీతి రుత్పన్నా తవ దర్శనాత్. 34-17

ఇదంతయు స్వప్నమే కాబోలు. స్వప్నమైనను నాకెంతో సుఖముగా ఉన్నది. 'శ్రీరాముని దూతను' అని పలుకుచు ఒకడు కనిపించినాడు. లక్ష్మణసమేతు డైన శ్రీరాముడు స్వప్నములోనైనను కానబడునేని ఎంతో సుఖముగా నుండును కాని ఆ స్వప్నమునకు కూడ నాయెడ మాత్సర్య మున్నట్లున్నది.

స్వప్నేఽపి యద్యహం వీరం రాఘవం సహలక్ష్మణమ్
పశ్యేయం నావసీదేయం స్వప్నోఽపి మమ మత్సరీ. 34-21

ఇది స్వప్నము కానేకాదు. స్వప్నములో మర్కటమును చూచినప్పుడు సంతోషము కలుగునా! నేనేమో ఇప్పుడు సంతోషము ననుభవించుచున్నాను.

ఒకవేళ నా కిప్పుడు చిత్తభ్రాంతి కలిగినదా! లేక పిచ్చిపట్టియుండునా! అట్టి దేమియులేదు. నేను వానరునీ, నన్నూ స్పష్టముగా చూడగలిగియున్నాను.

ఇట్లు అనేక విధములుగా తర్కించుకొని ఇది రావణమాయగా ఉండు నని అనుమానించి సీతాదేవి హనుమంతునితో పలుకుట మానినది. సీతాదేవి మనసులోని భయమును; అనుమానమును హనుమంతుడు గ్రహించి ఆమె వీనులకు విందుగా శ్రీరాముని ప్రశంసించి ఆయన గుణములను కీర్తించినాడు.

[రావణుడే అగునేని మరి యెట్టి పనినైనను చేయునుగాని సీతాదేవి యెదుట శ్రీరామ సంకీర్తనము మాత్రము చేయడు!]

హనుమంతుడు : శ్రీరాముడు సత్యవాది. మధురముగా మాటలాడువాడు. మన్మథుడే రామ రూపములో ఉన్నాడా అని తోపింపగల సౌందర్యమూర్తి. యుక్త కాలమునమాత్రమే కోపించువాడు. లోకములో అందరలోను ఉత్తముడు.

సత్యవాదీ మధురవా గ్దేవో వాచస్పతి ర్యథా
రూపవాన్ సుభగ శ్శ్రీమాన్ కందర్ప ఇవ మూర్తిమాన్. 34-30

స్థానక్రోధః ప్రహర్తా చ శ్రేష్ఠో లోకే మహారథః. 34-31

శ్రీరాముడు త్వరలోనే వచ్చి రావణుని వధించి నిన్ను చేకొనిపోగలడు. అమ్మా! నేను శ్రీరాముని పంపున వచ్చిన దూతను. నీ వియోగమువల్ల శ్రీరాముడు దుఃఖములో మునిగి యున్నాడు. నీ క్షేమవార్తను వినగోరుచున్నాడు. లక్ష్మణుడు, సుగ్రీవుడు నీ క్షేమమును అడుగుచున్నారు. సుగ్రీవుడు మా వానరుల కందరకును ప్రభువు. శ్రీరాముని మిత్రుడు. రాముడు లక్ష్మణుడు సుగ్రీవుడు ఎల్లప్పుడును నిన్ను గూర్చియు నీ గుణగణములను గూర్చియు మాటలాడుకొనుచుందురు. వా రందరు అనేక కోట్ల సంఖ్యలో నున్న వానర సైన్యమును వెంటగొని త్వరలోనే వచ్చి నిన్ను రక్షింపగలరు. నేను సుగ్రీవుని మంత్రిని. నా పేరు హనుమంతుడు. నీ దర్శనముకొరకు నేను సముద్రమును లంఘించి వచ్చితిని. నాపై అనుమానము వలదు.

సీత : హనుమంతుడా! నీకు శ్రీరామునితోను లక్ష్మణునితోను పరిచయ మెట్లుకలిగినది. వానరులును మానవులును ఏ విధముగా కలిసినారు? శ్రీరాముని లక్ష్మణుని చూచితినంటివిగదా! వారిని వర్ణింపుము.

హనుమంతుడు రామలక్ష్మణుల ఆకారములను గుణములను వర్ణించినాడు.

హనుమంతుడు: శ్రీరాముడు శ్యామసుందరుడు. ఎనిమిది అడుగుల పొడవువాడు. ఆజానుబాహుడు. ఆయన కంఠస్వరము భేరీనినాదమువలె ఉండును. గొప్ప పరాక్రమశాలి.

దుందుభిస్వన నిర్ఘోష స్స్నిగ్ధవర్ణః ప్రతాపవాౕ
సమ స్సమవిభక్తాంగో వర్ణం శ్యామం సమాశ్రితః 35-16

లక్ష్మణుడుకూడ శ్రీరామునివలెనే సర్వాంగసుందరుడు. సుగుణసంపన్నుడు. బంగారు వన్నెవాడు.

[ఈ విధముగా రామలక్ష్మణులను హనుమంతుడు విశదముగా వర్ణించినాడు]

తల్లీ! రామలక్ష్మణులు నిన్ను వెదకికొనుచు ఋశ్యమూకపర్వతముచెంతకు వచ్చినారు. మా ప్రభువైన సుగ్రీవుడు అతని అన్నయగు వాలిచే తరుమబడి ఆ పర్వతము మీద తలదాచుకొనుచుండినాడు. అతనికి నలుగురు మంత్రులు. వారిలో నే నొకడను. మేము సుగ్రీవుని అనుసరించి వచ్చి ఋశ్యమూకపర్వతమం దుండగా రామలక్ష్మణులు అక్కడికి వచ్చినారు. వారి ఆకారములను తేజస్సును చూచి సుగ్రీవుడు భీతిజెంది వారి సంగతి తెలిసికొని రమ్మని న న్నంపినాడు. నేను పోయి రామలక్ష్మణులతో మాటలాడి ఇర్వురను నా వీపుమీద ఎక్కించుకొని సుగ్రీవుని చెంతకు తీసికొనిపోయితిని. శ్రీరాముడు సుగ్రీవుడు అగ్నిసాక్షిగా స్నేహము చేసికొని తమతమ కష్టసుఖములను ఒకరికొకరు చెప్పుకొని పరస్పరము సహాయము చేసికొనునట్లు ప్రమాణములు సలుపుకొన్నారు. రావణుడు నిన్ను కొనివచ్చినప్పుడు నీవొక నగలమూటను క్రిందికి విసిరితివి. జ్ఞాపకమున్నదా! ఆ మూటను భద్రపరచినది నేనే. ఆ నగలను శ్రీరామునికి చూపించినాము. వానిని చూచినవెంటనే ఆయన మూర్ఛిల్లినాడు. కొంతసేపటికి తేరి ఆ నగలను చూచి నిన్ను తలచుకొని యెంతగానో విలపించినాడు.

తల్లీ! నీవు కనబడలేదని శ్రీరాముడు ఎల్లప్పుడును పరితపించుచున్నాడు.

రామ సుగ్రీవుల మైత్రినిబట్టి శ్రీరాముడు వాలినివధించి కపిరాజ్యమును సుగ్రీవుని కిచ్చినాడు. నిన్ను వెదకించెదనని సుగ్రీవుడు, శ్రీరాముని కిచ్చిన మాటమేరకు కపివీరులను నాలుగు దిక్కులకు పంపించి వారు మరలి వచ్చుటకు ఒక్కనెల గడువుపెట్టినాడు. మేము దక్షిణ దిశకు వచ్చినవారము. నిన్ను వెదకుటలో గడువు మీరిపోయినది. ఏమిచేయుటకును మాకు తోపలేదు. సుగ్రీవుని ఆజ్ఞకు తిరుగులేదు. గడువేమో మించినది. వచ్చిన పనియేమో కాలేదు. ఈ స్థితిలో మేము మరలిపోయినయెడల సుగ్రీవుడు మాకు మరణదండన విధించును కావున మే మందరము ప్రాయోపవేశము

నకు పూనుకొన్నాము. ఆ సమయమున జటాయువు అన్న యగు సంపాతి తటస్థపడి నీవు లంకలో నున్నసంగతి చెప్పినాడు. సముద్రమును దాటుటనుగూర్చి మా వా రందరు దిగులుపడినారు. నేను వారిని ఓదార్చి సముద్రమును లంఘించి లంకకు వచ్చి నీ కొరకు ఎన్నిచోట్లనో వెదకి వేసారి తుదకు ఇక్కడికి వచ్చి నా భాగ్యవశమున నిన్ను చూడగలిగితిని. దేవుని దయవలన సముద్రలంఘనము వ్యర్థముకాలేదు. నీ దర్శనమువలన కలిగిన యశస్సు, అదృష్టవశమున నాకు లభించినది. వానరుల శోకము తీరిపోయినది.

తల్లీ! శ్రీరాముడు శీఘ్రమేవచ్చి రావణుని సబాంధవముగా వధించి నిన్ను చేకొనిపోగలడు. నీవిక దుఃఖపడకుము. నేను వాయుదేవుని పుత్రుడను. నా మాట నమ్ముము.

హనుమంతుని మధురవాక్యములు విన్న సీతాదేవికి పరమసంతోషము కలిగినది. ఆమె నేత్రములనుండి ఆనందబాష్పములు స్రవించినవి. ఆమె అనుమానము తీరిపోయినది. ఆమె ముఖము వికసించినది.

*హనుమంతుడు :* అమ్మా! ఊరడిల్లుము. నే నిప్పు డేమిచేయవలయునో ఆజ్ఞాపింపుము. నేను శ్రీరాముని చెంతకు శీఘ్రముగా పోవలయును.

తల్లీ! మరియొకమాట. శ్రీరామ నామాంకితమైన యీ అంగుళీయమును చూడుము. నీకు నాయెడ నమ్మకము కలుగుటకై శ్రీరాముడు దీనిని నాచేతి కిచ్చి పంపినాడు. ఇదిగో యీ అంగుళీయమును గ్రహింపుము. నీ దుఃఖము లన్నియు నశించి పోయినవి. నీకు మంగళ మగునుగాక!

[ఇక్కడ ఒక విషయము గమనింపదగియున్నది. సీతాదేవితో అన్ని సంగతులు మాట లాడి ఆమెకు తనయందు పూర్తి నమ్మకము కుదిరిన పిమ్మట గాని హనుమంతుడు అంగుళీయ మును బయట పెట్టలేదు. మాటలవల్ల కలిగిన నమ్మకమును దృఢపరుచుటకు అంగుళీయమును ఉపయోగించినాడు. ఇది యెంతో సమంజసముగా నున్నది. అట్లుగాక మొట్టమొదటనే అంగు ళీయమును సీతాదేవికి ఇచ్చియుండునేని ఆమెకు దానివలన నమ్మకము కలుగునా! కలుగవే కలుగదు. ఇదేదో రాక్షస మాయగా నుండు నని సీతాదేవి భావింపవచ్చును. వీ డెవడో అంగు ళీయమును సంగ్రహించి నన్ను మోసము చేయజూచుచున్నా డని తలపవచ్చును. మరి యేవిధ ముగా నైనను సందేహించవచ్చును. అట్లు మొదటనే కలిగిన సందేహమును తీర్చుట కష్ట సాధ్యము. వీని నన్నింటిని ఆలోచించుకొనియే మతిమంతుడైన హనుమంతుడు అంగుళీయము సంగతి చిట్టచివర చెప్పినాడు]

సీతాదేవి అంగుళీయమును గైకొని దానిని అనేక పర్యాయములు చూచి చూచి శ్రీరాముని చూచినట్లే సంతోషించినది. హనుమంతుని ప్రశంసించినది.

సీత: హనుమంతుడా! ఎంత గొప్ప కార్యమును సాధించితివి! నీ పరాక్రమము సామాన్యమైనది కాదు. నీ ధైర్యము, నీ సాహసము నీ బుద్ధి యెంతో ప్రశంస నీయములు. మహాసముద్రమును లంఘించి ఒక్కడవే వచ్చి రాక్షసులచే సురక్షిత మైన యీ లంకలో ప్రవేశించుట మాటలా! నీవు సామాన్యమైన వానరుడ వని తోచుటలేదు. రావణాసురుని సైతము సరకుచేయక ధైర్యము ప్రదర్శించితివి.

విక్రాంత స్త్వం సమర్థ స్త్వం ప్రాజ్ఞ స్త్వం వానరోత్తమ
యేనేదం రాక్షసపదం త్వయైకేన ప్రధర్షితమ్. 36-7

శతయోజన విస్తీర్ణ స్సాగరో మకరాలయః
విక్రమశ్లాఘనీయేన క్రమతా గోష్పదీ కృతః. 36-8

న హి త్వాం ప్రాకృతం మన్యే వానరం వానరర్షభ
యస్య తే నాస్తి సంత్రాసో రావణాన్నాపి సంభ్రమః. 36-9

శ్రీరాముని పంపున వచ్చిన దూతవు గనుక, నేను భాషింప దగినవాడవు. సర్వ విధముల పరీక్షింపక, దూత పరాక్రమమును తెలిసికొనక, ఒక దూతను శ్రీరాముడు పంపునా! అందులో నా యొద్దకు.

['రామ దూతను' అన్నప్పుడే నీ శక్తి సామర్థ్యములు నాకు తెలిసినవి]

ప్రేషయిష్యతి దుర్ధర్షో రామో న హ్యపరీక్షితం
పరాక్రమ మవిజ్ఞాయ మత్సకాశం విశేషతః. 36-11

హనుమంతుడా! నా భాగ్య విశేషమున రామలక్ష్మణులు కుశలులై యున్నారు. వారెంతో శక్తియుతులు గదా! నా విషయములో ఇట్లేల ఉపేక్ష చేయుచున్నారు. నా దుఃఖమునకు అంతములేదు కాబోలు! నన్ను గూర్చి శ్రీరాముడు పరితపించుచున్నా డని పలికితివి. అట్లు సర్వదా దీనుడై యున్నాడా లేక నన్ను తెచ్చుకొను ప్రయత్న మేమైనను చేయుచున్నాడా? రాజపుత్రునికి తగిన వృత్తిని అవలంబించునా లేక దీనుడై పనితెరువు తెలిసికొనక విలపించుచున్నాడా?

కచ్చిన్న దీన స్సంభ్రాంతః కార్యేషు చ న ముహ్యతి
కచ్చి త్పురుషకార్యాణి కురుతే నృపతే స్సుతః. 36-16

శ్రీరాముడు మంచి మిత్రులను సంపాదించెనా? దేవతానుగ్రహమును కోరు చున్నాడుగదా!

శ్రీరామునికి నాయెడగల ప్రేమ యీ యెడబాటు వలన తగ్గలేదుకదా!

కచ్చిన్న విగతస్నేహః ప్రవాసా న్మయి రాఘవః. 36-20

హనుమంతుడా! కౌసల్య, సుమిత్ర, భరతుడు మున్నగువారి క్షేమ వార్త లేమైనను తెలియవచ్చినవా ?

[బంధువులమీదికి మనస్సు మరలినది పాపము.]

భరతుడు నా కొరకు ఒక అక్షౌహిణి సైన్యమును పంపునా ?

కచ్చి దక్షౌహిణీం భీమాం భరతో భ్రాతృవత్సలః
ధ్వజినీం మంత్రిభి ర్గుప్తాం ప్రేషయిష్యతి మత్కృతే. 36-24

[మనము కష్టములలో నుండునప్పుడు మన బంధువులు వచ్చి మనకు సాయపడుదు రని ఆశించుట సహజము.]

రామలక్ష్మణులు సుగ్రీవుని సైన్యముల గూడి వచ్చి రావణుని సబాంధవముగా వధించుట త్వరలో చూడగలుగుదునా! రామలక్ష్మణులు అమోఘములైన తమ బాణములతో లంకను నిర్మూలింతురా! శ్రీరామునికి నాయెడ గల ప్రేమ అపారము. దానిని స్మరించి, యేనాటికైనను వచ్చి నన్ను చేకొనిపోగల డని ఆశపడి ప్రాణముతో ఉన్నాను.

హనుమంతుడు : (చేమోడ్చు గిలించి) తల్లీ, నీ విందున్న సంగతి శ్రీరామునికి తెలియదు. నీ వృత్తాంతము తెలిసినవెంటనే వచ్చి రాక్షసుల నందరను వధించి నిన్ను చేకొని పోగలడు. శ్రీరాముడు నీ కొరకుగా ఎంతో పరితపించుచున్నాడు. ఆయనకు ఆహారము మీదికి మనస్సు పోవుటలేదు. నిద్ర పట్టుటలేదు. ఎప్పుడైన కొంచెము కునుకు వచ్చినను "సీతా! సీతా!" అనుచు వెంటనే మేలుకొనును. ఏ దేని ఫలమునుగాని పుష్పమునుగాని చూచినప్పుడు నిన్ను తలచుకొని నిట్టూర్పులు పుచ్చుచుండును. అన్ని వేళలయందు నిన్ను గూర్చియే చింతించుచుండును. శ్రీరాముడు నిన్ను చేకొనిపోవు ప్రయత్నములోనే ఉన్నాడు.

సీత : హనుమంతుడా! నీ పలుకులు విషముతోకూడిన అమృతమువలె ఉన్నవి. శ్రీరాముడు నన్నే తలచుకొనుచున్నా డనినమాట సంతోషప్రదమైనను ఆయన శోక నిమగ్నుడై యున్నా డనుమాట బాధకలిగించుచున్నది.

అమృతం విష సంసృష్టం త్వయా వానర భాషితం
యచ్చ నాన్యమనా రామో యచ్చ శోకపరాయణః. 37-2

గొప్ప ఐశ్వర్యము లభించుటగాని దారుణమైన ఆపద సంభవించుటగాని కేవల దైవకృతములు. దైవము మనలను త్రాటితో బంధించినట్లు బంధించి యీడ్చుకొని పోవును.

ఐశ్వర్యే వా సువిస్తీర్ణే వ్యసనే వా సుదారుణే
రజ్జ్వేవ పురుషం బద్ధ్వా కృతాంతః పరికర్షతి. 37-3

మన చేతిలో ఉండున దేదియు లేదు. దైవము నతిక్రమించుటకు ఎవ్వనికిని సాధ్యము కాదు. కానిచో శ్రీరామునికిని లక్ష్మణునికిని నాకును ఈ కష్టము లేమి! నా దుఃఖమునకు అంతమే లేదా! శ్రీరాముడు వచ్చి రావణుని వధించి లంకను నిర్మూలించి న న్నెప్పుడు చూచునోగదా!

హనుమంతుడా! నాకు రావణుడు నిర్ణయించిన గడువు రెండు నెలలు మాత్రమే మిగిలియున్నది. నన్ను శ్రీరాముని కర్పింపు మని విభీషణుడు ఎంతదూరమో చెప్పినాడు కాని రావణు డందుకు సమ్మతింపలేదు. విభీషణుని కొమారిత 'నల' తన తల్లి పంపున వచ్చి యీ సమాచారము నాకు చెప్పినది.

శ్రీరాముని యందు ఉత్సాహము, పౌరుషము, బలము, దయ మున్నగు సుగుణము లన్నియు ఉన్నవి. నీవు పోయి నా విషయ మంతయు ఆయన కెరుకపరచి ఇక్కడికి వేగిరము వచ్చునట్లు చేయుము. శ్రీరాముని ప్రభావము నాకు తెలియనిది కాదు. జనస్థానములో పదునాలుగువేల రాక్షసులను తా నొక్కడే సంహరించి యుండలేదా! శ్రీరాముని బాణమునకు అడ్డులేదు.

హనుమంతుడు: తల్లీ! కొంచెము ఓపికపట్టుము. నే నక్కడికిపోయి చెప్పుటయే తడవు. శ్రీరాముడు వెంటనే సైన్య సమేతుడై రాగలడు. పోనిమ్ము! ఒక పని చేయ రాదా! నీ దుఃఖమును ఇప్పుడే పోగొట్టెదను. నా వీపుపై నెక్కి రమ్ము. అగ్నిహోత్రుడు హవిస్సును కొనిపోయి ఇంద్రున కిచ్చునట్లు నేను నిన్ను కొనిపోయి శ్రీరామున కర్పింతును.

[ఈ ఉపమానము చక్కగా అర్థయుక్తముగా నున్నది. అగ్నిహోత్రు డెంత పవిత్రుడో హనుమంతు డంత పవిత్రుడు!]

అహం ప్రస్రవణస్థాయ రాఘవా యాద్య మైథిలి
ప్రాపయిష్యామి శక్రాయ హవ్యం హుత మివానలః 37-21

సీతాదేవి హనుమంతుని మాటలను విని ఆశ్చర్యపడినది.

సీత: హనుమా! అంతదూరము నన్ను మోసికొని పోగలవా! అల్ప శరీరుడవుగదా! నన్నెక్కించుకొని ప్రయాణము చేయగలవా! నీ మాటకు అర్థ మేమైన ఉన్నదా! మొత్తమునకు కోతివే అనిపించితివి.

హనుమంతుడు సీతాదేవి పరిహాసవాక్యములను విన్నాడు. ఇంతకుముందు ఎప్పుడుగాని తనను ఇంతమాట అనలేదు. క్రొత్తగా కలిగిన యీ అవమానమును గురించి చింతించినాడు.

చింతయామాస లక్ష్మీవా న్నవం పరిభవం కృతమ్. 37-31

"సీతాదేవి నా ప్రభావమునుగూర్చి యెరిగినట్లులేదు. నా నిజరూపమును ప్రదర్శించెదను" అని ఆలోచించి హనుమంతుడు తన శరీరమును పెంచి మేరుమందర పర్వతములవలె తేజరిల్లుచు సీతాదేవి యెదుట నిలబడి

హనుమంతుడు: తల్లీ, చూచితివా నా రూపమును. రావణ సహితముగా లంకను పెల్లగించి కొనిపోగలను. నీవు నా సామర్థ్యమును గురించి శంకింపకుము. ఒక్క క్షణములో నిన్ను శ్రీరాముని చెంతకు చేర్పగలను. మీ అందరి దుఃఖములు తీరిపోవును.

సీత: హనుమా! ఏదో మాటవరుస కంటినిగాని నీ ప్రభావము నాకు తెలియక యున్నదా! నీ యందు వాయుదేవుని వేగము అగ్నిదేవుని తేజస్సు నెలకొనియున్న వని నాకు తెలియదా! సామాన్యుడవైనచో సముద్రమును లంఘించి రాగలవా! నీవు నన్ను సురక్షితముగా కొనిపోగల వని నాకు తెలియును. అయినను శ్రీరాముని కార్యము చెడకుండునట్లు చూడవలయునుగదా! నేను నీ వెంటవచ్చుట సరి కాదు. దీనికి అనేక కారణము లున్నవి. వినుము.

నీవు నన్ను మోసికొని వాయువేగముతో సముద్రము మీదుగా పోవునప్పుడు నేను భయపడి సముద్రములో పడిపోవచ్చును. రాక్షసులు నిన్ను వెంబడింతురు. నీవు వారితో యుద్ధము చేయవలసియుండును. వారితో యుద్ధ మాడుదువా, నన్ను రక్షించుకొందువా? పెద్ద చిక్కు రాగలదు. మీ యుద్ధమును చూచి నేను భయపడి నీ వీపుపైనుండి పడిపోవచ్చును. అంతట రాక్షసులు నన్ను పట్టుకొనిపోయి మరియొక రహస్య ప్రదేశమున దాచినను దాచగలరు; లేక నన్ను వధించినను వధింతురు. ఎట్లైనను నీ శ్రమ అంతయు వ్యర్థమైనట్లే కదా!

హనుమా! నీవు రాక్షసులను వధింపగలవు. కాని ఆపని నీవు చేయుదువేని శ్రీరాముని కీర్తి మరుగుపడదా!

మరియొక కారణమును వినుము. నేను పరపురుషుని స్పృశింపను. 'రావణుడు నిన్ను స్పృశింపలేదా!' అని అందువేమో! అది బలవంతముగా జరిగిన పని.

కావున శ్రీరాముడు స్వయముగా వచ్చి రావణుని సబాంధవముగా సంహరించి నన్ను చేకొనిపోవుటయే తగినపని.

[రావణుడు సీతాదేవిని అపహరించి తెచ్చినాడు. ఆమెను గుట్టుగా హనుమంతుడు తీసికొని పోయినచో దొంగకు శిక్ష యేది!]

యది రామో దశగ్రీవ మిహ హత్వా సబాంధవమ్
మా మితో గృహ్య గచ్ఛేత త త్తస్య సదృశం భవేత్. 37-62

హనుమా! నీవుపోయి రామలక్ష్మణులను వానర సైన్యములను శీఘ్రముగా తోడ్కొనివచ్చి నా దుఃఖమును బాపుము.

*హనుమంతుడు*: తల్లీ! ఎంతచక్కని పలుకు పలికితివి! పతివ్రత యగు నీవు తప్ప మరి యొక రిట్లు పలుకగలరా! మహాత్ము డగు శ్రీరామునికి తగిన పత్ని వనిపించు కొంటివి. అక్కడ శ్రీరాముడు నిన్ను తలచుకొని వేదన పడుచుండుట చూచి నాను. ఇక్కడ నీ వనుభవించుచున్న బాధలను చూచినాను. మీ దుఃఖమును చూడజాలక మీ ఇరువురను ఒకటిగా జేయుట బాగుండు నని తోచి నా వీపు పై నెక్కి రమ్మని చెప్పితిని. కాని నీవు చెప్పినదే సరియైన మాట. ఇక్కడ రావణా సురుని తృణీకరించి నీ వాడిన మాటలు, నీవు పడుచుండుబాధ, నీకు ప్రాణము మీదకూడ విసువు పుట్టినసంగతి అన్నింటిని నేను శ్రీరామునికి నివేదించి ఆయన వెంటనే బయలుదేరి వచ్చునట్లు చేయుదును.

నేను వచ్చి నీతో మాటలాడినట్లు శ్రీరామునికి నమ్మకము కలుగుట కేదైన ఆనవాలు నిమ్ము.

*సీత*: హనుమా! మంచిగుర్తు నొకదానిని వినుము. నా మాటలుగా శ్రీరామునితో ఇట్లు చెప్పుము.

"నాథా! గంగానదికి సమీపమున సిద్ధాశ్రమ ప్రాంతములో చిత్రకూటపర్వతపు ఈశాన్యపాదమున మన మొక ఆశ్రమమునం దుండువారము. జ్ఞాపకమున్నదా! ఒక నాడు మనము పుష్పవనమున విహరించుటలో నేను అలసిపోగా, నన్ను నీ అంకమున చేర్చుకొంటివి. ఒక వాయసము వచ్చి నన్ను పొడిచినది. నే నెంత తోలినను కదలక నన్ను పొడిచి నా మాంసమును తినుచుండినది. నా చీర జారిపోయినది. బిగించి కట్టుకొనదలచి మొలనూలు సవరించుకొనుచుండగా నీవు నన్ను పరిహసించితివి. నేను సిగ్గుపడినాను. నేను అలసిపోయి మరల నీ అంకము నాశ్రయించితిని. నేను కోపించియుండుట చూచి నీవు నన్ను బుజ్జగించినావు. ఆ తరువాత నాకు నిద్ర పట్టినది. ఆ వాయసము మరలివచ్చి

నన్ను స్తనాంతరమున గాయపరచినది. నా శరీరమునుండి రక్తము స్రవించి నీ మీద పడినది. నీవు వాయసమును చూచి కోపించి ఒక దర్భను గైకొని బ్రహ్మాస్త్రమున అభిమంత్రించి వాయసముపై ప్రయోగించితివి. ఇంద్రుని సుతుడైన ఆ వాయసము నీ అస్త్రమునుండి తప్పించుకొనుటకు ముల్లోకములును తిరిగి రక్షకుని కానక మరల నీయొద్దకు వచ్చి నిన్ను శరణువేడినది. బ్రహ్మాస్త్రము అమోఘము గనుక నీవు వాయసము కుడికంటినిమాత్రము కొట్టి దానిని ప్రాణముతో విడిచితివి. నాథా! నా నిమిత్తము ఒక కాకిమీద బ్రహ్మాస్త్రమును ప్రయోగించినవాడవు ఇప్పు డేల ఉపేక్షించుచుంటివి. దయ గలిగియుండుట పరధర్మ మని నీవే యెన్నిపర్యాయములో చెప్పియున్నావు. ఆ దయనైనను నా యెడ చూపకూడదా! నీయట్టివాడు నాథుడుగా ఉండియు నే నీ రాక్షసుల నడుమ అనాథవలె ఉండవలసినదేనా!"

హనుమా! ఈ మాటలు శ్రీరామునితో చెప్పుము. రామలక్ష్మణులు పరాక్రమశాలురు. కాని వారికి నా మీద దయరాలేదు. అన్న అనుజ్ఞ గైకొని ఆ లక్ష్మణుడైనను రాకూడదా! అన్నిటికిని నా దుష్కృతమే కారణము. వారి ననుకొని లాభ మేమి.

**హనుమంతుడు :** తల్లీ! దుఃఖింపకుము. ఎంతెంతో శ్రమపడి నిన్ను దర్శింపగలిగితిని. ఇది సంతోషమునకు సమయమేగాని దుఃఖమునకు కాదు. నే నిప్పుడే పోయి రామలక్ష్మణులను వానరసైన్యమును తోడ్కొనివచ్చెదను. నీ దుఃఖము తీరిపోవును. రామలక్ష్మణులకు చెప్పవలసినమాట లేవైనను చెప్పుము.

**సీత :** హనుమా! శ్రీరాముని ఎంతో అడిగితి నని చెప్పి నాకుగా సాష్టాంగనమస్కారము చేయుము.

శ్రీరామునియెడ పితృభక్తియు, నా యెడ మాతృభక్తియు కలిగి సర్వసుఖములు పరిత్యజించి మాతో అడవికి నడచిన ఆ సుగుణుని లక్ష్మణుని ఎంతో అడిగితి నని చెప్పుము.

పితృవ ద్వర్తతే రామే మాతృవ న్మాం సమాచరన్ 38-61

వృద్ధోపసేవీ లక్ష్మీవాన్ శక్తో న బహు భాషితా
రాజపుత్రః ప్రియ శ్రేష్ఠ స్సదృశ శ్శ్వశురస్య మే 38-62

మృదు ర్నిత్యం శుచి ర్దక్షః ప్రియో రామస్య లక్ష్మణః 38-64

[ఇదివరలో లక్ష్మణుని అనరానిమాట లని ఆశ్రమమునుండి పంపినందుకు సీతాదేవి పశ్చాత్తాపపడినట్లు తోపించుచున్నవి ఈమాటలు.]

హనుమా! శ్రీరాముడు నా దుఃఖమును పోగొట్టునట్లు చేయుము. ఈ కార్యమునకు కర్తవు నీవేసుమా! నీ ప్రేరణవల్లనే శ్రీరాముడు రాగలడు. ఏమి చేయుదువో మరి!

త్వ మస్మిన్ కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ
రాఘవ స్త్వ త్సమారంభా న్మయి యత్నపరో భవేత్. 38-66

నే నిక ఒక నెలమాత్రమే జీవించియుండెదను. ఈమాటకు తిరుగులేదు. హనుమా! ఇదిగో యీచూడామణిని శ్రీరాముని కిమ్ము. దీనిని చూచుటతోడనే నేను, నా మామగారు, నాతల్లి శ్రీరాముని జ్ఞప్తికి రాగలము. ఇది మంచి ఆనవాలు. కార్యమంతయు నీచేతిలో నున్నదిసుమా.

హనుమంతుడు చూడామణిని వ్రేలికి పెట్టుకొని సీతాదేవికి ప్రదక్షిణనమస్కారములు చేసి నిలబడినాడు. సీతాదేవిని దర్శించినందున ఆనందభరితుడై శ్రీరామునికి శుభవార్త నందించుటకు త్వరపడుచున్నాడు. తన శరీరము అక్కడ ఉన్నను మనస్సుచేత శ్రీరామునియొద్దకు చేరినాడు హనుమంతుడు.

హర్షేణ మహతా యుక్త స్సీతాదర్శనజేన సః
హృదయేన గతో రామం శరీరేణ తు నిష్ఠితః. 38-72

సీత: హనుమా! శ్రీరామునికి పౌరుషము పురికొల్పు మాటలు చెప్పి త్వరగా వచ్చునట్లు చేయుము. ఈ మాత్రము మాటసాయముచేసి పుణ్యము కట్టుకొనుము.

జీవంతీం మాం యథా రామ స్సంభావయతి కీర్తిమాన్
త త్తథా హనుమ న్వాచ్యో వాచా ధర్మ మవాప్నుహి. 39-10

(హనుమంతుని మాటి మాటికి చూచుచు) హనుమా! నిన్ను చూచుటవలన నా దుఃఖము కొంచెము శమించుచున్నది. నీవు ఒక రహస్యప్రదేశమునం దుండి కొంత విశ్రమించి రేపు పోరాదా! నీవిప్పుడే పోవుదువేని నా దుఃఖము వృద్ధియగును. అందువల్ల మరణించినను మరణింతును.

హనుమంతుడు: తల్లీ! దుఃఖపడకుము. నేను పోయి శ్రీరాముడు త్వరలో వచ్చునట్లు చేయుదును.

సీత: హనుమా! ఒక సందేహము నన్ను బాధించుచున్నది. రామలక్ష్మణులును వానర సైన్యములును సముద్రము నెట్లు దాటగలరు? దానిని లంఘించుటకు నీకు, గరుత్మంతునికి, వాయుదేవునికి మీ ముగ్గురకుమాత్రమే సాధ్యము. ఇతరు లెట్లు దాటి రాగలరు. దీని కేమి సమాధానము చెప్పుదువు.

హనుమంతుడు: దానినిగూర్చి నీ వేమియు దిగులొందకుము. సుగ్రీవుడుగాని అతని సైనికులుగాని గొప్ప పరాక్రమవంతులు. అందరు ఈ భూమండలమును అనేక పర్యాయములు చుట్టివచ్చియున్నారు. ఈ సముద్రము వారికొక లెక్కకాదు. సుగ్రీవుని సన్నిధిలో ఉన్నవా రందరు నన్ను మించినవారేగాని నాకంటె తక్కువవా డెవ్వడును లేడు. ఇట్టిపనులమీద తక్కువవారినే పంపుదురుగాని గొప్పవారిని పంపుదురా! నేనే యీసముద్రమును దాటిరాగలిగితి ననగా వారి మాట ప్రత్యేకముగా చెప్పవలయునా!

[ఈ మాటలు హనుమంతుడు తప్ప అన్యులు అనగలరా?]

మద్విశిష్టాశ్చ తుల్యాశ్చ సంతి తత్ర వనౌకసః
మత్తః ప్రత్యవరః కశ్చిన్నాస్తి సుగ్రీవ సన్నిధౌ. 39-38

అహం తావదిహ ప్రాప్తః కిం పునస్తే మహాబలాః
నహి ప్రకృష్టాః ప్రేష్యంతే ప్రేష్యంతే హీతరే జనాః. 39-39

వలయునేని రామలక్ష్మణులను నావీపుపై నెక్కించుకొని వచ్చెదను. నీ వేమియు దిగులు పడకుము. శీఘ్రకాలములోనే రామలక్ష్మణులు వచ్చి రావణుని వధింపగలరు. నేను వెళ్ళి చెప్పుటయే ఆలస్యము. సెలవిమ్ము.

సీత: హనుమా! నీ మాటలు ధైర్యమును కలిగించుచున్నవి. పోయినప్రాణము మరలి వచ్చినట్లయినది. నేను త్వరగా శ్రీరాముని చెంతకు చేరు ఉపాయము నాలోచింపుము.

ఇదివరకు చెప్పినవిగాక మరియొక ఆనవాలు చెప్పుచున్నాను వినుము. శ్రీరామునితో నామాటగా ఇట్లు పలుకుము. "నాథా! ఒకనాడు నా తిలకము కొంచెము చెదరియుండినది. అప్పుడు నీవు మణిశిలతో నా చెక్కిలిమీద బొట్టు పెట్టిన సంగతి జ్ఞాపక మున్నదా! నీవు నన్ను రక్షించుట కేలరాకయున్నావు. నేను రాక్షసుల చేతిలో చిక్కి యెంతో దుఃఖములో నున్నాను. నా చెంతనుండిన చూడామణిని చూచి నిన్ను చూచినట్లు భావించి కొంత ఊరట పొందుచుంటిని. ఆ చూడామణిని సైతము ఇప్పుడు నీకొరకు పంపుచున్నాను. అందువలన ఆ కొంత ఊరటయు పోయినది. నిన్ను బాసి ఒక నెలకంటె ఎక్కువకాలము జీవించియుండజాలను. బ్రతికియున్నచో, ఏనాటికైనను నిన్ను కలిసికొనవచ్చునని ఆశపెట్టుకొని, యీ బాధ లన్నింటిని నిన్ను తలచుకొని భరించుచున్నాను"

హనుమా! ఈ మాటలు శ్రీరామునికి చెప్పి త్వరగా తోడ్కొనిరమ్ము.

హనుమంతుడు : తల్లీ ! నీ దుఃఖము అంతమొందుకాలము వచ్చినది. నీవు సంతోషముగా ఉండుము.

ఇమం ముహూర్తం దుఃఖానా మంతం ద్రక్ష్యసి భామిని. 40-14

తల్లీ ! నాకు మరి యేదైన ఆనవాలు చెప్పుము.

సీత : నేను చెప్పినవి చాలును. ఈ చూడామణిని చూచుటతోడనే శ్రీరామునికి నీ మాటలయందు నమ్మకము కలుగును. నీవు పోయి ఆయనను ఇచ్చటికి త్వరగా ప్రయాణము చేయింపుము.

హనుమంతుడు సీతాదేవికి నమస్కరించి తిరుగుప్రయాణమునకు పూనుకొన్నాడు. సీతాదేవి "నీకు మార్గము మంగళకర మగునుగాక" అని ఆశీర్వదించినది.

## అశోకవన భంజనము

హనుమంతుడు అక్కడినుండి కదిలివచ్చి కొంత ఆలోచనలో పడినాడు.

హనుమంతుడు : (తనలో) సీతాదేవిని సందర్శించుట అయినది. ఇంతటితో వెళ్ళుట సరికాదు. రావణుని బలము విషయము తెలిసికొనిపోవుదునేని ఉపయోగకరముగా నుండును.

ఎవ్వడు తనకు నిర్దేశింపబడిన కార్యమును చేసి అందుకు ప్రతికూలము కాని ఇతర పనులనుకూడ సాధించునో అట్టివాడే కార్యసాధకు డనిపించుకొనగలడు. ఒక చిన్నపనిని సైతము ఒక్క కారణమును మాత్రమే ఆధారపరచుకొని సాధింపలేముగదా ! అట్టిచో ఇటువంటి గొప్ప కార్యములను సాధింపగలమా !

కార్యే కర్మణి నిర్దిష్టే యో బహూన్యపి సాధయేత్
పూర్వకార్యావిరోధేన స కార్యం కర్తు మర్హతి. 41-5

న హ్యేక స్సాధకో హేతు స్స్వల్పస్యాపీహ కర్మణః
యో హ్యర్థం బహుధా వేద స సమర్థోఽర్థసాధనే. 41-6

కొలువులో నున్నప్పుడు రావణాసురుని చూతునేని అతని మనస్సుకూడ కొంత గ్రహింపవచ్చును. దీనికి ఉపాయ మేమి ? రాక్షసుల విషయములో సామదాన భేదములు పనిచేయవు. దండోపాయమునే ప్రయోగింపవలయును. ఇప్పుడు యుద్ధము సంభవించు మార్గమును వెదకవలయును. ఈ అశోకవనమును ధ్వంసము చేయుదును. అంతట రావణుడు కోపించి నా మీదికి రాక్షసులను పంపగలడు. నేను వారిని వధింతును. మన బలముకూడ కొంత ప్రదర్శిత మగును.

న సామ రక్షస్సు గుణాయ కల్పతే
న దాన మర్థోపచితేషు యుజ్యతే
న భేదసాధ్యా బలదర్పితా జనాః
పరాక్రమస్త్వేవ మమేహ రోచతే. 41-3

తత స్సమాసాద్య రణే దశాననం
సమంత్రివర్గం సబల ప్రయాయినం
హృది స్థితం తస్య మతం బలం చ వై
సుఖేన మత్వాహ మితః పున ర్వ్రజే. 41-9

ఈ విధముగా ఆలోచించి హనుమంతుడు అశోకవనమును ధ్వంసముచేయ సాగినాడు.

[ఈ వనభంగము కేవల వానరచేష్టకాదు. గొప్ప రాజనీతిని అనుసరించి చేసిన కార్య మని గమనింపదగియున్నది.]

అశోకవనము ఎంతో మనోహరముగా నుండిన ప్రమదావనము. దానిని హను మంతుడు నాశనమొనర్చినాడు. అప్పుడు కలిగిన శబ్దమునకు లంకాపురిలో అలజడి పుట్టి నది. ఎక్కడివా రక్కడ భయపడి పరుగులెత్తసాగినారు. అప్పటివరకు నిద్రించుచుండిన రాక్షసస్త్రీలు మేలుకొని పర్వతాకారుడైన హనుమంతుని చూచి భీతిజెందినారు. వారు సీతాదేవిని సమీపించి "ఎవ్వడువీడు ? ఇక్కడికి వచ్చిన కారణ మేమి ? నీతో ఏమి మాట లాడినాడు ? నీకేమియు భయములేదు; అతని వృత్తాంతము చెప్పుము" అని అడిగినారు.

సీత : అనేకవిధముల భయంకరరూపములనుధరించు రాక్షసుల సంగతి నాకేమి తెలియును? ఇతని విషయము మీకే తెలియవలెను. పాము పాదములు పాముకేగదా తెలియగలవు.

యూయమేవాభిజానీత యోఽయం యద్వా కరిష్యతి
అహిరేవ హ్యహేః పాదాన్విజానాతి న సంశయః. 42-9

నేనుకూడ ఇతని రూపమునుచూచి భయపడియున్నాను. ఇత డెవరో మీరే చెప్పుడు. ఇతడు వానరరూపమును దాల్చిన రాక్షసుడే అయియుండును.

అహ మప్యస్య భీతాస్మి నైనం జానామి కోఽన్వయం
వేద్మి రాక్షస మేవైనం కామరూపిణ మాగతమ్. 42-10

[ఈమాటలు నిజమెనా ! సీతాదేవి అబద్ధ మేల చెప్పినది ? అని కొందరు అందురేమో ! కాని ధర్మసూక్ష్మములను అర్థముచేసికొనుట సులభముకాదు. భారతము శాంతిపర్వము 3-45 లో భీష్ముడు ధర్మరాజునకు చెప్పినమాట యీ సందర్భమున గమనింపదగియున్నది.

"సత్యంబు పలుకుట సర్వధర్మములకు మిక్కిలి, యనృతంబు మేటిపాతకము, తద్విశేషంబుగలదు చెప్పెద, నొరు నర్థంబుఁ బ్రాణంబు నపహరింప జూచు పాతకులతో సూనృతంబాడుట పాపంబు, బొంకులు పలికి యట్టివారి హింసించుట వరధర్మ, మిది యొక్కడేల, భూతములకు హితముసేయు

బొంకులెల్లను ధర్మముల్, భూత బాధ
కంబు లగు నిక్కములు పాతకములు వినుము,
భూతముల దుష్ట శిష్టత్వములు వివేక
సూక్ష్మతా వేద్యములు, వాని జూడవలయు".]

రాక్షసస్త్రీ లందరు దశదిశలకు పరుగెత్తినారు. కొందరు ఈ సమాచారమును రావణునికి నివేదించుటకు వెళ్లినారు.

రాక్షసస్త్రీలు : (రావణునితో) మహాప్రభూ ! అనుపమ పరాక్రమశాలి యైన వానరు డొకడు సీతాదేవితో మాటలాడి రమ్యమైన మన ప్రమదావనమును ధ్వంసము చేసినాడు. సీతాదేవి ఆశ్రయించియుండిన చెట్టును మాత్రము ఏమియు చేయ లేదు. సీతను రక్షించుటకై అట్లుచేసెనో, లేక అలసిపోయి విడిపించెనో తెలియ లేదు-అతనికి అలసటయేమి? సీతను రక్షించుటకే అట్లు చేసియుండును. ఆ వాన రుని గురించి యెంత అడిగినను సీత చెప్పుటలేదు. వా డెవడో ఇంద్రుని దూతయో, కుబేరుని దూతయో, లేక రాముని దూతయో అయియుండును. మహారాజా ! వీడు రెండుతప్పులు చేసినాడు. సీతతో భాషించుట మొదటితప్పు, వనభంగము రెండవది. కావున అతనిని తప్పక దండింపవలయును.

ఈ మాటలు విని రావణుడు కోపోద్రిక్తుడై యెనుబదివేలమంది కింకరులను హనుమంతునిపైకి పంపినాడు. అగ్నిపైకి వచ్చు మిడుతల చందమున ఆ రాక్షసు లందరు హనుమంతునిపైకి దూకినారు. హనుమంతుడు సింహగర్జన చేసి రామలక్ష్మణులకును సుగ్రీవునికిని జయశబ్దములు పలికినాడు.

హనుమంతుడు : నేను కోసలేంద్రుడైన శ్రీరాముని దాసుడను. వాయుదేవుని పుత్రు డను. నాపేరు హనుమంతుడు. వేయిమంది రావణు లైనను నాతో యుద్ధము నకు చాలరు. రాక్షసుల కట్టెదుటనే లంకను నాశన మొనర్చి సీతాదేవికి నమస్క రించి వచ్చినపని చక్కబెట్టుకొని శ్రీరాముని చెంతకు పోగలను.

**జయ త్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః**
**రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః.** 42-33

దాసోఽహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్టకర్మణః
హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః. 42.34

న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః. 42.35

అర్దయిత్వా పురీం లంకా మభివాద్య చ మైథిలీం
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వ రక్షసామ్. 42.36

[అన్ని వివరములు తానే చెప్పుకొన్నాడు. పరాక్రమవంతులకు భయ మేమి ! రామ దాసునకు భయ మను మాటయే ఉండదు !]

## హనుమంతుడు రాక్షస సైన్యములను వధించుట

అశోకవనద్వారము చెంత ఉండిన ఒక ఇనుపగుదియను గైకొని హనుమంతుడు తన పైకి వచ్చిన యెనుబదివేల కింకరులను వధించినాడు.

హనుమంతుడు వనభంగము చేసినాడు గాని అక్కడ ఉండిన చైత్యప్రాసాదము మిగిలిపోయినది. హనుమంతుడు దానిచెంత కేగి గర్జించి అడ్డము వచ్చిన కావలివారిని మర్దించి ఒక స్థంభమును పెల్లగించి గిరగిర త్రిప్పి అగ్నిని సృజించి ప్రాసాదమును దహించినాడు. "నా వంటి శూరులు కోట్లకొలది ఉన్నారు. వా రందరు వచ్చి లంకను, రాక్షసులను, రావణుని భస్మము చేయగలరు. మహాత్ము డగు శ్రీరామునితో విరోధించినవారు బాగుపడజాలరు. ఇకపైన మీ రెవ్వరును ఉండరు. లంకాపురి ఉండదు. రావణుడును ఉండడు" అని గర్జించినాడు. మరల ద్వారము చెంత కరిగి శత్రువులను సంహరించుటకు సంసిద్ధుడై యుండినాడు.

కింకరులు మరణించినపిదప రావణుడు ప్రహస్తుని కుమారు డగు జంబుమాలిని హనుమంతునిపై కి పంపినాడు. కాని అతడుకూడ హనుమంతుని చేతిలోపడి మరణించి నాడు. ఆ తరువాత మంత్రికుమారులు ఏడుగురు రాగా, వారికిని అదేగతి పట్టినది. ఈ వార్త విని రావణునికి భయము తోచినది. సేనానాయకులను అయిదుగురిని పిలిచి "మీరు మెలకువ కలిగి ప్రయత్నింపవలెను. ఇతడు కేవల వానరు డని నాకు తోపలేదు. నే నింతకుపూర్వ మెందరు వానరులనో చూచితిని. వాలి, సుగ్రీవుడు, జాంబవంతుడు, నీలుడు, ద్వివిదుడు మున్నగువారిని అనేక కపివీరులను చూచితిని గాని ఇతనియందు వేగము తేజస్సు బలము పరాక్రమము బుద్ధి ఉత్సాహము అపూర్వముగా నున్నవి.

నైవం తేషాం గతి ర్భీమా న తేజో న పరాక్రమః
న మతి ర్న బలోత్సాహౌ న రూపపరికల్పనమ్. 46.10

వీ డెవరో వానరరూపముతో వచ్చిన మహాభూతము అయి యుండును. ఇంద్రుడు ఘోరతప మాచరించి మనలను వధించుటకు ఈ భూతమును సృజించి యుండును. ఈ వానరుని నిర్లక్ష్య భావముతో చూడరాదు. మీరు కడు జాగరూకులై యుండి వీనిని బంధింపుడు. తెలిసినదా!" అని హెచ్చరిక చేసి పంపినాడు. కాని హనుమంతుడు వారిని సైతము వరుసగా వధించినాడు.

## అక్షకుమార సంహారము

అటుతరువాత రావణుడు తనకుమారుడైన అక్షుని హనుమంతునిపైకి పంపినాడు. హనుమంతునికి అక్షకుమారునికి ప్రచండయుద్ధము జరిగినది. అక్షుడు సామాన్యుడు కాడు. హనుమంతుడు అక్షుని పరాక్రమమును గురుతించి వానిని వధించుటకు ఒక మార్గమును వెదకినాడు. వానిని కాళ్ళతో పట్టి పైకెత్తి వేయి పర్యాయములు గిరగిర త్రిప్పి నేలపైకి విసిరికొట్టి వధించినాడు.

## ఇంద్రజిత్తు హనుమంతుని బంధించుట

ఈ వార్త విని రావణునికి దుఃఖము వచ్చినది. దుఃఖముతోపాటు క్రోధము కలిగినది. తనకుమారుడైన ఇంద్రజిత్తును పిలిచి "కుమారా! యీ వానరు డెవడో గొప్ప వీరుడుగా నున్నాడు. నీకు దేహబలమేగాక అస్త్రబలముకూడ కలదుగదా! నీ వింతకుమున్ను ఎందరెందరు వీరులనో జయించియున్నావు. నీకు సాధ్యముకాని పని యేదియును లేదు. అయినను నీవు ఏమరుపాటులేక, బలాబలములు గమనించి, మెలకువ కలిగి ప్రవర్తించుట అవసరము. నిన్నిప్పుడు యుద్ధమునకు పంపుట అంత మంచిపని కాదేమో! కాని రాజధర్మమును అనుసరించి నిన్ను పంపవలసివచ్చినది. కావున నీవు బయలుదేరుము. యుద్ధమాడి శత్రువును జయించిరమ్ము" అని పలికినాడు.

ఇంద్రజిత్తు తండ్రికి ప్రదక్షిణము చేసి యుద్ధమునకు బయలుదేరినాడు. హనుమంతునికి ఇంద్రజిత్తునకు ఘోరయుద్ధము జరిగినది. ఇంద్రజిత్తు బాణములను ప్రయోగించినాడు. హనుమంతుడు ఆకాశమున కెగిరి బాణపాతమును తప్పించుకొని శత్రువుతో యుద్ధమాడినాడు. యుద్ధము తీవ్రముగా జరుగుచున్నది. హనుమంతుని వధించుట సాధ్యముకాదని ఇంద్రజిత్తు నిర్ణయించుకొని అతనిని బంధించుటకు ఉపాయ మాలోచించి బ్రహ్మాస్త్రమును ప్రయోగించినాడు. హనుమంతుడు కట్టువడి బ్రహ్మ తనకు ప్రసాదించిన వరమును స్మరించి బ్రహ్మాస్త్రమును గౌరవించుటకై కొంతకాలము నిశ్చేష్టుడై యుండినాడు. "రాక్షసులు నన్ను పట్టుకొన్నను దానివలన రాగల ఇబ్బంది యేమియును లేదు. రావణాసురునియొద్దకు కొనిపోవుదురేని అదియును మేలే" అని భావించినాడు.

హనుమంతుడు ఈవిధముగా ఉలుకు పలుకులేక పడియుండుట చూచి రాక్షసులు ధైర్యము తెచ్చుకొని హనుమంతుని సమీపించి అతనిని త్రాళ్ళతో బంధించినారు. హనుమంతుడు వారిని అడ్డుపెట్టలేదు. మరియొకదానితో బంధించినచో బ్రహ్మాస్త్ర బంధము నిలువదు కావున బ్రహ్మాస్త్రబంధము విడిపోయినది.

స బద్ధ స్తేన వల్కేన విముక్తోఽస్త్రేణ వీర్యవాన్
అస్త్రబంధ స్స చాన్యం హి న బంధ మనువర్తతే. 48-49

ఇంద్రజిత్తు దీని నంతయుచూచి దుఃఖించినాడు. "ఈ రాక్షసులు ఎంత తెలివి మాలినపని చేసినారు! బ్రహ్మాస్త్రమేమో ప్రతిహతమైనది. ఇకమీద మరియొక అస్త్రము పారదుగదా! నా శ్రమ అంతయు వ్యర్థమైపోయినది" అని చింతించినాడు.

[తెలిసి తెలియని భృత్యు లున్నచో ఇట్టి ప్రమాదములు జరుగుచుండును.]

## హనుమంతుని రావణునియొద్దకు కొనిపోవుట

వానరుడు చేతికి చిక్కినాడుగదా అని రాక్షసులు సంతోషించి హనుమంతుని కట్టెలతోను పిడికిళ్ళతోను యథేచ్ఛగా మర్దించి రావణాసురునియొద్దకు ఈడ్చుకొని పోయినారు.

రావణుడు సింహాసనము నలంకరించి కొలువుదీరి యున్నాడు. రావణుడు హనుమంతుడు ఒకరినొకరు చూచుకొన్నారు. హనుమంతుడు రావణుని ఆకారమును తేజస్సును చూచి ఆశ్చర్యచకితుడైనాడు.

హనుమంతుడు: (తనలో) ఆహా! రావణు డెంతకాంతితో వెలుగుచున్నాడు! ఇతని ఆకారము, ధైర్యము, బలము, తేజస్సు యెంత ప్రశంసనీయములు! వీనియందు అధర్మ మను దోషము లేనిచో ఇంద్రునికిని దేవలోకమునకును ప్రభువుగా ఉండదగినవాడు!

అహో రూప మహో ధైర్య మహో సత్త్వ మహో ద్యుతిః
అహో రాక్షసరాజస్య సర్వలక్షణ యుక్తతా. 49-17

య ద్యధర్మో న బలవాన్ స్యాదయం రాక్షసేశ్వరః
స్యాదయం సురలోకస్య సశక్రస్యాపి రక్షితా. 49-18

రావణాసురుడు హనుమంతుని తేజస్సును చూచి దిగులొంది "పూర్వము నేను కైలాసపర్వతమును ఊగించినప్పుడు నన్ను శపించిన నందికేశ్వరుడే యీ వానర రూపమున అవతరించి యుండునా! లేక బాణాసురు డీరూపమున వచ్చియుండునా" అని చింతించినాడు.

కిమేష భగవా న్నందీ భవే త్సాక్షా దిహాగతః
యేన శప్తోఽస్మి కైలాసే మయా సంచాలితే పురా 50-2

సోఽయం వానరమూర్తి స్స్యా త్కింస్వి ద్బాణో మహాసురః. 50-3

## రావణుని కొలువుకూటమున హనుమంతుడు

హనుమంతునిచూచి సభలోని రాక్షసు లందరు గుసగుస లాడసాగిరి. "ఎవ్వడు వీడు ? ఇక్కడికెందుకై వచ్చినట్టు? వీనిని వధించి భక్షించిన బాగుండును" అని అనేక విధములుగా భాషింపజొచ్చిరి. రావణుడు తన సేనాపతి ప్రహస్తుని పిలిచి "వీ డెవడో ! ఏల వచ్చెనో, అశోకవనము నేల ధ్వంసముచేసెనో, రాక్షసుల నేల వధించెనో, ఈ విషయములను అడిగి తెలిసికొనుము" అని ఆజ్ఞాపించినాడు.

ప్రహస్తుడు : ఓరీ వానరుడా ! నీకు వచ్చిన భయ మేమియులేదు. నిజము చెప్పుము. ఇంద్రుడుగాని, వరుణుడుగాని, యముడుగాని, విష్ణువుగాని నిన్ను పంపినారా చెప్పుము. నీవు రూపముచే వానరుడవుగా నున్నను నీ ప్రభావము మాత్రము అద్భుతముగా నున్నది. నీవు వానరుడ వని నమ్మజాలను. నీ విక్కడికి వచ్చిన పని యేమి ? నిజము పలుకుదువేని నిన్ను విడిచిపెట్టెదము. అబద్ధ మాడినచో బ్రదికి పోజాలవు.

[ప్రహస్తునికి బదులుచెప్పునా హనుమంతుడు ! రావణునితో మాటలాడుచున్నాడు]

హనుమంతుడు : మీరు చెప్పిన దేవత లెవ్వరును నన్ను పంపలేదు. నేను పుట్టుకచేతనే వానరుడను. రాక్షసేశ్వరుడ వగు నిన్ను చూచుటకు మార్గాంతరములేక అశోక వనమును కూల్చితిని. రాక్షసులు నా పైకి వచ్చిరి గనుక నన్ను రక్షించుకొనుటకై ప్రతియుద్ధము చేసితిని. బ్రహ్మదేవుడు నాకొక వరమును ప్రసాదించి యున్నాడు. బ్రహ్మాస్త్రముతో గాని ఇతరవిధమున గాని నన్ను బంధింప నెవ్వరికిని సాధ్యముకాదు. బ్రహ్మాస్త్ర మెప్పుడో విడిపోయినది. నిన్ను చూడ వలయు నను ఆశతో కట్టువడితిని.

నే నిక్కడికి ఒక రాచకార్యముమీద వచ్చితిని. నేను రామదూతను. మా ప్రభు వగు సుగ్రీవునియొద్దనుండి నీ కొక సందేశమును తెచ్చితిని. ఇహపరలోకములలో నీకు మేలు చేకూర్చు హితవాక్యమును సోదరభావముతో సుగ్రీవుడు చెప్పి పంపిన మాట నాలకించి శ్రీరామునియెడ నీవు చేసిన మహాపరాధమును సరిదిద్దుకొని సీతాదేవిని శ్రీరామునికి సమర్పింపుము.

నేను చెప్పుచున్న మాటలనుకూడ వినుము. శ్రీరాముడు అసమాన పరాక్రమ శాలి ; ఒక్కబాణముతో వాలిని వధించి సుగ్రీవునికి రాజ్యము సమకూర్చినాడు. సీతాదేవిని వెదకుటకై కోట్ల సంఖ్య వానరులు దేశ మెల్లెడల తిరుగుచున్నారు. వారు సామాన్యులుకారు. నేను సముద్రము లంఘించి ఇక్కడికి వచ్చి సీతాదేవిని సందర్శించితిని. నేను వాయుదేవుని కుమారుడను. నా పేరు హనుమంతుడు. నీవు త్వరలోనే నాశనము కానున్నావు. నీయట్టి పండితుడు ఇట్టి నీచ కార్యమును చేయదగునా! ఎంతో తపస్సు చేసినవాడవు. పరదారలను అపహరించుట యెంతతప్పు. తెలిసినవాడు చేయదగిన పనియేనా ఇది. ఈ అకార్యము నిన్ను సమూలముగా నాశనము చేయ గలదు.

న హి ధర్మవిరుద్ధేషు బహ్వపాయేషు కర్మసు
మూలఘాతిషు సజ్జన్తే బుద్ధిమంతో భవద్విధాః. 51-18

"నాకు వర మున్నది కదా! నన్నెవడు వధింపగలడు" అని భావించుచుంటివి కాబోలు! శ్రీరాముడు మానవుడు. సుగ్రీవుడు వానరుడు. కావున నీ వరము వారిపట్ల వర్తింపదు. నీ తమస్సునుండి మేల్కొనుము. సీతాదేవి లంకను, నిన్ను సమూలముగా నాశనముచేయు కాళరాత్రి యని యెరుగుము. ఆమె తేజస్సుచే ఇప్పటికే యీ లంక దహింపబడి యున్నది చూడుము. శ్రీరాముని ప్రభావము మరచిపోకుము. సమస్త లోకములను సంహరించుటకును, వలయునేని వానిని మరల యథాప్రకారము సృష్టించుటకును శ్రీరామునికి శక్తి కలదు.

సర్వాన్ లోకాన్ సుసంహృత్య సభూతాన్ సచరాచరాన్
పునరేవ తథా స్రష్టుం శక్తో రామో మహాయశాః. 51-39

[దేనినైనను నాశన మొనరించుటకు శక్తిగలవారు ఎందరో ఉండవచ్చునుగాని. యథాప్రకారముగా పునస్సృష్టిచేయగల శక్తి శ్రీరామునికి మాత్రమేకలదు. కావున నాశనము చేయుటకు సామాన్యులు పూనుకొనకూడదు.]

శ్రీరామునికి అపకార మొనర్చి ఇంద్రుడైనను సుఖముగా ఉండలేడు. నీవంటి వానిది ఒక లెక్కయా! శ్రీరాముడు వధింపదలచుకొన్నవానిని రక్షింపగలవాడు ముల్లోకములలో లేడు

నేనే యీలంకను భస్మము చేయగలను. కాని ఆపనిని శ్రీరాముడే స్వయముగా చేయదలచియున్నాడు ; గనుక ఇంతతో వదలిపెట్టితిని. నామాట వినుము; ఎందుకు శ్రీరాముని చేతిలోబడి నీ ప్రాణములను, పోగొట్టుకొందువు. సీతాదేవిని శ్రీరామునికి సమర్పింపుము.

సర్వలోకేశ్వర స్త్యైవం కృత్వా విప్రియ ముత్తమమ్
రామస్య రాజసింహస్య దుర్లభం తవ జీవితమ్. 51-43

హనుమంతుని మాటలు విని రావణుడు పట్టరాని కోపముతో "ఈ వానరుని వధింపుడు" అని అజ్ఞాపించినాడు.

విభీషణుడు దానికి అంగీకరింపలేదు.

*విభీషణుడు :* అన్నా ! ఈపని నీకు తగునా! దూత నెవ్వరైన చంపుదురా ! దూత వధము రాజధర్మమునకు విరుద్ధము కాదా ! నీవంటి పండితుడే ఇట్లొనర్చినచో శాస్త్ర పాండిత్యము వృథాశ్రమ అన్నమాట !

ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ రాజధర్మ విశారదః
పరావరజ్ఞో భూతానాం త్వమేవ పరమార్థవిత్ 52-7

గృహ్యన్తే యది రోషేణ త్వాదృశోఽపి విపశ్చితః
తత శ్శాస్త్ర విపశ్చిత్త్వం శ్రమ ఏవ హి కేవలమ్. 52-8

నీవు బాగుగా ఆలోచించి దూతకు యుక్తమైన శిక్ష విధింపుము.

*రావణుడు :* విభీషణా ! పాపిని వధించుటవలన పాప మెందైన కలుగునా ! పాపిష్ఠుడైన యీవానరుని వధించుటయే యుక్తము.

*విభీషణుడు :* అన్నా ! కోపమునువిడిచి సమచిత్తుడవై చక్కని ఆలోచన చేయుము. దూతకు తగిన శిక్షలు శాస్త్రములలో ఎన్నియో చెప్పబడియున్నవి. అంగ వికృతి కావించుట, కొరడాతో కొట్టుట, శిరము గొరిగించుట, శరీరమున ముద్ర వేయుట మున్నగు శిక్షలు చెప్పబడియున్నవేకాని దూతను వధించుట అను మాట మనము విననైన వింటిమా !

వైరూప్య మంగేషు కశాభిఘాతో
మౌణ్డ్యం తథా లక్షణ సన్నిపాతః
ఏతాన్ హి దూతే ప్రవదంతి దండాన్
వధస్తు దూతస్య న న శ్రుతోఽపి. 52-15

మొదటిమాట—ఈవానరుని చంపినందువలన మనకు వచ్చిన లాభ మేమి ? వీనిని పంపినవారిపై నీకోపమును చూపి వారిని వధించుట న్యాయముగాని పరుల సందేశము నందించు దూతను వధించుట పాడికాదు. అదిగాక మరొక్కమాట వినుము. ఈ వానరుని వధింతుమేని యీ సముద్రమును దాటి రాగలవాడు మరియొక్క డుండునా ?

అపి చాస్మి న్హతే రాజ న్నాన్యం పశ్యామి ఖేచరమ్
ఇహ యః పునరాగచ్ఛే త్వరం పారం మహోదధేః 52.20

రామలక్ష్మణులకు సీతావృత్తాంతము తెలియు మార్గమేమున్నది. తెలియనిచో వారు యుద్ధమునకు వెడలివచ్చుట కుదురునా? నీ వంటి యుద్ధప్రియుడు సిద్ధముగా నున్న యుద్ధమును వదలుకొనునా? నీ పరాక్రమమును రామలక్ష్మణులపై ప్రయోగింపుము. దూతను వధించుటలో లాభముగాని కీర్తిగాని లేదు.

రావణుడు: సరే! నీ మాటకూడ సమంజసముగనే ఉన్నది. దూతకు తగిన శిక్షనే విధించెదను. వానరులకు వాలము మిక్కిలి ప్రియమైన అవయవము. ఈ వానరుని వాలమును కాల్చివేయుడు. ఇతడు తోకను పోగొట్టుకొని వెళ్లునేని, వీని స్నేహితులు, బంధువులు వీనినిచూచి పరిహసింతురు. అదియే వీనికి తగిన శాస్తి. వీని తోకకు నిప్పంటించి పుర మంతయు ఊరేగింపుడు. మనవారు చూచి సంతోషపడుదురు.

ఆజ్ఞాపయ ద్రాక్షసేంద్రః పురం సర్వం సచత్వరమ్
లాంగూలేన ప్రదీప్తేన రక్షోభిః పరిణీయతామ్. 53.5

## హనుమంతుని తోకకు గుడ్డలుచుట్టి కాల్చుట

రావణుని ఆజ్ఞననుసరించి రాక్షసులు హనుమంతుని తోకకు గుడ్డలుచుట్టి దానిని నూనెలో ముంచి నిప్పంటించి వాడవాడల త్రిప్పుచున్నారు. రాక్షసులు గుంపులు గుంపులుగాకూడి ఈ చిత్రమును తిలకించుచున్నారు.

హనుమంతుడు: (తనలో) నేనీ రాక్షసు లందరను ఒక్కక్షణములో ఊదివైచి తప్పించుకొని పోగలను. కాని దానివల్ల లాభ మేమి? శ్రీరాముని కార్యమునకు ఇదియు ఒక అనుకూల్యమే. రాత్రివేళ నగరదుర్గములను చక్కగా పరీక్షించుటకు వీలు కాలేదు. ఇప్పుడు పగటివేళ నాలుగు ప్రక్కలను తిరిగి చూచి విశేషములను సమగ్రముగా గ్రహింపవచ్చును.

రాత్రౌ న హి సుదృష్టా మే దుర్గకర్మ విధానతః
అవశ్యమేవ ద్రష్టవ్యా మయా లంకా నిశాక్షయే. 53.15

రాక్షసులు భేరులు వాయించుచు, శంఖములు పూరించుచు, హనుమంతుని పురిలో త్రిప్పుచున్నారు. ఇండ్లలోనుండి స్త్రీలు, బాలురు అందరును వచ్చి వినోదము చూచుచున్నారు. ఊరంతయు పెద్దరొద చెలరేగినది. ఈవార్తను రాక్షసస్త్రీలు సీతాదేవికి తెలియజేసినారు. సీతాదేవి దుఃఖించి హనుమంతునికి మేలు చేయగోరి అగ్నిహోత్రుని ఉపాసించినది.

## సీతాదేవి అగ్నిహోత్రుని ఉపాసించుట

సీత : నేను పతిసేవ చేయుదాననేని, నేను తపమాచరించి యుందునేని, నేను పతివ్రతనే అగుదునేని, హనుమంతునికి అగ్నిహోత్రుడు చల్లనివా డగునుగాక !

శ్రీరామునికి నాయెడ కొంచమేని దయ గలదేని హనుమంతునికి అగ్నిహోత్రుడు చల్లనివా డగునుగాక !

యద్యస్తి పతిశుశ్రూషా యద్యస్తి చరితం తపః
యది చాస్త్యేకపత్నీత్వం శీతో భవ హనూమతః. 53-28

యది కించి దనుక్రోశ స్తస్య మయ్యస్తి ధీమతః
యది వా భాగ్యశేషో మే శీతో భవ హనూమతః. 53-29

ఈవిధముగా సీతాదేవి అగ్నిహోత్రుని ప్రార్థించినది. హనుమంతునికి అగ్ని బాధ యేమియు కలుగలేదు, వాయుదేవుడు తనకుమారునిపై చల్లగా వీచినాడు. హనుమంతుడు ఆశ్చర్యపడి,

హనుమంతుడు : ఇది తప్పక శ్రీరామ ప్రభావమే. సముద్రపు గర్భమునుండి పర్వతమే పైకి రాగా ఇదియొక చిత్రమా ! సీతాదేవి దయవలన, శ్రీరాముని ప్రభావము వలన, నాతండ్రి వాయుదేవునికిని అగ్నిదేవునికి గల మైత్రివలన, ఈ అగ్నిహోత్రుడు నన్ను దహింపలేదు.

సీతాయా శ్చానృశంస్యేన తేజసా రాఘవస్య చ
పితుశ్చ మమ సఖ్యేన న మాం దహతి పావకః 53-38

[ఈ ఘట్టమునందు సీతాదేవి పాతివ్రత్యమహిమ శ్రీరామునికి ఆమె యందుగల ప్రేమ నిరూపింపబడియున్నవి. సీతాదేవి తన భర్తను యాపదను గూర్చి యెంత పరితపించినదో, భర్తని రక్షించుటకు యెంత శ్రమపడినదో గమనింపదగియున్నది. తన కష్టములను గురించి కూడ ఆమె యిట్లు పాటుపడలేదు. తమ బాధలను మఱచిపోయి ఎదుటివారి బాధలను తీర్ప బూనుట మహనీయుల లక్షణము.]

## లంకాదహనము

ప్రజ్వలించుచున్న వాలముతో హనుమంతుడు లంకాపుర మంతయు సంచరించుచున్నాడు. వేగముగా పైకెగిరి శరీరమును చిన్నదికావించి కట్లు వదిలించుకొన్నాడు. ఒక ఇనుప గుదియను గైకొని కావలివారిని వధించి ఆమీద ఏమి చేయవలయునా అని ఆలోచించుచున్నాడు.

హనుమంతుడు: నా వాలము నావహించియున్న అగ్నిహోత్రునికి సంతర్పణ చేయుట న్యాయము. కావున, ఈ గృహము లన్నింటిని అగ్నిపాలు చేసెదను.

యో హ్యాయం మమ లాంగూలే దీవ్యతే హవ్యవాహనః
అస్య సంతర్పణం న్యాయ్యం కర్తు మేభి ర్గృహోత్తమైః 54-5

హనుమంతు డిట్లు నిర్ణయించుకొని, ఇళ్లిల్లును తిరిగి తగులబెట్టినాడు. విభీషణుని ఇంటినిమాత్రము వదలిపెట్టినాడు

వర్జయిత్వా మహాతేజా విభీషణ గృహం ప్రతి. 54-16

[మాటసహాయము చేసినవానికి యథాశక్తి ప్రత్యుపకారము చేయుట ధర్మముకదా!]

అగ్నికి వాయువు తోడైనది. పుర మంతయు తగులబడిపోవుచున్నది. ఎక్కడ చూచినను ఏడ్పులు హాహాకారములు వినబడుచున్నవి. "ఇత డెవ్వడో రుద్రుడుగాని యముడుగాని అయియుండును. బ్రహ్మదేవుడే వానర రూపమున వచ్చి రాక్షసులను నాశనము చేయుచున్నాడు" అని లంకాపురవాసులు విలపించుచున్నారు. ఎక్కడ చూచినను "అయ్యోతండ్రీ! అయ్యోకొడుకా! హాప్రియుడా! హామిత్రుడా! పోయితివా" అను విలాపధ్వనులు వినిపించినవి.

హా తాత హా పుత్త్రక కాంత మిత్త్ర
హా జీవితం భోగయుతం సుపుణ్యం
రక్షోభి రేవం బహుధా బ్రువద్భి
శ్శబ్దః కృతో ఘోరతర స్సుభీమః. 54-41

పట్టణ మంతయు దగ్ధమయినది. దేవతలు సంతోషించినారు. మండుచున్న తోకను హనుమంతుడు సముద్రములో ముంచి చల్లార్చుకొన్నాడు. వెంటనే ఆలోచనలో పడినాడు.

## హనుమంతుని సంభ్రమము

హనుమంతుడు: (తనలో) నేనెంత తెలివితక్కువపని చేసితిని. సీతాదేవి సంగతినే మరచి పోయి లంక నంతయు తగులబెట్టితిని. కోప మెంతపనినైన చేయించునుగదా! కోపోద్రేకము కార్యాకార్యజ్ఞానమును నశింపజేయును. మండుచుండు అగ్ని హోత్రమును నీటిచే చల్లార్చునట్లు పొంగివచ్చుచున్న కోపమును తమ బుద్ధి విశేషముచే ఎవ్వరు అణచివేయగలరో వారే ధన్యులు.

[ఇంతకుముందేకదా మండుచున్న తోకను సముద్రజలముల ముంచి చల్లార్చినాడు. కావున ఉపమానము సొగసుగా నున్నది.]

కోపగించినవాడు చేయని పాపకార్య మేమున్నది? కోపించినవాడు గురువులను గూడ వధించును. యోగ్యులను సైతము పరుషవాక్కులచే అధిక్షేపించును. కోపించిన వానికి అనదగినమాటలు అనదగనిమాటలు ఉండవు. కుపితుడు ఎట్టి పనినైనను చేయును. అవాచ్యములు పల్కును.

ధన్యా స్తే పురుషశ్రేష్ఠా యే బుద్ధ్యా కోప ముత్థితం
నిరుంధంతి మహాత్మానో దీప్తమగ్ని మివాంభసా 55-4

క్రుద్ధః పాపం న కుర్యా త్కః క్రుద్ధో హన్యా ద్గురూనపి
క్రుద్ధః పరుషయావాచా నర స్సాధూ నధిక్షిపేత్. 55-5

వాచ్యావాచ్యం ప్రకుపితో న విజానాతి కర్హిచిత్
నాకార్యమ స్తి క్రుద్ధస్య నావాచ్యం విద్యతే క్వచిత్. 55-6

నా తెలివితక్కువచేత స్వామికార్యమును పాడుచేసితిని. నేను వచ్చిన పని యేమి? నేను చేసిన పని యేమి? పని నంతయు చేసినట్టే చేసితిని. సముద్రమును లంఘించి సీతాదేవిని సందర్శించితిని. ఈ వార్త శ్రీరామునికి చెప్పుటయే గదా తరువాయి. నేను కోపావేశముతో మొదటికే మోసము తెచ్చితిని.

ఈషత్కార్య మిదం కార్యం కృతమాసీ న్న సంశయః
తస్య క్రోధాభిభూతేన మయా మూలక్షయః కృతః. 55-11

పుర మంతయు భస్మీభూత మైనదిగదా! సీతాదేవి మాత్రము బ్రదికియుండునా? నే నిక జీవించియుండుట బాగులేదు. అగ్నియందో నీటిలోనో పడి ప్రాణత్యాగము చేయుదును. ఇట్టి తెలివిమాలిన పని చేసి, రామలక్ష్మణులకు గాని సుగ్రీవునికి గాని ముఖము చూపగలనా! తుదకు నా వానరస్వభావమే ప్రకటిత మయినది.

మయా ఖలు తదేవేదం రోషదోషా త్ప్రదర్శితమ్
ప్రథితం త్రిషు లోకేషు కపిత్వ మనవస్థితమ్. 55-16

సీతాదేవి మరణించినచో మరేమైన కలదా! రామలక్ష్మణులు వారి బంధువులు అందరు నశింతురు. సుగ్రీవుడు మూ వానరులు అందరు నశింపగలరు. నే నెంత పాపాత్ముడను.

ఇట్లు పరితపించుచుండగా, హనుమంతునికి కొన్ని శుభశకునములు కనిపించినవి. మరల ఆలోచించినాడు.

**హనుమంతుడు :** సీతాదేవి పవిత్రత, ఆమె తేజస్సు ఆమెను రక్షింపవా! అగ్నిని అగ్ని దహించునా! పాతివ్రత్య మహిమచే తేజరిల్లుచున్న సీతాదేవిని, ధర్మాత్ముడైన

శ్రీరాముని పత్నిని అగ్నిహోత్రుడు స్పృశింపగలడా! ఆ సీతారాముల ప్రభావముచేతనే గదా నేను దహింపబడకున్నాను. సీతాదేవి తన తపః ప్రభావముచే, సత్యసంధతచే, పాతివ్రత్య మహిమచే అగ్నినికూడ దహింప సమర్థురాలు—ఆమెను అగ్ని దహింప గలదా.

అథవా చారుసర్వాంగీ రక్షితా స్వేన తేజసా
న నశిష్యతి కల్యాణీ నాగ్ని రగ్నౌ ప్రవర్తతే. 55-23

న హి ధర్మాత్మన స్తస్య భార్యా మమిత తేజసః
స్వచారిత్రాభిగుప్తాం తాం స్ప్రష్టు మర్హతి పావకః. 55-24

నూనం రామప్రభావేణ వైదేహ్యా స్సుకృతేన చ
య న్మాం దహనకర్మాయం నాదహ ద్ధవ్యవాహనః 55-25

తపసా సత్యవాక్యేన అనన్యత్వాచ్చ భర్తరి
అపి సా నిర్దహే దగ్నిం న తా మగ్నిః ప్రధక్ష్యతి. 55-29

ఇట్లు తలపోయుచుండగా చారణులు చెప్పుకొనుచుండిన మాటలు హనుమంతునికి వినవచ్చినవి. "నగరమంతయు దహింపబడినను సీతాదేవికిమాత్రము ఎట్టి అపాయము గాని వాటిల్లకుండుట ఆశ్చర్యముగా నున్నది" అని చారణులు పలికిన మాటలతో హనుమంతునికి ధైర్యముకలిగినది. హనుమంతుని దుఃఖము తీరిపోయినది. అయినను సీతాదేవిని మరొక్కమారు ప్రత్యక్షముగా చూచిపోవుట మేలని యోచించి సీతాదేవి చెంత కరిగి ఆమెకు నమస్కరించి "తల్లీ! నా భాగ్యవశమున నీవు క్షేమముగా నుండుట చూచితిని" అని పలికినాడు. సీతాదేవి హనుమంతుని మాటి మాటికి ఆదరముతో చూచుచు "హనుమా! నేను చెప్పిన మాటలు మరచిపోవుగదా! కార్యభార మంతయు నీ మీదనే ఉన్నది సుమా! శ్రీరాముడు శీఘ్రమే వచ్చి రాక్షసులను వధించి నన్ను చేకొని పోవునట్లు చూడుము.

*హనుమంతుడు*: తల్లీ! నీ వెట్టి దిగులును పెట్టుకొనవలదు. శ్రీరాముడు త్వరలోనే రాగలడు. నాకు సెలవిమ్ము.

## హనుమంతుని తిరుగు ప్రయాణము

హనుమంతుడు సీతాదేవికి నమస్కరించి సెలవు గైకొని శ్రీరాముని ఎప్పు డెప్పుడు చూడనగునా అని అత్తరపడి ఉత్సాహముతో తిరుగు ప్రయాణమునకు పూనుకొని అరిష్ట పర్వతముపై నెక్కినాడు.

తమారురోహ హనుమా౯ పర్వతం పవనాత్మజః
రామదర్శన శీఘ్రేణ ప్రహర్షేణాభిచోదితః. 56-21

హనుమంతుడు ఆకసమున కెగురుటకు వీలుగా శరీరమును పెంచి యెగురుట తోడనే హనుమంతుని వేగమునకు అరిష్టపర్వతము నేలమట్టమయినది. ఆ పర్వతముపై విహరించుచుండిన విద్యాధరస్త్రీలు భయపడి పారిపోయిరి. హనుమంతుడు ఆకాశమున పయనముచేయునప్పుడు సముద్రమున ప్రయాణము చేయుచున్న పెద్ద ఓడవలె కనిపించినాడు. దారిలో కానవచ్చిన మైనాకపర్వతమును మర్యాదకొరకు స్పృశించి వింటినుండి వెల్వడిన బాణమువలె వేగముగా పోవుచున్నాడు.

జ్యాముక్త ఇవ నారాచో మహావేగోఽభ్యుపాగతః. 57-14

మహేంద్రపర్వతమును సమీపించి ఒక సింహగర్జనము చేసినాడు. ఉత్తరతీరము చేరి వాలమునాడించుచు అతడు చేసిన సింహనాదమును విని హనుమంతుని రాకకు వేచియుండిన వానరు లందరను జాంబవంతుడు పిలిచి "మన కందరకు ఇది సంతోష సమయము. హనుమంతుని గర్జనస్వరమును బట్టి చూడగా కార్యసిద్ధి తప్పక అయిన దని యేర్పడుచున్నది. కార్యము సాధింపనివాని స్వర మిట్లుండునా!" అని చెప్పినాడు.

సర్వథా కృతకార్యోఽసౌ హనుమా న్నాత్ర సంశయః
న హ్యస్యాకృతకార్యస్య నాద ఏవంవిధో భవేత్. 57-24

ఈ వార్త విని వానరులు మిక్కిలి సంతోషించినారు. వాడిపోయిన వారి ముఖములు వికసించినవి. హనుమంతునికి స్వాగత మిచ్చుటకు అందరును గుమిగూడినారు. దూరమునం దున్నవానిని త్వరగా రమ్మనుటకు మనము ఉత్తరీయముల నెగుర వేయునట్లు హనుమంతుని త్వరగా రమ్మని సూచించుటకు వానరులు చెట్ల కొమ్మలను గైకొని ఆడించుచున్నారు.

తే ప్రీతాః పాదపాగ్రేషు గృహ్య శాఖా స్సుపుష్పితాః
వాసాంసీవ ప్రశాఖాశ్చ సమావిధ్యన్త వానరాః. 57-26

ఎగిరి వచ్చుచున్న హనుమంతుని చూచి వానరు లందరు చేమోడ్పులు గీలించి నిల్వబడినారు. హనుమంతుడు మహేంద్రగిరిమీద వ్రాలుట చూచి వానరులు హనుమంతుని పరివేష్టించినారు. హనుమంతుడు క్షేమముగా వచ్చుట కాంచి అందరు సంతోషించి కందమూలములను ఫలములను తెచ్చి హనుమంతునికి కానుకలుగా సమర్పించినారు.

హనుమంతుడు వానరవృద్ధులకును యువరాజైన అంగదునకును నమస్కరించి "కనబడినది సీత" [దృష్టా సీతా] అని సారాంశమును సంక్షేపముగా నివేదించినాడు.

అర్థవంతమును అమృతతుల్యమును అగు 'కనబడినది' అను మాటను విని వానరులందరు ఆనందభరితు లైనారు.

దృష్టా సీతేతి విక్రాంత స్సంక్షేపేణ న్యవేదయత్. 57-36

తతో దృష్టేతి వచనం మహార్థ మమృతోపమమ్
నిశమ్య మారుతే స్సర్వే ముదితా వానరా భవన్ 57-40

['దృష్టా సీతా' ఈ రెండు మాటలను గురించి గొప్పగా భావింపనివారులేరు. మహర్షియే చెప్పియున్నారు. "ఎంతో అర్థముగల అమృతతుల్య మగుమాట" అని. వారు చెప్పుటలో దృష్టా' అను పదమును మాత్రమే గ్రహించి 'సీతా' అను పదమునుగూడ వదలివేసినారు. దృష్టా' అనుటయే చాలును. హనుమంతుడు సీతాదేవిని వెదకుటకై పోయినసంగతి వానరులకు తెలియకున్న దా. 'కనబడినది' అనగా వెదకబోయిన వస్తువు కనబడినది అన్నమాట. వస్తువును ప్రత్యేకముగా పేర్కొనుట అనవసరము. నెమ్మదిగా పిచ్చాపాటి మాటలాడుకొనునప్పుడు ఎన్నిమాటలైనను వాడుకోవచ్చునుగాని విషయమును వినుటకు కుతూహలపడి ఒంటికాలిమీద నిలబడియున్నవారికి సారాంశము తేల్చి వెంటనే చెప్పుట అత్యావసరము. ఉపన్యాసములకు తరుణముకాదు.

హనుమంతుడు వాక్యకోవిదుడు. స్నేహితుల ఆందోళనమును తన సింహగర్జనముచే దూరమునుండియే కొంత తగ్గించినాడు. సమీపమునకు వచ్చి 'కనబడినది' అన్నాడు. ఆ ఒక్క మాట చాలును వారి బాధ తీర్చుటకు. 'సీత' అని ప్రారంభించి యుండునేని రెండవమాట వచ్చువరకు సందేహమేకదా! 'సీత' కనబడలేదనునో కనబడినది అని చెప్పునో మరి. కావున 'దృష్టా' అని ప్రారంభించినాడు. ఇది యెంతో ప్రశంసనీయము.

దీనిని గురించి మరియొక్కమాట. ఈ వాక్యమును తెలుగులో చెప్పునప్పుడు 'చూచినాను సీతను' అని చెప్పుట వాడుకలో నున్నది. ఈ అర్థము సరియైనది కాకపోవుటయేగాక మూలములోని సొగసును కప్పివేయుచున్నది. 'దృష్టా' అనగా 'కనబడినది' అన్నమాట. వెదకబోయిన వస్తువు 'కనబడినది' అని చెప్పుట ఎంతో సహజముగా నుండును 'కనబడినది' 'దొరకినది' అని అందుముగాని 'నేను చూచితిని' అని అందుమా.

అదియునుగాక 'చూచితిని' అనుటలో అహంభావము ప్రకటితమగుచున్నది. హనుమంతుడు తన స్నేహితులతో చెప్పదగిన మాటకాదు. 'కనబడినది' అనుటయే హనుమంతునికి తగినమాట. "దేవుని దయవల్ల కనబడినది" అనుటవలన హనుమంతుని కీర్తి తగ్గునా! అట్లు తగ్గిపోవునని హనుమంతుడు భావించునా!]

## హనుమంతుడు తన స్నేహితులను కలిసికొనుట

హనుమంతుడు అంగదుని చేతిని తన చేతిలోనికి తీసికొన్నాడు. ఇద్దరు ఒక రమణీయమైన ప్రదేశమున కూర్చుండి కుశల ప్రశ్నలు వేసికొనుచున్నారు. వానరుల

ఆనందము చెప్ప నలవికాదు. ఎగిరి గంతులు వేయువారు, కిలకిల శబ్దములు చేయువారు, వాలము లాడించువారు ఇట్లు అనేక విధములుగా ఆనందించుచున్నారు. కొందరు వానరులు హనుమంతుని స్పృశించి సంతసించుచున్నారు.

*అంగదుడు :* హనుమా! ఎంత గొప్ప కార్యము సాధింపగలిగితివి! నీ వంటి వీరుడు వేరొక్క డున్నాడా! సముద్రమును లంఘించి మరల వచ్చుట సామాన్యమైన కార్యమా! నీ స్వామిభక్తి, నీ శక్తి అపారములు. మన భాగ్యవశమున సీతాదేవిని సందర్శించితివి. సీతావియోగమువలన బాధపడుచుండు శ్రీరామునికి కొంత ఊఱట కలుగును.

వానరు లందరు పెద్దపెద్ద బండలు తెచ్చి వేసికొని హనుమంతునికి నాలుగువైపుల కూర్చుండినారు. అందరు చేతులు జోడించికొని హనుమంతుని చూచుచు సమాచారమును సవిస్తరముగా వినుటకు కుతూహలపడుచున్నారు.

తస్థుః ప్రాంజలయ స్సర్వే హనూమ ద్వదనోన్ముఖాః. 57-49

*జాంబవంతుడు :* నాయనా, నీ ప్రయాణ విశేషములు విపులముగా చెప్పుము. సీతాదేవి నెచ్చట చూచితివి? ఎట్లున్నది? నీ ప్రయాణ మెట్లు సాగినది? ఏ మేమి చూచి వచ్చితివి? వినగోరుచున్నాము చెప్పుము.

*హనుమంతుడు :* (సీతాదేవి నుద్దేశించి నమస్కరించి) నేను మహేంద్రగిరిపైనుండి యెగురుట మీకు తెలిసియే ఉన్నది. నేను ఎగిరిపోవుచుండగా సముద్రమునుండి ఒక పర్వతము పై కుబికి నా మార్గమున కడ్డముగాగా దానిని నా వాలముతో కొట్టినాను. దాని శిఖరము వేయిముక్కలైనది.

అంతట ఆ పర్వతము మనుష్యరూపమును దాల్చి "కుమారా! నా పేరు మైనాకుడు. నీ తండ్రి వాయుదేవుడు నా కిదివరలో గొప్పసహాయము చేసి ఇంద్రుని వజ్రాయుధము తాకుడు నా రెక్కలకు తగులకుండునట్లు నన్ను సముద్రములో దాచినాడు. కావున నీ మీద నాకు ప్రీతికలిగినది. రామకార్యార్థివై పయనించుచున్న నీకు శుభ మగునుగాక" అని పలికినది.

నే నెగిరిపోవుచుండగా మరియొక విఘ్నము కలిగినది. సర్పములకు తల్లియైన సురస నా దారికి అడ్డముగా వచ్చి నన్ను భక్షింతు నని బెదరించినది. "రామకార్యమును పూర్తిచేసి నేను మరల వచ్చి నీ నోటిలో ప్రవేశింతును. ఇప్పుడు మాత్రము నన్ను వదలిపెట్టుము" అని యెంతదూరము చెప్పినను అంగీకరింపలేదు. నోరు

పెద్దదిగా తెరచి నన్ను మ్రింగజూచినది. నేను నా శరీరమును పెంపు చేసినాను. సురస తన నోటిని ఇంకను పెద్దది చేసినది. నేనప్పుడు ఆలోచించి నా శరీరమును కుంచించి అంగుష్ఠమాత్రుడనై ఆమె నోటిలో దూరి వెంటనే బయటికివచ్చి నా ప్రయాణమును సాగించినాను. సురస సంతోషించి నన్ను ఆశీర్వదించినది.

నా కష్టములు అంతటితో ముగియలేదు. నేను ఎగిరిపోవుచుండగా ఏదియో నా నీడను పట్టుకొని ఆకర్షించినది. నాకు తెలియకయే నా వేగము తగ్గిపోయినది. దీనికి కారణ మేమి అని అటుఇటు చూడగా సముద్రములో ఒక రాక్షసి కనబడినది. నోరు పెద్దదిగా తెఱచి నన్ను మ్రింగబోయినది. నేను నా రూపమును చిన్నది చేసి దాని నోటిలోనుండి లోపలికిపోయి దాని మర్మస్థానములను ఛేదించి ఆ రాక్షసిని వధించినాను. ఆ తరువాత నా ప్రయాణము నిరాటంకముగా జరిగినది.

సాయంకాలమునకు ఆవలిగట్టు చేరి 'లంక' అను పట్టణమును చూచినాను. రాక్షసులకు తెలియకుండ పురము ప్రవేశించినాను. నగరాధిదేవతయైన లంకిణి వికటాట్టహాసము చేయుచు నాపైకి వచ్చినది. దానిని ఒకపోటు పొడిచి జయించి పట్టణములోనికి పోయి సీతాదేవికొరకు ఎందెందో వెదకినాను. ఆమె కానబడలేదు. నాకు దుఃఖము వచ్చినది. ఆ తరువాత అశోకవనములో చూడగా అక్కడ ఒక చెట్టుక్రింద కనబడినది సీతాదేవి. పాపము, అతిదీనముగా నున్నది. ఎల్లప్పుడు భర్తనే ధ్యానించుచు దుఃఖించు చున్నది. బ్రతుకుమీద విసువుపుట్టి ప్రాణత్యాగము చేయుటకు నిశ్చయించుకొని యున్నది. భయంకరలైన రాక్షసస్త్రీలు ఆమెను చుట్టుముట్టి బెదరించుచున్నారు.

ఇంతలో రావణాసురుడు అక్కడికివచ్చినాడు. ఆ రాక్షసుని చూచి సీతాదేవి వణికిపోయినది. రావణుడు సీతాదేవిని అనేకవిధములుగ ప్రార్థించినాడు. ఆమె కోపించి రావణుని సరకుసేయక నిర్భయముగా మాటలాడినది. "నీవు పిరికిపందవు. నన్ను తస్కరించి తెచ్చితివి. శ్రీరాముని కంటబడుదువేని భస్మమైపోదువు" అని తూలనాడినది. రావణుడు కోపించి ఆమెను కొట్టునంతపనిచేసినాడు. అంతట రావణుని భార్య మండోదరి (రావణుని భార్య. అనగా మండోదరియే అని హనుమంతిని అభిప్రాయము) అడ్డము వచ్చి "నిన్ను ప్రేమింపని సీతతో మాట లెందుకు. మనము పోవుదమురమ్ము" అని చెప్పినది. అంతట రావణుడు సీతాదేవితో "నీ కిచ్చిన గడువు రెండు నెలలు మాత్రమే మిగిలియున్నది. ఈ లోపల నీ మనస్సు మార్చుకొనకపోయినచో నిన్ను వధింతును" అని బెదరించి అక్కడినుండి పోయినాడు. సీతాదేవి యెంత ధైర్యమును ప్రదర్శించినది ! రావణుని గడ్డిపరకకంటె హీనముగా చూచినది.

రాక్షసస్త్రీలు సీతాదేవిని నానాబాధలు పెట్టినారు. ఆమె నేత్రములనుండి దుఃఖాశ్రువులు ప్రవాహముగా పారినవి. అప్పుడు త్రిజట అను ఒక ముసలిరాక్షసి తనకు వచ్చిన కలనుగురించి రాక్షసస్త్రీలతో చెప్పి రావణాసురుని మరణము, శ్రీరాముని విజయము తప్పక సంభవించు నని రాక్షసస్త్రీలకు తెలియజేసినది.

నేను చెట్టుమీద దాగియుండి యీ విషయముల నన్నింటిని గమనించినాను. సీతాదేవితో మాటలాడిగాని మరలి రాకూడదని నిశ్చయించుకొని దీనికి తగిన మార్గమేమి అని యెంతో దూరము ఆలోచించుకొని ఇక్ష్వాకువంశమును కీర్తించినాను. సీతాదేవి నెమ్మదిగా తలయెత్తి నన్ను చూచినది. 'నేను రామదూతను' అని ఆమెకు నివేదించి శ్రీరామునిగూర్చి వివరములు చెప్పి శ్రీరాముడు నా చేతి కిచ్చిన అంగుళీయమును చూపించి ఆమెకు దాని నిచ్చితిని. "అమ్మా ! నిన్ను నా వీపుపై నెక్కించుకొని రామలక్ష్మణులయొద్దకు కొనిపోయెదను రమ్ము" అని చెప్పితిని. సీతాదేవి సామాన్యురాలు కాదు. "రావణాసురుని వధించి శ్రీరాముడే నన్ను చేకొనిపోవుట సరియైనపని" అని ఆమె చెప్పినది. ఆ మాటను నేను అంగీకరించి ఆమెకు నమస్కరించి శ్రీరామునికి ఏదేని ఆనవాలు నీయుమని కోరగా ఆమె నాచేతికి ఈ చూడామణిని ఇచ్చి మరికొన్ని మాటలుగూడ చెప్పినది.

ఇత్యుక్త్వా తు వరారోహా మణిప్రవర మద్భుతమ్
ప్రాయచ్ఛ త్వరమోద్విగ్నా వాచా మాం సందిదేశ హ. 58-102

[ఈ ఔచిత్యము గమనింపదగియున్నది. కాకాసురుని వృత్తాంతము, మణిశిల బొట్టు విషయము వానరులకు చెప్పనవసరములేదు. అవి శ్రీరామునికి ప్రత్యేకముగా అందింపవలసిన రహస్యములు. కావున 'ఏవో కొన్ని మాటలుకూడ చెప్పిపంపినది' అని ముగించినాడు. అందుకే హనుమంతుని 'వాక్యకోవిదుడు' అన్నారు]

అంతట నేను సీతాదేవికి నమస్కరించి తిరుగుప్రయాణమునకు సిద్ధమైనాను. సీతాదేవి నాతో "హనుమా! నీ వెళ్లైనను శ్రీరాముని ప్రోత్సహించి త్వరగా వచ్చునట్లు చేయుము. బ్రతుకు బరువుగా నున్నది. ఒక నెలకంటె ఎక్కువకాలము జీవించి యుండలేను" అని దీనముగా పలికినది. ఆ మాటలను విన్న నాకు రావణాసురునిమీద పట్టరాని కోపము కలిగి నేను అశోకవనమును ధ్వంసము చేసితిని. రావణుడు నా పైకి ఎనుబదివేల మంది కింకరులను పంపినాడు. నేను వారి నందరను వధించినాను. వనములో నుండిన చైత్య ప్రాసాదమును తగులబెట్టినాను. ఆ తరువాత ప్రహస్తుని కుమారుడు జంబుమాలి అనువాడు నా పైకి వచ్చినాడు. జంబుమాలిని అతని సైన్యమును వధించినాను. అటుపై రావణాసురుడు నా మీదికి ఏడుగురు మంత్రి పుత్రులను అయిదు మంది సేనానాయకులను పంపినాడు. నేను వారి నందరను వధించినాను.

ఈ వార్త విని రావణాసురుడు తన కుమారుడైన అక్షుని నాపైకి పంపినాడు. అక్షుడు మండోదరి కుమారుడు. గొప్ప బలశాలి. నేను అతనితో యుద్ధమాడి వానిని పట్టుకొని పైకెత్తి గిరగిర త్రిప్పి నేలమీదికి విసిరికొట్టి వధించితిని.

రావణాసురునికి ఇంద్రజిత్తు అని మరియొక కుమారు డున్నాడు. అక్షుడు మరణించినపిదప ఇంద్రజిత్తు నాపైకి వచ్చినాడు. అతనికి అస్త్రబలము సైతమున్నది. మా కిద్దరకు ప్రచండయుద్ధము జరిగినది. తుదకు ఇంద్రజిత్తు ఏమిచేసెనో యెరుగుదురా. నా మీద బ్రహ్మాస్త్రమును ప్రయోగించి నన్ను బంధించినాడు. రాక్షసులు నన్ను త్రాళ్లతో కట్టి రావణాసురునియొద్దకు తీసికొని పోయినారు. "ఎవ్వడవు నీవు. ఏల వచ్చితివి" అని నన్ను ప్రశ్నించినారు. "నేను రామదూతను. వాయుదేవుని పుత్రుడను. నా పేరు హనుమంతుడు. వానరేశ్వరుడైన సుగ్రీవుని మంత్రిని. సుగ్రీవుడు నీ మేలు కోరి నీకొక సందేశమును పంపినాడు. శ్రీరాముని పరాక్రమము అపారము. ఒక్క బాణముతో వాలిని వధించి కపిరాజ్యమును సుగ్రీవునికి ప్రసాదించినదిట్టి. శ్రీరామునికి నీవు చాలవు. సీతాదేవిని మర్యాదగా శ్రీరామునికి సమర్పింపుము. సుఖపడగలవు. లేనిచో నీవు బ్రతికియుండజాలవు" అని రావణునితో చెప్పినాను. రావణుడు నా మీద మండిపడి "ఈ వానరుని వధింపుడు" అని ఆజ్ఞాపించినాడు. అప్పుడు రావణుని తమ్ముడు విభీషణుడు అడ్డుపడి "దూతను వధించుట యెందైన కలదా. దూతకు తగిన శిక్ష విధించుట యుక్తము" అని పలికినాడు. రావణుడు అందుకు సమ్మతించి నా తోకను తగులబెట్టుడని ఉత్తర్వు చేసినాడు.

రాక్షసులు నా తోకకు గుడ్డలుచుట్టి నిప్పంటించినారు. నేను రాక్షసులను విదిలించి కట్లు వదలించుకొని, ఇల్లిల్లు తిరిగి లంకాదహనము కావించితిని. సీతాదేవి కూడ ఈ అగ్నికి ఆహుతి అయినదేమో అని చింతించి మరల సీతాదేవియొద్దకు పోయి, ఆమె క్షేమముగా నుండుట చూచి సంతసించి, ఆపై మిమ్ములను కలుసుకొనుటకు త్వరపడి వచ్చితిని.

శ్రీరాముని ప్రభావమువల్లను మన పెద్దల అనుగ్రహమువల్లను ఇంతమట్టుకు చేసికొనివచ్చితిని. ఇకమీద జరుగవలసిన కార్యమును గురించి పెద్దలందరు యోచించి నిర్ణయింతురుగాక. రావణాసురుడు సామాన్యుడుకాడు. సీతాదేవిని స్పృశించిన క్షణముననే భస్మమైపోవలసినవాడు ఇంకను బ్రదికియున్నాడనగా అది అతని తపశ్శక్తిగాని అన్యముకాదు. ఇప్పుడు మన కర్తవ్యమేమి ? సీతాదేవిని తీసికొని రామలక్ష్మణులయొద్దకు చనుటయే మంచిది కాబోలు. నేనొక్కడనే రావణాసురుని

పుత్రమిత్రబంధు సహితముగా వధింపగలను. అట్టియెడ మీ అందరి సహాయముతోను మనము సాధింపలేని పని యేమున్నది. ఈ కార్యము మన కొక లెక్కకాదు

జాంబవంతుడు తక్కువవాడా! మన యువరాజు తక్కువవాడా! మన పనసుడు, నీలుడు, మైందుడు, ద్వివిదుడు మున్నగువారు ఒక్కొక్కరే చాలును లంకను నిర్మూలించుటకు. సగముపని నేనే చేసివచ్చియున్నాను. ఎంతో దుఃఖములో మునిగియున్న సీతాదేవిని శ్రీరామునితో చేర్చుట యుక్తమని తోచుచున్నది. అన్ని విషయములు మీరు ఆలోచించి కర్తవ్యమును నిర్ణయింతురుగాక.

*అంగదుడు :* హనుమంతుడు చెప్పిన దంతయు విన్నాము. ప్రఖ్యాత వీరులము ఇందర మున్నాము. సీతాదేవిని తీసికొనిపోవకయే శ్రీరామునియొద్దకు వెళ్లుట సరికాదని తోచుచున్నది.

*జాంబవంతుడు :* (వృద్ధుడు - అనుభవశాలి) మన ఆలోచనలతో పని యేమి. సంగతి సందర్భములను శ్రీరామునికి నివేదించి ఆయన మాటమేరకు నడచుకొనుటయే సరియైనపని.

## హనుమదాది వానరవీరులు మధువనమున ప్రవేశించుట

జాంబవంతుని మాటను అందరు హర్షించినారు. మహేంద్రగిరిపైనుండి అందరు బయలుదేరినారు. అందరకును హనుమంతుని చూచుటతోకు సరిపోయినది. ['వహన్త ఇవదృష్టిభిః' అన్నారు మహర్షి. చూపులతో మోయుచున్నారట హనుమంతుని]

పనిని జయప్రదముగా సాధించినవారు కావున అందరు ఉత్సాహముగా ఉన్నారు.

['కర్మసిద్ధిభి రున్నతాః' అన్నారు మహర్షి. కార్యమును సాధించినవారు ఎత్తు పెరుగుదురు. దెబ్బతిన్నవారు క్రుంగిపోదురు. జయమును పొందినవాని గమనములోనే ఒక ఠీవి ఉండును.]

వానరు లందరు ఎగిరి ప్రయాణముచేసి సుగ్రీవుని మధువనమును చేరుకొన్నారు.

ఆ వనము సుగ్రీవుని మేనమామ యగు దధిముఖుని రక్షణలో నున్నది. వానరు లందరు అంగదుని ప్రార్థించి మధుభక్షణకు అనుజ్ఞ నీయుమని కోరినారు. జాంబవంతుడు మున్నగు పెద్దలతో ఆలోచించి అంగదుడు అనుజ్ఞ నిచ్చినాడు. వానరుల ఆనందము నకు మేరలేదు. అందరు మధువనములో ప్రవేశించి వారి ఇష్టమువచ్చినట్టు తేనె త్రాగి పానమత్తులై ఆడెడువారు పాడెడువారు ఎగురువారునై అల్లరి చేయుచున్నారు.

దధిముఖుని సేవకులు వచ్చి ఆక్షేపించినారు కాని యీ వానరసైన్యము వారిని లెక్కచేయక తిట్టి కొట్టి పంపి వనము నంతయు పాడుచేయుచున్నారు. హనుమంతుడు తనవారిని మరింత ప్రోత్సహించి "మీరు యథేచ్ఛగా త్రాగుడు. ఎవ్వరైన అడ్డము వత్తురేని వారిపని నేను చూచుకొందును" అని చెప్పినాడు. అంగదుడు ఈ మాటను విని "హనుమంతుని మాటను ఏ నాడైనను కాదని చెప్పుదునా! అందులో ఇంత గొప్ప కార్యమును సాధించుకొని వచ్చియున్నాడు. అతని మాటను తప్పక పాటింపవల యును" అన్నాడు. వానర సైనికులు వనపాలకులను కొట్టి వారి యిష్టానుసారము త్రాగుచున్నారు. అందరకును మత్తెక్కినది.

వనపాలకులు దధిముఖునియొద్దకు పోయి జరిగిన సంగతిని చెప్పుకొన్నారు. దధిముఖుడు ఒక పెద్ద వృక్షమును పెల్లగించి దానిగైకొని వానరులపైకి వచ్చినాడు. హనుమంతుడు, అంగదుడు మున్నగువారు దధిముఖుని మర్దించినారు. దధిముఖుడు వనపాలకులను పిలిచి "మీ రిందే ఉండుడు. నేను సుగ్రీవునియొద్దకు పోయి రామలక్ష్మణ సమేతుడైన సుగ్రీవునికి వీరి దుండగములను నివేదించి వచ్చెదను. తప్పు నంతయు అంగదునిమీద మోపి అతనికి తగిన శిక్ష విధించునట్లు చూచెదను. మధువన మన్న సామాన్యమా! ఎన్నితరములుగా దీనిని కాపాడుచున్నారు! ఈ వనములో ప్రవేశించుటకు దేవతలకుకూడ సాధ్యము కాదుగదా! అట్టి వనమును ధ్వంసము చేయుదురా యీ దుర్మార్గులు" అని చెప్పి సుగ్రీవునిచెంతకు పోయినాడు.

## మధువనమునుగురించి దధిముఖుడు సుగ్రీవునితో చెప్పుట

సుగ్రీవుడు రామలక్ష్మణుల చెంత ఉన్నాడు. దధిముఖుడు అచ్చటి కరిగి దీనుడై సుగ్రీవునికి సాష్టాంగనమస్కారము చేసినాడు.

*సుగ్రీవుడు :* మామా! ఇట్లు దుఃఖించుచున్నా వేమి? నీకు వచ్చిన భయమేమి? లే, లెమ్ము. నేను నీ కభయమిచ్చుచున్నాను. లేచి నీ సంగతిని చెప్పుము.

*దధిముఖుడు :* రాజా! మీ తండ్రిగాని, వాలిగాని, నీవుగాని మధువనమును ఎప్పుడైనను తాకినారా! చూడుడు. ఆ వానరసైనికులు వచ్చి మధువనమును ధ్వంసము చేయుచున్నారు. మేము అడ్డముపోగా మమ్ములను మర్దించినారు. ఇంకను ఎన్నెన్నో పనులు చేసినారు. చెప్పుకున్న సిగ్గుచేటు. ఈ దుండగమునకు అంగదుడే కారణభూతుడు.

*లక్ష్మణుడు :* సుగ్రీవా! పాపము! ఇతని బాధ యేమి. నీతో ఏమి చెప్పుకొనుచున్నాడు

[దధిముఖుడు వానర భాషలో మాటలాడెను కాబోలు]

*సుగ్రీవుడు :* మరేమియులేదు. అంగదుడు మున్నగు వానరవీరులు మధువనములో ప్రవేశించి, వనమును ధ్వంసము చేసి, తేనెను త్రాగుచున్నారట. వారందరు సీతాదేవిని వెదకుటకు దక్షిణదిశకు పోయిన వీరులుకదా! కార్యసిద్ధి కానిచో ఇట్టి సాహసము చేయజాలరు. సీతాదేవి తప్పక కనబడిన దన్నమాట. హనుమంతుడే యీ కార్యమును సాధించియుండును.

వనం యదా విపన్నం తై స్సాధితం కర్మ వానరైః
దృష్టా దేవీ న సందేహో న చాన్యేన హనూమతా. 63.17

ఈపని మరియొకనికి సాధ్యముకాదు. హనుమంతుడు బుద్ధిమంతుడు. అతని యందు ఉత్సాహము వ్యవసాయము వీర్యము జ్ఞానము కార్యసిద్ధికి కావలసిన లక్షణము లన్నియు కలవు. జాంబవంతుడు అంగదుడు హనుమంతుడు ఏకమై చేయు కార్యమునకు అపజయ మెన్నటికిని కలుగదు.

కార్యసిద్ధిర్మతిశ్చైవ తస్మిన్ వానరపుంగవే
వ్యవసాయశ్చ వీర్యంచ శ్రుతం చాపి ప్రతిష్ఠితమ్. 63.18

జాంబవా న్యత్ర నేతా స్యాదంగదశ్చ మహాబలః
హనూమాం శ్చాప్యధిష్ఠాతా న తస్య గతి రన్యథా. 63.19

అంగద ప్రముఖు లందరు మధువనమును పాడుచేయుచున్నా రని వనపాలకుడైన యీదధిముఖుడు మొరపెట్టుచున్నాడు. లక్ష్మణా! సీతాదేవి కనబడిన దనుటకు సందేహ మేమియులేదు.

శ్రీరాముడు ఈ మాటలను వినుచున్నాడు. రామలక్ష్మణులు సంతోషపరవశులైనారు. శుభవార్త యెన్నాళ్లకు వినబడినది!

మధువనమును గురించిన ఘట్టము ఎంతో గొప్పది. దీనినిగూర్చి మహర్షి మూడు సర్గలు వ్రాసియున్నారు. కార్యమును సాధించినవారు వెంటనే శ్రీరాముని యొద్దకు వచ్చి శుభవార్తను చెప్పక, దారిలో కాలయాపన చేసి, మధువనములో ఆగుట బాగున్నదా అన్నచో ఎంతో బాగున్నది. శుభవార్తను సైతము తటాలున చెప్పకూడదు. అట్లు చెప్పుటవలన ఎన్నియో ప్రమాదములు జరుగవచ్చును. శుభమును వినుటకుకూడ మనస్సును సిద్ధము చేయవలెను. ఆపనినే మహర్షి యీ మూడుసర్గలలో చేసినారు. సుగ్రీవుని ప్రశ్నించినవాడు లక్ష్మణుడు—శ్రీరాముడుకాదు. ప్రశ్నోత్తరములద్వారా శ్రీరాముడు శుభవార్తను నెమ్మదిగా అందుకొన్నాడు. హనుమంతుడు వచ్చి చెప్పబోవు వివరములను గ్రహించుటకు శ్రీరాముని మనస్సు సిద్ధముగా నున్నది. కావున ఎట్టి ప్రమాదములకు అవకాశములేదు.

మరియొకమాట. కార్యము జయప్రదముగా సాధించుకొనివచ్చినవారిని సంతోషపెట్టుటకూడ ఎంతో ముఖ్యముగదా!]

వీనులకు విందుగా వినబడిన సుగ్రీవుని పలుకులవల్ల రామలక్ష్మణులు ఆనంద పరవశులైనారు.

> శ్రుత్వా కర్ణసుఖాం వాణీం సుగ్రీవవదనా చ్చ్యుతామ్
> ప్రాహృష్యత భృశం రామో లక్ష్మణశ్చ మహాబలః. 63-25

*సుగ్రీవుడు :* (దధిముఖునితో) మామా! అంగదాది వీరులు గొప్పకార్యమును సాధించి వచ్చియున్నారు. మధువనములోని మధువు నంతయు త్రాగినను సంతోషమే. వారిని త్వరగా రమ్మని చెప్పుము. సీతాన్వేషణ వివరములను వినుటకు రామలక్ష్మణులు కుతూహలపడుచున్నారు.

దధిముఖుడు శీఘ్రగమనమున పోయి అంగదుని సమీపించి "అంగదా! క్షమింపుము. నే నేదో తెలియక పొరపాటు చేసితిని. నీవు యువరాజువు. మధువనమును యథేచ్ఛగా అనుభవింపుము. నేను నీ మీద తప్పుపెట్టి మన ప్రభువుతో మొఱపెట్టుకొన్నాను. కాని ఆయన నా మాటలను విని సంతోషించి మిమ్ములను త్వరగా రమ్మనినాడు.

*అంగదుడు :* వానరులారా! మీకు తృప్తి అయినదా. ఇక పోవుదమా? నేను యువరాజును కావున మీ మీద నాకు అధికార మున్నను ఈ విజయసమయమున మీ మాటనుబట్టిపోవలసినవాడనేకదా. కావున మీ ఇష్ట మేదియో చెప్పుడు.

*వానరులు :* యువరాజా! నీవు తప్ప ఇంత వినయముగా పలుకువా రెవ్వరుగలరు? ఐశ్వర్య మదమత్తులై సర్వము తామే నని భావించుట సహజము. నీ వట్టివాడవు కావు. మాకు తృప్తి అయినది. మరి పోవుదము.

> ఐశ్వర్యమద మత్తో హి సర్వోఽహ మితి మన్యతే. 64-17

అందరు బయలుదేరినారు. ఈ లోపల సుగ్రీవుడు శ్రీరామునితో అనునయ వాక్యములు పలుకుచున్నాడు.

*సుగ్రీవుడు :* రామప్రభూ! ఊరడిల్లుము. నీకు మంగళ మగునుగాక. సీతాదేవి తప్పక కనబడినది. లేనిచో గడువుదాటి, వారు నా యెదుటికి రాగలరా?

> సమాశ్వసిహి భద్రం తే దృష్టా దేవీ న సంశయః
> నాగంతు మిహ శక్యం తై రతీతే సమయే హి నః. 64-25

## వానరవీరులు రామలక్ష్మణులచెంతకు వచ్చుట

ఈ మాటలలోనే కిలకిల శబ్దము వినబడినది. వానరులు వచ్చి వ్రాలినారు. హనుమంతుడు శ్రీరామునికి సాష్టాంగ నమస్కారము చేసి "పాతివ్రత్య తేజముతో వెలుగుచున్న సీతాదేవి క్షేమముగా నున్నది" అని నివేదించినాడు.

నియతా మక్షతాం దేవీం రాఘవాయ న్యవేదయత్. 64-38

[ఇక్కడ ఒక ముఖ్యమైన విషయము గమనింపవలయును. 'దృష్టా సీతా' అని తన స్నేహితులతో చెప్పిన హనుమంతుడు శ్రీరామునితో అట్లు చెప్పలేదు. "నియతా మక్షతాం దేవీం...." అని ప్రారంభించి చెప్పుచున్నాడు. ఈ ఔచిత్యమును గమనింపదగియున్నది. 'సీతాదేవి పతివ్రతగా ఉన్నది' అని చెప్పినచో శ్రీరామునికి సంతోషముగా నుండునుగాని "సీతాదేవి ఉన్నది" అనుటమాత్రమే ఆయనకు చాలదు. సీతాదేవి శీలమునకు భంగములేదు అని శ్రీరామునికి మున్ముందు తెలియవలెను.

ఎవ్వరికి ఏ మాట చెప్పవలయునో ఆ మాట వారికి చెప్పుటలో హనుమంతునికి సరివచ్చు వారులేరు]

సుగ్రీవునికి లక్ష్మణునికి సంతోష మైనది. సీతాదేవి అక్షతగా నున్నదని విని శ్రీరాముడు సంతోషించినాడు [ఆయనకు కావలసినది ఆమాట]

వైదేహీ మక్షతాం శ్రుత్వా రామస్తూత్తరమబ్రవీత్. 65-4

**రాముడు :** వానరులారా! సీత యెందున్నది? నన్ను గూర్చి యేమనుకొనుచున్నది?

## సీతావృత్తాంతమును శ్రీరామునికి హనుమంతుడు నివేదించుట

సీతావృత్తాంత కోవిదుడైన హనుమంతుని అందరు ప్రోత్సహించిరి. హనుమంతుడు సీతాదేవి ఉన్నవైపు మరలి ఆమెకు నమస్కరించి సీతాదేవి వృత్తాంతమును శ్రీరామునికి నివేదించుచున్నాడు. తాను సముద్రమును లంఘించుట, లంకలో ప్రవేశించుట, సీతాదేవిని సందర్శించుట మున్నగు విషయములను చెప్పినాడు.

**హనుమంతుడు :** రామప్రభూ! సీతాదేవి రాక్షసస్త్రీల నడుమ చిక్కుకొని యెంతో బాధపడుచున్నది. తల జడలుకట్టి పెనుచుకొనియున్నది. ఎల్లప్పుడును దీనయై కటికినేల నాశ్రయించి నిన్ను ధ్యానించుచున్నది. నీయెడ భక్తి కొంచెమేనియు తగ్గలేదు. నీయెడ భక్తి కలిగి ఉగ్రతపస్సుతోకూడిన సీతాదేవిని సందర్శించితిని.

నియత స్సముదాచారో భక్తిశ్చాస్యా స్తథా త్వయి. 65-17

ఏవం మయా మహాభాగా దృష్టా జనకనందినీ
ఉగ్రేణ తపసా యుక్తా త్వద్భక్త్యా పురుషర్షభ. 65-18

చిత్రకూట పర్వతమునందు మీ రున్నప్పుడు కాకాసురుడు చేసిన అపరాధమును గూర్చి చెప్పినది. ఆ వాయసముపై నీవు బ్రహ్మాస్త్రమును ప్రయోగించుట, ఆ తరువాత అతడు శరణు వేడగా నీవు రక్షించుట, మున్నగు సంగతులు చెప్పినది. ఇదిగో యీ చూడామణిని ఆనవాలుగా ఇచ్చిపంపినది. దీనిని చూడుము. ఇదిగాక మరొకమాటకూడ చెప్పినది. ఒకనాడు ఆమె తిలకము కొంచెము చెదరిపోగా నీవు మణిశిలతో ఆమె చెక్కిలిమీద బొట్టు పెట్టినావటగదా!

చూడామణిని నా చేతి కిచ్చినప్పుడు ఆమె నీతో చెప్పుమన్న మాటలను వినుము "నాథా! నేను ఎంతో దుఃఖములో నున్నాను. మన వివాహసమయమునం దీయబడిన యీ చూడామణిని చూచుకొని కొంత ఊరట నెందుచుంటిని. ఇప్పుడు దానినికూడ నీయొద్దకు పంపుచున్నాను. కావున ఆకొద్ది ఊరటయు పోయినది. ఇక నేను ఎక్కువ కాలము బ్రతికియుండజాలను. ఒక నెలదినములు ఎట్లైన కష్టపడి యీ దుఃఖమును భరింతును. అంతే! ఆపై నాప్రాణములు విడువగలను. నీవు త్వరగా వచ్చి రావణుని వధించి నన్ను చేకొనిపొమ్ము" అని చెప్పుమన్నది.

జీవితం ధారయిష్యామి మాసం దశరథాత్మజ
ఊర్ధ్వం మాసా న్నజీవేయం రక్షసాం వశ మాగతా. 65-24

రామప్రభూ! సీతాదేవి చిక్కి శల్యమైయున్నది. ఎంతో భయపడుచున్నది. నీవు ఆమెను వెంటనే రక్షించుట అవసరము. ఈ సముద్రము నెట్లైనను దాటుటకు ఉపాయ మాలోచింపుము.

రాముడు: (చూడామణిని తీసికొని దానివంకనే చూచుచు) హనుమా! ఈ చూడామణిని మా పెండ్లిలో మా అత్తగారు సీత కిచ్చినారు. దీనిని చూచుటతోడనే మా తండ్రియు మా మామగారును సీతయు జ్ఞప్తికి వచ్చినారు. వారిని చూచిన ట్లయినది. హనుమా! నాసీత ఇంకను ఏమి చెప్పినది. వినగోరుచున్నాను. మరి మరి చెప్పుము. దాహము గొన్నవానికి నీరుపోసినట్లు, నీవాక్యామృతముతో నన్ను తడిపి నా తాపమును చల్లార్చుము.

కి మాహ సీతా వైదేహీ బ్రూహి సౌమ్య పునః పునః
పిపాసుమివ తోయేన సించంతీ వాక్య వారిణా. 66-8

సీత ఇంక ఒకనెలదినములు బ్రతికియుందునని చెప్పినది. అదియెంతో గొప్ప సంగతి. నామట్టుకు నేను సీతను బాసి ఒక్కక్షణమేనియు జీవింపజాలను.

చిరం జీవతి వైదేహీ యది మాసం ధరిష్యతి
క్షణం సౌమ్య న జీవేయం వినా తా మసితేక్షణామ్. 66-10

లక్ష్మణా! సీతను చూడకయే యీచూడామణిని మాత్రము చూచుచున్నాను. ఇంతకంటె దుఃఖము కలదా! సీత ఎచ్చట ఉన్నదో తెలిసినది. ఇప్పుడు నన్నుకూడ ఆమెచెంతకు చేర్పుము. పాపము! సీత యెంతబాధ పడుచున్నదోగదా!

హనుమా! సీత మరియు ఏమిచెప్పినది-వినిపింపుము.

*హనుమంతుడు :* (కాకాసురుని కథ మరల చెప్పి) రామప్రభూ! సీతాదేవి మాటలను వినుము. "ఇంతగొప్ప పరాక్రమముతో కూడియున్న రామలక్ష్మణులకు నాపై దయరాకపోవుటకు కారణ మేమి? నేను చేసిన పాపమే దీనికి కారణమై యుండును" అని చెప్పినది. అంతట నేను "తల్లీ! దుఃఖపడకుము, అచిరకాలమున నే నీదుఃఖము లన్నియు నశింపగలవు. నీవృత్తాంతము తెలియక ఇంతవరకు ఆలస్య మైనది. ఇకమీద ఆలస్య ముండదు" అని చెప్పితిని. అంతట సీతాదేవి "హనుమా! నీవు త్వరగా వెళ్ళి రామలక్ష్మణులకు సుగ్రీవునికి నా క్షేమవార్తను చెప్పుము. ఈదుఃఖసముద్రములోనుండి నన్ను దరిజేర్చు మార్గమును చూడుమని శ్రీరామునితో చెప్పుము. సముద్రమును దాటుటకు గరుత్మంతునికి వాయుదేవునికి నీకు మీ ముగ్వురకుమాత్రమే సాధ్య మగును. రామలక్ష్మణులు సముద్రమును దాటి రాగలరా?" అని ప్రశ్నించినది. అంతట నేను "తల్లీ! నా వీపుపై నెక్కిరమ్ము. నిన్ను కొనిపోయి శ్రీరామునికి సమర్పింతును" అన్నాను. సీతాదేవి ఆమాటకు సమ్మతింపలేదు. రామప్రభూ! నీవుకూడ ఆమెను రహస్యముగా కొనివచ్చుట ఆమెకు ఇష్టములేదు "రావణుడు దొంగతనముగా నన్ను తెచ్చినాడు. శ్రీరాముడుకూడ రాక్షసునికి భయపడినట్లు నన్ను రహస్యముగా కొనిపోవుట కీర్తికరముకాదు. అది రామునికి తగినపనికాదు. శ్రీరాముడు వచ్చి రాక్షసులను, రావణుని వధించి లంకను నాశన మొనర్చి నన్ను చేకొనిపోవుటయే శ్రీరామునికి తగినపని" అని పలుమారు చెప్పినది.

బలైః స్వమగ్రైర్యది మాం హత్వా రావణ మాహవే
విజయీ స్వాం పురీం రామో నయే త్తత్స్యా ద్యశస్కరమ్. 68-12

యథాఽహం తస్య వీరస్య వనా దుపధినా హృతా
రక్షసా తద్భయాదేవ తథా నార్హతి రాఘవః. 68-13

అంతట, నే నామెకు ఎంతో ధైర్యము చెప్పితిని, "సుగ్రీవుని ఆజ్ఞలో కోట్లకొలది వానరు లున్నారు. వా రందరు నాకంటె గొప్పవారు. నాకంటె తక్కువవా డెవ్వడును లేడు. నేనే ఇక్కడికి రాగలిగితి ననగా వారిమాట ప్రత్యేకముగా చెప్పవలయునా! ఇట్టి పనులమీద తక్కువవారినే పంపుదురుగాని గొప్పవారిని పంపుదురా.

న హి ప్రకృష్టాః ప్రేష్యంతే ప్రేష్యంతే హీతరే జనాః 68-22

తల్లీ! దుఃఖింపకుము. వానరు లిక్కడికి ఒక్క యెగురున రాగలరు. రామ లక్ష్మణులను నా వీపుపై నెక్కించుకొని రాగలను. అందరును వచ్చి త్వరలోనే లంకను ముట్టడించి రాక్షసులను వధించి నిన్ను రక్షింపగలరు. వనవాసవ్రతమును పూర్తి కావించి శ్రీరాముడు నిన్నుకూడి అయోధ్యలో పట్టాభిషేకము శీఘ్రముగనే చేసికొనగలడు" అని సీతాదేవికి చెప్పి ఆమె దుఃఖమును పోగొట్టి వచ్చితిని.

నివృత్త వనవాసం చ త్వయా సార్ధమరిందమం
అభిషిక్త మయోధ్యాయాం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్. 68-28

తతో మయా వాగ్భి రదీన భాషిణా
శివాభి రిష్టాభి రభిప్రసాదితా
జగామ శాన్తిం మమ మైథిలాత్మజా
తవాపి శోకేన తదాఽభిపీడితా. 68-29

[సుందరకాండ 'త'కారముతో ప్రారంభమై 'త'కారముతో ముగింపబడినది. శ్రీమద్రామాయణము 'త'కారముతో ప్రారంభమైనది. 'త'కారమునకు గొప్ప మహిమ కల దని పెద్ద లందురు.]

ఓం తత్సత్

శ్రీ రా మా య న మః

# శ్రీమద్వాల్మీకి రామాయణ కథామృతము

# యుద్ధ కాండము

## శ్రీరాముడు హనుమంతుని ప్రశంసించి ఆదరించుట

శ్రీరాముడు హనుమంతుడు చెప్పిన శుభసమాచారమును విని సంతోషించి,

**రాముడు**: హనుమంతుడు ఎంత గొప్పకార్యమును సాధించినాడు! ఇట్టి కార్యమును లోకమున మరెవ్వరును మనసాకూడ చేయలేరు.

కృతం హనుమతా కార్యం సుమహ ద్భువి దుర్లభమ్
మనసాపి య దన్యేన న శక్యం ధరణీతలే. 1-2

సముద్రమును దాటగలవాడు ఎవ్వడైనను కలడా! గరుత్మంతుడు, వాయుదేవుడు, హనుమంతుడు ఈ ముగ్గురికి మాత్రమే ఆ పని సాధ్యము. రావణపాలితమైన లంకలో ప్రవేశించి ఎవ్వడుగాని ప్రాణముతో బయటికి రాగలడా! మొదటి మాట, లంకలో అడుగుపెట్టగలడా! హనుమంతుడు సాధించిన మహాత్కార్యము ఇంతది అంతది అని చెప్పుటకు సాధ్యముకాదు.

సుగ్రీవుడు చెప్పిన మాటతో సరిపెట్టుకొనక హనుమంతుడు తన బలమును, పౌరుషమును రాక్షసులయెదుట ప్రదర్శించి ఉత్తమ దూతగా ప్రవర్తించినాడు. నా కెంతో ఆనందప్రదమైన వార్తను కొనివచ్చినాడు. హనుమంతునికి తగిన ప్రియమును చేయజాలకున్నందుకు నా మనస్సు ఎంతో బాధపడుచున్నది.

ఇదం తు మమ దీనస్య మనో భూయః ప్రకర్షతి
యదిహాస్య ప్రియాఖ్యాతు ర్న కుర్మి సదృశం ప్రియమ్. 1-12

ఈ మహాత్మునికి నే నిప్పుడిచ్చు కవుగిలింతయే సర్వస్వము నిచ్చిన ట్లగునుగాక.

ఏష సర్వస్వభూతస్తు పరిష్వంగో హనూమతః
మయా కాల మిమం ప్రాప్య దత్త స్తస్య మహాత్మనః. 1-13

ఈ మాటలు చెప్పి శ్రీరాముడు ప్రీతితో హనుమంతుని కవుగిలించుకొన్నాడు.

[ఇంతపని చేసినవేగాని హనుమంతునికి శ్రీరాముని కవుగిలింత లభింపలేదు!]

## శ్రీరామునికి సుగ్రీవుడు ఉత్సాహము కలిగించుట

శ్రీరాముడు కొంతసేపు ఆలోచించి సుగ్రీవునికి వినబడునట్లు హనుమంతునితో అనుచున్నాడు.

రాముడు : హనుమంతుడా ! నీవు సముద్రమును లంఘించి సీతను చూచి రాగలిగితివి ! సముద్రము సంగతి స్మృతికి వచ్చినప్పుడు నాకు దిగు లగుచున్నది. ఈ వానరులను ఆవలితీరమునకు చేర్చు టెట్లు ? దీని కేదైన ఉపాయ మాలోచింపవలయును.

రాముడు మరల శోకనిమగ్నుడగుట చూచి సుగ్రీవుడు రాముని ఊరడించుచున్నాడు.

సుగ్రీవుడు : రామప్రభూ ! నీవు సైతము ఒక ప్రాకృతునివలె దుఃఖించుట తగునా ! కృతఘ్నుడు స్నేహమును విడిచిపుచ్చునట్లు నీ వీ దుఃఖమును విడిచిపెట్టుము.

[కృతఘ్నుడు స్నేహమును నిశ్శేషముగా వదలిపెట్టును !]

కిం త్వం సంతప్యసే వీర యథాన్యః ప్రాకృత స్తథా
మైవం భూ స్త్యజ సంతాపం కృతఘ్న ఇవ సౌహృదమ్. 2.2

ఇంతకును, నీ దుఃఖమునకు కారణ మేమైన కలదా ! సీతాదేవి వృత్తాంతము తెలిసినది. శత్రువు నెలవు తెలిసినది. నీవు మహాప్రాజ్ఞుడవు. గొప్ప పండితుడవు. దుఃఖము పరిత్యజింపుము. మేము సముద్రము దాటి లంకను ఆక్రమించి నీ శత్రువును పరిమార్చెదము. నీవు ఉత్సాహము వహింపుము. ఉత్సాహమును వదలి దుఃఖపడుచున్నచో కార్యమును సాధింపగలమా !

నిరుత్సాహస్య దీనస్య శోకపర్యాకులాత్మనః
సర్వార్థా వ్యవసీదంతి వ్యసనం చాధిగచ్ఛతి. 2.6

ఈ వానరువీరు లందరు నీకై అగ్నిహోత్రమున దూకుటకుగూడ సంసిద్ధులై యున్నారు. సముద్రమునకు సేతువు నిర్మించి లంకకు చేరు మార్గము నాలోచింపుము. సేతువు కట్టకయే లంకను సాధించు కార్యము దేవతలకును సాధ్యము కాదు.

అబద్ధ్వా సాగరే సేతుం ఘోరే తు వరుణాలయే
లంకా న మర్దితుం శక్యా సేంద్రైరపి సురాసురైః 2.11

సేతువు నిర్మింతుమేని జయము మనదే. ఈ వానరవీరులు రావణ సమేతముగా లంకను పెల్లగించి తేగలరు. ప్రభూ ! నీవు ధైర్య మూనుము. నీవు ధనుర్ధరుడవై యుండ, యుద్ధమున నీ యెదుట నిలబడగలిగినవాడు ముల్లోకములందును లేడు.

న హి పశ్యా మ్యహం కంచి త్త్రిషులోకేషు రాఘవ
గృహీత ధనుషో యస్తే తిష్ఠే దభిముఖో రణే. 2-18

శోకము సర్వార్థములను నాశనము చేయగలదు. నీవు శోకమును విడిచిపెట్టుము. క్రోధము నవలంబింపుము. క్షత్రియుడు దీనుడై, మందుడై యుండరాదు. ప్రచండుడుగా నుండవలయును. అట్లున్న నే గాని ఎవ్వడును లక్ష్యము సేయడు.

తదలం శోకమాలంబ్య క్రోధ మాలంబ భూపతే
నిశ్చేష్టాః క్షత్రియా మందా స్సర్వే చండస్య బిభ్యతి. 2-20

మన సైన్యము సముద్రమును దాటుట కేదేని ఉపాయము చూడుము. మనకు జయము కలిగితీరును. ఇన్ని మాట లేల! నాకు శుభశకునములు కనబడుచున్నవి నా మనస్సు సంతోషముతో నిండియున్నది. నీకు జయము తప్పక కలుగును.

కిముక్త్వా బహుధా చాపి సర్వథా విజయీ భవాన్
నిమిత్తాని చ పశ్యామి మనో మే సంప్రహృష్యతి. 2-25

## లంకాపురి దుర్గాదులనుగూర్చి హనుమంతుడు వివరించుట

శ్రీరాముడు కార్యదీక్షను పూని హనుమంతునితో అనుచున్నాడు.

**రాముడు** : తపస్సుచేత సేతువును నిర్మించుటయో, సముద్రమును శోషిల్లజేయుటయో, ఏదియో ఒకటిచేసి సేనలను సముద్రము దాటింపగలను. దానిగూర్చిన చింత మరి అక్కరలేదు.

తపసా సేతుబంధేన సాగరోచ్ఛోషణేన వా
సర్వథా సుసమర్థోస్మి సాగరస్యాస్య లంఘనే. 3-2

హనుమంతుడా! లంకను చూచివచ్చితివిగదా! లంకాపురి ద్వారములు, దుర్గ కర్మ విధానము, రాక్షసుల సైన్యస్థితి వివరముగా చెప్పుము.

[అన్నింటిని చూడబట్టి సరిపోయినదిగాని, లేనిచో ఏమి చెప్పగలడు!]

**హనుమంతుడు** : రామప్రభూ! లంకాపట్టణములోని దుర్గకర్మ విధానము, పట్టణ రక్షణ పద్ధతి, రావణుని పరాక్రమము, బలవిభాగము, సముద్ర స్వరూపము అన్నింటిని మనవిచేసెదను.

శ్రూయతాం సర్వ మాఖ్యాస్యే దుర్గకర్మ విధానతః
గుప్తా పురీ యథా లంకా రక్షితా చ యథా బలైః. 3-7

రాక్షసాశ్చ యథా స్నిగ్ధా రావణస్య చ తేజసా
పరాం సమృద్ధిం లంకాయా స్సాగరస్య చ భీమతామ్. 3-8

విభాగం చ బలౌఘస్య నిర్దేశం వాహనస్య చ. 3-9

[హనుమంతుడు ఎన్ని విషయములను తెలిసికొనివచ్చినాడు!]

ప్రభూ! లంకాపట్టణము విశాలమైనది. ప్రజలు నిత్య సంతుష్టులై యున్నారు. పట్టణము చతురంగబలములచే రక్షితమైయున్నది. రావణుని సేనలు అపారములు. పట్టణములోనికి శత్రువు ప్రవేశించుట అంత సులభమైన పనికాదు. నగరమునకు నాలుగు ద్వారము లున్నవి. అవి మిక్కిలి దృఢమైనవి. ఆ ద్వారములందు బాణ యంత్రములు శిలా యంత్రములు నిర్మింపబడియున్నవి. శత్రు సైన్యములు ముట్టడించినప్పుడు వానిని ప్రయోగించి బాణవర్షమును, శిలావర్షమును శత్రువులమీద కురిపింపగలరు. ఆ ద్వారములలో ఉక్కు శతఘ్ను లున్నవి. నగర ప్రాకారములు సువర్ణమయములు. వానిని దాటుట కష్టసాధ్యము. అగాధమైన అగడ్త లున్నవి. నాలుగు ద్వారములయొద్ద నాలుగు యంత్రములు నిర్మింపబడి యున్నవి. ప్రజలు బయటికి రావలసినప్పుడు ఆ యంత్రముల సహాయమున అగడ్తలమీద పలకలు దింపుదురు. అక్కరలేనప్పుడు పలకలను ఎత్తివేయుచుందురు. శత్రుసైన్యములు ముట్టడించినప్పుడు పలకలు ఎత్తివేయబడి యుండును. రావణుడు అనుదినము సైన్యమును పరీక్షించుచుండును.

లంకాపురి సముద్ర మధ్యమున ఒక పర్వతముపై నున్నది. అక్కడికి వెళ్లుటకు దేవతలకుసైతము సాధ్యముకాదు. జల దుర్గములు, పర్వత దుర్గములు, వన దుర్గములు, కృత్రిమ దుర్గములు, ఈ నాలుగు విధములైన దుర్గము లున్నవి.

లంకాపురి ఇచ్చటి కెంతోదూరమున సముద్రపు టావలి తీరమునం దున్నది. అక్కడికి నావమార్గముకూడ లేదు.

[ఓడలపై సముద్రప్రయాణము చేయుట ఆ కాలమువారికి క్రొత్త కాదు.]

స్థితా పారే సముద్రస్య దూరపారస్య రాఘవ
నౌపథోపి చ నాస్త్యత్ర నిరాదేశశ్చ సర్వతః. 3-21

లంకను చేరుటగాని, లంకను జయించుటగాని సులభమైన పనులు కావు. అన్ని ద్వారములలోను, మధ్యమ స్కంధములోను రాక్షససైన్యములు కావలి కాయుచుందురు. అగడ్తలమీద నున్న సంచార మార్గములను నేను పగులగొట్టి వచ్చితిని. అగడ్తలను పూడ్చినాను. ప్రాకారములను బ్రద్దలు చేసినాను. పట్టణమును తగులబెట్టివచ్చినాను.

తే మయా సంక్రమా భగ్నాః పరిఖా శ్చావపూరితాః
దగ్ధా చ నగరీ లంకా ప్రాకారా శ్చావసాదితాః 3-29

రాక్షససైన్యములో కొంతభాగమును సంహరించినాను. కొంతమంది మేటి వీరులను వధించినాను. మన మేదైన ఒక ఉపాయము చూచుకొని సముద్రమును దాటుదుమేని లంక హతమైనట్లే భావింపుము. మనకు సైన్యముతోకూడ పనిలేదు. అంగదుడు, ద్వివిదుడు, మైందుడు, జాంబవంతుడు, పనసుడు, నీలుడు, నలుడు వీరు చాలును. ఆకాశమార్గమున ఎగిరిపోయి లంకను పెల్లగించి తేగలరు.

ప్రభూ ! మంచి ముహూర్తము చూచి మన సైన్యములను కదలింపుము.

## శ్రీరాముడు వానరసైన్యములను లంకపైకి నడిపించుట

**రాముడు :** హనుమా ! లంకాపురి సంగతి మనసుకువచ్చినది. ఆ లంకను త్వరలోనే హతమార్చెదను.

సుగ్రీవా ! ఇదియే మంచి ముహూర్తము. సూర్యుడు మధ్యాకాశమున ఉన్నాడు [ఇది అభిజిన్ముహూర్తము]. మనకు విజయము కలుగును. ఈనాడు ఉత్తర ఫల్గునీ నక్షత్రము. నాకు సాధనతార. రేపు హస్త. నా కనుకూలమైనది కాదు. మన మిప్పుడే బయలుదేఱుదము. మంచి శకున మగుచున్నది. నేను రావణుని తప్పక సంహరించి సీతను కొనివత్తును. విషము త్రాగినవాడు మరణింపనుండగా అమృత స్పర్శచే జీవనశక్తి నొందునట్లు, సీత నా ప్రయాణముసంగతి విని ప్రాణముపై ఆశగొని యుండగలదు.

సీతా శ్రుత్వాభియానం మే ఆశా మేష్యతి జీవితే
జీవితాంతేఽమృతం స్పృష్ట్వా పీత్వా విషమివాతురః. 4-5

నీలుడు దిటవుగల వీరులను వెంటబెట్టుకొని దారిచూపుచు ముందు నడచునుగాక.

నీలుడా ! చల్లని నీడలుగల అడవులగుండ, మంచినీరు లభించు మార్గము చూచి సేనను నడపింపుము-మార్గములోని జలములను, ఫలమూలములను, రాక్షసులు చెరిచి వేయుదురు. మెలకువతో కనిపెట్టియుండుడు.

దూషయేయు ర్దురాత్మానః పథి మూలఫలోదకమ్
రాక్షసాః పరిరక్షేథా స్తేభ్య స్త్వం నిత్య ముద్యతః. 4-12

దారిలో శత్రుసైన్యములు దాగియుండగలవు. చూచినడచుట అవసరము. మనలో బలహీనులైనవారిని వెనుక నిలిపి పరాక్రమవంతులను ముందు నడపింపుము.

గజుడు, గవయుడు, గవాక్షుడు సేనకు ముందుగాను, ఋషభుడు కుడిప్రక్క, గంధ మాదనుడు ఎడమ ప్రక్కను నడతురు గాక. నేను హనుమంతునిపై నెక్కి సేన మధ్యలో వచ్చెదను-లక్ష్మణుడు అంగదునిపై నెక్కి రాగలడు-జాంబవంతుడు, సుషేణుడు, వేగదర్శి ఈ ముగ్గురు సేన వెనుక భాగమును రక్షించుచు రాగలరు.

శ్రీరాముని మాటలను, వాహినీపతి యైన సుగ్రీవుడు విని సంతోషించి ప్రయాణమునకు ఆజ్ఞ నిచ్చినాడు. వానర సేన బయలుదేరినది. సైనికు లందరు అత్యంతోత్సాహులై గంతులు వేయుచు, సింహనాదములు చేయుచు, దారిలో కానబడు వృక్షము లందలి ఫలములను తినుచు తేనె త్రాగుచు సాగిపోవుచున్నారు. సుగ్రీవుడు, రామ లక్ష్మణులు సేనమధ్యభాగములో నున్నారు. శ్రీరాముని ఆజ్ఞను మనస్సులో నుంచుకొని వానరులు నగరములమీదగాని, గ్రామములమీదగాని పడక అడవుల మార్గమున నడచినారు. వానర సేన సముద్రమువలె అనంతమైయున్నది. సైన్యము భయంకరధ్వనితో ప్రయాణము చేసినది.

రామస్య శాసనం జ్ఞాత్వా భీమకోపస్య భీతవత్
వర్జయ న్నగరాభ్యాశాం స్తథా జనపదానపి. 4-39

సాగరౌఘ నిభం భీమం తద్వానరబలం మహత్
ఉత్ససర్ప మహాఘోషం భీమఘోష ఇవార్ణవః. 4-40

శ్రీరాముడు హనుమంతుని మీదను, లక్ష్మణుడు అంగదుని మీదను ఎక్కి వచ్చుచున్నారు.

**లక్ష్మణుడు :** (సంతోషముతో) రామా! నీవు శీఘ్రకాలములోనే సీతాదేవిని గూడి అయోధ్యకు వెళ్లగలవు. ఆకాశమందును, భూమియందును నాకు మంచి శకునములు కనబడుచున్నవి. మన ఇక్ష్వాకుల నక్షత్రమైన విశాఖ నిర్మలముగా ప్రకాశించుచున్నది. రాక్షసుల నక్షత్రమైన మూల ధూమకేతు స్పర్శవలన కాంతి విహీనమైయున్నది. వీని నన్నింటిని గుర్తించి ఆనందింపదగిన సమయ మిది. మనకు జయము కలుగుటలో సందేహములేదు.

సైన్య మంతయు ఉత్సాహ సంపన్నమై యుండినది. నఖములు, దంతములే వానరుల ఆయుధములు. సైన్యము భూమినంతయు ఆక్రమించి నడచుచున్నది. నదులను పర్వతములను అడవులను దాటుకొనుచు ప్రయాణము సాగించినారు. హాయిగా ఆడుకొనుచు, పాడుకొనుచు, ఎగురుచు, అఱచుచు, రాత్రియనక, పగలనక నడచుచున్నారు. నదులలో స్నానములు చేయుచు, దారిలో చెట్లయందలి ఫలములను

తినుచు, తేనె త్రాగుచు, ఉత్సాహముగా ప్రయాణము చేసి సహ్యాపర్వతము, మలయ పర్వతము సమీపించినారు.

స్నాత్వా పీతోదకా స్తత్ర జలే క్రీడంతి వానరాః
అన్యోన్యం ప్లావయంతి స్మ శైల మారుహ్య వానరాః. 4-89

ఫలా న్యమృతగంధీని మూలాని కుసుమాని చ
బుభుజు ర్వానరా స్తత్ర పాదపానాం మదోత్కటాః. 4-90

ద్రోణమాత్ర ప్రమాణాని లంబమానాని వానరాః
యయుః పిబంతో హృష్టా స్తే మధూని మధుపింగళాః 4-91

ఇట్లు ప్రయాణము చేసి మహేంద్రపర్వతము చేరినారు. శ్రీరాముడు లక్ష్మణ సుగ్రీవ సహితుడై పర్వతశిఖర మారోహించి సముద్రమును కని, పర్వతముపైనుండి దిగి, అందరును సాగరతీరమునకు వచ్చినారు.

అవరుహ్య జగామాశు వేలావన మనుత్తమమ్
రామో రమయతాం శ్రేష్ఠ స్ససుగ్రీవ స్సలక్ష్మణః 4-98

## వానరసైన్యమును సముద్రతీరమున విడియించుట

*రాముడు :* సుగ్రీవా! మనము సముద్రతీరము చేరినాము. దీనికి ఆవలిగట్టు కాన వచ్చుటయే లేదు!

అతః పరమతీరోఽయం సాగర స్సరితాం పతిః 4-101

ఎద్దియేని ఉపాయ మాలోచించి ఈ సముద్రమును దాటవలయును. సైన్యమును ఇక్కడనే విడియించి, ఆవలి తీరమునకు చేర్చుమాట పిదప ఆలోచింతము. ఇప్పుడు సేనలను విడియింపుము. ఎవ్వడుగాని తన సేనను వదలి ఎక్కడికిని పోరాదు. శూరులైన వానరులు నాలుగుప్రక్కల తిరుగుచు శత్రువు లెవరైన దాగియున్నారా అని కనిపెట్టుచు మెలకువతో మెలగవలయును.

స్వాం స్వాం సేనాం సముత్సృజ్య మా చ కశ్చి త్కుతో వ్రజేత్
గచ్ఛంతు వానరా శ్శూరా జ్ఞేయం ఛన్నం భయం చ నః.

సుగ్రీవుడు వానరసైన్యమును సముద్రతీరమున విడియించినాడు. సైన్యము విడియుటలో పుట్టిన ధ్వని సముద్రధ్వనిని అణచివైచినది. సముద్రమును చూచి 'దీనిని దాటగలమా' అని వానరులకు దిగులుపుట్టినది.

సముద్రమునందలి నురుగును చూడగా సముద్రము నవ్వుచున్నట్లు కనిపించినది. అలలు ఎగురుచుండుట చూడగా సముద్రము నాట్యము చేయుచున్నట్లు తోచినది. ఎన్నో చంద్రబింబములు సముద్రములో ప్రతిఫలించుచు కనబడుచున్నవి. సముద్రమున మొసళ్ళు, సర్పములు, మొదలగు క్రూరజంతువు లెన్నో యున్నవి. అందలి సర్పముల ఫణములయందు మణులు ధగధగ వెలుగుచుండినవి. సముద్రములోపల పర్వతములు మునిగియుండినవి. సర్వము జలమయముగా నున్నది. సముద్రమునకు ఆవలితీరమే ఉన్నట్టులేదు. దానిని దాటుటకు దారి కనిపించలేదు. సముద్రము అగాధముగా నున్నది. ఇట్టి సముద్రమును చూచి వానరులు దిగులొందినారు.

సముద్రమునకు ఆకాశమునకు భేదము కానరాలేదు. ఒకదానివలె ఒకటి యున్నది.

సాగరం చాంబరప్రఖ్య మంబరం సాగరోపమమ్
సాగరం చాంబరం చేతి నిర్విశేష మదృశ్యత. 4-119

సముద్రజలము ఆకాశమువలె నున్నది. సముద్రములోని రత్నములు ఆకాశమునందలి నక్షత్రములవలె నున్నవి. అలలు మేఘములవలె నున్నవి. అలల శబ్దము మేఘముల శబ్దమువలె వినిపించినది. అలలు పైకి లేచి గర్జించుట చూడగా సముద్రము కోపించి ఏమో మాటలాడుచున్నట్లు అనిపించినది. ఇట్టి సముద్రమును చూచి వానరులు భయసంభ్రమములకు లోనైనారు.

సేనాధిపతియైన నీలుడు యుద్ధనీతిశాస్త్రానుసారము సైన్యమును విడియించినాడు.

[ఈ ఘట్టమున ఒకమాట. శ్రీరాముని సహాయార్థము వానరసైన్యమును సృష్టించిన మహానుభావుల ప్రజ్ఞ కొనియాడదగియున్నది. వానరుల నఖములు, దంతములే వారి ఆయుధములు. చెట్లలోనుండు పండ్లు, కాయలే వారి ఆహారము. దారి బాగుచేయ నవసరములేదు. రస్తాలు వేయనక్కరలేదు. వారిని కదలించుటకు వాహనము లక్కరలేదు. వారినిగూర్చి ఎవ్వరికిని ఎట్టి కష్టమునులేదు. దేవుని దయవలన వానరసైన్యము దొరకబట్టి, శ్రీరాముని యుద్ధ ప్రయత్నము సులభముగా సాగినది. లేకపోయినచో అడవిలో అవస్థపడుచుండిన ధనహీనుడైన శ్రీరాముడు ఏమి చేయగలడు! ఇప్పటి మన సైన్యములను కదలించుటకు రస్తాల శాఖలు, ఆహార శాఖలు, ఆయుధ శాఖలు ఎన్నో కావలయును. వ్యయమునకు మితియే లేదు. శ్రీరామునికి అట్టి ఇబ్బందు లేవియు లేక గొప్పసైన్యము లభించినది.]

## శ్రీరాముని శోకము

సైన్యమంతయు సముద్రతీరమున చేరినది. శ్రీరాముని మనస్సు సీతాదేవిపైకి మరలినది. రామునికి శోకము కలిగినది. మన్మథపీడితుడైనాడు.

రాముడు : లక్ష్మణా! కాలము గడచినచో శోకము తగ్గిపోవు నని చెప్పుదురు. నాకు మాత్రము సీతను చూడజాలనందున కాలము గడచుకొలది శోకము వృద్ధి యగుచున్న దేగాని తగ్గుటలేదు. సీత దూరదేశమున ఉన్న దనిగాని, రాక్షసుడు సీతను అపహరించినా డనిగాని అంత దుఃఖపడను. సీత యౌవనము గడచిపోవు చున్న దని మాత్రము విచారపడుచున్నాను.

న మే దుఃఖం ప్రియా దూరే న మే దుఃఖం హృతేతి వా
ఏతదేవానుశోచామి వయోస్యా హ్యతివర్తతే. 5-5

వాయుదేవుడా! నీవు నా ప్రియురాలి చెంత కరిగి ఆమెను స్పృశించి ఇక్కడికి వచ్చి నన్ను స్పృశింతువేని నేను నా ప్రియురాలిని స్పృశించినట్లే సంతోషించెదను. ఇక్కడను, అక్కడను ప్రకాశించు చంద్రుడు మా చూపులకు సమాగమము చేకూర్చగలడు.

[ఇరువురును చంద్రుని చూచుట వలన వారి చూపులు చంద్రబింబమున కలిసికొనును]

వాహి వాత యతః కాంతా తాం స్పృష్ట్వా మామపి స్పృశ
త్వయి మే గాత్రసంస్పర్శ శ్చంద్రే దృష్టి సమాగమః. 5-6

రాక్షసునిచేత చిక్కి 'హానాథా' అని సీత పలికిన ఆక్రందనశబ్దము నా శరీరమును దహించివేయుచున్నది. రాత్రి, పగలు అనక ఈ మదనాగ్ని నన్ను దహించుచున్నది. లక్ష్మణా! నే నీ సముద్రములో జొచ్చెదను. అప్పుడైనను ఈ అగ్ని చల్లారునా! నేను, నా సీత ఈ భూమిమీదనే ఉన్నాముగదాయని నేనింకను ప్రాణముతో నున్నాను. రాక్షసుని వధించి నేను సీతను ఎన్నడు కలిసికొందునోగదా! నేను నాథుడనై యుండియు నా సీత రాక్షసుల చేతులలో చిక్కి అనాథవలె ఎంత బాధపడుచున్నదో. పాపము! సీత దుఃఖముతోను ఉపవాసములతోను కృశించిపోయియుండును. సీత నన్ను కవుగిలించుకొని ఆనందబాష్పములను ఎన్నడు విడుచునోగదా!

ఇట్లు విలపించుచుండిన శ్రీరాముని లక్ష్మణుడు ఊరడించినాడు. ఇంతలో సూర్యాస్తమయ మైనది. రామలక్ష్మణులు సంధ్యను ఉపాసించి విశ్రమించినారు.

## రావణ సభ (మంత్రులతో)

హనుమంతుడు కావించిన కార్యము తలచుకొని రావణాసురుడు సిగ్గు పడి, తల కొంచెము వంచుకొని, తన మంత్రులు కూడియుండిన సభలో మాటలాడుచున్నాడు.

**రావణుడు :** ఒక వానరమాత్రుడు మన లంకలో ప్రవేశించి సీతను చూచినాడు. మన వారి నెందరనో వధించినాడు. పట్టణమును తగులబెట్టినాడు. ఇప్పుడు మన కర్తవ్యమునుగూర్చి ఆలోచింపవలసిన సమయము వచ్చినది.

విజయమునకు మంతనమే మూలమని పెద్దలు చెప్పియున్నారు. కావున మీరందరు చక్కగా ఆలోచించి మన కేది హితవో నిర్ణయింపుడు.

లోకమున పురుషులు ఉత్తములు, మధ్యములు, అధములు అని మూడు తరగతు లున్నారు. స్నేహితులతోను, మంత్రులతోను, హితులతోను ఆలోచించి గుణదోషములు నిర్ణయించుకొని కార్యము ప్రారంభము చేసి దైవముమీద భారము వేయువాడు ఉత్తముడు. ఎవ్వరితోను ఆలోచింపక కేవల దైవముమీద భారము మోపి పనులు ప్రారంభించువాడు మధ్యముడు. రెంటిని లెక్కచేయక కార్యమును ప్రారంభించి దానిని తుదముట్ట నిర్వహింపక ఉపేక్షచేయువాడు అధముడు.

పురుషులలో మూడు తరగతు లున్నట్లే ఆలోచనలలోకూడ మూడు రకము లున్నవి. మంత్రు లందరు ఐకమత్యముతో ఉండి ఒక్క మాటయే చెప్పుట ఉత్తమము. మొదట మొదట భిన్నాభిప్రాయము లుండినను పర్యవసానమున ఏకాభిప్రాయమునకు వచ్చుట మధ్యమము. మొదటినుండియు తుదవరకు భిన్నాభిప్రాయములు కలిగి ఎవరిమాటలో వా రుండుట అధమ ఆలోచన.

మంత్రులారా! మీ రందరు చక్కగా ఆలోచించి నాకు హితము చెప్పుడు. రాముడు వానరసైన్యములను వెంటబెట్టుకొని మన లంకపైకి వచ్చుచున్నాడు. రాముడు సైన్యసమేతుడై తన ప్రభావముచే సముద్రమును సైతము సులభముగా దాటిరాగల డని స్పష్ట మగుచున్నది.

తరిష్యతి చ సువ్యక్తం రాఘవ స్సాగరం సుఖమ్
తరసా యుక్తరూపేణ సానుజ స్సబలానుగః 6-17

రాముడు తన పరాక్రమముచే సముద్రమును ఎండింపజేసినను చేయగలడు, లేక మరి యే విధమున నైనను దాటిరాగలడు.

సముద్ర ముచ్ఛోషయతి వీర్యేణాన్య త్కరోతి వా. 6-18

మనకు యుద్ధము తప్పునట్లు లేదు. మన పట్టణమునకు, మన సేనలకు, మనకు ఏది హితమో మీరు చక్కగా ఆలోచించి చెప్పుడు.

**మంత్రులు :** మహాప్రభూ! నీ కెందు కీ విషాదము. మన బలము సామాన్యమైనది కాదు. తక్కువదికాదు. పాతాళమున నున్న భోగవతిని నీవు

జయించితివి. కుబేరుని జయించి అతని పుష్పక విమానమును తెచ్చియున్నావు. దానవేంద్రుడైన మయుడు నీ పరాక్రమమును చూచి భీతి జెంది, నీ సఖ్యము కోరి తన పుత్రికను (మండోదరిని) నీ కిచ్చి పెండ్లిచేసినాడు. నీవు రసాతలముపై దండయాత్ర సలిపి నాగేంద్రులను జయించినావు. కాలకేయులను వశపరచుకొని వారివలన ఎన్నో మాయలు నేర్చియున్నావు. యమునినైతము ఓడించి యున్నావు. ఇంకను ఎందరనో హతమార్చియున్నావు. వారికంటె రాముడు ఎక్కువవాడు కాడు.

నీ వరకు ఏల ? మన ఇంద్రజిత్తు చాలును. ఇంద్రుని బంధించి లంకకు తెచ్చిన ఇంద్రజిత్తుకు ఈ వానరులను, రాముని వధించుట ఒక పెద్ద పనికాదు.

ఎవ్వడో ఒక క్షుద్ర వానరునివలన మనకు సంభవించిన ఆపదను మనస్సులో నుంచుకొనుట సరికాదు. నీవు రాముని తప్పక వధింపగలవు.

> రాజన్నాపదయుక్తేయ మాగతా ప్రాకృతా జ్జనాత్
> హృది నైవ త్వయా కార్యా త్వం వధిష్యసి రాఘవమ్. 7.24

*ప్రహస్తుడు :* (సేనాపతి) ప్రభూ ! దేవదానవగంధర్వులుకూడ యుద్ధమున నీ యెదుట నిలువజాలరు గదా ! ఈ వానరులు నిలువగలరా ! హనుమంతుడు వచ్చినప్పుడు ఏమరుపాటుగానుండి మనము మోసపోయితిమి. లేకున్న, నేను జీవించి యుండగా ఆ వానరుడు ప్రాణముతో బయటపడియుండడు. పొరపాటు జరిగి పోయినది. ఇప్పుడు మన పట్టణమును మెలకువతో రక్షింతును. మనకు వానరుల వలన ఎట్టి భయముగాని ఉండబోదు. నీ యాజ్ఞ యగునేని ఈ లోకమున వానరు డనువాడు లేకుండునట్లు అందరను నాశనము చేయగలను.

*దుర్ముఖుడు :* హనుమంతుడు మన ప్రభువును, అంతఃపురమును అవమానించినాడు. ఇది క్షమింపదగిన అపరాధముకాదు. నే నిప్పుడే పోయి వానరుల నందరను వధించి వత్తును.

*వజ్రదంష్ట్రుడు :* హనుమంతుడు ఒక నీచ వానరుడు. అతనితో పనియేమి ? రామలక్ష్మణు లను, సుగ్రీవుని నేను వధించి వత్తును. వానరసేనను హతమార్పగలను. ప్రభూ ! మరొక్కమాట ! ఇష్టమైనచో వినుము. మన మొక ఉపాయముచే శత్రువును జయింపవచ్చును. మన రాక్షసులు వేనకువేలుగా మనుష్యరూపములను ధరించి రామునియొద్దకు వెళ్ళి తొట్రుపాటులేక "మేము భరతుని పంపున వచ్చినాము. ఇంకను సేనలను నడపించుకొని భరతుడు వెనుక వచ్చుచున్నాడు", అని చెప్పి,

వానర సైన్యమున ప్రవేశించి సైన్యమును చంపుదము. దానితో రామలక్ష్మ ణులు దిగులుపడి మరణింపగలరు.

కుంభకర్ణుని కుమారుడైన నికుంభుడు గొప్ప వీరుడు గనుక ఈ మాటలకు కోపించి లోకరావణుడైన (లోకములను బాధించువాడు) రావణునితో అనుచున్నాడు.

అబ్రవీ త్పరమక్రుద్ధో రావణం లోకరావణమ్. 8-19

*నికుంభుడు :* ప్రభూ! ఈ మాటలతో పని యేమి! మీ రందరు ఇందే యుండుడు. నే నొక్కడనే పోయి రామలక్ష్మణులను, సుగ్రీవుని, హనుమంతుని, సమస్త వానర సైన్యమును వధించి రాగలను.

*వజ్రహనుడు :* మీ రెల్లరు నిశ్చింతగా నుండుడు. నేను పోయి వారి నందరను భక్షించి రాగలను.

ఇంతలో, కొందరు రాక్షసవీరులు ఆయుధములు గైకొని వానరులను వధించుటకు బయలుదేరినారు. విభీషణుడు వారిని వారించి కూర్చుండబెట్టి రావణునితో అనుచున్నాడు.

*విభీషణుడు :* ప్రభూ! సామదాన భేద దండోపాయము లని నాలుగు ఉపాయము లున్నవి గదా! సామ దాన భేదములతో పనులు చక్కబడక పోవునేని ఆపై దండోపాయమును ప్రయోగించుట యుక్తము. ఇప్పుడు దండోపాయమునకు సమయము కాదు. మొదటి మాట, ఈ దండోపాయము అందరియెడ పని చేయ జాలదు. ఏమరుపాటుగా నుండువారిమీద, శత్రువుల చేతిలో చిక్కినవారి మీద దైవానుకూల్యము లేనివారియందు ప్రయోగింతుమేని లాభించును. రాముడు అట్టివాడుకాడు. రాముడు అప్రమత్తుడు. మనలను జయించుటకు సంసిద్ధుడై వచ్చియున్నాడు. రామునికి దైవబలముకూడ కలదు. హనుమంతుడు సముద్రమును లంఘించి మన నగరము ప్రవేశించి ఇచ్చట ఎంత పని సాధించెనో ఆలోచింపుము. యుద్ధమున రాముని జయించుట మనకు సాధ్యము కాదు.

రాక్షసులారా! శత్రు బలమును విమర్శింపకయే త్వరపడి చులకనగా భాషించుట గొప్ప తప్పు. జనస్థానమున నుండిన మనవారిని రాముడు సంహరించిన కారణమున మన ప్రభువు ప్రతీకారభావముతో రాముని భార్య నపహరించుట దోషము కాదని యందురా? అది సరియైన మాట కాదు. జనస్థాన వధ విషయమున తప్పు మన వారిదేగాని రామునిది కాదు. రామునిపైకి ఖరుడు యుద్ధమునకు పోయినాడు. రాముడు తన్ను రక్షించుకొనుటకుగా ప్రతియుద్ధము చేసి ఖరుడు మొదలైనవారిని

సంహరించినాడు. ప్రతి ప్రాణియు తన ప్రాణమును శక్తికొలది రక్షించుకొనుట సహజమేకదా! ఇంతకును, పరదారాభిమర్శనము ఘోరదోషము. దానివలన అపకీర్తి పాలగుటయేగాక మన అర్థప్రాణములు భస్మమై పోవును. పాపముకూడ మనలను ఆవరించును.

అయశస్య మనాయుష్యం పరదారాభిమర్శనమ్
అర్థక్షయకరం ఘోరం పాపస్య చ పునర్భవమ్. 9-15

సీత కారణమున మనకు గొప్ప ఆపద సంభవింపగలదు. సీతను వదలుకొన్నచో వైరము తీరిపోవును. రామునితో విరోధము పెట్టుకొనుట క్షేమకరముకాదు. అట్టి ధర్మాత్ముని భార్యను ఆయనకు సమర్పించుట మనకు మేలు.

న నః క్షమం వీర్యవతా తేన ధర్మానువర్తినా
వైరం నిరర్థకం కర్తుం దీయతా మస్య మైథిలీ. 9-17

రామునికి సీతను మనమై ఈయనిచో మన పట్టణము, మనము సర్వనాశనమై పోగలము. ప్రభూ! నిన్ను ప్రార్థించుచున్నాను. నా మాట వినుము. రామబాణములు మనల నందరను దహింపకమున్నే, సీతను రామునికి సమర్పింపుము. సుఖమును, ధర్మమును నశింపజేయు కోపమును పరిత్యజించి, మన కీర్తిని ఆనందమును వృద్ధిజేయు ధర్మము నవలంబింపుము. నీవు ప్రసన్నుడవై మన మందరము భార్యాపుత్రులతో క్షేమముగా బ్రదికియుండునట్లు చూడుము. నా ప్రార్థన నంగీకరించి సీతను రామునికి సమర్పింపుము.

త్యజస్వ కోపం సుఖధర్మ నాశనమ్
భజస్వ ధర్మం రతి కీర్తి వర్ధనమ్
ప్రసీద జీవేమ సపుత్రబాంధవాః
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. 9-23

విభీషణుని మాటలు విని రావణుడు సభచాలించి అంతఃపురము ప్రవేశించినాడు.

[రావణుని ఉపోద్ఘాత మంతయు వ్యర్థ మైనట్లు కనిపించుచున్నది. మంత్రాంగము అధమ పద్ధతిలోపడినది. నలుగురు నాలుగు విధములుగా మాట్లాడినారు. రావణుడు సభ చాలించి లేచిపోవక ఏమిచేయగలడు!]

## విభీషణుడు రావణునికి హితము చెప్పుట

విభీషణుడు తన ప్రయత్నమును వీడలేదు. మరునాడు ప్రొద్దుననే రావణుని భవనమునకు పోయినాడు. రావణుడు కొలువుకూటమున సింహాసనగతుడై యున్నాడు. అచ్చట కొందరు మంత్రులు తప్ప మరెవ్వరును ...

**విభీషణుడు :** (నమస్కరించి) అన్నా! సీత మన నగరమునకు వచ్చిననాటినుండియు అశుభశకునములే కానబడుచున్నవి. గృహము లందును, వేదాధ్యయనము చేయు ప్రదేశము లందును సర్పములు తిరుగుచున్నవి. హవిస్సులకు చీమలు పట్టుచున్నవి. ఏనుగులు, గుఱ్ఱములు మేత తినక దీనముగా నున్నవి. కాకులు గుంపులుగూడి ఘోరముగా అరుచుచున్నవి. గ్రద్దలు గుంపులుకట్టి ప్రతిగృహము మీదను వ్రాలుచున్నవి. నక్కలు. కుక్కలు నగరద్వారముల చెంతజేరి పిడుగు పంటి శబ్దములను చేయుచున్నవి ఇట్టివి లెక్కలేనన్ని అపశకునములు కనబడు చున్నవి. వీనికి ప్రాయశ్చిత్తముగా సీతను రామునికి సమర్పించుట మనకు మేలు.

తదేవం ప్రస్తుతే కార్యే ప్రాయశ్చిత్త మిదం క్షమమ్
రోచతే యది వైదేహీ రాఘవాయ ప్రదీయతామ్. 10-22

అన్నా! ఈ అపశకునముల విషయము ఊరిలోని స్త్రీపురుషుల కందరకును తెలిసియున్నది. అంతఃపురజనమునకుకూడ తెలియును. నీ మంత్రులు నీకు భయపడి వీనినిగూర్చి నీతో చెప్పుటలేదు. నాకు తెలిసిన విషయములను నీకు నివేదింపవలసిన బాధ్యత నాకు కలదు గనుక మనవి చేయుచున్నాను. దీనిని ఒక తప్పుగా భావింపకుము.

నేను చెప్పిన మాటలనుగూర్చి నీవు చక్కగా ఆలోచింపుము. నీకు ఏది న్యాయ మని తోచునో అట్లు చేయుము.

శ్రావణే చాస్య మంత్రస్య నివృత్తా స్సర్వ మంత్రిణః
అవశ్యం చ మయా వాచ్యం యద్దృష్టమపి వా శ్రుతమ్. 10-25

సంప్రధార్య యథా న్యాయం త ద్భవాన్ కర్తు మర్హసి 10-26

విభీషణుని మాటలు రావణునికి రుచింపలేదు.

**రావణుడు :** (కోపముతో) విభీషణా! ఎందు కీ శుష్కప్రలాపములు! రాముడు ఇంద్ర సహితుడై వచ్చినను నా యెదుట ఆగగలడా! నా చేజిక్కిన సీతను గైకొని పోగలడా! రామునికి భయపడి సీత నిత్తునా! నా కెవ్వరివలనగాని ఎట్టి భయ మును లేదు. నీవు సెలవు తీసికొనవచ్చును.

పాపము! విభీషణుడు చేయున దేమియు లేక అక్కడనుండి వెళ్ళిపోయినాడు. ఆ దినము అట్లు గడచిపోయినది.

## రావణుని కొలువుకూటములో మహాసభ

రావణుడు దినదినమునకు కృశించిపోవుచున్నాడు. కామమోహితు డగుటవలనను, తానుచేసిన పాపకార్య ఫలముగాను, స్నేహితుల అనాదరణవలనను రావణుడు క్షీణించుచున్నాడు.

స బభూవ కృశో రాజా మైథిలీకామమోహితః
అసమ్మానాచ్చ సుహృదాం పాపః పాపేన కర్మణా. 11-1

[రావణుని పాపము అప్పుడే పంటకు వచ్చుచున్నది. మనస్సు స్తిమితముగాలేదు. స్నేహితులు, బంధువులు దూర మగుచున్నారు. శరీరము కృశించినది. తెలివితేటలు అడుగంటుచున్నవి.]

రావణుని కన్నులయెదుట యుద్ధము తాండవిచుచున్నది. మంత్రులతోను ప్రజలతోను సంప్రతించవలసిన కాలము సంప్రాప్త మైనదని రావణుడు తెలిసికొని రథము నారోహించి సపరివారముగా సభామందిరమున కరిగినాడు.

రథమునం దుండిన రావణునికి రాక్షసు లందరు చేతులు జోడించి నమస్కరించినారు. రావణుడు సభామందిరమున ప్రవేశించి సింహాసనము నలంకరించి దూతలతో అనుచున్నాడు.

**రావణుడు :** ఇప్పుడు మన కొక గొప్పపని కలిగినది. మీరు నగరములోనికి వెళ్ళి రాక్షసుల నందరను శీఘ్రముగా పిలుచుకొనిరావలయును.

దూతలు ఇంటింటికి వెళ్ళి ఇండ్లలో నుండువారిని, ఉద్యానవనములందు విహరించుచుండిన వారిని, ఎక్కడెక్కడనో ఉండినవారి నందరను పిలిచినారు.

రాక్షసులు సభామందిరమునకు వచ్చుచున్నారు. కొందరు రథములలో, కొందరు గుఱ్ఱములమీద, కొందరు ఏనుగులమీద, మరికొందరు కాలినడకన ఈ విధముగా అందరు మందిరము చేరినారు. వారివారి వాహనములను బయట నిలిపి సభామందిరమున ప్రవేశించినారు. అందరు రావణునికి నమస్కరించి, కొందరు సువర్ణాసనములయందును, కొందరు దర్భాసనములమీదను, మరికొందరు నేల మీదను వారివారి యోగ్యతకు తగినట్లు అందరు ఆసీను లైనారు.

విభీషణుడుకూడ సభకు వచ్చినాడు. రావణుడు విభీషణునికి స్వాగతము చెప్పి కాంచనాసనమున కూర్చుండ నియమించినాడు. సభామందిరము ప్రజలతో నిండియున్నది. ప్రజ లందరు తమ చూపులను రావణుని ముఖమునందు నిలిపి నిశ్శబ్దముగా కూర్చుండియున్నారు.

న చుక్రుశు ర్నానృతమాహ కశ్చి
త్సభాసదో నైవ జజల్పు రుచ్చైః
సంసిద్ధార్థా స్సర్వ ఏవోగ్రవీర్యా
భర్తు స్సర్వే దదృశు శ్చాననం తే. 11-32

సభలో కార్యక్రమము ప్రారంభము కాబోవుచున్నది. సేనాపతియైన ప్రహస్తుని రావణుడు హెచ్చరించుచున్నాడు.

**రావణుడు :** సేనాపతీ! నగరమునకు ఎప్పటికన్న నెక్కువగా రక్షణపర్పాటులను చేయుట అవసరము. దిటవుగల వీరులను ఆ పనికి నియమింపుము.

ప్రహస్తుడు మేటి వీరులను మందిరము లోపలను, బయటను కావలి పెట్టినాడు. నగరరక్షణకు సైన్యమును నియమించి, కావలసిన పర్పాటులను చేసివచ్చి, ఆ సంగతి రావణునితో చెప్పుచున్నాడు.

**ప్రహస్తుడు :** ప్రభూ! నగర రక్షణకును, సభామందిర రక్షణకును కావలసిన పర్పాటులను కావించితిని. దిగులులేక కార్యక్రమమును జరుపుకొనవచ్చును.

నిహితం బహి రంతశ్చ బలం బలవత స్తవ
కురుష్వావిమనాః క్షిప్రం యదభిప్రేత మస్తి తే. 12-5

[రావణుని దిగులు ప్రహస్తునికి తెలియును. మనముకూడ ఊహింపవచ్చును]

రావణుడు సభను ప్రారంభించి మాటలాడుచున్నాడు.

**రావణుడు :** మంత్రులారా! ప్రజలారా! ధర్మార్థకామములకు సంబంధించిన కష్టములు సంభవించినప్పుడు ప్రియాప్రియములను, సుఖదుఃఖములను, లాభాలాభములను, హితాహితములను, విమర్శించి తెలిసికొనుటకు మీ రందరు సమర్థులు. మీతో మంతనములు జరిపి ప్రారంభించిన కార్యము లన్నియు నేటివరకు జయప్రదములుగనే ఉన్నవి. ఈ నాటి సమస్యనుగూర్చి నే నింతకుపూర్వమే కొంత చెప్పియున్నాను. అప్పటిలో కుంభకర్ణుడు నిద్రించుచుండినందున, అతనితో సంప్రతించుటకు వీలులేకపోయినది. ఈ నాడు కుంభకర్ణుడు సైతము వచ్చియున్నాడు.

నేను సీతను దండకారణ్యమునుండి తెచ్చిన సంగతి మీకు తెలిసియే యున్నది. సీతవంటి రూపలావణ్యవతి ముల్లోకములందును లేదు. సీతపై నా మనస్సు గాఢముగా నెలకొనియున్నది. కాని ఆమె ఇప్పటివరకు నా వశము కాలేదు. నేను [illegible] లో నున్నాను. సీత తన భర్తకై ఎదురుచూచుచు ఒక సంవత్సరము గడు వీయు మని నన్ను ప్రార్థించినది.

[గడువును సీతాదేవి కోరలేదు. ఒక సంవత్సరము లోపల సీతాదేవిని వంచగల మని ఆశపడి రావణుడే స్వయముగా గడువు పెట్టినాడు. తన ప్రజలతో చెప్పుటలో బెట్టుసరికి అబద్ధ మాడుచున్నాడు. అంతచేసిన రావణునికి ఈ అబద్ధము ఒక లెక్కలోనిది కాదు.]

సా తు సంవత్సరం కాలం మా మయాచత భామినీ
ప్రతీక్షమాణా భర్తారం రామ మాయతలోచనా. 12-18

ఆమె ప్రార్థన నే నంగీకరించితిని.

నేను మదన బాధను భరింపజాలక అలసి యున్నాను. అక్షోభ్యమైన సముద్ర మును రామలక్ష్మణులు గాని, వానర సేనలు గాని దాటజాల రని తోచుచున్నది. అయినను, ఒక్క వానరమాత్రుడు సముద్రమును లంఘించి ఇచ్చటికి వచ్చి గొప్ప యుద్ధము చేసిపోయిన సంగతిని మనము మరవరాదు. కార్యగతులను తెలిసికొనుట సులభముకాదు. కావున మీరు చక్కగా ఆలోచించి కర్తవ్యమును వినిపింపుడు.

అథవా కపినైకేన కృతం నః కదనం మహత్
దుర్జ్ఞేయాః కార్యగతయో బ్రూత యస్య యథామతిః. 12-21

మీ సహాయముతో నేను దేవాసురులను జయించి యున్నాను. మనుష్య మాత్రునివలన నా కేమియు భయములేదు. అయినను, మీ రందరు విషయమును సమగ్ర ముగా విమర్శించి మీ అభిప్రాయములను తెలియజేయుడు.

రామలక్ష్మణులు సుగ్రీవసహితులై వానర సైన్యమును వెంటబెట్టుకొని వచ్చి సముద్రతీరమున విడిసియున్నారు. కావున మనము దీనినిగూర్చి శ్రద్ధగా అలోచింప వలసిన తరుణము వచ్చినది. సీతను వదలుకొనక, రామలక్ష్మణులను వధించి మనము సుఖముగా నుండగల మార్గమును మీరు అన్వేషించి నివేదింపుడు.

అదేయా చ యథా సీతా వధ్యౌ దశరథాత్మజౌ
భవద్భి ర్మంత్ర్యతాం మంత్ర స్సునీతంచాభిధీయతామ్. 12-25

ఎటు చూచినను, రామలక్ష్మణులు సముద్రమును దాటజాలరు. మనకు జయము తప్పక కలుగును.

[రావణుని మనస్సు స్తిమితముగాలేదు. అటు కొంత, ఇటు కొంత మాట్లాడు చున్నాడు. మొత్తమునకు, హనుమంతుడు చేసిన పని రావణుని మొదలుకొని ప్రతి రాక్షసుని హృదయములోను మెదలుచునే యున్నది. రాక్షసులకు భీతిగొల్పి హనుమంతుడు సగము యుద్ధమును గెలిచినాడు.]

***కుంభకర్ణుడు :*** (కోపముతో) రాజా ! నీ వీ ఆలోచన, ముందే చేసియుండవలసినది. నీవు ఎవ్వరితోను ఆలోచింపకయే సీతను బలాత్కారముగా తెచ్చితివి. మొదటనే

ఆలోచించి యుండువేని, వెనుక ఈ పరితాపము ఉండియుండదు. ముందు చేయవలసిన పనిని వెనుక, వెనుక చేయవలసిన పనిని ముందు, ఎవ్వడు చేయునో అతడు మంచిచెడ్డలు తెలిసినవాడు కాడు.

యః పశ్చా త్పూర్వకార్యాణి కురుతే బుద్ధిమోహితః
పూర్వం చోత్తర కార్యాణి న స వేద నయానయౌ. 12-32

మాతో ఎవ్వరితోగాని ఆలోచింపకయే ఇంతపనిచేసి గొంతుపైకి తెచ్చుకొంటివి. రాముడు నిన్నింకను చంపకయుండు టంతయు మా అదృష్టమేకాని మరేమియుకాదు.

త్వయేదం మహదారబ్ధం కార్య మప్రతిచింతితమ్
దిష్ట్యా త్వాం నావధీ ద్రామో విషమిశ్ర మివామిషమ్, 12-34

అయినను దిగులు నొందకుము. నేను శత్రువును వధించి నీకు సంతోషము కలిగింతును. నేను రామలక్ష్మణులను వధించి వారి రక్తమును పానము చేయుదును. వానరులను భక్షింతును. నీవు నిర్విచారముగా నుండుము. నేను రాముని వధించిన పిదప సీత నీకు వశము కాగలదు.

ఈ నిష్ఠురవాక్యములను విని రావణుడు ఆగ్రహించినాడు. రావణుని కోపమును మహాపార్శ్వుడు గమనించి రావణునికి ఊరటగా పలుకుచున్నాడు.

*మహాపార్శ్వుడు*: ప్రభూ! ఒక్క మనవి. క్రూరమృగములతోను, సర్పములతోను నిండియున్న అరణ్యములోనికి తేనెకొరకు పోయి, కష్టపడి ఆ తేనెను తెచ్చుకొని దానిని త్రాగకయుండువాడు మూఢుడు.

యః ఖల్వపి వనం ప్రాప్య మృగవ్యాళ సమాకులమ్
న పిబే న్మధు సంప్రాప్తం స నరో బాలిశో భవేత్. 13-2

నీవు అందరకును ఈశ్వరుడవు. నీకు ప్రభు వెవ్వడునులేడు. సీత నీకు వశ మగుట యేమిమాట! నీవు బలాత్కరించిన సరిపోవును. ఆ పిదప రాగల ఆపదలనుగూర్చి అటువెనుక ఆలోచింపవచ్చును. సీతను రామునికి సమర్పింపుమని కొందరు బలహీనులు చెప్పు మాటలను పాటింప పనిలేదు. సామదానభేదోపాయములను అతిక్రమించి దండోపాయమును ప్రయోగించుటయే ఉచితము.

*రావణుడు*: మహాపార్శ్వుడా! నాలో ఒక రహస్యము దాగియున్నది. చాలకాలము నాటిమాట. పుంజికస్థల యను అప్సరస బ్రహ్మయొద్దకు పోవుచుండగా నేను చూచి దారిలో బలాత్కరించితిని. ఈ సంగతి బ్రహ్మదేవుడు గ్రహించి నన్ను

శపించి "ఇకపై నీవు పరస్త్రీని బలాత్కరింతువేని నీ తల నూరువరియలగును.
ఇందుకు సందేహములేదు" అని చెప్పినాడు.

అద్యప్రభృతి యా మన్యాం బలా న్నారీం గమిష్యసి
తదా తే శతధా మూర్ధా ఫలిష్యతి న సంశయః. 13-14

ఈ శాపభయముచేతనే నీవు చెప్పినట్లు చేయజాలకున్నాను. నా పరాక్రమమును గూర్చి రామునికి తెలిసినట్టులేదు. కావుననే మనపైకి వచ్చుచున్నాడు. రానిమ్ము. నేను రాముని తప్పక వధింతును.

**విభీషణుడు:** ప్రభూ! సీత పంచఫణముల మహావిషసర్పము. మన కెంతమాత్రము వలదు.

వృతో హి బాహ్వ న్తరభోగరాశి
శ్చిన్తావిష స్సుస్మిత తీక్ష్ణ దంష్ట్రః
పంచాంగుళీ పంచ శిరోతికాయ
స్సీతామహాహి స్తవ కేన రాజ్ఞా 14-2

వానరసైన్యములు లంకకు రాకమున్నే సీతాదేవిని రామునికి సమర్పింపుము. రామబాణములు సమస్త రాక్షసులను బలిగొనకపూర్వమే సీతాదేవిని రామునికి సమర్పింపుము.

ప్రహస్తుడా! ప్రాణాంతకమైన రామబాణము నీదేహము నింకను భేదింపనందున నీ నోటికి వచ్చినట్లు పలుకుచుంటివి. కుంభకర్ణుడుగాని, ఇంద్రజిత్తుగాని, మన రాజుగాని, మరెవ్వరుగాని యుద్ధమున రాముని యెదుట నిలువజాలరు. నీవు పాతాళమున దాగినను, యముని ఒడిలో కూర్చుండినను మరియెచ్చటికి వెళ్లినను రామబాణము నిన్ను తరుముకొని వచ్చి వధింపగలదు.

**ప్రహస్తుడు:** విభీషణా! నీ మాటలు చాలింపుము. మనకు దేవతలవలనగాని, దానవుల వలనగాని, మరెవ్వరి వలనగాని భయములేదు. ఒకరాజపుత్రుడైన రాముడు మనల నేమిచేయగలడు!

**విభీషణుడు:** ప్రహస్తుడా! రాముడు ధర్మప్రధానుడు, కావున రాముని జయించుట అసాధ్యము. మీరందరు మన రాజునకు మిత్రరూపమున నున్న శత్రువులు. రామవైర మను సహస్రఫణముల సర్పము మన రాజును చుట్టుకొనియున్నది. మీరు నిజముగా రాజుహితమును కోరువారైనచో ఆ సర్పమును పారదోలి రాజును విముక్తుని చేయుడు. రాజు దుర్మార్గమున చరించునప్పుడు అతని తల పట్టుకొని లాగియైనను సన్మార్గమునకు మరలించువారే నిజమైన మిత్రులు.

యావద్ధి కేశగ్రహణం సుహృద్భి
స్సమేత్య సర్వైః పరిపూర్ణకామైః
నిగృహ్య రాజా పరిరక్షితవ్యో
భూతై ర్యథా భీమబలై ర్గృహీతః. 14-19

నేను సందర్భము లన్నింటిని గమనించి చక్కగా ఆలోచించి నా అభిప్రాయము చెప్పుచున్నాను. సీతాదేవిని రామునికి సమర్పించుట మంచిది. ఈ కార్యము లంకకు, మన ప్రభువునకు, మనకును క్షేమము చేకూర్చును. బలాబలములను గురుతించి విమర్శించి రాజునకు హితకరమైన యోచన చెప్పువారే సరియైన మంత్రులు.

*ఇంద్రజిత్తు* : చిన్నాయనా ! నీ కేదో విపరీతమైన భయము పట్టుకొన్నది. నీ యట్టి పిరికి పంద మన కులములో కనిపింపలేదు. మన వంశమున లేని మాట నీ నోట వచ్చినది. నీ పనికిమాలిన మాటలను చాలింపుము. మనవారిలో ఏ సామాన్య రాక్షసుడైనను రామలక్ష్మణులను వధింపగలడు. నీవు భయపడుటయేగాక, అందరను అనవసరముగా భయపెట్టుచున్నావు. నేను ఇంద్రుని జయించినవాడను. మనుష్యమాత్రులైన రామలక్ష్మణులు నా యెదుట నిలువగలరా.

*విభీషణుడు* : ఓరీ ఇంద్రజిత్తు ! నీవు పసివాడవు. నీ బుద్ధి పక్వముకాలేదు. నీవు మంత్రాంగమునకు పనికిరావు. నీవు నోటికి వచ్చినట్లు ప్రేలుచున్నావు. నీవు నీ తండ్రికి పరమశత్రువుగా నున్నావు. కావున నీవు వధ్యుడవు. నీవేకాదు; కండకావరముతో మదించియున్న నిన్ను ఆలోచన సభలోనికి రానిచ్చినవాడు కూడ వధ్యుడు.

త్వమేవ వధ్యశ్చ సుదుర్మతిశ్చ
స చాపి వధ్యో య ఇహానయ త్త్వామ్
బాలం దృఢం సాహసికం చ యోఽద్య
ప్రావేశయ న్మంత్రకృతాం సమీపమ్. 15-11

రామబాణ ప్రభావము నీకు తెలియదు. రామబాణములను సహింపగలవాడెవ్వడును లేడు.

రాజా ! నా మాట వినుము. ఆభరణములతోను, మేలైన వస్త్రములతోను రత్నములతోను సీతాదేవిని రామునికి సమర్పించి మన మందరము దుఃఖము వీడి సుఖముగా నుండవచ్చును.

ధనాని రత్నాని విభూషణాని
వాసాంసి దివ్యాని మణీంశ్చ చిత్రాన్
సీతాం చ రామాయ నివేద్య దేవీం
వసేమ రాజ న్నిహ వీతశోకాః. 15-14

**రావణుడు :** (పరుషముగా) విభీషణా! తెలిసిన శత్రువుతోగాని, క్రూర మగు విషసర్పముతోగాని నివసింపవచ్చును. కాని, మిత్రు డను పేరు పెట్టుకొని శత్రు పక్షమును సేవించు వానితో మాత్రము కలిసియుండలేము.

వసే త్సహ సపత్నేన క్రుద్ధేనాశీవిషేణ వా
న తు మిత్రప్రవాదేన సంవసే చ్ఛత్రుసేవినా. 16-2

లోకమున జ్ఞాతుల స్వభావము నాకు చక్క[illegible] తెలియును. తమవారికి దుఃఖము కలిగినప్పుడు జ్ఞాతులు సంతోషింతురు. [illegible] ప్రసిద్ధి కెక్కినవానిని గాని, పండితునిగాని అవమానింతురు. శూరుని తిరస్కరింతురు. బయటికి ఎంతో మంచి వారుగ కనబడుదురు. లోపల ద్రోహమునే తలపెట్టుచుందురు. జ్ఞాతులు ఎల్లప్పుడును భయమునే కలిగించుచుందురు.

జానామి శీలం జ్ఞాతీనాం సర్వలోకేషు రాక్షస
హృష్యంతి వ్యసనేష్వేతే జ్ఞాతీనాం జ్ఞాతయ స్సదా. 16-3
ప్రధానం సాధనం వైద్యం ధర్మశీలం చ రాక్షస
జ్ఞాతయో హ్యవమన్యంతే శూరం పరిభవంతి చ 16-4
నిత్య మన్యోన్యసంహృష్టా వ్యసనే ష్వాతతాయినః
ప్రచ్ఛన్నహృదయా ఘోరా జ్ఞాతయస్తు భయావహాః 16-5

పద్మవనమునందలి ఏనుగులు వానిని పట్టుకొనుటకు వచ్చిన పాశహస్తు లగు మనుష్యులను చూచి చెప్పిన గీతమును వినుము. "మనకు అగ్నివలన భయములేదు. ఆయుధములవలన భయములేదు. కాని ఈ మనుష్యుల యొద్దనుండు నిర్దయులు, స్వకార్యపరులును అగు మన జాతివారే (ఏనుగులే) మనకు భయముకలిగింతురు. మనలను పట్టుకొనుటకు ఉపాయమును మనుష్యులకు నేర్పుదురు. ఇందుకు సందేహము లేదు."

నాగ్నిర్నాన్యాని శస్త్రాణి న నః పాశా భయావహాః
ఘోరా స్స్వార్థప్రయుక్తాస్తు జ్ఞాతయో నో భయావహాః 16-7
ఉపాయమేతే వక్ష్యంతి గ్రహణే నాత్ర సంశయః 16-8

విభీషణా! అన్నిభయములకంటె జ్ఞాతిభయము గొప్పది. గోవులయందు సంపద, బ్రాహ్మణులయందు దమము, స్త్రీలయందు చాపల్యము సహజముగా ఉన్నట్లు జ్ఞాతులయందు భయము సహజము.

విద్యతే గోషు సంపన్నం విద్యతే బ్రాహ్మణే దమః
విద్యతే స్త్రీషు చాపల్యం విద్యతే జ్ఞాతితో భయమ్. 16.9

ఈ కారణముచేతనే, లోకు లందరిచే సత్కరింపబడుచు, అందరలో అధికుడనుగా నున్న నన్ను నీ వవమానించుచున్నావు. తామరాకులో పడిన నీటి బిందువులు ఒక దానితో నొకటి చేరజాలనట్లు దుష్టునితో ఎంతకాలము సహవాసము చేసినను స్నేహ మేర్పడదు. పుష్పమునందలి మకరందమును గ్రోలి తుమ్మెద ఆ సంగతి విస్మరించి ఆ పుష్పమును వీడి ఎట్లు పారిపోవునో అట్లే నీవంటి దుర్మార్గుడు ఇక్కడ సమస్తభోగ ములను అనుభవించి ఆ మాటను మరచిపోయి స్నేహమును విస్మరించును.

శరత్కాల మేఘములు ఎంతో వర్షమును క్రుమ్మరించువానివలె గర్జించి తుదకు ఒక్కచుక్క నీటినైనను కురిపింపక ఎట్లుండునో అట్లే దుష్టుడు ఎంతో స్నేహమును అభినయించి కార్యసమయమున ఉపయోగపడకయుండును.

విభీషణా! నీవు పలికిన పలుకులు మరొక్కని నోటినుండి వెల్వడియుండునేని, అతడు ఇప్పటికే చచ్చిపడియుండును. ఛీ! కులపాంసనా! నీ విం దుండతగవు. వెళ్లుము ఆవలికి.

అన్య స్త్వేవం విధం బ్రూయా ద్వాక్యమేత న్నిశాచర
అస్మిన్ ముహూర్తే నభవే త్త్వం తు ధి క్కులపాంసనమ్. 16.18

## విభీషణుడు సభను వీడుట

ఈ పరుషవాక్కులు విని, విభీషణుడు తన గదను గైకొని తనకు హితులైన నలుగురు రాక్షసులనుగూడి, సభనుండి లేచి రావణునితో అనుచున్నాడు.

*విభీషణుడు :* రావణుడా! నీవు నాకు అన్నవు, నా ప్రభుడవు. నన్ను తిట్టినను బాధలేదు. నీవు నాకు తండ్రివంటివాడవు. నీవు ధర్మమార్గమున నడచుటలేదు. నా హిత వాక్యములను పెడచెవిని బెట్టి, నన్ను నిండుకొలువులో దూషించితివి. నీకు కాల మాసన్నమైనది కావున నా మాటలను త్రోసిపుచ్చితివి. ఎల్లప్పుడును తియ్యని మాటలు చెప్పువారు సులభముగా దొరకుదురు. అప్రియమైన హితవాక్యము లను చెప్పువారు అరుదు. చెప్పినను వినువారు అంతకంటె అరుదు.

సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః
అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః. 16.20

[ఈ మాట నిత్యజీవితమున మన కందరకును పనికివచ్చునది.]

రామబాణాగ్నిలో నీవు దగ్ధుడ వగుట చూడజాలక బాధపడుచున్నాను. నీవు నా అన్నవు కావున నీ మేలు కోరి ఇంతదూరము చెప్పితిని. నన్ను క్షమింపుము. నిన్ను, నీ నగరమును, నీ ప్రజలను జాగరూకుడవై రక్షించుకొనుము. నేను వెళ్ళిపోవుచున్నాను. ఇకమీద నా వలని బాధలేక సుఖముగా నుండుము. నీకు మంగళ మగునుగాక !

తన్మర్షయతు యచ్చోక్తం గురుత్వా ద్ధితమిచ్ఛతా
ఆత్మానం సర్వథా రక్ష పురీం చేమాం సరాక్షసామ్. 16-24

స్వస్తి తేస్తు గమిష్యామి సుఖీ భవ మయా వినా. 16-25

ఈ మాటలుచెప్పి విభీషణుడు తనకు హితు లగు నలుగురు రాక్షసులనుగూడి రివ్వున ఎగిరి రామలక్ష్మణు లున్నచోటికి వచ్చి ఆకాశమున నిలిచినాడు. వానరులు వీరిని చూచినారు.

## విభీషణ శరణాగతి

హనుమంతుడు మున్నగు వానరులతో సుగ్రీవుడు "ఈ రాక్షసులు మనల వధించుటకే వచ్చియుందురు" అని చెప్పినాడు. ఈ మాటతో వానరు లందరు వృక్షము లను, పర్వతశిఖరములను గైకొని రాక్షసులపైకి బయలుదేరగా, ఈ సన్నాహమును విభీషణుడు చూచి సుగ్రీవాది వానరవీరులతో అనుచున్నాడు.

*విభీషణుడు*: వానరులారా ! నేను రావణుని తమ్ముడను. నా పేరు విభీషణుడు. సీతా దేవిని రావణుడు నిర్బంధించి రాక్షసస్త్రీలను కావలి పెట్టియున్నాడు. సీతాదేవిని రామునికి సమర్పింపు మని నేను ఎంతోదూరము చెప్పినాను. నా హితవాక్యము లను పెడచెవిని బెట్టి రావణుడు నన్నవమానించి పరుషముగా దూషించినాడు. నేను భార్యాపుత్రులను విడిచిపెట్టి శ్రీరాముని శరణు కోరి వచ్చితిని. సర్వలోక శరణ్యుడైన శ్రీరామునికి నా రాకను నివేదింపుడు.

సోహం పరుషిత స్తేన దాసవ చ్చావమానితః
త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః. 17-14

సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే
నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్. 17-15

సుగ్రీవుడు రాముని చెంత కరిగి విభీషణుని వృత్తాంతము చెప్పుచున్నాడు.

*సుగ్రీవుడు*: రామప్రభూ ! రావణుని తమ్ముడట-విభీషణుడట-నలుగురు రాక్షసులను గూడి నీ శరణు కోరి వచ్చియున్నాడు. నీవు దీనినిగూర్చి చక్కగా యోచిం

పుము. రాక్షసులు కామరూపులు-శూరులు-కపటోపాయములలో గడిదేరిన వారు. వారిని నమ్మరాదు.

విభీషణుడు రావణుని చారుడుగా నుండును. మనలను నమ్మించి నీకును నాకును మిత్రభేదము కలిగింపగలడు. సమయము కనిపెట్టి మనలను చంపినను చంపగలడు. మిత్రబలమును, ఆటవికబలమును, మూల్యము గొని యుద్ధము చేయువారిని చేర్చుకొనవచ్చును. కాని శత్రుబలమును మాత్రము చెంతకు రానీయగూడదు.

మిత్రాటవిబలం చైవ మౌలం భృత్యబలం తథా
సర్వమేత ద్బలం గ్రాహ్యం వర్జయిత్వా ద్విషద్బలమ్. 17-22

ఈ విభీషణుడు మన శత్రువైన రావణునికి తమ్ముడు. శత్రుపక్షమునుండి వచ్చిన వాడు. వీనిని నమ్మనేకూడదు. ఇతడు మన సైన్యమున ప్రవేశించి సమయము చూచి, గుడ్లగూబ కాకులను చంపునట్లు, మనలను వధింప గలడు.

ప్రవిష్ట శ్శత్రుసైన్యం హి ప్రాజ్ఞ శ్శత్రు రతర్కితః
నిహన్యా దంతరం లబ్ధ్వా ఉలూక ఇవ వాయసాన్. 17-26

[గుడ్లగూబ కాకులను చంపుట చూచియే భారతయుద్ధమున అశ్వత్థామ రాత్రిపూట ఉపపాండవులను వధించినాడు.]

ఈ విభీషణుని, ఈతని నలుగురు మంత్రులను వధించివుచ్చుటయే యుక్తము.

శ్రీరాముడు సుగ్రీవు నిమాటలు విని, తనను పరివేష్టించియుండిన హనుమదాది వానరప్రముఖులను చూచి వారితో అనుచున్నాడు.

**రాముడు :** వింటిరిగదా సుగ్రీవుని పలుకులు ! ఈ విషయమున మీ అభిప్రాయ మేమి ?

**వానరులు :** రామప్రభూ ! నీకు తెలియని సంగతి ముల్లోకములలోను లేదు. మాపైగల వాత్సల్యముచే మమ్ములను గౌరవించుటకై అడుగుచున్నావు. మేముకూడ నీమాట కాదనజాలక మాకు తోచిన అభిప్రాయములను విన్నవించెదము.

**అంగదుడు :** విభీషణుడు శత్రుపక్షమునుండి వచ్చినవాడుగనుక, నమ్మదగినవాడు కాడు. ఇట్టివారు సమయమునకు వేచియుండి మనకు అపకారము చేయుదురు. విభీషణుని పరీక్షించి అతని గుణదోషములను తెలిసికొని, గుణములు ఎక్కువగా నుండునేని మన పక్షములోనికి గ్రహింపదగును. దోషాధికు డగునేని వదలివేయుదము.

**శరభుడు :** విభీషణుని చెంతకు ఒక గూఢచారుని పంపి, సంగతి తెలిసికొనిన పిదప ఒక నిర్ణయమునకు వచ్చుట మంచిది.

**జాంబవంతుడు :** రామప్రభూ! ఈ విభీషణుడు మన శత్రువైన రావణుని చెంతనుండి వచ్చినవాడు. ఇది అతడు రాదగిన చోటుగాని, సమయముగాని కాదు. కావున ఇతని విషయము ఎటుచూచినను సందేహాస్పదమై యున్నది.

**మైందుడు :** ఒక చారుడుపోయి విభీషణునితో మృదువుగా సంభాషించి రావణుని సంగతిని అడిగి, దానికి విభీషణుడు చెప్పు ప్రత్యుత్తరమును విని విమర్శించి విభీషణుని మంచిచెడుగులను నిర్ణయించుకొని ఏది యుక్తమో దానిని చేయుట మంచిది.

కొందరు వానర ప్రముఖులు వారివారికి తోచిన మాటలు చెప్పిన పిమ్మట, సంస్కార సంపన్నుడును సచివోత్తముడును అగు హనుమంతుడు మధురముగాను, అర్థవంతముగాను మాటాడుచున్నాడు.

**హనుమంతుడు :** రామప్రభూ! నీవు అందరకంటెను బుద్ధిమంతుడవు. సమర్థుడవు. వాక్యకోవిదుడవు. సంభాషించుటలో బృహస్పతి సైతము నిన్ను మించలేడు.

నేను నా తర్క కౌశలమును ప్రదర్శించుటకుగాని, స్పర్ధచేగాని, అందరకంటె అధికుడ నని యెంచిగాని మాటలాడుటలేదు. నాకు మాటలాడవలె నని కోరికయు లేదు. కాని రామ గౌరవముచే నాకు తోచిన అభిప్రాయమును మనవి చేయుచున్నాను.

న వాదా న్నాపి సంఘర్షా న్నాధిక్యా న్నాపి కామతః
వక్ష్యామి వచనం రాజన్ యథార్థం రామ గౌరవాత్. 17-50

విభీషణుని గుణ దోషములను ముందు తెలిసికొని ఆ తరువాత అతని విషయము నిర్ణయించుకొనవలె నని చెప్పిన మాటలో దోషము కానవచ్చుచున్నది. విభీషణుని ఒక పనియందు ప్రవేశపెట్టిన పిదపగాని అతని గుణదోషములు మనకు తెలియవు. అతడు గుణహీనుడైనచో మన పక్షములోనికి చేర్చుకొనుట అపాయకరమైన పని. హాని కలిగిన పిదప చేయుట కేమున్నది? కావున ఈ యభిప్రాయము సరికాదు.

చారుని పంపి విభీషణుని విషయము తెలిసికొనదగు నని కొంద రన్నారు. ఈ మాటయును దోషముతో కూడి యున్నది. ఎచ్చటనో దూరముగా నున్న వానికడకు గూఢచారులను పంపినచో ఉపయోగ ముండును గాని ఎదుట నిలబడియుండు వాని యొద్దకు పంపుటలో ఏమి ప్రయోజనము!

"విభీషణుడు ఈ చోటునకు రావలసినవాడు కాడు. అతడు రాదగిన సమయము కూడ కాదు" అని కొంద రన్నారు. దానిని గురించి రెండు మాటలు చెప్పెదను.

రావణుని దుష్ట స్వభావమును నీ పరాక్రమమును విభీషణుడు గ్రహించి చక్కగా ఆలోచించుకొనియే ఇక్కడికి వచ్చి యున్నాడు. అత డిప్పుడు వచ్చుట

యుక్తముగనే ఉన్నది. గూఢచారులు పోయి రావణుని సంగతిని గురించి విభీషణుని ప్రశ్నించి దానికి అతడు ప్రత్యుత్తరము చెప్పు తీరును బట్టి అతని గుణ దోషములను నిర్ణయింపవచ్చు నని చెప్పిన మాటయును సరియైనదికాదు. ఒకనియొద్దకు పోయి తటాలున ఒక మాట అడిగినప్పుడు అతనికి లేనిపోని సందేహములు కలుగవచ్చును. మంచి ఉద్దేశము కలవాడుకూడ అట్టి ప్రశ్నలవలన విరోధి కావచ్చును.

పృచ్ఛ్యమానో విశంకేత సహసా బుద్ధిమా న్వచః
తత్ర మిత్రం ప్రదుష్యేత మిథ్యాపృష్టం సుఖాగతమ్. 17-58

అడిగినంత మాత్రమున, మనస్సులో నున్న సంగతిని ఒకడు బయల్పరచునా ఎట్టి సమర్థునకైనను ఒకని మనస్సునందు గూఢమైయున్న సంగతి తెలిసికొనుట కష్టసాధ్యము.

విభీషణుని మాటలలో, అతనికి దుష్టభావము లున్నట్లు నాకు తోపలేదు. ఆతని ముఖము ప్రసన్నమై యున్నది. దుష్టాత్ముడు ఇంత నిర్భయముగా రాజాలడు. మానవులు తమ భావములను దాచుకొనుటకు ఎంత ప్రయత్నించినను వారి ముఖలక్షణములు వారి భావములను తప్పక ప్రకటింపగలవు.

ఆకార శ్ఛాద్యమానోఽపి న శక్యో వినిగూహితుమ్
బలాద్ధి వివృణోత్యేవ భావ మంతర్గతం నృణామ్. 17-62

రామప్రభూ! దేశకాలములను అనుసరించి ఎప్పుడు చేయదగిన పని అప్పుడు చేయబడు నేని ఆ కార్యము తప్పక ఫలించును. అట్టి కార్యమునే ఇప్పుడు విభీషణుడు చేసినాడు. రావణుడు దుర్మార్గు డనియు, నీవు రావణుని పరిమార్చు ప్రయత్నములో నున్నా వనియు విభీషణుడు గ్రహించినాడు. నీవు వాలిని వధించి సుగ్రీవునికి పట్టాభిషేకము జరిపించిన సంగతి విన్నాడు. తానుకూడ రాజ్యమును పొందు ఆశతో నీ యొద్దకు వచ్చినాడు.

ఉద్యోగం తవ సంప్రేక్ష్య మిథ్యావృత్తం చ రావణమ్
వాలినశ్చ వధం శ్రుత్వా సుగ్రీవం చాభిషేచితమ్ 17-64
రాజ్యం ప్రార్థయమానశ్చ బుద్ధిపూర్వ మిహాగతః 17-65

కావున విభీషణుని మనలో చేర్చుకొన వచ్చును. రామప్రభూ! నాకు తోచిన మాటలు చెప్పినాను. నీ చిత్త మెట్లో అట్లు కావింపుము.

రాముడు: విభీషణునిగూర్చి నా యభిప్రాయమును వినుడు. ఎవ్వనియందు ఎన్ని దోషము లున్నను మిత్రభావముతో నా సన్నిధికి వచ్చినవానిని నేను ఎన్నడును త్యజింపను. అట్లు త్యజింపకుండుట పెద్దలకు సమ్మతమైన పద్ధతి.

మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన
దోషో యద్యపి తస్య స్యా త్సతా మేత దగర్హితమ్. 18-3

సుగ్రీవుడు : ప్రభూ! ఈ రాక్షసుడు దుష్టుడు కానిమ్ము, కాకపోనిమ్ము. మన కేల? అట్టి కష్టదశలో నున్న అన్ననే పరిత్యజించివచ్చినవాడు మఱెవ్వరిని పరిత్యజింపడు!

సుదుష్టో వా ప్యదుష్టో వా కిమేష రజనీచరః
ఈదృశం వ్యసనం ప్రాప్తం భ్రాతరం యః పరిత్యజేత్. 18-5

కో నామ స భవేత్తస్య యమేష న పరిత్యజేత్ 18-6

రాముడు : లక్ష్మణా! విన్నావా సుగ్రీవుని మాట! శాస్త్రములు అధ్యయనము చేసి పెద్దలను సేవించినవాడు తప్ప అన్యు డింత చక్కగా పలుకజాలడుసుమా!

అనధీత్య చ శాస్త్రాణి వృద్ధా ననుపసేవ్య చ
న శక్య మీదృశం వక్తుం య దువాచ హరీశ్వరః 18-8

అయినను, ఈ విషయములో లౌకికమైన సూక్ష్మ సందర్భమొకటి యున్నది. వినుడు. ఒక రాజునకు కష్టము తటస్థించినప్పుడు అతని జ్ఞాతులు, ఇరుగు పొరుగు రాజులు, కనిపెట్టియుండి అతనికి అపాయము కలిగింతురు. ఈ సూత్రము ననుసరించియే విభీషణు డిక్కడికి వచ్చియున్నాడు.

శత్రుపక్షమువానిని చేర్చుకొనరా దను మాటకు శాస్త్రసమ్మతమైన సమాధానము కలదు. మనము విభీషణుని కులము వారము కాము. అతనికి రాజ్యకాంక్ష యున్నది.

[రాక్షస రాజ్యమును మనము కోరువారము కాము అని అత డెరుగును]

న వయం తత్కులీనాశ్చ రాజ్యకాంక్షీ చ రాక్షసః 18-13

జ్ఞాతు లెప్పుడును కలిసియుండలేరు. వారు పరస్పర విరోధులు. ఈ విభీషణుడు భయపడి మన యొద్దకు వచ్చియున్నాడు. లక్ష్మణా! అన్నదమ్ము లందరును భరతుని వంటివారు కారు. పుత్రు లందరును నా వంటివారు కారు. సుహృదు లందరును నీ వంటి వారు కారుసుమా.

న సర్వే భ్రాతర స్తాత భవంతి భరతోపమాః
మద్విధా వా పితుః పుత్రా స్సుహృదో వా భవద్విధాః. 18-15

ఈ మాటలను విని, సుగ్రీవుడు రామునికి నమస్కరించి అనుచున్నాడు.

సుగ్రీవుడు : ప్రభూ! మనలను మోసగించి ఇక్కడ చేరి నిన్ను, నన్ను, లక్ష్మణుని కడతేర్చుటకై రావణుడే ఈ విభీషణుని పంపియుండును. విభీషణుడు రావణుని తమ్ము డను మాటమాత్రము మనము మరచిపోరాదు.

రాముడు: సుగ్రీవా! ఈ రాక్షసుడు దుష్టుడు కానిమ్ము, కాకపోనిమ్ము. ఇతడు నన్నేమియు చేయజాలడు. నేను సంకల్పించినచో లోకమునందలి సమస్త రాక్షసులను, యక్షులను, దానవులను, పిశాచములను నా వ్రేలికొనతో నిర్మూలింపగలను.

పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం చైవ రాక్షసాన్
అంగుళ్యగ్రేణ తాన్ హన్యా మిచ్ఛన్ హరిగణేశ్వర. 18-23

తన భార్యను వధించిన శత్రువు తన యొద్దకు వచ్చి శరణు కోరగా, ఒక పావురము తన శరీరము నర్పించి శత్రువును రక్షించిన సంగతి వినియున్నాముగదా! ఒక పావురమే తన శత్రువును రక్షించినయెడ, నాయట్టివాడు 'శరణు' అని వచ్చిన వానిని రక్షింపకుండగలడా! దీనిని గూర్చి కండుమహాముని చెప్పిన వాక్య మొకటి కలదు. "దీనుడై శరణు కోరి వచ్చినవాడు శత్రువైనను వానిని వధింపరాదు" అని చెప్పి యున్నాడు.

బద్ధాంజలిపుటం దీనం యాచంతం శరణాగతమ్
న హన్యా దానృశంస్యార్థ మపి శత్రుం పరంతప. 18-27

శరణాగతుడైన శత్రువును మన ప్రాణముల నిచ్చియైన రక్షింపవలయును. అట్లు రక్షింపనిచో మన పుణ్య మంతయు నశించిపోవును. లోకనిందకుసైతము పాత్రుల మగుదుము. ప్రపన్నుని రక్షింపకపోవుటలో అనేక దోషము లున్నవి.

ఏవం దోషో మహా నత్ర ప్రపన్నానా మరక్షణే
అస్వర్గ్యం చాయశస్యం చ బలవీర్య వినాశనమ్. 18-31

కండుమహాముని చెప్పిన వాక్యమును తప్పక గౌరవింతును. ఎవ్వడుగాని ఒక్కమారు "నేను శరణాగతుడను. నీవాడను" అని యాచించునేని అతనికి ఎవ్వని వలనగాని ఎట్టిభయమును కలుగనీయక అభయ మిచ్చుట నావ్రతము.

సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ. 18-33

సుగ్రీవా! నేను అభయ మిచ్చితిని. నీ వరిగి అతనిని తోడితెమ్ము. ఆ వచ్చిన రాక్షసుడు విభీషణుడు కానిమ్ము లేక సాక్షా ద్రావణుడే కానిమ్ము. నీ వతనిని కొనిరమ్ము.

[లేనిపోని సందేహములను పెట్టుకొని వెనుకకు రావలదు!]

ఆనయైనం హరిశ్రేష్ఠ దత్తమస్యాభయం మయా
విభీషణో వా సుగ్రీవ యది వా రావణ స్స్వయమ్. 18-34

*సుగ్రీవుడు* : స్వామీ! నీవు లోకనాథుడవు. ధర్మజ్ఞుడవు. లోకమునకు సుఖము చేకూర్చు వాడవు. చలింపక సత్పథమున నిల్చు వీరుడవు. నీ విట్లు పలుకుటలో ఆశ్చర్య మేమి యున్నది!

కి మత్ర చిత్రం ధర్మజ్ఞ లోకనాథ సుఖావహ
య త్త్వ మార్యం ప్రభాషేథా స్సత్త్వవాన్ సత్పథే స్థితః 18-36

రామప్రభూ! విభీషణుడు పరిశుద్ధుడే నని నాకును తోచుచున్నది. నే నిప్పుడే పోయి వానిని తీసికొనివత్తును. విభీషణుడు మాలో ఒకడుగా నుండునుగాక.

సుగ్రీవుడు పోయి విభీషణుని శ్రీరాముని సన్నిధికి పిల్చుకొనివచ్చినాడు. విభీషణుడు తన మంత్రులనుగూడివచ్చి శ్రీరాముని పాదములను ఆశ్రయించినాడు.

స తు రామస్య ధర్మాత్మా నిపపాత విభీషణః
పాదయో శ్శరణాన్వేషీ చతుర్భి స్సహ రాక్షసైః. 19-2

*విభీషణుడు* : రామప్రభూ! నేను రావణుని తమ్ముడను. అతనిచే అవమానింపబడి వచ్చితిని. సర్వభూతములకును శరణ్యుడవైన నిన్ను శరణు జొచ్చితిని. లంకను, మిత్రులను, సంపదను, వదలుకొని నీ ఆశ్రయమును కోరివచ్చితిని. నా రాజ్యముగాని, నా ప్రాణములుగాని, నా సుఖముగాని అన్నియు నీ అధీనములు.

[శరణు కోరువాడు వీని నన్నింటిని త్యాగము చేయుటకు సంసిద్ధుడైయుండవలెను.]

అనుజో రావణస్యాహం తేన చా స్మ్యవమానితః
భవంతం సర్వభూతానాం శరణ్యం శరణం గతః. 19-4

పరిత్యక్తా మయా లంకా మిత్రాణి చ ధనాని చ
భవద్గతం మే రాజ్యం చ జీవితం చ సుఖాని చ. 19-5

శ్రీరాముడు విభీషణునికి మంచిమాటలు చెప్పి ఆశ్వాసించి అతనిపై తన కరుణాకటాక్షవీక్షణములు ప్రసరింపజేసినాడు.

తస్య తద్వచనం శ్రుత్వా రామో వచన మబ్రవీత్
వచసా సాంత్వయిత్వైనం లోచనాభ్యాం పిబన్నివ. 19-6

[శ్రీరాముడు తన చల్లని చూపులతో విభీషణుని చూచుట, కన్నులతో త్రాగుచున్నట్టున్నదని అన్నారు వాల్మీకిమహర్షి! ఆ చూపులు ఎంత దయార్ద్రములో!]

విభీషణుడు శ్రీరాముని పరిజనములలో ఒకడైనాడు.

## సముద్రతీరమున విభీషణునికి పట్టాభిషేకము

**రాముడు :** విభీషణా ! రావణుని బలాబలములను వివరింపుము.

**విభీషణుడు :** రామప్రభూ ! రావణునికి బ్రహ్మదేవుడు ఒక వరము ప్రసాదించియున్నాడు. ఆ వరప్రభావమువలన రావణునికి దేవత లెవరివలనను మరణము కలుగదు. రావణుని వెనుకటివాడు కుంభకర్ణుడు. ఇంద్రునికి సరివచ్చు శరీరబలము కలవాడు. రావణుని సేనాపతి ప్రహస్తుడు; కైలాసమున జరిగిన యుద్ధములో కుబేరుని, సేనాపతి యగుమణి భద్రుని జయించినవాడు.

రావణుని కుమారుడైన ఇంద్రజిత్తు గొప్ప పరాక్రమవంతుడు. అవధ్య కవచము గలవాడు. యుద్ధకాలమున, ఇరుపక్షముల సేనలు యుద్ధసన్నద్ధులై యుండు సమయమున ఇంద్రజిత్తు హోమము చేసి అగ్నిహోత్రుని తృప్తిపరిచి, ఆ ప్రభావముచే అదృశ్యుడై శత్రువులను వధించును.

వీరుగాక, మహోదరుడు, మహాపార్శ్వుడు, అకంపనుడు మున్నగు సేనాపతులనేకు లున్నారు. రాక్షస సైనికులు కోట్ల లెక్కన ఉన్నారు. రావణుడు దేవతలను సైతము జయించి యున్నాడు.

**రాముడు :** విభీషణా ! నీ మాటలవలన రావణుని బలపరాక్రమములు తెలియవచ్చినవి. నేను రావణుని సబాంధవముగా వధించి లంకారాజ్యమునకు నిన్ను రాజుగావింతును. ఈ మాట సత్యము.

> అహం హత్వా దశగ్రీవం సప్రహస్తం సబాంధవమ్
> రాజానం త్వాం కరిష్యామి సత్యమేత ద్బ్రవీమి తే. 19-19

రావణుడు రసాతలమున కరిగినను, పాతాళమున దాగినను, బ్రహ్మదేవుని యొద్ద కేగినను, అతని ప్రాణము తప్పక హరింతును. రావణుని వధింపక అయోధ్యలో అడుగు పెట్టను. నా ముగ్గురి తమ్ములమీద శపథముచేసి ఈ మాట చెప్పుచున్నాను.

**విభీషణుడు :** (రామునికి శిరసా నమస్కరించి) రామప్రభూ ! నేనుకూడ శక్తివంచనలేక రాక్షస సంహారమునకు తోడ్పడగలను. యుద్ధమున పాల్గొందును.

**రాముడు :** (విభీషణుని కవుగిలించుకొని) లక్ష్మణా ! సముద్ర జలమును తెచ్చి విభీషణుని రాక్షసరాజుగా అభిషేక మొనర్పుము.

> ఇతి బ్రువాణం రామస్తు పరిష్వజ్య విభీషణమ్
> అబ్రవీ ల్లక్ష్మణం ప్రీతః సముద్రా జ్జల మానయ. 19-24

తేన చేమం మహాప్రాజ్ఞ మభిషించ విభీషణమ్
రాజానం రక్షసాం క్షిప్రం ప్రసన్నే మయి మానద. 19-25

వానర ప్రముఖుల సమక్షమున లక్ష్మణుడు విభీషణునికి అభిషేకము చేసినాడు. అందరు ఆనందమయులై శ్రీరాముని ప్రశంసించినారు.

[విభీషణునికి ఏదైన అనుమాన ముండినను అదికూడ తీరిపోయినది. తన శక్తి యుక్తు లన్నింటిని వినియోగించి రామునికి సహాయము చేయగలడు. అట్లు చేసిననేగాని తనకు రాజ్యము రాకపోవచ్చును.

అయినను, విభీషణుడు రాజ్యమునకు ఆశపడి రాముని యొద్దకు రాలేదు. విభీషణుని తమ పక్షములోనికి చేర్చుకొనుటను గూర్చి తర్కము జరిగినప్పుడు హనుమంతుడు చెప్పుటలో విభీషణుడు రాజ్యమును కోరి వచ్చినట్లు చెప్పియున్నాడు. శ్రీరాముడుకూడ అట్లే చెప్పి యున్నాడు. ఈ మాటలు సుగ్రీవునికి నచ్చజెప్పుటకు ఉపయోగింపబడిన హేతువాదములు మాత్రమే నని మనము గ్రహింపవలయును.

విభీషణుడు సహజ ధర్మాత్ముడు. అతనిలో రాక్షస గుణములు లేవు. ఈ మాట, రామునితో శూర్పణఖ జనస్థానమున చెప్పియున్నది. ఆ కాలమునాటికి ఇప్పటిపరిస్థితులులేవు. అప్పటికి ఖరదూషణాదుల వధయైనను జరిగియుండలేదు. ఏనాడో శ్రీరాముడు వచ్చి రావణుని వధింపబూనుకొను నని ఆనాడు ఎవ్వరును అనుకొనలేదు. ఆ మాటలు శూర్పణఖ చెప్పినవి గనుక త్రోసిపుచ్చుటకు వీలులేదు. అదిగాక, విభీషణుడు ధర్మాత్ము డని, మహాత్ము డని, రావణుడే చెప్పియున్నాడు. కుంభకర్ణుని మరణమును గూర్చి రావణుడు దుఃఖించుచు విభీషణుని ప్రశంసించిన విషయము గమనింప దగియున్నది. (యుద్ధ 68-21-23)

ధర్మాత్ముడైన విభీషణుడు రావణునికి అనేకవిధములుగా హితమును బోధించినాడు. కాని అది లాభింపలేదు. పైగా, రావణుడు నిండు కొలువులో విభీషణుని అవమానించి వెళ్లి పొమ్మన్నాడు. విభీషణుడు వెళ్ళక ఏమి చేయగలడు? ధర్మమునకై పాటుపడుచున్నవాడు గనుక తెంపుగా రాముని యొద్దకు వచ్చినాడు. తన ప్రాణమునుకూడ లెక్కచేయక శత్రువుల మధ్యకు వచ్చినాడు. ధర్మను నవలంబించువారు తమ ప్రాణములనుకూడ నిర్లక్ష్యముగా చూడగలరు. అట్టియెడ, అధర్మము నవలంబించిన రావణుని వధించు విషయములో విభీషణుడు సహాయము చేయక ఏల యుండవలయును? రాముని పక్షమున చేరినవాడు రామునికి సహా యము చేయక ద్రోహము చేయవలయునా! సహాయము చేయబూనుకొన్నవాడు అర మనస్సుతో చేయుట యుక్తమా! కావున నిండు మనస్సుతో చేసినాడు. ఇంద్రజిత్తును వధించు టకు ఉపాయము చెప్పినాడు. ధర్మమును నిల్పబెట్టుటకు తన చేతనైన పని చేసినాడు. అదియు ఒక తప్పయినచో తప్పు కానిది ఒకటి యుండునా!

రావణుడు మరణించిన పిదప రాక్షస రాజ్యమును ఏలదగినవాడు విభీషణుడు తప్ప మరొక్క డున్నాడా? రాక్షసరాజ్యము శ్రీరామునికి గాని సుగ్రీవునికిగాని అక్కరలేదు.

కావున విభీషణునికి రాజ్యము లభ్యమైనది. శ్రీరాముడు ప్రీతితో ఇచ్చిన ప్రసాదమును విభీషణుడు స్వీకరించినాడు. అందువలన, లౌకికముగా విభీషణుని ధర్మప్రవర్తనమునకు లోటు కలుగలేదని చెప్పవచ్చును.]

విభీషణుడు శ్రీరాముని పక్షమువాడైనాడు. సుగ్రీవాది వానరులు ఎట్టి అరమరయు లేక విభీషణుని తమవానినిగా అంగీకరించినారు. విభీషణుడు వారిలో ఒకడైనాడు.

## దర్భశయనము

***సుగ్రీవుడు :*** విభీషణా ! ఈ సముద్రమును దాటుటకు ఉపాయ మేమైన కలదా !

***విభీషణుడు :*** శ్రీరాముడు సముద్రుని శరణుకోరవలెను.

[శరణుకోరుటయొక్క ప్రభావము విభీషణునికి అనుభవవేద్యముకదా !]

ఇక్ష్వాకు వంశస్థులవలన వృద్ధిబొందినవాడుగనుక, సముద్రుడు రామకార్యమునకు తప్పక సహాయము చేయగలడు.

ఈ మాటను సుగ్రీవుడు రామలక్ష్మణులకు అందించినాడు. రాముడు లక్ష్మణ సుగ్రీవులను చూచి అనుచున్నాడు.

***రాముడు :*** (చిరునవ్వుతో) విభీషణుని ఆలోచన నాకు సమ్మతమే. మీ రిద్దరును దీని సంగతి చక్కగా యోచించి మీ అభిప్రాయములను తెలియజేయుడు.

***సుగ్రీవుడు :*** విభీషణునిమాట మాకు నచ్చినది. సేతువును నిర్మింపక సముద్రమును దాటి లంకకుచేరుట, దేవతలు సైతము చేయలేని కార్యము. ఆలస్యములేక సముద్రుని ప్రార్థించుట మంచిది.

శ్రీరాముడు సముద్రతీరమున దర్భశయ్యమీద శయనించినాడు.

[ఇదే దర్భశయనము]

ఏవముక్తః కుశాస్తీర్ణే తీరే నదనదీపతేః
సంవివేశ తదా రామో వేద్యామివ హుతాశనః. 19-42

శ్రీరాముడు వేదియందలి అగ్నిహోత్రునివలె తేజరిల్లినాడు.

## రావణాసురుడు సుగ్రీవునియొద్దకు శుకుని పంపుట

లంకాపురియందు రావణాసురుడు కొలువుదీరి కూర్చుండియున్నాడు. శార్దూలుడను రాక్షసుడు సముద్రతీరమున విడిసియుండిన వానర సైన్యమును చూచివచ్చి రావణునికి నివేదించుచున్నాడు.

**శార్దూలుడు :** ప్రభూ ! ఋక్ష వానరసేనలు లంకపైకి వచ్చుచున్నవి. సైన్యము రెండవ సముద్రమువలె నున్నది. ఎటుచూచినను పది యోజనములు ఆక్రమించుకొని భయంకరముగా కనబడుచున్నది. దూతలను వెంటనే పంపి వివరములను తెలిసికొని సామ దాన భేదోపాయములను ప్రయోగించుట మేలు.

ఈ మాటలు విని రావణుడు శుకు డను దూతను పిలిపించినాడు.

**రావణుడు :** శుకుడా ! నీవు వెళ్ళి నా మాటలుగా సుగ్రీవుని కిట్లు చెప్పుము. "సుగ్రీవా ! నీవు గొప్ప కులమున జన్మించితివి. మన మిద్దరము అన్నదమ్ములవంటివారము. నేను చేసిన పని నీకు కీడునుగాని మేలునుగాని కలిగించునదికాదు. నేను రాముని భార్యనుగదా అపహరించితిని ! దానికై నీవు బాధపడవలసిన దేమున్నది ? వానరులు లంకాపురికి రాజాలరు. దేవతలకును గంధర్వులకును సాధ్యముకాని పని వానరులకు సాధ్య మగునా ! నీవు సుఖముగా కిష్కింధకు మరలిపొమ్ము."

> అహం యద్యహరం భార్యాం రాజపుత్రస్య ధీమతః
> కిం తత్ర తవ సుగ్రీవ కిష్కింధాం ప్రతిగమ్యతామ్. 20-11

రావణుడు ఈవిధముగా భేదోపాయమును ప్రయోగించి శుకుని సుగ్రీవుని యొద్దకు పంపినాడు. శుకుడు పక్షిరూపమును దాల్చి సముద్రముమీదుగా ఎగిరి వానర సైన్యము విడిసియుండిన ప్రదేశమున ఆకాశమున నిలిచి రావణుని సందేశమును సుగ్రీవునికి నివేదించినాడు. వానరులు శుకుని పట్టుకొని కొట్టి క్రిందికి త్రోసినారు. శుకుడు విలపించుచు శ్రీరాముని సమీపించి "నేను రావణుని దూతను. దూతను వధించుట న్యాయము కాదుగదా ! ఈ వానరులు నన్ను కొట్టి చంపుచున్నారు. రాజు పంపిన సందేశమును యథాతథముగ చెప్పక తనకు తోచిన మాటను చెప్పునట్టి దూతనుగదా వధించుట యుక్త మని శాస్త్రము ! మా రాజు చెప్పిపంపిన మాటలనే చెప్పినవాడను. కావున నేను వధ్యుడను కాను. నన్ను వధించుట తగదు. రామప్రభూ ! ఈ వానరులను నివారింపుము" అని మొరపెట్టుకొన్నాడు.

> న దూతాన్ ఘ్నంతి కాకుత్స్థ వార్యంతాం సాధు వానరాః 20-18

> యస్తు హిత్వా మతం భర్తు స్స్వమతం సంప్రభాషతే
> అనుక్తవాదీ దూత స్సన్ స దూతో వధమర్హతి. 20-19

శ్రీరాముడు వానరులతో "వీనిని వధింపవలదు" అని చెప్పినాడు.

**శుకుడు :** (ఆకాశమున కెగిరి అచ్చట నిలిచి) సుగ్రీవా ! లోకరావణుడైన రావణుని ప్రతిసందేశ మేమి ?

*సుగ్రీవుడు :* రావణునితో నా మాటలుగా ఇట్లు పలుకుము. "రావణుడా! నీకును నాకును ఎట్టి స్నేహముగాని లేదు. నీ వలన నే నేమియు ఉపకారము పొందియుండలేదు. నా స్నేహితుడైన శ్రీరామునికి నీవు పగవాడవు. నా శత్రువైన వాలికి నీవు మిత్రుడవు. కావున నాకు పగవాడవు. వాలివలె నీవును చంపదగినవాడవు. త్వరలోనె నిన్ను, నీవారిని వధించి లంకను భస్మము చేయగలను. నీవు ఎచ్చోటికి వెళ్ళినను రామబాణము నిన్ను తరుముకొనిరాగలదు. రామలక్ష్మణులు లేని సమయమున సీతాదేవిని అపహరించితివి. శ్రీరాముడు నిన్ను తప్పక వధింప గలడు" అని చెప్పుము.

*అంగదుడు :* (సుగ్రీవునితో) రాజా! ఈ రాక్షసుడు దూతకాడు. ఇతడు చారుడు. మన సేన నంతయు పరీక్షించుచున్నాడు. వీనిని లంకకు పోనీయరాదు.

ఈ మాట విని, సుగ్రీవుడు చేసిన ఆజ్ఞానుసారము, వానరులు శుకునిపట్టి బంధించి యుంచినారు.

## శ్రీరాముడు సముద్రునిమీద కోపగించుట

శ్రీరాముడు సముద్రతీరమున దర్భలు పరచుకొని తనకుడిభుజమును తలగడగా పెట్టుకొని సముద్రమున కంజలి గావించి తూర్పుముఖముగా శయనించినాడు.

[శ్రీరాముని కుడిభుజము అద్భుతముగా వర్ణింపబడియున్నది. ఇరువదియొకటవ సర్గ 2 మొదలు 8 వరకుగల శ్లోకములయం దున్నది.]

శ్రీరాముని కుడిభుజము సువర్ణాభరణములతో పూర్వము అలంకృతమైయుండి నది. పెక్కుమంది స్త్రీలచే నలుగులు పెట్టించుకొనినది. అగరు చందనాది సుగంధ ద్రవ్యములచే తేజరిల్లుచుండినది. సీతాదేవి ఉత్తమాంగముచే శోభించినది. గంగాది జలములచే సేవింపబడినది. తక్షకుని శరీరమువలె వెలుగుచుండినది. శత్రువుల శోకమును వృద్ధిపరచునది. సుహృదులకు ఆనందము కలుగజేయునది. భూమండలమును ప్రదక్షిణముచేసి రాగల బాణములను ప్రయోగింపజాలినది. గొప్ప ఇనుపగుదియవంటిది. వేల లెక్కన గోదానములు చేసినది.

ఇట్టి కుడిభుజమును తలగడగా నుంచుకొని శ్రీరాముడు "నేను సాగరమును దాటుటయో లేక మరణించుటయో జరుగగలదు" అని నిశ్చయించుకొని సముద్రమున కభిముఖముగా శయనించి యథా శాస్త్రముగా సముద్రుని ఆరాధించినాడు.

అద్య మే మరణం వాథ తరణం సాగరస్య వా
ఇతి రామో మతిం కృత్వా మహాబాహు ర్మహోదధిమ్. 21-8

అథిశశ్యే చ విధివ త్ప్రయతో నియతో మునిః. 21.9

ఈవిధముగా మూడు రాత్రములు గడచినవి. సముద్రుడు కానరాలేదు. శ్రీరాముడు కోపించి లక్ష్మణునితో అనుచున్నాడు.

*రాముడు :* లక్ష్మణా! చూచితివిగదా సముద్రుని గర్వము! అతడు ఇంకను కానవచ్చుట లేదు. శమము, క్షమ, ఆర్జవము, ప్రియభాషిత్వము, మున్నగు సద్గుణములు గుణహీనులమీద పనిచేయజాలవు. లోకములో ఎవ్వరుగాని సాధువును గౌరవింపరు. తన్నుతాను పొగడుకొనువానిని, నిర్దయుని, దుర్మార్గుని, దండధరుడై మంచిచెడ్డలు చూడక అందఱను హింసించువానిని లోకులు గౌరవింతురు.

ప్రశమశ్చ క్షమా చైవ ఆర్జవం ప్రియభాషితా
అసామర్థ్యం ఫలంత్యేతే నిర్గుణేషు సతాం గుణాః. 21.14

ఆత్మప్రశంసినం ధృష్టం దుష్టం విపరిధావకమ్
సర్వత్రోత్సృష్టదండం చ లోకస్సత్కురుతే నరమ్. 21.15

ఈ లోకమున కీర్తిగాని, యశస్సుగాని, యుద్ధవిజయముగాని మంచితనముచేత సాధింపలేము. నే నిప్పుడు బాణములు ప్రయోగించి సముద్రమును క్షోభిల్లజేసి సముద్ర గర్భమున నుండు జంతువులను బయటికి రప్పింపగలను. సముద్రమును ఎండింపజేయుదును. నేను ఓర్పుతో నుండుకొలది సముద్రునికి ఉపేక్ష ఎక్కువయగుచున్నది. ఈ సముద్రుడు నా క్షమను అసమర్థతగా భావించుచున్నాడు. ఇట్టివారిపట్ల క్షమ దహింపబడును గాక.

క్షమయా హి సమాయుక్తం మామయం మకరాలయః
అసమర్థం విజానాతి ధిక్ క్షమా మీదృశే జనే. 21.20

మంచిగా నున్నంతకాలము సముద్రుడు కనిపింపడు. లక్ష్మణా! ధనుస్సును తెమ్ము. సముద్రమును ఎండించి, వానరసైన్యము కాలినడకన ప్రయాణము చేయుటకు వీలు కలిగించెదను.

చాప మానయ సౌమిత్రే శరాం శ్చాశీవిషోపమాన్
సాగరం శోషయిష్యామి పద్భ్యాం యాంతు ప్లవంగమాః. 21.22

లక్ష్మణా! సముద్రమున సంక్షోభము కలిగింతును. సముద్రము చెలియలికట్టను దాటి భూమినంతయు ఆక్రమింపగలదు.

ఈ మాటలు చెప్పి, శ్రీరాముడు పిడుగులవంటి బాణములను ప్రయోగించినాడు.

[శ్రీరాముడు అన్నంతపని చేయగలిగినవాడు. వ్యర్థముగా దబ్బఱలాడువాడు కాడు.]

సంపీడ్య చ ధనుర్ఘోరం కంపయిత్వా శరై ర్జగత్
ముమోచ విశిఖా నుగ్రాన్ వజ్రానివ శతక్రతుః. 21.26

ఆ బాణములు సముద్రములో ప్రవేశించి సంక్షోభము కలిగించినవి. సముద్ర గర్భమున నుండిన జంతువులు భయముతో వణకిపోయినవి. పాతాళమునందుండిన దానవులకుకూడ బాణములు తగిలినవి. శ్రీరాముడు బాణమును మరల సంధించుచున్నాడు. అంతట, లక్ష్మణుడు శ్రీరాముని వారించి ధనుస్సును పట్టుకొన్నాడు.

తత స్తు తం రాఘవ ముగ్రవేగం
ప్రకర్షమాణం ధను రప్రమేయమ్
సౌమిత్రి రుత్పత్య సముచ్ఛ్వసంతం
మా మేతి చోక్త్వా ధను రాలలంబే. 21.33

శ్రీరామునికి కోపము తగ్గలేదు.

*రాముడు :* సముద్రుడా! నిన్ను పాతాళమట్టమునకు శోషిల్ల జేయుదును. నీ జల మంతయు ఎండిపోయి నీ వున్న ప్రదేశమంతయు ఇసుకమయము కాగలదు. వానరు లందఱు కాలినడకనే ఆవలితీరము చేరగలరు. నీవు నా పరాక్రమమును గుఱుతించినట్లు లేదు.

ఈ మాట లనుచు శ్రీరాముడు బాణమును బ్రహ్మాస్త్రమంత్రముతో అభిమంత్రించి శరసంధానము చేసి ధనుస్సును ఆకర్షించినాడు. ఆకర్షణ మాత్రముననే భూమ్యాకాశములు బ్రద్దలయినట్లు అనిపించినది. పర్వతములు గడగడ వణకిపోయినవి. నదులు, సరోవరములు క్షోభించినవి. సూర్యచంద్రులకు వక్రగతి పట్టినది. లోకమంతయు అంధకారబంధురమైనది. పిడుగులు పడినవి. భూతములు విలపింప సాగినవి. సముద్రము క్షోభించి చెలియలికట్టనుండి ఒక యోజనదూరము వెనుకకు పోయినది.

వెనుకకు పారిపోవుచున్న సముద్రముమీద శ్రీరాముడు భాణము వేయలేదు.

[పారిపోవుచున్న శత్రువుమీద శ్రీరాముడు బాణము వేయునా!]

యోజనం వ్యతిచక్రామ వేలామన్యత్ర సంప్లవాత్. 22-15

తం తదా సమతిక్రాంతం నాతిచక్రామ రాఘవః
సముద్ధత మమిత్రఘ్నో రామో నదనదీపతిమ్. 22-16

ఇంతలో సముద్రుడు సర్వాభరణాలంకృతుడై దర్శనీయరూపముతో సముద్రము నుండి ఆవిర్భవించినాడు. కౌస్తుభమునకు తోడబుట్టిన మణి అతని వక్షస్థలమున మెరయుచుండినది.

[సముద్రునికి ఆభరణముల కొరత యేమియుండును! అన్నియు సముద్రమున ప్రభవించునవిగదా!]

సముద్రుడు శ్రీరాముని ముందుగా పలుకరించి అంజలిగావించి,

*సముద్రుడు :* శ్రీరామచంద్రప్రభూ! పృథివ్యాది పంచభూతములు వానివాని స్వభావ సిద్ధములైన మార్గములను శాశ్వతముగా ఆశ్రయించియుండును. అగాధముగను అప్లవముగను ఉండుట నా స్వభావమునపుట్టిన గుణము. లోతులేకయుండుట నా స్వభావమునకు విరుద్ధగుణము. కామమువలనగాని, లోభమువలనగాని, భయమువలనగాని ఈ జలమును స్తంభింపజేయుట నాకు సాధ్యముకాదు.

న కామా న్న చ లోభాద్వా న భయా త్పార్థివాత్మజ
గ్రాహనక్రాకులజలం స్తంభయేయం కథంచన. 22-26

నాకు సాధ్యమైనపని ఒక్కటిమాత్ర మున్నది. నా గర్భమున నుండు క్రూర జంతువుల వలన మీకు బాధ కలుగకుండునట్లు మీరు దాటుటకు నే నొక ప్రదేశమును నిర్దేశింతును.

*రాముడు :* సరే! కాని అమోఘమైన నా బాణమును ఎచ్చట వేయమందువు?

*సముద్రుడు :* ఉత్తరదిశయందు ద్రుమకుల్య మను ప్రదేశ మున్నది. అదియును నాదే. అచ్చట కొందరు చోరులు నా జలమును త్రాగుచుందురు. నీ బాణమును వారిపై ప్రయోగింపుము.

శ్రీరాముడు బాణమును వదలినాడు. ఆ బాణము పడిన ప్రదేశము మరుకాంతార మని ప్రసిద్ధికెక్కినది. శ్రీరాముడు ఆ ప్రదేశమునకు వరము ప్రసాదించినాడు. అది సమస్త సంపదలతోకూడి ఎల్లప్పుడు మనోహరముగా నుండును.

*సముద్రుడు :* విశ్వకర్మ కుమారుడైన నలుడు తన తండ్రియంతటివాడు. నలుడు నాయందు సేతువు నిర్మించినచో నేను దానిని ధరింతును.

ఏష సేతుం మహోత్సాహః కరోతు మయి వానరః
తమహం ధారయిష్యామి తథా హ్యేష యథా పితా. 22-44

ఈ మాటలు విన్నవించి సముద్రుడు అంతర్ధానమైనాడు.

*నలుడు :* నేను సేతువు నిర్మింప గలను. నా తండ్రికిగల సామర్థ్యము నాకును కలదు. సముద్రుడు చెప్పినమాట సత్యము.

ఈ లోకమున దండోపాయమే అన్నింటిని మించిన ఉపాయము. ముఖ్యముగా, సామ దానములు కృతఘ్నులు కానివారివిషయమున ఏమియు పనిచేయజాలవు.

దండ ఏవ వరో లోకే పురుషస్యేతి మే మతిః
ధిక్ క్షమా మకృతజ్ఞేషు సాంత్వం దాన మథాపి వా. 22-47

ఈ సముద్రుడు శ్రీరాముని దండభయముచేతనేగదా సేతువునకు చోటిచ్చుట!

నాకు సేతువు నిర్మింపగల సామర్థ్య మున్నది. నా తండ్రి నాకు వరము ప్రసాదించి యున్నాడు. ఈ మాటను సముద్రుడు జ్ఞప్తికి తెచ్చినాడు.

స్మారితోస్మ్యహ మేతేన తత్త్వమాహ మహోదధిః. 22-51

[ఈ మాట ముందే జ్ఞాపకముండి యుండినచో ఈ చిక్కంతయు లేకపోవునుగదా యని అనిపించును. కాని, పనులు అంత సులభముగా నెఱవేరవు.]

రామప్రభూ! సేతు నిర్మాణమునకు మన మిప్పుడే ప్రయత్నింపవచ్చును.

## సేతుబంధనము; సముద్రమును దాటుట

శ్రీరాముడు అనుజ్ఞ నిచ్చినాడు. వానరులు లక్షలులక్షలుగా వృక్షములను తెచ్చినారు. కొండలను పెల్లగించి బండలను తెచ్చినారు. ఒక్కొక్క బండ ఒక ఏనుగంత ఉన్నది. వాని నన్నింటిని యంత్రములతో తెచ్చినారు.

[అప్పటికప్పుడు యంత్రములను నిర్మించుకొన్నారు కాబోలు!]

హస్తిమాత్రా న్మహాకాయాః పాషాణాంశ్చ మహాబలాః
పర్వతాంశ్చ సముత్పాట్య యంత్రైః పరివహంతి చ. 22-58

పర్వతములను తెచ్చి సముద్రములో వేసినారు – సేతువు సమముగా నుండుటకు కొందరు నూరు యోజనముల పొడవున నూలు పట్టినారు. కొందరు కొలత కొయ్యలను గ్రహించి కొలత లెత్తుచున్నారు. కార్యకలాపమును కొందరు పరీక్షించుచున్నారు. శ్రీరాముని ఆజ్ఞను శిరసావహించి వానరులు శిలలను, పచ్చిక పెళ్లలను, కొయ్యలను, ఉపయోగించి సేతువు నిర్మించినారు.

మొదటిదినము పదునాలుగు యోజనములు, రెండవ దినము ఇరువది, మూడవ దినము ఇరువదియొకటి, నాల్గవ దినము ఇరువదిరెండు, అయిదవ దినము ఇరువదిమూడు, ఈవిధముగా నూరు యోజనముల నిడివియు, పది యోజనముల వెడల్పును గల సేతువును అయిదు దినములలో నిర్మించినారు.

సముద్రమున నలుడు నిర్మించిన సేతువు ఆకాశమున స్వాతీపథమువలె శోభిల్లినది.

స నలేన కృత స్సేతు స్సాగరే మకరాలయే
శుశుభే సుభగ శ్శ్రీమా౯ స్వాతీపథ ఇవాంబరే. 22-72

[లోగడ, సముద్రమును ఆకాశమునకు పోల్చి వర్ణించి యున్నారు. ఇప్పుడొక క్రొత్త పోలికనుకూడ సూచించినారు వాల్మీకి మహర్షి.]

ఈ అద్భుతకార్యమును చూచుటకు దేవతలు, ఋషులు వచ్చి ఆకాశమున నిల్వబడినారు.

నలుడు నిర్మించిన సేతువు, సముద్రమునకు పాపటవలె కానవచ్చినది.

[ఉపమానము చక్కగా నున్నది. సేతువునకు ఇరుపార్శ్వములయందున్న సముద్ర జలము నీలకుంతలములకు సరివచ్చునట్లు స్ఫురించుచున్నది. సేతువు పాపటవలె చక్కగా తీర్చి దిద్దబడి యున్న దనియు స్ఫురించుచున్నది.]

విశాల స్సుకృత శ్శ్రీమా౯ సుభూమి స్సుసమాహితః
అశోభత మహాసేతు స్సీమంత ఇవ సాగరే. 22-78

సేతువును నిర్మించు సందర్భముననే కోట్లకొలది వానరులు సముద్రపు ఆవలితీరము చేరినారు. విభీషణుడు గదాపాణియై తన మంత్రులగూడి సముద్రపు దక్షిణ తీరమున చేరి శత్రువులను నిగ్రహించుటకు సంసిద్ధుడై యుండినాడు.

*సుగ్రీవుడు :* రామప్రభూ! నీవు హనుమంతునిపై నధిరోహింపుము. లక్ష్మణుడు అంగదునిపై నెక్కి రాగలడు. వారిద్దరు మిమ్ములను ఆకాశమార్గమున దాటింపగలరు.

హనుమంతం త్వ మారోహ అంగదం చాపి లక్ష్మణః 22-80
వైహాయసౌ యువా మేతౌ వానరౌ తారయిష్యతః 22-81

[సుగ్రీవుడు రామలక్ష్మణులను నూరు యోజనములు నడిపించునా!]

సుగ్రీవుడు, రామలక్ష్మణులు సేనకు అగ్రభాగమునం దున్నారు. సేన కదిలినది. సేతుమార్గమున సముద్రమునుదాటి దక్షిణతీరమున విడిసినది.

దేవతలు, ఋషులు శ్రీరాముని సన్నిధికివచ్చి మంగళజలములతో శ్రీరాముని అభిషేకించి "రామా! నీవు శత్రువును జయించి అనేక సంవత్సరములు రాజ్యమును పాలించుచు సుఖముగా నుండుము. నీకు మంగళ మగునుగాక" అని ఆశీర్వదించినారు.

తదద్భుతం రాఘవకర్మ దుష్కరం
సమీక్ష్య దేవా స్సహ సిద్ధచారణైః

ఉపేత్య రామం సహసా మహర్షిభి
స్సమభ్యషించ౯ సుశుభై ర్జలైః పృథక్. 22-86

జయస్వ శత్రూ౯ నరదేవ మేదినీం
ససాగరాం పాలయ శాశ్వతీ స్సమాః
ఇతీవ రామం నరదేవ సత్కృతం
శుభై ర్వచోభి ర్వివిధై రపూజయ౯. 22-87

రామలక్ష్మణులు వానరసైన్య సమేతులై సముద్ర దక్షిణతీరమునకు చేరినారు. రామునికి మంచి శకునములైనవి. శ్రీరాముడు సంతోషించి లక్ష్మణుని కవుగిలించుకొని,

రాముడు : లక్ష్మణా! మంచిఫలమూలములు, నీటివసతియుగల ఒక ప్రదేశమును చూడుము. మన సైన్యమును విభజించి వ్యూహముగా తీర్చి స్వస్థచిత్తులమై యుందము. శకునములనుబట్టి చూడగా యుద్ధము ప్రచండముగా జరుగునట్లు కనబడుచున్నది. ఋక్ష వానర సమూహములు, రాక్షసానీకములు విస్తారముగా చనిపోవున ట్లున్నది.

లోకక్షయకరం భీమం భయం పశ్యా మ్యుపస్థితమ్
నిబర్హణం ప్రవీరాణా మృక్ష వానర రక్షసామ్. 23-3

వానరులు రాక్షసులు ప్రయోగించు ఆయుధములతోను, వారి రక్తమాంసములతోను, భూమి నిండిపోగలదు.

లక్ష్మణా! మన మిప్పుడే లంకకు ప్రయాణము సాగింతము.

శ్రీరాముడు ధనుర్ధరుడై లంకకు అభిముఖముగా వానరసేనముందు లక్ష్మణ సహితుడై బయలుదేరినాడు. రామునివెంట సుగ్రీవ విభీషణులు సైన్యముతో కదలినారు. అందరు ఉత్సాహముగా నడచుచున్నారు. లంకలో మ్రోగుచుండిన భేరీ మృదంగనాదములు వానరులకు వినిపించినవి. వానరులు సింహనాదములు చేసినారు.

శ్రీరాముడు లంకాపురిని చూచి సీతాదేవికి వాటిల్లిన కష్టమును తలచుకొని దుఃఖించినాడు.

రాముడు : లక్ష్మణా! ఈ పట్టణమును చూడుము. హర్మ్యములతో, ప్రాసాదములతో నిండి తెల్లనిమేఘములతోకూడిన ఆకాశమువలె ప్రకాశించుచున్నది. ఇక్కడి ఉద్యానవనములు కుబేరుని చైత్రరథమును మించియున్నవి.

వానరులారా! మనము మన సైన్యమును విభాగించి వ్యూహమును పన్నుదము. అంగదుడు, నీలుడు వారిసేనలతో వక్షస్థలమున నుందురు. నేను, లక్ష్మణుడును

శిరః ప్రదేశమున నెలకొనియుందుము. ఋషభుడు దక్షిణపార్శ్వమునందును, గంధమాదనుడు సవ్యపార్శ్వమునందును ఉందురుగాక. జాంబవంతుడు, సుషేణుడు, వేగదర్శి, ఈ ముగ్గురు కుక్షిభాగమును, సుగ్రీవుడు పుచ్ఛభాగమును రక్షింతురుగాక.

శ్రీరాము డీవిధముగా వ్యూహము నిర్మించి సుగ్రీవునితో

*రాముడు* : సుగ్రీవా! సైన్యమును విభజించి వ్యూహమును నిర్మించుటయైనది. ఇక శుకుని విడిచిపెట్టుడు.

ఈ మాటతో శుకుడు వానరుల చేతులలోనుండి బయటబడి రావణుని సన్నిధికి చేరినాడు.

## శ్రీరాముని వానరసేనను గూర్చి శుకుడు రావణునికి నివేదించుట

*రావణుడు* : (శుకుని చూచి నవ్వుచు) శుకుడా! నీ రెక్కలు శిథిలమై యున్నవేమి? శత్రువుల చేతులలో చిక్కలేదుగదా!

*శుకుడు* : ప్రభూ! వానరసేన సముద్రపు ఉత్తరతీరమున నుండగా - నేను వారి చేరువ కరిగి నీ సందేశమును సుగ్రీవునికి నివేదించితిని. వానరులు నన్ను పట్టుకొని కొట్టి నానాబాధలు పెట్టినారు. అచ్చట ఎవ్వనితోను మాటలాడుటకుకూడ సాధ్యము కాదు. ప్రశ్నలకుగాని జవాబులకుగాని అవకాశములేదు.

విరాధుని, ఖరుని, కబంధుని వధించిన రాముడు సుగ్రీవుని గూడివచ్చియున్నాడు. సముద్రమునకు సేతువు నిర్మించి సైన్యమును ఈవలికి దాటించినాడు. వానరసైన్యము అఖండ భూమండలమును ఆక్రమించుకొని యున్నది. దేవతలకు దానవులకు సంధి కుదరనట్లే వానరులకును రాక్షసులకును సంధి కుదురదు. వానరసైన్యములు లంకాప్రాకారములపైకి రాకమునుపే సీతను ఇచ్చివేయుటయో లేక యుద్ధము చేయుటయో వెంటనే నిర్ణయించుకొనవలెను.

**పురా ప్రాకార మాయాంతి క్షిప్ర మేకతరం కురు**
**సీతాం వాస్మై ప్రయచ్ఛాశు సుయుద్ధం వా ప్రదీయతామ్.** 24-35

*రావణుడు* : (కోపముతో) దేవతలు, గంధర్వులు, అందరు ఏకమై నా పైకి వచ్చినను నేను సీతను విడువను. నా పరాక్రమ మెట్టిదో తెలియక రాముడు నాతో యుద్ధమునకు పూనుకొన్నాడు. రాముని, వానికి తోడువచ్చిన వానరసైన్యములను సంహరించెదను. యుద్ధములో నా యెదుట నిలువగలిగినవాడు ముల్లోకములలోను లేడు.

ఈ మాటలు శుకునితో అన్నాడేగాని, రావణుని గుండె దడదడలాడుచునే యుండినది.

## శుక సారణులు

శుకుడు, సారణుడు అను మంత్రుల నిద్దరను పిలిచి వారితో అనుచున్నాడు.

**రావణుడు :** శుక సారణులారా! దుస్తరమైన సముద్రము సైతము దాటివచ్చినదట వానర సైన్యము! రాముడు సముద్రమునకు సేతువు నిర్మించి, లోకమున ఇదివరకు కని విని ఎరుగని మహత్కార్యమును సాధించినాడు!

సమగ్రం సాగరం తీర్ణం దుస్తరం వానరం బలమ్
అభూతపూర్వం రామేణ సాగరే సేతుబంధనమ్. 25-2

ఈ మాట నేను నమ్మజాలకున్నాను.

సాగరే సేతుబంధంతు న శ్రద్ధధ్యాం కథంచన 25-3

మీరు పోయి చూచిరండు. సముద్రమునకు సేతువు నెట్లు నిర్మింపగలిగిరో తెలిసికొనిరండు. వానరసైన్యమునందు ప్రముఖు లెవ్వరో గుర్తింపుడు. రాముడు, సుగ్రీవుడు, ఎవ్వనిమాటలో నుందురో, రామలక్ష్మణుల ఆయుధము లెట్టివో, బలవిభాగము ఎట్లున్నదో, హరి సేనాపతి ఎవ్వడో, ఈ వివరము లన్నింటిని తెలిసికొని వెంటనేరండు.

శుక సారణులు కపిరూపములు ధరించిపోయి వానరసైన్యములో ప్రవేశించినారు.

హరిరూపధరౌ వీరౌ ప్రవిష్టౌ వానరం బలమ్. 25-9

విభీషణుడు వారిని గుర్తుపట్టి వారిని శ్రీరామునియొద్దకు తీసికొనిపోయి "వీరు రావణుని మంత్రులైన శుక సారణులు. మన రహస్యముల నారయుటకు వచ్చిన చారులు" అని చెప్పినాడు.

శుక సారణులు ప్రాణములమీద ఆశ వదలుకొని శ్రీరామునికి నమస్కరించి "స్వామీ! మీ సైన్యమును పరిశీలించిరమ్మని మా ప్రభువు పంపగా వచ్చితిమి" అని సవినయముగా చెప్పినారు.

**రాముడు :** (నవ్వుచు) మీరు మా సైన్యమును చూచుట పూర్తియైనదా? ఇంకను చూడవలసిన దేమైన కలదేని మీకు విభీషణుడు తోడ్పడగలడు. సర్వమును పరీక్షించి వెళ్ళవచ్చును. మీ రేమియు భయపడవలసిన పనిలేదు. మిమ్ముల నెవ్వరును బాధింపరు.

[ఈ మాటలు శ్రీరాముడు తప్ప మరెవ్వడైన చెప్పగలడా! సత్యపరాక్రమునికి రహస్యములతో పనిలేదు]

అథ కించి దదృష్టం వా భూయ స్తద్రష్టు మర్హథః
విభీషణో వా కార్త్స్న్యేన భూయ స్సందర్శయిష్యతి. 25-19

న చేదం గ్రహణం ప్రాప్య భేత్తవ్యం జీవితం ప్రతి
న్యస్తశస్త్రౌ గృహీతౌ వా న దూతౌ వధ మర్హథః 25-20

విభీషణా ! ఈ చారులను విడిచిపెట్టుము.

శుక సారణులారా ! మీరు లంకకుపోయి రావణునికి నా మాటలుగా ఇట్లు చెప్పుడు. "రావణా ! నీవు ఏ బలమును ఆశ్రయించుకొని నా సీతను అపహరించితివో ఆ బలమును యథేచ్ఛముగా ప్రదర్శింపుము. రేపుఉదయమున లంకను, దాని ప్రాకారములను, ద్వారములను, రాక్షససైన్యమును ధ్వంస మొనర్తును. నీవు సిద్ధముగా నుండుము".

ఈ మాటలు విని శుక సారణులు గండము తప్పించుకొని జయశబ్దములతో శ్రీరాముని అభినందించి లంకాపురిలోని కేగి రావణాసురునితో తమ వృత్తాంతమును చెప్పుచున్నారు.

## శుక సారణులు వానరసైన్యమును గూర్చి రావణునితో చెప్పుట

*సారణుడు :* ప్రభూ ! మేము వానరసైన్యములో ప్రవేశించిన వెంటనే విభీషణుడు మమ్ములను గుర్తించి పట్టుకొన్నాడు. మేము ప్రాణములమీద ఆశ వదలుకొన్నాము. ధర్మాత్ముడైన రాముని దయవలన మేము బ్రతికిబయటపడి మీ దర్శనము చేసికొనగలిగితిమి. లోకపాలకులకు సరివచ్చు పరాక్రమవంతులు, శూరులు, అస్త్రసంపన్నులును అగు రామలక్ష్మణులు, సుగ్రీవుడు, విభీషణుడు, ఈ నలుగురు ఒకచోట కూడియున్నారు. సైన్యసహాయము లేకయే వారు నలుగురును లంకను ప్రాకారతోరణసహితముగా పెల్లగించి తీసికొనిపోగలరు. అంతవరకు పనిలేదు. మిగిలినవారితో పనిలేకయే రాముడొక్కడుమాత్రమే అంతపని చేయగలడు. వారు సముద్రమునకు సేతువు నిర్మించినారన్నమాటలో సందేహింపవలసిన దేమియు లేదు. సేతువును మేము స్వయముగా చూచినాము. పదియోజనముల వెడల్పు, నూరుయోజనముల నిడివియును కలిగియున్నది. సర్వసైన్యములు ఆ సేతువుమార్గముననే సముద్రమును దాటివచ్చినవి.

వానరసైన్యము ఇంతయని అంతయని చెప్పుటకు సాధ్యముకాదు. అందరును ఉత్సాహపూరితులై యున్నారు. వారితో విరోధించి జయము సాధింపలేము. శాంతించి, సీతను రామునికి సమర్పించుటయే మేలు.

ప్రహృష్టరూపా ధ్వజినీ వనౌకసాం
మహాత్మనాం సంప్రతి యోద్ధు మిచ్ఛతామ్
అలం విరోధేన శమో విధీయతాం
ప్రదీయతాం దాశరథాయ మైథిలీ. 25-34

*రావణుడు* : సారణా! దేవగంధర్వదానవులు ఏకమై నా పైకివచ్చినను, సమస్తలోకముల వారు నన్ను భయపెట్టినను, నేను సీతను విడువను. నీవు వానరులచే మర్దింపబడివచ్చి వారికి భయపడి శాంతిదూతవై తివి! యుద్ధమున నన్ను జయించువాడొక డున్నాడా?

## రావణుడు ప్రాసాదముపైనుండి వానరసైన్యమును చూచుట

ఈ మాటలు చెప్పి, వానరసైన్యమును చూచుటకై రావణుడు ఒక ప్రాసాదము పై కెక్కినాడు. శుక సారణులు రావణుని అనుసరించినారు. అపారమైన వానర సేనను చూచి,

*రావణుడు* : సారణా! వానరవీరులలో ముఖ్యు లెవ్వరు?

*సారణుడు* : ప్రభూ! లంకకు అభిముఖముగా నిల్చి సింహనాదము చేయుచున్నవాడు నీలుడు-అతడే వానర సేనాధిపతి. అదిగో, చేతులు పైకెత్తి తోకను విదెల్చి లంక పైకి విజృంభించుచున్నవాడు అంగదుడు-కపిరాజ్యమునకు యువరాజు, వాలి కుమారుడు, తండ్రికి సరివచ్చు వీరుడు, రామునికై తన పరాక్రమము నంతయు వినియోగింప సంసిద్ధుడైయున్నాడు. హనుమంతుడు లంక కరుదెంచి సీతను సందర్శించి పోగలుగుటకు అంగదుని బుద్ధిసూక్ష్మతయే కారణము.

అంగదుని వెనుక నిలువబడియున్నవాడే నలుడు. సేతువును నిర్మించిన మహావీరుడు. లంకను నాశన మొనర్చుటకు తహతహ పడుచున్నాడు.

ఆ తెల్లని దేహమువాడు శ్వేతుడు. అదిగో! రంగురంగుల వాలముతో శోభిల్లుచున్నవాడు కుముదుడు. కపిలవర్ణముగల దీర్ఘనేత్రములవాడు రంభుడు. చెవులు విప్పి అటుఇటు ఎగురుచు కోపముతో వణకుచు సింహనాదము చేయుచున్నవాడు శరభుడు. ఆ మేఘాకార శరీరుడు పనసుడు.

రెండవ సముద్రమోయన, కన్నులకు ప్రేగై కానవచ్చు వానర సేనామధ్యమున సముద్రతీరమున నిల్వబడి యుండువాడు వినతుడు. నిన్ను యుద్ధమున కాహ్వానించుచున్నవాడు క్రోధనుడు. ఆ గైరికవర్ణదేహుడు గవయుడు.

వీ రందరు యూథపులు. అందరును బలవంతులు. కామరూపులు. రామునికొరకు ప్రాణము లర్పించుటకు సంసిద్ధులైయున్నారు.

అదిగో ! బహువర్ణరంజితమైన దీర్ఘవాలమువాడు హరుడు. అదిగో ! మనపైకి దూకుటకు తొందరపడుచున్న భల్లూకములను చూడుము. వారి నడుమ నున్నవాడు ధూమ్రుడు. వాని సమీపమునందున్న ఆపర్వతాకారుడు ధూమ్రుని తమ్ముడు జాంబవంతుడు. మున్ను దేవాసురయుద్ధములో దేవేంద్రునికి సహాయ మొనర్చి ఎన్నో వరములు సంపాదించియున్నాడు. ఇతని సైనికులు పర్వతములపైనుండి మేఘములవంటి పెద్దబండలను క్రిందికి త్రోయుచున్నారు చూడుము.

కోపోద్రిక్తుడై ఎగురుచున్నవాడు దంభుడు. ఆపొడవైన, లావైన మేనివాడు సన్నాదనుడు. అతనికంటె పెద్దశరీరముగలవాడు చతుష్పదములలోలేడు. ఇతడు దేవేంద్రునితో యుద్ధముచేసిన వీరుడు. అగ్నిదేవుని కుమారుడు.

ఆ యెర్రని దుమ్మురేగుచున్నచోట నిలబడియున్నవాడు ప్రమాథి. అదుగో ! కొండముచ్చులనాయకుడు గవాక్షుడు. సైన్యము నడుమ విజృంభించుచున్నవాడు శతవలి. జయార్థియై ప్రతిదినము సూర్యదేవుని ఆరాధించువాడు.

[సూర్యుని ఆరాధించుటవలన జయము కలుగును. ఎల్లరు చేయదగినది !]

**జయార్థీ నిత్య మాదిత్య ముపతిష్ఠతి బుద్ధిమాన్.** 27-45

ప్రభూ ! వానరసేనలోని వా రందరు మహాపరాక్రమసంపన్నులు. ఒక్కొక్కడును లంకను భస్మము చేయుటకు త్వరపడుచున్నాడు.

*శుకుడు* : ప్రభూ! సుందరరూపులు ఇరువు రున్నారు చూచితివా ! వారు మైందద్వివిదులు. బ్రహ్మదేవుని అనుజ్ఞతో అమృతపానము చేసినవారు. వారి ప్రక్కన నిలబడియున్నవారు సుముఖుడు, దుర్ముఖుడు; ఇద్దరును మృత్యుదేవతకుమారులు. పరాక్రమమునందు తండ్రికి సరివచ్చువారు.

మత్తమాతంగముభంగి శోభిల్లుచున్నవాడే హనుమంతుడు. మన మెరిగినవాడే! సముద్రమును లంఘించి లంకలో ప్రవేశించి సీతను సందర్శించిపోయిన మహనీయుడు.

ఆ హనుమంతుని చేరువ నున్నవాడే శ్రీరాముడు. శ్యామసుందరుడు. పద్మనేత్రుడు. లోకప్రసిద్ధిగాంచిన పరాక్రమశాలి. ధర్మాత్ముడు. ఎప్పుడుగాని ధర్మమును విడుచువాడు కాడు. బ్రహ్మాస్త్రమును, వేదములను చక్కగా తెలిసినవాడు. ఆకాశమును బాణములతో భ్రద్దలుచేయగలడు. క్రోధపరవశుడైనప్పుడు యమునికి సాటి

వచ్చువాడు. ఇంద్రునివంటి పరాక్రమసంపన్నుడు. నీవపహరించిన సీత ఈ రాముని భార్య. రాముడు నీతో యుద్ధమాడ వచ్చియున్నాడు.

యశ్చైషోఽనంతర శ్శూర శ్శ్యామః పద్మనిభేక్షణః
ఇక్ష్వాకూణా మతిరథో లోకే విఖ్యాత పౌరుషః 28-19

యస్మిన్న చలతే ధర్మో యో ధర్మం నాతివర్తతే
యో బ్రాహ్మమస్త్రం వేదాంశ్చ వేత్తి వేదవిదాం వరః 28-20

యో భింద్యా ద్గగనం బాణైః పర్వతానపి దారయేత్
యస్య మృత్యోరివ క్రోధ శ్శక్రస్యేవ పరాక్రమః 28-21

యస్య భార్యా జనస్థానా త్సీతా చాపహృతా త్వయా
స ఏష రామ స్త్వాం యోద్ధుం రాజన్ సమభివర్తతే. 28-22

రాముని కుడిప్రక్కన చూపట్టు బంగారువన్నెవాడు లక్ష్మణుడు. రాముని తమ్ముడు. రామునికి ప్రాణసముడైన ప్రియుడు.

యస్యైష దక్షిణే పార్శ్వే శుద్ధజాంబూనద ప్రభః
విశాలవక్షా స్తామ్రాక్షో నీల కుంచిత మూర్ధజః 28-23

ఏషోఽస్య లక్ష్మణో నామ భ్రాతా ప్రాణసమః ప్రియః 28-24

[ఈ శ్లోకమును చదివి ఏ చిత్రకారుడైనను లక్ష్మణస్వామిని చిత్రించిన బాగుండును]

లక్ష్మణుడు యుద్ధకుశలుడు. సర్వశాస్త్రవిశారదుడు-గొప్పవీరుడు-బుద్ధిమంతుడు. రామునికి కుడిభుజమువంటివాడు. రామునికిగా ప్రాణము నర్పించుటకు సంసిద్ధుడైయున్నవాడు.

న హ్యేష రాఘవస్యార్థే జీవితం పరిరక్షతి 28-26

ప్రభూ! లక్ష్మణు డొక్కడే రాక్షసుల నందరను వధింపవలయునని యున్నాడు.

శ్రీరాముని ఎడమవైపున కానవచ్చువాడు రాజైన విభీషణుడు. రాజరాజైన శ్రీరామునిచే లంకేశ్వరుడుగా అభిషిక్తుడైనాడు. నీతో యుద్ధముచేయ సంసిద్ధుడై యున్నాడు.

యస్తు సవ్యమసౌ పక్షం రామస్యాశ్రిత్య తిష్ఠతి
రక్షోగణ పరిక్షిప్తో రాజా హ్యేష విభీషణః 28-27

శ్రీమతా రాజరాజేన లంకాయా మభిషేచితః 28-28

ప్రభూ! శతపుష్కరములతో శోభిల్లుచున్న కాంచనమాలను ధరించి అచ్చట నిలబడియున్నవాడే సుగ్రీవుడు. రాముడు వాలిని వధించి కపిరాజ్యమును ఎవ్వనికి ప్రసాదించెనో ఆ సుగ్రీవుడు ఈతడే.

నూరులక్షలు ఒక కోటి. నూరువేలకోట్లు ఒక శంఖము. నూరువేల శంఖములు ఒక మహాశంఖము. నూరువేల మహాశంఖములు ఒక బృందము. నూరువేల బృందములు ఒక మహాబృందము. నూరువేల మహాబృందములు ఒక పద్మము. నూరువేల పద్మములు ఒక మహాపద్మము. నూరువేల మహాపద్మములు ఒక ఖర్వము. నూరువేల ఖర్వములు ఒక మహాఖర్వము. నూరువేల మహాఖర్వములు ఒక సముద్రము. నూరువేల సముద్రములు ఒక ఓఘము. నూరువేల ఓఘములు ఒక మహౌఘము.

ఈ వానరసేన కోటి మహౌఘములను మించి మహాసముద్రమువలె నున్నది. ఈ సేన కంతటికి సుగ్రీవుడు ప్రభువు. సుగ్రీవుడు మహాబలపరాక్రమ సంపన్నుడు. నీతో యుద్ధమాడుటకు వచ్చియున్నాడు.

రాజా! ఈ మహావీరుల పరాక్రమమును గుర్తించి మనకు జయము లభించునట్లు గొప్ప ప్రయత్నము చేయవలసియున్నది.

రామలక్ష్మణులను, సుగ్రీవ విభీషణులను, వానరవీరులను, శుక సారణుల మాటలను స్మరించిన రావణునికి భయము కలిగినది. శుక సారణులతో పరుషముగా మాటలాడుచున్నాడు.

రావణుడు : నిగ్రహానుగ్రహశక్తిగల రాజును ఆశ్రయించి జీవించు మంత్రులు రాజునకప్రియమైన మాటలను చెప్పకూడదు. యుద్ధారంభసమయమున శత్రువును పొగడుచున్నారు. రాజనీతిశాస్త్రము మీకు తెలిసినట్లేలేదు. ఒకవేళ మీరు చదివియున్నను దాని అర్థమును గ్రహింపక జ్ఞానభారమును మోయుచున్నవారు మాత్రమే అయినారు.

[జ్ఞానమును తలమీదనుంచుకొని మోయుచుండినచో అది తలలోపలికి ఎట్లుపోగలదు!]

గృహీతో వా న విజ్ఞాతో భారో జ్ఞానస్య వోహ్యతే. 29-8

మీవంటి మూర్ఖులను మంత్రులుగా ఉంచుకొని నే నింకను బ్రతికియున్నా ననగా అది కేవల దైవయోగ మనియే చెప్పవలయును. మీ రిట్లు పరుషముగా మాటలాడుట చూడగా మీకు మరణభయములేనట్లు తోచుచున్నది. శత్రుపక్షమును పొగడుచున్న మీరు వధ్యులు. కాని, ఇదివరలో మీరు మంచివారుగా నుండినందున మిమ్ములను స్థానభ్రష్టులను మాత్రము చేసి ప్రాణములతో విడిచిపెట్టుచున్నాను. మీ ముఖము నాకు చూపవలదు. పొండు.

శుక సారణులు రావణునికి నమస్కరించి వెళ్ళిపోయినారు.

## రావణుడు శార్దూలాది చారులను పంపుట

**రావణుడు :** మహోదరా! రాజనీతివిశారదులైన చారులను పిలిపింపుము.

మహోదరుడువెళ్లి శార్దూలుడు మున్నగు మేటిచారులను పిలిపించినాడు.

**రావణుడు :** (చారులతో) శత్రురహస్యములను గూఢచారులవలన తెలిసికొన్న రాజునకు యుద్ధ విజయము అల్పయత్నముతో కలుగును. కావున మీరుపోయి రాముని రహస్యములను గ్రహించిరావలయును. వారు చేయుచున్న యుద్ధప్రయత్నములు సవివరముగా తెలిసికొనవలయును. రాముడు నిద్రించుట యెట్లు? రాముని ఆంతరంగికమంత్రు లెవ్వరు? అన్ని వివరములను తెలిసికొని త్వరగారండు.

శార్దూలాది చారులు సువేలపర్వతప్రాంతమునకు వచ్చి వానరసేనను చూచి దిగులు నొందినారు. విభీషణుడు వారిని పట్టుకొని వానరులవశము చేసి "ఈ శార్దూలుడు పరమదుర్మార్గుడు" అని చెప్పినాడు. వానరులు శార్దూలుని మర్దించినారు. చారులనందరనుకొట్టి బంధించినారు. శ్రీరాముడు దయదలచి అందరను విడిపించినాడు. చారులు చావుతప్పించుకొని రావణుని చెంతకు వచ్చి చెప్పుచున్నారు.

**చారులు :** ప్రభూ! రాముడు లెక్కకు మించిన వానరసైన్యమును గూడి సువేలపర్వత ప్రాంతమునకు వచ్చియున్నాడు.

**రావణుడు :** శార్దూలుడా! రహస్యము లేమైన కనుగొనివచ్చితిరా? మీ ముఖములు అట్లున్న వేమి? వానరులచేతులలో చిక్కలేదుగదా!

**శార్దూలుడు :** ప్రభూ! అచ్చట చారులకెట్టి అవకాశమును లేదు. ఎవ్వనితోను భాషించుటకు సాధ్యముకాదు. బలవంతులైన వానరులు దారు లన్నిటిని ఆక్రమించి కావలి కాయుచున్నారు. మేము వెళ్ళుటతోడనే మమ్ములను గుర్తుపట్టినారు. విభీషణుని మంత్రులు మమ్ములను పట్టుకొని కొట్టినారు. వానరులు మమ్ములను వధింపదలచినారు. నా శరీర మంతయు రక్తసిక్తమైపోయినది. నేను వానరులకు నమస్కరించి నన్ను రక్షింపు డని ప్రార్థించినాను. వారు నన్ను రాముని సన్నిధికి కొనిపోయినారు. రాముడు నన్ను విడిపించి వానరుల బాధనుండి తప్పించినాడు. రాముని దయవల్ల ఇంకను జీవించి యున్నాను.

**రాఘవేణ పరిత్రాతో జీవామీతి యదృచ్ఛయా.** 30-10

ప్రభూ! రాముడు లంకాద్వారమున నున్నాడు. గరుడవ్యూహమును నిర్మించి లంకపైకి దూకబోవుచున్నాడు. ప్రాకారముల దరికి రాకమునుపే సీతను సమర్పించుటయో, యుద్ధము చేయుటయో త్వరగా నిర్ణయింపుము.

పురా ప్రాకార మాయాంతి క్షిప్ర మేకతరం కురు
సీతాం వాస్మై ప్రయచ్ఛాశు సుయుద్ధం వా ప్రదీయతామ్. 30-13

*రావణుడు :* దేవదానవులు నా పైకి వచ్చినను మరియెవ్వరు వచ్చినను నేను భయపడను. నేను సీతను విడుచుటలేదు. అంతే.

శార్దూలుడా ! నీవు వానర సేనను చూచివచ్చితివిగదా ! వారిలో శూరు లెవ్వరు? వారి బలమెట్టిది ? వా రెవరిపుత్రులు ? ఎవ్వరి పౌత్రులు ? వివరము లన్నియు చెప్పుము.

*శార్దూలుడు :* కపిరాజైన సుగ్రీవుడు ఋక్షరజుని పుత్రుడు. జాంబవంతుడు గద్గదుని పుత్రుడు. ధూమ్రుడు జాంబవంతుని అన్న. హనుమంతుని తండ్రియగు కేసరి బృహస్పతి పుత్రుడు. సుషేణుడు వరుణదేవుని పుత్రుడు. దధిముఖుడు చంద్రుని కుమారుడు. సుముఖుడు, దుర్ముఖుడు, వేగదర్శి అనువారలు బ్రహ్మచే వానర రూపమున సృష్టింపబడిన మృత్యుదేవతలు. వానర సేనాపతియైన నీలుడు అగ్ని దేవుని పుత్రుడు. హనుమంతుడు వాయుదేవుని పుత్రుడు. అంగదుడు దేవేంద్రుని పౌత్రుడు. మైందద్వివిదులు అశ్వినీదేవతల పుత్రులు. గజుడు, గవాక్షుడు, గవయుడు, శరభుడు, గంధమాదనుడు, ఈ అయిదుగురు యముని కుమారులు.

వీరుగాక, పది కోట్లమంది వానరులు దేవతలకు జన్మించిన గొప్ప వీరులు వానర సేనలో నున్నారు.

రాముని సమాచారము వినుము. రాముడు దశరథచక్రవర్తి కుమారుడు. ఖరదూషణాదులను, విరాధుని, కబంధుని వధించిన మహావీరుడు. పరాక్రమమున రామునికి సరివచ్చువాడు ఈ లోకములో లేడు.

నాస్తి రామస్య సదృశో విక్రమే భువి కశ్చన. 30-29

జనస్థానమున మన రాక్షసుల నందరను వధించిన రాముని పరాక్రమము వర్ణనాతీతము.

వక్తుం న శక్తో రామస్య నరః కశ్చిద్గుణాన్ క్షితౌ
జనస్థానగతా యేన యావంతో రాక్షసా హతాః. 30-30

ఆ రాముని తమ్ముడే లక్ష్మణుడు. లక్ష్మణుని బాణవేగమును ఇంద్రుడు సైతము సహింపజాలడు.

శ్వేతుడు, జ్యోతిర్ముఖుడు, వీ రిద్దరు సూర్యదేవుని పుత్రులు. హేమకూటుడు వరుణదేవుని కుమారుడు. నలుడు విశ్వకర్మ పుత్రుడు. దుర్ధరుడు వసు పుత్రుడు.

వీరుగాక, నీ తమ్ముడు విభీషణుడు ఉండనే ఉన్నాడు. లంకా రాజ్యమును ఇదివరకే పరిగ్రహించియున్నాడు – శక్తివంచనలేక రామునికి సహాయము చేయ బూని యున్నాడు.

ఇది అక్కడి సమాచారము. ఇకమీద జరుగవలసిన కార్యమునకు నీవే కర్తవు. వానర సైన్యము సువేలపర్వతము నాక్రమించి యున్నది.

ఈ వర్ణన విని రావణునికి జంకు పుట్టినది.

**రావణుడు :** (సచివులను చూచి) మనము చక్కగా ఆలోచింపవలసిన సమయము వచ్చినది. మంత్రుల నందరను పిలిపింపుడు.

మంత్రులు వచ్చినారు. రావణుడు వారితో ఏవో మంతనములు చేసి వారికి సెల విచ్చినాడు. తన భవనములోనికి వెళ్ళి మాయలమారియైన విద్యుజ్జిహ్వుని పిలిపించినాడు.

## శ్రీరాముడు మరణించె నని రావణుడు సీతాదేవికి చెప్పుట

**రావణుడు :** విద్యుజ్జిహ్వుడా! మనము సీతను మోసపుచ్చవలయును. నీ మాయచేత రాముని శిరస్సును, రాముని ధనుర్బాణములను, సృజించి తెచ్చి నా వెంట రమ్ము.

శిరో మాయామయం గృహ్య రాఘవస్య నిశాచర
త్వం మాం సముపతిష్ఠస్వ మహచ్చ సశరం ధనుః 31-8

రావణుడు కోరినమేరకు, విద్యుజ్జిహ్వుడు రాముని శిరస్సును, ధనుర్బాణములను నిర్మించినాడు. ఇరువురును అశోకవనమున కేగి ఒక చిన్న నాటక మాడినారు.

సీతాదేవి భర్తనే స్మరించుచు దీనయై యున్నది. విద్యుజ్జిహ్వుడు ఒక ప్రక్క దాగియున్నాడు. రావణుడు సీతాదేవిని సమీపించి అనుచున్నాడు.

**రావణుడు :** (సంతోషముతో) నీవు ఇంతకాలము ఎవ్వరిని నమ్ముకొని నా వశము గాక యుంటివో ఆ రాముడు యుద్ధమున మరణించినాడు. నీ దర్పము అణగారినది. ఇకపై నా ప్రార్థనలతో పనిలేక నీ దుఃఖమే నిన్ను నా భార్యగా చేయగలదు.

ఛిన్నం తే సర్వతో మూలం దర్పస్తే నిహతో మయా
వ్యసనే నాత్మన స్సీతే మమ భార్యా భవిష్యసి. 31-15

నీ భర్త పోయినా డని దుఃఖింపకుము. నీవు నాకు భార్యవై సుఖింపుము.

రాముని మరణ మెట్లు కలిగెనో వినుము.

రాముడు నన్ను వధించుటకు వానరసైన్యమును వెంటబెట్టుకొని వచ్చినాడు. వారు సముద్రపు ఉత్తరతీరమును చేరునప్పటికి సూర్యాస్తమయ మైనది. ప్రయాణపు బడలికవలన అందరు మంచి నిద్రచెందినారు. మా చారులు పోయి అచ్చటి పరిస్థితులను చూచి వచ్చినారు.

మా సేనాపతి ప్రహస్తుడు గొప్పరాక్షససేనలను కొనిపోయి వానరుల నందరను వధించినాడు. నిద్రలో నుండిన రాముని శిరస్సును ప్రహస్తుడు తన ఖడ్గముచే ఖండించినాడు. విభీషణుడు ఆకాశమునకెగిరిపోయి తప్పించుకొనుటకు ప్రయత్నించెను. కాని మా వారు వానిని పట్టుకొన్నారు.

లక్ష్మణుడు, కొందరు వానరులు నల్దిక్కులకు పారిపోయినారు. సుగ్రీవుని గ్రీవము తెగిపోయినది. హనుమంతుని హనువు విరిగి చచ్చిపడియున్నాడు. జాంబవంతుడు, మైందుడు, ద్వివిదుడు అందరు హతు లైనారు. మా యోధులు పనసుని పనస పండు తరిగినట్టు తరిగి వధించినారు. దరీముఖుడు, కుముదుడు, అంగదుడు, అందరు హతులై పడియున్నారు. కొంతమంది వానరులను ఏనుగులచేత, గుఱ్ఱములచేత త్రొక్కించి వధించినారు.

[శుక సారణులవలన తెలిసికొనిన పేర్లను ఉపయోగపరచుకొని సీతాదేవికి తన మాటల యందు నమ్మకము కలిగించుటకు రావణుడు ప్రయాసపడుచున్నాడు]

రక్తసిక్తమై ధూళితో కప్పబడియున్న నీ భర్త శిరస్సును రాక్షసులిచ్చటికి తెచ్చి యున్నారు.

(రాక్షసస్త్రీలతో) రామునిశిరస్సును తెచ్చిన ఆ విద్యుజ్జిహ్వుని ప్రవేశపెట్టుడు.

విద్యుజ్జిహ్వుడు రాముని శిరస్సును, ధనుర్బాణములను, పట్టుకొని ప్రవేశించినాడు.

**రావణుడు :** (మాయశిరస్సును ధనుర్బాణములను చూపించి) సీతా! అల్లెత్రాటితో కూడియున్న ఈ ధనుస్సును ప్రహస్తుడు తెచ్చినాడు. ఇప్పుడైనను నీవు నా మాట వినుము.

క్రిందపడియుండిన శిరస్సును ధనుస్సును చూచి సీతాదేవి విలపించినది. శిరస్సున చూడామణిసైత మున్నది. ముఖవర్ణము, నేత్రములు, శిరోజములు, చూడామణి, ధనుర్బాణములు అన్నియు శ్రీరామునే సూచించుచున్నవి. సీతాదేవి దుఃఖము పట్టలేక విలపించుచున్నది.

**సీత :** కైకేయీ! నీ కోరిక సఫల మైనది. రాముడు నీ కేమి అపకారము చేసె నని అడవికి పంపితివి?

సీతాదేవి వణకుచు, మూర్ఛిల్లి నేలమీద పడినది. కొంతసేపటికిగాని ప్రజ్ఞ కలుగలేదు. మూర్ఛదేరి మరలమరల విలపించుచున్నది.

సీత : (శిరస్సును మూర్కొని) నాథా! నన్ను అనాథను జేసిపోయితివా! భార్యయందు దోషము కలదేని భర్త మరణించు నని యందురు - నేను సదాచారములో నున్నానుగదా! ఇట్లేల జరిగినది! నన్ను రక్షించుటకై వచ్చి నీ విట్లయితివా! మా అత్త కౌసల్య దుఃఖమును ఎవ్వరు తీర్పగలరు? నీకు దీర్ఘాయువు కలదని దైవజ్ఞులు చెప్పిరికదా! వారిమాట లన్నియు అబద్ధములేనా!

కాలమును మించిన శక్తి ప్రపంచమున లేదు. మన మిరువురము గంధమాల్యాములతో పూజించుచుండిన ధనుస్సు ఇట్లున్న దేమి? నన్ను చిన్నతనమున వివాహాము చేసికొంటివి. అప్పటినుండియు నేను నీకు సహచారిణిగా నున్నానుగదా! నన్ను చూడక నాతో మాటాడక ఉపేక్షగా నున్నావేమి? నన్ను వీడుటలేదని పాణిగ్రహణమునాడు ప్రతిజ్ఞచేసి ఇప్పుడు నన్నుబాసి పోవుచుంటివా! నన్ను నీవెంట కొనిపొమ్ము.

కిం మాం న ప్రేక్షసే రాజన్ కిం మాం న ప్రతిభాషతే
బాలాం బాల్యేన సంప్రాప్తాం భార్యాం మాం సహచారిణీమ్. 32-20

సంశ్రుతం గృహ్ణతా పాణిం చరిష్యామీతి యత్త్వయా
స్మర తన్మమ కాకుత్స్థ నయ మామపి దుఃఖితామ్. 32-21

అహో! నేను కవుగిలించుకొన్న శరీరము ఇప్పుడు నక్కలపాలైనదిగా! లక్ష్మణుడు అయోధ్యకుపోయి, రాత్రిసమయమున రాక్షసులు నిన్ను వధించిరని కౌసల్యకు చెప్పినప్పుడు ఆ తల్లి గుండె బ్రద్దలై మరణింపగలదు.

నన్ను రక్షించుటకు ఎంతెంతో ప్రయత్నముచేసి తుదకిట్లు మరణించితివా! నేనే నీకు మృత్యువునైతినిగదా! నీ కులమును నాశన మొనర్చు దాన నని తెలిసికొనజాలక నన్ను వివాహమాడితివి. నేను పూర్వజన్మమున ఎవరి కన్యాదానమునకో విఘ్న మొనర్చి యుందును. కావుననే శ్రీరాముని భార్యనైయుండియు నా కిట్టి దుర్గతి సంభవించినది.

నూన మన్యాం మయా జాతిం వారితం దాన ముత్తమమ్
యాహమద్యేహ శోచామి భార్యా సర్వాతిథేరపి. 32-30

[కన్యాదానమునకు ఎవ్వరుగాని అడ్డుతగులకూడదు!]

రావణుడా! నన్ను శ్రీరాముని శరీరముతో చేర్చి భార్యాభర్తలను ఒకటిగా చేయుము.

ఆ శిరస్సును ధనుస్సును మాటిమాటికి చూచుచు సీతాదేవి విలపించినది.

ఇంతలో ద్వారపాలకుడు రావణుని యొద్దకు వచ్చి "రాజా! సేనాపతి ప్రహస్తుడు వచ్చి కాచుకొనియున్నాడు. మంత్రు లందరును వచ్చియున్నారు. వెంటనే జరిపింపవలసిన గొప్పకార్య మున్నదట. అందరు తమ దర్శనమునకు వేచియున్నారు" అని చెప్పినాడు. రావణుడు అక్కడినుండి లేచిపోయి సభామందిరమున కరిగి మంత్రాంగము జరిపినాడు.

రావణుడు వెళ్లుటతోడనే రాముని మాయశిరస్సు, ధనుస్సు మాయమైనవి. [నాటకము ముగిసినది]

సభామందిరమున జరుగుచుండిన ఆలోచనలన్నియు శ్రీరాముని గూర్చినవే. ఆలోచనలు పూర్తియైన పిదప రావణుడు సేనాధ్యక్షులతో చెప్పుచున్నాడు.

రావణుడు: నగారాలు గట్టిగా మ్రోగించి సైన్యములను ప్రోగుచేయుడు. ఎవ్వరికిని కారణము మాత్రము చెప్పవలదు.

> శీఘ్రం భేరీనినాదేన స్ఫుటకోణాహతేన మే
> సమానయధ్వం సైన్యాని వక్తవ్యం చ న కారణమ్. 32-43

## సరమ సీతాదేవిని ఊరడించుట

సీతాసంరక్షణకు రావణుడు నియమించిన రాక్షసస్త్రీలలో సరమ అను ఒక యువతికలదు. సరమ సీతాదేవికి స్నేహితురాలైనది.

> సా హి తత్ర కృతా మిత్రం సీతయా రక్ష్యమాణయా
> రక్షంతీ రావణాదిష్టా సానుక్రోశా దృఢవ్రతా. 33-3

సీతాదేవిమీద సరమకు అమితప్రీతి. సరమ మిక్కిలి దయగల రాక్షసి. ఇంపుగా మాటలు చెప్పగలదు.

[రాక్షసులలోకూడ మంచివా రున్నారు. దేవుని దయవలన సీతాదేవికి లంకలోకూడ ఒక స్నేహితురాలు లభ్యమయినది. మంచిగుణములు రాక్షసులను సైతము ఆకర్షింపగలవు.]

సరమ సీతాదేవిని ఊరడించుచున్నది.

సరమ: సీతా! ఊరడిల్లుము. శ్రీరాముడు జీవించియే ఉన్నాడు. రావణుడు నీతో చెప్పినమాట లన్నియు నేను దాగియుండి విన్నాను. నేను నీకై నా ప్రాణము లర్పించుటకుకూడ సంసిద్ధురాలనై యున్నాను.

> తవ హేతో ర్విశాలాక్షి న హి మే జీవితం ప్రియమ్. 33-7

రావణుడు అంత తొందరపాటుతో వెళ్ళిన కారణముగూడ తెలిసికొనివచ్చితిని.

శ్రీరాముని నిద్రలో వధించుట సాధ్యమగునా! ఇదంతయు మాయ. సీతా! నీ శోకము తీరిపోయినది. నీకు శుభము కలుగబోవుచున్నది. నీకొక ప్రియవార్తను చెప్పెదను వినుము.

శోకాస్తే విగత స్సర్వః కల్యాణం త్వా ముపస్థితమ్
ధ్రువం త్వాం భజతే లక్ష్మీః ప్రియం ప్రీతికరం శృణు. 33-15

[ప్రియవార్తను ఎంతచల్లగా, మృదువుగా చెప్పుచున్నదో గమనింపదగియున్నది. తటాలున చెప్పకూడదు!]

శ్రీరాముడు సముద్రమును దాటి సైన్యసమేతుడై లంకాతీరమున విడిసియున్నాడు. రామలక్ష్మణులను నేను కన్నులార చూచివచ్చితిని. ఈ వృత్తాంతము రావణుడు తెలిసికొని దానినిగూర్చి ఆలోచించుటకే ఇక్కడనుండి వడిగా వెళ్ళినాడు.

ఈ మాటలలోనే, రాక్షససైన్యములు కదలుచుండిన శబ్దము వినబడినది.

సరమ: వింటివిగదా ఈ శబ్దము! రావణుడు తన సేనలను ప్రోగుచేయుచున్నాడు. సీతా! నీ శోకము త్వరలోనే తీరిపోగలదు. జయలక్ష్మి నిన్ను కూడగలదు. శీఘ్రకాలముననే శ్రీరాముడు రావణుని వధించి నిన్ను కలిసికొనగలడు. అచిరకాలములో నీవు శ్రీరాముని ఒడియందు కూర్చుండగలవు. నీవు రాముని కవుగిలించుకొని ఆనందబాష్పములు విడువగలవు. ఇంతకాలముగా సంస్కారము లేక పెనచుకొనిపోయి జడకట్టియున్న నీ దీర్ఘవేణిని శ్రీరాముడు స్వయముగా త్వరలోనే సవరింపగలడు. శ్రీరాముని పూర్ణచంద్రాననము జూచి నీవు శోకమును వీడగలవు. శ్రీరాముడు రావణుని వధించి నిన్ను గూడి సుఖముగా నుండగలడు.

[ఈ శృంగారరస వాక్యములు ప్రియసఖి నోట వచ్చుట సొంపుగా నున్నది]

ఆగతస్య హి రామస్య క్షిప్ర మంకగతాం సతీమ్
అహం ద్రక్ష్యామి సిద్ధార్థాం త్వాం శత్రౌ వినిపాతితే. 33-32

అశ్రూణ్యానందజాని త్వం వర్తయిష్యసి శోభనే
సమాగమ్య పరిష్వజ్య తస్యోరసి మహోరసః 33-33

అచిరా న్మోక్ష్యతే సీతే దేవి తే జఘనం గతామ్
ధృతామేతాం బహూన్ మాసాన్ వేణీం రామో మహాబలః 33-34

తస్య దృష్ట్వా ముఖం దేవి పూర్ణచంద్రమివోదితమ్
మోక్ష్యసే శోకజం వారి నిర్మోకమివ పన్నగీ 33-35

రావణం సమరే హత్వా నచిరాదేవ మైథిలీ
త్వయా సమగ్రః ప్రియయా సుఖార్హో లప్స్యతే సుఖమ్. 33-36

సీతా! నీవు సూర్యదేవుని ఉపాసింపుము. ప్రజలకు కారకుడైన సూర్యదేవుడు నీకు మేలు చేయగలడు.

సఖి! నే నిప్పుడే పోయి, శ్రీరామునికి నీ క్షేమ సమాచారమును చెప్పవలెనని కుతూహలపడుచున్నాను. పోయిరానా? ఆకాశమార్గమున వెళ్లి ఒక్క క్షణములో రాగలను.

సీత : సరమా! నీ శక్తి నాకు తెలియనిదికాదు. నీవు నాకొరకు ఎట్టి కార్యమునైనను చేయుదువనికూడ నే నెరిగియున్నాను. అయినను నీ విప్పుడు శ్రీరాముని యొద్దకు పోవలదు. రావణుడు నాకు మాటిమాటికి ఏదో దుఃఖమును కలిగించుచునే యుండును. ఇప్పుడు రావణుడేమి చేయుచున్నాడో కనుగొని రమ్ము.

[సీతాదేవి ముందుచూపు ప్రశంసనీయము. సరమను రాముని యొద్దకు పోవలదని ఏల చెప్పినది? సీతాదేవి క్షేమముగా నున్నదని సరమ చెప్పినచో శ్రీరాముని యుద్ధప్రయత్నము సడలునేమో! రాక్షసస్త్రీనోట సీతాదేవి క్షేమసమాచారమును విని రాము డెట్టి ఊహల పాలగునో! కావున సరమ శ్రీరామునియొద్దకు పోవుట సరికాదు.]

సరమ వెంటనే వెళ్ళి రావణుని వృత్తాంతము తెలిసికొని వచ్చినది.

సీతాదేవి సరమను కవుగిలించుకొని, కూర్చుండుటకు ఆసన మిచ్చి

సీత : సరమా! ఇచ్చట కూర్చుండి, సంగతిని వివరించి చెప్పుము.

సరమ : దేవీ! నిన్ను శ్రీరామునికి సమర్పింపు మని రావణుని తల్లి ఎంతదూరమో బోధించినది. అవిద్ధు డను వృద్ధమంత్రియైతము చెప్పిచెప్పి చూచినాడు. అవిద్ధుడు "రాముడు సామాన్యుడుకాడు. జనస్థానములో జరిగిన రాక్షస సంహారము మనస్సుకు తెచ్చికొనుము. హనుమంతుడు సముద్రమును లంఘించి లంకకు వచ్చి సీతను సందర్శించి రాక్షసవీరులను వధించివెళ్ళిన విషయమును మరవవలదు. సీతాదేవిని గొప్పగా సత్కరించి శ్రీరామునికి సమర్పింపుము" అని యెంత చెప్పినను రావణుడు చెవినిబెట్టలేదు.

జనన్యా రాక్షసేంద్రో వై త్వన్మోక్షార్థం బృహద్వచః
అవిద్ధేన చ వైదేహి మంత్రివృద్ధేన బోధితః. 34-20

దీయతా మభిసత్కృత్య మనుజేంద్రాయ మైథిలీ 34-21

అర్థపరుడు అర్థమును వదలుకొనుటకు ఇష్టపడనియట్లు రావణుడు నిన్ను వదలుకొనుటకు ఇష్టపడలేదు.

న త్వా ముత్సహతే మోక్తు మర్థ మర్థపరో యథా. 34-23

యుద్ధమున రాక్షసులు, తాను, అందరును చనిపోయినగాని రావణుడు నిన్ను వీడడు.

[సీతాదేవి కోరికయు అదే. శ్రీరాముడు రావణుని వధించినగాని ఆమెకు తృప్తి కలుగదు.]

సీతా! శ్రీరాముడు రావణుని వధించి నిన్ను అయోధ్యకు కొనిపోగలడు.

ఈ మాటలలోనే వానరసైన్యములోనుండి సింహనాదములు వినబడినవి. రాక్షసుల గుండెలు దడదడలాడినవి. శంఖభేరీనినాదములతో శ్రీరాముడు వానర సేనలను కదలించినాడు.

## రావణుడు మంత్రులతో ఆలోచించుట

రావణుడు : (నిష్ఠురముగా) మంత్రులారా! రాముడు సముద్రమును దాటివచ్చుట, రాముని అపారపరాక్రమము, వానర సేనల పరిమాణము, వీని నన్నింటిని ప్రశంసించి మీరు చెప్పిన మాటలను చెవులార విన్నాను. మీరు దిగులుపడి, ఒకరి ముఖము ఒకరు చూచుకొనుచు దీనులై యుండుటకూడ కన్నులార చూచి గ్రహించినాను.

తరణం సాగరస్యాపి విక్రమం బలసంచయమ్
య దుక్తవంతో రామస్య భవంత స్తన్మయా శ్రుతమ్. 35-4

భవత శ్చాప్యహం వేద్మి యుద్ధే సత్యపరాక్రమాన్
తూష్ణీకా నీక్షతోఽన్యోన్యం విదిత్వా రామవిక్రమమ్. 35-5

మాల్యవంతుడు : (రావణుని తల్లికి పినతండ్రికుమారుడు) రావణా! యుద్ధనీతియందు ఒక సూత్రమున్నది. మన బలము హీనమైయున్నచో శత్రువుతో సంధిచేసికొనవలయును. శత్రుబలముకన్న మనబలము అధికముగా నున్నప్పుడు యుద్ధము చేయవలయును. ఇప్పుడు రామునితో సంధిచేసికొనుటయే మేలు. యుద్ధమునకు కారణభూతురాలైన సీతను రామునికి సమర్పింతుమేని సంధి కుదురగలదు. రావణా! దేవతలు, ఋషులు రాముని విజయము కోరుచున్నారు. నిన్ను ఆశ్రయించియున్న అధర్మము వృద్ధిపొందుచున్నది. కావున మనము క్షీణించి

పోవుచున్నాము. నీవు ఋషులకు అపకార మొనర్చితివి. ఋషులు వేదాధ్యయనము చేసి రాక్షసులను పారదోలుచున్నారు. వారి అగ్నిహోత్రములనుండి వెల్వడు ధూమము దశదిశలు వ్యాపించి రాక్షసుల తేజస్సును అపహరించుచున్నది.

ఋషీణా మగ్నికల్పానా మగ్నిహోత్ర సముత్థితః
ఆదత్తే రక్షసాం తేజో ధూమో వ్యాప్య దిశోదశ. 35-21

ఋషుల తపస్సు రాక్షసులను తపింపజేయుచున్నది. నీవు బ్రహ్మవలన పొందిన వరము మనుష్యులందును వానరులందును వర్తింపదు. దుశ్శకునము లెదురై రాక్షస వినాశమును సూచించుచున్నవి. నా మాట వినుము. మేలును కీడును గమనించి పనులు జరిపింపుము.

*రావణుడు :* (క్రోధవశుడై బొమముడి వేసి) నీవు శత్రుపక్షములో చేరి హితమును బోధించు నెపముతో అహితమునే పలుకుచున్నావు. కోతిమూకల నాశ్రయించి వచ్చిన మనుష్యమాత్రుడైన ఒక కృపణుని గొప్పగా కీర్తించుచుంటివి. రాక్షసేశ్వరుడనైన నన్ను అవమానించి మాటాడుచున్నావు. అసూయాహేతువుననో, పక్షపాతముననో, లేక శత్రువు చేసిన ప్రోత్సాహముననో ఇట్లు పరుష వాక్కులు పలుకుచున్నావు.

వీరద్వేషేణ వా శంకే పక్షపాతేన వా రిపోః
త్వయాహం పరుషాణ్యుక్తః పరప్రోత్సాహనేన వా. 36-6

రాముడు నన్ను జయింపలేడు. రాముడు సముద్రమునకు సేతువు నిర్మించినందున నీకు భయము కలిగినది కాబోలు. అది యొక పెద్దపని కాదు. దానిలో మనము భయపడవలసిన దేమియు లేదు. సముద్రమును దాటివచ్చినాడు కాని ప్రాణముతో మరలి పోజాలడు. రాము డన్న నాకు భయములేదు. నేను జనస్థానమునుండి తెచ్చుకొన్న సీతను విడువను. నేను రెండు ముక్కలుగానైన విరిగిపోవుదునుగాని ఎవ్వరికిని వంగువాడను కాను. ఇది నా స్వభావమునం దున్న దోషము. స్వభావము నతిక్రమించుటకు ఎవ్వనికిని సాధ్యము కాదు.

ద్విధా భజ్యేయ మప్యేవం న నమేయం తు కస్యచిత్
ఏష మే సహజో దోష స్స్వభావో దురతిక్రమః. 36-11

ఈ మాటలు విని మాల్యవంతుడు సిగ్గుపడి రావణునియొద్ద సెలవు గైకొని వెళ్ళిపోయినాడు.

రావణుడు మంత్రులతో ఆలోచించి లంకాపురి రక్షణకు కావలసిన ఏర్పాటులను చేసినాడు. తూర్పు ద్వారమున ప్రహస్తుని, దక్షిణ ద్వారమున మహోదర మహా పార్శ్వులను, పశ్చిమ ద్వారమున ఇంద్రజిత్తును, ఉత్తర ద్వారమున శుక సారణులను, నియమించి తాను సైతము ఉత్తర ద్వారమున నుండుటకే నిశ్చయించుకొని మంత్రులకు తెలిపినాడు. మధ్యగుల్మమున విరూపాక్షుని నియమించినాడు. ఈ యేర్పాటులను కావించి రావణుడు కృతకృత్యుడైనట్టు భావించి కొలువు చాలించి అంతఃపురమునకు చేరినాడు.

## శ్రీరాముడు యుద్ధవిధానమును నిర్ణయించుట

యుద్ధ విధానమును నిర్ణయించుకొనుటకు రామలక్ష్మణులు, సుగ్రీవుడు, విభీషణుడు, హనుమంతుడు మున్నగు వానర ప్రముఖులు సమావేశ మైనారు.

**విభీషణుడు :** రామప్రభూ ! నా నలుగురు మంత్రులు పక్షిరూపములతో లంకకు వెళ్ళి అచ్చట రావణుడు కావించిన యేర్పాటులను చూచి వచ్చినారు. తూర్పు ద్వారమున ప్రహస్తుడు, దక్షిణ ద్వారమున మహోదర మహాపార్శ్వులు, పశ్చిమ ద్వారమున ఇంద్రజిత్తు, ఉత్తర ద్వారమున రావణుడు స్వయముగాను, నెలకొనియున్నారు. మధ్యగుల్మమున విరూపాక్షుడు నియమింపబడినాడు. రామప్రభూ ! రావణుడు అసాధ్యుడు. కుబేరుని జయించిన వీరుడు. ఈ మాట చెప్పినందులకు నన్ను క్షమింపుము. నీకు రోషము కలిగించుటకు చెప్పిన మాటయే గాని నిన్ను భయపెట్టుటకు కాదు. దేవతలనుకూడ నీవు నీ పరాక్రమముచే జయింపగలవు.

అత్ర మన్యు ర్నకర్తవ్యో రోషయే త్వాం న భీషయే
సమర్థోహ్యసి వీర్యేణ సురాణామపి నిగ్రహే 37-23

మన సైన్యమును చక్కగా విభజించి రావణ సంహారమును గావింపుము.

**రాముడు :** మంచిది ! మనము ప్రతిబలమును ఏర్పాటు చేయుదము. లంకాపురి తూర్పు ద్వారమున నీలుడు, దక్షిణ ద్వారమున అంగదుడు, పశ్చిమ ద్వారమున హనుమంతుడు నెలకొని యుందురు. రావణుని నేనే స్వయముగా వధింతును. నేను లక్ష్మణసహితుడనై ఉత్తరద్వారమున ఉందును. సుగ్రీవుడు, జాంబవంతుడు, విభీషణుడు, ఈ ముగ్గురును మధ్య గుల్మమునం దుండగలరు. ఒక్క విషయమును మాత్రము జ్ఞప్తియం దుంచుకొనవలయును. వానరు లెల్లరు వారి సహజరూపములతోనే వానరులుగానే ఉండవలయును. మనుష్యరూపమును ధరింపకూడదు.

ఎల్లప్పుడును మనవారిని మనము గుర్తించుటకు వీలు కలిగియుండవలయును. నేను, లక్ష్మణుడు, విభీషణుడు, అతని మంత్రులు, మేము ఏడుగురము మాత్రమే మనుష్యరూపముతో ఉండగలము.

## శ్రీరాముడు, సుగ్రీవాదులు సువేలపర్వతము నెక్కుట

ఇట్లు ఏర్పాటులు కావించిన పిదప రాముడు సుగ్రీవునితో,

రాముడు : సుగ్రీవా ! మనము సువేలపర్వతము నధిరోహించి ఈ రాత్రి అచ్చట గడపుదము. దురాత్ముడైన రావణుని లంకాపురమును పర్వతముపైనుండి చూతము. రావణుని పేరు తలపునకు వచ్చుటతోడనే రోషము కలుగుచున్నది. ఒక్క నీచుడు చేసిన పాపకార్యఫలముగా కుల మంతయు వినాశము కాగలదు.

ఏకో హి కురుతే పాపం కాలపాశ వశం గతః
నీచే నాత్మాపచారేణ కులం తేన వినశ్యతి. 38-7

రామలక్ష్మణులు, సుగ్రీవుడు, విభీషణుడు, అతని మంత్రులు, హనుమంతుడు మున్నగు వానరప్రముఖులు సువేలపర్వతమును అధిరోహించినారు. లంకను లంక వైభవమును చూచి రాముడుసైతము ఆశ్చర్యపడినాడు. లంకాప్రాకారములు అద్భుతముగా నున్నవి. ప్రాకారచయములలో పంక్తులు తీరియుండిన నల్లని రాక్షసులు లంకకు రెండవ ప్రాకారమువలె కనిపించినారు.

ప్రాకారచయ సంస్థైశ్చ తదా నీలై ర్నిశాచరైః
దదృశుస్తే హరిశ్రేష్ఠాః ప్రాకార మపరం కృతం. 38-16

లంకాపట్టణమును చూచుచుండుటలోనే సూర్యాస్తమయ మైనది. ఆరాత్రి, అందరు పర్వతముమీద విశ్రమించినారు.

మరునా డుదయమున అందరు లంకాపురిని, అందలి రమణీయములైన వనములను ఉపవనములను తిలకించినారు. అవి కుబేరుని చైత్రరథమునకును, ఇంద్రుని నందనవనమునకును సాటివచ్చుచున్నవి. వృక్షము లన్నియు సువాసనల పుష్పములతోను, మధురఫలములతోను నిండియున్నవి. వానిని చూచి వానరులు ఆనందపరవశులై వనములలో ప్రవేశించినారు.

[ఫలవృక్షములను చూచిన వానరులు ఊరకుందురా !]

వివిశుస్తే తత స్తాని వనాన్యుపవనాని చ
హృష్టాః ప్రముదితా వీరా హరయః కామరూపిణః. 39-12

మరికొందరు వానరవీరులు సుగ్రీవుని అనుమతితో పతాకాలంకృతమైన లంక లోనికి సింహనాదములుచేయుచు ప్రవేశించినారు. లంకాపట్టణము త్రికూట పర్వత శిఖరముపై నున్నది. దాని నిడివి నూరుయోజనములు, వెడల్పు ముప్పది యోజనములు. బంగారు ప్రాకారములతోను హర్మ్యప్రాసాదములతోను, విమానములతోను శోభిల్లు చున్నది. వేయి స్తంభముల చైత్యప్రాసాదము ఆకాశమును స్పృశించుచున్నట్టు కన బడుచున్నది. సమస్తసంపదలతో నిండియుండిన లంకాపురిని చూచి శ్రీరాముడు అచ్చెరు వొందినాడు.

ఆ సమయముననే రావణుడు గోపురశిఖరముమీద ఉన్నాడు. ఆభరణశోభితుడై కిరీటఛత్రచామరములతో విరాజిల్లుచున్నాడు. శ్రీరాముడు, సుగ్రీవాది వానరులును రావణుని చూచినారు. పొంగివచ్చుచున్న కోపమును పట్టజాలక సుగ్రీవుడు రావణునితో,

*సుగ్రీవుడు :* రాక్షసాధముడా ! నేను లోకనాథుడైన శ్రీరాముని మిత్రుడను-రామ దాసుడను. నిన్నిప్పుడు విడువను.

## రావణ సుగ్రీవుల మల్లయుద్ధము

ఈ మాట లనుచు, సుగ్రీవుడు తటాలున ఎగిరి రావణునిపైకి ఉరికి కిరీటమును లాగి క్రింద పడవైచినాడు.

[రావణునికి తల కొట్టివేసినంతటి పని. ఒక విధమున దానికి మించినపని జరిగినది. ఇట్టి అవమానమును రావణుడు భరింపగలడా ! యుద్ధప్రారంభమునకు ముందే జరిగిన ఈ యవ మానము, రావణుని క్రుంగదీసి యుండును. కిరీటము పోవుటవలన యుద్ధము సగము అయి పోయినట్లే తోచియుండును]

ఇత్యుక్త్వా సహసోత్పత్య పుప్లువే తస్య చోపరి
ఆకృష్య మకుటం చిత్రం పాతయిత్వాపతద్భువి. 40-11

*రావణుడు :* (కోపముతోను, లజ్జతోను) సుగ్రీవా ! నా కంటపడితివి. నిన్నిప్పుడే హీన గ్రీవుని చేయగలను.

సుగ్రీవుని రావణుడు క్రిందికి త్రోసినాడు. సుగ్రీవుడు కందుకమువలె పైకెగిరి రావణుని పట్టుకొని క్రిందికి నెట్టినాడు. ఆ గోపురశిఖరముమీద రావణ సుగ్రీవులకు ఒక గొప్పయుద్ధము జరిగినది. ఒకరినొకరు చేతులతోను కాళ్లతోను కొట్టుకొన్నారు. ఒకరి నొకరు విసరి, క్రిందపడవేయుచున్నారు. ఇద్దరు అలసిపోవుచున్నారు. కొంత అలుపు తీర్చుకొని మరల మరల కొట్టుకొనుచున్నారు. కొంతసేపు మల్లయుద్ధము చేసినారు. ఆహారమునకు పొంచి కూర్చుండియున్న మార్జాలముల భంగి పొంచియుండి ఒకరి ఛిద్రములను ఒకరు వెదకుచున్నారు.

రావణుని బలము క్షీణింపసాగినది. అంతట, తన మాయా బలమును ప్రదర్శింప సమకట్టినాడు. ఈ విషయమును సుగ్రీవుడు గుర్తించి ఆకాశమున కెగిరి శ్రీరాముని సన్నిధికి వచ్చి చేరినాడు.

**రాముడు :** (సుగ్రీవుని కవుగిలించుకొని) సుగ్రీవా! నీవు నాతో ఒకమాట మాత్రము అనకయే ఎట్టి సాహసమునకు పూనుకొంటివి! రాజైనవాడు ఇట్టి సాహస కార్యములను చేయదగునా! నీ కేదైన ఆపద వాటిల్లినచో సీతతోగాని, నా తమ్ములతోగాని, తుదకు నా శరీరముతోగాని, నా కేమి పనియున్నది! నీ పరాక్రమము నాకు తెలియక యున్నదా? నేను రావణుని వధించి విభీషణు లంకేశ్వరునిగా చేయుదును. నీ వెన్నడును ఇట్టి సాహసములు మాత్రము చేయకుము.

**సుగ్రీవుడు :** రామప్రభూ! నీ భార్య నపహరించిన నీచుని చూచి కోపము పట్టలేక పోయితిని. పౌరుషముగలవాడు ఓర్చుకొనియుండగలడా!

**రాముడు :** లక్ష్మణా! శకునములు లోకక్షయకర మగు ఘోరయుద్ధమును సూచించు చున్నవి. వానర సేనలను లంకాపురిపైకి పంపుదము.

అందఱు పర్వతముపైనుండి క్రిందికి దిగినారు. శ్రీరాముడు లంకాపురికి అభి ముఖముగా నడచుచున్నాడు. సైన్యము శ్రీరాముని వెంట నడచినది. ఇట్లు ప్రయా ణము చేసి పట్టణముచెంత చేరి ఎవరికి నిర్ణయమైన స్థానములను వారు ఆక్రమించు కొన్నారు. రామలక్ష్మణులు ఉత్తరద్వారమును అడ్డగించినారు. అదియే రావణు డుండు ద్వారము. కావున శ్రీరాముడు తప్ప మరెవ్వరును దానిని రక్షింపజాలరు. తూర్పు ద్వారమును నీలుడు, దక్షిణద్వారమును అంగదుడు, పశ్చిమద్వారమును హనుమంతుడు వారివారి సైన్యముల గూడి రక్షించుచున్నారు. మధ్యగుల్మమును సుగ్రీవుడు కాపాడుచున్నాడు. ఒక్కొక్క ద్వారముయొద్దను, వానర సేనలు కోట్లలెక్కన ఉన్నారు. వానర సైన్యములు నడచుచుండినప్పుడు కలిగిన ధ్వనికి లంకాపురి వణకి పోయినది. వానరులు లంకాపురిని ముట్టడించినారు.

## అంగదుని రాయబారము

రాజనీతిని అనుసరించి, శ్రీరాముడు తన మిత్రులతో ఆలోచించి విభీషణుని అనుమతి పొంది, రావణునికి రాయబారము పంపుటకు నిశ్చయించి అంగదునితో అను చున్నాడు.

**రాముడు :** అంగదా! నీవు లంకకు ఎగిరిపోయి, రావణునితో నా మాటగా నిర్భయముగా ఇట్లు చెప్పుము "రాక్షసాధమా! నేను నీ పాలిటి యముడనై వచ్చి లంకాద్వారమునందున్నాను. నేను లేని సమయము చూచి, నీవు సీతను అపహరించితివి. సీతను నాకు సమర్పించి నన్ను శరణు వేడుకొనుము. లేనిచో నేను నా బాణములను ప్రయోగించి లోకమును అరాక్షసము గావింతును. ధర్మాత్ముడైన విభీషణుడు లంకేశ్వరుడు కాగలడు. నీవు పరమ పాపివి. అధర్మము నాశ్రయించితివి. నీవు ఒక్క క్షణమైనను రాజుగా నుండదగవు. నీవు నా బాణహతుడవై పునీతుడవు కాగలవు. నేను నీ కొక హితమును చెప్పుచున్నాను వినుము. నీ అపరక్రియలు నీవే చేసికొనుము. లంకను ఇక చూడలేవు కాబట్టి ఇప్పుడే చక్కగా చూచుకొనుము. నీ ప్రాణము నా చేతిలో నున్నది."

అరాక్షస మిమం లోకం కర్తాస్మి నిశితై శ్శరైః
న చే చ్ఛరణ మభ్యేషి మాముపాదాయ మైథిలీమ్. 41-66

ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠ స్సంప్రాప్తోఽయం విభీషణః
లంకైశ్వర్యం ధ్రువం శ్రీమా నయం ప్రాప్నో త్యకంటకమ్ 41-67

న హి రాజ్య మధర్మేణ భోక్తుం క్షణమపి త్వయా 41-68

మచ్ఛరై స్త్వం రణే శాంత స్తతః పూతో భవిష్యసి 41-69

బ్రవీమి త్వాం హితం వాక్యం క్రియతా మౌర్ధ్వదైహికమ్
సుదృష్టా క్రియతాం లంకా జీవితం తే మయి స్థితమ్ 41-71

అంగదుడీ సందేశమును కొనిపోయి, మంత్రుల నడుమ నున్న రావణునికి చెప్పుచున్నాడు.

**అంగదుడు :** నేను కోసలేంద్రుడైన శ్రీరాముని దూతను. వాలి కుమారుడను. నా పేరు అంగదుడు. నీవును వినియే యుందువు. శ్రీరాముడు నీ కొక సందేశమును పంపినాడు వినుము.

అంగదుడిట్లు చెప్పి, రామ సందేశమును రావణునికి వినిపించినాడు. రావణుడు కోపించి "వీనిని పట్టి బంధించి వధింపుడు" అని తన రాక్షసుల కాజ్ఞాపించినాడు. అంగదునిపైకి నలుగురు రాక్షసులు వచ్చి వానిని పట్టుకొన్నారు. అంగదుడు వారికి బుద్ధిపూర్వకముగా పట్టుబడి వారిని తన బాహుమూలములలో ఇరికించుకొని మహావేగముతో ప్రాసాదముపై కెగిరినాడు. ఆ వేగమునకు రాక్షసులు క్రిందపడి పోయినారు.

అంగదుడు ప్రాసాద శిఖరమును పగులగొట్టి సింహనాదముచేసి ఆకసమున కెగిరి శ్రీరాముని సన్నిధానము చేరినాడు.

రావణుని కన్నులయెదుటనే ఇంతపని జరిగినది. రావణుడు కోపోద్రిక్తుడైనాడు. తనకు వినాశకాలము సమీపించిన దని భయపడి నిట్టూర్పులుపుచ్చినాడు.

[సుగ్రీవుడు కిరీటమును ఎగురగొట్టినాడు. అంగదుడు ప్రాసాదమును పగులగొట్టినాడు. ఇం కేమున్నది!]

రావణస్తు పరం చక్రే క్రోధం ప్రాసాద ధర్షణాత్
వినాశం చాత్మనః పశ్య న్నిశ్వాస పరమోఽభవత్ 41-91

## లంకాపురి ముట్టడి

అపారమైన వానరసేన లంకాపురమును చుట్టుముట్టినది. లంకకు వానరమయమైన క్రొత్తప్రాకార మొకటి ఏర్పడినదా యన్నట్లు కనిపించినది. వానరులు ప్రాకారము చుట్టును ఉన్నారు.

రాక్షసులు భయకంపితులై దీనులై హాహాకారములు చేయుచున్నారు. కొందరు రాక్షసులు రావణునియొద్దకు పోయి వానరులు పట్టణమును ముట్టడించిన సమాచారము తెలియజేసినారు. రావణుడు నగరరక్షణకు వలసిన ప్రత్యేకవిధానములు సిద్ధము చేసి ప్రాసాదము పైకెక్కి చూచినాడు. ఎక్కడ చూచినను వానర పరంపరలే. రాముని వానరసేనలను చూచి రావణుడు దిగులొందినాడు.

## శ్రీరాముడు వానరులకు ఉత్తరు విచ్చుట

శ్రీరాముడు లంకాపురమువంక చూచినాడు. సీతాదేవి జ్ఞప్తికి వచ్చినది. సీతాదేవి దీనావస్థను తలచుకొని, రాక్షసులను వధింప నిశ్చయించుకొని శ్రీరాముడు శత్రుసంహారము చేయు డని వానరసైన్యము కాజ్ఞాపించినాడు.

పీడ్యమానాం స ధర్మాత్మా వైదేహీ మనుచింతయన్
క్షిప్ర మాజ్ఞాపయామాస వానరాన్ ద్విషతాం వధే. 42-9

వానరులు వృక్షములను పర్వతశిఖరములను గైకొని యుద్ధసన్నద్ధులై సింహనాదములు చేసినారు. లంకా ప్రాకారముల నెక్కి పురములో ప్రవేశించి, అగడ్తలను పూడ్చి, గృహములను గోపురములను ధ్వంసము చేసినారు. వానర సేనానాయకులు వారివారికి నియమింపబడిన స్థానములను ఆక్రమించుకొన్నారు. రామలక్ష్మణులు ఉత్తర

ద్వారమును చేరియుండిరి. విభీషణుడు కవచము తొడిగి, గదను గైకొని, రాముని వెంట చరించుచు, ఆయన ఆజ్ఞను నిరీక్షించుచుండినాడు.

రావణుడు తన సేనలను కదలించినాడు. భేరీనినాదములు మిన్నుముట్టినవి. వానరుల సింహనాదములు చెలరేగినవి.

## యుద్ధ ప్రారంభము

యుద్ధము ప్రారంభమైనది. దేవాసురుల యుద్ధమువలె సాగినది.

ఏతస్మిన్నంతరే ఘోర స్సంగ్రామ స్సమవర్తత
రక్షసాం వానరాణాం చ యథా దేవాసురే పురా. 42-41

వానరులు "రాజా జయతి సుగ్రీవః" అని కిలారించుచు పోరాడినారు. దొమ్మి యుద్ధములు, ద్వంద్వయుద్ధములు అనేకములు జరిగినవి.

అంగదునికి ఇంద్రజిత్తునకు, సంపాతికి (విభీషణుని మంత్రి) ప్రజంఘునికి, హనుమంతునికి జంబుమాలికి, విభీషణునికి మిత్రఘ్ననికి, నీలునికి కుంభునికి, సుగ్రీవునకు ప్రఘసునకు, లక్ష్మణునికి విరూపాక్షునికి ద్వంద్వయుద్ధములు జరిగినవి. అగ్నికేతుడు, రశ్మికేతుడు, సుప్తఘ్నుడు, యజ్ఞకోపుడు అను నలుగురు రాక్షసులు ఏకమై శ్రీరామునితో యుద్ధము చేసినారు. శ్రీరాముడు ఆ నలువురను వధించినాడు.

అంగదుడు ఇంద్రజిత్తుని రథమును నుగ్గుచేసి సారథిని వధించినాడు. వానరుల చేతులలోపడి రాక్షసులు తండోపతండములుగా హతులైనారు. ఎందరో రాక్షసులకు తీవ్ర గాయములైనవి. రాక్షసులు "సూర్యుడు ఎప్పుడు అస్తమించునా" అని వేచియుండిరి.

[సూర్యుడు క్రుంకినచో రాక్షసులకు బల మభివృద్ధి యగును]

విదార్యమాణా హరిపుంగవై స్తదా
నిశాచరా శ్శోణిత దిగ్ధ గాత్రాః
పున స్సుయుద్ధం తరసా సమాస్థితా
దివాకరస్యాస్తమయాభికాంక్షిణః 43-47

సూర్యుడు అస్తమించినాడు. కాని యుద్ధముమాత్రము ఆగలేదు.

## రాత్రి యుద్ధము

రాత్రియందుకూడ యుద్ధము జరుగుచునే యుండినది.

అన్యోన్యం బద్ధవైరాణాం ఘోరాణాం జయ మిచ్ఛతామ్
సంప్రవృత్తం నిశాయుద్ధం తదా వానర రక్షసామ్. 44-2

చీకటిలో వానరుడు రాక్షసుడు అను గుర్తు తెలియక తమ పక్షమువారిని తామే చంపుకొనుచున్నారు. అంధకారమున రాక్షసులు వానరులను భక్షింప సాగినారు. రామలక్ష్మణులు బాణములు ప్రయోగించి కన్నులకు కనిపించినవారిని, కనిపించని వారిని, అనేక రాక్షసవీరులను వధించినారు.

లక్ష్మణశ్చాపి రామశ్చ శరై రాశీవిషోపమైః
దృశ్యాదృశ్యాని రక్షాంసి ప్రవరాణి నిజఘ్నతుః 44-9

గాఢాంధకారమునకుతోడు, యుద్ధభూమిలోరేగినదుమ్ము యోధుల కంటిచూపు నడ్డగించినది. రక్తములు వెల్లువలై ప్రవహించినవి. వానరులు రాక్షసులు చచ్చిపడిపోవు చుండిరి. ఆ రాత్రి కాళరాత్రి యైనది. ఎప్పటికైనను తెల్లవారునా అని అనిపించినది.

సా బభూవ నిశా ఘోరా హరిరాక్షస హారిణీ
కాళరాత్రీవ భూతానాం సర్వేషాం దురతిక్రమా. 44-16

రాక్షసులు శ్రీరామునిమీద బాణవర్షములు కురిపించినారు. శ్రీరాముని పైకి వచ్చిన యమశత్రుడు, మహాపార్శ్వుడు, మహోదరుడు, వజ్రదంష్ట్రుడు, శుక, సారణులు రాముని బాణపాతమును సహింపలేక యుద్ధభూమినుండి పారిపోయి ప్రాణములు దక్కించుకొన్నారు. శ్రీరాముని ఎదుట నిలబడిన రాక్షసు లందరు హతులైనారు. మహాకాయులైన గోలాంగూల వీరులు రాక్షసులను భక్షింపసాగినారు.

అంగదుడు ఇంద్రజిత్తుని రథాశ్వములను, సారథిని వధించి ఇంద్రజిత్తును వధించుటకు ప్రయత్నము చేయగా ఇంద్రజిత్తు రథమును విడిచిపెట్టి అంతర్ధాన మైనాడు. యుద్ధమునందు ఇంద్రజిత్తు ప్రభావము నెరింగిన దేవతలు ఋషులు అంగదుడు కావించిన అద్భుతకార్యమును ప్రశంసించినారు. రామలక్ష్మణులును, సుగ్రీవుడును, అంగదుని అభినందించినారు.

**రాముడు :** వానరులారా! జాగరూకులై యుండుడు. మీ రాజును రక్షించుకొనుడు. బ్రహ్మదత్తమైన వరము నాశ్రయించుకొని ముల్లోకములను బాధించుచున్న ఇంద్రజిత్తుకు చావు మూడినది. కొంచెముసేపు ఓపికపట్టుడు. వీనిని నా బాణమునకు ఆహుతి గావింతును. భయపడకుడు.

అద్యైవ క్షమితవ్యం మే భవంతో విగతజ్వరాః 44-37

## నాగపాశము

ఇంద్రజిత్తు తనకు గల శక్తిని వినియోగించి అదృశ్యుడై బాణములు కుప్పించుచున్నాడు. రామలక్ష్మణుల శరీరములనిండ నాగమయశరములు ప్రయోగించి ఇద్దఱిని నాగపాశములతో బంధించినాడు.

మాయయా సంవృత స్తత్ర మోహయన్ రాఘవౌ యుధి
అదృశ్య స్సర్వభూతానాం కూటయోధీ నిశాచరః 44-39

బబంధ శరబంధేన భ్రాతరౌ రామలక్ష్మణౌ 44-40

ఇంద్రజిత్తు ఎందున్నాడో తెలియుట లేదు. అంగదుడు, నీలుడు, మున్నగు పదిమంది వానర వీరులను పిలిచి, శ్రీరాముడు ఇంద్రజి త్తున్న స్థానమును కనిపెట్టుడని ఆజ్ఞాపించినాడు. వారలు ఆకాశమున కెగిరి దశదిశలు వెదకిరి కాని లాభము లేక పోయినది. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రము ప్రయోగించి వానరులను వారించి రామలక్ష్మణుల మీద బాణవర్షము కురిపించుచున్నాడు. రామలక్ష్మణుల శరీరములలో కొంచెమైనను సందులేకుండునట్లు సర్పబాణములు నిండిపోయినవి.

నిరంతర శరీరౌ తౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ
క్రుద్ధేనేంద్రజితా వీరౌ పన్నగై శ్శరతాం గతైః. 45-8

ఇద్దరి శరీరములనుండియు రక్తము ప్రవహించుట కారంభమైనది.

**ఇంద్రజిత్తు :** (అంతర్ధానగతుడై) నేను అంతర్ధానము నొంది యుద్ధము చేయుచుండగా నన్ను చూచుటకుగాని, నా చెంతకు వచ్చుటకుగాని దేవేంద్రునికికూడ సాధ్యము కాదు - మీకు సాధ్య మగునా! నేను మిమ్ముల నిద్దరిని బాణములతో కప్పి వేసితిని. ఇప్పుడే మిమ్ము యమపురికి పంపగలను.

ఈ మాటలు చెప్పి ఇంద్రజిత్తు సింహనాదము చేయుచు మరికొన్ని బాణములు వేయగా రామలక్ష్మణులకు కనుచూపు సైతము మందగించినది.

బద్ధౌ తు శరబంధేన తావుభౌ రణమూర్ధని
నిమేషాంతరమాత్రేణ న శేకతు రుదీక్షితుమ్. 45-16

రామలక్ష్మణులు బాణక్షతగాత్రులై రజ్జుముక్తములైన ఇంద్రధ్వజములవలె నేలపై పడిపోయినారు. భూనాథులైన ఇద్దరును భూమిపై పడిపోయినారు. ముందు శ్రీరాముడును, పిమ్మట లక్ష్మణుడును పడినారు.

నిపేతతు ర్మహేష్వాసౌ జగత్యాం జగతీపతీ. 45-18
పపాత ప్రథమం రామో విద్ధో మర్మసు మార్గణైః. 45-22

అట్లు పడియున్న రామునిపై ఇంద్రజిత్తు బాణములు వేయుచునేయుండినాడు. లక్ష్మణుడు రాముని స్థితిని చూచి ప్రాణమునుగూర్చి నిరాశ నొందినాడు.

బాణపాతాంతరే రామం పతితం పురుషర్షభమ్
స తత్ర లక్ష్మణో దృష్ట్వా నిరాశో జీవితేఽభవత్. 45-25

లక్ష్మణుని దుఃఖము చూచి వానరు లందరును దుఃఖించినారు. రామలక్ష్మణు లిద్దరు నాగపాశ బద్ధులై నేలపై శయనించియుండగా హనుమంతుడు మున్నగు వానరులు వారి చుట్టును నిలబడి ఆకసమువైపు భూమివైపు చూచుచు దుఃఖపడుచున్నారు. సుగ్రీవుడును విభీషణుడును వచ్చి పరితపించుచు ఆకసమువైపు చూచిరిగాని ఇంద్రజిత్తు ఎందును కానరాలేదు. బాణములుమాత్రము వానరులపై పడుచుండినవి.

విభీషణుడు మాత్రము తన మాయచే ఇంద్రజిత్తును చూడగలిగినాడు.

తం తు మాయాప్రతిచ్ఛన్నం మాయయైవ విభీషణః
వీక్షమాణో దదర్శాథ భ్రాతుః పుత్ర మవస్థితమ్. 46-9

ఇంద్రజిత్తు: (రాక్షసులతో) నేను రామలక్ష్మణులను బాణపాశములతో బంధించితిని. దేవతలు ఋషులు అందరును ఏకమై వచ్చినను వీరిని ఈ బంధమునుండి విడిపింపలేరు.

నేమౌ మోక్షయితుం శక్యా వేతస్మా దిషుబంధనాత్
సర్వైరపి సమాగమ్య సర్షిసంఘై స్సురాసురైః. 46-13

ఎవ్వని గురించిన దిగులుచే మా తండ్రి శోకపీడితుడై, పానుపున మేను వాల్చక దీర్ఘరాత్రులను గడపుచున్నాడో, ఎవ్వడు మన లంకను కలచివుచ్చి కలగుండుపరచి మన కెల్లరకు మూలహరుడై అనర్థకరుడై యుండెనో ఆ రాముని నేను వధించివుచ్చితిని.

యత్కృతే చింతయానస్య శోకార్తస్య పితు ర్మమ
అస్పృష్ట్వా శయనం గాత్రై స్త్రియామా యాతి శర్వరీ. 46-14

కృత్స్నేయం యత్కృతే లంకా నదీ వర్షాస్వివాఽఽకులా
సోఽయం మూలహరోఽనర్థ స్సర్వేషాం నిహతో మయా. 46-15

[రామునివలని భయమున రావణుని హృదయమున దిగులు నెలకొనుటచే అతనికి రాత్రివేళల నిదురపట్టుటలేదు. లంకలోని రాక్షసు లందరు రామభయముతో వణకిపోవుచున్నారు. ఈ మాటలు ఇంద్రజిత్తు స్వయముగా చెప్పుచున్నాడు. రావణుడును, రాక్షసులును, ఎంత భయపడియున్నారో !]

రామలక్ష్మణులు చేష్టలు దక్కిపడియుండుట చూచి వారు చనిపోయినారని విశ్వసించి ఇంద్రజిత్తు పట్టణములోనికి మరలిపోయినాడు.

నిష్పందౌ తు తదా దృష్ట్వా తావుభౌ రామలక్ష్మణౌ
వసుధాయాం నిరుచ్ఛ్వాసౌ హతావిత్యన్వమన్యత. 46-27

వానరు లందరు దుఃఖములో నున్నారు. రామలక్ష్మణుల క్షేమమునుగూర్చి సుగ్రీవుడు భయపడి దుఃఖితుడై యుండుటచూచి విభీషణుడు సుగ్రీవునితో అనుచున్నాడు.

*విభీషణుడు :* మిత్రమా! దుఃఖింపకుము. యుద్ధములు ఇట్లే యుండును. ఎల్లప్పుడును జయమే కలుగదు. రామలక్ష్మణులు మూర్ఛలో నున్నారు. మన అదృష్టము చక్కగా నున్నచో వీరు తేరుకొనగలరు. నీవు ధైర్య మూని నాకు ధైర్యము చెప్పవలసినవాడవుకదా! దుఃఖింపకుము. సత్యమును, ధర్మమును అవలంబించి యున్న వీరికి మరణభయము లేదు.

ఏవం ప్రాయాణి యుద్ధాని విజయో నాస్తి నైష్ఠికః. 46-31

సశేషభాగ్యతాఽస్మాకం యది వీర భవిష్యతి
మోహమేతౌ ప్రహాస్యేతే మహాత్మానౌ మహాబలౌ. 46-32

సత్యధర్మాభియుక్తానాం నాస్తి మృత్యుకృతం భయమ్. 46-33

ఈ మాటలు చెప్పి విభీషణుడు జలము అభిమంత్రించి సుగ్రీవుని నేత్రములను ముఖమును తుడిచి,

*విభీషణుడు :* ఈ సమయములో మనమెంతమాత్రము అధైర్యపడరాదు. రామలక్ష్మణులు మూర్ఛనుండి తేరువరకు వారిని రక్షింపవలయును. వారికి ప్రాణభయము లేదు. మృత్యువు సన్నిహితముగా నుండువారి కిట్టి ముఖకాంతి ఎన్నటికిని ఉండదు. ఈ వానరు లందరు భయపడి గుసగుస లాడుకొనుచున్నారు. వారి భయమును పోగొట్టుము.

ఈ మాటలు చెప్పి విభీషణుడు సుగ్రీవుని ఊరడించినాడు.

## ఇంద్రజిత్తు నాగపాశమునుగూర్చి రావణునికి చెప్పుట

ఇంద్రజిత్తు తండ్రిసన్నిధి కరిగి నమస్కరించి "రామలక్ష్మణులు హతులైనారు." అని నివేదించినాడు. రావణుడు ఆసనమునుండి లేచి సంతోషపరవశుడై కొడుకును కవుగిలించుకొన్నాడు. రామలక్ష్మణులను నాగపాశముతో బంధించిన విషయమును, వారు కాంతితరిగి నిశ్చేష్టులై పడియున్న విషయమును, ఇంద్రజిత్తు సవిస్తరముగా తండ్రికి నివేదింపగా, రావణుడు రామభయమును వీడి కుమారుని ప్రశంసించినాడు.

సీతాదేవికి కావలి గాయుచుండిన త్రిజట మున్నగు రాక్షసస్త్రీలను పిలిపించి రావణుడు వారితో అనుచున్నాడు.

**రావణుడు :** ఇంద్రజిత్తు రామలక్ష్మణులను వధించినాడని సీతతో చెప్పి ఆమెను పుష్పక విమానముపై నెక్కించుకొని రామలక్ష్మణులు పడియున్నచోటికి తీసికొని పోయి చూపవలయును. ఎవ్వనిపై ఆధారపడి సీత ఇన్నినాళ్ళు నా వశము కాకుండినదో ఆ రాముడు మరణించినాడు కావున సీత దిక్కులేనిదై అన్ని ఆశలను వదలుకొని తానే స్వయముగా నా యధీనురాలు కాగలదు.

అద్య కాలవశం ప్రాప్తం రణే రామం సలక్ష్మణమ్
ఆవేక్ష్య వినివృత్తాశా నాన్యాం గతి మపశ్యతీ. 47-10

నిరపేక్షా విశాలాక్షీ మాముపస్థాస్యతే స్వయమ్. 47-11

రాక్షసస్త్రీలు సీతాదేవిని పుష్పక విమానములో నెక్కించుకొని రామలక్ష్మణు లుండిన చోటికి కొనిపోయినారు.

ఈ లోపలనే రావణుడు ధ్వజముల నెత్తించి పట్టణమును అలంకారము చేయించినాడు. ఇంద్రజిత్తు రామలక్ష్మణులను వధించినా డని ఊరిలో చాటింపు చేయించినాడు.

రావణోఽకారయల్లంకాం పతాకాధ్వజ మాలినీమ్. 47-15

ప్రాఘోషయత హృష్టశ్చ లంకాయాం రాక్షసేశ్వరః
రాఘవో లక్ష్మణశ్చైవ హతా వింద్రజితా రణే. 47-16

## సీతాదేవి రామలక్ష్మణులను చూచి దుఃఖించుట

సీతాదేవి పుష్పకవిమానమునుండి రామలక్ష్మణులను చూచినది. వానరు లందరు దుఃఖార్తులై రామలక్ష్మణులను పరివేష్టించియున్నారు. శరతల్పగతులైన రామలక్ష్మణు లను చూచి సీతాదేవి దుఃఖములో మునిగిపోయి విలపించుచున్నది.

**సీత :** సాముద్రిక లక్షణము తెలిసిన ప్రాజ్ఞులు నాకు సంతానము కలుగుననియు, సౌమంగల్యముగల భాగ్యవతి ననియు చెప్పిరిగదా! ఇట్టి దుర్గతి నా కెట్లు కలిగినది! వారి మాటలు అనృతములేనా! నా భర్త నన్నుగూడి సామ్రాజ్య పట్టాభిషిక్తు డగునని, నేను రాణి నగుదునని, మంగళకరినని, నా భర్త నన్ను గూడి అశ్వమేధయాగములను చేయునని, జ్ఞానులు చెప్పిన మాట లన్నియు కల్లలేనా! పట్టమహిషికి ఉండవలసిన లక్షణము లన్నియు నాకు కలవుగదా!

[ఈ ఘట్టమున సీతాదేవి తన అవయవములను వర్ణించి సాముద్రిక లక్షణములను స్మరించినది.]

అధిరాజ్యేభిషేకో మే బ్రాహ్మణైః పతినా సహ
కృతాంతకుశలైరుక్తం తత్సర్వం వితథీ కృతమ్. 48-14

ఆహా! ఎంతపని జరిగినది! రామలక్ష్మణులు నాకొరకు ఎందెందో వెదకి, నేనున్న ప్రదేశమును తెలిసికొని దుస్తరమైన సముద్రమును దాటివచ్చి, తుదకు గోష్పాదమంతటి ఇంద్రజిత్తు మాయలో నిహతులై పోయిరిగదా! రాముని అస్త్రము లన్నియు ఏమైనట్టు! ఇంద్రజిత్తు కపటయుద్ధముచేసి ఇంతపనిచేయగలిగినాడు. రామునికంటబడిన శత్రువు బ్రతికిపోగలడా! కాలునికి సాధ్యముకాని కార్యములేదు. దైవమునకు తిరుగులేదు.

న కాలస్యాతిభారోఽస్తి కృతాంతశ్చ సుదుర్జయః. 48-19

అయ్యో పాపము! కౌసల్య ఏమైపోవునోగదా! మేము ముగ్గురము వనవాస వ్రతమును పూర్తిచేసికొని యెప్పుడెప్పుడు వత్తుమా యని మా కోస మెదురు చూచుచు కాలము గడపుచున్నది!

## త్రిజట సీతాదేవిని ఊరడించుట

ఇట్లు విలపించుచున్న సీతాదేవిని త్రిజట ఊరడించినది.

*త్రిజట:* దేవీ! దుఃఖపడకుము. నీ భర్త బ్రతికియే యున్నాడు. రామలక్ష్మణులు జీవించి యున్నారు. నాథుడు హతుడైయుండినచో సైనికు లీరీతి రోషముతోను, ఉత్సాహముతోను ఉండజాలరు. మరియొకమాట. వారు బ్రతికియుండనిచో, దివ్యమైన ఈ పుష్పకవిమానము నిన్ను వహింపదు.

ఇదం విమానం వైదేహి పుష్పకం నామ నామతః
దివ్యం త్వాం ధారయేన్నైవం యద్యేతౌ గతజీవితౌ. 48-25

నీవనుకొన్నట్టు జరిగియుండునేని వానర సేన చెల్లాచెదరై పారిపోయియుండును. అట్లుగాక, సైనికులందరు రామలక్ష్మణులను సంరక్షించుచున్నారు. వారు నిశ్చయముగా బ్రతికియే యున్నారు. నాకు నీపైగల స్నేహమునుబట్టి ఇంతదూరము చెప్పుచున్నాను. నీ సద్గుణములు, నీ పాతివ్రత్యము నన్ను ఆకర్షించినవి.

చారిత్రసుఖశీలత్వా త్ప్రవిష్టాసి మనో మమ. 48-29

రామలక్ష్మణులను జయించుట దేవేంద్రునికిని సాధ్యముకాదు. నీకొక గుర్తు చెప్పుచున్నాను. రామలక్ష్మణులు మూర్ఛనొందియున్నను వారిముఖకాంతి కొంచెమైనను తగ్గలేదు.

నిస్సంజ్ఞావప్యుభావేతౌ నైవ లక్ష్మీ ర్వియుజ్యతే. 48-31

వారు నిస్సందేహముగా బ్రతికియున్నారు. నీవు దుఃఖింపకుము.

సీత : (అంజలి చేసి) త్రిజటా ! నీ మాట నిజమగునుగాక !

త్రిజట సీతాదేవిని పుష్పకవిమానములో తెచ్చి అశోకవనమున దించినది.

## శ్రీరాముడు మూర్ఛదేరి విలపించుట

వానరవీరు లందరు రామలక్ష్మణులకు కావలికాయుచుండినారు. కొంతసేపటికి రాముడు మూర్ఛనుండి తేరినాడు. ధీరుడు, బలవంతుడు అయిన శ్రీరాముడు కండ్లు తెరచి చూచినాడు.

ఏతస్మిన్నంతరే రామః ప్రత్యబుధ్యత వీర్యవాన్
స్థిరత్వా త్సత్త్వయోగాచ్చ శరైః స్సందానితోఽపి సన్. 49-3

లక్ష్మణుడు రక్తసిక్తాంగుడై తెలివిదప్పి పడియున్నాడు.

రాముడు : యుద్ధభూమిలో నా తమ్ము డిట్లు పడియుండుట చూడవలసివచ్చినదిగదా ! నా కిక సీతతోగాని, ఈ నాదేహముతోగాని పనియేమి? లోకములో వెదకుదు మేని సీతవంటి యువతి ఎందైన దొరకునేమోగాని లక్ష్మణునివంటి తమ్ముడు మాత్రము దొరకడు.

శక్యా సీతాసమా నారీ మర్త్యలోకే విచిన్వతా
న లక్ష్మణసమో భ్రాతా సచివ స్సాంపరాయికః. 49-6

లక్ష్మణుడు మరణించునేని నేను వానరుల కట్టెదుటనే ప్రాణము విడిచెదను. లక్ష్మణుడులేక నే నయోధ్య కేగి సుమిత్రాదేవిని ఆశ్వాసింపగలనా! లక్ష్మణుడు నన్ను వెంబడించి అరణ్యమున కెట్లు వచ్చెనో అట్లే నేనును వాని ననుసరించి యమలోకమున కేగెదను.

యథైవ మాం వనం యాంత మనుయాతో మహాద్యుతిః
అహమ ప్యనుయాస్యామి తథైవైనం యమక్షయమ్. 49-17

లక్ష్మణున కిట్టి దురవస్థ కలుగుటకు అనార్యుడనైన నా దుర్నయములే కారణములై యుండును. కోపము వచ్చినను ఎప్పుడు నాతో పరుషముగాగాని అప్రియముగా గాని ఒక్కమాటనైనను పలికినవాడు కాడుగదా లక్ష్మణుడు!

సురుష్టేనాపి వీరేణ లక్ష్మణేన న సంస్మరే
పరుషం విప్రియం వాపి శ్రావితం తు కదాచన. 49-19

లక్ష్మణుడు ఏకకాలమున అయిదువందల బాణములు వేయగలవాడు. బాణాస్త్ర ప్రయోగ కౌశలమునందు వేయి చేతులుగల కార్తవీర్యునికన్నను ఎక్కువవాడు.

విససర్జైకవేగేన పంచ బాణశతాని యః
ఇష్వస్త్రేష్వధిక స్తస్మా త్కార్తవీర్యాచ్చ లక్ష్మణః 49-2(

అట్టి లక్ష్మణుడు నేడు యుద్ధభూమిలో పడియున్నాడు గదా ! నేను విభీషణుని రాక్షసరాజుగా చేయనివాడనై నా మాట చెల్లించుకొనలేక అసత్యదోషము తెచ్చుకొన్నాను.

సుగ్రీవా ! నేను లేకుండుట చూచి రావణుడు నిన్ను తరిమికొట్టును. కావున నీ విప్పుడే కిష్కింధకు వెళ్ళిపొమ్ము. వానరులను సేతువుమీద నడిపించుకొని ఊరికి చేరుము. హనుమంతుడు గొప్పకార్యమును సాధించినాడు. మీ రందరు నాకు ఎంతో సహాయము చేసినారు. సుగ్రీవా ! మిత్రుడు చేయదగిన దంతయు నీవు చేసితివి. కాని దైవమును ఎవ్వ డతిక్రమింపగలడు ? నేను మీ కందరకు అనుజ్ఞ ఇచ్చుచున్నాను. మీరు వెళ్ళి సుఖముగా నుండుడు.

శ్రీరాము డిట్లు విలపించుట చూచి వానరులు కన్నీరు కార్చినారు. విభీషణుడు గదాపాణియై వానరసైన్యము పారిపోనీయక నిల్వరించి, రామలక్ష్మణు లున్నచోటికి వచ్చినాడు. అచ్చటనుండిన వానరులు విభీషణుని చూచి ఇంద్రజిత్తు వచ్చె నని భావించి భయపడి పరుగులు తీయసాగినారు.

*సుగ్రీవుడు :* జాంబవంతుడా ! "ఈ వచ్చినవాడు ఇంద్రజిత్తుకాడు. ఇతడు విభీషణుడు" అని మన సేనలకు చెప్పి వారిని మరలింపుము.

పారిపోవుచున్న వానరసేనలకు జాంబవంతుడు ధైర్యము చెప్పి వారిని మరలించినాడు.

## విభీషణుని దుఃఖము : సుగ్రీవుని ఊరడింపు

రామలక్ష్మణుల పరిస్థితిచూచిన విభీషణునికి కొంత దిగులు కలిగినది. జలమును గైకొని రామలక్ష్మణుల నేత్రములను తుడిచినాడు. విభీషణునికి దుఃఖము వచ్చి విలపించుచున్నాడు.

*విభీషణుడు :* దుర్మార్గుడైన ఇంద్రజిత్తు మాయను ప్రయోగించి రామలక్ష్మణులను మోసగించినాడు. శరీరమున బాణములు గ్రుచ్చుకొనుటచే వీ రిద్దరు శల్యకములవలె చూపట్టుచు యుద్ధభూమిలో పడియున్నారు. ఎవ్వారి వీర్యము నాశ్రయించి

నేను ప్రతిష్ఠ పొందగోరితినో, వారు నేలమీదపడిపోయి మరణించున ట్లున్నారు. నాకు రాజ్యముపై కోరిక నశించినది. నే నిక బ్రతికియుందునేని ఆపద కలుగుట నిశ్చయము. నా శత్రువైన రావణుడు తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనగలడు.

[నన్ను బ్రతుకనీయడు]

యయోర్వీర్య ముపాశ్రిత్య ప్రతిష్ఠా కాంక్షితా మయా
తావుభౌ దేహనాశాయ ప్రసుప్తౌ పురుషర్షభౌ. 50-18

జీవన్నద్య విపన్నోఽస్మి నష్టరాజ్యమనోరథః
ప్రాప్తప్రతిజ్ఞశ్చ రిపు స్సకామో రావణః కృతః. 50-19

సుగ్రీవుడు : విభీషణా! దిగులు పడకుము. నీకు రాజ్యము తప్పక లభించును. రావణుడు తన కోర్కెను తీర్చుకొనలేడు. రామలక్ష్మణులు మూర్ఛ జెందియున్నారు. అంతే. కొంత సేపటిలో తేరుకొని రావణుని, అతని అనుచరులను సంహరింపగలరు.

రాజ్యం ప్రాప్స్యసి ధర్మజ్ఞ లంకాయాం నాత్ర సంశయః
రావణ స్సహపుత్రేణ నేహ కామ మవాప్స్యతే. 50-21

న రుజా పీడితావేతా వుభౌ రాఘవలక్ష్మణౌ
త్యక్త్వా మోహం వధిష్యేతే సగణం రావణం రణే. 50-22

సుగ్రీవుడు : (సుషేణుని చూచి) మామా! రామలక్ష్మణులు మూర్ఛదేరినవెంటనే నీవు వారిరువురను తీసికొని కిష్కింధకు వెళ్లుము. నేను రావణుని వధించి సీతాదేవిని తీసికొనివచ్చెదను.

[సుషేణుడు వైద్యుడు; సుగ్రీవుడు రామలక్ష్మణులను వైద్యునికి అప్పగించి రావణునితో యుద్ధము చేయుటకు తానే పూనుకొన్నాడు. సుగ్రీవుని సాహసము, మిత్రభావము, మరవరానివి]

సుషేణుడు : పూర్వము దేవాసురుల యుద్ధములో దానవులు బాణములు వేసి దేవతలను ఇట్లే నొప్పించినారు. అప్పుడు బృహస్పతి కొన్ని మంత్రములను, కొన్ని ఓషధులను ప్రయోగించి దేవతలకు చికిత్స చేసినాడు. ఆ ఓషధులు క్షీరసముద్ర సమీపమున పర్వతములపై నున్నవి. సంజీవకరణి, విశల్యకరణి అనునవి. క్షీర సముద్రమునను అమృతమును మథించినచోట చంద్రపర్వతము, ద్రోణపర్వతము అను రెండు పర్వతములున్నవి. దేవతలు ఆ ఓషధులను ఆ పర్వతములమీద ఉంచియున్నారు. హనుమంతుని పంపి ఆ ఓషధులను తెప్పింపుము.

అయం వాయుసుతో రాజ న్హనుమాం స్తత్ర గచ్ఛతు. 50-32

## నాగపాశ విమోచనము

ఈ మాటలలోనే ఒక పెనుగాలి వీచినది. మరుక్షణములో గరుత్మంతుడు సాక్షాత్కరించినాడు. రామలక్ష్మణులను శరరూపమున బంధించిన సర్పములు ఎక్కడి వక్కడ పటాపంచలై పారిపోయినవి.

[హనుమంతునికి ఒక ప్రయాణము తప్పినది]

తమాగత మభిప్రేక్ష్య నాగా స్తే విప్రదుద్రువుః
యైస్తౌ సత్పురుషౌ బద్ధౌ శరభూతై ర్మహాబలౌ. 50-37

రామలక్ష్మణులు గరుత్మంతుని పూజించినారు.

చంద్రబింబములవంటి రామలక్ష్మణుల ముఖములను గరుత్మంతుడు తన చేతులతో నిమిరినాడు. వెంటనే వారి గాయములు మానిపోయి వారి తేజస్సు, బలపరాక్రమములు, బుద్ధి, ఉత్సాహము, అన్నియు మునుపటికంటె రెండింత లయినవి.

[ఇదియును ఒకందుకు మేలే అయిన దన్నమాట. రామలక్ష్మణుల బుద్ధి, పరాక్రమము, మున్నగునవి రెండింతలుగా పెరుగు నని తెలిసియుండినచో, ఇంద్రజిత్తు వారిపై నాగపాశ మును ప్రయోగించి యుండడు కాబోలు! కీడులోనుండి మేలు ఇట్లే కలుగును. మనము కొంచెము ఓపికపట్టి యుండవలయును. అంతే]

తేజో వీర్యం బలం చౌజ ఉత్సాహశ్చ మహాగుణః
ప్రదర్శనం చ బుద్ధిశ్చ స్మృతిశ్చ ద్విగుణా తయోః 50-40

గరుత్మంతుడు రామలక్ష్మణులను లేపి ఆదరముతో కవుగిలించుకొన్నాడు.

*రాముడు* : నీ ప్రసాదమువలన ఈ ఆపద గడచినది. నిన్ను చూడగా మా తండ్రి దశరథ చక్రవర్తిని మా పితామహుడు అజమహారాజును చూచిన ట్లున్నది. రూప సంపన్నుడవై దివ్యాభరణభూషితుడవై యున్న నీ వెవ్వడవో తెలియలేదు.

*గరుత్మంతుడు* : నేను నీ సఖుడను. నీ బహిఃప్రాణమువంటివాడను. గరుత్మంతుడను. మీకు సహాయము చేయుటకై వచ్చితిని. ఇంద్రజిత్తు తన మాయచే నిర్మించిన ఈ నాగ పాశబంధమునుండి విడిపించుటకు నాకు తప్ప మరెవ్వనికిని సాధ్యము కాదు. మీ ఆపద తెలిసిన వెంటనే వేగముగా వచ్చితిని.

ఈ యుద్ధములో మీరు జాగరూకులై యుండవలయును. రాక్షసులు మాయల మారులు. ఏదో మోసము చేయుచునే యుందురు. మెలకువ కలిగి మెలగుడు.

ఈ మాటలు చెప్పి గరుత్మంతుడు శ్రీరాముని కవుగిలించుకొని,

*గరుత్మంతుడు* : రామా ! నాకు సెలవిమ్ము. నీకును నాకును ఎక్కడి స్నేహ మని మాత్రము ఇప్పుడు అడుగవలదు. యుద్ధము పూర్తియైన పిదప అన్ని సంగతులును నీకు తెలియగలవు. నీవు రావణుని వధించి సీతాదేవిని పొంది సుఖముగా వర్ధిల్లగలవు.

గరుత్మంతుడు రామలక్ష్మణులను కవుగిలించుకొని వారికి ప్రదక్షిణముచేసి ఆకాశ మార్గమున వెళ్ళినాడు.

వానరులు సింహనాదములు చేసినారు. భేరీమృదంగములను మ్రోగించినారు. శంఖములను పూరించినారు. రాక్షసులను సంహరించుటకు వేగిరపడుచున్నారు. వానర సైన్యములో ఎక్కడ చూచినను ఆనందము, ఉత్సాహము తాండవ మాడుచున్నవి.

## రావణుని భయము - యుద్ధప్రయత్నము

వానరుల హర్షనాదములను రావణుడు విన్నాడు. దీని అర్థ మేమైనది అతనికి తోపలేదు. మంత్రులతో ఆలోచనలు సాగించినాడు.

**రావణుడు** : మంత్రులారా ! రామలక్ష్మణులు నాగపాశబద్ధులయినారు. వానరులు సింహగర్జనలు చేయుచున్నారు. శోకసమయమున ఈ హర్షనాదము లేమిటి ? నాకేమియు తోచుటలేదు. మీరు వెంటనే వెళ్ళి సంగతి యేమిమో తెలిసికొని రండు.

> జ్ఞాయతాం తూర్ణ మేతేషాం సర్వేషాం వనచారిణామ్
> శోకకాలే సముత్పన్నే హర్షకారణ ముత్థితమ్. 51-7

రాక్షసులు ప్రాకారము నెక్కి వానర సైన్యమును చూచినారు. రామలక్ష్మణులు నాగపాశ విముక్తులై సుఖముగా నుండుట చూచినారు. వారిని చూచుటతోడనే రాక్షసులు భయపడి పరుగెత్తుకొని వెళ్ళి రావణునితో చెప్పినారు. రావణుని ముఖము వెలవెలబోయినది.

**రావణుడు** : ఆహా ! రాముడు నాగపాశమునే విడిపించుకొనియెనా ! ఇక నేమున్నది ! మన సైన్యమున కంతటికిని ప్రాణసంశయము కలిగిన దన్నమాట !

> తదస్త్రబంధ మాసాద్య యది ముక్తౌ రిపూ మమ
> సంశయస్థ మిదం సర్వ మనుపశ్యా మ్యహం బలమ్. 51-16

ధూమ్రాక్షుడా ! నీవు నీ సైన్యసమేతుడవై పోయి వానరులను రాముని వధింపుము.

## ధూమ్రాక్షుడు యుద్ధమునకు పోవుట

ధూమ్రాక్షుడు రథస్థుడై, తన సైన్యమును వెంటబెట్టుకొని పశ్చిమద్వార మార్గమున బయలువెడలినాడు. దుశ్శకునములు ఎదురైనవి. రథము శిరస్సుపై గ్రద్ద వ్రాలినది. ధూమ్రాక్షునికి దిగులు తోచినది. కాని వెనుకకు మరలలేదు.

పశ్చిమద్వారమున వానరవీరుడు హనుమంతుడు రాక్షసులను ఎదుర్కొనుటకు సంసిద్ధుడైయున్నాడు.

రాక్షసులకును వానరులకును ఘోరయుద్ధము జరిగినది. రాక్షసులు వారి ఆయుధములను ప్రయోగించినారు. వానరులు వారి నఖములను, దంతములను, వృక్షములను, పర్వత శిఖరములను ప్రయోగించి రాక్షస చమూసమూహములను వధించినారు. చావక మిగిలియున్న రాక్షసులు పారిపోవుచున్నారు.

ధూమ్రాక్షునికి రోషము కలిగినది. వానర సైన్యముపై విజృంభించి అనేక వానరులను వధించినాడు. హనుమంతుడు కోపించి ఒక పెద్ద పర్వతశిఖరమును గైకొని ధూమ్రాక్షునిమీద విసరినాడు. ధూమ్రాక్షుడు తన గదతో హనుమంతుని కొట్టినాడు. హనుమంతుడు క్రోధవశుడై మరియొక పర్వతశిఖరమును ధూమ్రాక్షుని తలమీద ప్రయోగించినాడు. ఆ దెబ్బకు ధూమ్రాక్షుడు క్రిందపడి చనిపోయినాడు. హతశేషులైన రాక్షసులు లంకలోనికి పరుగెత్తినారు.

మహాత్ముడైన హనుమంతుడు శత్రువును వధించి యుద్ధభూమియందు రక్త నదులను ప్రవహింపజేసి, వానరుల పూజ లందుకొని సంతోషించినాడు.

స తు పవనసుతో నిహత్య శత్రుం
క్షత జవహాః స్సరితశ్చ సన్నికీర్య
రిపువధ జనిత శ్రమో మహాత్మా
ముద మగమ త్కపిభిశ్చ పూజ్యమానః. 52-39

[రావణుడు యుద్ధమునకు పంపిన రాక్షసవీరులలో మొదటి వాడైన ధూమ్రాక్షుని హనుమంతుడు వధించినాడు. రాక్షసవీరుల సంహారమునకు హనుమంతుడు నాంది కావించినాడు]

ధూమ్రాక్షుని మరణవార్త విని రావణుడు కోపోద్రిక్తుడై సర్పమువలె బుసలు కొట్టి యుద్ధమునకు వజ్రదంష్ట్రుని పంపినాడు. వజ్రదంష్ట్రుడు దక్షిణద్వారముగుండ నిర్గమించినాడు. ఆ ద్వారమున అంగదుడు సిద్ధముగా నున్నాడు. ఇరువురకు గొప్ప యుద్ధము జరిగినది. అంగదుడు విజృంభించి రాక్షసులను తండోపతండములుగా వధించినాడు. వజ్రదంష్ట్రుడు ధనుస్సు గైకొని అనేక వానరులను హతమార్చినాడు.

## అంగదుడు వజ్రదంష్ట్రుని సంహరించుట

అంగదునికిని వజ్రదంష్ట్రునికిని ద్వంద్వయుద్ధము జరిగినది. వజ్రదంష్ట్రుడు రథము నుండి దిగి గదను గైకొని అంగదునిపైకి వచ్చినాడు. అంగదుడు ఒక పర్వతశిఖరమును తీసికొని వజ్రదంష్ట్రుని శిరస్సుపైన కొట్టినాడు. ఈ విధముగా ఇద్దరు వీరులు చాలసేపు పోరు సలిపినారు. తుదకు, అంగదుడు అచ్చట పడియుండిన ఖడ్గమును గైకొని వజ్రదంష్ట్రుని శిరస్సు ఖండించినాడు.

వానరసేనలు అంగదుని పూజించినవి.

## హనుమంతుడు అకంపనుని వధించుట

వజ్రదంష్ట్రుడు మరణించిన పిదప, రావణుడు అకంపనుని యుద్ధమునకు పంపినాడు. అకంపనుడు తన సైన్యమును వెంటబెట్టుకొని యుద్ధభూమికి బయలువెడలినాడు. అపశకునములు కనిపించినవి. అకంపనుడు వానిని లెక్కచేయక ముందరకు నడచి యుద్ధభూమికి వచ్చినాడు. కుముదుడు, నలుడు, మైందుడు, ద్వివిదుడు, రాక్షస సైన్యముల నెదుర్కొని అనేక రాక్షసులను వధించినారు.

అకంపనుడు అనేక వానరులను వధించినాడు. వానరుల భంగపాటును చూచి హనుమంతుడు యుద్ధరంగమున కరుదెంచి యమునివలె విజృంభించి అనేక రాక్షసులను సంహరించినాడు. అకంపనునికిని హనుమంతునికిని ద్వంద్వయుద్ధము జరిగినది. ఇద్దరును బహుకాలము పోరినారు. తుదకు హనుమంతుడు అకంపనుని ఒక వృక్షముతో మర్దించి వధించినాడు. హతశేషులైన రాక్షసులు తమ ఆయుధములను విసర్జించి లంకలోనికి పరుగులు తీసినారు.

దేవగణములు, రామలక్ష్మణులు, సుగ్రీవాది వానర ప్రముఖులు, విభీషణుడు హనుమంతుని కొనియాడి పూజించినారు.

**అపూజయన్ దేవగణా స్తదా కపిం**
**స్వయం చ రామోఽతిబలశ్చ లక్ష్మణః**
**తథైవ సుగ్రీవముఖాః ప్లవంగమా**
**విభీషణశ్చైవ మహాబల స్తథా.** 56-౭

## నీలుడు ప్రహస్తుని సంహరించుట

అకంపనుడు హతము మరణించిన వార్తవిని రావణునికి దైన్యము కలిగినది. ఉదయముననే పట్టణమును పర్యటించి తన సైన్యములను పరీక్షించినాడు. వానర సేనలు

పట్టణమును ముట్టడించియున్నవి. సేనానాయకుడైన ప్రహస్తుని పిలిచి రావణుడు చెప్పుచున్నాడు.

**రావణుడు :** ప్రహస్తుడా! శత్రుసైన్యములు పట్టణమును ముట్టడించి పీడించుచున్నవి. ఈ బాధను తొలగించుటకు శక్తిగలవాడు కనిపించుటలేదు. నీవుగాని, నేనుగాని, లేక కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు, నికుంభుడు వీరిలో ఎవ్వరైనగాని ఈ భారమును వహింపవలయును.

పురస్యోపనివిష్టస్య సహసా పీడితస్య చ
నాన్యం యుద్ధాత్ప్రపశ్యామి మోక్షం యుద్ధవిశారద. 57-5

అహం వా కుంభకర్ణో వా త్వం వా సేనాపతి ర్మమ
ఇంద్రజిద్వా నికుంభో వా వహేయు ర్భార మీదృశమ్. 57-6

కావున నీ సేనలను తీసికొని యుద్ధమునకు బయలుదేరుము. సందేహముగా నుండు ఆపద ఎన్నడుగాని మేలు. నిస్సందేహమైన ఆపద మేలు కాజాలదుకదా!

[యుద్ధమున ఒకవేళ జయించినను జయింపవచ్చును. యుద్ధమే చేయనిచో మనలను వారు నిస్సందేహముగా వధింపగలరు. కావున యుద్ధము చేయుటయే మేలు]

ఆపత్సంశయితా శ్రేయో న తు నిస్సంశయీకృతా. 57-11

ప్రహస్తుడా! ఈ విషయమున నీ అభిప్రాయ మేమి!

**ప్రహస్తుడు :** ప్రభూ! ఈ సమస్య ఇదివరలోనే చర్చకు వచ్చినది. దీనిని గూర్చి మంత్రులలో భేదముకూడ కలిగినది. సీతను రామునికి సమర్పించుటయే మేలను నా అభిప్రాయము ను ఆనాడే తెలిపి యున్నాను. సీతను విడువనిచో యుద్ధము చేయవలసిన మాట తెలిసినదేకదా! ప్రభూ! నే నింతకు పూర్వము నీ వలన ఎన్నో సమ్మానములు పొందియున్నాను. ఈనాడు నీ కిష్టమైన కార్యమును చేయకుందునా! భార్యా పుత్రులను, సంపదను, తుదకు నా ప్రాణమును సైతము నీకుగా త్యాగము చేసి యుద్ధ మొనర్చుటకు సిద్ధముగా నున్నాను.

[ఈ విధముగా ప్రతిరాక్షసుడు రావణుని జీవమునకై తమ పచ్చని సంసారములను వదలిపెట్టి యుద్ధమునకు పోయి చనిపోవుచున్నారు. ఒక్కని మూర్ఖతవలన కోట్లకొలది అమాయికులు చనిపోవుచున్నారు. యుద్ధము లన్నియు ఇట్టి నాశనము కలుగజేయును కావుననే "శాంతి, శాంతి" అని ప్రపంచమున ఎందరో ఘోషించుచున్నారు.]

రాజ న్మంత్రితపూర్వం నః కుశలైః స్సహ మంత్రిభిః
వివాదశ్చాపి నో వృత్త స్సమవేక్ష్య పరస్పరమ్. 57-1

ప్రదానేన తు సీతాయా శ్రేయో వ్యవసితం మయా
అప్రదానే పునర్యుద్ధం దృష్టమేత త్తథైవ నః 57-14
సోఽహం దానైశ్చ మానైశ్చ సతతం పూజిత స్త్వయా
సాంత్వైశ్చ వివిధైః కాలే కిం న కుర్యాం ప్రియం తవ 57-15
న హి మే జీవితం రక్ష్యం పుత్రదారధనాని వా
త్వం పశ్య మాం జుహూర్షంతం త్వదర్థం జీవితం యుధి. 57-16

రాక్షసులు హోమములు చేయించి అగ్నిదేవుని తృప్తిపరచినారు. బ్రాహ్మణులను పూజించినారు. నేతి వాసనలతోను పుష్పముల వాసనలతోను వాయువు వీచుచున్నది. జయార్థమై అభిమంత్రితములైన పుష్పమాలికలను రాక్షసులు ధరించినారు.

హుతాశనం తర్పయతాం బ్రాహ్మణాశ్చ నమస్యతామ్
ఆజ్యగంధ ప్రతివహ స్సురభి ర్మారుతో వవౌ. 57-22
స్రజశ్చ వివిధాకారా జగృహు స్త్వభిమంత్రితాః
సంగ్రామసజ్జాః సంహృష్టా ధారయన్ రాక్షసా స్తదా. 57-23

సేనాధిపతియైన ప్రహస్తుడు రావణుని అనుజ్ఞ గైకొని శంఖభేరీ నినాదములతో యుద్ధమునకు బయలుదేరినాడు. ప్రహస్తుని మంత్రులైన నరాంతకుడు, కుంభహనుడు, మహానాదుడు, సమున్నతుడు ప్రహస్తుని అనుసరించినారు. ప్రహస్తునిసేన ఒక సముద్రమువలె కన్పట్టినది. ప్రహస్తునికి అపశకునములు ఎదురైనవి. ధ్వజముపై గ్రద్ద కూర్చుండినది. సారథి అశ్వగతులను చక్కగా నెరిగినవాడైనను, వాని చేతినుండి మునికోల క్రిందపడినది. గుఱ్ఱములు జారిపడినవి. ప్రహస్తుని ముఖకాంతి తరిగినది. ఉత్సాహము క్షీణించినది. కాని, ప్రహస్తుడు వెనుకకు మరలలేదు.

[వీరుడు వెనుకకు మరలునా!]

రాక్షససేనలనుచూచి వానరులు గర్జించినారు. శ్రీరాముడు ప్రహస్తుని సైన్యములను చూచి ఆశ్చర్యపడినాడు.

*రాముడు* : (మందహాసముతో) విభీషణా! ఆ వచ్చువాడు గొప్ప పరాక్రమశాలివలె కనబడుచున్నాడు. ఆ వీరు డెవ్వడు ?

*విభీషణుడు* : అతడు ప్రహస్తుడు. రావణుని సేనాధిపతి. రావణ సైన్యములో మూడవ భాగము అతని యధీనములో నున్నది. ప్రహస్తుడు వీర్యవంతుడు. అస్త్రముల నెరిగినవాడు. తన సేన నంతయు వెంటబెట్టుకొని వచ్చియున్నాడు.

రాక్షసులకును వానరులకును ఘోరయుద్ధము జరిగినది. ఆర్తనాదములతోను సింహగర్జనలతోను యుద్ధరంగము నిండిపోయినది. తలలు దొరలిపోవుచున్నవి. రక్త

నదులు ప్రవహించుచున్నవి. ఎచ్చట చూచినను విరిగిన రథములు, చచ్చిపడియున్న ఏనుగులు గుఱ్ఱములు కనిపించుచున్నవి.

ద్వివిదుడు, దుర్ముఖుడు, జాంబవంతుడు, తారుడు, ప్రహస్తుని నల్వుర మంత్రులను వధించినారు. ప్రహస్తుడు ధనుస్సు గైకొని బాణవర్షమును కురిపించినాడు. ఎక్కడి వానరు లక్కడ పడిపోయి చనిపోవుచున్నారు.

అంతట, వానరసేనాధిపతియైన నీలుడు ప్రహస్తునిపైకి ఉరికినాడు. ప్రహస్తుడు నీలునిమీద బాణములు కుప్పించినాడు. ఆబోతు కన్నులు మూసికొని వర్షపాతమును సహించునట్లు నీలుడు బాణవర్షమును సహించినాడు.

యథైవ గోవృషో వర్షం శారదం శీఘ్రమాగతమ్
ఏవమేవ ప్రహస్తస్య శరవర్షం దురాసదమ్ 58-42
నిమీలితాక్ష స్సహసా నీల స్సేహే సుదారుణమ్. 58-43

నీలుడు ఒక సాలవృక్షమును పెల్లగించి చేతికి తీసికొని ప్రహస్తుని రథాశ్వములను వధించినాడు. ధనుస్సును చేతులతో విరిచినాడు. ప్రహస్తుడు రథమునువీడి, ఒక ముసలమును గైకొని నీలునిపై చెలరేగినాడు. ఇరువురికిని ప్రచండయుద్ధము జరిగినది. నీలుడు ప్రహస్తుని తలమీద ఒక పెద్దశిలను విసరినాడు. ప్రహస్తుని శిరస్సు ముక్కలైనది. ప్రహస్తుడు చనిపోయినాడు.

హతశేషులైన రాక్షసులు లంకలోనికి పరుగెత్తినారు. దుఃఖపడుచు, రావణుని సమీపించి మూగవారివలె నిలబడినారు.

రక్షఃపతిగృహం గత్వా ధ్యాన మూకత్వ మాస్థితాః
ప్రాప్తా శ్శోకార్ణవం తీవ్రం నిస్సంజ్ఞా ఇవ తేఽభవన్. 58-60

[పర్యవసానము వారి పైఖరివలననే తెలిసినది. మాటలతో పని యేమి ?]

నీలుడు విజయుడై రామలక్ష్మణులయొద్దకు వచ్చినాడు. అందరును నీలుని ప్రశంసించినారు.

## రావణుడు యుద్ధమునకు బయలువెడలుట

సేనాపతి హతుడైన సంగతి రావణుడు తెలిసికొని మిక్కిలిగా దుఃఖించినాడు. దుఃఖముతోపాటు క్రోధము కలిగినది.

**రావణుడు :** (రాక్షసులతో) ఆహా ! ఇంద్రుని బలమునైతము హత మొనర్చిన నా సేనానాయకుడు మరణించినాడు ! ఈ వానరులను మనము చులకన సేయరాదు

ఇక కార్యమునకు పూనుకొనవలయును. ఆలస్యము చేయుట సరికాదు. నేనే స్వయముగా పోయి యుద్ధము చేయుదును. రామలక్ష్మణులను, వానర సేనలను నా, బాణాగ్నిచే దహించివైతును.

రావణుడు రథము నధిరోహించి బయలుదేరినాడు. శంఖ భేరీ నినాదములును, రాక్షసుల సింహనాదములును చెలరేగినవి. భూతములచే పరివేష్టితుడైన రుద్రుని పగిది, రావణుడు రాక్షసవీరులచే పరివేష్టితుడై యుద్ధభూమికి వెడలినాడు.

శ్రీరాముడు రావణుని సైన్యమును, రావణుని చూచి ఆశ్చర్యపడినాడు.

**రాముడు**: విభీషణా ! ఈ గొప్ప సేన యెవరిది ? ఆ వీరు లందరు యెవ్వరు ?

**విభీషణుడు**: ఆ ఏనుగుమీద వచ్చువాడు రావణుని కుమారుడైన అకంపనుడు. ఇంద్ర ధనుస్సునుబోలు ధనుస్సు ధరించి సింహకేతువుగల రథముపై వచ్చువాడు వర ప్రదానమత్తుడైన ఇంద్రజిత్తు. ధనుస్సును టంకార మొనర్చుచు రథముపై వచ్చుచున్న ఆ పర్వతాకారుడు అతికాయుడు. ఆ ఏనుగునెక్కి గర్జించుచున్నవాడు మహోదరుడు. ఆ గుఱ్ఱము నెక్కివచ్చువాడు పిశాచుడు. ఆ శూలమును గ్రహించి వృషభము నెక్కివచ్చుచున్నవాడు త్రిశిరుడు. సర్పరాజు టెక్కెముగల వాడు కుంభుడు. సువర్ణముతోను, మణులతోను అలంకృతమైన పరిఘమును గైకొని వచ్చువాడు నికుంభుడు. అతడు రాక్షససైన్యమున కంతటికిని ధ్వజము వంటివాడు. ఇంతకుపూర్వము ఎన్నియో అద్భుత సాహసములను చేసి యున్నాడు. ధనుర్బాణములను, నిశితఖడ్గమును ధరించి అగ్నివలె తేజరిల్లుచు రథముపై వచ్చుచున్న భయంకరమూర్తి నరాంతకుడు.

శ్వేతచ్ఛత్రముతో శోభిల్లుచున్న రథమునందు కిరీట కుండలములతో అలంకృతుడై వచ్చుచున్నవాడే దేవతల దర్పము నణచిన మహాపరాక్రమశాలి రావణుడు. లంకేశ్వరుడు. సమస్త రాక్షసులకును ప్రభువు.

**రాముడు**: విభీషణా ! రాక్షసేశ్వరుడు ఎంత కాంతితో వెలుగుచున్నాడు ! కన్నులు చెదరజేయు తేజస్సుతో సూర్యునిపగిది ప్రకాశించుచున్నాడు !

> **అహో** దీప్తో మహాతేజా రావణో రాక్షసేశ్వరః
> ఆదిత్య ఇవ దుష్ప్రేక్షో రశ్మిభి ర్భాతి రావణః. 59-26

కానిమ్ము ! రావణుడు ప్రకాశించుచున్నందున కంటికి స్పష్టముగా కనబడు చున్నాడు. ఈ పాపాత్ముడు దైవవశమున నా కంట పడినాడు. సీతాపహారణమువలన నాకు కలిగిన క్రోధమును రావణునిపై ప్రదర్శించెదను.

దిష్ట్యా యమద్య పాపాత్మా మమ దృష్టిపథం గతః
అద్య క్రోధం విమోక్ష్యామి సీతాహరణ సంభవమ్. 59-31

శ్రీరాముడు ధనుస్సు గ్రహించినాడు. లక్ష్మణుడు రామునిచెంతనే యున్నాడు.

రావణుడు: (తన వెంటవచ్చిన రాక్షస వీరులతో) మీ రందరును ఇందున్న యెడల పట్టణము శూన్యముగా నుండుటనెరిగి వానరులు గుంపులు కట్టుకొని నగరములో ప్రవేశించి సర్వనాశనము చేయగలరు. కావున మీ రందరును మరలిపోయి నాలుగు ద్వారములను పట్టణమును మెలకువతో రక్షింపుడు.

[రావణుడు అసహాయశూరుడు గదా !]

ఇంద్రజిత్తు మున్నగు రాక్షసవీరులు మరలిపోయినారు.

రావణుడు యుద్ధము ప్రారంభించి అనేక వానరులను వధించినాడు. సుగ్రీవుడు ఒక పెద్ద పర్వత శిఖరమును రావణుని పైకి విసరినాడు. రావణుడు ఒక బాణమువేసి దానిని నడిదారిలోనే ముక్కలుచేసి సుగ్రీవునిమీద ఒక తీవ్రబాణమును ప్రయోగించినాడు. కుమారస్వామి ప్రయోగించిన ఉగ్రశక్తి క్రౌంచపర్వతమును భేదించినట్లు రావణుని బాణము సుగ్రీవుని దేహమును భేదించినది. సుగ్రీవుడు మూర్ఛిల్లి క్రింద పడిపోయినాడు. గవాక్షుడు, గవయుడు మొదలైన కపివీరులు పర్వతములను గైకొని రావణుని పైకి దూకినారు. రావణుడు ఆ పర్వతముల నన్నింటిని తన శరములతో నివారించి వానిని ముక్కలుచేసి, వానరులమీద బాణములు ప్రయోగింపగా వారు బాణహతులై క్రింద పడిపోయినారు. ఇట్లు వానర సైన్యములను రావణుడు చించి చెండాడ సాగినాడు. వానరులు శ్రీరాముని శరణు జొచ్చినారు.

శ్రీరాముడు ధనుస్సును చేతికి తీసికొన్నాడు. ఇంతలో, లక్ష్మణుడు శ్రీరామునితో అనుచున్నాడు.

లక్ష్మణుడు: (అంజలిచేసి) రామా! రావణుని వధించుటకు నీవు సమర్థుడవు. అయినను, నీవు అనుజ్ఞ నిత్తువేని ఆ నీచుని నేను వధించెదను.

రాముడు: మంచిది! లక్ష్మణా! నీవు తీవ్రప్రయత్నము చేయుము. రావణుడు గొప్ప వీరుడు. యుద్ధమున అద్భుతకౌశలమును ప్రదర్శింపగలడు. అతనికి క్రోధము కలుగునేని ముల్లోకములలో ఎవ్వరుగాని అతని యెదుట నిలువలేరని తోచుచున్నది. నీవు కడు మెలకువగా నుండుము. అతని ఛిద్రములను వెదకి కనుగొనుము. నీ ఛిద్రములను కాపాడుకొనుము. ఏమరుపాటులేక కంటితో చూచుచు వింటితో పనిచేయుచు నిన్ను నీవు రక్షించుకొనుము.

చక్షుషా ధనుషా యత్నా ద్రక్షాత్మానం సమాహితః. 59-50

లక్ష్మణుడు శ్రీరాముని కవుగిలించుకొని పూజించి అభివందనముచేసి యుద్ధమునకు బయలుదేరినాడు. ఇంతలోనే, వానరసంహారము చేయుచుండిన రావణునిపై హనుమంతుడు కవిసి అతని రథమును దరిసినాడు. తన కుడిచేతిని పైకెత్తి రావణుని గుండె జల్లు మనునట్లు మాటాడుచున్నాడు.

**హనుమంతుడు**: రావణుడా! దేవతలను జయించితి నని విఱ్ఱవీగుచున్నావు. కాని నీకు వానరులవలన అపాయము కలుగును. ఇదిగో నా కుడిచేయి. ఇది నీ ప్రాణములను హరింపగలదు.

**రావణుడు**: వానరుడా! నిర్భయముగా నన్ను కొట్టి శాశ్వత కీర్తిని సంపాదింపుము. నీ పరాక్రమ మెట్టిదో చూచి అటుపై, నిన్ను నాశన మొనరింతును.

క్షిప్రం ప్రహర నిశ్శంకం స్థిరాం కీర్తి మవాప్నుహి
తతస్త్వాం జ్ఞాత విక్రాంతం నాశయిష్యామి వానర. 59-58

**హనుమంతుడు**: నీ కుమారుడు అక్షునికి నాచేత ఎట్టి పాటు వాటిల్లెనో జ్ఞప్తికి తెచ్చుకొనుము.

ఈ మాట వినుటతోడనే రావణునికి రోషము కలిగినది. తన అరచేతితో హనుమంతుని వక్షస్థ్సలమున ఒక దెబ్బ కొట్టినాడు.

[ఎట్లైన నేమి! మొదటిదెబ్బ రావణునిచేతనే కొట్టించినాడు!]

రావణుని దెబ్బ హనుమంతునికి గట్టిగా తగిలినది. కొంచెము చలించినాడు. ఒక్క క్షణమున ధైర్యము సమకూర్చుకొని తన అరచేత రావణుని కొట్టినాడు. భూకంపమువలన పర్వతము చలించునట్లు ఆ పోటుకు రావణుడు చలించినాడు. ఈ మహాత్కార్యమును చూచి దేవతలు, ఋషులు సంతోషించినారు. వానరులు సింహనాదములు చేసినారు.

**రావణుడు**: (కొంచెము తట్టుకొని) వానరుడా! నీ పరాక్రమమును మెచ్చుకొన్నాను. నీవు నాకు తగిన ప్రతివీరుడవు.

**హనుమంతుడు**: నా పరాక్రమము తగులబడినట్లున్నది! నా చేతిదెబ్బ తిని నీ వింకను ప్రాణముతో ఉన్నావుగదా!

ధిగస్తు మమ వీర్యేణ యస్త్వం జీవసి రావణ. 59-66

ఏదీ! మరొక్కమారు కొట్టుము. అప్పుడు నేను నా పిడికిలితో నిన్ను పొడిచి యమునిచెంత కంపెదను.

ఈ మాటకు రావణుడు కోపించి తన పిడికిట, హనుమంతుని వక్షస్థలమున కొట్టి నాడు. ఆ దెబ్బకు హనుమంతుడు మూర్ఛిల్లినాడు. హనుమంతుడు తేరుకొనులోగా రావణుడు తన రథమును నీలునిపైకి మరలించి నీలునిమీద బాణములు కుప్పించినాడు. నీలుడు ఒక పర్వతశిఖరమును గైకొని రావణునిమీద విసరివైచినాడు. ఇంతలో హనుమంతుడు మూర్ఛదేరి రావణుడు నీలునితో యుద్ధము చేయుచుండుట చూచి

**హనుమంతుడు :** రావణుడా! నీవు మరియొక్కనితో యుద్ధమాడుచుంటివి గనుక నిన్ను తరుముట సరికాదని వదలిపెట్టినాను.

అన్యేన యుధ్యమానస్య న యుక్తమభిధావనమ్. 59-74

నీలుడు విసరిన పర్వతశిఖరమును రావణుడు ఖండించినాడు. నీలుడు కొన్ని వృక్షములు ప్రయోగించెనుగాని వాని నన్నింటిని రావణుడు తన బాణములచే నివారించినాడు. నీలుడు తన ఆకారమును చిన్నది గావించుకొని రావణుని టెక్కెముపై వ్రాలినాడు.

హ్రస్వం కృత్వా తదా రూపం ధ్వజాగ్రే నిపపాత హ. 59-79

నీలుడు టెక్కెముపైనుండి సింహనాదము చేసినాడు. అక్కడనుండి రావణుని ధనుస్సుమీదను, రావణుని కిరీటముమీదను వ్రాలినాడు. మరల టెక్కెముపై కెక్కినాడు. హనుమంతుడు, రామలక్ష్మణులు నీలుని అద్భుత చర్యలనుచూచి ఆశ్చర్యచకితులైనారు. విభ్రాంతుడైన రావణుడు టెక్కెముమీదనుండిన నీలుని చూచి

**రావణుడు:** వానరుడా! నీవు అనేక మాయలు నేర్చిన ట్లున్నది! నీ మీద ఆగ్నేయాస్త్రమును ప్రయోగించుచున్నాను. శక్తి కలదేని, నీ ప్రాణమును రక్షించుకొనుము.

రావణుడు ఒక బాణమును ఆగ్నేయాస్త్రముతో అభిమంత్రించి నీలుని వక్షస్స్థలమున వేసినాడు. నీలుడు బాణహతుడై క్రింద పడిపోయినాడు. నీలుడు అగ్నిదేవుని కుమారుడే కావున తండ్రి అనుగ్రహముచేతను, తన తేజఃప్రభావముచేతను, రక్షింపబడినాడు. నీలుడు తన మోకాళ్లమీద పడి మూర్ఛితు డాయనే కాని మరణింపలేదు. అతడు పడియుండుటను చూచి రావణుడు లక్ష్మణునిపై కడరినాడు.

## రావణుడు లక్ష్మణునితో యుద్ధము చేయుట

**లక్ష్మణుడు :** రావణుడా! ఈ వానరులతో యుద్ధము చేయుచున్నావేమి? శక్తికల దేని నాతో యుద్ధము చేయుము.

**రావణుడు:** లక్ష్మణా! ఈ క్షణముననే నీ ప్రాణములను తీయగలను. నా భాగ్యవశమున నీవు నా కంట బడితివి.

రావణుడు లక్ష్మణునిమీద ఏడు బాణములు వేసినాడు. లక్ష్మణుడు వానిని ఖండించి రావణునిపై బాణవర్షమును కురిపించినాడు. రావణుడును తీవ్రబాణములను ప్రయోగించినాడు. ఆ బాణపాతములకు లక్ష్మణుడు చలించినాడు. వాని ధనుస్సు పట్టు తప్పినది. కొంత సేపటికి లక్ష్మణుడు తేరుకొని రావణుని ధనుస్సును ఖండించి రావణునిమీద బాణములు కుప్పించినాడు. రావణుని శరీరము రక్తసిక్తమైనది. రావణుడు మూర్ఛపోయి కొంత సేపటికి తేరి బ్రహ్మదేవుడు తనకు ప్రసాదించిన 'శక్తి'ని గైకొని లక్ష్మణునిమీద ప్రయోగించినాడు.

స కృత్తచాప శ్శరతాడితశ్చ
మేదార్ద్రగాత్రో రుధిరావసిక్తః
జగ్రాహ శక్తిం సముదగ్ర శక్తి
స్స్వయంభు దత్తాం యుధి దేవశత్రుః 59-107

ఆ శక్తిని ఖండించుటకు లక్ష్మణుడు బాణము ప్రయోగించెను కాని లాభము లేకపోయినది. ఆ శక్తి లక్ష్మణుని వక్షమున ప్రవేశించినది. లక్ష్మణుడు మూర్ఛిల్లినాడు. రావణుడు వడివడిగా వచ్చి లక్ష్మణుని చేతులతో పట్టుకొని పైకెత్తుటకు ప్రయత్నించినాడు. కాని ఎత్తజాలకపోయినాడు. హిమవత్పర్వతమునుగాని, మేరు మందర పర్వతములనుగాని, ఎత్తుటకు వీలగునేమోకాని యుద్ధభూమినుండి లక్ష్మణుని ఎత్తుటకు మాత్రము సాధ్యముకాదు.

[ప్రపంచమును మోయు ఆదిశేషుడు కదా లక్ష్మణుడు!]

రావణుడు ప్రయోగించిన శక్తి తన శరీరములో ప్రవేశించిన వెంటనే తాను విష్ణుదేవుని అంశమను మాట లక్ష్మణుడు స్మరించినాడు.

శక్త్యా బ్రాహ్మ్యా హి సౌమిత్రి స్తాడితస్తు స్తనాంతరే
విష్ణో రచింత్యం స్వంభాగ మాత్మానం ప్రత్యనుస్మరత్. 59-112

లక్ష్మణుడు విష్ణుదేవుని అంశమే కావున రావణుడు లక్ష్మణుని ఎత్తలేక పోయినాడు.

హనుమంతుడు ఉగ్రమూర్తియై రావణునిపైకి ఉరికినాడు. తన పిడికిలితో రావణుని వక్షమున ఒక పోటు పొడిచినాడు. ఆ దెబ్బకు రావణునికి మూర్ఛవచ్చి

మోకాళ్ళమీద పడిపోయినాడు. రావణుని కన్నులనుండియు చెవులనుండియు నోటి నుండియు రక్తము ప్రవాహముగా స్రవించినది.

తేన ముష్టిప్రహారేణ రావణో రాక్షసేశ్వరః
జానుభ్యా మపత ద్భూమౌ చచాల చ పపాత చ 59-115

అస్యై స్సనేత్ర శ్రవణై ర్వవామ రుధిరం బహు. 59-116

రావణుడు చేష్ట లుడిగి రథములో పడియున్నాడు. దీనిని చూచి దేవతలు, ఋషులు సంతోషించినారు.

వాయుపుత్రుడైన హనుమంతుడు తనచేతులతో లక్ష్మణుని ఎత్తుకొని శ్రీరాముని చెంతకు వచ్చినాడు. మిత్రుడును, భక్తుడును కావున హనుమంతునికి లక్ష్మణుడు తేలికయైనాడు.

వాయుసూనో స్సుహృత్త్వేన భక్త్యా పరమయా చ సః
శత్రూణా మప్రకంప్యోపి లఘుత్వ మగమ త్కపేః 59-120

[భక్తియున్నచో భగవంతుడు అందుబాటులో నుండగలడు]

రావణుడు ప్రయోగించిన శక్తి లక్ష్మణుని శరీరము వీడి రావణుని రథమున యథాస్థానములో చేరినది. లక్ష్మణుడు విశల్యుడై ఊరట జెంది తాను విష్ణుదేవుని అంశ మగుట స్మరించినాడు.

## రావణుడు శ్రీరామునితో యుద్ధము చేయుట

రావణుడు కొంతసేపటికి మూర్ఛదేరి ధనుస్సును గ్రహించి యుద్ధమునకు మరల పూనుకొన్నాడు. వానరసైన్యము భీతిజెంది పరుగెత్తిపోవుచున్నది. శ్రీరాముడు రావణునిమీదికి బయలుదేరినాడు. అప్పుడు హనుమంతుడు రామునితో అనుచున్నాడు.

*హనుమంతుడు* : రామప్రభూ ! విష్ణుదేవుడు గరుత్మంతునిపై నెక్కినట్టు నీవు నా వీపుపై నెక్కి యుద్ధముచేయుము.

శ్రీరాముడు హనుమంతుని వీపుపై నెక్కినాడు. రావణుడు రథస్థుడైయున్నాడు.

*రాముడు* : (ధనుష్టంకారముచేసి) ఓరీ రాక్షసుడా ! నిలునిలు ! నా కింతటి అపకారము గావించి నీ వెచ్చటికి వెళ్ళినను నా బాణమునుండి తప్పించుకొనలేవు. జనస్థానములో మీ వారిని పదునాలుగువేలమందిని నా బాణములు బలిగొన్నవి. జ్ఞప్తి యం దుంచుకొనుము.

ఈ మాటలకు రావణుడు కోపించి హనుమంతునిమీద బాణములువేసి నొప్పించినాడు. అయినను హనుమంతుని తేజస్సు వృద్ధియైనదేకాని తగ్గలేదు. తన భక్తుడగు హనుమంతుడు గాయపడుట చూచి శ్రీరాముడు కుపితుడై రావణుని రథచక్రములను, అశ్వములను, ధ్వజమును, ఛత్రమును, సారథిని ఖండించినాడు. రావణుని ఱొమ్మున పిడుగువంటి బాణమును ప్రయోగించినాడు. తనపై పిడుగు పడినను, ఇంద్రుని వజ్రాయుధముచే కొట్టబడినను, కలతనొందక చలింపని రావణుడు రామబాణహతుడై, తన చేతనుండిన ధనుస్సును జారవిడిచి వివశుడైనాడు.

యో వజ్రపాతాశని సన్నిపాతా
న్న చుక్షుభే నాపి చచాల రాజా
స రామబాణాభిహతో భృశార్త
శ్చచాల చాపంచ ముమోచ వీరః. 59-138

శ్రీరాముడు ఒక అర్ధచంద్రబాణము ప్రయోగించి రావణుని కిరీటమును ఖండించినాడు. రావణుడు నిర్విషమైన సర్పమువలె, మంటలేని అగ్నిచందమున, కాంతిహీనుడైన సూర్యునిపగిది, నిస్తేజస్కుడైనాడు. ఇట్టి రావణుని చూచి శ్రీరాముడు అనుచున్నాడు.

రాముడు : రావణా ! నీవు అనేక మహావీరులను వధించితివి. క్షతగాత్రుడవై యిప్పుడు అలసియున్నావు. కావున నిన్నిప్పుడే యమపురికి పంపక విడిచిపెట్టుచున్నాను. నేను నీ కనుజ్ఞ నిచ్చినాను. నీవు నగరము ప్రవేశించి, విశ్రాంతి తీసికొని, క్రొత్త రథము నెక్కి ధనుర్బాణములను ధరించి యుద్ధమునకు వెడలిరమ్ము. అప్పుడు నీపై నా బలమును ప్రదర్శింపగలను. నీ విప్పుడు పోవచ్చును.

కృతం త్వయా కర్మ మహ త్సుభీమం
హత ప్రవీరశ్చ కృత స్త్వయాహమ్
తస్మా త్పరిశ్రాంత ఇతి వ్యవస్య
న త్వాం శరై ర్మృత్యువశం నయామి. 59-142

గచ్ఛానుజానామి రణార్దిత స్త్వం
ప్రవిశ్య రాత్రించరరాజ లంకామ్
ఆశ్వాస్య నిర్యాహి రథీ చ ధన్వీ
తదా బలం ద్రక్ష్యసి మే రథస్థః. 59-143

[శ్రీరాముడు తప్ప మరియొక్కడు చేతికి జిక్కిన పరమశత్రువును ఈ విధముగా వదలిపెట్టునా ! వీరుడన్న శ్రీరాముడే వీరుడు]

శ్రీరాముని మాటలు విని రావణుడు సిగ్గుపడి లంకలోనికి పోయినాడు.

[శ్రీరాముడు ఈ రీతిగా తన్నవమానింపక వధించియుండినను, మేలుగా నుండెడిది!]

రావణుని గర్వభంగమునకు దేవతలు, ఋషులు సంతోషించినారు. రావణుని గర్వము అడుగంటిపోయినది. రామబాణ మనిన భయము తోచుచున్నది.

[మారీచుని మాటలు స్మృతికి వచ్చుచున్నవి.]

> బ్రహ్మదండ సకాశానాం విద్యు త్సదృశ వర్చసామ్
> స్మరన్ రాఘవబాణానాం విష్యధే రాక్షసేశ్వరః 60-3

రావణుడు సింహాసనముమీద చేరగిలబడి, తన మనోవ్యథను రాక్షసులతో చెప్పుకొనుచున్నాడు.

**రావణుడు :** నా తప స్సంతయు వ్యర్థమైపోయినది. ఒక్క మనుష్య మాత్రునిచేత ఎట్టి భంగపాటు కలిగినది! "మనుష్యునివలన నీకు భయము కలుగును" అని బ్రహ్మదేవుడు ఆనాడే చెప్పినాడు. మనుష్యునివలనగూడ భయము లేకుండునట్లు వరము కోరకపోవుట గొప్ప తప్పే అయినది. ఇక్ష్వాకు వంశములోని అనరణ్యుడు [త్రిశంకుని పితామహుడు] "కులాధముడా! నిన్ను సపుత్ర బాంధవముగా సంహారము చేయువాడు మా వంశమున పుట్టగలడు" అని శపించినాడు. ఈ రాముడు అతడే అయియుండును. నాచే ధర్షింపబడి నన్ను శపించిన వేదవతియే ఈ సీత కాబోలు! ఉమాదేవి, నందీశ్వరుడు, రంభ, వరుణకన్యక వీరు ఎన్నిమాటలు చెప్పిరో అవి యన్నియు అట్లే జరుగుచున్నవి. ఋషులును నన్ను శపించియున్నారు. ఋషుల మాటలు ఎన్నటికిని అబద్ధములు కావు.

> ఇదం తద్బ్రహ్మణో ఘోరం వాక్యం మా మభ్యుపస్థితమ్
> మానుషేభ్యో విజానీహి భయం త్వమితి తత్తథా. 60-6

> దేవదానవగంధర్వై ర్యక్ష రాక్షస పన్నగైః
> అవధ్యత్వం మయా ప్రాప్తం మానుషేభ్యో న యాచితమ్. 60-7

> విదితం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్
> ఇక్ష్వాకుకుల నాథేన అనరణ్యేన యత్పురా. 60-8

> ఉత్పత్స్యతే హి మద్వంశే పురుషో రాక్షసాధమ
> యస్త్వాం సపుత్రం సామాత్యం సబలం సాశ్వసారథిమ్. 60-9

నిహనిష్యతి సంగ్రామే త్వాం కులాధమ దుర్మతే
శప్తోఽహం వేదవత్యా చ యదా సా ధర్షితా పురా. 60-10

సేయం సీతా మహాభాగా జాతా జనకనందినీ
ఉమా నందీశ్వరశ్చాపి రంభా వరుణకన్యకా. 60-11

యథోక్తా స్తపసా ప్రాప్తం న మిథ్యా ఋషిభాషితమ్
ఏతదేవాభ్యుపాగమ్య యత్నం కర్తు మిహార్హథ. 60-12

రాక్షసులారా! నా మాట లన్నియు జ్ఞప్తియం దుంచుకొని జాగరూకులై మెలగుడు. లంకాపురి రక్షణ విషయములో కడుంగడు శ్రద్ధ వహింపుడు. శత్రువును వధించు ఉపాయ మాలోచింపుడు. దేవదానవుల దర్ప మడగించిన నా తమ్ముని కుంభకర్ణుని నిద్రనుండి మేల్కొలుపుడు.

ద్వారేషు యత్నః క్రియతాం ప్రాకారశ్చాధిరుహ్యతామ్
నిద్రావశ సమావిష్టః కుంభకర్ణో విబోధ్యతామ్. 60-15

కుంభకర్ణుడు నిదురింప నారంభించి తొమ్మిది దినము లయినది. మీ రతనిని త్వరగా మేల్కొలుపుడు. ఈ దుఃఖసమయమున నాకు ఉపయోగపడని వాని పరాక్రమ మెంత గొప్పది అయినను లాభ మేమి? కావున మీరు వానిని నిదురనుండి లేపి తీసికొని రండు. అతడు రామలక్ష్మణులను, వానరులను ఒక్క క్షణములో హత మొనరింపగలడు.

## కుంభకర్ణుడు

చందనాది సుగంధద్రవ్యములు, పుష్పమాలికలు, పిండివంటలు పట్టించుకొని రాక్షసులు కుంభకర్ణుని భవనమునకు వెళ్ళినారు. భవనద్వారము వెడల్పు ఒకటిన్నర యోజనము; ఎత్తుకూడ అంతే యున్నది. కుంభకర్ణుడు హాయిగా నిద్రపోవుచున్నాడు. రాక్షసులు వానియొద్దకు పోవుటకు ప్రయత్నించిరిగాని అతని నిశ్వాసవేగమువలన వెనుకకు పడిపోయినారు. ఎట్లో కష్టపడి నెమ్మదిగా కుంభకర్ణుని చెంతకు చేరగలిగినారు. అన్నరాశి, రక్త ఘటములు, మద్య భాండములు కుంభకర్ణుని ఎదుట సిద్ధముగా ఉంచినారు. కుంభకర్ణుని మేలుకొల్పుటకు ప్రయత్నములు చేయుచున్నారు.

శరీరమునకు గంధ మలంది పుష్పమాలికలు వేసినారు. ధూపములు వేసినారు. మెలకువ కలిగించుటకు మేఘములవలె గర్జించినారు. శంఖములు పూరించినారు. కుంభకర్ణుడు కదలలేదు. ఇనుపగుదియలతో పొడిచినారు. చెట్లతో మోదినారు. పిడికిళ్లతో గ్రుద్దినారు. భేరీవాద్యములు మ్రోగించినారు. వారు చేసిన శబ్దము లంకాపట్టణ మంతయు మారుమ్రోగినదేకాని శాపహతుడైన కుంభకర్ణుడుమాత్రము లేవలేదు. రాక్షసులు

కుంభకర్ణుని కేశములు పట్టి లాగినారు. చెవులు కొరికినారు. చెవులలో నీరు పోసినారు. శతఘ్నులతో ప్రహరించినారు. ఏమియు లాభము లేకపోయినది. తుదకు వేయి ఏనుగులను శరీరముపై నెక్కించి త్రొక్కించినారు. కుంభకర్ణునికి తనమీద ఏదో ప్రాకుచున్నట్లనిపించినది. కొంచెము కదిలినాడు. పూర్తిగా మేల్కొలుపుటకై రాక్షసులు పర్వత శిఖరములతోను, వృక్షములతోను కొట్టినారు.

[వానరుల ఆయుధములు ఇవే! జరుగబోవు యుద్ధము సూచింపబడినది]

కుంభకర్ణుడు ఆదెబ్బలను లక్ష్యపెట్టలేదు. ఆకలితోను, ఆవులింతలతోను నిదుర నుండి లేచినాడు. కడవలతో తెచ్చిపెట్టబడిన రక్తమును, మద్యమును సేవించినాడు. తృప్తిపడినాడని రాక్షసులు గ్రహించి కుంభకర్ణునికి నమస్కారము చేసి అతనిని పరివేష్టించినారు. కుంభకర్ణుడు నిద్రకన్నులు నులుముకొనుచు నాలుగువైపుల చూచి రాక్షసులను గుర్తించి, తన్ను లేపినకారణము తెలియనివాడగుటచే విస్మయముతో పలుకుచున్నాడు.

కుంభకర్ణుడు: నన్ను నిదుర లేపుటకు కారణ మేమి? మన ప్రభువుకు క్షేమమేనా! ప్రమాద మేమైన కలిగినదా యేమి? నన్ను లేపుటకు గొప్ప కారణ మేదో యుండును. తెలియజెప్పుడు. రావణునికి కలిగిన భయమును ఇప్పుడే పోగొట్టెదను. ఇంద్రుని అణగద్రొక్కెదను. అగ్నిదేవుని హతమార్చెదను.

యూపాక్షుడు: (రావణుని మంత్రి) దేవతలవలన మన కేమియు భయము కలుగలేదు. ఇప్పుడు కలిగిన భయ మంతయు ఒక్క మనుష్యునివలననే. లంకాపురిని వానర సైన్యము ముట్టడించినది. సీతాపహరణ కారణముగా రాముడు కోపించినందున మన కీ దురవస్థ కలిగినది. పూర్వ మొక వానరుడు వచ్చి లంకను తగులబెట్టి అక్షకుమారునిగూడ వధించినాడు. ఇప్పుడు జరుగుచున్న యుద్ధమునందు అనేక రాక్షసవీరులు హతులైనారు. మనరాజు స్వయముగా యుద్ధమాడి చచ్చిపోవు అంతపని అయినది. రాముని దయవలన ప్రాణముతో బయటపడినాడు. ఇంత వరకు దేవతలుగాని మరెవ్వరుగాని చేయలేని కార్యము రాముడు సాధించినాడు.

స్వయం రక్షోధిపశ్చాపి పౌలస్త్యో దేవకంటకః
మృతేతి సంయుగే ముక్తో రామేణాదిత్యతేజసా. 60-77

యన్న దేవైః కృతో రాజా నాపి దైత్యైర్న దానవైః
కృత స్స ఇహ రామేణ విముక్తః ప్రాణసంశయాత్. 60-78

కుంభకర్ణుడు: యూపాక్షుడా! నే నిక్కడనుండియే ఇప్పుడే యుద్ధభూమికి పోయి రామలక్ష్మణులను వానరసైన్యమును వధించి వచ్చి, అటుపిమ్మట రావణుని

జూడబోయెదను. రామలక్ష్మణుల రక్తము పానముచేసి రాజు దర్శనము చేసికొందును.

**మహోదరుడు :** (అంజలిచేసి) నీవు ముందు ప్రభుదర్శనము చేసికొని కార్యాకార్యములను నిర్ణయించుకొని అటుపిమ్మట యుద్ధభూమి కేగుట యుక్తము.

మహోదరుని మాటను కుంభకర్ణుడు అంగీకరించినాడు. రాక్షసులు ముందుగా పోయి కుంభకర్ణుడు వచ్చుచున్నాడని రావణునికి తెలియజేసినారు.

**రావణుడు :** రాక్షసులారా ! కుంభకర్ణునికి తగిన మర్యాదలు చేసి తీసికొని రండు.

రాక్షసులు కుంభకర్ణుని దగ్గరకరిగి, "ప్రభువు నిన్ను చూడగోరుచున్నాడు" అని చెప్పగా, కుంభకర్ణుడు పడకనుండి లేచి ముఖప్రక్షాళనము చేసికొని, శుచియై, అలంకారము కావించుకొని, పుష్పమాలలు ధరించినాడు. రెండువేల కుండలతో కల్లు తెప్పించుకొని త్రాగి బయలుదేరినాడు. అతని నడకకు భూమి దద్దరిల్లిపోయినది. పుర జనులు కుంభకర్ణునికి నమస్కరించినారు. లంకాపుర రాజమార్గములో నడచుచున్న కుంభకర్ణుని, లంకకు వెలుపలనున్న వానర సైనికులు చూచినారు.

[కుంభకర్ణుని శరీరము అంతపెద్దది అన్నమాట]

వానరులు భయపడి దిక్కులకు పరుగెత్తినారు. కొందరు వానరులు రాముని శరణు జొచ్చినారు.

శ్రీరాముడు కుంభకర్ణుని ఆకారమును చూచి ఆశ్చర్యపడి

**రాముడు :** విభీషణా ! ఎవ్వడీ అపూర్వ పర్వతాకారుడు ! మెరపులతో కూడిన మేఘ సముదాయము చందమున విలసిల్లుచున్నాడు ! ఇట్టి మహాభూతమును నే నిదివర కెన్నడును చూచి యుండలేదు. వీనిని చూచి వానరులు భయపడి ఎట్లు పారి పోవుచున్నారో చూడుము.

**విభీషణుడు :** రామప్రభూ ! ఇతడే కుంభకర్ణుడు. శూలపాణియై దేవదానవులను గడగడ లాడించినవాడు. ఇతర రాక్షసులకు వరదానమువలన బలము కలిగినది. కుంభ కర్ణుడు సహజముగనే బలము కలవాడు. ఇతడు పుట్టినవెంటనే ఆకలిగొని పెక్కు వేల ప్రాణులను భక్షించినాడు. ప్రజలు ఇంద్రునితో మొరపెట్టుకొనగా ఇంద్రుడు తన వజ్రాయుధమును కుంభకర్ణునిమీద ప్రయోగించినాడు. దాని దెబ్బకు కుంభకర్ణుడు కొంచెము చలించి ఒక క్షణములో తేరుకొని సింహనాదము

చేసి ఐరావత దంతము నూడబెరికి దానితో ఇంద్రుని రొమ్మున గ్రుమ్మినాడు. దేవతలు, ఋషులు, దుఃఖితు లైనారు. ఇంద్రుడు దేవతలను ఋషులను వెంట బెట్టుకొని బ్రహ్మసన్నిధికి పోయి మొరపెట్టుకొన్నాడు. "కుంభకర్ణుని దుండగములను మేము సహింపజాలము. ప్రజల నందరను భక్షించుచున్నాడు. ఆశ్రమములను ధ్వంసము చేయుచున్నాడు. పరస్త్రీల నపహరించుచున్నాడు. అత డిట్లు ప్రజలను భక్షింపసాగినచో త్వరలోనే లోకము ప్రాణిశూన్యమై పోవును. తాము దీనికి తగిన పరిహారము చేయుదు రని వేడుకొనుచున్నాము" అని ఇంద్రుడు ప్రార్థింపగా బ్రహ్మదేవుడు రాక్షసుల నందరిని తన కడకు పిలిపించి, కుంభకర్ణుని చూచి తానుకూడ భయపడినాడు.

కుంభకర్ణం సమీక్ష్యైవ వితత్రాస ప్రజాపతిః. 61-23

కొంచెము సేపటికి దిటపు తెచ్చుకొని బ్రహ్మదేవుడు కుంభకర్ణునితో "పౌలస్త్యుడు నిన్ను లోకవినాశనమునకై పుట్టించిన ట్లున్నది. కావున నీ విప్పటినుండియు మృతకల్పుడవై పడియుండి నిదురించుచుండుము" అని శపించినాడు. అంతట రావణుడు బ్రహ్మతో "స్వామీ! నీ మునిమనుమడేకదా కుంభకర్ణుడు. వీని నిట్లు శపించుట న్యాయమా? నీ మాటకు తిరుగులేదు. అయినను వీని నిద్రకు ఒక కాలనియమము నిర్ణయింపు మని వేడుచున్నాను" అని ప్రార్థించినాడు. బ్రహ్మదేవుడు "సరే! అట్లే చేసెదను. ఇతడు ఆరుమాసముల కొక్కనాడు మేలుకొని యుండగలడు" అని శాసించినాడు. ఇదీ కుంభకర్ణుని సంగతి.

రామప్రభూ! నీ పరాక్రమమునకు భయపడి రావణుడు కుంభకర్ణుని నిద్రలోనుండి మేల్కొలిపించినాడు. వానరు లందరు వీనిని చూచి భయపడి పారిపోవుచున్నారు. ఇట్లువెళ్ళుచున్నవారు కుంభకర్ణునితో యుద్ధ మేమి చేయగలరు? వానరులతో "ఇతడు రాక్షసుడుకాడు. ఇది పైకెత్తబడిన ఒక యంత్రము. అంతే. మీరు భయపడవలసిన పని లేదు" అని వారికి ధైర్యము చెప్పవలయును.

ఉచ్యంతాం వానరా స్సర్వే యంత్ర మేత త్సముచ్ఛ్రితమ్
ఇతి విజ్ఞాయ హరయో భవిష్య న్తీహ నిర్భయాః 61-33

ఈ మాటలు విని శ్రీరాముడు సేనాపతియైన నీలుని పిలిచి "నీలుడా! నీవు సైన్యములను చక్కగా తీర్చి పురద్వారములను అనకట్టలను ఆక్రమింపుము. యుద్ధమునకు కావలసిన పర్వత శిఖరములను వృక్షములను సేకరించి సిద్ధముగా నుంచుము" అని యేర్పాటులు చేసినాడు.

## కుంభకర్ణుడు - రావణుడు

కుంభకర్ణుని నిద్రమత్తు పూర్తిగా వదలలేదు. సొక్కుచు సొలుచు రాజమార్గమున నడచుచున్నాడు. పౌరులు మేడలమీదినుండి అతనిపై పుష్పవర్షమును కురిపించుచున్నారు. కుంభకర్ణుడు రావణుని ప్రాసాదము ప్రవేశించి సింహాసనగతుడై దుఃఖించుచుండిన అన్నను దూరమునుండి చూచినాడు. రావణుడు సింహాసనమునుండి సంతోషముతో లేచి తమ్ముని కెదురేగినాడు.

*కుంభకర్ణుడు* : (రావణుని పాదములకు మ్రొక్కి) నాతో పని కలిగినదా ! న న్నెందుకు మేల్కొలిపినారు ?

**రావణుడు** (కుంభకర్ణుని కవుగిలించుకొని సువర్ణాసనముమీద కూర్చుండబెట్టి) కుంభకర్ణుడా ! నీవు హాయిగా నిద్రించుచు నాకు రామునివలన కలిగిన గొప్ప ఆపదను గ్రహించజాలకున్నావు. రాముడు వానర సైన్యములనుగూడి సముద్రమును దాటివచ్చి లంకను నిర్మూలము చేయుచున్నాడు. యుద్ధమాడబోయిన మన వీరు లందరు హతులైనారు. వానరులలో ఒక్కడును చచ్చినట్లు నేను వినలేదు. లంకాపురిని రక్షింపవలసిన భారము నీ మీద నున్నది. కుంభకర్ణుడా ! మన బొక్కస మంతయు క్షీణించిపోయినది. మేటి వీరు లెల్లరు మరణించినారు. లంకాపురిలో బాలురు, వృద్ధులు, మాత్రమే మిగిలియున్నారు. ఈ సమయమున నీవు న న్నెట్లైన రక్షింపవలయును.

> యే రక్షసాం ముఖ్యతమా హతాస్తే వానరై ర్యుధి
> వానరాణాం క్షయం యుద్ధే న పశ్యామి కదాచన. 62-16
>
> సర్వక్షపిత కోశం చ స త్వ మభ్యవపద్య మామ్
> త్రాయస్వేమాం పురీం లంకాం బాలవృద్ధావశేషితామ్. 62-19

తమ్ముడా ! నీపై నాకెంతో గౌరవము. అన్నకొఱకు నీవు కొంచెము చేయి చేసికొనవలయును. నీవంటి బలాఢ్యుడు లోకమున లేడు. నా శత్రువును సంహరించి నా బాధ తీర్పుము.

**కుంభకర్ణుడు** : (నవ్వుచు) మన మనుకున్నంత పనియు అయినది. ఆనాడు ఆలోచన సభలో చెప్పనే చెప్పితిని. నీవు నా మాటను చెవిని వేసికొనలేదు. నీ పాపఫలమును నీవు అనుభవించుచున్నావు. అంతే ! నీవు వీర్యదర్పాంధుడవై కన్నుగానక మాలో ఎవ్వరితోను ఆలోచింపక దానివలన ఏర్పడు బాధను గుర్తింపక, ఒక మహాపాపకార్యమును చేసి గొంతుపైకి తెచ్చుకొన్నావు.

ప్రథమం వై మహారాజ కృత్యమేత దచింతితమ్
కేవలం వీర్యదర్పేణ నానుబంధో విచారితః. 63-4

ఏపనినైన, ముందువెనుకలు ఆలోచించి మంచిచెడ్డలు గమనించి స్నేహితులతోను మంత్రులతోను సంప్రతించి, కాలాకాలములను గుర్తించి చేయవలయును. అట్లు చేసినవాడే సుఖపడగలడు. అట్లు చేయనివాని శాస్త్రజ్ఞాన మంతయు నిరర్థకము. ప్రభువు తెలివితక్కువవాడైనచో, మంత్రులు చెలరేగి శాస్త్రార్థమును వెనుకకు నెట్టి వారి ఇష్టానుసారము ఆలోచనలు చెప్పి తమ ప్రభువు కార్యమును పాడుచేయుదురు. అహితమును హితముగా పలుకుదురు. అట్టి మంత్రులను ఆలోచనసభకే రానీయ గూడదు.

అహితం చ హితాకారం ధార్ష్ట్యా జ్జల్పన్తి యే నరాః
అవేక్ష్య మంత్రబాహ్యాస్తే కర్తవ్యాః కృత్యదూషణాః. 63-16

ఆనాడు విభీషణుడు చెప్పిన మాటయే హితమైన మాట. ఈ నాడైనను అతడు చెప్పినట్లు చేయుటయే మంచిది. ఆపై నీ ఇష్టము.

యదుక్తమిహ తే పూర్వం క్రియతా మనుజేన చ
తదేవ నో హితం కార్యం యదిచ్ఛసి చ తత్కురు. 63-21

ఈ నిష్ఠురవాక్యములకు రావణుడు కోపోద్రిక్తుడై

**రావణుడు :** కుంభకర్ణా! పిన్నపెద్ద అంతరువు గమనింపక నీ యిష్టమువచ్చినట్లు మాటలాడుచున్నావు! నేను నీకు జ్యేష్ఠసోదరుడ నను స్మృతిలేనివాడవై, ఆచార్యునివలె నన్ను దండించుచున్నావు! ఈ పనికిమాలిన మాటలతో ప్రయోజన మేమి? తెలిసియో తెలియకయో ఒకపని చేసినాను. అయిపోయినది. మాటిమాటికిని చెప్పిపొడుచుటవలన ఏమైన లాభ మున్నదా! జరిగిన దేదియో జరిగిపోయినది. తెలివిగలవా డెవ్వడు జరిగిపోయినదానిని తలచుకొని దుఃఖించుచు కూర్చుండడు. నీకు నామీద ప్రీతికలదేని యీ కాలమునకు తగిన కార్యమును నీచేతనైనంత వరకు చేయుము. చిక్కులో చిక్కినవానికి సహాయము చేయువాడే నిజమైన బంధువు.

మాన్యో గురురివాచార్యః కిం మాం త్వ మనుశాససి
కిమేవం వాక్శ్రమం కృత్వా కాలే యుక్తం విధీయతామ్. 63-23

విభ్రమా చ్చిత్తమోహాద్వా బలవీర్యాశ్రయేణ వా
నాభిపన్న మిదానీం య ద్వ్యర్థా స్తస్య పునః కథాః 63-24

అస్మిన్ కాలే తు యద్యుక్తం తదిదానీం విధీయతామ్
గతం తు నానుశోచంతి గతం తు గతమేవ హి. 63-25

కుంభకర్ణుడు : (తగ్గి-నెమ్మదిగా) ప్రభూ! నీ సంతాపమును వీడి స్వస్థుడవై యుండుము. నేను బ్రతికియుండగా నీవు బాధపడవలసిన పని లేదు. ఇప్పుడే బయలుదేరెదను. నేను రాముని తప్పక వధింతును. రాముని శిరస్సు తెచ్చి నీ ముందు ఉంచెదను. రామునివలని భయమును వీడుము. రాముడు ముందు నన్ను వధించి తరువాత నిన్ను వధింపవలసినదేగాని, నే నుండగా ని న్నేమియు చేయలేడు.

అథ పూర్వం హతే తేన మయి త్వాం హంతి రాఘవః
నాహమాత్మని సంతాపం గచ్ఛేయం రాక్షసాధిప. 63-40

నా కిప్పుడే అనుజ్ఞ నిమ్ము. యుద్ధములో ఎవ్వడుగాని నా యెదుట నిలబడి ప్రాణముతో మరలిపోలేడు. రామలక్ష్మణులను, సుగ్రీవుని, లంకాదహనకర్త యగు హనుమంతుని, వానరసేనలను అందరను రూపుమాపెదను. ఈ ముల్లోకములు నా ఆహారమునకు చాలవు. మరి నాతో యుద్ధము చేయగలవా డెవ్వడు?

నన్విదం త్రిదివం సర్వ మాహారస్య న పూర్యతే. 63-55

నీవు నిర్విచారుడవై, కమ్మనిపదార్థములను తినుచు, మేలుమద్యములు సేవించుచు సుఖముగా నుండుము. నేను రాముని వధించివచ్చెదను. ఆవల సీత నీ వశ మగును.

రమస్వ కామం పిబ చాగ్ర్యవారుణీం
కురుష్వ కృత్యాని వినీయతాం జ్వరః
మయాద్య రామే గమితే యమక్షయం
చిరాయ సీతా వశగా భవిష్యతి. 63-57

మహోదరుడు కుంభకర్ణుని కఠినవాక్యములు విని రాజునకు అనుకూలముగా మాటలాడుచున్నాడు.

మహోదరుడు : కుంభకర్ణుడా! నీవు గొప్పకులములో పుట్టితివేకాని నీ బుద్ధిలో గొప్పతన మగుపడుటలేదు. మన ప్రభువునకు మంచిచెడ్డలు తెలియనట్లును, నీకే తెలిసినట్లును మాటలాడుచున్నావు. మన ప్రభువు గొప్ప పండితుడు. నీవంటి మూర్ఖుడు కాడు - "నీ పాపఫలము ననుభవించుచున్నావు" అని రాజును దూషించితివి.

ధర్మార్థకామములను గూర్చి నీ వాడిన మాటలకు ప్రమాణ మేమియు లేదు. లోకమున, పాపకార్యమువలన మంచిఫలము కలుగుచుండుట అనుభవవేద్యము.

కర్మ చైవ హి సర్వేషాం కారణానాం ప్రయోజనమ్
శ్రేయః పాపీయసాం చాత్ర ఫలం భవతి కర్మణామ్. 64-7

నీవు ధర్మమును గురించి చెప్పిన మాటలు పరలోక సుఖమునకు అన్వయించునేమో కాని ఈ లోకములో కామమును సేవించువానికే కర్మములు సుఖముల నిచ్చును. కావున మన రాజు చేసిన పనిలో తప్పులేదు.

ఐహలౌకికపారత్రం కర్మ పుంభి ర్నిషేవ్యతే
కర్మాణ్యపి తు కల్యాణి లభతే కామమాస్థితః. 64-9

అదిగాక నీ పరాక్రమమును గురించి గొప్పలు చెప్పుకొని నీ వొక్కడవే యుద్ధమొనర్చి శత్రువధచేతు నని చెప్పితివి. ఆ మాటలో అర్థములేదు. రాముడు జనస్థానములో ఎంతమంది రాక్షసులను సంహరించెనో ఎరుగవా ? నీవు రాముని వధించుట వట్టిమాట.

ప్రభూ ! నే నొకమాట చెప్పెదను వినుము. సీతను కోరికోరి తెచ్చుకొన్నావు. నీవు కోరినప్పుడు ఆమె నీ వశ మగుటకు నే నొక ఉపాయమును ఆలోచించినాను. నీ కిష్ట మేని అట్లు చేయుము.

దృష్టః కశ్చిదుపాయో మే సీతోపస్థాన కారకః
రుచిరశ్చేత్త్వయా బుద్ధ్యా రాక్షసేశ్వర తం శృణు. 64-21

నేను, ద్విజిహ్వుడు, సంహ్రాది, కుంభకర్ణుడు, వితర్ధనుడు మే మేవురము రాముని వధించుటకు బయలుదేరుచున్నామని చాటింపుము. మేము పోయి రామునితో యుద్ధము గావించెదము. శత్రువును జయింతుమేని నా ఉపాయముతో పనిలేదు. జయింపలేనిచో, రామనామము చెక్కిన బాణములతో మేమే మా శరీరములలో గాయములు చేసికొని, నెత్తుటితో తడిసి, యుద్ధభూమినుండి ఇచ్చటికి వచ్చి "రామలక్ష్మణులను మేము భక్షించి నాము" అని చెప్పి నీ పాదములకు మ్రొక్కెదము. నీవు మాకు బహుమతు లిచ్చి, రామలక్ష్మణులు వధింపబడి రను వార్తను పురియందు చాటింపుము. అందరకును దానధర్మములు చేయుము. సైనికులకు గంధమాల్యములను, మద్యములను యదేచ్ఛముగా ఇచ్చి సత్కరింపుము. నీవును మద్యము సేవించి సంతోషముగా నుండుము. రామలక్ష్మణుల మరణవార్త ఊరంతయు వ్యాపించి స్థిరపడినపిదప, నీవు సీతయొద్దకు వెళ్ళి ఆమెకు మంచిమాటలు చెప్పి అవి ఇవి యిచ్చి ఆమెను వశపరచుకొనుము. భర్త మరణించెనుగదా యని అతని ఆశ వదలుకొని, స్త్రీలు సహజముగా చపలచిత్తలు కావున సీత నీ వశము కాగలదు.

వయం యుద్ధా దిహైష్యామో రుధిరేణ సముక్షితాః
విదార్య స్వతనుం బాణై రామనామాంకితై శ్శరైః. 64-25

రంజనీయం హి భర్తారం వినష్టమవగమ్య సా
నైరాశ్యాత్ స్త్రీలఘుత్వాచ్చ త్వద్వశం ప్రతిపత్స్యతే 64-33

ప్రభూ! నేనెంతదూరమో ఆలోచించి ఈ యుపాయమును కనిపెట్టినాను. నీవు దీనిని అనుసరింపుము. మనకు యుద్ధముతో పనిలేకయే జయము కలుగును. నీవు రాముని కంటపడుదువేని నీకు అపాయము తప్పదు. యుద్ధమువలన మన కేమియు లాభములేదు.

ఏత త్సునీతం మమ దర్శనేన
రామం హి దృష్ట్వైవ భవే దనర్థః
ఇహైవ తే సేత్స్యతి మోత్సుకో భూ
ర్మహానయుద్ధేన సుఖస్య లాభః 64-35

*కుంభకర్ణుడు* : మహోదరా! ఇక నీ పనికిమాలిన మాటలను చాలింపుము. ఇంకెన్నడును ఇట్టిమాటలాడకుము. జాగ్రత్త! నీవంటి బుద్ధిహీనుల మాటలను ఆలకించి మన రాజు ఆపదలో చిక్కువడినాడు. మీరందరు ఏకమై రాజుతో ఇచ్చకములాడుచు రాక్షసులను చంపించి లంకాపురియందు రాజుమాత్రమే మిగిలియుండునట్లు చేసినారు. హితశత్రువులైన మీ కార్యమువలన బొక్కసము క్షీణించినది. బలము హతమయినది.

యుద్ధే కాపురుషై ర్నిత్యం భవద్భిః ప్రియవాదిభిః
రాజాన మనుగచ్ఛద్భిః కృత మేతద్ధి సాదితమ్ 65-6

రాజశేషా కృతా లంకా క్షీణః కోశో బలం హతమ్
రాజాన మిమమాసాద్య సుహృచ్ఛిహ్నా మమిత్రకమ్ 65-7

అన్నా! నీ వేమియు భయపడకుము. నేను నీ శత్రువును వధించిరాగలను.

*రావణుడు* : (నవ్వుచు) మహోదరుడు రామునికి భయపడి యుద్ధము వల దనుచున్నాడు. పాపము! నీవు పోయి రాముని వధించిరమ్ము. శూలపాణివై బయలుదేరుము. నీ ఆకారము చూచుటతోడనే రామలక్ష్మణుల గుండెలు బ్రద్దలయిపోగలవు.

*కుంభకర్ణుడు* : (శూలము చేకొని) నేనొక్కడనే పోయి శత్రుసంహారము కావింతును. నాకు సైన్యముతో పనిలేదు.

*రావణుడు* : తమ్ముడా! ఒంటరిగా వెళ్ళుట సరికాదు. సైన్యమును వెంట గొనిపొమ్ము. మణిహారములు, ఉంగరములు, అంగదములు తెప్పించి రావణుడు కుంభకర్ణునికి అలంకారము చేసినాడు. గంధమాల్యము లిచ్చి చెవులకు కుండలములు పెట్టినాడు. కుంభకర్ణుని నీలమణులమొలత్రాడు అమృతమథనకాలములో మందర పర్వతమునకు చుట్టిన వాసుకివలె తేజరిల్లుచున్నది.

## కుంభకర్ణుడు యుద్ధమునకు వెడలుట

కుంభకర్ణుడు కవచము ధరించి అన్నను కవుగిలించుకొని, ప్రదక్షిణము చేసి, శిరసా నమస్కరించి, రావణుని ఆశీర్వాదము పొంది యుద్ధమునకు బయలుదేరినాడు. పురజనులు కుంభకర్ణునిమీద పుష్పవృష్టి కురిపించినారు. కుంభకర్ణుడు నూరు ధనుస్సుల వెడల్పుగను, ఆరువందల ధనుస్సుల పొడవుగను ఉండినాడు. కన్నులు బండిచక్రముల వలె ఉన్నవి. ఇది కుంభకర్ణుని ప్రమాణము. పెద్దపర్వతమువలె ఉన్నాడు.

కుంభకర్ణుడు సైన్యసమేతుడై యుద్ధభూమికి వెడలినాడు. దుశ్శకునములు ఎదురైనవి. కాని కుంభకర్ణుడు వానిని లెక్కచేయలేదు. ప్రాకారమును లంఘించి సింహగర్జనము చేయుచు యుద్ధరంగము ప్రవేశించినాడు. కుంభకర్ణునిచూచి వానరులు దశదిశలకు పారిపోసాగినారు. నలుడు, నీలుడు, గవాక్షుడు, కుముదుడు మున్నగు గొప్ప వీరులుసైతము పారిపోవుట చూచి అంగదుడు వారిని మరలింప ప్రయత్నము చేయుచున్నాడు.

*అంగదుడు* : వీరులారా! మీ పరాక్రమమును, ప్రశస్తమైన కులమును మరచిపోయి మీరు సామాన్యులవలె భయపడి పారిపోవుచున్నారేమి? ఎచ్చటికి మీరు వెళ్లుట? ఈ వచ్చినవాడు రాక్షసుడు కాడు. మనకు భీతికలిగించుటకు నిర్మింపబడిన బిభీషిక. ఈ బొమ్మనుచూచి పారిపోవుచుంటిరా! మరలుడు. మన పరాక్రమ మును ప్రదర్శించి ఈ బిభీషికను బ్రద్దలు చేయుదము.

బహుప్రయాసమీద వానరవీరులు మరలివచ్చి వృక్షములను పర్వత శిఖరములను గైకొని యుద్ధమునకు పూనుకొన్నారు. వారి ఆయుధములను కుంభకర్ణునిమీద ప్రయోగించినారు. కాని అవి కుంభకర్ణుని శరీరమును తాకి ముక్కలు ముక్కలయి పోవుచున్నవేగాని ఆ రాక్షసుడు కొంచెమైనను వ్యధనొందలేదు. దావాగ్ని అడవిని దహించునట్లు కుంభకర్ణుడు వానరసైన్యమును దహించుచున్నాడు. అతని ధాటిని ఓర్వజాలక వానరులు తిరిగిచూడకయే పరుగెత్తిపోవుచున్నారు. కొందరు సముద్ర ములో పడినారు. కొందరు ఆకసమున కెగిరినారు. భల్లూక సైన్యములు చెట్లను ఆశ్ర యించినవి. ఎక్కడివారక్కడ పాటిపోవుచున్నారు.

*అంగదుడు* : వానరవీరులారా! మీ పౌరుష మంతయు ఏమయినది! ఆయుధములు విడిచి పారిపోవుచున్నారేమి? మీరు పౌరుషహీనులై ఇట్లు పారిపోవుదురేని మీ భార్యలు సైతము మిమ్ములను పరిహాసింపరా! అంతకన్న మరణ మొకటి యున్నదా!

దారా హ్యపహసిష్యంతి స వై ఘాతస్తు జీవినామ్ 66-21

అందరును మిమ్ములను అవమానింతురు. మీరు బయలుదేరినప్పుడు పలికిన పౌరుష వాక్యము లేమైనవి? భయమును విడువుడు. వీరమార్గము నవలంబింపుడు. ఈ భూమి మీద అల్పజీవితులై యుండుటకంటె యుద్ధమున మరణించి వీరస్వర్గమునకు పోవుట మేలు. ఈ కుంభకర్ణుడు శ్రీరాముని కంటబడునేని ఒక్క క్షణముకూడ బ్రతికియుండ జాలడు. మీరు యుద్ధరంగమునకు మరలి వీరులవలె యుద్ధము చేయుడు. ఇంతకాలము కష్టపడి ఆర్జించిన విపులకీర్తిని ఈనాడు నాశనము చేసికొనవలదు.

వానరులు: కుంభకర్ణుడు మాకు భీతినిగొల్పుచున్నాడు. అతని ధాటిని మేము తాళ జాలక యున్నాము. ఇది నిలుచుటకు సమయముకాదు. మాకు మా ప్రాణ ములు తీపి.

కృతం నః కదనం ఘోరం కుంభకర్ణేన రక్షసా
న స్థానకాలో గచ్ఛామో దయితం జీవితం హి నః 66-30

అంగదుడు వారిని మరిమరి ప్రోత్సాహము చేసి ప్రయాసమీద మరలింపగలిగి నాడు. అందరును యుద్ధమునకు పూనుకొన్నారు.

[అంగదు డెంత గొప్పవీరుడో ఈ పట్టున తెలియుచున్నది.]

వానరు లందరు ప్రాణములమీద ఆశ వదలుకొని తెంపుగా యుద్ధము చేయు చున్నారు.

ప్రయాతాశ్చ గతా హర్షం మరణే కృతనిశ్చయాః
చక్రు స్సుతుములం యుద్ధం వానరా స్త్యక్తజీవితాః 67-3

కుంభకర్ణుడు చంపిన వానరులకు లెక్కలేదు. వానరులను చేతులతో జవిరి నోటిలో వేసికొని భక్షింపసాగినాడు. ద్వివిధుడు ఒక పర్వతశిఖరమును గైకొని కుంభ కర్ణునిమీద వేసినాడు. కాని అది అంత దూరము పోకయే రాక్షససైన్యమునడుమ పడి గుఱ్ఱములను, ఏనుగులను, రథములను హతమార్చినది.

హనుమంతుడు ఆకసమున కెగిరి కుంభకర్ణునిమీద వృక్షశిలావర్షము కురిపించి నాడు. దానిని సరకుచేయక, కుంభకర్ణుడు లెక్కకు మిక్కిలియైన వానరులను తన శూలముతో సంహరించుచుండగా హనుమంతుడు ఒక పర్వతశిఖరమును కుంభకర్ణుని మీద బలముగా విసిరినాడు. ఆ ఘాతకు కుంభకర్ణుని శరీరమునుండి రక్తము స్రవించినది. కుంభకర్ణుడు క్షోభిల్లినాడు.

స చుక్షుభే తేన తదాభిభూతో
మేదార్ద్రగాత్రో రుధిరావసిక్తః 67-18

కుంభకర్ణుడు తన శూలముతో హనుమంతుని వక్షస్స్థలమున కొట్టినాడు. ఆ దెబ్బకు హనుమంతుడు చలించినాడు. నోట రక్తము క్రక్కి గట్టిగా అరచి మూర్ఛపోయినాడు.

స శూలనిర్భిన్న మహాభుజాంతరః
ప్రవిహ్వల శ్శోణిత ముద్వమ న్ముఖాత్
ననాద భీమం హనుమా న్మహాహవే
యుగాంత మేఘ స్తనిత స్వనోపమమ్ 67-20

ఈ సన్నివేశమును చూచి వానరులు భయపడి పరుగెత్తినారు. నీలుడు వారికి ధైర్యము చెప్పి నిలిపి కుంభకర్ణునిమీద ఒక పర్వత శిఖరమును వేసినాడు. కుంభకర్ణుడు దానిని తన పిడికిలితో అడ్డగించి ముక్కలుచేసినాడు. ఋషభుడు, శరభుడు, నీలుడు, గవాక్షుడు, గంధమాదనుడు, వీరేవురును ఏకమై కుంభకర్ణునిపైకి వచ్చినారు. కుంభకర్ణుడు ఋషభుని రెండుచేతులతో అదిమినాడు. ఋషభుడు నెత్తురు క్రక్కి పడిపోయినాడు. కుంభకర్ణుడు తన పిడికిలిపోటున శరభుని మర్దించి, మోకాలుతో నీలుని క్రుమ్మి, అరచేతితో గవాక్షుని చరచి, గంధమాదనుని కాలితో తన్నినాడు. ఈ దెబ్బలకు ఓర్వజాలక యెక్కడివా రక్కడ పడి మూర్ఛిల్లినారు. వేనకువేల వానరులు కుంభకర్ణునిపై నెక్కి కొరికినారు. చేతులతో, పాదములతో క్రుమ్మినారు. తనపై నున్న వానరులను కుంభకర్ణుడు తన చేతులతో లాగికొని నోటిలో వేసికొనుచున్నాడు. పాతాళమువంటి కుంభకర్ణ వక్త్రములోపడి వానరులు అతని ముక్కులగుండ, చెవులగుండ బయటికి వచ్చినారు.

ప్రక్షిప్తాః కుంభకర్ణేన వక్త్రే పాతాళసన్నిభే
నాసాపుటాభ్యాం నిర్జగ్ముః కర్ణాభ్యాం చైవ వానరాః 67-36

ఇట్లు బయటికి వచ్చుట చూచి కుంభకర్ణుడు వానరులను ముక్కలుగా విరిచి భక్షింపసాగినాడు. వానరులను కసిమసంగుచున్నాడు. వారు రాముని యొద్దకు పోయి శరణు కోరినారు. వారి బాధను చూచి అంగదుడు ఒక పర్వతశిఖరమును గైకొని కుంభకర్ణుని తలమీద కొట్టినాడు. ఆ దెబ్బకు కుంభకర్ణుడు మండిపడి అంగదుని మీద శూలమును ప్రయోగించినాడు. అంగదుడు శూలపు తాకు తప్పించుకొని కుంభకర్ణుని రొమ్ముమీద అరచేతితో చరిచినాడు. ఆ దెబ్బకు కుంభకర్ణుని కన్నులు తిరిగినవి. కొంత సేపటికి తేరుకొని ఎడమపిడికిలితో అంగదుని పొడిచినాడు. ఆ దెబ్బకు అంగదుడు మూర్ఛిల్లి పడిపోయినాడు.

# కుంభకర్ణుడు సుగ్రీవునితో యుద్ధము చేయుట

కుంభకర్ణుడు శూలము గైకొని సుగ్రీవునిపై కరిగినాడు. ఇద్దరకును కొంతసేపు తీవ్రయుద్ధము జరిగినది. సుగ్రీవుడు ఒక పర్వతశిఖరమును కుంభకర్ణునిమీద వేసినాడు. కుంభకర్ణుడు తన శూలమును గిరగిరత్రిప్పి సుగ్రీవునిపైకి విసరినాడు. హనుమంతుడు వెంటనే ఉరికి ఆ శూలమును తన రెండుచేతులతో పట్టుకొని మోకాలికి ఆనించి విరిచి వైచినాడు. కుంభకర్ణుడు కోపించి ఒక పర్వత శిఖరమును పెకలించి, దానిని సుగ్రీవుని పైకి విసరినాడు. ఆ దెబ్బకు సుగ్రీవుడు మూర్ఛిల్లి క్రింద పడిపోయినాడు.

వానరేంద్రుడైన సుగ్రీవుని కుంభకర్ణుడు పైకెత్తి పట్టుపఱచుకొని లంకలోనికి బయలుదేరినాడు. "సుగ్రీవుని పట్టుకొని వెళ్ళినయెడల రామలక్ష్మణులను, సమస్త వానరసైన్యమును, పట్టుకొన్నట్టే యగును" అని ఆలోచించినాడు.

[శత్రురాజును ప్రాణముతో పట్టుపఱచుకొనుట యుద్ధములో గొప్ప విజయము.]

తత స్తమాదాయ తదా స మేనే
హరీంద్ర మింద్రోపమ మింద్రవీర్యః
అస్మిన్హృతే సర్వమిదం హృతం స్యా
త్సరాఘవం సైన్య మితీంద్రశత్రుః 67-72

సుగ్రీవుడు పట్టుబడుట చూచి వానరులు భీతిల్లి పరుగెత్తిపోవుచున్నారు.

పరిస్థితిని హనుమంతుడు గమనించినాడు. "మన ప్రభువును కుంభకర్ణు డెత్తుకొని పోవుచున్నాడు. ప్రస్తుతము నా కర్తవ్య మేమి" అని మతిమంతుడైన హనుమంతుడు ఆలోచించినాడు.

హనుమాం శ్చింతయామాస మతిమా న్మారుతాత్మజః
ఏవం గృహీతే సుగ్రీవే కిం కర్తవ్యం మయా భవేత్ 67-74

"పర్వతాకారుడనై రాక్షసుని నాశన మొనరించి మా ప్రభువును విడిపింతునేని వానరు లందరకు సంతోషముగా నుండును" అని తలచినాడు. హనుమంతుడు మరల ఆలోచించినాడు. "సుగ్రీవుడు తన్ను తానే విడిపించుకొనగలడు. దేవతలు, అసురులు, ఉరగులు ఏకమై వచ్చి పట్టుకొన్నను, మా రాజు తనను తానే విడిపించుకొనుటకు సమర్థుడు. ఇప్పుడు మూర్ఛ నొందియున్నాడు. ఒక్కక్షణములో మూర్ఛదేరి తనకును మాకును ఏది హితమో అట్లుచేయగలడు. ఇప్పుడు నేను విడిపింతునేని మహాపరాక్రమ శాలియైన మా రాజు మనస్సునకు కష్టము తోచుటయేకాక ఆయనకు శాశ్వతమైన అపకీర్తికూడ కలుగును. కావున అతని పరాక్రమముమీదనే భారము వైచెదను.

ఈ లోపల వానరసేనను ఊరడింతును. ఇట్లుచేయుటయే యుక్తము" అని నిశ్చయించుకొన్నాడు.

అథవా స్వయమప్యేష మోక్షం ప్రాప్స్యతి పార్థివః
గృహీతోఽయం యది భవేత్ త్రిదశైః సాసురోరగైః 67-77

అయం ముహూర్తాత్ సుగ్రీవో లబ్ధసంజ్ఞో మహాహవే
ఆత్మనో వానరాణాం చ యత్పథ్యం తత్కరిష్యతి 67-79

మయా తు మోక్షితస్యాస్య సుగ్రీవస్య మహాత్మనః
అప్రీతిశ్చ భవేత్ కష్టా కీర్తినాశశ్చ శాశ్వతః 67-80

తస్మాన్ముహూర్తం కాంక్షిష్యే విక్రమం పార్థివస్య తు
భిన్నం చ వానరానీకం తావదాశ్వాసయామ్యహమ్ 67-81

[హనుమంతుడు మతిమంతుడని ఊరక అన్నారా! ఆయనకు ఎంత ముందుచూపు! ఎంతటి రాజభక్తి! హనుమంతుడు సుగ్రీవుని విడిపించినచో సుగ్రీవుడు తలయెత్తుకొని తిరుగగలడా! రాజ్యమును పాలింపగలడా! "ఆనాడు హనుమంతుడు కాపాడబట్టి బ్రతికిపోయితివి. లేనిచో నీ పని యేమైయుండును" అని ప్రతి యొక్కడు సుగ్రీవుని తిరస్కరింపడా! హనుమంతుని సూక్ష్మబుద్ధికి, స్వామి భక్తికి, జేజేలు!]

కుంభకర్ణుడు సుగ్రీవునెత్తికొని విజయగర్వముతో లంకాపురి రాజమార్గమున నడచుచున్నాడు. కుంభకర్ణుని గౌరవించుటకు పురజనులు కుంభకర్ణునిమీద పుష్పవర్షము కురిపించినారు. లాజలు, పరిమళగంధములు, పన్నీరు చల్లినారు. రాజమార్గము ఇరు పార్శ్వములందును వృక్షములతోకూడి చల్లగా నున్నది. ఇవన్నియు కుంభకర్ణుని పైనున్న సుగ్రీవునికి శైత్యోపచారము లయినవి. సుగ్రీవునికి మూర్ఛవదలి కొంచెముకొంచెముగా స్పృహకలిగినది.

లాజ్యగంధోదవర్షైస్తు సిచ్యమానశ్శనైశ్శనైః
రాజమార్గస్య శీతత్వాత్ సంజ్ఞామాప మహాబలః 67-84

[కుంభకర్ణునికి చేసిన ఉపచారములు సుగ్రీవునికి లాభించినవి. దైవగతులు ఈ తీరుగ నుండును!]

సుగ్రీవుడు కన్నులు తెరచి, జరిగిన విషయమును ఊహించి తెలిసికొని "ఈ రాక్షసుని చేతిలో చిక్కుపడినాను. దీనికి ప్రతీకారము చేయవలయును. ఇప్పుడు నేనేమిచేసినచో వానరులకు ప్రీతికరముగా నుండునో ఆపని చేసెదను" అని ఆలోచించి వాడియైన తనగోళ్ళతో కుంభకర్ణుని చెవులను గిల్లివైచి, దంతములతో ముక్కును, ప్రక్కలను కొరికినాడు.

తతః కరాగ్రైస్సహసా సమేత్య
రాజా హరీణా మమరేంద్ర శత్రుమ్
ఖరైశ్చ కర్ణౌ దశనైశ్చ నాసాం
దదంశ పార్శ్వేషు చ కుంభకర్ణమ్ 67-87

కుంభకర్ణునికి ముక్కు, చెవులు పోయినవి. శరీర మంతయు రక్తసిక్తమైనది. కుంభకర్ణుడు కోపించి సుగ్రీవుని కొట్టి క్రిందపడవేసినాడు. కొందరు రాక్షసులుకూడ సుగ్రీవుని మర్దించినారు. సుగ్రీవుడు ఆ దెబ్బలను లక్ష్యపెట్టక ఆకసమునకెగిరి శ్రీరాముని సన్నిధికి చేరినాడు.

కుంభకర్ణుడు అక్కడినుండియే మరలి యుద్ధభూమికి వచ్చినాడు. శూలమునకు బదులు ఒక ముద్గరమ్మును (ఇనుపగుదియ) గైకొని వచ్చి వానరసేనలో జొరబడి వానరులను భక్షింపసాగినాడు. తీవ్రమైన ఆకలి గొనియున్నాడు. మైమరచి వానరులనే కాక రాక్షసులనుకూడ తినుచున్నాడు. చేతికి చిక్కినవారిని నోటిలో వేసికొనుచున్నాడు.

ఏకం ద్వౌ త్రీన్ బహూన్ క్రుద్ధో వానరాన్ సహ రాక్షసైః
సమాదాయైకహస్తేన ప్రచిక్షేప త్వర న్ముఖే 67-97

వానరులు రామునియొద్ద కేగి శరణు వేడినారు. కుంభకర్ణుడు ఆ వానరులవెంట బడినాడు. లక్ష్మణుడు కోపించి కుంభకర్ణునిమీద ఏడు బాణములు ప్రయోగించినాడు. కుంభకర్ణుడు లక్ష్మణుని నిర్లక్ష్యము చేసి తిన్నగా రామునిపైకి వెళ్ళినాడు.

## కుంభకర్ణుడు రామునితో యుద్ధముచేసి మడియుట

శ్రీరాముడు రౌద్రాస్త్రమును సంధించి కుంభకర్ణుని వక్షమున బాణము వేసినాడు. కుంభకర్ణుని ఆయుధములు చేతినుండి జారి పడిపోయినవి. చేతులతోను కాళ్ళతోను యుద్ధము చేయుచున్నాడు. శరీర మంతయు రక్తసిక్తమైనది. వానరులను రాక్షసులను గుర్తింపజాలక అందరను భక్షించుచున్నాడు. ఒక పర్వతశిఖరము గైకొని గిరగిరత్రిప్పి రామునిపై విసరినాడు. రాముడు దానిని నడిదారిలోనే తన బాణములతో ఖండించినాడు. కుంభకర్ణుడు వానరులమీదికి పరుగెత్తుచున్నాడు. దీనిని నివారించుటకు లక్ష్మణుడు ఒక ఉపాయము నాలోచించినాడు. "ఈ రాక్షసుడు రక్తము త్రాగి ఒడలు మరచి మత్తులో ఉన్నాడు. రాక్షసులను వానరులను గుర్తింపలేకున్నాడు. వానర వీరులు ఇతనిమీద నెక్కి అటునిటు కదలనీయక నొక్కి పట్టుకొందురేని వానరులను భక్షించుట మానుకొనగలడు" అని చెప్పినాడు. వానరులు కుంభకర్ణునిమీద ఎక్కిరి కాని వారి నందరిని ఒక్క ఊపు ఊచి విదిలించివేసినాడు. దీని నంతటిని రాముడు చూచి

ధనుస్సు గైకొని బాణమును సంధించినాడు. కుంభకర్ణుడు శ్రీరాము\
సిద్ధపడినాడు.

రాముడు : రాక్షసుడా! ఇదిగో బాణము. నిన్నిప్పుడే వధింపగలను. 'ఇంద్రుని జయించి తినిగదా' అని విఱ్ఱవీగుచుంటివి కాబోలు! నేను రాముడను. నీ ప్రాణములు హరింతును.

కుంభకర్ణుడు : విరాధ, కబంధ, ఖర, వాలి, మారీచుల వంటి వాడ నని అనుకొనుచున్నావేమో! నేను కుంభకర్ణుడను సుమా! ఈ ముసలమును చూడుము. దీనితోనే దేవతలనుసైతము జయించియున్నాను. నాకు ముక్కు, చెవులు పోయిన వని చులకన చేయుదువు కాబోలు! అవి లేకపోవుట నా కొక బాధకాదు.

> వికర్ణనాస ఇతి మాం నావజ్ఞాతుం త్వమర్హసి\
> స్వల్పాపి హి న మే పీడా కర్ణనాసా వినాశనాత్ 67-137

నీ పరాక్రమమును పూర్తిగా ప్రదర్శింపుము. ఆ తరువాత నిన్ను భక్షించెదను.

శ్రీరాముడు బాణములు ప్రయోగించినాడు. కాని కుంభకర్ణుడు కొంచెమైనను చలింపలేదు. సప్తసాల వృక్షములను భేదించిన బాణములుగాని, వాలిని వధించిన కరకుటమ్ములుగాని, కుంభకర్ణునిమీద పని చేయజాలకపోయినవి.

> యైస్సాయకై స్సాలవరా నికృత్తా\
> వాలీహతో వానరపుంగవశ్చ\
> తే కుంభకర్ణస్య తదా శరీరే\
> వజ్రోపమా న వ్యథయాం ప్రచక్రుః 67-140

కొన్ని బాణములను కుంభకర్ణుడు తన ముద్గరముతో నివారించినాడు. మరల వానరసేనపై విజృంభించినాడు. శ్రీరాముడు వాయవ్యాస్త్రమును ప్రయోగించి ముద్గరసహితముగా కుంభకర్ణుని చేతిని ఖండించినాడు ఆ చేయి క్రిందపడుటలో వానర సైన్యములమీద పడి అనేక వానరులను హతమార్చినది.

ఉభయపక్షముల యోధులు చిత్తరువులవలె నిలబడి రామ కుంభకర్ణుల ద్వంద్వ యుద్ధమును చూచుచున్నారు.

కుంభకర్ణుడు మిగిలిన చేతితో ఒక వృక్షమును పెల్లగించి తీసికొని రాముని మీదికి ఉరికినాడు. శ్రీరాముడు ఐంద్రాస్త్రమును ప్రయోగించి ఆ రెండవ చేతినికూడ ఖండించినాడు. ఆ చేయి గిరగిర తిరిగి అనేక వానరులను చంపినది. వృక్షములను పడగొట్టినది. కొండలను పిండిచేసినది. కుంభకర్ణుని చేతులు తెగిపోయినను అతడు రామునిపైకి

వచ్చుచున్నాడు. శ్రీరాముడు రెండు అర్ధచంద్రబాణములను ప్రయోగించి కుంభకర్ణుని పాదములను ఛేదించినాడు. ఇంతజరిగినను కుంభకర్ణుడు నోరు తెరచుకొని, దొరలుచు, రామునిపైకి వచ్చినాడు. శ్రీరాముడు కుంభకర్ణుని నోటిలో బాణములు నాటినాడు. అప్పటికిగాని కుంభకర్ణుని నోరు కట్టుబడలేదు.

కుంభకర్ణుడు మాటాడలేక మూర్ఛపోయినాడు. శ్రీరాముడు ఇంద్రనిర్మితమైన ఒక దివ్య బాణమును గైకొని కుంభకర్ణుని శిరస్సును ఖండించినాడు. ఆ శిరస్సు క్రింద పడిన వేగమునకు పురద్వారములు, ప్రాకారములు విరిగి పడిపోయినవి. కుంభకర్ణుని కళేబరముక్రింద కోట్లకొలది వానరులు పడి నలిగిపోయినారు. ఆ కళేబరము సముద్రములో పడి జలజంతువులను చంపినది.

ఈ విధముగా కుంభకర్ణుడు మరణించినాడు. దేవతలు సంతోషించినారు. శ్రీరాముని పరాక్రమమును కొనియాడినారు. వానరులు ఆనందపరవశులై శ్రీరాముని పూజించినారు. వృత్రాసురుని వధించిన ఇంద్రునివలె శ్రీరాముడు ఆనందమును పొందినాడు.

స కుంభకర్ణం సురసంఘ మర్దనం
మహత్సు యుద్ధేషు పరాజితశ్రమమ్
ననంద హత్వా భరతాగ్రజో రణే
మహాసురం వృత్ర మివామరాధిపః 67-166

[కుంభకర్ణుడు ఆకారమును ధరించిన తమస్సు. తమస్సును ఛేదించుట సులభముకాదు. ఇంద్రియముల నన్నింటిని జయింపవలెను. అన్నింటిని ఏకకాలమున జయించుట కష్టము. ఈ విషయము కుంభకర్ణుని వధలో తెలియుచున్నది. ముక్కు, చెవులు, సుగ్రీవుడు ఖండించినాడు. శ్రీరాముడు సైతము చేతులను, కాళ్ళను విడివిడిగా ఖండింపవలసి వచ్చినది. ప్రత్యేక బాణము నోటిలో నాటవలసి వచ్చినది. తరువాతగాని శిరస్సును ఖండించుటకు వీలు కాలేదు. అప్పటికిగాని పర్వతాకారమైన తమస్సు అణగలేదు !]

## రావణుని దుఃఖము

కుంభకర్ణుని మరణ వృత్తాంతమును రాక్షసయోధులు రావణునికి విన్నవించుచున్నారు.

కుంభకర్ణం హతం దృష్ట్వా రాఘవేణ మహాత్మనా
రాక్షసా రాక్షసేంద్రాయ రావణాయ న్యవేదయన్ 68-1

రాక్షసులు: ప్రభూ! యమునివంటి కుంభకర్ణుడు యుద్ధమున గొప్ప పరాక్రమమును ప్రదర్శించి, లెక్కలేని వానరులను హతమొనరించి, తుదకు రామతేజస్సుచేత

శాంతి పొందినాడు. కుంభకర్ణుని శరీరము సగముమాత్రమే కనబడుచున్నది. మిగిలిన సగము సముద్రము ప్రవేశించినది. చేతులు, కాళ్లు, శిరస్సు విడివిడిగా ఖండింపబడినవి. శిరస్సు లంకాద్వారమును అడ్డగించియున్నది.

ఈ వార్త విని రావణుడు మూర్ఛనొంది క్రింద పడిపోయినాడు. దేవాంతకుడు, నరాంతకుడు, త్రిశిరుడు, అతికాయుడు తమ పినతండ్రి మరణవార్తను విని దుఃఖించినారు. మహోదర మహాపార్శ్వులు తమ సోదరుని ఘోరమరణమును గూర్చి దుఃఖించినారు.

రావణుడు మూర్ఛదేరి విలపించుచున్నాడు.

రావణుడు: తమ్ముడా! నీవుకూడ శత్రువుచే వధింపబడితివా! నా హృదయశల్యమును తీసిపుచ్చకయే మరణించితివా!

నా కుడిభుజము పడిపోయినది. దేవతలు, ఋషులు ఇక సంతోషింతురు. వానరులింక శీఘ్రముననే లంకాపురి దుర్గములను, ద్వారములను ఆక్రమించుకొనగలరు.

ఆహా! ఇంద్రుని వజ్రాయుధమును సరకుసేయనివాడవు రామబాణమునకు బలియైతివా! నా కిక రాజ్యముతోగాని, సీతతోగాని నా ప్రాణముతోగాని పని లేదు.

రాజ్యేన నాస్తి మే కార్యం కిం కరిష్యామి సీతయా
కుంభకర్ణ విహీనస్య జీవితే నాస్తి మే రతిః 68-17

నేనుకూడ నా తమ్ముడు పోయిన చోటికే పోయెదను. తమ్ముని విడిచి ఒక్క క్షణముకూడ జీవింపజాలను.

అద్యైవ తం గమిష్యామి దేశం యత్రానుజో మమ
న హి భ్రాతౄన్ సముత్సృజ్య క్షణం జీవితు ముత్సహే 68-19

ఇంతకుమున్ను నాచే అపకారము పొందిన దేవతలు నన్నుచూచి పరిహసింతురు.

దేవా హి మాం హసిష్యంతి దృష్ట్వా పూర్వాపకారిణమ్ 68-20

ఆనాడు విభీషణుడు ఎన్నిచెప్పెనో అన్నియు జరుగుచునేయున్నవి. ఆ మహాత్ముడు చెప్పిన హితవాక్యములను నా అజ్ఞానముచే పాటింపక, ఆ ధార్మికుని అన్యాయముగా వెడలగొట్టితిని. ఆ పాపఫలమును అనుభవించుచున్నాను.

తదిదం మా మనుప్రాప్తం విభీషణ వచ శ్శుభమ్
యదజ్ఞానా న్మయా తస్య న గృహీతం మహాత్మనః 68-21

తస్యాయం కర్మణః ప్రాప్తో విపాకో మమ శోకదః
యన్మయా ధార్మిక శ్రీమాన్ స నిరస్తో విభీషణః 68-23

ఇట్లు పరిపరివిధములుగా విలపించి రావణుడు దుఃఖమును సహింపలేక మూర్ఛ పోయినాడు.

*త్రిశిరుడు*: (తండ్రిని ఊరడించి) పరాక్రమశాలియైన మా పినతండ్రి దైవయోగము వలన యుద్ధములో వీరమరణమును పొందినాడు. దానినిగూర్చి నీవంటి సత్పురుషులు విలపింతురా! నీ వొక్కడవే ముల్లోకములను జయింప గలవు. 'శక్తి', కవచము, ధనుర్బాణములు, రథము వీని నన్నింటిని బ్రహ్మదేవుడు నీ కొసంగియున్నాడు గదా! రాముని జయించుట నీ కసాధ్యమగునా! ఆ పనికి నీవు కూడ అక్కఱలేదు. నేను యుద్ధమాడి నీ శత్రువును రూపుమాపెదను.

ఈ మాటలు విని దేవాంతకుడు, నరాంతకుడు, అతికాయుడు ఉత్సాహపడి వారుకూడ యుద్ధమునకు పూనుకొన్నారు. రావణునికి కొంత ఊపిరి వచ్చినట్లయినది. రావణుని కుమారులైన ఈ నలుగురు సహజ బలసంపన్నులేకాక వారికి వరదాన బలము సైతము కలదు. ఇంతేకాక వారు మాయావిశారదులు.

## త్రిశిరాది వీరులు యుద్ధమునకు వెడలుట

రావణుడు పుత్రులను కపుగిలించుకొని వారికి అలంకారములు చేసి ఆశీర్వదించి యుద్ధమునకు పంపినాడు.

స పుత్రాన్ సంపరిష్వజ్య భూషయిత్వా చ భూషణైః
ఆశీర్భిశ్చ ప్రశస్తాభిః ప్రేషయామాస సంయుగే 69-15

తన తమ్ములైన యుద్ధోన్మత్తుడు (మహోదరుడు) మత్తుడు (మహాపార్శ్వుడు) అనువారిని రావణుడు తన పుత్రుల సహాయార్థము పంపినాడు. ఈ ఆరుగురును రావణునికి ప్రదక్షిణ నమస్కారములు చేసి యుద్ధమునకు వెడలినారు.

మహోదరుడు సుదర్శన మను పేరుగల ఏనుగు నెక్కి అస్తగిరిమీది సూర్యునివలె ప్రకాశించినాడు. త్రిశిరుడు తన మూడు శిరస్సులపై మూడు కిరీటములను ధరించి, ధనుర్బాణములు గైకొని రథముమీద బయలుదేరినాడు. అతికాయుడు తన విశాల రథముమీద వెడలినాడు. నరాంతకుడు ఒక ప్రాసమును తీసికొని ఒక తెల్లని గుఱ్ఱముమీద సాగినాడు. దేవాంతకుడు ఒక పరిఘమును, మహాపార్శ్వుడు ఒక గదను ధరించి రథముల నెక్కి కదలినారు.

అందరును మహావీరులు. యుద్ధమున మరణించుటయో, లేక శత్రువును జయించుటయో తమ కర్తవ్య మని నిశ్చయించుకొని సైన్య సమేతులై రణరంగము చేరినారు.

మరణం వాపి నిశ్చిత్య శత్రూణాం వా పరాజయమ్ 69-37

వానరులు పర్వతశిఖరములను, వృక్షములను గైకొని యుద్ధమునకు సిద్ధముగా నున్నారు. ఇరుపక్షములవారు సింహగర్జనలు చేసినారు. రాక్షసులకు వానరులకు ఘోర యుద్ధము జరిగినది.

తద్యుద్ధ మభవ ద్ఘోరం రక్షోవానర సంకులమ్ 69-48

వానరులయొక్కయు రాక్షసులయొక్కయు కళేబరములతోను, ఆయుధముల తోను, విరిగిన రథములతోను, చచ్చిపడియున్న ఏనుగులతోను గుఱ్ఱములతోను యుద్ధ భూమి నిండిపోయినది. రక్తనదులు ప్రవహించుచున్నవి.

## అంగదుడు నరాంతకుని వధించుట

నరాంతకుడు ఒక శక్తిని గైకొని గుఱ్ఱమునెక్కి వానర సైన్యములో ప్రవేశించి విజృంభించినాడు. అనేక వానరులను వధించినాడు. వానరసైనికులు దశదిశలకు పరు గెత్తినారు. ఈ సంక్షోభమును సుగ్రీవుడు చూచి అంగదుని పిలిచి "అంగదా! నీవు పోయి ఆ రాక్షసుని వధింపుము" అన్నాడు.

అంగదుడు నరాంతకుని తలపడినాడు. నరాంతకుడు అంగదుని మీదికి ప్రాసము విసిరినాడు కాని అది అంగదుని రొమ్ము తాకి విరిగి పడిపోయినది. అంగదుడు తన చేతితో నరాంతకుని గుఱ్ఱమును కొట్టి చంపినాడు. ఇద్దరును పిడికిళ్ళతో కొట్టుకొన్నారు. అంగదుని పిడికిలిపోటునకు నరాంతకుడు క్రిందపడి మరణించినాడు. శ్రీరాముడు అంగదుని ప్రశంసించినాడు.

## అంగదుడు రాక్షసవీరులతో పోరుట

అంగదుడు యుద్ధమునకు మరల సిద్ధమైనాడు. మహోదరుడు, దేవాంతకుడు, త్రిశిరుడు అంగదునిపైకి వచ్చినారు. అంగదుడు చలింపక ముగ్గురితోను ఏకకాలములో యుద్ధము చేసినాడు.

స త్రిభి ర్నైరృతశ్రేష్ఠై ర్యుగప త్సమభిద్రుతః
న వివ్యథే మహాతేజా వాలిపుత్రః ప్రతాపవాన్ 70-12

ఒక్కపోటు పొడిచి మహోదరుని యేనుగును చంపినాడు. ఏనుగు దంతము నూడబెరికి దానితో దేవాంతకుని కొట్టగా ముగ్గురు రాక్షసులును అంగదుని చుట్టు ముట్టినారు. హనుమంతుడు, నీలుడు, అంగదుని పాటు చూచి అతనికి తోడువచ్చినారు.

## హనుమంతుడు దేవాంతకుని వధించుట

హనుమంతుడు తన పిడికిలితో దేవాంతకుని శిరస్సు మర్దించినాడు. ఆ పిడికిటి పోటు ధాటికి దేవాంతకుని తల బ్రద్దలై పోయినది. ఈ విధముగా దేవాంతకుడు మరణించినాడు.

## నీలుడు మహోదరుని వధించుట

మహోదరుడు మరియొక యేనుగు నెక్కివచ్చి నీలునిపై బాణవర్షము కురిపించినాడు. ఆపాదమస్తకము తగిలిన గాయములవలన నీలుడు అటునిటు కదలజాలక పోయినాడు. కొంత సేపటికి తేరుకొని ఒక పర్వతశిఖరమును మహోదరునిపై విసరగా ఆ దెబ్బకు మహోదరుడు ఏనుగుతోకూడ క్రిందికి కూలి చనిపోయినాడు.

## హనుమంతుడు త్రిశిరుని వధించుట

త్రిశిరుడు ధనుస్సు గ్రహించి హనుమంతునితో తలపడినాడు. ఇరువురికిని ప్రచండ యుద్ధము జరిగినది. త్రిశిరుడు తన 'శక్తి'ని గైకొని హనుమంతునిపై ప్రయోగింపగా హనుమంతుడు ఆ శక్తిని తన చేతితో పట్టుకొని విరిచివైచినాడు. త్రిశిరుడు ఖడ్గమును గొని హనుమంతుని వక్షమున కొట్టినాడు. హనుమంతుడు క్రోధపరవశుడై త్రిశిరుని రొమ్మును అరచేత చరచినంతనే త్రిశిరుడు మూర్ఛపోయి క్రిందపడినాడు. ఖడ్గము చేతిలోనుండి జారి క్రింద పడిపోయినది. హనుమంతుడు ఆ ఖడ్గమును తీసికొని సింహనాదము చేయగా త్రిశిరుడు లేచి హనుమంతుని ఒక పోటు పొడిచినాడు. అంతట హనుమంతుడు ఖడ్గముతో త్రిశిరుని మూడుశిరములను ఖండించినాడు.

## ఋషభుడు మహాపార్శ్వుని వధించుట

త్రిశిరుడు చనిపోవుటను మహాపార్శ్వుడు చూచి సహింపలేక గదను గైకొని వానరులపై బడి విజృంభించినాడు. ఋషభుడు మహాపార్శ్వుని మీదికి దూకగా మహాపార్శ్వుడు తన గదతో ఋషభుని రొమ్మును పగులగొట్టినాడు. ఋషభుడు మూర్ఛిల్లి కొంతసేపటికి తేరి మహాపార్శ్వుని గదను లాగి తీసికొని దానితో మోదగా మహాపార్శ్వుడు ప్రాణములు విడిచినాడు.

## లక్ష్మణుడు అతికాయుని వధించుట

రాక్షసులు పరుగులెత్తసాగినారు. ఈ సంక్షోభమును అతికాయుడు చూచినాడు. అతికాయుడు సామాన్యుడుకాడు. మహావీరుడు. బ్రహ్మయొద్ద వరములు పొందినవాడు. రథారూఢుడై ధనుర్ధారియై తనపేరు చెప్పుకొనుచు, సింహనాదము చేయుచు

వానరులమీదికి దూకినాడు. వానరులు అతికాయుని చూచి "కుంభకర్ణుడు మరల బ్రతికివచ్చినట్టున్నది" అని భావించి ఎక్కడివారక్కడ పాటిపోవుచున్నారు. కొందరు రాముని శరణుజొచ్చినారు.

శ్రీరాముడు దూరమునుండి అతికాయుని చూచి ఆశ్చర్యపడినాడు.

*రాముడు* : విభీషణా ! ఎవ్వడీ పర్వతాకారుడు ! వేయిగుఱ్ఱములు పూన్చిన విశాల రథములో వచ్చుచున్నాడు. నలుగురు సారథులున్నారు. ఇతని ధనుస్సు ఇంద్రధనుస్సుకు సాటివచ్చుచున్నది. రథమునందు ముప్పదియెనిమిది తూణీరములు, ధనుస్సులు అల్లెత్రాళ్లు ఉన్నవి. పదిచేతుల నిడివిగల రెండు ఖడ్గములున్నవి. ఈ రాక్షసోత్తము డెవ్వడు ?

*విభీషణుడు* : ఇతడు రావణుని కుమారుడు. ఇతనితల్లి ధాన్యమాలిని. పేరు అతికాయుడు. రావణునికి సాటివచ్చు వీరుడు. అస్త్రవేత్త. శాస్త్రములను చక్కగా చదివినవాడు. వృద్ధుల సేవ చేయువాడు. రాజనీతి పండితుడు. ఇతని బాహుబలము నాశ్రయించుకొనియే లంకాపురి నిర్భయముగా నున్నది.

యస్య బాహూ సమాశ్రిత్య లంకా వసతి నిర్భయా
తనయం ధాన్యమాలిన్యా అతికాయమిమం విదుః 71-30

ఇతడు బ్రహ్మనుగూర్చి తపస్సు చేసి బ్రహ్మవలన అస్త్రములను పొందినవాడు. సురాసురులచే మరణము కలుగకుండునట్లు వరమును పొందినాడు. ఇతని దివ్యరథకవచములు బ్రహ్మప్రసాదములు. ఇతడు అనేక పర్యాయములు దేవదానవులను జయించియున్నాడు. దేవేంద్రుని వజ్రాయుధమును స్తంభింప జేసిన వీరుడు. ఇతని తుదముట్టించుటకు వెంటనే ప్రయత్నము చేయవలయును. లేనియెడల వానరసైన్యములన్నియు ఇతని బాణములకు ఆహుతి కాగలవు.

తదస్మిన్ క్రియతాం యత్నః క్షిప్రం పురుషపుంగవ
పురా వానరసైన్యాని క్షయం నయతి సాయకైః 71-36

అతికాయుడు కపిసైన్యములో ప్రవేశించి విక్రమించినాడు. కపివీరులైన కుముదుడు, ద్వివిదుడు, మైందుడు, నీలుడు, శరభుడు ఏకమై అతికాయుని ధైర్యముగా ఎదుర్కొన్నారు. వారు ప్రయోగించిన పర్వతశిఖరములను, వృక్షములను అతికాయుడు తన బాణములతో ఛేదించినాడు. వానరులమీద శరవర్షమును కురిపించినాడు. వానరులు ఆ ధాటికి నిలువజాలక పారిపోయినారు. పారిపోవుచున్నవారిని మర్దించుటకు ఇష్టపడక అతికాయుడు రాముని సమీపించి సగర్వముగా అనుచున్నాడు.

**అతికాయుడు :** నేను ధనుర్బాణములను ధరించి సిద్ధముగా నున్నాను. అల్పులతో యుద్ధ మాడుట నా కిష్టములేదు. మీలో ఎవ్వడైన ఉత్సాహవంతు డున్నచో నాతో యుద్ధమునకు రమ్మనుము.

రథే స్థితోఽహం శరచాపపాణి
ర్న ప్రాకృతం కంచన యోధయామి
యశ్చాస్తి కశ్చి ద్వ్యవసాయ యుక్తో
దదాతు మే క్షిప్ర మిహాద్య యుద్ధమ్ 71-45

ఈ గర్వపు పలుకులకు లక్ష్మణుడు రోషించి ధనుస్సు 'గైకొని టంకార మొనర్చి నాడు. లక్ష్మణుని జ్యాఘోషము భూమ్యాకాశములు, పర్వతములు, సప్తసముద్రములు, దశదిశలు నిండిపోయినది. ఆ శబ్దమును విన్న రాక్షసుల గుండియలు అదరిపోయినవి.

పూరయన్ స మహీం శైలా నాకాశం సాగరం దిశః
జ్యాశబ్దో లక్ష్మణస్యోగ్ర స్త్రాసయన్ రజనీచరాన్ 71-48

అతికాయుడుసైతము ఈ శబ్దమును విని ఆశ్చర్యచకితుడైనాడు. కోపప్రకంపితుడై బాణము గైకొని లక్ష్మణునితో అనుచున్నాడు.

**అతికాయుడు :** లక్ష్మణా ! నీవు బాలుడవు. పరాక్రమముతో పరిచయము లేనివాడవు. నేను మృత్యువువంటివాడనుసుమా ! నాతో నీకేటికి ఈ రణవ్యవహారము ! ఆ ధనుస్సు నక్కడ వదలిపెట్టి పొమ్ము. నా చేతిలో బడి ఎందుకు మరణింతువు !

నా మాటలు నీ కింపుగానిచో, ఇదిగో బాణము వేయుచున్నాను. శక్తి గలదేని రక్షించుకొనుము.

**లక్ష్మణుడు :** ఓరీ వాచాలా ! మాటలచే ఎవ్వడేని శూరుడు కాగలడా ! నేను సిద్ధముగా నున్నాను. చేతనైనచో నీ బలమును ప్రదర్శింపుము. నీవు సర్వాయుధములతో కూడిన రథములో నున్నావు. శస్త్రములుగాని, అస్త్రములుగాని, నీ యిష్టము వచ్చిన వానిని ప్రయోగింపుము. అటుపిమ్మట నీ శిరస్సు ఖండించెదను. పక్వమైన తాళఫలము గాలికి క్రింద పడునట్లు నీ శిరము నీ శరీరమునుండి పడిపోగలదు. నేను బాలుడ నని అవజ్ఞ చేయకుము. బాలుడను కానిమ్ము, వృద్ధుడను కానిమ్ము, నేను యుద్ధమున నీకు మృత్యువు నని గ్రహింపుము. త్రివిక్రమావతారమున ముల్లోకములను మూడడుగులతో ఆక్రమించిన విష్ణుమూర్తి బాలుడు కాడా !

**బాలోఽయమితి విజ్ఞాయ న మావజ్ఞాతు మర్హసి**
**బాలో వా యది వా వృద్ధో మృత్యుం జానీహి సంయుగే** 71-63

**బాలేన విష్ణునా లోకా స్త్రయః క్రాంతా స్త్రిభిః క్రమైః** 71-64

అతికాయ లక్ష్మణులకు యుద్ధము ప్రారంభమైనది. విద్యాధరులు, దేవతలు, ఋషులు, దానవులు ఆ యుద్ధమును చూడవచ్చినారు. ఇద్దరును, వారికి సుపరిచితములైన బాణములను ప్రయోగించుచున్నారు. ఒకని బాణములను ఒకడు ఖండించుచున్నాడు. లక్ష్మణుడు అతికాయుని లలాటమున ఒక బాణము వేయగా లలాటము నుండి రక్తము ప్రవహించినది. అతికాయుడు చలించి శత్రువును మెచ్చుకొన్నాడు; కోపించి, లక్ష్మణునిపై శరపరంపర కురిపించినాడు. ఆ బాణముల నన్నింటిని లక్ష్మణుడు నివారించినాడు. అతికాయుడు తీక్ష్ణమైన బాణ మొకటి తీసి లక్ష్మణుని వక్షమున నాట నేయగా లక్ష్మణుని రొమ్మునుండి రక్తము స్రవించినది. లక్ష్మణుడు తన శరీరమున నాటుకొనియున్న బాణమును లాగివైచి తన బాణ మొక్కటి తీసి ఆగ్నేయాస్త్రముతో అభిమంత్రించి ప్రయోగించినాడు. అంతట, అతికాయుడు సౌరాస్త్రమును ప్రయోగించినాడు. రెండును ఒండొంటిని దహించుకొని భస్మమై క్రింద పడినవి. అతికాయుడు ఐషీకాస్త్రమును ప్రయోగింపగా దానిని లక్ష్మణుడు ఐంద్రాస్త్రముతో నశింప జేసినాడు. అతికాయుడు యామ్యాస్త్రమును ప్రయోగింపగా లక్ష్మణుడు దానిని వాయవ్యాస్త్రముతో శమింప జేసినాడు. లక్ష్మణుడు అతికాయునిమీద శరపరంపరలు ప్రయోగించినాడు కాని ఆ బాణము లన్నియు అతికాయుని కవచము తాకి కొనలు విరిగి క్రింద పడిపోయినవి. అతికాయుని కవచము అభేద్యము కావున లక్ష్మణుని బాణములవలన రాక్షసునికి బాధ కలుగలేదు. అప్పుడు వాయుదేవుడు లక్ష్మణుని సన్నిధికి వచ్చి "లక్ష్మణా! అతికాయుడు బ్రహ్మదత్తమైన అభేద్య కవచమును ధరించి యున్నాడు. వానిని బ్రహ్మాస్త్రముతో వధింపవలసినదే కాని మరియొక అస్త్రము ఉపయోగపడదు" అని చెప్పినాడు.

అథైన మభ్యుపాగమ్య వాయు ర్వాక్య మువాచ హ 71-98

బ్రహ్మదత్తవరో హ్యేషః అవధ్యకవచావృతః
బ్రాహ్మేణాస్త్రేణ భింధ్యేన మేష వధ్యో హి నాన్యథా 71-99

అవధ్య ఏష హ్యన్యేషా మస్త్రాణాం కవచీ బలీ 71-100

[వాయుదేవుడు ఎప్పుడైన మన చెవిలో ఊదుటయును కలదు. అనగా మనకు ఆలోచన స్ఫురించుటయే. అట్లు స్ఫురింపజేయుట వాయుదేవుని ప్రసాదమే!]

వాయుదేవుని మాట పాటించి లక్ష్మణుడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించినాడు. సూర్యచంద్రులు చలించినారు. ఇతర గ్రహములు భీతిల్లినవి. భూమి కంపించినది. అతికాయుడు ఆ బాణమును నివారించుటకు గొప్ప ప్రయత్నము చేసినాడు. శక్తులు, గదలు, కుఠారములు, శూలములు మొదలైన ఆయుధములను ప్రయోగించినాడు.

కాని అవి యేవియు ఉపయోగపడలేదు. అన్నియు వ్యర్థమైనవి. లక్ష్మణుని బాణము అతికాయుని శిరమును కిరీటసహితముగా ఖండించినది. అతికాయుని శిరస్సు నేలమీద పడినది. రాక్షసులు లంకలోనికి పరుగెత్తినారు.

వానరుల ముఖములు పద్మములవలె వికసించినవి. ఎల్లరును లక్ష్మణుని పూజించినారు.

ప్రహర్షయుక్తా బహవస్తు వానరాః
ప్రబుద్ధ పద్మప్రతిమాననా స్తదా
అపూజయన్ లక్ష్మణ మిష్టభాగినం
హతే రిపౌ భీమబలే దురాసదే 71-111

## రావణుని పరితాపము

రావణుడు అతికాయుని మరణవార్త విని దుఃఖములో మునిగిపోయినాడు.

*రావణుడు* : ఆహా ! పరాజయ మెట్టిదో తెలియని మేటివీరులు, ఇంద్రుని జయించినవారు రామునిచే వధింపబడినారు ! ధూమ్రాక్షుడు, అకంపనుడు, ప్రహస్తుడు, కుంభకర్ణుడు మున్నగు వీరాగ్రేసరులు, అస్త్రవిశారదులు అందరును హతమైనారు. ప్రఖ్యాత బలపరాక్రమ సంపన్నుడైన ఇంద్రజిత్తు ప్రయోగించిన నాగపాశమును సైతము రామలక్ష్మణులు విడిపించుకొన్నా రనగా అది వారి ప్రభావమో, మాయయో, మోసమో తెలియుటలేదు.

[మోసగాని ఆలోచన లన్నియు ఈ వరుసనే యుండును.]

తన్న జానే ప్రభావైర్వా మాయయా మోహనేన వా
శరబంధా ద్విముక్తౌ తౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ 72-7

నామాట చొప్పున యుద్ధమునకుపోయిన రాక్షసు డెవ్వడును మరలివచ్చుటలేదు. అందరును హతు లగుచున్నారు. లక్ష్మణ, సుగ్రీవ, విభీషణ సహితుడైన రాముని శాసింపగల రాక్షసవీరు డెవ్వడును నా కంటికి కనిపించుటలేదు. రాముని పరాక్రమము అద్భుతముగా నున్నది. రాముని అపార శస్త్రాస్త్రబలమునకు ఎందరు రాక్షసులు బలియైనారు ! రాముడు నాశరహితుడైన నారాయణుడే యని తోచుచున్నది. రామునికి భయపడికదా లంకాద్వారములను బంధింపవలసి వచ్చినది !

తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్
తద్భయాద్ధి పురీలంకా పిహిత ద్వార తోరణా. 72-11

రాక్షసులారా! మీ రందరు అప్రమత్తులై యుండి లంకాపురిని రక్షింపుడు. సీతను భద్రపరిచియున్న అశోకవనములోనికి ప్రవేశించువారిని, నిర్గమించువారిని కనిపెట్టి మాకు తెలియపరచవలయును.

అశోకవనికాయాం చ యత్ర సీతాభిరక్ష్యతే
నిష్క్రామో వా ప్రవేశో వా జ్ఞాతవ్య స్సర్వథైవ నః. 72-13

వానరులను సాయంకాలము లందును, అర్ధరాత్రులందును, ప్రాతఃకాలము లందును, ఇంతయేల అన్నివేళలయందును మెలకువతో కనిపెట్టియుండుడు. మనసేనలను నిలిపియుండు ప్రదేశములందు ఎక్కువ జాగరూకులై యుండుడు.

ఇట్లు ఉత్తరువు లిచ్చి రావణుడు దీనుడై పుత్రశోకముతో నిట్టూర్పులు విడుచుచు తన మందిరము ప్రవేశించినాడు.

మన్యుశల్యం వహ౯ దీనః ప్రవివేశ స్వమాలయమ్. 72-18

ఇంద్రజిత్తు తన తండ్రిని ఓదార్చుచున్నాడు.

**ఇంద్రజిత్తు :** తండ్రీ! నేను బ్రతికియుండగా నీ విట్లు దుఃఖపడకుము. ఇదిగో! దైవబల పౌరుష విశేష సమేతుడైన యీ ఇంద్రజిత్తు ప్రతిజ్ఞను వినుము. ఇప్పుడే రామ లక్ష్మణులను అమోఘములైన నా బాణములకు బలి గావింతును.

ఇమాం ప్రతిజ్ఞాం శృణు శత్రుశత్రో
స్సునిశ్చితాం పౌరుషదైవయుక్తాం
అద్యైవ రామం సహ లక్ష్మణేన
సంతర్పయిష్యామి శరై రమోఘైః. 73-6

బలిచక్రవర్తి యజ్ఞవాటికలో విష్ణుదేవుడు ప్రదర్శించిన పరాక్రమమునకు సరి వచ్చు నా పరాక్రమమును దేవతలు, సూర్యచంద్రులు, సమస్త భూతములును ఇప్పుడు చూడగలరు.

## ఇంద్రజిత్తు యుద్ధమునకు వెడలుట

ఈ పౌరుషవాక్యములు పలికి ఇంద్రజిత్తు తండ్రి అనుజ్ఞ వడసి ఖరశ్రేష్ఠ యుక్తమైన రథము నెక్కి సైన్యసమేతుడై యుద్ధరంగమునకు బయలుదేరినాడు. యుద్ధ భూమియందు తన రథమునకు రాక్షసులను కావలియుంచి హోమము చేయుట కరిగినాడు.

స సంప్రాప్య మహాతేజా యుద్ధభూమి మరిందమః
స్థాపయామాస రక్షాంసి రథం ప్రతి సమంతతః. 73-16

ఇంద్రజిత్తు యథాశాస్త్రముగా, మంత్రపూర్వకముగా, అగ్నిహోత్రమునందు హోమము కావించినాడు. బ్రతికియున్న నల్లమేకను పశువుగా బంధించి హోమ మొనర్చినాడు. అగ్నిశిఖలు విజయసూచకములై ప్రదక్షిణముగా వర్తిల్లినవి. అప్పుడు ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమును జపించి రథమును, ధనుస్సును, మున్నగు యుద్ధపరికరములను ఆ యస్త్రముతో అభిమంత్రించినాడు.

సోఽస్త్రమాహారయామాస బ్రాహ్మ మింద్రరిపు స్తదా
ధనుశ్చాత్మరథం చైవ సర్వం తత్రాభ్యమంత్రయత్. 73-23

ఇంద్రజిత్తు ధనుర్బాణ ఖడ్గ రథాశ్వ సారథి సహితముగా ఆకసమున అంతర్ధానమయినాడు.

స పావకం పావకదీప్త తేజా
హుత్వా మహేంద్రప్రతిమ ప్రభావః
సచాప బాణాసి రథాశ్వ సూతః
ఖేంతర్దధేఽఽత్మాన మచింత్యరూపః. 73-25

ఇంద్రజిత్తు సైన్యము యుద్ధభూమికి ఉత్సాహముతో నడిచినది. రాక్షసులు వానరులమీద శరవర్షము కురిపించినారు. ఇంద్రజిత్తు బాణములను ప్రయోగించి వానరులను లెక్కకు మిక్కుటముగా వధించుచున్నాడు. శ్రీరామ కార్యార్థమై వానరులు తమ ప్రాణములను సరకుసేయక తెంపు వహించి పోరుచున్నారు. ఇంద్రజిత్తుపై శిలావర్షమును, వృక్ష వర్షమును కురిపించినారు. ఇంద్రజిత్తు వాని నన్నింటిని తన బాణములతో నివారించి వానరులను రూపుమాపుచున్నాడు. గంధమాదనునిపై పదునెనిమిది బాణములు, నలునిపై తొమ్మిది, మైందునిమీద ఏడు, గజునిమీద అయిదు, బాణములు వేసి నొప్పించినాడు. సుగ్రీవుడు, ఋషభుడు, అంగదుడు, ద్వివిదుడు, వీరిమీద వర ప్రభావముగల బాణములు ప్రయోగించి వారిని మూర్ఛిల్లజేసినాడు. ఇంకను బాణములు వేసి వానరసైన్యమును చించి చెండాడినాడు. వానరయోధులు మూర్ఛితులై చేష్టలుదక్కియుండుట చూచి ఇంద్రజిత్తు సంతోషించినాడు. ఇంద్రజిత్తు బాణములు మాత్రము వానరులమీద పడుచున్నవేగాని ఇంద్రజిత్తు కన్నులకు కనిపించుటలేదు. ఆకసమువైపు దృష్టిని సారించిన వానరుల నేత్రములలో బాణములు గ్రుచ్చుకొనుచున్నవి.

హనుమంతుడు, సుగ్రీవుడు, అంగదుడు, జాంబవంతుడు, నలుడు, కుముదుడు, కేసరి, నీలుడు, గజుడు, గవాక్షుడు, వీరు వారు అనక అందరిని ఇంద్రజిత్తు బాణపీడితులను చేసినాడు. రామలక్ష్మణులపై బాణవర్షమును కురిపించినాడు.

స వై గదాభి ర్హరియూథముఖ్యా
న్నిర్భిద్య బాణై స్తపనీయపుంఖైః
వవర్ష రామం శరవృష్టిజాలై
స్సలక్ష్మణం భాస్కరరశ్మి కల్పైః. 73.

రాముడు : లక్ష్మణా! ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమును ఆశ్రయించి వానరసైన్యమును సంహరించుచు మనపై బాణములు కుప్పించుచున్నాడు. అతడు మన కంటికి కావచ్చుటలేదు. కావున అతని వధించుట ఇప్పుడు సాధ్యముకాదు. బ్రహ్మదేవ ప్రభావము అమోఘము కాబట్టి ఈ సమయమున నీవుకూడ నాతోపాటు బాణపాతమును ఓర్చుకొనుము.

మన్యే స్వయంభూ ర్భగవా నచింత్యో
యస్యైతదస్త్రం ప్రభవశ్చ యోఽస్య
బాణావపాతాం స్త్వమిహాద్య ధీమన్
మయా సహావ్యగ్రమనా స్సహస్వ. 73.

మనము మూర్ఛితులమై పడియుండుట చూచి ఇంద్రజిత్తు యుద్ధమును చాలించి జయానందముతో లంకకు మరలిపోగలడు.

ఆవాం తు దృష్ట్వా పతితౌ విసంజ్ఞౌ
నివృత్తయుద్ధో గత రోషహర్షో
ధ్రువం ప్రవేక్ష్య త్యమరారివాస
మసౌ సమాదాయ రణాగ్రలక్ష్మీమ్. 73.

రామలక్ష్మణులు ఇంద్రజిత్తు బాణములవలన బాధపడుచు పడిపోయినారు. వానరులును, రామలక్ష్మణులును, మూర్ఛితులై పడియుండుట చూచి ఇంద్రజిత్తు లంకలో పోయినాడు.

విభీషణుడు రామలక్ష్మణుల పాటును చూచినాడు. వానరసైన్యము పడిపోయుండుటయు చూచి వానరులకు ధైర్యము చెప్పుచున్నాడు.

విభీషణుడు : వానరులారా! భయపడకుడు. బ్రహ్మాస్త్రమును గౌరవించుటకు రామలక్ష్మణులు మూర్ఛితులైనారు. ఇప్పుడే తేరుకొనగలరు. మీరు ధైర్యావహింపుడు.

బ్రహ్మాస్త్రమును గౌరవించుటకై పడియుండిన హనుమంతుడు విభీషణ మాటలు విన్నాడు.

**హనుమంతుడు :** విభీషణా ! ఈ వానరు లందరు పడియున్నారు. వీరిలో బ్రతికియున్నవా రెవరైనను కలరేమో చూచి ఆశ్వాసించుట మంచిది. మన మిరువురము బయలుదేరుదము రమ్ము.

రాత్రివేళ గనుక ఇద్దరు దివిటీలను పట్టుకొని వెదకసాగినారు.

తావుభౌ యుగపద్వీరౌ హనుమద్రాక్షసోత్తమౌ
ఉల్కాహస్తౌ తదా రాత్రౌ రణశీర్షే విచేరతుః. 74-7

ఎక్కడ చూచినను వాలములు తెగినవారు, కాళ్ళుచేతులు తెగినవారు, మెడలు తెగినవారు, యుద్ధభూమియందు పడియున్నారు. ఇంద్రజిత్తు అరువదియేడుకోట్ల వానరులను ఒక్క సాయంకాలము అయిదు గడియలలో వధించినాడు.

సప్తషష్టి ర్హతాః కోట్యో వానరాణాం తరస్వినామ్
అహ్నః పంచమశేషేణ వల్లభేన స్వయంభువః. 74-12

హనుమంతుడును, విభీషణుడును వృద్ధుడైన జాంబవంతుని వెదకినారు. ఇట్లు వెదకుటలో, జాంబవంతుడు ఒకచోట కానవచ్చినాడు. శరీరమునిండ బాణములు గ్రుచ్చుకొనగా బాధపడుచుండినాడు. విభీషణుడు జాంబవంతుని సమీపించి పలుకరించినాడు.

**విభీషణుడు :** జాంబవంతుడా ! ఈ బాణములు నీ ప్రాణములను హరింపలేదుగద !

జాంబవంతునికి మాటకూడ సరిగా రాలేదు. కష్టపడి హీనస్వరముతో,

**జాంబవంతుడు :** ఈ బాణములవలన నాకు కన్నులు కనిపించుటలేదు. నీ కంఠస్వరమును బట్టి నిన్ను పోల్చుకొన్నాను. నీవు విభీషణుడవేనా ! విభీషణా ! వానరోత్తముడైన హనుమంతుడు జీవించియున్నాడా ?

నైరృతేంద్ర మహావీర్య స్వరేణ త్వాభిలక్షయే
పీడ్యమాన శ్శితై ర్బాణై ర్నత్వాం పశ్యామి చక్షుషా. 74-17

అంజనా సుప్రజా యేన మాతరిశ్వా స నైరృత
హనుమా న్వానరశ్రేష్ఠః ప్రాణాన్ ధారయతే క్వచిత్. 74-18

**విభీషణుడు :** జాంబవంతుడా ! ఇదియేమి ! రామలక్ష్మణుల క్షేమమును గూర్చి సైతము అడుగక హనుమంతుని క్షేమమునుగూర్చి అడుగుచున్నావేమి ? ప్రభువైన సుగ్రీవునిమీదగాని, యువరాజైన అంగదునిమీదగాని రామలక్ష్మణుల యందుగాని హనుమంతుని పట్ల ప్రదర్శించు స్నేహమును ప్రదర్శింపకున్నావేల ?

ఆర్యపుత్రావతిక్రమ్య కస్మా త్పృచ్ఛసి మారుతిమ్. 74-19

నైవ రాజని సుగ్రీవే నాంగదే నాపి రాఘవే
ఆర్య సందర్శిత స్స్నేహో యథా వాయుసుతే పరః. 74-20

*జాంబవంతుడు :* విభీషణా ! దానికి గొప్పకారణమున్నది. వినుము. హనుమంతుడొక్కడు బ్రతికియున్నచో సైన్య మంతయు మరణించినను బ్రతికియున్నట్టే తలంపుము. హనుమంతుడు మరణించునేని మన మందరము బ్రతికియుండియు చనిపోయిన వారమే అగుచున్నాము. హనుమంతుడు వాయుదేవునికి సరివచ్చువాడు. అగ్ని దేవునివంటి పరాక్రమవంతుడు. ఆ మహావీరుడు జీవించియుండునేని మాకు జీవితాశ కలుగును.

తస్మిఞ్జీవతి వీరే తు హతమప్యహతం బలం
హనుమత్యుజ్ఝితప్రాణే జీవంతోపి వయం హతాః. 74-22

ధరతే మారుతి స్తాత మారుతప్రతిమో యది
వైశ్వానరసమో వీర్యే జీవితాశా తతో భవేత్. 74-23

[ఈ మాట లన్నియు హనుమంతుడు వినుచున్నాడు. ఎంత ఆనందించెనో హనుమంతునికే తెలియవలయును. మనముకూడ ఊహింపవచ్చును]

*హనుమంతుడు :* (జాంబవంతుని పాదములు పట్టుకొని నమస్కరించి) హనుమంతుడను; నీకు నమస్కరించుచున్నాను.

కంఠస్వరమునుబట్టి జాంబవంతుడు హనుమంతుని గుర్తించినాడు. జాంబవంతునికి ప్రాణము లేచివచ్చిన ట్లయినది.

*జాంబవంతుడు :* హనుమా ! వచ్చితివా నాయనా ! రా రమ్ము. నీ విప్పుడు మనవారి నందరను రక్షింపవలయును. నీవుతప్ప ఇతరు లెవ్వరును ఈ కార్యమును సాధింపలేరు. నీ పరాక్రమమును ప్రదర్శింపవలసిన సమయము వచ్చినది. ఈ వానరసైన్యమును, రామలక్ష్మణులను విశల్యుల జేయుటకు నీవే సమర్థుడవు. నీవు కార్యదీక్ష పూని మా కందరకు సంతోషము కలుగజేయుము.

నాన్యో విక్రమపర్యాప్త స్త్వమేషాం పరమ స్సఖా
త్వత్పరాక్రమకాలోయం నాన్యం పశ్యామి కంచన. 74-27

ఋక్షవానర వీరాణా మనీకాని ప్రహర్షయ
విశల్యౌ కురు చాప్యేతౌ సాదితౌ రామలక్ష్మణౌ. 74-28

హనుమా ! నీవు సముద్రముమీదుగా ప్రయాణము చేసి హిమాలయమునకు వెడలుము. అక్కడ రెండుశిఖరము లున్నవి. ఒకటి కాంచనశిఖరము. రెండవది కైలాస

శిఖరము. వాని నడుమ ఓషధిపర్వత మున్నది. ఆ పర్వతశిఖరముపై దేదీప్యమానముగా ప్రకాశించు నాలుగు ఓషధు లున్నవి. మృతసంజీవని, విశల్యకరణి, సౌవర్ణకరణి, సంధాన కరణి. ఈ నాలుగు ఓషధులను తీసికొని వేగిరము రమ్ము. గంధవహుని పుత్రుడవైన నీవు వానరు లందరకును ప్రాణదానము చేయుము.

[ప్రాణమునకు ఆధారము వాయువే కదా! కావున ఈ సందర్భమున హనుమంతుని వాయుపుత్రునిగా సంబోధించుట సొంపుగాను అర్థవంతముగాను ఉన్నది]

ఆశ్వాసయ హరీన్ ప్రాణైర్యోజ్య గంధవహాత్మజ. 74-34

## హనుమంతుడు ఓషధిపర్వతమును కొనివచ్చుట

హనుమంతుడు లంకామలయపర్వతము నెక్కి శరీరమును పెద్దదికావించి సింహ నాదము చేసినాడు. ఆ శబ్దమును విని రాక్షసులు భయపడి నిశ్చేష్టులైనారు. హను మంతుడు పైకెగురుటకు కావలసిన వేగమును అలవరచుకొన్నాడు. ఆ వేగమునకు పర్వతము ముక్కలైనది. లంకాపురి అదరినది. అక్కడి గృహములు, గోపురములు కంపించి విరిగిపడినవి.

శ్రీరామకార్యమును చేయబూని హనుమంతుడు శ్రీరామునికి నమస్కరించినాడు.

నమస్కృత్వాథ రామాయ మారుతి ర్భీమవిక్రమః
రాఘవార్థే పరం కర్మ సమీహత పరంతపః. 74-48

హనుమంతుడు సర్పమువంటి తోకను పైకెత్తి, వీపును వంచి, చెవులను ముడుచు కొని, నోటిని తెరచి, ఆకసమున కెగిరినాడు.

స పుచ్ఛ ముద్యమ్య భుజంగకల్పమ్
వినమ్య పృష్ఠం శ్రవణే నికుంచ్య
వివృత్య వక్త్రం బడబాముఖాభ
మాపుప్లువే వ్యోమని చండవేగః. 74-49

విష్ణుదేవుని హస్తమునుండి వెడలిన చక్రము చందమున పోవుచున్నాడు.

చక్రం యథా విష్ణుకరాగ్రముక్తమ్. 74-52

సముద్రము, పర్వతములు, నదులు, అడవులు, నగరములు, జనపదములు, అన్నిం టిని తిలకించుచు హనుమంతుడు వాయువేగముతో ప్రయాణము చేసి హిమాలయ మును చేరినాడు. అచ్చట ఋషుల ఆశ్రమములను, బ్రహ్మకోశక్షేత్రము, కైలాస పర్వతము, బ్రహ్మకపాలము, కుబేరుని స్థానము, బ్రహ్మాసనము, శివధనుస్సు స్థానమును, భూమండల నాభిని, అన్నింటిని చూచినాడు. జాంబవంతుడు చెప్పిన ఓషధిపర్వతమును

చూచి ఓషధులు వెదకినాడు. అనేకవేల యోజనముల దూరము ప్రయాణము చేసియు అలసట జెందక, ఓషధిపర్వతముమీద తిరిగి వెదకుచున్నాడు. ఎవ్వడో తమకొరకు వచ్చినాడని గ్రహించి ఓషధులు అదృశ్యమైనవి.

మహౌషధ్య స్తత స్సర్వా స్తస్మిన్ పర్వత సత్తమే
విజ్ఞాయార్థిన మాయాంతం తతో జగ్ము రదర్శనమ్. 74-64

హనుమంతుడు ఆగ్రహించి పర్వతముతో అనుచున్నాడు.

*హనుమంతుడు* : ఓ పర్వతమా! రామునియెడ దయ చూపరాదని నిశ్చయించుకొంటివా యేమి? నా బాహుబలముతో నిన్ను చూర్ణము చేయగలను చూడుము.

హనుమంతుడు పర్వతశిఖరమును పెల్లగించి తీసికొని ఆకసమున కెగిరినాడు. రెండవ సూర్యుని పగిది ప్రకాశించుచు గరుడవేగముతో పయనించి లంకకు వచ్చి క్రిందికి వ్రాలి ఆ పర్వతశిఖరమును వానరసేన నడుమ ఉంచి జాంబవంతుడు మున్నగు వానర వృద్ధులకు నమస్కరించినాడు. విభీషణుని కవుగిలించుకొన్నాడు.

రామలక్ష్మణులు ఆ ఓషధుల గంధమును ఆఘ్రాణించిన వెంటనే విశల్యులై స్వస్థులైనారు. వానరు లందరు విశల్యులైనారు. మరణించిన వానరులు సైతము నిద్ర నుండి మేల్కాంచినట్లు సుఖముగా లేచినారు.

సర్వే విశల్యా విరుజః క్షణేన
హరిప్రవీరా నిహతాశ్చ యే స్యుః
గంధేన తాసాం ప్రవరౌషధీనాం
సుప్తా నిశాంతేష్వివ సంప్రబుద్ధాః. 74-74

[ఓషధుల గాలి తగిలినందున మృతులైన వానరులు సైతము బ్రతికినారుగదా! మృతులైన రాక్షసులుమాత్రము ఏల బ్రతుకలేదు? అని యెవ్వరికైనను తోచవచ్చును. దానికి వాల్మీకి మహర్షియే సమాధానము చెప్పియున్నారు]

యుద్ధము ప్రారంభమైనది మొదలు చనిపోయిన రాక్షసులను ఎందరు చనిపోయినారో ఎవ్వరికిని తెలియరాకుండ తన పరువు కాపాడుకొనుటకు, ఎప్పుడు చచ్చినవారిని అప్పుడే యీడ్పించి సముద్రములో వేయించినాడు రావణుడు.

యదాప్రభృతి లంకాయాం యుధ్యంతే కపిరాక్షసాః
తదాప్రభృతి మానార్థ మాజ్ఞయా రావణస్య చ 74-75

యే హన్యంతే రణే తత్ర రాక్షసాః కపికుంజరైః
హతాహతాస్తు క్షిప్యంతే సర్వ ఏవ తు సాగరే. 74-76

[రావణుడు తన పరువు కాపాడుకొనుటకు ఇంతపని చేసినాడు. కాబట్టి ఓషధిపర్వతము రాక్షసులకు ఉపయోగపడలేదు. ఇంద్రజిత్తు చేసిన అపకారము ధర్మమో యన, ఎన్నడో చని పోయిన వానరు లందరును బ్రతికినారు. తా నొకటి తలచిన దైవ మొకటి తలచును!]

వానరు లెల్లరు బ్రతికినారు. అందరు ఆరోగ్యముగా ఉన్నారు. రామలక్ష్మణులు విశల్యులై సుఖముగా ఉన్నారు.

హనుమంతుడు ఓషధిపర్వతమును తీసికొని హిమాలయపర్వతమున కెగిరిపోయి ఓషధిపర్వతమును యథాస్థానములో చేర్చి శ్రీరాముని సన్నిధికి వచ్చినాడు.

తతో హరి ర్గంధవహాత్మజస్తు
తమోషధీశైల ముదగ్ర వీర్యః
నినాయ వేగా ద్ధిమవంత మేవ
పునశ్చ రామేణ సమాజగామ. 74-77

[ఇది మిక్కిలి గొప్ప విషయము. మరియొకతూరి అక్కరకు వచ్చునని ఓషధి పర్వతమును అందే ఉంచుకొనలేదు. ఇంకొకమారు హిమాలయమునకు వెళ్లుట, తిరిగివచ్చుట, శ్రమ యని అనుకోలేదు. హనుమంతుడు ఎంత సునాయసనముగా వెళ్లివచ్చెనో ఒక్కముక్కలో చెప్పినారు మహర్షిగారు. ఈ ఔచిత్యము గమనింపదగినది. ఈ ప్రయాణము నిడివిగా వర్ణింప దగినదికాదు. కాని, హనుమంతుడు చేసిన గొప్పకార్యము ఎంతోగొప్పది.

మనము ఎరవుతెచ్చుకొన్న పనిముట్టును పని అయినవెంటనే ఇచ్చివేయవలెను. మరల పనిపడినప్పుడు మరల తెచ్చుకోవచ్చును. మనయొద్దనే ఉంచుకొందుమేని సొంతదారు ఇబ్బంది పడిపోవును. ఎక్కడ ఉండవలసిన వస్తువు అక్కడ ఉండునేని ఎవరికి కావలసినప్పుడు వారు దానిని తెచ్చుకోవచ్చును. మనము తెచ్చుకొని నిలుపుకొన్నచో అది కావలసినవారు శ్రమ పడుదురు.

కావుననే హనుమంతుడు ఓషధిపర్వతమును యథాస్థానములో ఉంచినాడు. ఇది గమనింపదగిన విషయము.]

## లంకాదహనము

సుగ్రీవుడు హనుమంతుని పిలిచి చెప్పుచున్నాడు.

**సుగ్రీవుడు :** హనుమంతుడా! ఇప్పు డొక పని చేయదగియున్నది. కుంభకర్ణుడు, రావణుని కుమారులు మరణించినారు. రావణుడు దుఃఖములో ఉన్నాడు. కావున ఇప్పుడు యుద్ధమునకు పూనుకొనడు. మనలో దిటవుగలవారు దివిటీలను గైకొని లంకాపురిలో ప్రవేశింపుడు.

[దివిటీలతో ఏమిచేయవలయునో హనుమంతునికి చక్కగా తెలియును. అది అతనికి కొత్తపని కాదు.]

వానరులు దివిటీలు తీసికొని బయలుదేరినారు. రాక్షసులు భయపడి యెక్కడి వారక్కడ పరుగెత్తినారు. వానరులు పట్టణ ద్వారములకును కోట బురుజులకును, రాజవీధులలోని భవనములకును, సందుగొందులయందలి గృహములకును నిప్పు అంటించినారు. వేలకొలది గేహములు తగులబడినవి. పర్వతములవంటి మేడలు కాలి కూలినవి. ఇండ్లలోని వస్త్రములు, ఆభరణములు, వస్తువాహనములు, కవచములు, ఆయుధములు, అన్నియు అగ్నిపాలైనవి. ఆయుధములు ధరించియుండినవారు, భోజనము చేయుచుండినవారు, పానశాలలందు మద్యమును సేవించుచుండినవారు, ప్రేమ కలాపములు జరుపుకొనుచుండినవారు, నిద్రపోవుచుండినవారు, బిడ్డలను తీసికొని పారిపోవుచున్నవారు, స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు, ఎందరో రాక్షసులు లక్షల లెక్కన అగ్నిహోత్రునికి ఆహుతి యైనారు. ఏనుగులును, గుఱ్ఱములును కట్లు తెంపుకొని, దిక్కు తోపక పారిపోసాగినవి.

లంకాపట్టణము మంటలపాలై ప్రళయకాలమున ప్రజ్వలించు భూమివలె కనబడినది.

సా బభూవ ముహూర్తేన హరిభి ర్దీపితా పురీ
లోకస్యాస్య క్షయే ఘోరే ప్రదీప్తేవ వసుంధరా 75-29

రాక్షసుల రోదనధ్వనులు, వానరుల హర్షనాదములు లంకలో చెలరేగి దశదిశలకు వ్యాపించినవి. రామలక్ష్మణులుకూడ ధనుర్బాణములను ధరించినారు. కోదండపాణియై ధనుష్టంకారము చేయుచున్న శ్రీరాముడు వేదమయధనుస్సును ధ్వనింపజేయుచున్న క్రుద్ధుడైన శివునిభంగి ప్రకాశించినాడు.

అశోభత తదా రామో ధనుర్విష్ఫారయ న్మహత్
భగవానివ సంక్రుద్ధో భవో వేదమయం ధనుః 75-35

శ్రీరాముని బాణములకు లంకాపురిద్వారము బ్రద్దలై పడిపోయినది.

రాక్షసులు యుద్ధసన్నాహము చేసినారు. ఆ రాత్రి ప్రళయకాల రాత్రివలె భయంకరముగా ఉన్నది.

*సుగ్రీవుడు*: వానరులారా! మీరు రావణుని అంతఃపురద్వారమును ఆక్రమించి యుద్ధము చేయుడు.

ఈ యాజ్ఞగొని వానరులు దివిటీలు గైకొని అంతఃపురద్వారమును సమీపించినారు. రావణుడు క్రోధవశుడై కుంభకర్ణుని పుత్రులైన నికుంభుడు, కుంభుడు అను వారిని యుద్ధమునకు పంపినాడు. యూపాక్షుడు, శోణితాక్షుడు, ప్రఘసుడు, కంపనుడు వారివెంట వెడలినారు.

**రావణుడు** : వీరులారా ! మీరు వెంటనే వెళ్ళి శత్రువును జయింపుడు.

రాక్షసవీరులు యుద్ధసన్నద్ధులైవచ్చినారు. రాక్షసులకు వానరులకు ఘోర యుద్ధము జరిగినది. ఇరుపక్షములందును అనేకులు మరణించినారు. అంగదుడు ఒక పర్వతశిఖరమునుగైకొని కంపనుని వధించినాడు. శోణితాక్షుడు అంగదునితో తలపడి నాడు. ప్రజంఘుడు, యూపాక్షుడు అంగదునిమీదికి వచ్చినారు. మైందుడు, ద్వివిదుడు అంగదునికి తోడ్పడినారు. యుద్ధము ప్రచండముగా జరిగినది. అంగదుడు ప్రజంఘుని వధించినాడు. ద్వివిదుడు శోణితాక్షుని, మైందుడు యూపాక్షుని వధించినారు. రాక్షసులు కుంభుని శరణుజొచ్చినారు.

## కుంభుని యుద్ధము

కుంభుడు ధనుస్సునుగ్రహించి ద్వివిదునిమీద బాణము వేసినాడు. ద్వివిదుడు మూర్ఛనొంది పడిపోయినాడు. మైందుడు ఒక పర్వతశిఖరమును గైకొని కుంభునిపై కడరినాడు. కాని మైందుడుకూడ కుంభుని బాణపాతమువలన మూర్ఛితుడైనాడు. అంగదుడు కుంభునిపై విజృంభింపగా ఇరువురికిని తీవ్రయుద్ధము జరిగినది. అంగదుడు మూర్ఛిల్లినాడు.

వానరులు రాముని శరణుజొచ్చినారు. శ్రీరాముడు అంగదుని సహాయార్థము జాంబవంతుడు మున్నగు వీరులను పంపినాడు. సుషేణుడు, వేగదర్శి మొదలైన వారితో జాంబవంతుడు కుంభునిమీదికి వచ్చినాడు. కుంభుడు వారి నందరను బాణములచే నొప్పింపగా ఈ సంక్షోభమును సుగ్రీవుడు గమనించి కుంభునితో యుద్ధము చేయుటకు స్వయముగా పూనుకొన్నాడు. ఈలోపల అంగదుడు మూర్ఛదేరి సుగ్రీవుని అనుస రించినాడు.

## కుంభుడు సుగ్రీవునితో యుద్ధమాడి మరణించుట

సుగ్రీవునికిని కుంభునికిని ఉగ్రయుద్ధము జరిగినది. సుగ్రీవుడు కుంభుని ధనుస్సును పట్టుకొని విరిచినాడు.

*సుగ్రీవుడు* : కుంభుడా ! నీవు గొప్ప పరాక్రమశాలివి. అందుకు సందేహములేదు. నీవు అనేక కపివీరులతో పోరాడి అలసియున్నావు. విశ్రాంతి తీసికొనుము. ఆ తరువాత నా పరాక్రమ క్రీడ తిలకింతువుగాక !

ఈ గరువపుపలుకులకు కుంభుడు కోపించి సుగ్రీవునిపైకి ఉరికి, రెండు చేతులతో సుగ్రీవుని పట్టుకొన్నాడు ఇద్దరును ఒకరినొకరు పట్టుకొని, మదించిన ఏనుగుల కరణి

పోరాడినారు. సుగ్రీవుడు కుంభుని పైకెత్తి సముద్రములో విసరివైచినాడు. కుంభుడు సముద్రమునుండి యెగిరివచ్చి సుగ్రీవుని రొమ్మున ఒక పోటు పొడిచినాడు. సుగ్రీవుడు కోపించి తన పిడికిలితో కుంభుని రొమ్ముమీద గ్రుద్దినాడు. ఆ దెబ్బకు కుంభుడు క్రింద పడి మరణించినాడు.

## నికుంభుడు - హనుమంతుడు

నికుంభుడు ఒక పరిఘమును గ్రహించి యుద్ధమునకు పూనుకొన్నాడు. హనుమంతుడు నికుంభుని యెదుట నిలబడినాడు. నికుంభుడు తన పరిఘముతో హనుమంతుని వక్షమున కొట్టినాడు. ఆ పరిఘము హనుమంతుని రొమ్ము తాకి నూరు ముక్క లయినది. హనుమంతుడు కోపించి తన పిడికిలి బిగించి, నికుంభుని వక్షమున పొడిచినాడు. నికుంభుని శరీరమునుండి రక్తము స్రవించినది. నికుంభుడు మూర్ఛిల్లినాడు. కొంతసేపటికి తేరి తన రెండు చేతులతో హనుమంతుని పట్టుకొన్నాడు. ఇరువురికిని గొప్ప పోరు జరిగినది. హనుమంతుడు తన రెండు చేతులతో నికుంభుని కంఠమును పట్టుకొని త్రిప్పి శిరస్సును విరిచివైచినాడు.

> పరిగృహ్యా చ బాహుభ్యాం పరివృత్య శిరోధరాం
> ఉత్పాటయామాస శిరో భైరవం నదతో మహత్. 77-23

## మకరాక్షుడు శ్రీరామునితో పోరి మరణించుట

కుంభుడును నికుంభుడును మరణించిన వార్త విని రావణుడు కోపవశుడై ఖరునికుమారుడైన మకరాక్షుని పిలిచి "కుమారా! నీవు బలసమేతుడవై యుద్ధభూమి కేగి ఆ రామలక్ష్మణులను, వానరులను వధించిరమ్ము" అని చెప్పినాడు.

మకరాక్షుడు రావణునికి ప్రదక్షిణ నమస్కారములు చేసి సైన్యమును వెంట బెట్టుకొని తన రథముమీద యుద్ధరంగమునకు బయలుదేరినాడు. దుశ్శకునములు కన బడినవి. సారథిచేతినుండి మునికోల జారిపడిపోయినది. ధ్వజము క్రిందపడినది. రథాశ్వములు తొట్రుపడి కన్నీరు కార్చినవి.

మకరాక్షుడు మహాపరాక్రమశాలి. ఈ అపశకునములను పాటింపలేదు.

మకరాక్షుడు ససైన్యముగా వచ్చుట చూచి వానరవీరులు తమ ఆయుధములను గైకొని యుద్ధమునకు సిద్ధమైనారు. మకరాక్షుడు వానరులపై శరవర్షమును కురిపించినాడు. రాక్షసులు ఉత్సాహపూరితులై పోరుచున్నారు. వానరులు భీతిల్లి పారిపోగా రాక్షసులు వారిని తరుముచున్నారు.

శ్రీరాముడు ఈ సంక్షోభమును చూచి రాక్షసులమీద బాణములు వేసి వారి ధాటిని అణచినాడు.

*మకరాక్షుడు* : రామా ! శక్తి కలదేని నా యెదుట నిలబడి నాతో ద్వంద్వయుద్ధము చేయుము. దండకారణ్యమున నా తండ్రిని వధించితివి. ఇప్పుడు నిన్ను వధించి నా పగతీర్చుకొందును. నీ కిష్టమైన ఆయుధము నెన్నుకొనుము. అస్త్రములతో గాని, గదతోగాని, చేతులతోగాని, నీకు ఎటుల ఇష్టమో దానిని కోరుకొనుము. నేను నీవు కోరినట్లే యుద్ధము చేయగలను.

> అస్త్రైర్వా గదయా వాపి బాహుభ్యాం వా మహాహవే
> అభ్యస్తం యేన వా రామ తేనైవ యుధి వర్తతామ్. 79-16

*రాముడు* : మకరాక్షుడా ! ఎందు కిట్లు ప్రేలుచున్నావు. యుద్ధములను యుద్ధమాడి గెలువవలెను కాని వాక్బలముతో యుద్ధములందు జయించుట సాధ్యమగునా !

> కత్థసే కిం వృథా రక్షో బహూన్యసదృశాని తు
> న రణే శక్యతే జేతుం వినా యుద్ధేన వాక్బలాత్. 79-18

నేను దండకారణ్యమున పదునాలుగువేల రాక్షసులను, దూషణుని, త్రిశిరుని, నీ తండ్రియైన ఖరుని సంహరించితిని. నిన్నుకూడ ఇప్పుడే యమసదనమున కంపగలను.

మకరాక్షుడు కోపించి రామునిమీద బాణములు వేయగా రాముడు ఆ బాణములను ఖండించినాడు. ఇరువురకు భయంకర సంగ్రామము జరిగినది. ఈ అద్భుత యుద్ధమును చూచుటకు దేవతలు, ఋషులు విమానములమీద వచ్చి ఆకాశములో ఉన్నారు. ఇద్దరును గొప్పవీరులు. ఒకరి బాణములను ఒకరు నివారించుకొనుచున్నారు. యుద్ధభూమి బాణములతో నిండిపోయినది. శ్రీరాముడు మకరాక్షుని ధనుస్సును ఛేదించి సారథిని వధించినాడు. రథాశ్వములను సమయించినాడు. మకరాక్షుడు విరథుడై నేలకు ఉరికి శూలమును గ్రహించి రామునిపైకి దూకినాడు. శ్రీరాముడు మూడుబాణములు వేసి శూలమును ఖండించినాడు. మకరాక్షుడు తన పిడికిలిని బిగించి రామునిపైకి వచ్చినాడు. శ్రీరాముడు మకరాక్షుని చూచి నవ్వుచు ఆగ్నేయాస్త్రమును ప్రయోగించి మకరాక్షుని వధించినాడు. హతశేషులైన రాక్షసులు లంకలోనికి పరుగెత్తినారు.

శ్రీరాముడు మకరాక్షుని వధించుటచూచి దేవతలు, ఋషులు సంతోషించినారు.

> దశరథనృపపుత్ర బాణవేగై
> రజనిచరం నిహతం ఖరాత్మజం తం
> దదృశురథ సురా భృశం ప్రహృష్టా
> గిరిమివ వజ్రహతం యథా వికీర్ణమ్. 79-40

## రావణుడు ఇంద్రజిత్తును యుద్ధమునకు పంపుట

మకరాక్షుని మరణవార్త విని రావణుడు కడుంగడు దుఃఖించినాడు. దుఃఖము నుండి కోపముపుట్టినది. రావణుడు రౌద్రావిష్టుడై పండ్లు పటపట కొరికి "నేనిప్పుడు చేయదగిన కార్యమేమి" అని ఆలోచించి తనకుమారుడైన ఇంద్రజిత్తును పిలిచి

**రావణుడు :** వీరకుమారా ! నీ వెశ్చైన రామలక్ష్మణులను వధింపవలయును. అదృశ్యుడవై గాని దృశ్యుడవైగాని నీ అపారబలమును ప్రదర్శించి వారిని తుదముట్టింప వలయును.

జహి వీర మహావీర్యౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ
అదృశ్యో దృశ్యమానో వా సర్వథా త్వం బలాధికః. 80-3

నీవు ఇంద్రుని జయించినవాడవు. ఈ మనుష్యమాత్రులను వధించుట నీ కొక పెద్దపని కాదు.

ఇంద్రజిత్తు తండ్రిమాట శిరసావహించి వెళ్ళి హోమము చేయుటకు యజ్ఞభూమి కరిగినాడు. ఋత్విజులు ధరించుటకై ఎఱ్ఱని వస్త్రములను రాక్షస స్త్రీలు తెచ్చి యిచ్చి నారు. హోమద్రవ్యములు సిద్ధము కావింపబడినవి.

ఇంద్రజిత్తు యథాశాస్త్రముగ హోమము చేసి అంతర్ధాన శక్తిగల రథ మెక్కి. అదృశ్యుడై బ్రహ్మాస్త్రముచే సురక్షితుడై యుద్ధభూమి ప్రవేశించి వానర వాహిని మధ్యప్రదేశమం దున్న రామలక్ష్మణులపై బాణములు ప్రయోగించినాడు. రామ లక్ష్మణులును అస్త్ర శస్త్రములను ప్రయోగించి ఆకాశమును బాణములతో కప్పివేసిరి గాని అవి ఇంద్రజిత్తుకు తగులలేదు.

ప్రచ్ఛాదయంతౌ గగనం శరజాలై ర్మహాబలౌ
తమస్త్రై స్సూర్యసంకాశై ర్నైవ పస్పర్శతు శ్శరైః. 80-24

ఇంద్రజిత్తు గగన మండలమును ధూమాంధకార మొనర్చి కంటికి కానరాక యుద్ధము చేయసాగినాడు.

స హి ధూమాంధకారం చ చక్రే ప్రచ్ఛాదయ న్నభః
దిశశ్చాంతర్దధే శ్రీమాన్ నీహార తమసావృతాః. 80-25

ఇంద్రజిత్తుని ధనుష్టంకార శబ్దముగాని, రథచక్రధ్వనిగాని, గుఱ్ఱముల గిట్టల చప్పుడుగాని వినిపింపలేదు. కాని అతని బాణములు మాత్రము పరంపరలుగా వచ్చి పడుచుండినవి. రామలక్ష్మణుల శరీరములనిండ బాణములు గ్రుచ్చుకొనుచుండినవి. వారు ప్రయోగించిన శరములలో కొన్నిమాత్రము ఇంద్రజిత్తు శరీరమును తాకి అతని

రక్తముతో తడిసి క్రింద పడిపోవుచుండినవి. ఇంద్రజిత్తుబాణములు ఏ దిక్కు నుండి వచ్చుచున్నవో చూచి ఆ వైపున గురిపెట్టి రామలక్ష్మణులు బాణములు విడిచిరి కాని ఆ రాక్షసుడు ఒకచోట నిలుచుటలేదు. అన్ని దిక్కులును తిరుగుచున్నాడు. ఇంద్రజిత్తు ఉన్నచోటుగాని, అతని ఆకారముగాని, ధనుర్బాణములుగాని, ఏమియు కనిపింప లేదు. ఇంద్రజిత్తు వేయుచున్న శరములకు వానరులు గుంపులు గుంపులుగా చచ్చి పడి పోవుచున్నారు.

**లక్ష్మణుడు :** (కోపముతో) అన్నా! సమస్తరాక్షస విధ్వంసము నుద్దేశించి నే నిప్పుడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించెదను.

లక్ష్మణస్తు సుసంక్రుద్ధో భ్రాతరం వాక్య మబ్రవీత్
బ్రాహ్మమస్త్రం ప్రయోక్ష్యామి వధార్థం సర్వరక్షసామ్. 80-37

**రాముడు :** తమ్ముడా! ఒక్క రాక్షసుడు కారణముగా భూమియందలి రాక్షసుల నందరను వధించుట పాడికాదు.

నైకస్య హేతో రక్షాంసి పృథివ్యాం హంతు మర్హసి. 80-38

ఈ ఇంద్రజిత్తునే తునుమాడ సమకట్టుదము. ఇతడు భూమిలోనికిగాని, స్వర్గ మునకుగాని, రసాతలమునకుగాని, ఆకాశమునకుగాని, ఎక్కడికి పోయినను నా కంటికి కానరాక దాగియున్నను నా అస్త్రములచే దహింపబడి అసువుల గోల్పోయి భూమిపై పడగలడు.

యద్యేష భూమిం విశతే దివం వా
రసాతలం వాఽపి నభస్థలం వా
ఏవం నిగూఢోఽపి మమాస్త్రదగ్ధః
పతిష్యతే భూమితలే గతాసుః. 80-42

శ్రీరాము డిట్లుపలికి ఇంద్రజిత్తును వధింపబూనగా ఇంద్రజిత్తు రామసంకల్పము గ్రహించి యుద్ధమును చాలించి లంకలో ప్రవేశించినాడు.

విజ్ఞాయ తు మనస్తస్య రాఘవస్య మహాత్మనః
సన్నివృత్యాహవా త్తస్మా త్ప్రవివేశ పురం తతః. 81-1

[యుద్ధభూమినుండి పారిపోయిన శత్రువును రాముడు వధించునా!]

రామబాణమునుండి తప్పించుకొనుటకై ఇంద్రజిత్తు పురము ప్రవేశించినాడే కాని రామలక్ష్మణులను తుదముట్టింపవలెనను తలంపును వదలుకొనలేదు.

పశ్చిమ ద్వారముగుండ యుద్ధరంగమునకు నిర్గమించినాడు. రామలక్ష్మణులు యుద్ధసంసిద్ధులై యుండుట చూచినాడు. తన నికుంభిలా హోమము పూర్తి యగు వరకు వారు యుద్ధ విషయము తలపెట్టజాలక దుఃఖనిమగ్నులగునట్లు చేయదలచి, దానికి తగిన ఉపాయమును ఆలోచించినాడు. తన మాయచే సీతాదేవివంటి బొమ్మను నిర్మించి తన రథములో పెట్టుకొన్నాడు.

## ఇంద్రజిత్తు మాయాసీతను వధించుట

వానరులను వంచింపదలచి సీతాసంహారము వారి కన్నులయెదుట జరిగినట్లు భ్రాంతి కలిగించుటకు ఇంద్రజిత్తు వానరుల కభిముఖముగా రథమును మరలించినాడు.

మోహనార్థం తు సర్వేషాం బుద్ధిం కృత్వా సుదుర్మతిః
హంతుం సీతాం వ్యవసితో వానరాభిముఖో యయౌ. 81-6

ఇంద్రజిత్తు వచ్చుట చూచి వానరులు శిలలు గైకొని ఇంద్రజిత్తును ఎదుర్కొనినారు. పశ్చిమద్వారముదగ్గర నెలకొనియున్న హనుమంతుడు ఒక పెద్దపర్వత శిఖరమును గొని ఇంద్రజిత్తుపైకి పోగా ఇంద్రజిత్తు రథమునందున్న సీతాస్వరూపము హనుమంతుని కంటపడినది. కృశించి, దీనానయై, సంస్కారశూన్యమై జడగట్టిపోయిన వేణితో, మలినవస్త్రముతో, ధూళిధూసరితమైన శరీరముతో ఉన్న సీతాదేవిని హనుమంతుడు చూచినాడు.

స దదర్శ హతానందాం సీతా మింద్రజితో రథే
ఏకవేణీధరాం దీనా ముపవాసకృశాననామ్. 81-9
పరిక్లిష్టైకవసనా మమృజాం రాఘవప్రియామ్
రజోమలాభ్యామాలిప్తై స్సర్వగాత్రై ర్వరస్త్రియమ్. 81-10

కొలదికాలము క్రిందటనే సీతాదేవిని అశోకవనములో చూచినవాడు కావున హనుమంతుడు సీతాదేవిని గుర్తింపగలిగినాడు. హనుమంతునికి దుఃఖము ముంచుకొని వచ్చినది. కన్నీరు నించినాడు. "ఈ రాక్షసుడు సీతాదేవిని రథమున నిడుకొని వచ్చుటకు కారణ మేమైయుండును ?" అని ఆలోచించినాడు. సమాధానము తోపలేదు. హనుమంతుడు క్రోధపరవశుడై తన సేననుగూడి ఇంద్రజిత్తుపైకి దూకినాడు. ఇంద్రజిత్తు కోపించి కత్తిదూసి సీతాదేవి తలమీద పెట్టినాడు. ఆ మాయాసీత "రామా! రామా!" అని విలపించినది. వానరుల కన్నులయెదుటనే ఇంద్రజిత్తు ఆ సీతామూర్తిని ఎన్నో దెబ్బలు కొట్టినాడు. తలవెండ్రుకలు పట్టుకొన్నాడు. ఈ దుండగమును చూచి హనుమంతుడు దుఃఖమును పట్టజాలక విలపించినాడు.

తాం ప్రియం పశ్యతాం తేషాం తాడయామాస రావణిః
క్రోశంతీం రామ రామేతి మాయయా యోజితాం రథే. 81-16

గృహీత మూర్ధజాం దృష్ట్వా హనుమాన్ దైన్యమాగతః
శోకజం వారి నేత్రాభ్యా మసృజ న్మారుతాత్మజః. 81-17

*హనుమంతుడు*: దురాత్ముడా! నీ వొనర్చిన పాపకార్యమువలన నీవు నాశన మగుట ఎరుగక సీతాదేవి తలవెండ్రుకలను పట్టుకొంటివా! ఛీ! ఇట్టి ఘోరదురితము నొనర్చిన నీవు దహింపబడుదువుగాక! ఇట్టి నీచకార్యమును చేసినందుకు సిగ్గు లేదా! సీతాదేవిని వధించి నీవు ఎక్కువకాలము బ్రతికియుండలేవు. స్త్రీ హత్యా దోషము పరలోకమునకూడ నిన్ను వేధింపక వదలదు.

ఇట్లు పలికి హనుమంతుడు రౌద్రమూర్తియై ఇంద్రజిత్తుపైకి పోయినాడు.

*ఇంద్రజిత్తు*: ఓరీ వానరా! సుగ్రీవుడు, నీవు, రాముడును ఎవ్వతె నిమిత్తమై ఇక్కడికి వచ్చితిరో ఆ సీతను నీ కన్నెదుటనే వధింతును.

సుగ్రీవ స్త్వం చ రామశ్చ యన్నిమిత్త మిహాఽఽగతాః
తాం హనిష్యామి వైదేహీ మద్యైవ తవ పశ్యతః. 81-27

సీతను వధించిన పిదప రాముని, లక్ష్మణుని, నిన్ను, సుగ్రీవుని, దుర్మార్గుడైన విభీషణుని వధించెదను. స్త్రీవధ చేయరాదని ఒక నీతిని చెప్పితివి. ఆ మాట సరికాదు. పీడ యేరూపములో నున్నను దానిని తొలగింపవలసినదే. అందులో తప్పులేదు.

ఇట్లుపలికి తన ఖడ్గము గైకొని మాయాసీతను యజ్ఞోపవీత మార్గముగా ఖండించి నాడు. ఆ సీత క్రింద పడిపోయినది.

*ఇంద్రజిత్తు*: హనుమంతుడా! రాముని ప్రియభార్యయైన సీతను వధించితిని. ఇక మీరు శ్రమపడుటవలన లాభ మేమియులేదు.

ఈ మాటలుపలికి ఇంద్రజిత్తు సింహగర్జన చేసినాడు. వానరులు భయపడి నలు దిక్కులకు పారిపోజొచ్చినారు.

*హనుమంతుడు*: వానరులారా! ఎందుకిట్లు పారిపోవుచున్నారు! మీ శౌర్యమేమైనది? పారిపోవుట శూరుల లక్షణము కాదు. మరలిరండు. నేను ముందు నడచెదను. మీరు నా వెంబడి వచ్చి ఉత్సాహముతో యుద్ధముచేయుడు.

హనుమంతుని వాక్యములను విని వానరులు యుద్ధమునకు పూనుకొన్నారు. రాక్షసులకు వానరులకు ప్రబలయుద్ధము జరిగినది. హనుమంతుడు కాలాంతకునివలె విజృంభించి శత్రుసైన్యమును దహించినాడు. ఇంద్రజిత్తు రథముపైకి ఒక పెద్దబండను

విసరినాడు. ఇంద్రజిత్తు తన రథమును దూరముగా తొలగతోలించినందున ఆ బండ రాక్షసులమీద పడి అనేక రాక్షసులను చంపినది. వానరవీరులు ఇంద్రజిత్తుపై పర్వత శిఖరములను, వృక్షములను ప్రయోగించినారు. ఇంద్రజిత్తు వానిని తీవ్రబాణములతో నివారించి వానరులను హతము చేసినాడు. హనుమంతుడు చెట్లను, శిలలను రువ్వుచు గొప్పయుద్ధము చేసినాడు. కొంత సేపైనపిదప హనుమంతుడు వానరులతో అనుచున్నాడు.

**హనుమంతుడు :** వానరులారా! వెనుకకు మరలుడు. మనము వచ్చినది రాక్షససేనను సాధించుటకు కాదు. మన మెవ్వతె నిమిత్తమై వచ్చి ప్రాణములు సరకుసేయక పోరుచుంటిమో ఆ సీతాదేవి వధింపబడినది.

> త్యక్త్వా ప్రాణాన్ వివేష్టంతో రామప్రియ చికీర్షవః
> యన్నిమిత్తం హి యుధ్యామో హతా సా జనకాత్మజా. 82-21

ఈ ఘోరవార్తను రామునికిని సుగ్రీవునికిని తెలియజేసి వారేమి చేయు మని చెప్పుదురో అట్లు చేయుదము.

[ఇంద్రజిత్తు మాయ అనుకొన్నంత పని చేసినది. సీతాదేవిని కొలదికాలముక్రిందటనే చూచి వచ్చిన హనుమంతుడు స్వయముగా చెప్పినగాని రాముడు విశ్వసింపక పోవచ్చును. కావున హనుమంతు డున్న పశ్చిమద్వారముగుండ ఇంద్రజిత్తు వచ్చి ఇంతపని చేసి వెళ్లినాడు. రాక్షసమాయను హనుమంతుడు సైతము గుర్తింపలేకపోయినా డనగా, ఆ మాయ యెంత గొప్పదో ఊహింపవచ్చును.]

హనుమంతుడు వెనుకకు మరలిపోవుటచూచి ఇంద్రజిత్తు హోమము చేయుటకై నికుంభిలాశక్తిగుడికి పోయి హోమము యథాశాస్త్రముగా ప్రారంభించినాడు.

> తతః ప్రేక్ష్య హనూమంతం వ్రజంతం యత్ర రాఘవః
> స హోతుకామో దుష్టాత్మా గత శ్చైత్య నికుంభిలామ్. 82-24

పశ్చిమద్వారములో జరుగుచున్న యుద్ధసందర్భమున వ్యాపించిన శబ్దము విని, హనుమంతుని సహాయార్థము శ్రీరాముడు జాంబవంతుని పంపినాడు. జాంబవంతుడు భల్లూక సైన్యములతో వచ్చుట దారిలోనే చూచి, ఆ సైన్యములను వెనుకకు మరలించి హనుమంతుడు వడివడిగా శ్రీరామునిచెంత కరిగి దుఃఖవార్తను చెప్పుచున్నాడు.

## సీతావృత్తాంతమును విని శ్రీరాముడు మూర్ఛిల్లుట

**హనుమంతుడు :** (దుఃఖముతో) రామప్రభూ! మేము యుద్ధము చేయుచుండగా ఇంద్రజిత్తు సీతాదేవిని మా కన్నెదుట వధించినాడు. నాకేమియు తోపక ఈ సంగతి నీతో మనవి చేయుటకు వచ్చినాను.

ఈ ఘోరవార్త వినినతోడనే శ్రీరాముడు మూర్ఛిల్లి, మొదలు నరికిన వృక్షము వలె క్రిందపడిపోయినాడు.

> తస్య తద్వచనం శ్రుత్వా రాఘవ శ్శోకమూర్ఛితః
> నిపపాత తదా భూమౌ ఛిన్నమూల ఇవ ద్రుమః. 83.10

వానరప్రముఖు లందరును రాముని పరివేష్టించినారు. శ్రీరామునికి శైత్యోపచారములు చేయుచున్నారు. సుగంధములతోకూడిన శీతలజలమును ముఖముపై చల్లినారు. అనేక ఉపచారములు చేసినారు. లక్ష్మణుడు దుఃఖాక్రాంతుడై శ్రీరాముని కవుగిలించుకొని తన తొడపై శ్రీరాముని శిరస్సు పెట్టుకొని విలపించుచున్నాడు.

**లక్ష్మణుడు :** అన్నా ! నీవు ధర్మమును నమ్మి ఈ దీనావస్థకు వచ్చినావు. నీ ధర్మము నిన్ను ఈ ఆపదనుండి రక్షింపలేకపోయినదిగదా! మరి, ధర్మమువలన ప్రయోజన మేమి?

> శుభే వర్త్మని తిష్ఠంతం త్వామార్య విజితేంద్రియమ్
> అనర్థేభ్యో న శక్నోతి త్రాతుం ధర్మో నిరర్థకః. 83.14

ఈ లోకములో ధర్మమనునదిలేదు. ఉన్నచో స్థావరములు, జంగమములు మన కంటికి కనబడినట్లు ధర్మమేల కానబడదు? కావున ధర్మము లేదనియే నా దృఢనిశ్చయము.

> భూతానాం స్థావరాణాం చ జంగమానాం చ దర్శనమ్
> యథాఽస్తి న తథా ధర్మ స్తేన నాఽస్తీతి మే మతిః. 83.15

ధర్మము, అధర్మము, అనునవి అర్థములేని వట్టిమాటలు. అట్లు కానిచో అధర్మములో నున్న రావణునికి ఆపద కలుగవలయును కదా! ధర్మమార్గమునందున్న నీవు వ్యసనముపాలుగాక సుఖముగా ఉండవలయును కదా! అట్లుగాక రావణుడు సుఖముగా నున్నాడు. నీకు కష్టపరంపరలు ప్రాప్తించుచున్నవి.

> యద్యధర్మో భవేద్భూతో రావణో నరకం వ్రజేత్
> భవాంశ్చ ధర్మయుక్తో వై నైవం వ్యసన మాప్నుయాత్. 83.17

> తస్య చ వ్యసనాభావాద్వ్యసనం చ గతే త్వయి
> ధర్మో భవ త్యధర్మశ్చ పరస్పర విరోధినౌ. 83.18

అధర్మములో నుండువారి సంపదలు వృద్ధియగుచున్నవి. ధర్మాత్ముల సంపదలు క్షీణించుచున్నవి. కావున ధర్మాధర్మముల ప్రసంగములు పనికిమాలిన మాటలు.

> యస్మాదర్థా వివర్ధంతే యేష్వధర్మః ప్రతిష్ఠితః
> క్లిశ్యంతే ధర్మశీలాశ్చ తస్మాదేతౌ నిరర్థకౌ. 83.21

ధర్మమునకు సహజబలము లేదు. పౌరుషమును ఆశ్రయించుకొని ఏమైన చేయగలదేమోకాని, ధర్మము స్వతంత్రించి ఏ పనియు చేయజాలదు. కావున ధర్మమును

సేవింపవలసిన పనిలేదు. ధర్మమును పరిత్యజించి పౌరుషమునే ఆశ్రయించుట పురుషుని కర్తవ్యము.

రామా! సత్యవచనము ధర్మముకదా! నీకు పట్టాభిషేకము చేసెద నని చెప్పి ఆ మాట తప్పిన తండ్రిని నీ వేల బంధింపలేదు?

అథ చే త్సత్యవచనం ధర్మః కిల పరంతప
అనృత స్త్వయ్యకరుణః కి న్నబద్ధ స్త్వయా పితా. 83-28

ధర్మమునకు అర్థమే మూలము. నే నీమాట ఆనాడే చెప్పినాను. కాని నీవు నా మాటను పెడచెవినిబెట్టి రాజ్యమును వదలుకొని అరణ్యమునకు వచ్చితివి.

ధనమున్నవాడే యేకార్యమునైనను సాధింపగలడు. ధనహీనుడు తేజోవిహీనుడై ఏకార్యమునుగాని సరిగా చేయజాలడు. లోక మంతయు అర్థము నాశ్రయించి యున్నది. ధనమున్నవానికే మిత్రు లుందురు. బంధువులును ధనవంతునికే. ధనమున్న వాడే పురుషుడు. ధనమున్నవాడే పండితుడు. అతడే పరాక్రమశాలి, బుద్ధిమంతుడు, మహాభాగుడు, మహాగుణుడు. అర్థమును వదలుకొన్నచో అనేక దోషములు తటస్థించు నని అప్పుడే చెప్పితినిగదా! నీవు రాజ్యము నేల వదలుకొంటివో నా కర్థమగుటలేదు. ధన మున్నవానికి అన్నియు అనుకూలముగా నుండును. ధనములేనివానికి అంతయు ప్రతికూలమే.

రామా! హర్షము, కామము, దర్పము, ధర్మము, క్రోధము, శమము, దమము, మున్నగు అన్ని గుణములు ధన మున్నప్పుడే ప్రకాశించును. ధనహీనుడు ఎంత ధర్మాత్ముడయినను లోకములో గౌరవింపబడడు.

యస్యార్థా స్తస్య మిత్రాణి యస్యార్థా స్తస్య బాంధవాః
యస్యార్థా స్స పుమాం ల్లోకే యస్యార్థా స్స చ పండితః. 83-35

యస్యార్థా స్స చ విక్రాంతో యస్యార్థా స్స చ బుద్ధిమాన్
యస్యార్థా స్స మహాభాగో యస్యార్థా స్స మహాగుణః. 83-36

యస్యార్థో ధర్మకామార్థా స్తస్య సర్వం ప్రదక్షిణమ్
అధనేనార్థకామేన నార్థ శ్శక్యం విచిన్వతా. 83-38

రామా! నీవు ధర్మము నవలంబించి తండ్రిమాట విని అరణ్యమునకు వచ్చినందున ఏమయినది? నీ కత్యంత ప్రియురాలైన భార్యను రాక్షసుడు అపహరించినాడు.

త్వయి ప్రవ్రాజితే వీర గురోశ్చ వచనే స్థితే
రక్షసాఽపహృతా భార్యా ప్రాణైః ప్రియతరా తవ. 83-41

అంతకన్న అధికమైన, హృదయవిదారకమైన ఆపద ఈ ఇంద్రజిత్తువలన కలిగినది.

అన్నా! లెమ్ము. నీ దుఃఖమును నా పౌరుషముచేత పోగొట్టెదను. లే లెమ్ము! నీవు మహాత్ముడవు. నీ మాహాత్మ్యమును నీవు గుర్తించుట లేదేమి.

> ఉత్తిష్ఠ నరశార్దూల దీర్ఘబాహో దృఢవ్రత
> కిమాత్మానం మహాత్మాన మాత్మానం నాఽవబుధ్యసే. 83-43

రామా! క్షమింపుము. సీతాదేవి మరణవార్త విని శోకక్రోధ పరవశుడనై యేమేమో అంటిని. నీకు ఉత్సాహము కలిగించుటకు చెప్పిన మాటలేగాని మరేమియు కాదు. నీవు పాపరహితుడవని నే నెరుగుదును. నే నిప్పుడే పోయి సరావణముగా లంకను నాశన మొనరింతును

> అయమనఘ తవోదితః ప్రియార్థం
> జనకసుతానిధనం నిరీక్ష్య రుష్టః
> సహయగజరథాం సరాక్షసేంద్రాం
> భృశ మిషుభి ర్వినిపాతయామి లంకామ్. 83-44

[లక్ష్మణుడు ఈ క్షమాపణ చెప్పుకొనుట ఎంతో బాగున్నది. ధర్మము నిరర్థకమని ఒక్కొక్కప్పుడు అనిపించుచుండును. లక్ష్మణుడే ఈ మాట లన్నాడనగా సామాన్యులమాట చెప్పవలెనా! అధర్మములో నున్నవానిదే కాలము అని తాత్కాలికముగా అనిపించినను తుదకు ధర్మమే జయించును.]

## విభీషణుడు ఇంద్రజిత్తు రహస్యమును తెల్పుట

ఈలోపల విభీషణుడు వానరసేనలను స్వస్థానములలో నిలువరించి శ్రీరాముడున్న ప్రదేశమునకు వచ్చినాడు. శ్రీరాముడు దుఃఖించుచు లక్ష్మణుని తొడమీద పడుకొని యుండుటను చూచినాడు. అం దుండినవారు అందరు కన్నీరు కార్చుచుండినారు.

> రాఘవం చ మహాత్మాన మిక్ష్వాకుకులనందనమ్
> దదర్శ మోహమాపన్నం లక్ష్మణస్యాంక మాశ్రితమ్. 84-4

వారి దుఃఖమును చూచిన విభీషణుడుకూడ దుఃఖించి కొంత దిటవు తెచ్చుకొని "మీ రిట్లు దుఃఖించుటకు కారణ మేమి?" అని అడిగినాడు. లక్ష్మణుడు కన్నీరుకార్చుచు విభీషణుని చూచి చెప్పలేక చెప్పలేక నెమ్మదిగా అనుచున్నాడు.

*లక్ష్మణుడు*: ఇంద్రజిత్తు సీతాదేవిని వధించె నని హనుమంతుడు చెప్పినాడు. ఆ మాట విని రాముడు మూర్ఛిల్లినాడు.

*విభీషణుడు*: ఇదియా సంగతి! మీ రెంతమాత్రము దుఃఖింపవలసిన పనిలేదు. హనుమంతుడు మోసపోయినాడు. సీతాదేవిని వధించుటకు రావణు డెన్నటికైన సమ్మతించునా!

సీతాదేవిని చూచుట కైనను ఒకనికి సాధ్యమా! ఆమెను కొనివచ్చుటయు, వధించుటయు, సాధ్య మగునా! ఇంద్రజిత్తు వధించినది మాయాసీత. వానరులను మోహితుల జేసి నికుంభిలా చైత్యమునకు పోయి హోమము నిర్విఘ్నముగా జరుపుకొనుటకు ఇంద్రజిత్తు పన్నిన తంత్రమేగాని అన్యముకాదు.

ఆ హోమము నిర్విఘ్నముగా జరిపి వచ్చినచో ఇంద్రజిత్తును జయించుటకు ఎవ్వరికిని సాధ్యము కాదు. ఆ హోమమునకు మనము విఘ్నము కలిగింపవలయును. హోమము పూర్తికాకమునుపే సైన్యముతో మన మక్కడికి వెళ్లుదము.

ససైన్యా స్తత్ర గచ్ఛామో యావత్తన్న సమాప్యతే. 84-15

రామప్రభూ! నీ సంతాపమునకు కారణ మేమియులేదు. భ్రమవలన కలిగిన శోకమును విడిచిపెట్టుము. సేనలకు ఉత్సాహము కలిగింపుము. నీవు ధైర్యముగా, సుఖముగా ఇందే యుండుము. సైన్యముతోకూడ లక్ష్మణుని వెంటనే పంపుము. ఇంద్రజిత్తు హోమము పూర్తి కాకమునుపే వానిని వధింప సాధ్య మగును. పూర్తి యగునేని, అదృశ్యుడై, మనలను తీవ్రముగా బాధింపగలడు.

విభీషణుని పలుకులు శ్రీరాముడు విన్నాడు. శోకములో ఉన్నవాడు గనుక సరిగా అర్థము చేసికొనలేదు. ఎట్లో కొంత ధైర్యమును సమకూర్చుకొని శ్రీరాముడు విభీషణునితో అనుచున్నాడు.

**రాముడు :** విభీషణా! నీవు చెప్పిన మాటలను మరియొకమారు చెప్పుము.

[మంచిమాటలను మరిమరి వినవలయు నని కోరుట సహజము]

నైరృతాధిపతే వాక్యం యదుక్తం తే విభీషణ
భూయ స్తచ్ఛ్రోతు మిచ్ఛామి బ్రూహి యత్తే వివక్షితమ్. 85-3

**విభీషణుడు :** రామప్రభూ! నీ సంతాపమునకు కారణ మేమియులేదు. ఇంద్రజిత్తు వధించినది మాయాసీతను. శత్రువుల హర్షమును వృద్ధిచేయు ఈ శోకమును విడిచి పెట్టుము. నీవు ఉత్సాహము నవలంబించి యుద్ధప్రయత్నము చేయుము.

తదియం త్యజ్యతాం చింతా శత్రుహర్ష వివర్ధనీ
ఉద్యమః క్రియతాం వీర హర్ష స్సముపసేవ్యతామ్. 85-8

రాక్షసులను వధించి సీతాదేవిని తెచ్చుకొనవలెనని కోరిక కలదేని నా మాట వినుము. గొప్పసైన్యము నిచ్చి, వెంటనే లక్ష్మణుని నికుంభిలకు పంపుము. లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధింపగలడు. హోమము పూర్తి యగునేని మనకు ప్రాణములు దక్కుట దుర్లభము.

యద్యుత్తిష్ఠే త్కృతం కర్మ హతాన్ సర్వాంశ్చ విద్ధి నః. 85-14

ఇంద్రజిత్తునకు బ్రహ్మదేవుడు ప్రసాదించిన వరము వినుము. "నీవు నికుంభిలా హోమమునకు ప్రయత్నించి హోమము పూర్తిచేయక నికుంభిలను చేరకయుండువేళ, నీవు ఆయుధములను ధరించి వెడలునప్పుడు, నిన్ను ఏ శత్రువు కొట్టునో అతడే నీకు మారకుడని తెలిసికొనుము" అని బ్రహ్మదేవుడు చెప్పియున్నాడు.

నికుంభిలా మసంప్రాప్త మహుతాగ్నిం చ యో రిపుః
త్వామాతతాయినం హన్యా దింద్రశత్రో స్స తే వధః. 85-15
వరో దత్తో మహాబాహో సర్వలోకేశ్వరేణ వై. 85-16

రామప్రభూ! ఇప్పుడా సన్నివేశము తటస్థించినది. సందర్భము లన్నియు అనుకూలముగా నున్నవి. కావున వెంటనే ప్రయత్నము చేయవలయును. ఇంద్రజిత్తు మరణించునేని రావణుడు మరణించినట్లే భావింపుము.

వధాయేంద్రజితో రామ సందిశస్వ మహాబల
హతే తస్మిన్ హతం విద్ధి రావణం ససుహృజ్జనమ్. 85-16

*రాముడు* : విభీషణా! ఇంద్రజిత్తుమాయ నే నెరుగుదును. నీ వన్నట్లే లక్ష్మణుని ఇప్పుడే పంపెదను.

లక్ష్మణా! నీవు సైన్యసమేతుడవై హనుమంతుడు మున్నగు వానరప్రముఖులను వెంటబెట్టుకొని వెళ్లి ఆ మాయలమారి ఇంద్రజిత్తును వధింపుము. ఆ ప్రదేశముతో పరిచయముగల విభీషణుడు తన మంత్రులనుగూడి నీకు తోడురాగలడు.

జహి తం రాక్షససుతం మాయాబల విశారదమ్
అయం త్వాం సచివై స్సార్ధం మహాత్మా రజనీచరః. 85-23

అభిజ్ఞ స్తస్య దేశస్య పృష్ఠతోఽనుగమిష్యతి. 85-24

## లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించుటకు వెడలుట

లక్ష్మణుడు కవచము ధరించి, ధనుర్బాణములును, ఖడ్గమును గైకొని శ్రీరామ పాదములకు మ్రొక్కి శ్రీరామునికి ప్రదక్షిణము చేసి ఆ మహనీయుని మంగళాశీర్వాదములు పొంది ఇంద్రజిత్తును వధించుటకు బయలుదేరినాడు.

హనుమంతుడు మున్నగు వానరప్రముఖులు, విభీషణుడు, విభీషణునిమంత్రులు, వానర సేనలును లక్ష్మణునివెంట వెళ్ళినారు.

లక్ష్మణుడు దూర ప్రయాణము చేసి, వ్యూహాముగా తీర్చి యుండిన రాక్షస సైన్యమును చూచినాడు. లక్ష్మణుడు శత్రుసైన్యములోనికి ప్రవేశించినాడు.

**విభీషణుడు :** లక్ష్మణా! అటు చూడుము. మేఘమువలె నల్లగా కనబడుచున్న ఆ రాక్షస సైన్యముమీద వానరులు తమ ఆయుధములను ప్రయోగించి సైన్యమును భేదించినచో ఇంద్రజిత్తు కానబడును. నీవుకూడ ఆ రాక్షసులమీద బాణములు వేయుము. దురాత్ముడైన ఇంద్రజిత్తును వధింపుము.

జహి వీర దురాత్మానం మాయాపర మధార్మికమ్
రావణిం క్రూరకర్మాణం సర్వలోక భయావహమ్. 86-5

లక్ష్మణుడు తీవ్రబాణములు ప్రయోగించినాడు. వానరులు రాక్షససేనలపై కరిగి విజృంభించినారు. వానరులకును రాక్షసులకును భీకరయుద్ధము జరిగినది. రాక్షసులు తండోపతండములుగా హతులైనారు.

ఈ వార్త ఇంద్రజిత్తు విని, కోపోద్రిక్తుడై, హోమకార్యమును పూర్తి చేయకయే లేచి వృక్షాంధకారమైన ప్రదేశమునుండి నిర్గమించి, అంతకు మునుపే సిద్ధము చేయబడియుండిన రథము నధిరోహించి ధనుర్ధరుడై, యమునివంటి భయంకరరూపము దాల్చి, శత్రువుతో యుద్ధము చేయుటకు వచ్చినాడు.

స్వమనీకం విషణ్ణం తు శ్రుత్వా శత్రుభిరర్దితమ్
ఉదతిష్ఠత దుర్ధర్ష స్తత్కర్మణ్యననుష్ఠితే. 86-14

వృక్షాంధకారా న్నిర్గత్య జాతక్రోధ స్స రావణిః
ఆరురోహ రథం సజ్జం పూర్వయుక్తం స రాక్షసః. 86-15

హనుమంతుడు పర్వతాకారుడై రాక్షస సైన్యమును చించిచెండాడుచున్నాడు. ఇంద్రజిత్తు తన రథమును హనుమంతునిపైకి మరలించి అతనిపై శరవర్షమును కురిపించినాడు.

**హనుమంతుడు :** దుర్మార్గుడా! యుద్ధములో వాయుపుత్రుని ఎదుర్కొని ప్రాణములతో బయటబడినవా డెవ్వడును లేడు. శూరుడవైనచో నాతో యుద్ధము చేయుము. చేతనైనచో నాతో ద్వంద్వయుద్ధము చేయుము.

ఇంద్రజిత్తు ధనుస్సు గైకొని, హనుమంతుని వధింప నుద్యమించి యున్నాడని విభీషణుడు లక్ష్మణునికి హెచ్చరిక చేసినాడు.

**విభీషణుడు :** లక్ష్మణా! ఉపేక్షకు సమయముకాదు. నీవు బాణములు ప్రయోగించి ఇంద్రజిత్తును వధింపుము.

ఈ మాటలు చెప్పి, విభీషణుడు లక్ష్మణుని ఇంద్రజిత్తు చేరువకు తీసికొని వెళ్ళినాడు. ఇంద్రజిత్తు హోమము చేయుచుండిన ప్రదేశమును లక్ష్మణునికి చూపించి

**విభీషణుడు** : లక్ష్మణా! నల్లని మేఘమువలె భయంకరముగా కన్పట్టుచున్న ఆ వటవృక్షమును చూచితివా ! అదియే ఇంద్రజిత్తు భూతములకు బలి నొసంగు చోటు. అక్కడ బలి ఇచ్చి యుద్ధమునకు వెడలివచ్చి అంతర్ధానగతుడై శత్రువులను వధించును.

ఇంద్రజిత్తును ఆ వటవృక్షము చెంతకు రానీయరాదు. అచ్చటికి అతడు రాక మున్నే నీ వతనిని వధింపుము.

అవిదూరం తతో గత్వా ప్రవిశ్య చ మహద్వనమ్
దర్శయామాస తత్కర్మ లక్ష్మణాయ విభీషణః. 87-2

నీలజీమూత సంకాశం న్యగ్రోధం భీమదర్శనమ్
తేజస్వీ రావణభ్రాతా లక్ష్మణాయ న్యవేదయత్. 87-3

ఇహోపహారం భూతానాం బలవా న్రావణాత్మజః
ఉపహృత్య తతః పశ్చా త్సంగ్రామ మభివర్తతే. 87-4

అదృశ్య స్సర్వభూతానాం తతో భవతి రాక్షసః
నిహంతి సమరే శత్రూన్ బధ్నాతి చ శరోత్తమైః. 87-5

తమప్రవిష్టన్యగ్రోధం బలినం రావణాత్మజమ్
విధ్వంసయ శరై స్తీక్ష్ణై స్సరథం సాశ్వసారథిమ్. 87-6

లక్ష్మణుడు ధనుస్సును సారించి, ఇంద్రజిత్తును నివారించుటకు వటవృక్షము సమీపమున సిద్ధముగా ఉన్నాడు.

ఇంద్రజిత్తు కవచమును ధరించి, ధనుస్సును గ్రహించి, రథారూఢుడై వచ్చి లక్ష్మణునికంట బడినాడు. లక్ష్మణుడు ఇంద్రజిత్తును యుద్ధమున కాహ్వానించినాడు. ఇంద్రజిత్తు విభీషణుని చూచి పరుషముగా పలుకుచున్నాడు.

**ఇంద్రజిత్తు**: రాక్షసాధముడా ! నీవు ఇక్కడ పుట్టి పెరిగి, నా తండ్రికి తమ్ముడవై యుండి, కుమారునిపట్ల ఎంత ద్రోహము తలపెట్టితివి ! దురాత్ముడా ! బంధుత్వము, స్నేహము, కులము, సౌదర్యము, ధర్మము మున్నగువానిని లెక్క సేయక ఎంత పని చేసితివి ! నీ సొంత బంధువులను వదలిపెట్టి పరునికి భృత్యుడవై తివిగదా ! నీవు బుద్ధిహీనుడవుగనుక, స్వజనసంవాసమునకును, నీచ పరాశ్రయమునకును గల మహదంతరమును గుర్తింపలేకపోయితివి. పరులు గుణవంతులైనను, స్వజనులు గుణహీనులైనను, ఏనాటికైన స్వజనులపొందు మేలని యెరుగుము. పరుడు ఎల్లప్పుడు

**పరులేగాని** మనవా డగునా! స్వపక్షమును విసర్జించి పరపక్షమును సేవించువాడు ఎన్నటికిని బాగుపడడు. స్వపక్షము క్షీణించినతోడనే ఆ ద్రోహిని శత్రువు వధింపగలడు. నీచుడా! ఇట్టి ఘోరమును నీవుతప్ప మఱెవ్వరును చేయజాలరు.

ఇహ త్వం జాత సంవృద్ధ స్సాక్షాద్భ్రాతా పితుర్మమ
కథం ద్రుహ్యసి పుత్రస్య పితృవ్యో మమ రాక్షస. 87-11

న జ్ఞాతిత్వం న సౌహార్దం న జాతి స్తవ దుర్మతే
ప్రమాణం న చ సౌదర్యం న ధర్మో ధర్మదూషణ. 87-12

శోచ్య స్త్వమసి దుర్బుద్ధే నిందనీయశ్చ సాధుభిః
య స్త్వం స్వజన ముత్సృజ్య పరభృత్యత్వ మాగతః. 87-13

నైతచ్ఛిథిలయా బుద్ధ్యా త్వం వేత్సి మహదంతరమ్
క్వ చ స్వజనసంవాసః క్వ చ నీచ పరాశ్రయః. 87-14

గుణవాన్ వా పరజన స్స్వజనో నిర్గుణోపి వా
నిర్గుణ స్స్వజన శ్శ్రేయాన్ యః పరః పర ఏవ సః 87-15

య స్స్వపక్షం పరిత్యజ్య పరపక్షం నిషేవతే
స స్వపక్షే క్షయం ప్రాప్తే పశ్చాత్తై రేవ హన్యతే. 87-16

**విభీషణుడు:** దుష్టాత్ముడా! ఏల నోటికి వచ్చినట్లు ప్రేలుచున్నావు. నేను రాక్షస కులములో జన్మించినను నా శీలము సత్వసంపన్న మని ఎరుగవా? దుర్మార్గముగాని, అధర్మముగాని నాకు మొదటినుండియు సరిపడవు. కావుననే అన్నను పరిత్యజించి రాగలిగితిని.

[ధర్మబుద్ధిగలవాడు బంధుత్వమును పాటింపడు]

న రమే దారుణేనాహం న చాధర్మేణ వై రమే
భ్రాత్రా విషమశీలేన కథం భ్రాతా నిరస్యతే. 87-20

ధర్మమును పరిత్యజించి అధర్మము నాశ్రయించినవానిని వెంటనే వదలిపెట్టి వచ్చుటయే యుక్తము. హింసించుట, పరధనము నపహరించుట, పరదారాభిమర్శనము మున్నగు దురాచారములు గలవానిని మండుచున్న ఇంటిని విడిచిపెట్టునట్టు విడువవలయు నని పెద్ద లందురు.

[ఇల్లు తగులబడుచున్నప్పుడు మన ఇల్లుగదా యని ఎవ్వరైన అందులో నుందురా!]

హింసా పరస్వహరణే పరదారాభిమర్శనమ్
త్యాజ్యమాహు ర్దురాచారం వేశ్మ ప్రజ్వలితం యథా. 87-22

పరధనములను అపహరించుట, పరదారాభిమర్శనము, స్నేహితులను విశ్వసింపక పోవుట, ఈ మూడు దుర్గుణములును ఎవ్వనినైన నాశనము చేయగలవు.

రావణుడు గర్వించి ఋషులను వధించినాడు. దేవతలతో యుద్ధమాడినాడు. ఐశ్వర్యమును జీవితమును నశింపజేయగల దుర్గుణము లన్నియు రావణునియందు నెల కొని యున్నవి. కావున రావణుని పరిత్యజించి వచ్చితిని.

దుర్మార్గుడా! త్వరలోనే నీవును, నీ తండ్రియును, లంకలోని సమస్త రాక్షసులును సర్వనాశము కాగలరు. నీకు కాల మాసన్నమైనందున నోటికవచ్చినట్లు ప్రేలుచున్నావు. ఎంత చేసినను, నీవు మాత్రము వటవృక్షము చెంతకు పోజాలవు. రామలక్ష్మణులను అవమానించి నీవు ప్రాణముతో ఉండజాలవు.

ప్రవేష్టుం న త్వయా శక్యో న్యగ్రోధో రాక్షసాధమ
ధర్షయిత్వా చ కాకుత్స్థౌ న శక్యం జీవితుం త్వయా. 87-29

లక్ష్మణుడు నీతో యుద్ధము చేసి నిన్ను వధించుటకు వచ్చియున్నాడు. నీవుగాని, నీ సేనలుగాని ప్రాణములతో మరలి పోజాలరు.

ఈ మాటలు విని ఇంద్రజిత్తు కోపోద్దీప్తుడై ధనుస్సు గైకొని కాలాంతకుని భంగి విభీషణునిపైకి వచ్చినాడు. ఇంద్రజిత్తు రథస్థుడైయుండుట చూచి లక్ష్మణుడు హనుమంతుని భుజములపై నెక్కి యుద్ధమునకు పూనుకొన్నాడు.

## లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించుట

*ఇంద్రజిత్తు* : లక్ష్మణా! మీ రెవ్వరును నా యెదుట నిలువలేరు. ఆనాడు నిశాయుద్ధమున నిన్నును, మీ అన్నను, నాగపాశములతో బంధించిన మాట మరచిపోయితివా యేమి? నిన్ని క్షణముననే యమపురికంపెదను.

*లక్ష్మణుడు* : పనులు చేతలతో అగునుగాని, మాటలతో అగునా! నీ వానాడు కంటికగుపడక రాత్రివేళ చేసిన యుద్ధము దొంగలు చేయు పనియేగాని, వీరుడు చేయుపని కాదు. నీకు పరాక్రమము కలదేని ఇప్పుడు ప్రదర్శింపుము.

అంతర్ధానగతేనాజౌ యస్త్వయా చరిత స్తదా
తస్కరాచరితో మార్గో నైష వీరనిషేవితః 88-15

ఇంద్రజిత్తు బాణములు వేసినాడు. లక్ష్మణుని శరీరమునుండి రక్తము స్రవించినది.

*ఇంద్రజిత్తు* : లక్ష్మణా! నీవు నీ ప్రాణములను ఎక్కువసేపు కాపాడుకొనలేవు.

**లక్ష్మణుడు :** రాక్షసుడా ! ప్రేలకుము. ఇదిగో ! బాణము వేయుచున్నాను. చేతనైన రక్షించుకొనుము.

లక్ష్మణుడు ఇంద్రజిత్తు వక్షమున అయిదు బాణములు నాటినాడు. ఈ విధముగా ఒకరిమీద ఒకరు బాణములు వేయుచున్నారు. ఇద్దరును బలసంపన్నులు, పరాక్రమవంతులు, సర్వశస్త్రాస్త్రకోవిదులు. వారిలో నెవరెవ్వరినిగాని జయించుట సులభముకాదు. ఆకసమున గ్రహములు ఒండొంటితో పోరునట్లు ఇద్దరును తీవ్రముగా యుద్ధము చేయుచున్నారు.

**ఉభౌ హి బలసమ్పన్నా వుభౌ విక్రమశాలినౌ**
**ఉభావపి సువిక్రాన్తౌ సర్వ శస్త్రాస్త్ర కోవిదౌ.** 88-34

**ఉభౌ పరమ దుర్జేయా వతుల్య బలతేజసౌ**
**యుయుధా తే తదా వీరౌ గ్రహావివ నభోగతౌ.** 88-35

ఇంద్రుడును వృత్రాసురుడును పోరినట్లు, అరణ్యమున సింహములు పోరునట్లు, ఉభయులు ఉత్సాహముతో యుద్ధము చేయుచున్నారు.

లక్ష్మణుడొక దివ్యబాణమును సంధించి ఇంద్రజిత్తుమీద ప్రయోగించినాడు. లక్ష్మణ ధనుష్టంకార నాదమును విన్నంతనే ఇంద్రజిత్తు ముఖము వెలవెలపోయినది. విభీషణుడు దీనిని గుర్తించి లక్ష్మణుని హెచ్చరించుచున్నాడు.

**విభీషణుడు :** లక్ష్మణా ! ఇంద్రజిత్తు ముఖకాంతి తరిగిపోవుచున్నది. అతని లక్షణములను బట్టి అతని పరాక్రమము భగ్నమైనట్లు ఏర్పడుచున్నది. ఇందులో సందేహము లేదు. ఇప్పుడే త్వరపడి కార్యమును పూర్తిచేయుము.

**నిమిత్తా న్యనుపశ్యామి యాన్యస్మిన్ రావణాత్మజే**
**త్వర తేన మహాబాహో భగ్న ఏష న సంశయః.** 89-4

లక్ష్మణుడు అగ్నిశిఖలవంటి బాణములను ప్రయోగింపగా ఇంద్రజిత్తు మూర్ఛిల్లినాడు. కాని, వెంటనే మూర్ఛదేరి లక్ష్మణునిమీద ఏడు బాణములు వేసినాడు. హనుమంతునిమీద పది బాణములను, విభీషణునిమీద నూరు బాణములను వేసినాడు. లక్ష్మణుడు చలింపలేదు.

**లక్ష్మణుడు :** (నవ్వుచు) రాక్షసుడా ! నీ బాణములు ఇంత లఘువుగా ఉన్నవేమి ! నా బాణముల రుచి చూడుము.

లక్ష్మణుడు ఇంద్రజిత్తుమీద బాణములు వేసినాడు. ఇంద్రజిత్తు కవచము ముక్కలై క్రింద పడిపోయినది. ఇంద్రజిత్తు కోపావిష్టుడై లక్ష్మణునిమీద శరవర్షమును కురిపించినాడు.

ఈ విధముగా ఉభయవీరులు ఒకరు చేసిన దానికి మరియొకరు ప్రతిక్రియ చేయుచున్నారు.

కృత ప్రతికృతాన్యోన్యం బభూవతు రభిద్రుతౌ. 89-22

ఇద్దరి శరీరములనిండ బాణములు గ్రుచ్చుకొని రక్తము ప్రవహించుచున్నది. ఒకరిమీద ఒకరు శరవర్షమును కురిపించుచు దీర్ఘకాలము యుద్ధము చేసినారు. విసువు గాని అలసటగాని చెందక ఇరువురును పోరుచున్నారు. వారు అస్త్రములు సైతము ప్రయోగించినారు. వారి ధనుస్సులనుండి వెల్వడిన బాణములతో భూమి నిండిపోయినది.

లక్ష్మణునికి ఉత్సాహము కలిగించుటకు విభీషణుడు లక్ష్మణుని చెంతకు వచ్చి తానుకూడ యుద్ధము చేయుటకు పూనుకొన్నాడు.

రాక్షససైన్యములమీద బాణములు వేసి, విభీషణుడు అనేక రాక్షసులను వధించి నాడు. విభీషణుని మంత్రులుకూడ యుద్ధముచేయుచున్నారు. వానరవీరులకు ఉత్సాహము కలిగించుటకై విభీషణుడు వారితో అనుచున్నాడు.

*విభీషణుడు* : వానరవీరులారా! ఈ ఇంద్రజిత్తు మాత్రమే మిగిలియున్నాడు. ఇత డొక్కడే రావణుని గతి. ఇతడు హతుడైనచో రావణుని బల మంతయు హతమైనట్లే! రావణుడుమాత్రమే మిగిలియుండును. మీరు ఉపేక్షచేయక ఇంద్రజిత్తు సైన్యమును తుదముట్టింపుడు.

అస్మిన్ వినిహతే పాపే రాక్షసే రణమూర్ధని
రావణం వర్జయిత్వా తు శేషమస్య బలం హతమ్. 90-9

ప్రహస్తుడు, నికుంభుడు, కుంభకర్ణుడు, కుంభుడు, ధూమ్రాక్షుడు, జంబుమాలి, మహామాలి, తీక్ష్ణవేగుడు, అశనిప్రభుడు, సుప్తఘ్నుడు, యజ్ఞకోపుడు, వజ్రదంష్ట్రుడు, సంహ్రాది, వికటుడు, నిఘ్నుడు, తపనుడు, దముడు, ప్రఘాసుడు, ప్రఘసుడు, ప్రజంఘుడు, జంఘుడు, మున్నగు మేటివీరులను మీరు వధించియున్నారు. అగ్నికేతుడు, రశ్మికేతుడు, విద్యుజ్జిహ్వుడు, ద్విజిహ్వుడు, సూర్యశత్రుడు, అకంపనుడు, సుపార్శ్వుడు, చక్రమాలి, కంపనుడు, ఇంకను అనేక రాక్షసవీరులు మీచే హతులయినారు. బలసంపన్నులైన దేవాంతక నరాంతకులనుసైతము మీరు వధించినారు. ఇక మిగిలియున్నపని మీకొక పెద్దపనికాదు.

పాపాత్ముడైన యీ ఇంద్రజిత్తును రామకార్యార్థమై నేనే వధించియుందును. కాని కుమారుని చంపుట యుక్తముకాదని అంతపనికి పూనుకొనకున్నాను. అదియు

గాక, నేనే ఇతనిని చంపజూడగా, కన్నీరు కన్నులనిండ క్రమ్మి నా చూపునకు అడ్డుపడు చున్నది. కావున లక్ష్మణుడే ఇంద్రజిత్తును వధింపగలడు.

అయుక్తం నిధనం కర్తుం పుత్త్రస్య జనితుర్మమ
ఘృణామపాస్య రామార్థే నిహన్యాం భ్రాతురాత్మజమ్. 90-17

హంతుకామస్య మే బాష్పం చక్షుశ్చైవ నిరుధ్యతి
తమేవైష మహాబాహు ర్లక్ష్మణ శ్శమయిష్యతి. 90-18

వానరులారా ! మీరు ఇంద్రజిత్తు సైన్యములను వధించిపుచ్చుడు.

విభీషణుని ప్రోత్సాహవాక్యములను విని వానరులు తీవ్రముగా పోరుచున్నారు. జాంబవంతుడు తన భల్లూకసైన్యమును రాక్షసులపైకి పంపినాడు. రాక్షసులకు ఋక్షులకు గొప్ప యుద్ధము జరిగినది. హనుమంతుడుసైతము యుద్ధముచేయుచున్నాడు.

[ఇంద్రజిత్తు విభీషణునిపైకి పోయినందున హనుమంతునికి యెడతెరపి కలిగినదికాబోలు].

ఇంద్రజిత్తు విభీషణునితో యుద్ధమాడి మరల లక్ష్మణునిపైకి వచ్చినాడు.

స దత్వా తుములం యుద్ధం పితృవ్యస్యేంద్రజిద్యుధి
లక్ష్మణం పరవీరఘ్నం పునరేవాభ్యధావత. 90-26

ఇంద్రజిత్తునకును లక్ష్మణునికిని భయంకరమైన యుద్ధము జరిగినది. బాణములు ఆకాశ మెల్లెడల ఎగురుచున్నవి. ఉభయుల హస్తలాఘవము ప్రశస్తమైనది. బాణము తీయుటగాని, సంధించుటగాని, వేయుటగాని కంటికి కనబడుటలేదు. బాణములు మాత్రము కుప్పలు కుప్పలుగా వచ్చిపడుచున్నవి. ఆకాశము శరములతో కప్పబడి చీకట్లు క్రమ్మినవి. యుద్ధభూమియందు రక్తనదులు ప్రవహించుచున్నవి. ఈ గొప్ప యుద్ధమును తిలకించుటకు దేవతలు, ఋషులు వచ్చినారు. ఈ భయంకరయుద్ధమును చూచినవారికి జంకు పుట్టినది. యుద్ధము ఆగలేదు. లక్ష్మణుడు నాలుగు బాణములు గైకొని ఇంద్రజిత్తు రథాశ్వములను నొప్పించినాడు. మరియొక బాణముతో సారథిని వధించినాడు.

ఇంద్రజిత్తు స్వయముగా సారథ్యము చేసికొనుచు, బాణములు వేయుచు, అద్భుత యుద్ధమును చేయుచున్నాడు. ఇంద్రజిత్తు సామర్థ్యమును చూచి అందరును అబ్బురపడినారు.

స్వయం సారథ్యమకరోత్ పునశ్చ ధనురస్పృశత్
తదద్భుతమభూత్తత్ర సామర్థ్యం పశ్యతాం యుధి. 90-43

ఇంద్రజిత్తుమాత్రము ఈ విధముగా ఎంతసేపని యుద్ధము చేయగలడు! లక్ష్మణుడు సామాన్యుడు కాడు. ఇంద్రజిత్తు ఛిద్రములను వెదకి బాణములు ప్రయోగించుచున్నాడు. ఇంద్రజిత్తునకు ఉత్సాహము తగ్గినది. ముఖము వాడినది. వానరులకు ఉత్సాహము బలమయినది. వానరవీరులైన ప్రమాథి, శరభుడు, రభసుడు, గంధమాదనుడు, ఈ నలుగురు బయలువెడలి ఇంద్రజిత్తు రథాశ్వములను నాలుగింటిని కొట్టి చంపినారు. రథమును విరిచి, మరలివచ్చి లక్ష్మణుని చెంత నిలబడినారు.

ఇంద్రజిత్తు రథమును విడిచి క్రిందికి దిగి యుద్ధము చేయుచున్నాడు. ఒక ప్రక్కన రాక్షససేనలును వానరసేనలును ఘోరయుద్ధము చేయుచున్నారు. ఇంద్రజిత్తు రాక్షసులతో అనుచున్నాడు.

*ఇంద్రజిత్తు* : రాక్షసులారా! మీరు వానరులతో తీవ్రముగా పోరుచుండుడు. నేను పోయి మరియొక రథము నెక్కివచ్చెదను. నేను పోవుసంగతి వారికి తెలిసినచో నన్ను పోనీయరు. కావున వారికి నా తలపు గోచరము కాకుండునట్లు మీరు తీవ్ర యుద్ధమును సాగింపవలయును.

రాక్షసుల కిట్లు ఆదేశించి, వానరులను మోసపుచ్చి, ఇంద్రజిత్తు లంకలోనికి పోయి క్రొత్తరథము నెక్కివచ్చి, యుద్ధమునకు పూనుకొన్నాడు. ఇంద్రజిత్తు కావించిన ఈ అద్భుత కార్యమును చూచి అందరును ఆశ్చర్యపడినారు. ఇంద్రజిత్తు వానరులమీద బాణవర్షమును కురిపించినాడు. వానరులు లక్ష్మణుని శరణుజొచ్చినారు.

లక్ష్మణుడు తన హస్తలాఘవమును ప్రదర్శించి ఇంద్రజిత్తు ధనుస్సును ఖండించినాడు. ఇంద్రజిత్తు మరియొక ధనుస్సును గ్రహించినాడు. లక్ష్మణుడు మూడు బాణములు వేసి దానినికూడ ఖండించి ఇంద్రజిత్తు భుజాంతరమున అయిదు బాణములను నాటినాడు. ఇంద్రజిత్తు శరీరమునుండి రక్తము ప్రవహించినది. కవచము భిన్నమయినది. ఇంద్రజిత్తు మరియొక దృఢమైన ధనుస్సు గైకొని లక్ష్మణునిపై లెక్కలేని బాణములను వేసినాడు. లక్ష్మణుడు వాని నన్నింటిని నివారించి ఒక భల్లమును ప్రయోగించి ఇంద్రజిత్తు సారథిని వధించినాడు. సారథి లేకపోయినను ఆ గుఱ్ఱములు వానియంతట అవియే రథమును మండలాకారముగా త్రిప్పుచుండినవి! ఈ చిత్రమును చూచి అందరు ఆశ్చర్యపడినారు.

ఇంద్రజిత్తూ లక్ష్మణుడూ ఒకరిమీద ఒకరు బాణములు వేసికొనుచున్నారు. ఇంద్రజిత్తు లక్ష్మణుని కవచమును భేదించుటకు ప్రయత్నించినాడు కాని లాభము లేక పోయినది. లక్ష్మణుని కవచము అభేద్యమని గురితించి ఇంద్రజిత్తు లక్ష్మణుని లలాటమున

మూడు బాణములు నాటవేసినాడు. లక్ష్మణుడు ఇంద్రజిత్తుముఖమున అయిదు బాణములను వేసినాడు. ఉభయుల శరీరములనుండియు రక్తము వెల్లువలుగా ప్రవహించినది.

ఇంద్రజిత్తునకు విభీషణునిపై క్రోధము కలిగినది. విభీషణునిమీద మూడు బాణములు వేసినాడు. విభీషణుడు కోపించి ఇంద్రజిత్తు రథాశ్వములను తన గదతో మోది చంపినాడు.

ఇంద్రజిత్తు రథమునుండి దిగి రథ'శక్తి'ని తీసి విభీషణునిపై ప్రయోగించినాడు. లక్ష్మణుడు బాణములు వైచి ఆశక్తిని దారిలోనే ఖండించినాడు. విభీషణుడు ఇంద్రజిత్తు వక్షస్థలమున అయిదు బాణములు వేసి నొప్పించినాడు. ఇంద్రజిత్తు విభీషణునిమీద వేయుటకు యమదత్తమైన బాణమును తీసినాడు. లక్ష్మణుడు దీనిని గమనించి కుబేరుడు తనకు స్వప్నమందు ఇచ్చిన బాణమును వింట సంధించి వదలినాడు. ఆ రెండు బాణములు ఒకదానిని ఒకటి తాకి శాంతించి క్రింద పడిపోయినవి.

లక్ష్మణుడు వారుణాస్త్రమును ప్రయోగించినాడు. ఇంద్రజిత్తు రౌద్రాస్త్రమును ప్రయోగించి దానిని ప్రతిహతము చేసినాడు. ఇంద్రజిత్తు అగ్నేయాస్త్రమును ప్రయోగించినాడు. లక్ష్మణుడు దానిని సౌరాస్త్రముతో నిరోధించినాడు. ఇంద్రజిత్తు ఆసురాస్త్రమును ప్రయోగించినాడు. లక్ష్మణుడు మాహేశ్వరాస్త్రమును ప్రయోగించి దానిని నివారించినాడు. ఈ యుద్ధమును చూచుటకు దేవతలు, ఋషులు, గరుడులు, ఉరగులు, మున్నగువారు దేవేంద్రుని పురస్కరించుకొని వచ్చి ఆకసమున నిలిచియున్నారు. వీరందరు లక్ష్మణునికి బాధ కలుగకుండునట్లు రక్షించుచున్నారు.

ఋషయః పితరో దేవా గంధర్వా గరుడోరగాః
శతక్రతుం పురస్కృత్య రరక్షు ర్లక్ష్మణం రణే. 91-65

[మనకు తెలియకయే, మంచివారిని దేవతలు రక్షించుచుందురు.]

లక్ష్మణుడు మరియొక బాణమును గైకొని ఐంద్రాస్త్ర మంత్రముతో అభిమంత్రించి వింట సంధించినాడు. దేవాసురయుద్ధములో దేవేంద్రుడు యీ అస్త్రమునే ప్రయోగించి విజయము సాధించినాడు.

తదైంద్రమస్త్రం సౌమిత్రి స్సంయుగే ష్వపరాజితమ్.
శరశ్రేష్ఠం ధనుశ్శ్రేష్ఠే నరశ్రేష్ఠోభిసందధే. 91-70

లక్ష్మణుడు ధనుస్సును వంచి ఆకర్షించి (ఒక అపూర్వమైన దివ్యాస్త్రమును సృష్టించి) బాణమును ఉద్దేశించి అనుచున్నాడు.

**లక్ష్మణుడు :** బాణమా! దశరథపుత్రుడైన శ్రీరాముడు ధర్మాత్ముడును, సత్యసంధుడును, ఎదురులేని పరాక్రమశాలియు అగునేని నీవు యీ ఇంద్రజిత్తును వధింపుము.

ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది
పౌరుషే చాప్రతిద్వంద్వః శరైనం జహి రావణిమ్. 91-73

ఈ మంత్రమును స్మరించి లక్ష్మణుడు బాణమును వదలినాడు. ఆ బాణము శీఘ్రమున పోయి ఇంద్రజిత్తు శిరస్సును ఖండించినది. ఇంద్రజిత్తు శిరస్సు శరీరమునుండి విడిపడి క్రింద పడిపోయినది.

[పై శ్లోకమును రామాయణమునకు మూలమంత్రముగా పెద్దలు స్వీకరించినారు. శ్రీరాముని గుణసంపదను అపార తేజస్సును లక్ష్మణుడు వ్యక్తపరచినాడు.]

ఇంద్రజిత్తు మరణించినాడు.

వానరులు, విభీషణుడు, హర్షనాదములు చేసినారు. ఋషులు, దేవతలు, గంధర్వులు, మున్నగువారు సంతోషించినారు. పుష్పవృష్టి కురిసినది. అందరును లక్ష్మణుని గొప్పగా పూజించినారు. వానరులు 'లక్ష్మణో జయతి' అని సింహనాదములు చేసినారు. వారి ఆనందమునకు మేరలేదు.

[ఈ యుద్ధము మూడు అహోరాత్రములు జరిగినది. 92-16 శ్లోకములో ఈ మాట చెప్పియున్నారు. "అహోరాత్రైః త్రిభి ర్వీరః కథంచి ద్వినిపాతితః."]

ఇంద్రుని జయించిన లోకైకవీరుని వధించి లక్ష్మణుడు ఆనందమును పొందినాడు.

లక్ష్మణుని శరీరము రక్తసిక్తమై యున్నది. హనుమంతుడు మున్నగు వానర వీరులతోను, విభీషణునితోను కూడి లక్ష్మణుడు రాముని చెంత కరిగి, శ్రీరామునికి ప్రదక్షిణ నమస్కారములు కావించి, "ఇంద్రజిత్తు హతుడైనాడు" అని చెప్పినాడు.

[లక్ష్మణుని వినయము గమనింపదగియున్నది.]

**విభీషణుడు :** (సంతోషముతో) ఇంద్రజిత్తు శిరస్సు మహాత్ముడైన లక్ష్మణునిచే ఖండింపబడినది.

రావణేస్తు శిరశ్ఛిన్నం లక్ష్మణేన మహాత్మనా
న్యవేదయత రామాయ తథా హృష్టో విభీషణః. 92-6

[ఈ సంభాషణ ఎంతో నాజూకుగా ఉన్నది]

సిగ్గుపడుచున్న లక్ష్మణుని శ్రీరాముడు తన చెంతకు చేర్చుకొని తొడమీద కూర్చుండబెట్టుకొని, గాఢముగా కౌగిలించుకొని, తమ్ముని మాటిమాటికి చూచుచు ఆనందనిమగ్నుడైనాడు.

స తం శిరస్యుపాఘ్రాయ లక్ష్మణం లక్ష్మివర్ధనమ్
లజ్జమానం బలాత్స్నేహా దంక మారోప్య వీర్యవాన్. 92-9
ఉపవేశ్య తముత్సంగే పరిష్వజ్యావపీడితమ్
భ్రాతరం లక్ష్మణం స్నిగ్ధం పునః పునరవైక్షత. 92-10

బాణ పీడితుడై నిట్టూర్పులు విడుచుచున్న లక్ష్మణుని ఆశ్వాసించుచు

**రాముడు**: నాయనా! నీవు దుష్కరకార్యమును సాధించి ఇంద్రజిత్తును వధించి నాకు పరమ కల్యాణమును చేకూర్చితివి. ఇంద్రజిత్తు హతుడైనందున రావణుడు సైతము హతుడైనట్టే. జయము మనకు హస్తప్రాప్త మయినట్టే! ఈ యుద్ధమున విభీషణుడు, హనుమంతుడు మున్నగు వీరులు మూడు అహోరాత్రములు కష్టపడి విజయమునకు తోడ్పడినారు.

విభీషణ హనూమద్భ్యాం కృతం కర్మ మహద్రణే
అహోరాత్రైస్త్రిభి ర్వీరః కథంచిద్వినిపాతితః. 92-16

తమ్ముడా! నాథుడవైన నీవు ఇంద్రజిత్తును వధించితివి గనుక ఇకమీద సీతనుగాని, భూమండలమునుగాని పొందుటలో నాకెట్టి కష్టమును లేదు.

త్వయా లక్ష్మణ నాథేన సీతా చ పృథివీ చ మే
న దుష్ప్రాపా హతే త్వద్య శక్రజేతరి చాహవే. 92-18

శ్రీరాముడు లక్ష్మణుని ఆశ్వాసించి సుషేణుని పిలిచి అనుచున్నాడు.

**రాముడు**: సుషేణా! లక్ష్మణుని శరీరము బాణములతో నిండియున్నది. ఆ బాణములను తీసివైచి చికిత్స చేయుము. ఎవ్వరెవరు బాణపీడితులై బాధపడుచున్నారో వారి కందరకును చికిత్స చేయుము. అందరను ఆరోగ్యవంతులుగా చేయుము.

సుషేణు డొక దివ్యౌషధిని తెచ్చి లక్ష్మణునికి వాసన చూపించినాడు. అంతట లక్ష్మణుడు విశల్యుడైనాడు. గాయము లన్నియు మానిపోయి సుఖముగా ఉన్నాడు.

సుషేణుడు అందరకు చికిత్సలు చేసినాడు. అందరును ఆరోగ్యవంతులై సుఖముగా ఉన్నారు.

## రావణుని సంతాపము

**రావణుని సచివులు**: మహారాజా! ఇంద్రజిత్తు లక్ష్మణునితో గొప్పయుద్ధము చేసెనుగాని విభీషణుని సహాయముతో లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించినాడు. ఇంద్రజిత్తు వీరస్వర్గమున కరిగినాడు.

ఈ ఘోరవార్త వినుటతోడనే రావణుడు మూర్ఛిల్లినాడు. ఎంతోసేపటికి మూర్ఛదేరి విలపించుచున్నాడు.

**రావణుడు :** కుమారా! ఇంద్రుని జయించినవాడవుగదా! లక్ష్మణునికి చాలకపోయితివా! నీ విప్పుడు యమునిచెంత నున్నావుగనుక యముడు నాకు ప్రియబంధువైనాడు. నీవు వీరమార్గము ననుసరించి స్వర్గమున కరిగితివి. దేవగణములు, లోకపాలురు, ఋషులు, ఇకపైన భీతిరహితులై సుఖముగా నిదురింపగలరు. ఒక్క ఇంద్రజిత్తు లేకపోవుటవలన ముల్లోకములును నాకు శూన్యముగా కానబడుచున్నవి.

యౌవరాజ్యమును, లంకను, రాక్షసులను, తల్లిని, నన్ను, నీ భార్యను, ఎల్లరను విడిచిపోతివా నాయనా! ప్రేతకార్యములను నీవు నాకు చేయవలసియుండగా, నాచేత నీవు చేయించుకొనుచుంటివా! సుగ్రీవుడు, రామలక్ష్మణులు, ఇంకను బ్రతికియే యున్నారు! నీవు నా హృదయశల్యమును తీసివేయకయే పోతివా!

రావణునికి శోకమునుండి క్రోధము పుట్టుకొని వచ్చినది. పండ్లు పటపట కొరికినాడు. ఆ శబ్దము దానవులు యంత్రములు త్రిప్పునప్పుడు కలుగు గొప్ప శబ్దమువలె వినిపించినది.

దంతాన్విదశతస్తస్య శ్రూయతే దశనస్వనః
యంత్రస్యావేష్ట్యమానస్య మహతో దానవైరివ. 93-24

తన్ను పరివేష్టించియుండిన రాక్షసులను యుద్ధమునకు పురికొల్పుటకు రావణుడు వారితో అనుచున్నాడు.

**రావణుడు :** నేను గొప్ప తపస్సు చేసి బ్రహ్మయొద్ద వరములు పొందినాను. బ్రహ్మదేవుడు నాకు అభేద్యకవచమును, ధనుర్బాణములను ప్రసాదించియున్నాడు. యుద్ధములో నా యెదుట ఎవ్వడును నిలబడలేడు. నేను పోయి ఆ రామలక్ష్మణులను వధించెదను. నా కిట్టి శోకమును తెచ్చిపెట్టిన సీతను ఇప్పుడే ఖండించెదను. నా కుమారుడు మాయాసీతను చంపినాడు. నేను నిజమైన సీతను వధించెదను.

రావణుడు ఖడ్గమును తీసికొని సీతాదేవి చెంతకు వెడలినాడు. ఎందరు వారించినను నిలువలేదు. సీతాదేవి రావణాసురుని చూచి ఆక్రందించుచున్నది.

**సీత :** నాకు నాథుడుండియు, ఈ రాక్షసుడు నన్ను అనాథను వలె వధింప వచ్చుచున్నాడు! రామలక్ష్మణులను సైతము ఈ దురాత్ముడు వధించి యుండునా! అట్లైనట్టికిని జరిగియుండదు. ఈ రావణుడు రామలక్ష్మణులను వధింపజాలక, పుత్ర శోకము భరింపలేక, నాపై కసితీర్చుకొనుటకు వచ్చుచున్నాడు కాబోలు!

ఆనాడు హనుమంతుని మాట నాలకించి అతని వీపుపై నెక్కి వెళ్ళియుందునేని శ్రీరాముని అంకమున కూర్చుండి సుఖముగా ఉండియుందును! నా కిట్టి దుఃఖము కలిగియుండదు కదా!

హనూమతోపి యద్వాక్యం న కృతం క్షుద్రయా మయా. 93-54

యద్యహం తస్య పృష్ఠేన తదా యాయామనిందితా
నాద్యైవ మనుశోచేయం భర్తురంకగతా సతీ 93-55

ఆహా! ఆ మంథర పని ఎంతకు తెచ్చినది!

సీతాదేవి యీ రీతిగా విలపించుచుండినది. ఇంతలో రావణుని మంత్రియైన సుపార్శ్వుడు రావణుని నివారించి పలుకుచున్నాడు.

సుపార్శ్వుడు: మహారాజా! ఈ కార్యము నీవు చేయదగినది కాదు. నీవు అన్ని వేదములను అధ్యయనము చేసితివి. సమస్త విద్యలను నేర్చితివి. ఎల్లప్పుడును విహిత కర్మలను చేయుచున్నావు. నీవంటి వీరుడు స్త్రీవధ చేయవచ్చునా!

వేదవిద్య వ్రతస్నాత స్వకర్మనిరత స్సదా
స్త్రియాః కస్మాద్వధం వీర మన్యసే రాక్షసేశ్వర 93-63

రూపసంపన్నయైన సీతను రక్షించుకొనుము. నీ కోపమును రామునిమీద ప్రకటింపుము. రాముని వధింతువేని సీత నీ వశ మగును.

యుద్ధమునకు బయలుదేరుము. ఈనాడు చతుర్దశి. రేపు అమావాస్య. నేడు సన్నాహములను పూర్తిచేసి రేపటిదినమున సైన్యసహితుడవై పోయి, యుద్ధమాడుము, జయము కలుగును.

అభ్యుత్థానం త్వమద్యైవ కృష్ణపక్ష చతుర్దశీమ్
కృత్వా నిర్యాహ్యమావాస్యాం విజయాయ బలైర్వృతః 93-65

రావణు డీ హితవాక్యము నంగీకరించి యుద్ధప్రయత్నము చేయదలచి, సభామందిరము చేరినాడు.

రావణుడు సింహాసనముపై కూర్చుండి దైన్యముతోను, దుఃఖముతోను, క్రుంగిపోయి అక్కడ సమావిష్టులైన సేనాధ్యక్షులకు నమస్కార మొనర్చి వారితో చెప్పుచున్నాడు.

అబ్రవీచ్చ సతాన్ సర్వాన్ బలముఖ్యాన్ మహాబలః
రావణః ప్రాంజలి ర్వాక్యం పుత్రవ్యసనకర్శితః 94-2

[ముల్లోకములను గడగడలాడించిన రావణుడు సేనాధ్యక్షులకు నమస్కరించు చున్నాడు! రావణునికి ఎట్టిగతి పట్టినది !]

**రావణుడు :** సేనాధ్యక్షులారా ! మీరు మీ సైన్యములను కొనిపోయి రాముని మీద శర వర్షమును కురిపింపుడు. మీరు రాముని హతమార్చలేకపోయినను బాణములచే నొప్పింపుడు. నేను రేపు యుద్ధరంగము ప్రవేశించి మీ బాణక్షతుడై బాధపడు చున్న రాముని సులభముగా వధింపగలను.

అథవాహం శరై స్తీక్ష్ణై ర్భిన్నగాత్రం మహారణే
భవద్భి శ్శ్వో నిహంతాస్మి రామం లోకస్య పశ్యతః 94-5

## రావణుడు తన మూలబలమును యుద్ధమునకు పంపుట

రావణుడు తన మూలబలమును కదలించినాడు. రాక్షసులు యుద్ధమునకు బయలుదేరినారు. వానరులకును రాక్షసులకును దారుణయుద్ధము జరిగినది. రాక్షసులు విజృంభించి వానరులను వధించినారు. హతశేషులైన వానరులు రాముని శరణుజొచ్చి నారు. రాముడు ధనుస్సును చేబూని రాక్షస సైన్యములో ప్రవేశించినాడు. రాక్షసులు చచ్చిపడిపోవుచున్నారు. రథములు విరిగిపడుచున్నవి. రాక్షసులు భీతిజెంది పారిపోవుచున్నారు.

శ్రీరాముడుమాత్రము ఎవ్వని కంటికిని కనిపించుటలేదు. అడవిని ధ్వంసము చేయుచున్న పెనుగాలి కంటికి కనబడనట్లు రాముడు ఎవ్వనికిని కనిపించుటలేదు. దేహములో ఇంద్రియములను ఆడించుచున్న పరమాత్మ కంటికి కానరాని చందమున, శ్రీరాముని కార్యములు కనబడుచున్నవేగాని రాముడుమాత్రము కనిపించుటలేదు.

ప్రహరంతం శరీరేషు న తే పశ్యంతి రాఘవమ్
ఇంద్రియార్థేషు తిష్ఠంతం భూతాత్మానమివ ప్రజాః 94-23

శ్రీరాముడు గాంధర్వాస్త్రమును ప్రయోగించినాడు. రాక్షసు లందరు మోహితులై పడిపోయినారు. రాక్షససైన్యమును దహించుచున్న శ్రీరాముడుమాత్రము కనిపింపలేదు.

న తే దదృశిరే రామం దహంత మరివాహినీమ్
మోహితాః పరమాస్త్రేణ గాంధర్వేణ మహాత్మనా 94-26

రాక్షసులకు వేలకొలది రాములు కనబడుచున్నారు.

[ఏ వైపు చూచినను రాముడే కనబడుచున్నాడు]

మరల అప్పుడే ఒక్కడుగానే కనబడుచున్నాడు.

తే తు రామసహస్రాణి రణే పశ్యంతి రాక్షసాః
పునః పశ్యంతి కాకుత్థ్సమేకమేవ మహాహవే 94-27

శ్రీరాముడు ధనుస్సును మండలాకారము చేసి బాణవర్షము కురిపించుచున్నాడు. రాక్షసులను బలిగొనుచున్న రామచక్రము కాలచక్రమువలె కానవచ్చినది. రాక్షసులకు రామబాణముల తాకుడు తగులుచున్నదేకాని, వారికి రాముడు మాత్రము కనబడుటలేదు.

ఏడుకోట్ల యిరువది తొమ్మిది రథములు, పదమూడుకోట్ల పండ్రెండు లక్షల యిరువదివేల ఏనుగులు, రౌతులతోకూడిన గుఱ్ఱములు పదికోట్ల యిరువదిలక్షల అరువది వేలు, నూటనలుబదియైదుకోట్ల యెనుబదిలక్షల పదాతులుగల చతురంగబలమును ఒక్క పగటిపూటయొక్క యెనిమిదవ భాగములో అనగా మూడుమ్ముక్కాలు గడియలలో (ఒకటిన్నరగంట) రాముడు ఒక్కడు తన బాణములచే హత్య మొనరించినాడు.

దివసస్యాష్టమే భాగే శరై రగ్నిశిఖోపమైః
హతాన్యేకేన రామేణ రక్షసాం కామరూపిణామ్ 94-33

యుద్ధభూమి రుద్రుని క్రీడారంగముభంగి భయంకరముగా కాన్పించినది. రావణుని మూలబలము హతమయిపోయినది. దేవతలు, ఋషులు, పరమానంద భరితులై శ్రీరాముని ప్రస్తుతించినారు.

శ్రీరాముడు సుగ్రీవుని, విభీషణుని, హనుమదాది కపివీరులను చూచి అనుచున్నాడు.

రాముడు: దివ్యమైన యీ అస్త్రబలము నాకును, శివునికిని మాత్రమే కలదు.

[దీని భావము గమనింపదగియున్నది]

ఏతదస్త్రబలం దివ్యం మమ వా త్ర్యంబకస్య వా 94-38

శ్రీరాముడు శస్త్రాస్త్రములను ప్రయోగించి రాక్షససేనలను సునాయాసముగా వధించినందుకు దేవతలు అస్తోక ప్రమోదభరితులై శ్రీరాముని ప్రస్తుతించినారు.

## రాక్షసస్త్రీల విలాపము

రాక్షసయోధులందరు హతమైన వార్త వినిన రాక్షసస్త్రీలు భర్తలను, పుత్రులను, బంధుజనములను పోగొట్టుకొనినవారై గుంపులుగట్టుకొని విలపింపసాగినారు.

విధవా హతపుత్త్రాశ్చ క్రోశంత్యో హతబాంధవాః
రాక్షస్య స్సహసంగమ్య దుఃఖార్తాః పర్యదేవయన్ 95-5

రాక్షసస్త్రీలు : శూర్పణఖ ముసలిది. వికారస్వరూపిణి. ఇట్టి రాక్షసి మన్మథాకారుడైన రాముని మోహించి మన కీ సంతాపము తెచ్చినది! అట్టి అకార్యమును లోకములో ఇతరులు చేయుదురా! ఆ శూర్పణఖ కారణముగనే రావణుడు ఈ వైరమును తెచ్చుకొన్నాడు.

తన్నిమిత్త మిదం వైరం రావణేన కృతం మహత్ 95-11

ఇంతకును రావణుడు సీతను వశపరచుకొనలేకనే పోయినాడు! తన చావు కొరకే సీతను తెచ్చుకొన్నాడు. రామునితో విరోధము పెట్టుకొను మూర్ఖుడొకడుండునా! రాముని ప్రభావము తెలియనిదా! మునుపు సీతను అపహరింపబూనిన విరాధునికి ఏగతి పట్టినదో ఆ నిదర్శనము చాలదా!

వైదేహీం ప్రార్థయానం తం విరాధం ప్రేక్ష్య రాక్షసమ్
హతమేకేన రామేణ పర్యాప్తం తన్నిదర్శనమ్ 95-13

రాముడు జనస్థానములో పదునాలుగువేల రాక్షసులను, ఖరుని, దూషణుని, త్రిశిరుని పరిమార్చినాడు. యోజనబాహుడైన కబంధుని వధించినాడు. మహాబలశాలియైన వాలిని గూల్చి సుగ్రీవునికి రాజ్య మిప్పించినాడు. ఇవన్నియు రాముని పరాక్రమమునకు నిదర్శనములుకావా! రావణుడు పరమమూఢుడు. విభీషణుడు ఎంతదూరము బోధించినను ఆ ధర్మాత్మునిమాట చెవికి చేదైనది. ఆనాడు విభీషణుని హితవాక్యమును వినియుండినచో, ఈనాడు లంకాపట్టణము శ్మశాన మైయుండదుగదా! కుంభకర్ణుడు, అతికాయుడు, ఇంద్రజిత్తు మున్నగు మహావీరులు వధింపబడినను ఈ రావణునికి తెలివిరాలేదుగదా!

లంకలో ఏ ఇంటజూచినను "అయ్యో! నా కొడుకు పోయినాడు, నా భర్త పోయినాడు, నా సోదరుడు పోయినాడు" అను ఏడ్పులు వినబడుచుండినవి.

[సీతాదేవి వాక్కు ఫలించినది!]

మమ పుత్త్రో మమ భ్రాతా మమ భర్తా రణే హతః
ఇత్యేవం శ్రూయతే శబ్దో రాక్షసానాం కులే కులే 95-22

రాక్షసస్త్రీలు : మా వారందరు రామునిచే నిహతులైనారు. ఇక మాకు దిక్కెవ్వరు! అనాథలమైన మేము బ్రతికియుండి లాభ మేమి? రావణుడు శుద్ధమూఢుడు. రావణుడుకూడ త్వరలోనే చనిపోగలడు. మనుష్యునివలన మరణము కలుగ

కుండునట్లు రావణుడు వరము కోరుకొనలేదు. రావణుని వధించుటకే దేవతలు సీతను పంపియుందురు. రావణుని అవినీతివలన మన కెల్లరకు తీరనిదుఃఖము కలిగినది. రాముడు వధింపదలచుకొన్న వానిని ఒకడు రక్షింపగలడా? విభీషణుడు రాముని శరణుజొచ్చి సుఖపడినాడు.

రాక్షసస్త్రీల ఆర్తనాదములతో లంకాపురము నిండిపోయినది. రావణుడుకూడ ఈ విలాపములను విని కడుంగడు దుఃఖించినాడు. దుఃఖమునుండి కోపము జనించినది. పండ్లతో పెదవిని కొరికినాడు. కన్నులు చింతనిప్పులైనవి. భయంకరరూపమును దాల్చి

*రావణుడు* : (చెంతనున్న రాక్షసులను చూచి) నా ఆజ్ఞయైనదని చెప్పి సైన్యములను యుద్ధమునకు వెడలిరమ్మని తెలుపుడు. నేను యుద్ధభూమి కరిగి రామలక్ష్మణులను, వానరసేనలను విధ్వంసము చేసెదను. నా రథమును ఆయతము చేయుడు. చావక మిగిలియున్న రాక్షసు లందరు నా వెంట రండు.

[రాక్షసు డొక్కడైనను మిగిలియుండకూడదు కాబోలు !]

రావణుని ఆజ్ఞానుసారము బలాధ్యక్షులు ఇంటింటికి వెళ్ళి రాక్షసులను పిల్చినారు.

బలాధ్యక్షాస్తు సంరబ్ధా రాక్షసాంస్తాన్ గృహా ద్గృహాత్
చోదయంతః పరియయు ర్లంకాయాం తు మహాబలాః 96-23

సైన్యము సంసిద్ధమైనది. రావణుడు రథము నధిరోహించి యుద్ధమునకు బయలు వెడలినాడు. మహాపార్శ్వుడు, మహోదరుడు, విరూపాక్షుడు వారి వారి రథముల మీద రావణునివెంట కదలినారు.

## రావణుడు యుద్ధరంగమునకు పోవుట

రావణుడు సైన్యసమేతుడై ఉత్తరద్వారము వెల్వడి యుద్ధభూమి ప్రవేశించినాడు. రావణుని ఎడమకన్ను ఎడమచేయి అదిరినవి. ముఖము వెలవెలపోయినది. స్వరము క్షీణించినది. రావణు డీ దుశ్శకునములను సరకుసేయక యుద్ధమునకు పూనుకొన్నాడు. వానరులుకూడ యుద్ధసన్నద్ధులైయుండినారు. వానరసేనకును రాక్షసవాహినికిని ఘోరయుద్ధము జరిగినది. రావణుని శరపాతములకు పెక్కుమంది వానరులు మరణించినారు.

వానరుల భంగపాటును చూచి సుగ్రీవుడు రోషావేశముతో యుద్ధము చేసి అనేక రాక్షసులను వధించినాడు. విరూపాక్షుడు సుగ్రీవునితో తలపడినాడు. ఇద్దరకును భయంకర యుద్ధము జరిగినది. విరూపాక్షుని ఖడ్గక్షతికి సుగ్రీవుని కవచము ఛిన్నమయిపోయి

నది. అంతట, సుగ్రీవుడు తన అరచేత విరూపాక్షుని మర్దింపగా, విరూపాక్షుని నవరంధ్రములనుండియు రక్తము స్రవించినది. విరూపాక్షుడు విలవిల తన్నుకొని మరణించినాడు.

ఇరుపక్షములందును పెక్కండ్రు మరణించినారు. సైన్యములు క్షీణించినవి. రావణుడు వేదనపడుచు మహోదర మహాపార్శ్వులను యుద్ధమునకు పురికొల్పుచున్నాడు.

**రావణుడు :** వీరులారా! ఇప్పుడు మీవలన మనకు జయము కలుగవలయును. ఇంత కాలము నాచే పోషింపబడిన మీరు నాయెడ కృతజ్ఞత చూపవలసిన తరుణము వచ్చినది. మీరు అరమరలేక యుద్ధము చేయవలయును.

భర్తృపిండస్య కాలోఽయం నిర్దేష్టుం సాధు యుధ్యతామ్ 98-5

మహోదరుడు తన శౌర్యము ప్రకటించి వానరులను అంపకోత కోయుచున్నాడు. సుగ్రీవుడు దీనిని సహింపలేక మహోదరుని మార్కొనగా ఇరువురకు ప్రచండయుద్ధము జరిగినది. సుగ్రీవుడొక పరిఘమును మహోదరుడొక గదను గైకొని పోరాడినారు. పరిఘమును, గదయును ఒండొంటిని తాకి రెండును విరిగి పోయినవి. ఇద్దరును కొంతసేపు బాహుయుద్ధము చేసినారు. క్రిందపడియుండిన ఖడ్గములను చెరియొకటి తీసికొని ఖడ్గయుద్ధము కావించినారు. ఆ యుద్ధములో సుగ్రీవుడు మహోదరుని శిరస్సు ఖండించినాడు. రాక్షసులు భయపడి పరుగెత్తినారు. వానరులు సంతోషించి సుగ్రీవుని పూజించినారు.

మహాపార్శ్వుడు చెలరేగి అలవిమాలిన తెగువతో వానర సైన్యమును చించి చెండాడుచున్నాడు. అంగదుడు దీనిని గుర్తించి సహింపనోపక ఒక పరిఘము గైకొని గిరగిర త్రిప్పి మహాపార్శ్వునిపై వేయగా మహాపార్శ్వుని ధనుస్సు తునియలైనది. అంగదుడు తన పిడికిలితో మహాపార్శ్వుని రొమ్మున ఒక పోటు పొడిచినాడు. దానితో మహాపార్శ్వుడు యమపురి జేరినాడు.

## రావణుడు యుద్ధము చేయుట

రావణుడు యుద్ధరంగము ప్రవేశించినాడు.

**రావణుడు :** (సారథితో) మన రాక్షసులు హతులయినారు. రామలక్ష్మణులను వధించి, మనవారికి కలిగిన దుఃఖమును పోగొట్టెదను. సుగ్రీవుడు, జాంబవంతుడు, కుముదుడు, నలుడు, మైందుడు, ద్వివిదుడు, అంగదుడు, గంధమాదనుడు, హనుమంతుడు, సుషేణుడు, మున్నగు వానర సేనాధ్యక్షులను కొమ్మలుగా

కలిగి, 'సీత' అను పుష్పమును, ఫలమును ఇచ్చు రామవృక్షమును నిర్మూలించెదను.

రామవృక్షం రణే హన్మి సీతాపుష్పఫల ప్రదమ్
ప్రశాఖా యస్య సుగ్రీవో జాంబవాన్ కుముదో నళః. 100-4

మైందశ్చ ద్వివిదశ్చైవ హ్యంగదో గంధమాదనః
హనుమాంశ్చ సుషేణశ్చ సర్వే చ హరియూథపాః. 100-5

రావణుడు మొదట తామసాస్త్రమును ప్రయోగించినాడు. వానరులు దగ్ధులై కుప్పలు కుప్పలుగా కూలిపోవుచున్నారు. శ్రీరాముడు యుద్ధమునకు పూనుకొని ధనుష్టంకారము చేసినాడు. రామునిచెంత నుండిన లక్ష్మణునికి రావణునితో యుద్ధమాడవలయు నని కోరిక కలిగి రావణునిమీద బాణములు ప్రయోగించినాడు. రావణుడు తన హస్తలాఘవమును ప్రదర్శించి ఆ బాణముల నన్నింటిని ఖండించినాడు.

రావణుడు లక్ష్మణుని తప్పించి రామునిపైకి పోయి, రామునిమీద బాణవర్షము కురిపించినాడు. రాముడును రావణునిపై శరపరంపర క్రుమ్మరించినాడు.

రాఘవో రావణం తూర్ణం రావణో రాఘవం తదా
అన్యోన్యం వివిధై స్తీక్ష్ణై శ్శరై రభివవర్షతుః. 100-25

ఈ బాణ పరంపరలు ఆకాశమునకు కిటికీలు పెట్టినట్లు తోపించినవి.

గవాక్షిత మివాకాశం బభూవ శరవృష్టిభిః. 100-29

రావణుడు లెక్కలేని బాణములువేసి శరాంధకారమును కల్పించినాడు. రామరావణులు ఉభయులు గొప్ప విలుకాండ్రు. ఇద్దరును అస్త్రసంపన్నులు. ఇరు పార్శ్వములనుండియు బాణములు పరంపరలుగా వచ్చుచున్నవి. రావణుడు రాముని లలాటమున ఒక బాణమాలను గ్రుచ్చినాడు [బాణములను వరుసగా నాటినాడు] కాని రామునికి దానివలన బాధ కలుగలేదు. శ్రీరాముడు కోపించి రౌద్రాస్త్రమంత్రము నభిమంత్రించి బాణమును వదలినాడు. ఆ బాణము రావణుని అభేద్యకవచమును తాకినదేగాని రావణుని నొప్పింపలేదు. మాయావి యగు రావణుడు ఆసురాస్త్రమును ప్రయోగించినాడు. దానిలోనుండి సింహముఖములు, వ్యాఘ్రముఖములు, పంచాననసర్పములు, ఇంకను ఎన్నియో భయంకరరూపములు గల బాణములు బయలువెడలి వచ్చినవి. అంతట శ్రీరాముడు ఆగ్నేయాస్త్రమును ప్రయోగించినాడు. దానిలో నుండి అగ్నిముఖములు, సూర్యచంద్రుల ముఖములు, గ్రహనక్షత్రముఖములును కలిగి

మెరుపుతీగెలవలె ప్రకాశించుచున్న బాణములు వెల్వడి ఆసురాస్త్రమును ఖండించినవి. తన అస్త్రము ప్రతిహత మగుట చూచి రావణుడు కోపించి, మయుడు ఆర్జించి తనకిచ్చిన రౌద్రాస్త్రమును ప్రయోగించినాడు. రాముడు దానిని గాంధర్వాస్త్రముతో ఖండించినాడు. రావణుడు సౌరాస్త్రమును ప్రయోగించినాడు. దానిలోనుండి గొప్పచక్రాయుధములు వెల్వడినవి. రాముడు తన దివ్యశరములు ప్రయోగించి దానిని ప్రతిహతము కావించినాడు. తన అస్త్రము లన్నియు ప్రతిహత మగుట చూచి రావణుడు పదిబాణములు వేసి రాముని నొప్పించినాడు. దానికి శ్రీరాముడు చలింపక రావణుని మీద శరవృష్టి కురిపించినాడు.

## లక్ష్మణుడు రావణునితో యుద్ధము చేయుట

లక్ష్మణుడు కోపించి ఏడుబాణములు గైకొని వానితో రావణుని ధ్వజమును ముక్కలుముక్కలుగా ఖండించినాడు.

[రావణుని టెక్కెము మనుష్యుని శిరస్సు]

తైస్సాయకైర్మహావేగై రావణస్య మహాద్యుతిః
ధ్వజం మనుష్యశీర్షం తు తస్య చిచ్ఛేద నైకధా. 101-14

లక్ష్మణుడు ఒక్కబాణముచే రావణుని సారథిశిరమును ఖండించినాడు. అయిదు బాణములు ప్రయోగించి రావణుని ధనుస్సును ముక్కలు చేసినాడు. ఇంతలో విభీషణుడు తన గదతో రావణుని రథాశ్వములను వధించినాడు.

నీలమేఘనిభాంశ్చాస్య సదశ్వాన్ పర్వతోపమాన్
జఘానాప్లుత్య గదయా రావణస్య విభీషణః. 101-17

## విభీషణునిపై రావణుడు శక్తిని ప్రయోగించుట - లక్ష్మణుడు రక్షించుట

రావణునికి తన తమ్మునిపై పట్టరాని కోపము కలిగినది. రథముమీదినుండి నేలకు దూకి, వజ్రాయుధమువలె వెలుగుచున్న 'శక్తి'ని గైకొని విభీషణునిమీద ప్రయోగింపగా, అది విభీషణుని తాకకమున్నే లక్ష్మణుడు దానిని మూడు బాణములతో మూడు తునియలుగా ఖండించినాడు.

'శక్తి' ముక్కలై పోవుట చూచి రావణుడు 'మహాశక్తి' గైకొని గిరగిర త్రిప్పినాడు. విభీషణుని ప్రాణమునకు అపాయము కలుగునట్లుండుటను గుర్తించి లక్ష్మణుడు విభీషణునికి అడ్డముగా నిలబడి 'మహాశక్తి'ని గిరగిర త్రిప్పుచున్న రావణునిపై బాణవర్షము కురిపించినాడు.

ఏతస్మిన్నంతరే వీరో లక్ష్మణ స్తం విభీషణమ్
ప్రాణసంశయమాపన్నం తూర్ణ మభ్యవపద్యత. 101-24

తం విమోక్షయితుం వీర శ్చాపమాయమ్య లక్ష్మణః
రావణం శక్తిహ స్తం వై శరవర్షై రవాకిరత్ 101-25

ఆపదనుండి విభీషణుని తప్పించిన లక్ష్మణుని చూచి రావణుడు

***రావణుడు :*** లక్ష్మణా ! నీవు విభీషణుని తప్పించితివి. కావున వానిని విడిచిపెట్టి ఈ శక్తిని నీమీదనే ప్రయోగించెదను. ఇది నీ హృదయమును భేదించి నీ ప్రాణములను హరించుకొని పోగలదు.

## లక్ష్మణుడు మూర్ఛిలుట

మయుడు మాయాబలముతో నిర్మించిన అమోఘమైన ఆ మహాశక్తిని లక్ష్మణుని పై ప్రయోగించి రావణుడు సింహనాదము చేసినాడు. మహాశక్తి లక్ష్మణుని పైకి వచ్చుట చూచి శ్రీరాముడు "లక్ష్మణునికి మంగళ మగునుగాక" అని మంగళానుశాసనము కావించి ఆ శక్తిని ఉద్దేశించి "నీవు వ్యర్థ మగుదువుగాక ! లక్ష్మణుని వధింప దలచుకొన్న నీ ప్రయత్నము విఫల మగునుగాక !" అని పలికినాడు.

తామనువ్యాహరచ్ఛక్తి మాపతంతీం స రాఘవః
స్వస్త్యస్తు లక్ష్మణాయేతి మోఘా భవ హతోద్యమా. 101-33

రావణుడు ప్రయోగించిన శక్తి లక్ష్మణుని హృదయమును భేదించినది. లక్ష్మణుడు క్రింద పడిపోయినాడు. శ్రీరాముడు కన్నీరు నించి, దుఃఖమునకు సమయము కాదని యోచించి, ఒకకంట లక్ష్మణుని కనిపెట్టుచు, రావణుని వధింప నిశ్చయించి రావణునితో ప్రచండయుద్ధ మొనర్చినాడు.

న విషాదస్య కాలోఽయమితి సంచింత్య రాఘవః
చక్రే సుతుములం యుద్ధం రావణస్య వధే ధృతః. 101-39

సర్వయత్నేన మహతా లక్ష్మణం సన్నిరీక్ష్య చ. 101-40

లక్ష్మణుని శరీరము రక్తసిక్తమయినది. సర్పముతోగూడిన పర్వతమువలె పడియుండినాడు. ఆ శక్తిని విరుచుటకు వానరవీరులు ఎంతో ప్రయత్నించినారు కాని వారికి సాధ్యముకాలేదు. ఆ శక్తి లక్ష్మణుని భేదించి భూమిపై పడినది. శ్రీరాముడు దానిని తన రెండుచేతులతో పట్టుకొని వంచి విరిచివేసినాడు. రాముడు ఈ పనిలో నుండగా రావణుడు రామునిపై కరకుటమ్ములను కుప్పించినాడు. రాముడు రావణుని

బాణములను సరకుసేయక లక్ష్మణుని కవుగిలించుకొని, హనుమంతునితోను, సుగ్రీవుని తోను అనుచున్నాడు.

**రాముడు:** మీరు జాగరూకులై లక్ష్మణుని కాపాడుచుండుడు. వానరవీరులారా! నా పరాక్రమమును ప్రదర్శింపవలసిన సమయము వచ్చినది. ఈ సమయమునకే చిరకాలముగా నిరీక్షించుచుంటిని. ఆ పాపాత్ముని వధించిపుచ్చెదను. ఇదిగో! మీయెదుట ప్రతిజ్ఞ చేయుచున్నాను. ఈ భూమిమీద రావణుడు లేకపోవుటయో రాముడు లేకపోవుటయో ఇప్పుడే ఏర్పడగలదు.

పరాక్రమస్య కాలోఽయం సంప్రాప్తో మే చిరేప్సితః
పాపాత్మాయం దశగ్రీవో వధ్యతాం పాపనిశ్చయః. 101-47

అస్మిన్ముహూర్తే న చిరా త్సత్యం ప్రతిశృణోమి వః
అరావణమరామం వా జగద్ద్రక్ష్యథ వానరాః. 101-48

రావణుని తప్పక వధింతును. రాజ్యభ్రంశమువలనను, వనవాసము వలనను, దండకారణ్యమున సంచరించుటవలనను, నా సీతను పరపురుషుడు స్పృశించుటవలనను, రాక్షసుల పొత్తువలనను, నాకు సంభవించిన ఘోరదుఃఖమును వదలి, క్రోధము నవలంబించి రావణుని వధింతును. రావణుడు నా కంటబడినాడు. ఇక బ్రతికిపోజాలడు. మీరందరును స్వస్థచిత్తులై యుండి మా యుద్ధమును తిలకింపుడు. ఇప్పుడు దేవతలు, ఋషులు, ముల్లోకములవారును ఈ యుద్ధమున రాముని రామత్వమును తిలకింతురుగాక!

అద్య రామస్య రామత్వం పశ్యంతు మమ సంయుగే
త్రయో లోకా స్సగంధర్వా స్సదేవా స్సర్షిచారణాః. 101-55

ఈ ప్రపంచ మెంతకాలముండునో అంతకాలము సమస్తజనులు, దేవతలు గుంపులు గుంపులుగా చేరి, ఇప్పుడు జరుగబోవు యుద్ధమునుగూర్చి కీర్తించునట్లు యుద్ధము చేయుదును.

[లక్ష్మణుని బాధ కంటికి కనిపించుచున్నందున శ్రీరాముని కింత కోపము కలిగినది. శ్రీరామునికి కోపము రప్పించుట సులభమైనపనికాదు]

అద్య కర్మ కరిష్యామి యల్లోకా స్సచరాచరాః
సదేవాః కథయిష్యంతి యావ ద్భూమి ర్ధరిష్యతి. 101-56

సమాగమ్య సదా లోకే యథా యుద్ధం ప్రవర్తితమ్. 101-57

[శ్రీరామునిమాట అబద్ధమగునా! ఆ మహనీయుడు చెప్పినట్లే ఈ ప్రపంచమున్నంత వరకు ఈ కథ ఉండనే ఉండగలదు.]

ఈ పలుకులు పలికి, శ్రీరాముడు రావణునిమీద బాణములు ప్రయోగించినాడు. రావణుడు ప్రతిబాణములు వేసినాడు. ఇరువురి బాణములు ఒకదానిని ఒకటి ఖండించి క్రిందపడుచున్నవి.

## సంజీవనికై హనుమంతుని పంపుట

శ్రీరాముడు సుషేణునితో అనుచున్నాడు.

**రాముడు :** సుషేణా! లక్ష్మణు డిట్లు రక్తసిక్తుడై యున్నాడు గదా! నేను ఉత్సాహముగా యుద్ధ మాడగలనా! నా వీర్యము సిగ్గుపడుచున్నది. ధనుస్సు పట్టు తప్పుచున్నది. బాణములు బలహీనమైపోయినవి. కన్నీటివలన చూపు ఆనుట లేదు. అవయవము లన్నియు, కలలో నడకవలె, తేలిపోవుచున్నవి.

లజ్జతీవ హి మే వీర్యం భ్రశ్యతీవ కరాద్ధనుః
సాయకా వ్యవసీదంతి దృష్టి ర్బాష్పవశం గతా. 102-6

అవసీదంతి గాత్రాణి స్వప్నయానే నృణామివ. 102-7

రావణునిచే నిహతుడైన తమ్ముని జూచి నాకు దుఃఖము ఎక్కువ యగుచున్నది. నేను జీవించియుండవలయు నని కూడ నాకు అనిపించుటలేదు. నా తమ్ముడు మరణించిన పిదప నాకు ప్రాణముతో పని యేమున్నది! యుద్ధముతో గాని, రాజ్యముతోగాని, నా ప్రాణముతో గాని, సీతతో గాని నాకు పనిలేదు.

చింతా మే వర్ధతే తీవ్రా ముమూర్షా చోపజాయతే
భ్రాతరం నిహతం దృష్ట్వా రావణేన దురాత్మనా. 102-8

న హి యుద్ధేన మే కార్యం నైవ ప్రాణైర్న సీతయా
భ్రాతరం నిహతం దృష్ట్వా లక్ష్మణం రణపాంసుషు. 102-10

కావలసినచో ప్రతిదేశమునందును భార్యలు లభింపగలరు. బంధువులు సైతము దొరకుదురు. కాని తోడబుట్టినవాడు దొరకు దేశముమాత్రము ఎందును కానరాదు.

దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః 102-12

**సుషేణుడు :** రామప్రభూ! లక్ష్మణుడు జీవించియే ఉన్నాడు. అతని కాంతి తరుగలేదు. ముఖము వికారముగలేదు. వివర్ణము కాలేదు. దీర్ఘాయువు గలవారి ముఖములు మాత్రమే ఇట్లు ప్రకాశించుచుండును. అసువ్రుల బాసిన వాని ముఖము ఈ తీరున నుండదు. నీవు దుఃఖపడకుము. లక్ష్మణుడు ప్రాణముతో ఉన్నాడు. అతని గుండె ఆడుచునే వున్నది చూడుము. లక్ష్మణుడు నిదురలో ఉన్నాడు. మరేమియు లేదు.

(హనుమంతునితో) హనుమంతుడా! మునుపు జాంబవంతుడు సూచించిన ఓషధి పర్వతమునకు వెళ్ళి దాని దక్షిణశిఖరమునం దుండు ఓషధులను గైకొని వేగిరము రమ్ము. విశల్యకరణి, సువర్ణకరణి, సంజీవని, సంధానకరణి, అను నాలుగు ఓషధులు అందు కలవు. లక్ష్మణుని బ్రతికించుటకు వానిని తీసికొని త్వరగా రావలయునుసుమా!

సంజీవనార్థం వీరస్య లక్ష్మణస్య మహాత్మనః 102-23

## హనుమంతుడు ఓషధిపర్వతమును కొనివచ్చుట

హనుమంతుడు ఓషధిపర్వతమునకు పోయినాడు. హనుమంతునికి ఓషధులు గుర్తుచిక్కలేదు. కర్తవ్య మేమి అని యోచించినాడు.

*హనుమంతుడు :* (తనలో) ఈ పర్వతశిఖరమునే కొనిపోవుట యుక్తము. విశల్యకరణి ఏదియో తెలియుటలేదు. వట్టిచేతులతో వెళ్లుదునేని కాలాతీత మైపోయి కార్యభంగము కావచ్చును.

ఈ విధముగా తర్కించుకొని హనుమంతుడు ఆ పర్వతశిఖరమును మూడు మార్లు ఊగించి, పెల్లగించి, దానిని చేతులతో ఎత్తుకొనివచ్చి సుషేణునితో "నీవు చెప్పిన ఓషధులను పోల్చుకొనలేక ఆ పర్వతశిఖరమునే తెచ్చినాను," అన్నాడు.

హనుమంతుడు కావించిన అసాధ్యకార్యమును చూచి అందరును ఆశ్చర్య చకితులైనారు.

సుషేణుడు తనకు కావలసిన ఓషధిని తీసికొని, దానిని నలిపి లక్ష్మణుని ముక్కులో పిండినాడు. లక్ష్మణుడు విశల్యుడైనాడు. ఓషధిగంధము నాఘ్రాణించి బాధావిరహితుడై సుఖముగా ఉన్నాడు.

ఇత్యేవముక్తో హనుమాన్ గత్వా చౌషధిపర్వతమ్
చింతామభ్యగమ చ్ఛ్రీమా నజానంస్తాం మహౌషధిమ్ 102-24

తస్య బుద్ధి స్సముత్పన్నా మారుతే రమితౌజసః
ఇదమేవ గమిష్యామి గృహీత్వా శిఖరం గిరేః 102-25

అగృహ్య యది గచ్ఛామి విశల్యకరణీమహమ్
కాలాత్యయేన దోష స్స్యాద్వైక్లబ్యం చ మహద్భవేత్ 102-27

ఇతి సంచింత్య హనుమాన్ గత్వా క్షిప్రం మహాబలః
ఆసాద్య పర్వతశ్రేష్ఠం త్రిః ప్రకంప్య గిరే శ్శిరః 102-28

ఫుల్లనానాతరుగణం సముత్పాట్య మహాబలః
గృహీత్వా హరిశార్దూలో హస్తాభ్యాం సమతోలయత్ 102-29

స నీలమివ జీమూతం తోయపూర్ణం నభఃస్థలాత్
ఆపపాత గృహీత్వా తు హనుమాన్ శిఖరం గిరేః 102-30

[హనుమంతుడు ఓషధిపర్వతమునకు వెళ్ళి పర్వతశిఖరమును పెల్లగించి తెచ్చిన వృత్తాంతమును వాల్మీకిమహర్షి మూడుమాటలలో ముచ్చటగా చెప్పినారు.

హనుమంతుడు సీతాదేవిని చూచుటకు మహేంద్రపర్వతమునుండి సమీపమునం దున్న లంకాపురికి వచ్చిన ప్రయాణమునుగురించి రెండువందలశ్లోకములు చెప్పి విపులముగా వర్ణించినారుగదా! దానికిని దీనికిని గల భేదము గమనింపదగియున్నది.

ఇప్పుడు లక్ష్మణుడు మూర్ఛయం దున్నాడు. ప్రయాణమును తీరుబడిగా సాగించు సమయముకాదు. త్వరగా వెళ్ళి రావలయును. హనుమంతుడు ఎంతశీఘ్రముగా వెళ్లివచ్చినాడో మన కండ్లకు కట్టినట్టు మహర్షి మూడుముక్కలలో చిత్రించినారు! ఈ ఔచిత్యము గమనింపదగియున్నది]

లక్ష్మణుడు స్వస్థుడై లేచి కూర్చుండినాడు. రాముని కన్నులనుండి ఆనందాశ్రువులు స్రవించినవి. శ్రీరాముడు లక్ష్మణుని తన చెంతకు చేర్చుకొని గాఢముగా కవుగిలించుకొని లక్ష్మణునితో అనుచున్నాడు.

**రాముడు :** తమ్ముడా! నా భాగ్యవశమున నీవు పునర్జీవితుడవైతివి. నీ కొక ఆపద కలుగునేని నాకు ప్రాణముతోగాని, సీతతోగాని, యుద్ధవిజయముతోగాని పని యేమున్నది!

లక్ష్మణుడు అప్పుడప్పుడే తేరుకొనుచున్నాడు. స్వరము హీనముగా నున్నది. రామునితో నెమ్మదిగా అనుచున్నాడు.

**లక్ష్మణుడు :** రామా! ఇట్లు పలుకుచున్నావేమి! ఎవ్వడో బలహీను డనవలసిన మాటలు నీ నోట వచ్చుట సరికాదు. గొప్పవారు తమ ప్రతిజ్ఞను పాలింపకుందురా! నన్ను గూర్చిన దుఃఖమును వదలిపెట్టి రావణుని వధించి నీ ప్రతిజ్ఞను పాలింపుము. శత్రువు నీ కంట బడి ప్రాణముతో మరలిపోజాలడు. ఈనాడు సూర్యాస్తమయకాలములోగా రావణవధము జరుగవలయు నని కోరుచున్నాను. నా కోరికను తీర్చుము

అహం తు వధమిచ్ఛామి శీఘ్రమస్య దురాత్మనః
యావదస్తం న యాత్యేష కృతకర్మా దివాకరః. 102-46

## ఇంద్రుడు తన రథమును శ్రీరామునికి పంపుట

శ్రీరాముడు వెంటనే ధనుస్సును చేబట్టినాడు. ఈ లోపల రావణుడు మరియొక రథము నెక్కి వచ్చినాడు. ఉభయులును బాణములు ప్రయోగించుకొనుచున్నారు.

రావణుడు రథస్థుడై యుండుటయును, శ్రీరాముడు క్రింద నిలువబడి యుద్ధము చేయుటయును సరికాదని దేవేంద్రుడు తన రథమును, తన సారథియైన మాతలిని, శ్రీరాముని యొద్దకు పంపినాడు.

**మాతలి:** రామప్రభూ! నీ విజయము కోరి ఇంద్రుడు నీ కీ రథమును పంపినాడు. ఈ ధనుస్సును, బాణములను, కవచమును, ఈ శక్తిని నీకొరకు పంపినాడు. వీనిని గ్రహింపుము. నీవు రథము నధిరోహింపుము. నేను నీకు సారథ్యము చేయుదును. దేవేంద్రుడు ఈ రథము నెక్కి యుద్ధమాడి దానవులను వధించినట్లు నీవు రావణుని వధింపుము.

శ్రీరాముడు రథమునకు ప్రదక్షిణనమస్కారములు చేసి రథము నధిరోహించినాడు.

## రావణుని సారథి యుద్ధభూమినుండి రథమును తొలగించుట

రామ రావణులకు ప్రచండయుద్ధము జరుగుచున్నది.

> తద్బభూవాద్భుతం యుద్ధం తుములం రోమహర్షణమ్
> రామస్య చ మహాబాహో రావణస్య చ రక్షసః. 103-15

ఉభయులు అస్త్రవేత్తలు. గాంధర్వాస్త్రమును గాంధర్వాస్త్రము చేతను, దైవాస్త్రమును దైవాస్త్రము చేతను నివారించుకొనుచున్నారు. రావణుడు రాక్షసాస్త్రమును ప్రయోగించినాడు. అందులోనుండి విషసర్పములు లెక్కలేక వెడలినవి. శ్రీరాముడు గారుడాస్త్రమును ప్రయోగించి ఆ సర్పసమూహమును హతమార్చినాడు.

అస్త్రములు ప్రతిహత మగుచుండుట చూచి రావణుడు రామునిమీద శరవర్షమును కురిపించినాడు. మాతలిమీదకూడ బాణములు కుప్పించినాడు. రథముపై నుండిన ధ్వజమును ఒక బాణముతో కొట్టి క్రింద పడవైచినాడు. ఇంద్రుని గుఱ్ఱముల మీద బాణములు ప్రయోగించినాడు.

శ్రీరాముడు ఆర్తుడగుట చూచి, దేవతలు, ఋషులు, విభీషణుడు, వానరులు దుఃఖపడినారు. రావణుడు విజృంభించినాడు. పది తలలతోను, ఇరువది చేతులతోను, మైనాక పర్వతమువలె కనబడినాడు. ఇరువదిచేతులతోను బాణములు వేయుచున్నాడు. వింట బాణమును సంధించుటకుకూడ రామునికి వీలుకాలేదు..

నిరస్యమానో రామస్తు దశగ్రీవేణ రక్షసా
నాశక్నో దభిసంధాతుం సాయకాన్ రణమూర్ధని. 103-35

శ్రీరామునికి రోషము కలిగినది. ఉగ్రరూపమును దాల్చినాడు. రాముని ఉగ్రరూపమును చూచి రావణుడుకూడ భయపడినాడు.

ఈ యుద్ధమును చూచుటకు దేవతలు, అసురులు, మున్నగువా రందరు వచ్చినారు. అసురులు రావణుని ప్రోత్సహించి జయింపు మన్నారు. సురలు శ్రీరాముని ప్రోత్సహించి జయింపు మని మాటిమాటికి హెచ్చరించినారు.

దశగ్రీవం జయేత్యాహు రసురా స్సమవస్థితాః
దేవా రామమథోచుస్తే త్వం జయేతి పునః పునః. 104-8

రావణుడు భయంకరశూలమును గైకొని సింహనాదము చేసి

**రావణుడు:** రామా! రాక్షసవీరు లనేకులను వధించితివి. నిన్ని శూలముతో ఇప్పుడే వధింతును.

ఈ మాట లనుచు రావణుడు తన శూలమును రామునిపై ప్రయోగించినాడు. ఆ శూలమును నివారించుటకు రాముడు బాణములు వేసినాడు. కాని ఆ బాణము లన్నియు శూలమును తాకి అగ్నిలోపడిన మిడుతలవలె భస్మమైపోయినవి. రాముడు కోపించి మాతలి తెచ్చిన 'శక్తి'ని ప్రయోగించినాడు. ఆ శక్తి రావణుని శూలమును ఖండించినది.

రాముడు రావణుని రథాశ్వములమీద బాణములు వేసినాడు. రావణుని వక్షస్థలమున కొన్ని బాణములు వేసి, లలాటమున మూడుబాణములు నాటవేసినాడు. రావణుని శరీరమునుండి రక్తము ప్రవహించినది. రావణుడు ఖేదపడినాడు.

క్రోధావిష్టుడై, రావణుడు రామునిమీద వేలకొలది బాణములు వేసినాడు.

బాణధారా సహస్రైస్తు స తోయద ఇవాంబరాత్
రాఘవం రావణో బాణై స్తటాకమివ పూరయత్. 105-3

వర్షము కుండపోతగా కురిసి తటాకమును నిండించునట్లు రావణుడు రాముని శరీరమును బాణములతో నింపినాడు. కాని రాముడు చలింపలేదు. రావణుడు ఇంకను బాణములు వేసినాడు. రాముని శరీరము రక్తసిక్తమైనది.

రామ రావణులు ఒకరిమీద ఒకరు బాణములు కుప్పించుచున్నారు. ఆకాశమంతయు బాణములతోనిండి శరాంధకార మేర్పడినందున ఒకరికొకరు కానవచ్చుటలేదు.

*రాముడు :* దురాత్ముడా! నేను లేని సమయమున చోరునివలె నా భార్యను అపహరించినావు. నీకు చావు మూడినది. అంతటి నీచకార్యమును చేసినవాడవు నీవును ఒక శూరుడవేనా! నీకు సిగ్గు లేదా!

> శూరోఽహమితి చాత్మాన మవగచ్ఛసి దుర్మతే
> నైవ లజ్జాస్తి తే సీతాం చోరవద్వ్యపకర్షతః 105-17

నా యెదుట నీ వా పని చేసియుందువేని ఖరుని మార్గమును అనుసరించి యుండువాడవు. ఇప్పుడు నిన్ను వధించి నీ కళేబరమును నక్కలపాలు చేయుదును.

శ్రీరాముడు రావణునిమీద శరవర్షమును కురిపించినాడు. రామునికి ఉత్సాహము అతిశయించినది. అస్త్రము లన్నియు స్ఫురణకు వచ్చినవి. హస్తలాఘవము ఎక్కువైనది.

ఈ శుభనిమిత్తములను గురితించి శ్రీరాముడు రావణునిమీద బాణములను చురుకుగా వేసినాడు. వానరులు రావణునిమీద శిలావృష్టిని కురిపించినారు.

రావణునికి చిత్తభ్రాంతి కలిగినది. మనస్సు స్వాధీనము తప్పినది. ధనుస్సును ఆకర్షించుటయును, బాణములు వేయుటయును విరమించుకొన్నాడు. ఏమియు తోపక జడుడై పోయినాడు. మరణావస్థయం దున్నట్టు కనబడినాడు. ఈ లక్షణముల నన్నింటిని రావణుని సారథి గమనించి, రథమును యుద్ధభూమినుండి తొలగదోలుకొనిపోయినాడు.

## రావణుడు యుద్ధభూమికి మరలివచ్చుట

రావణుడు కొంత సేపటికి తేరుకొని, కోపోద్రిక్తుడై సారథిని నిందించుచున్నాడు.

*రావణుడు :* బుద్ధిహీనుడా! నన్ను ఎంత అవమానించితివి! నాతో చెప్పక, చేయక శత్రువు సమక్షమున యుద్ధభూమినుండి రథమును మరలించి తెచ్చి ఎంత ద్రోహము చేసితివి! చిరకాలమునుండి నేను ఆర్జించిన కీర్తిని, పౌరుషమును, పరాక్రమమును ఒక్క క్షణములో నాశన మొనర్చితివి గదా!

> త్వయాద్య హి మమానార్య చిరకాల సమార్జితమ్
> యశో వీర్యం చ తేజశ్చ ప్రత్యయశ్చ వినాశితః 106-5

యుద్ధప్రియుడనైన నన్ను ప్రఖ్యాతవీరుడైన శత్రువు నెదుట అవమానించితివి. నీ వేదో లంచము పుచ్చుకొని శత్రుపక్షమున చేరి ఈ నీచకార్యమును చేసినట్టు కనబడుచున్నది.

**[అట్టివానికి అట్టి ఆలోచన తోచుటలో వింతలేదు!]**

యస్త్వం రథమిమం మోహాన్న చోద్వహసి దుర్మతే
సత్యోయం ప్రతితర్కో మే పరేణ త్వముపస్కృతః 106-7

నీవు చేసిన కార్యము శత్రువు చేయదగినదే కాని మిత్రుడు ఇట్లు చేయునా! నే నిదివరకు నీకు చేసిన మేలు జ్ఞప్తియం దున్నచో శత్రువు నన్ను వెదకికొనుచు రాక మున్నే, రథమును యుద్ధభూమికి మరలింపుము.

సారథి: ప్రభూ! నేను తెలివితక్కువవాడను కాను. భయపడిగాని లంచము తీసికొనిగాని మరలివచ్చినవాడను కాను. నీవు నా కిదివఱకు చేసియున్న మేలును మఱచినవాడనుకూడ కాను. నీ క్షేమము కోరి ఈ కార్యమును చేస్తితిని.

నీవు యుద్ధములో అలసిపోయితివి. నీయందు ఎట్టి ఉత్సాహమును కానరాలేదు. రథాశ్వములుకూడ డస్సినవి. సారథియైనవాడు అన్నిసందర్భములను గమనింపవలయును. దేశకాలములు, రథికుని లక్షణములు, రథికుని దైన్యము, ఖేదము, మోదము, యోధుల బలాబలములు, అన్నింటిని గుర్తించి ముందరికి వెళ్ళదగియున్నచో వెళ్ళవలయును. వెనుకకు తగ్గవలసియున్నచో తగ్గవలయును. నీకును, ఈ గుఱ్ఱములకును, కొంత విశ్రాంతి నిచ్చుట అవసర మని నిర్ణయించుకొని వచ్చితినేగాని తగిన కారణము లేక వచ్చినవాడనుకాను. స్వామిభక్తిని అనుసరించి చేసిన కార్యమేగాని మరేమియు కాదు. నీయాజ్ఞను శిరసావహించి పాలించుటకు సంసిద్ధుడనై యున్నాను.

రావణుడు: సారథీ! మన రథమును రామునికి అభిముఖముగా పోనిమ్ము. శత్రువును వధింపక, రావణుడు యుద్ధభూమినుండి మరలిరాడు.

ఈ మాటలుచెప్పి రావణుడు ఒక హస్తాభరణమును సారథికి బహూకరించినాడు. సారథి రావణుని రథమును యుద్ధభూమికి మరలించినాడు.

## అగస్త్యుడు శ్రీరామునికి 'ఆదిత్య హృదయము'ను ఉపదేశించుట

యుద్ధమును చూచుటకు దేవతలతోపాటు వచ్చియుండిన అగస్త్యమహర్షి శ్రీరామునికి ఉత్సాహము కలిగించి శత్రువును జయింపగల శక్తిని ప్రసాదించుటకై, ఆదిత్యహృదయమంత్రమును శ్రీరామునికి ఉపదేశించినాడు.

[ఈ 'ఆదిత్య హృదయము'ను అనేకులు పారాయణము చేయుదురు. యుద్ధకాండ నూటయేడవ సర్గలో ఉన్నది. అది మంత్రము కాబట్టి పొడిమాటలతో చెప్పదగిన విషయము కాదు. యథాతథముగా ఉండవలయును గనుక అది ఒక అనుబంధముగా చేర్చబడియున్నది.]

అగస్త్యుడు: రామా! ఆపదలయందును, కష్టములలోను, భయము కలిగినప్పుడును, ఈ ఆదిత్యహృదయమును కీర్తించువానికి దుఃఖము తొలగిపోవును.

ఏనమాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ
కీర్తయన్ పురుషః కశ్చిన్నావసీదతి రాఘవ 107-25

జగత్పతియైన సూర్యదేవుని ఏకాగ్రబుద్ధితో పూజించి ఈ మంత్రమును మూడు మార్లు జపింపుము. యుద్ధములో నీకు తప్పక విజయము కలుగును. ఈ క్షణముననే రావణుని వధింపగలవు.

ఈ హితబోధచేసి అగస్త్యుడు వెడలిపోయినాడు. రాముని శోకము తీరిపోయినది. శ్రీరాముడు ఆచమనము చేసి శుచియై సూర్యదేవుని ఉపాసించి ఆదిత్యహృదయమును మూడుమార్లు జపింపగా సూర్యభగవానుడు సంతోషించి రాముని చూచి "రావణుడు నశింపగలడు. త్వరపడుము" అని ఉత్సాహపరచినాడు.

అథ రవిరవదన్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః
నిశిచరపతి సంక్షయం విదిత్వా
సురగణ మధ్యగతో వచస్త్వరేతి 107-31

శ్రీరాముడు రావణుని వధించుటకు నిశ్చయించుకొన్నాడు. రావణుడు యుద్ధసన్నద్ధుడై రథముపై వచ్చినాడు. శ్రీరాముడు రావణునిచూచి మాతలితో అనుచున్నాడు.

**రాముడు** : మాతలీ ! చూచితివా ! రావణుడు అప్రదక్షిణముగా వచ్చుచున్నాడు. ఇతడు తప్పక హతుడు కాగలడు. నీవు మన రథమును రావణునికి ఎదురుగా పోనిమ్ము. కలతలేని మనస్సుతో మన రథమును నిర్భయముగా నడుపుము. నీవు ఇంద్రునంతటివానికి సారథ్యము చేయువాడవు. నీకేమియు క్రొత్తగా చెప్పవలసిన పనిలేదు. యుద్ధసమయముగనుక జ్ఞప్తిపరచుచున్నాను. అంతేకాని నీకు నేర్పుటకాదుసుమా !

మాతలి రథమును నడపినాడు. రావణుని రథము అప్రదక్షిణముగా పోవునట్లు చేయుచు తన రథమును వేగముగా పోనిచ్చినాడు. ఆ వేగమునకు రేగిన దుమ్ము రావణుని చలింపజేసినది. రావణుడు కోపించి రామునిమీద బాణములు వేసినాడు. రాముడు మాతలి తెచ్చిన ఇంద్రధనుస్సును, కరకుటమ్ములను గ్రహించినాడు.

## రామ రావణ యుద్ధము

రామ రావణులకు ప్రచండయుద్ధము జరిగినది. దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు మున్నగువారు ఈ యుద్ధమును తిలకించుటకు వచ్చినారు. శ్రీరాముని

జయమును, రావణుని మరణమును సూచించు శకునము లెన్నియో కనబడినవి. రావణుని రథాశ్వముల కన్నులనుండి నీరు కారినది.

శ్రీరాముడు తన విజయమును సూచించు శకునములను చూచి సంతోషించి రావణవధము త్వరలో జరుగనున్న దని ఉత్సాహపడి విజృంభించి యుద్ధము చేసినాడు. ఉభయసేనలు యుద్ధము చాలించి రామ రావణ యుద్ధమును తిలకించుచు నిలువబడి నారు. రాక్షసులు రావణునిచూచుచూ, వానరులు రామునిచూచుచూ అందరు చిత్తరువులవలె ఉన్నారు.

రక్షసాం రావణం చాపి వానరాణాం చ రాఘవమ్
పశ్యతాం విస్మితాక్షాణాం సైన్యం చిత్రమివాబభౌ 109.5

[ఆకాలములోకూడ చిత్రకళ సుప్రసిద్ధమై యుండినది.]

రామ రావణు లిద్దరును నిర్భయముగా యుద్ధము చేయుచున్నారు. ఇరువురును శకునములను గుర్తించినారు. తప్పక గెలుతు మన్న ఉత్సాహముతో శ్రీరాముడును, మరణించుట ధ్రువ మను తెంపుతో రావణుడును, వారివారి పరాక్రమములను పూర్తిగా ప్రదర్శించి యుద్ధమాడినారు.

జేతవ్యమితి కాకుత్స్థో మర్తవ్యమితి రావణః
ధృతౌ స్వవీర్యసర్వస్వం యుద్ధేఽదర్శయతాం తదా 109.7

రావణుడు రాముని ధ్వజమును ఖండించుటకు ప్రయత్నించెను కాని రావణుని బాణములు రాముని ధ్వజము చెంతకు రాకయే పడిపోయినవి. రావణుడు చేసినదానికి రాముడు ప్రతిక్రియ చేయ నుద్దేశించి, ఒక బాణమును ప్రయోగించి రావణుని ధ్వజ మును ఖండించినాడు.

రావణుడు రాముని గుఱ్ఱములమీద బాణములు వేసినాడు. కాని ఆ బాణము లకు రాముని గుఱ్ఱములు చలింపలేదు. రావణుడు ఆగ్రహించి రామునిమీద శరవర్షము కురిపించినాడు. బాణములనేగాక గదలను, పరిఘములను, చక్రములను, మరియు అనేక ఆయుధములను ప్రయోగించినాడు. మాయను ప్రదర్శించి ఆయుధవర్షమును కురి పించినాడు. రాముడు తన బాణములతో వాని నన్నింటిని నివారించినాడు. ఆయు ధము లన్నియు వానరసేనలమీద పడినవి.

రామ రావణులు ఉభయులు లక్షల లెక్కన బాణములు వేయుచున్నారు. బాణములు ఆకాశమును కప్పివేసినవి. బాణములతో మరియొక ఆకాశమును నిర్మించిన

ట్టయినది. యుద్ధము ఘోరముగా జరుగుచున్నది. ఒకరు చేసిన దానికి ఒకరు బదులు చేయుచున్నారు. సమస్తభూతములును ఈ యుద్ధమును చూచి అబ్బురపడుచున్నారు. ఇరువురి రథములు అటునిటు అనేక గతులుగా తిరుగుచున్నవి. ఇద్దరును ఎడతెగని వడువున బాణములు వేయుచున్నారు. భూమి అదరినది. సూర్యుని కాంతి తరిగినది. వాయువు స్తంభించినది.

దేవతలకు దిగులుపుట్టినది. "లోకములోని గోబ్రాహ్మణులకు మంగళ మగును గాక! రాముడు జయించుగాక!" అని దేవతలును, ఋషులును పలికినారు. జపములు చేసినారు.

స్వస్తి గోబ్రాహ్మణేభ్యోఽస్తు లోకాస్తిష్ఠంతు శాశ్వతాః
జయతాం రాఘవ స్సంఖ్యే రావణం రాక్షసేశ్వరమ్ 110-21

దేవతలును ఋషులును రామ రావణ యుద్ధమును తిలకించి "దీనికి సరిపోల్చుటకు లోకమునం దేదియునులేదు. ఆకాశమునకు ఆకాశమే సాటి. సముద్రమునకు సముద్రమే సాటి. అట్లే రామ రావణ యుద్ధమునకు రామ రావణ యుద్ధమే సాటి" అన్నారు.

గంధర్వాప్సరసాం సంఘా దృష్ట్వా యుద్ధమనూపమమ్
గగనం గగనాకారం సాగర స్సాగరోపమః 110-23

రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ
ఏవం బ్రువంతో దదృశు స్తద్యుద్ధం రామరావణమ్ 110-24

శ్రీరాముడు కోపించి ఒక నిశితశరమును గైకొని రావణుని శిరస్సును ఛేదించినాడు. అట్టిదే మరియొక్క శిరస్సు మొలిచినది.

తస్యైవ సదృశం చాన్య ద్రావణస్యోత్థితం శిరః 110-27

శ్రీరాముడు దానినికూడ ఛేదించినాడు. కాని, మరల అట్టిదే మరియొకటి పుట్టినది. ఒక శిరస్సు పోయిన వెంటనే దాని స్థానమునందు మరియొకటి మొలచుచున్నది. ఈవిధముగా నూట ఒక్క పర్యాయములు జరిగినది గాని రావణుడు మరణింపలేదు.

ఏవమేకశతం ఛిన్నం శిరసాం తుల్యవర్చసామ్
న చైవ రావణస్యాంతో దృశ్యతే జీవితక్షయే 110-29

శ్రీరాముడు ఆలోచింపసాగినాడు.

**రాముడు :** (తనలో) మాయలమారి మారీచుని వధించితిని. ఖరుని, దూషణుని, విరాధుని, కబంధుని, వధించితిని. వారిమీద ప్రయోగించిన బాణము లేవియు ఈ రావణుని మీద పనిచేయుటలేదు. దీనికి కారణ మేమై యుండును !

ఇట్లు తర్కించుకొనుచు శ్రీరాముడు రావణునిమీద బాణములు వేయుచునే ఉన్నాడు. రావణుడు రామునిమీద గదలు, ముసలములు, మున్నగు ఆయుధములను కుప్పించుచున్నాడు. దేవతలు, దానవులు, యక్షులు, పిశాచగణములు, ఉరగులు, రాక్షసులును యుద్ధమును చూచుచున్నారు. యుద్ధము ఏడు రాత్రులు జరిగినది.

దేవదానవయక్షాణాం పిశాచోరగరక్షసామ్
పశ్యతాం తన్మహాయుద్ధం సప్తరాత్ర మవర్తత

['సర్వరాత్ర మవర్తత' అని పాఠాంతర మున్నది. ఒక్క అహోరాత్రము జరిగిన దని ఈ పాఠమునుబట్టి ఏర్పడుచున్నది.]

## రావణవధ

రామ రావణ యుద్ధము రాత్రిగాని పగలుగాని ఒక్క క్షణమైనను విరామమనునది లేక జరిగినది.

నైవ రాత్రిం న దివసం న ముహూర్తం న చ క్షణమ్
రామరావణయోర్యుద్ధం విరామ ముపగచ్ఛతి 110-37

ఇట్లు ఎడతెరపిలేక పోరుచుండిన శ్రీరాముని జూచి మాతలి శ్రీరామునికి ఒక విషయము జ్ఞప్తిచేసినాడు.

అథ సంస్మారయామాస రాఘవం మాతలి స్తదా
అజానన్నివ కిం వీర త్వమేనమనువర్తసే 111-1

**మాతలి :** రామప్రభూ ! ఏమియు ఎరుగనివాని చందమున నీవీ రావణుని అనుసరించుచుంటివేమి ?

[రావణుడు చేసినదానికి బదులు చేయుటతోనే సరిపెట్టుకొనుచున్నావేమి ?]

రావణునికి వినాశము కలుగు నని దేవతలు సూచించినకాలము వచ్చినది. రావణునిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించి రావణుని వధింపుము.

ఈ హెచ్చరికతో శ్రీరామునికి స్ఫురణకలిగినది. బ్రహ్మదేవుడు ఇంద్రునికై నిర్మించిన బాణమును, అగస్త్యుడు రాముని కిచ్చినాడు. శ్రీరాముడు ఆ బాణమును గైకొని వేదప్రోక్తవిధానముగా అభిమంత్రించి ధనుస్సును సంధించి రావణుని వక్షస్థలమున ప్రయోగించినాడు. ఆ బాణము రావణుని హృదయమును భేదించినది.

స విసృష్టో మహావేగ శ్శరీరాంతకర శ్శరః
బిభేద హృదయం తస్య రావణస్య దురాత్మనః 111-18

ఆ దివ్యబాణము రావణుని ప్రాణములను హరించి, భూతలమునపడి మరలివచ్చి రాముని తూణీరమున యథాస్థానములో చేరినది. రావణుని శరీరము రథముపైనుండి క్రింద పడిపోయినది.

హతశేషులైన రాక్షసులు లంకలోనికి పరుగెత్తినారు. వానరులు ఆనందసాగరమున మునిగి సింహనాదములు చేసినారు. అంతరిక్షమున దేవదుందుభులు మ్రోగినవి. పుష్పవృష్టి కురిసినది. దేవత లందరును శ్రీరాముని ప్రశంసించినారు. దేవతలబాధ తీరిపోయినది. ఆకాశము నిర్మల మయినది.

లక్ష్మణుడు, సుగ్రీవుడు, విభీషణుడు, హనుమంతుడు మున్నగు వానరవీరులును ఆనందభరితులై శ్రీరాముని పూజించినారు. శ్రీరాముడు తన ప్రతిజ్ఞను నెరవేర్చి సుగ్రీవాది మిత్రులు పరివేష్టింప, దేవసమూహములతో పరివేష్టితు డైన దేవేంద్రుని చందమున ప్రకాశించినాడు.

స తు నిహతరిపుః స్థిరప్రతిజ్ఞః
స్వజన బలాభివృతో రణే రరాజ
రఘుకుల నృపనందనో మహౌజా
స్త్రిదశగణై రభిసంవృతో యథేంద్రః 111-34

[రావణుని శిరస్సు నూటఒక్క పర్యాయములు తెగిపోయి నూటఒక్క పర్యాయములు మొలిచినది. తుదకు, బ్రహ్మాస్త్రము రావణుని హృదయమును భేదించి రావణుని అంత మొందించినది. ఈ సందర్భమున ఒకమాట.

ఈ సన్నివేశము ఒక పరమసత్యమును బోధించుచున్నది. మనము ఒక వేదాంత ఉపన్యాసమును వినినప్పుడు ఉపన్యాసము తల కెక్కుచున్నది. విన్నంత సేపు ఆ ధోరణిలోనే ఉందుము. బయటికి వచ్చిన వెంటనే దానిని మఱచిపోయి మన మామూలు ధోరణిలో పడుట కలదు. ఉపన్యాస మందిరమున ఛేదింపబడిన మన మామూలు ఆలోచనలు మనము బయటికి వచ్చిన వెంటనే మరల పుట్టుకొనివచ్చును. మనము కేవల బుద్ధిచే గ్రహించిన వేదాంత జ్ఞానము ఇట్లే ఉండును. నిజముగా పనిచేయగల వేదాంతజ్ఞానము హృదయమున ప్రవేశించి మనయందు పరివర్తనము కలుగజేయును. అట్టి జ్ఞానము బ్రహ్మాస్త్రమువంటిది. హృదయమున దూరబడి పనిచేయగలదు. అంతటితో ప్రాతవాసనలు నిశ్శేషముగా నమసిపోగలవు. రావణుని ప్రాణములను బ్రహ్మాస్త్రము కొనిపోయినట్లు మన మలినవాసనలను బ్రహ్మజ్ఞానము శమింపజేయును. బ్రహ్మజ్ఞానమును తలకుమాత్రము ఎక్కించుకొనుటవలన లాభము ఉండదు. హృదయముచే గ్రహింపవలయును.]

## విభీషణుడు

రావణుడు మరణించి యుద్ధభూమిలో పడియుండుట చూచి విభీషణుడు విలపించుచున్నాడు.

**విభీషణుడు :** అన్నా ! లోకోత్తరుడవైన వీరుడవు. హంసతూలికాతల్పమున పవ్వళింపదగిన నీకు ఎట్టిదీనావస్థ వచ్చినది ! ఇటుల జరుగు నని నే నానాడే చెప్పితిని. కామమోహమున చిక్కుపడి నీవు నామాట పెడచెవినిబెట్టితివి.

ఆహా ! నీతివిశారదుడు, ధర్మవిగ్రహ మనదగినవాడు, పరాక్రమవంతుడు, ప్రశంసనీయుడును మరణించెనుగదా !

గత స్సేతు స్సునీతానాం గతో ధర్మస్య విగ్రహః
గత స్సత్త్వస్య సంక్షేపః ప్రస్తావానాం గతిర్గతా 112.6

[మరణించినవానినిగూర్చి విలపించునప్పుడు అతని సుగుణములనే స్మరించుట యోగ్యులలక్షణము.]

ధైర్యమే చిగురుగాను, సహనమే పుష్పముగాను, తపస్సే బలముగాను, శౌర్యమే వేరుగాను కలిగిన రాక్షసరాజవృక్షము 'రాముడు' అను పెనుగాలిచే యుద్ధములో విరువబడినది.

ధృతిప్రవాళః ప్రసహాగ్ర్యపుష్ప
స్తపోబల శ్శౌర్య నిబద్ధ మూలః
రణే మహాన్ రాక్షసరాజ వృక్ష
స్సమ్మర్దితో రాఘవ మారుతేన. 112.10

రావణుని గొప్పతనము తలచుకొని తలచుకొని విభీషణుడు పరిపరివిధములుగా చాలసేపు విలపించినాడు.

**రాముడు :** విభీషణా ! రావణుడు గొప్ప పరాక్రమశాలియై, యుద్ధమాడి, రణరంగమున వీరమరణమును పొందినవాడు. ఇట్టి శూరులను గురించి దుఃఖపడరాదు. నీ వీ దుఃఖమును విడిచి, అనంతరము జరుగవలసిన పనులనుగూర్చి ఆలోచింపుము.

**విభీషణుడు :** రామప్రభూ ! రావణుడు దొడ్డవాడు. గొప్పబ్రదుకు బ్రదికినవాడు. తపస్సంపన్నుడు. వేదపండితుడు. ఆహితాగ్ని. కర్మఠుడు. నీవు అనుగ్రహింతువేని, నీకు సమ్మత మగునేని రావణునికి ప్రేతసంస్కారము చేయగోరుచున్నాను.

ఏషోహితాగ్నిశ్చ మహా తపాశ్చ
వేదాంతగః కర్మసు చాగ్ర్యశూరః

ఏతస్య యత్ప్రేతగతస్య కృత్యం
తత్కర్తు మిచ్ఛామి తవ ప్రసాదాత్. 112-24

*రాముడు* : విభీషణా! రావణునికి సంస్కారము యథాశాస్త్రముగా చేయుము. రావణుని మరణముతో మా వైరము తీరినది. ఇకమీద రావణుడు నీకెట్లో నాకును అట్లే.

[శత్రువు మరణించినపిమ్మటకూడ విరోధమును సాధించునట్టివాడుకాడు శ్రీరాముడు]

మరణాంతాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్
క్రియతామస్య సంస్కారో మమాప్యేష యథా తవ. 112-26

## అంతఃపురస్త్రీల విలాపము

రావణుడు హతుడైన వార్త విని రావణుని అంతఃపురస్త్రీ లందరు యుద్ధభూమికి వచ్చి, అచ్చట పడియుండిన తమ భర్తను చూచి పరిపరివిధములుగా దుఃఖించినారు. కొందరు రావణుని కవుగిలించుకొన్నారు. కొందరు పాదములు పట్టుకొని విలపించినారు. కొందరు మూర్ఛిల్లినారు. కొందరు రావణుని శిరస్సును ఒడియం దుంచుకొని యేడ్చినారు. రావణుని గొప్పతనమును స్మరించుచు ఆక్రందించినారు. విభీషణుని హితవాక్యములను వినియుండినచో మా కీ దుర్గతి తప్పియుండునుగదా అని దుఃఖించినారు. 'దైవగతిని తప్పింప నెవ్వనికేని సాధ్య మగునా' అని రోదించినారు.

## మండోదరీ విలాపము

మండోదరి రావణునికి ప్రియురాలైన పట్టమహిషి. ఇంద్రజిత్తు తల్లి. మయుని పుత్రిక. ఎన్నిక గన్న పతివ్రత. హతుడైన పతిని జూచి పరిదేవించినది.

*మండోదరి* : నాథా! ఇంద్రుడు సైతము నిన్ను జూచి భయపడువాడుగదా! ఒక్క మనుష్యమాత్రుడు ని న్నెట్లు వధింపగలిగెనో ఆశ్చర్యకరముగా నున్నది. కాదు, రాముడు మనుష్యమాత్రుడు కాడని తోచుచున్నది. జనస్థానమునందు రాక్షస సంహారము చేసిననాడే తెలిసినది రాముడు మనుష్యమాత్రుడు కాడని. దేవతలకునూ చొరరాని లంకలోనికి హనుమంతుడు వచ్చినప్పుడే దిగులుపడితిమిగదా! వానరులు సముద్రమునకు సేతువు నిర్మించి రనగా అది మనుష్యమాత్రుడు సాధింపగల కార్యమా! అప్పుడే గ్రహించితిని రాముడు మానవాతీతు డని. నిన్ను వధించుటకు యముడే రామరూపముతో వచ్చియుండును; లేక ఇంద్రుడే ఇట్లు వచ్చెను కాబోలు! అయ్యో! నా వెర్రిగాని, యముడును ఇంద్రుడును యుద్ధమున నీ యెదుట నిలువగలరా! ఈ రాముడు విష్ణుదేవుడే అయియుండును. ఆదిమధ్యాంతరహితుడైన శంఖచక్రగదాధరుడే ఈ రాముడు.

వ్యక్తమేష మహాయోగీ పరమాత్మా సనాతనః
అనాదిమధ్యనిధనో మహతః పరమో మహాన్. 114-14

తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః
శ్రీవత్సవక్షా నిత్యశ్రీ రజయ్య శ్శాశ్వతో ధ్రువః. 114-15

నిన్ను విధ్వంస మొనర్చుటకే విష్ణుదేవుడు రామరూపముతో అవతరించినాడు.

నీవు పూర్వము ఇంద్రియములను జయించి ముల్లోకములను జయింపగలిగితివి. పూర్వ వైరమును స్మరించి ఆ ఇంద్రియములు ఇప్పుడు నిన్ను జయించి పగ సాధించినవి. నీవు ఇంద్రియలోలుడవై ప్రాణముపైకి తెచ్చుకొంటివి!

ఇంద్రియాణి పురా జిత్వా జితం త్రిభువనం త్వయా
స్మరద్భిరివ తద్వైర మింద్రియైరేవ నిర్జితః. 114-18

రామునితో విరోధము వల దని ఎంతదూరమో చెప్పితినిగదా! నా మాట విన్నావా! నిష్కారణముగా సీతను కోరి నీకును, మాకును ఇట్టి అనర్థము తెచ్చిపెట్టితివి! అరుంధతి, రోహిణి, మున్నగువారికంటె గొప్ప పతివ్రతయైన సీతను చెరపట్టుట ఎంత తప్పు!

అరుంధత్యా విశిష్టాం తాం రోహిణ్యాశ్చాపి దుర్మతే
సీతాం ధర్షయతా మాన్యాం త్వయా హ్యసదృశం కృతమ్. 114-21

పతివ్రతయైన సీతయొక్క తపఃప్రభావాగ్నిలో నీవు దగ్ధుడవైతి వనుటకు సందేహములేదు.

పతివ్రతాయా స్తపసా నూనం దగ్ధోసి మే ప్రభో 114-24

నీవు సీతాదేవిని స్పృశించిన క్షణముననే మండిపోవలసినవాడవు. కాని దేవతలకు సైతము భీతిగొల్పు నీ తపస్సు నిన్ను ఆ క్షణమున కాపాడినది.

ప్రతిప్రాణియు వాని వాని కర్మఫలములు అనుభవింపక తప్పదు. పుణ్యముచేసికొన్నవాడు మంచి ఫలము ననుభవింపగలడు. పాపము చేసినవానికి పాపఫలము తప్పక సంప్రాప్త మగును. పుణ్యము చేసికొన్న విభీషణుడు సుఖపడినాడు. నీవు పాపము చేసితివి కావున ఇట్టి దురవస్థ నీకు సంభవించినది.

శుభకృ చ్ఛుభ మాప్నోతి పాపకృ త్పాప మశ్నుతే
విభీషణ స్సుఖం ప్రాప్త స్త్వం ప్రాప్తః పాపమీదృశమ్. 114-26

నీవు మోహములోపడి, తెలిసికొనలేకపోయితివి కాని కులమునగాని, రూపమున గాని సీత నాకన్న అధికురాలా ! నాతో సమానురాలునుకాదు.

ప్రతిప్రాణియు మరణించుటకు ఏదో ఒక కారణము ఉండవలయును. సీతను కొనివచ్చుట నీ మరణమునకు నెపమేగాని మరియొకటికాదు.

['నిందలేక బొందిపోదు' అను సామెత వాడుకలో నున్నది]

సర్వథా సర్వభూతానాం నాస్తి మృత్యురలక్షణః
తవ తావదయం మృత్యు ర్మైథిలీకృత లక్షణః. 114-29

సీతను కొనివచ్చుట మృత్యువును తెచ్చుకొన్నట్టయినది. సీతారాములు సుఖముగా నుందురు. నాకు మాత్ర మీ దుర్గతి పట్టినది.

ఛీ! సంపద లెంత చంచలములు ! నాకు వైధవ్యము కలుగు నని ఎన్నడును తలపలేదుగదా !

దానవభర్త కుమార్తెను, రాక్షసేశ్వరుని భార్యను, ఇంద్రుని జయించిన వాని తల్లిని అని ఎంతో గర్వించియుంటిని. నా గర్వ మంతయు అణగిపోయినది.

నాథా! నీ శరీర మంతయు బాణమయమై యున్నందున నిన్ను మనసార కవుగిలించుకొనుటకుకూడ వీలుకాకున్నది.

నిన్ను వధింప నొకనికి సాధ్య మగునా ! నీవు మరణించితి వని కలగనుచున్నాను కాబోలు !

అయ్యో ! ఇది కలకాదు. అంతయు నిజమే ! నీ వంటి భర్తను పోగొట్టుకొని నే నింకను బ్రతికియున్నా ననగా నేనొక శిల నన్నమాట.

ఇంద్రజిత్తు మరణించినప్పుడే క్రుంగి కూలి పోయితిని. నీవును మరణించినపిదప నా ప్రాణము నిలుచునా ! నీవు పోవుచోటికి నన్నును వెంట గొనిపొమ్ము.

నాథా ! నీ భార్య లందరు మేలిముసుగులు విడనాడి అంతఃపురము వెల్వడి వచ్చియున్నారు చూడుము. వారిపై కోపింపకున్నా వేల !

నీ విదివరకు పతివ్రతలైన కులస్త్రీలను చెరపట్టి వారి భర్తలను వధించి, వారిని విధవలను చేసితివి. ఆ కులస్త్రీలు దుఃఖించి నిన్ను శపించినందున నీవు శత్రువుచే నిహతుడవైతివి.

**యాస్త్వయా విధవా రాజన్ కృతా నైకాః కులస్త్రియః**
**పతివ్రతా ధర్మపరా గురుశుశ్రూషణే రతాః.** 114-65

తాభి శ్శోకాభితప్తాభి శ్శప్తః పరవశం గతః. 114-66

పతివ్రతల కన్నీరు ఎన్నటికిని వ్యర్థము కాదు. పతివ్రతల కన్నులనుండి అశ్రుబిందువులు నేల రాలుట అకారణము కాదను లోకోక్తి నీపట్ల సత్య మయినది.

ప్రవాద స్సత్య ఏవాయం త్వాం ప్రతి ప్రాయశో నృప
పతివ్రతానాం నాకస్మా త్పతం త్యశ్రూణి భూతలే. 114-67

నాథా! నీ పరాక్రమముచే లోకముల నాక్రమించుకొన్నవాడవు. చోరునివలె ఒక అబలను అపహరించి పిరికివాని చందమున ప్రవర్తించితివి. నీవు నారీ చౌర్యము చేసిననాడే నీ శౌర్యము ఉడిగినది. నీవు భయపడుటయే నీ వినాశమును సూచించినది.

కాతర్యం చ న తే యుద్ధే కదాచి త్సంస్మరామ్యహమ్
తత్తు భాగ్యవిపర్యాసా న్నూనం తే పక్వలక్షణమ్. 114-70

నీ పుణ్యాపాపములను వెంటబెట్టుకొని నీదారిబట్టి నీవు వెళ్ళితివి. నేనుమాత్రము నీ వియోగమువలన కలిగిన దుఃఖమును భరింపజాలకున్నాను.

విభీషణుడు, మారీచుడు, కుంభకర్ణుడు, మా తండ్రి, వీరందరును చెప్పిన హితవాక్యములను త్రోసిపుచ్చినందుకు ఈ ఫలిత మేర్పడినది.

ఇట్లు విలపించి విలపించి మండోదరి మూర్ఛిల్లి రావణుని శరీరముపై పడిపోయినది. రావణుని ఇతర భార్యలు మండోదరికి ఉపచారములు చేసి ఊరడించినారు.

## విభీషణుడు రావణునికి సంస్కారము చేయుట

*రాముడు* : విభీషణా! స్త్రీ జనములను నగరములోనికి పంపించి, రావణునికి జరుగవలసిన ఉత్తరక్రియలు జరిపింపుము.

*విభీషణుడు* : (మెలకువతో) రామప్రభూ! రావణుని వంటి పాపాత్మునికి నేను సంస్కారము చేయుట తగియుండునా! రావణుడు నాకు సోదరుని రూపములో నున్న శత్రువు. అన్నకు సంస్కారము చేయని దుర్మార్గుడ నని లోకులు నన్ను మొదట మొదట నిందించినను, అటువెనుక రావణుని దుర్గుణములను మనస్సునకు తెచ్చుకొని నేను చేసినపని మంచిదే అని సమాధానపడగలరు.

నృశంస ఇతి మాం కామం వక్ష్యంతి మనుజా భువి
శ్రుత్వా తస్యగుణా న్సర్వే వక్ష్యంతి సుకృతం పునః. 114-96

*రాముడు* : (విభీషణుని మాటలకు సంతోషించి) రాక్షసేశ్వరా! నీ సహాయమువలన నాకు జయము కలిగినది. నేను నీకు హితకరమైన మాట చెప్పెదను, వినుము.

రావణుడు అధర్మమార్గములో నుండినమాట నిజమే కాని రావణుడు గొప్ప వీరు డన్నమాట మనము మరవకూడదు. శత్రువు మరణించినపిదప విరోధము సాధింపరాదు. రావణుడు సంస్కారమునకు అర్హుడు. కావున నీ వతనికి యథా శాస్త్రముగా ఉత్తరక్రియలు జరిపింపుము. దీనివలన నీకు కీర్తి లభింపగలదు.

త్వత్సకాశాద్దశగ్రీవ స్సంస్కారం విధిపూర్వకమ్
ప్రాప్తుమర్హతి ధర్మజ్ఞ త్వం యశోభాగ్భవిష్యసి. 114-102

శ్రీరాముని అనుమతితో విభీషణుడు రావణునికి సంస్కారము చేయ సమకట్టి నాడు. ఋత్విజులు మంచిగంధపు చెక్కలతో చితి పేర్చి దానిని తెల్లవెంద్రుకలు గల జింక చర్మముతో కప్పినారు. త్రేతాగ్నులు స్థాపించినారు. పెరుగు, నెయ్యి, కలిపి హోమపాత్రములలో పెట్టినారు. రావణుని కళేబరమును అలంకరించి చితిపై నుంచి విభీషణుడు మంత్రయుక్తముగా అగ్నిసంస్కారము చేసినాడు. విభీషణుడు స్నానము చేసి తడిగుడ్డలతో రావణునికి ఉదకదానము చేసి సాష్టాంగనమస్కారము చేసి శాస్త్రో క్తముగా సంస్కారము పూర్తి కావించినాడు.

స్త్రీల నందరను ఆశ్వాసించి పట్టణములోనికి పంపినాడు. తాను వచ్చి సవినయ ముగా శ్రీరాముని ప్రక్కన నిలువబడినాడు.

ప్రవిష్టాసు చ సర్వాసు రాక్షసీషు విభీషణః
రామపార్శ్వ ముపాగమ్య తదాతిష్ఠ ద్వినీతవత్. 114-115

## విభీషణుని పట్టాభిషేకము

శ్రీరాముడు శత్రువును వధించి, వృత్రాసురుని వధించిన ఇంద్రునివలె పరమ సంతోషమును పొందినాడు. లక్ష్మణుడు, సుగ్రీవుడు, వానర సేనలు, అందరును ఆనంద సాగరతరంగములలో ఊగాడుచుండినారు.

యుద్ధమును చూడవచ్చిన దేవతలు, గంధర్వులు, దానవులు రావణవధమును తిలకించి శ్రీరాముని పరాక్రమమును, హనుమదాది వానరవీరుల సాహసకార్యములను, సుగ్రీవుని మంత్రాంగమును, లక్ష్మణుని అనురాగ పరాక్రమములను ప్రశంసించుకొనుచు వారివారి నెలవులకు అరిగినారు.

శ్రీరాముడు మాతలికి వీడుకో లిచ్చి రథమును ఇంద్రునికి పంపించినాడు.

శ్రీరాముడు సుగ్రీవుని కవుగిలించుకొన్నాడు.

అందరు శిబిరమునకు చేరినారు.

**రాముడు**: లక్ష్మణా! విభీషణుడు నాయెడ స్నేహమును చూపి ఉపకారము చేసినవాడు. నాయందు భక్తిగలవాడు. ఇతనికి లంకారాజ్యపట్టాభిషేకము చేయింపుము. ఇదియే నా ముఖ్యమైన కోరిక.

విభీషణమిమం సౌమ్య లంకాయా మభిషేచయ
అనురక్తం చ భక్తం చ మమ చైవోపకారిణమ్. 115-9

ఏష మే పరమః కామో యదీమం రావణానుజమ్
లంకాయాం సౌమ్య పశ్యేయ మభిషిక్తం విభీషణమ్. 115-10

[ముందు తన భక్తుని అభిషేకము జరిపింపవలయును. సీతాదేవిని తరువాత చూడవచ్చును! భక్తుల కోరికలు తీర్చుటయే శ్రీరాముని మొదటి పని]

లక్ష్మణుడు బంగారుకలశములను తెప్పించి, మనోవేగముతో ప్రయాణము చేయగలిగిన వానరవీరుల చేతి కిచ్చి సముద్రముల జలములు తెప్పించినాడు. లక్ష్మణుడు సింహాసనమున విభీషణుని కూర్చుండబెట్టి ఒక జలపూర్ణకలశమును గైకొని దానితో విభీషణునికి అభిషేకము చేసినాడు.

తతస్త్వేకం ఘటం గృహ్య సంస్థాప్య పరమాసనే
ఘటేన తేన సౌమిత్రి రభ్యషించ ద్విభీషణమ్. 115-14

శుద్ధాత్ముడైన విభీషణునికి మంత్రయుక్తముగా పట్టాభిషేకము జరిగినది. విభీషణుని మంత్రులు, విభీషణుని భక్తులైన రాక్షసులును సంతోషించినారు. విభీషణుడు శ్రీరామదత్తమైన రాజ్యమును పొంది రాక్షసులను ఊరడించి, శ్రీరాముని చెంతకు వచ్చినాడు.

పౌరులు అక్షతలు, కుడుములు, పేలాలు, పూవులు మొదలైన మంగళద్రవ్యములను తెచ్చి విభీషణునికి సమర్పించినారు. ఆ ద్రవ్యముల నన్నింటిని విభీషణుడు రామలక్ష్మణులకు సమర్పించినాడు. విభీషణునిప్రీతికై శ్రీరాముడు వానిని ప్రతిగ్రహించినాడు.

[తనకు పని లేకపోయినను, భక్తునికి ఆయాసము కలిగించుటకు ఇష్టపడక శ్రీరాముడు వానిని ప్రతిగ్రహించినాడు. శ్రీరాముడు ఇచ్చువాడేగాని పుచ్చుకొనువాడు కాడు. అయినను, భక్తునికోసమై శ్రీరాముడు ఏ పనియైన చేయువాడు!]

కృతకార్యం సమృద్ధార్థం దృష్ట్వా రామో విభీషణమ్
ప్రతిజగ్రాహ తత్సర్వం తస్యైవ ప్రియకామ్యయా: 115-20

[విభీషణుడు నిజముగా రాక్షసేంద్రుడైనాడు. శ్రీరాముడు తన మాట నిలబెట్టుకొన్నాడు. తన పట్టాభిషేకమును వదలుకొని సుగ్రీవుని పట్టాభిషేకము, అంగదుని యౌవరాజ్య పట్టాభిషేకము, విభీషణుని పట్టాభిషేకము జరిపించినాడు. అందుకే రాముడు రాముడైనాడు!]

## శ్రీరాముడు సీతాదేవియొద్దకు హనుమంతుని పంపుట

*రాముడు :* (చెంతనున్న హనుమంతునితో) హనుమంతుడా! మహారాజైన విభీషణుని అనుమతి గైకొని లంకలోనికి వెళ్ళి నేను, లక్ష్మణుడు, సుగ్రీవుడు, మున్నగు వారము కుశలులమై యుండుటయును, రావణుడు హతుడైనా డనియును, సీతతో చెప్పి ఆమె సందేశమును గొనిరమ్ము.

> ప్రియమేత దుదాహృత్య మైథిల్యా స్త్వం హరీశ్వర
> ప్రతిగృహ్యా చ సందేశ ముపావ ర్తితు మర్హసి. 115-25

[మాట కటువుగా నున్నది. సీతాదేవిని పిలుచుకొని రమ్మని చెప్పలేదు. ఆమె సందేశము కావలయునట! పాపము! ఆమె పంపుటకు సందేశ మేమి యుండును!]

రాక్షసుల పూజ లందుకొనుచు హనుమంతుడు వెళ్ళి అశోకవనమం దుండిన సీతాదేవిని చూచినాడు. సీతాదేవి ఎట్టి సంస్కారమును లేక చెట్టుక్రింద కూర్చుండి దుఃఖనిమగ్నయై యుండినది. రాక్షసస్త్రీలు ఆమెను పరివేష్టించియున్నారు.

ఇట్టి స్థితిలో నున్న సీతాదేవియొద్దకు వెళ్ళి హనుమంతుడు నమస్కరించి అభివందనము చేసినాడు [తనపేరు చెప్పుకొన్నాడు]. సీతాదేవి హనుమంతుని చూచి కొంతసేపు ఏమియు పలుకక యుండినది. ఆ తరువాత స్మృతి తెచ్చుకొని సంతోషపడినది.

సీతాదేవి ప్రసన్నయైయుండుట చూచి హనుమంతుడు అనుచున్నాడు.

*హనుమంతుడు :* తల్లి శ్రీరాముడు కుశలియై యున్నాడు. లక్ష్మణుడు, సుగ్రీవుడు, విభీషణుడు, వానరసేనలు, అందరును క్షేమముగా నున్నారు. విభీషణుని తోడ్పాటువలనను, లక్ష్మణుని నీతిబలమునను శ్రీరాముడు యుద్ధమున రావణుని వధించినాడు.

శ్రీరాముడు నీ క్షేమమును అడిగి నీకీ వార్తను చెప్పి పంపినాడు. "దేవీ! నీకొక ప్రియవార్త నందించుచున్నాను. నీకు సంతోషము కలిగింతును. నా భాగ్యవశమున నీవు బ్రదికియున్నావు. యుద్ధమునందు మనకు విజయము లభించినది. నీ విక దుఃఖమును విడిచి స్వస్థవై యుండుము. శత్రువైన రావణుడు హతుడైనాడు. లంకానగరము మన వశ మయినది. నిన్ను శత్రువుపశమునుండి విడిపించుటకై ప్రతిజ్ఞ పూని, దృఢ సంకల్పముతో, నిద్ర మాని, సముద్రమునకు సేతువు నిర్మించి, లంకకు వచ్చి, రావణుని వధించి, నా ప్రతిజ్ఞను నెరవేర్చుకొన్నాను. రావణుని ఇంటిలో నుంటి నని నీ విక భయపడవలసిన పనిలేదు. ఈ లంకారాజ్యమును విభీషణుని కిచ్చితిని. నీ విప్పుడు

మన ఇంట నున్నట్టే సుఖముగా నుండుము. నిన్ను సందర్శించుటకు విభీషణుడు ఇప్పుడే రాగలడు."

[అయోధ్యలో సీతారాముల ఆవరణములోకూడ ఒక అశోకవనము ఉన్నది కావున మన ఇంటనున్నట్టు సుఖముగా నుండుమనుట చక్కగా నున్నది.

యచ్చ మద్భవనం శ్రేష్ఠం సాశోకవనికం మహత్
ముక్తా వైడూర్యసంకీర్ణం సుగ్రీవాయ నివేదయ 131-45]

హనుమంతుని మాటలు విని, సీతాదేవి యేమియు బదులు పలుకక ఊరకుండినది.

**హనుమంతుడు :** తల్లీ! నీవు నాతో పలుకక ఏదో ఆలోచించుచున్నావేమి ?

కిన్ను చింతయసే దేవి కిం ను మాం నాభిభాషసే. 116-16

**సీత :** (సంతోషముతో గద్గదస్వరముతో) హనుమంతుడా! నా భర్తనుగూర్చిన విజయ వార్త విని సంతోషపరవశనైనందున క్షణకాలము నోట మాటరాలేదు.

ఇట్టి శుభవార్తను కొనివచ్చిన నీకు తగినట్లు ఏమిచేయగలనా అని ఆలోచించుచున్నాను. నీవు చెప్పిన ప్రియవార్తకు సరివచ్చునట్లు నీకీయదగిన వస్తువు నాకు ముల్లోకములలోను కానరాలేదు. వెండిగాని, సువర్ణముగాని, రత్నములుగాని, త్రిలోక రాజ్యాధిపత్యముగాని నీవు కొనివచ్చిన ప్రియవార్తకు సరిరావు.

ప్రియమేత దుపశ్రుత్య భర్తుర్విజయ సంశ్రితమ్
ప్రహర్షవశ మాపన్నా నిర్వాక్యాస్మి క్షణాంతరమ్. 116-17

న హి పశ్యామి సదృశం చింతయంతీ ప్లవంగమ
మత్ప్రియాఖ్యానకస్యేహ తవ ప్రత్యభినందనమ్. 116-18

హిరణ్యం వా సువర్ణం వా రత్నాని వివిధాని చ
రాజ్యం వా త్రిషు లోకేషు నైతదర్హతి భాషితుమ్. 116-21

**హనుమంతుడు :** (అంజలిఘటించి) తల్లీ! నీవు ప్రసన్నవై పలికిన పలుకులే చాలును. నీ మాటలు రత్నరాసులకన్నను, దేవరాజ్యముకన్నను అధికమైనవి. శత్రువును వధించి, విజయదీప్తులతో వెలుగుచున్న శ్రీరామచంద్రుని దర్శనభాగ్యము నాకు లభించినది. ఆ దర్శనముచే నాకు సమస్తసంపదలును, దేవరాజ్యమును, సర్వము చేకూరినవి. అదియే నాకు పరమార్థము.

తవైతద్వచనం సౌమ్యే సారవ త్స్నిగ్ధమేవ చ
రత్నౌఘా ద్వివిధాచ్చాపి దేవరాజ్యా ద్విశిష్యతే. 116-23

అర్థతశ్చ మయా ప్రాప్తా దేవరాజ్యాదయో గుణాః
హతశత్రుం విజయినం రామం పశ్యామి సుస్థితమ్. 116-24

సీత : హనుమా ! ఇంత లక్షణసంపన్నముగా, ఇంతమధురముగా మాటలాడుటకు నీవే సమర్థుడవు. నీవంటి కొడుకును గన్న నీ తల్లిదండ్రులు ధన్యులు. బలము, ఉత్సాహము, పాండిత్యము, ధైర్యము, పరాక్రమము, వినయము మున్నగు సద్గుణములు నిన్నాశ్రయించి ఎంతయు ప్రకాశించుచున్నవి. ఇందులో సందేహము లేదు.

[నిన్ను పొగడుటకు చెప్పిన మాటలుకావు ఇవన్నియు నిజముగానే నీయందున్నవి]

బలం శౌర్యం శ్రుతం సత్త్వం విక్రమో దాక్ష్యముత్తమమ్
తేజః క్షమా ధృతి ర్ధైర్యం వినీతత్వం న సంశయః. 116-29

ఏతే చాన్యే చ బహవో గుణా స్త్వయ్యేవ శోభనా. 116-29

[ఈ మాటలు విని హనుమంతు డెంత సంతోషించెనో !]

హనుమంతుడు : (అంజలిచేసి ఆనందపరవశుడై సీతాదేవియెదుట నిలబడి) తల్లీ ! నా కొక చిన్న కోరిక యున్నది. నీవు దుఃఖముతో బాధపడుచుండగా నిన్ను హింసించిన రాక్షసస్త్రీలను వధింపగోరుచున్నాను. వారిని నా ఇష్టానుసారము మర్దించి కసి తీర్చుకొనవలె నని మిక్కిలి ఆశపడుచున్నాను. నీ అనుజ్ఞకై వేచియున్నాను. ఈ వరమును మాత్రము ప్రసాదింపుము.

సీత : నాయనా ! ఆంజనేయా ! ఈ రాక్షసస్త్రీలు రావణుని ఆశ్రయించి బ్రతుకుచుండిన పనికత్తెలు. రావణుని ఆజ్ఞ ననుసరించి నన్ను బాధించినారు. అంతే. దాసీజనముపై కోపింపదగునా !

రాజసంశ్రయ వశ్యానాం కుర్వంతీనాం పరాజ్ఞయా
విధేయానాం చ దాసీనాం కః కుప్యే ద్వానరోత్తమ. 116-38

ఇంతకును, నా గ్రహచారము వలన నాకు కష్టము కలిగినదేగాని ఇందులో వారి తప్పేమున్నది ? రావణుడు మరణించినాడు. ఇకమీద వారు నన్నేమియు బాధపెట్టరుగదా !

మరియొకమాట వినుము. ప్రాజ్ఞుడైనవాడు అపకారికి సైతము ప్రత్యపకారము చేయడు. ఈ మాటనే ఋక్షగీతలో, భల్లూకము వ్యాఘ్రముతో చెప్పినది. ఆ గీతమును వినుము.

న పరః పాపమాదత్తే పరేషాం పాపకర్మణామ్
సమయో రక్షితవ్యస్తు సంత శ్చారిత్ర భూషణాః. 116-43

హనుమా! ఈ రాక్షస స్త్రీలు చేసినది పాపమే అయినను వారిని దండించుట నాకు సమ్మతము కాదు. లోకములో తప్పు చేయనివా డొక డుండునా! అందరియెడలను మనము దయతో వర్తింపవలయును.

పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ
కార్యం కరుణ మార్యేణ న కశ్చి న్నాపరాధ్యతి. 116-44

హనుమంతుడు: తల్లీ! నీవు శ్రీరామునికి తగిన ధర్మపత్నివి. శ్రీరామునికి ప్రతిసందేశమును చెప్పి పంపుము.

సీత: హనుమా! నేను నా భర్తను చూడగోరుచున్నాను.

[అంతకన్న సందేశ మేమున్నది]

హనుమంతుడు: తల్లీ! శత్రువును వధించి లక్ష్మణుని, మిత్రులను కూడి విజయప్రభలలో వెలుగుచున్న శ్రీరాముని పూర్ణచంద్రముఖమును నీవు శీఘ్రముగా సందర్శింపగలవు.

పూర్ణచంద్రాననం రామం ద్రక్ష్యస్యార్యే సలక్ష్మణమ్
స్థిరమిత్రం హతామిత్రం శచీవ త్రిదశేశ్వరమ్. 116-50

హనుమంతుడు వాయువేగముతో శ్రీరామునిచెంతకు చేరినాడు.

## ఋక్షగీత

[ఋక్షగీతను గురించిన కథ వినదగినది.

ఒక వేటకాడు ఒక పెద్దపులి తరుముగా ఒక చెట్టుపై కెక్కినాడు. ఆ చెట్టుమీద ఒక ఎలుగుబంటున్నది. చెట్టుచెంతకు పెద్దపులి వచ్చి ఎలుగుబంటును పిలిచి "వీడుగో! ఈ వేటకాడు మన కందరికిని శత్రువు. వీనిని క్రిందికి త్రోసివేయుము" అన్నది. ఎలుగుబంటు "వీడు మన శత్రువే కానిమ్ము. అయినను నే నుండు చెట్టు నాశ్రయించినాడు గనుక నేను వీనిని త్రోయజాలను" అన్నది. పులి పోలేదు. చెట్టుక్రిందనే కనిపెట్టుకొని యుండినది.

కొంతసేపటికి ఎలుగుబంటుకు నిద్రపట్టినది. పులి వేటకానిని పిలిచి "ఆ యెలుగుబంటును నీవు క్రిందికి త్రోయుము. నేను నిన్ను విడిచిపెట్టెదను" అన్నది. వేటకాడు ఈ మాటకు హర్షించి ఎలుగుబంటును క్రిందికి బడత్రోసినాడు. కాని ఎలుగుబంటు క్రిందపడలేదు. వేటకాడు త్రోయుటలో మేల్కాంచి తన అలవాటుచొప్పున మరియొక కొమ్మను పట్టుకొని చెట్టుమీదనే ఉండిపోయినది. అంతట, పెద్దపులి ఎలుగుబంటుతో "చూచితివా! ఈ వేటకాడు పరమపాపి. నిన్ను క్రిందికి పడద్రోయుటకే పూనుకొన్నాడు. ఇప్పుడైనను వీనిని క్రిందికి త్రోసివేయుము"

అన్నది. ఈ మాటకు ఎలుగుబంటు పెద్దపులితో "ఇత డెంత అపకారము చేసినను నేను మాత్రము త్రోయను. నా ఈచెట్టు నాశ్రయించినాడు గనుక నేను వీనిని రక్షించి తీరవలసినదే' అని పలికి, సీతాదేవి హనుమంతునికి చెప్పిన గీతమును పులికి చెప్పినది.

న పరః పాపమాదత్తే పరేషాం పాపకర్మణామ్
సమయో రక్షితవ్యస్తు సంత శ్చారిత్ర భూషణాః. 116-43

"తనకు అపకారము చేసినవారికైన, శీలసంపన్నులు కీడుచేయరు. ఇదివారి ఆచారము"

ఈ మాట విని పెద్దపులి ఇక లాభములే దని తన దారి బోయినది. వేటకాడు చెట్టు దిగి బ్రతికి బయటబడినాడు.]

## హనుమంతుడు సీతాదేవి సందేశమును శ్రీరామునికి చెప్పుట

హనుమంతుడు సీతాదేవియొద్దనుండి శ్రీరాముని సన్నిధికి వచ్చి

**హనుమంతుడు :** రామప్రభూ ! ఎవ్వరినిమిత్తము ఈ మహాయత్నమును ఆరంభించి పూర్తి చేసితివో ఆ సీతాదేవిని నీవు చూడదగును. సీతాదేవి శోకముతో తపించిపోవు చున్నది. నీ విజయమును విని ఆనందించి నీదర్శనము కోరుచున్నది.

యన్నిమిత్తోయ మారంభః కర్మణాం చ ఫలోదయః
తాం దేవీం శోకసంతప్తాం మైథిలీం ద్రష్టు మర్హసి. 117-2

[శ్రీరాముని ప్రయత్నమంతయు సీతాదేవికొరకే యని హనుమంతుడు తొలిమాటలోనే సూచించుట గమనింపదగియున్నది.]

హనుమంతుని మాటలు విన్న శ్రీరాముని కన్నులనుండి అశ్రువులు వెల్వడినవి. ఏదియో ఆలోచనలో నిమగ్నుడై నిట్టూర్పుబుచ్చి, తలవ్రాల్చి, భూమి నవలోకించి, ప్రక్క నున్న విభీషణునితో పలుకుచున్నాడు.

ఏవముక్తో హనుమతా రామో ధర్మభృతాం వరః
ఆగచ్ఛ స్సహసా ధ్యాన మీషద్బాష్ప పరిప్లుతః. 117-5

దీర్ఘముష్ణం చ నిశ్శ్వస్య మేదినీ ముపలోకయన్
ఉవాచ మేఘసంకాశం విభీషణ ముపస్థితమ్. 117-6

**రాముడు :** విభీషణా ! సీతకు శిరస్స్నానముచేయించి దివ్యాంగరాగముతోను దివ్యాభరణములతోను అలంకారము చేయించి వేగిరము తోడ్కొనిరమ్ము.

## విభీషణుడు సీతాదేవిని శ్రీరామునియొద్దకు తీసికొనివచ్చుట

విభీషణుడు తన అంతఃపురస్త్రీలను వెంటబెట్టుకొనిపోయి "అమ్మా! నీవు స్నానము చేసి అలంకారము చేసికొని పల్లకి యెక్కి శ్రీరాముని సన్నిధానము చేర వలయును" అని సీతాదేవికి చెప్పినాడు.

*సీత :* రాక్షసేశ్వరా! నే నిప్పుడున్నట్టే వచ్చి నా భర్తను చూడగోరుచున్నాను. స్నానము చేసి అలంకృతనై వచ్చుట నా కిష్టము కాదు.

ఏవముక్తా తు వైదేహీ ప్రత్యువాచ విభీషణమ్
అస్నాతా ద్రష్టుమిచ్ఛామి భర్తారం రాక్షసాధిప. 116-10

[సీతాదేవి ఎంతదూరము ఆలోచించినదో గమనింపదగియున్నది. శ్రీరామునికన్న పైచేయి అనిపించినది!]

*విభీషణుడు :* అమ్మా! నీ భర్త యాజ్ఞానుసారము వర్తింపవలయునుగదా! నీ భర్త యగుటయేగాక ఆయన ప్రభువుకదా! కావున ఆయనమాట కాదనరాదు.

యదాహ రాజా భర్తా తే తత్తథా కర్తుమర్హసి. 117-11

భర్తను దైవముగా కొల్చుచున్న సీతాదేవి ఆ మాటకు మారాడజాలక సమ్మతించినది.

విభీషణుని యంతఃపురస్త్రీలు సీతాదేవికి మంగళస్నానము చేయించి, అంగరాగ మలంది, దివ్యాభరణములతోను పుష్పములతోను అలంకరించినారు. విలువగలచీరను కట్టించి మేలైన యుత్తరీయము కప్పించి పల్లకిలో కూర్చుండజేసి, సీతాదేవిని శ్రీరామునియొద్దకు విభీషణుడు తీసికొనిపోవుచున్నాడు.

రాక్షసుని ఇంట చిరకాల ముండిన సీతాదేవి తనయొద్దకు వచ్చుటను తలచుకొనిన రాముని మనస్సున హర్షము, దైన్యము, రోషము పెనగొని ప్రవేశించినవి.

తామాగతా ముపశ్రుత్య రక్షోగృహ చిరోషితామ్
హర్షో దైన్యం చ రోషశ్చ త్రయం రాఘవ మావిశత్. 117-16

*రాముడు :* విభీషణా! సీతను నాయొద్దకు కొనిరమ్ము.

సీతాదేవిని చూచుటకై వానరులు, రాక్షసులు గుంపులుగూడి దారి నడ్డగించి యున్నారు. వారి నందరిని నెట్టివైచి దారి చేయుటకు విభీషణునిచే నియమింపబడిన వేత్రహస్తులు వారి బెత్తములతో హెచ్చరికలు చేయుచు గుంపులను పారదోలు చున్నారు. ఈ కతమున పెద్ద రొద రేగినది. శ్రీరాముడు దీనిని చూచి కోపించి

**రాముడు :** విభీషణా ! ఈ జనములను ఎందు కట్లు వారించుచున్నావు ? ఈ పని చాలింపుము. వీ రెల్లరు నాకు స్వజను లని గ్రహింపుము. స్త్రీకి సదాచారమే కవచము. ఆలయములుగాని, వస్త్రములుగాని, ప్రాకారములుగాని, యవనికలుగాని, ఇతర రాజమర్యాదలుగాని ఆవరణము లగునా !

న గృహాణి న వస్త్రాణి న ప్రాకారా స్తిరస్క్రియాః
నేదృశా రాజసత్కారా వృత్తమావరణం స్త్రియాః. 117-26

గోషాలతో ఇక్కడ పని యేమి ? దుఃఖసమయములలోను, ఆపదల యందును, యుద్ధభూములయందును, స్వయంవరములలోను, యజ్ఞసమయములలోను, వివాహ వేళలలోను స్త్రీలు పురుషుల కంటబడుట దోషముకాదు.

వ్యసనేషు న కృచ్ఛ్రేషు న యుద్ధేషు స్వయంవరే
న క్రతౌ న వివాహే చ దర్శనం దుష్యతి స్త్రియాః. 117-27

ఇప్పుడు, సీత యుద్ధభూమిలో నున్నది. కష్టానుభవము నొందియున్నది. అదిగాక, నా సమక్షములో సీతకు పరదా యెందుకు ? ఇం దున్నవా రందరు నా విహితులు. కావున నిరాటంకముగా ఇచ్చటికి రావచ్చును.

శ్రీరాముని మాటలకు విభీషణుడు నొచ్చుకొన్నాడు. శ్రీరాముని సన్నిధికి సీతాదేవిని గొనివచ్చుటకు పోయినాడు. లక్ష్మణుడు, సుగ్రీవుడు, హనుమంతుడును శ్రీరాముని కటువైన కంఠస్వరమును, కఠినమైన మాటలను విని దుఃఖితు లైనారు. శ్రీరామునికి సీతాదేవియెడ ప్రేమ తొలగిపోయినదేమో యని భయపడి విచార గ్రస్తులైనారు.

కళత్ర నిరపేక్షైశ్చ ఇంగితైరస్య దారుణైః
అప్రీతమివ సీతాయాం తర్కయంతి స్మ రాఘవమ్. 117-32

పాపము ! సీతాదేవికి ఈ గొడవ తెలియదు. సీతాదేవిని విభీషణుడు శ్రీరాముని సన్నిధికి కొనివచ్చుచున్నాడు. సీతాదేవి జనసమూహమున నడచివచ్చుచుండుటచే లజ్జించి మేలిముసుగు వేసికొని తొట్రిలుచు భర్తను సమీపించి "ఆర్యపుత్రా" అని కన్నీరు నించినది.

సా వస్త్రసంరుద్ధముఖీ లజ్జయా జనసంసది
రురోదాసాద్య భర్తార మార్యపుత్త్రేతి భాషిణీ. 117-34

పతిని దైవముగా కొల్చుచుండిన సీతాదేవి, భర్తముఖమును ప్రేమతో, సంతోషముతో, విస్మయముతో చూచినది.

[రాముడు తాను చూచుట కలవాటుపడిన రాముడే అని తలచినది!]

విస్మయాచ్చ ప్రహర్షాచ్చ స్నేహాచ్చ పతిదేవతా
ఉదైక్షత ముఖం భర్తు స్సౌమ్యం సౌమ్యతరాననా. 117-35

ఎంతో కాలమైనది శ్రీరాముని చూచి! పూర్ణచంద్రబింబమువంటి రామచంద్రుని ముఖము చూచి సీతాదేవి దుఃఖమునుండి విడివడి సంతోషము పొందినది.

## శ్రీరాముడు సీతాదేవితో పరుషముగా పలుకుట

**రాముడు:** సీతా! యుద్ధములో శత్రువును జయించి నా పౌరుషమును ప్రదర్శించితిని. చపలచిత్తుడైన రాక్షసుడు నా భార్య నపహరించి నాకు కలిగించిన అవమానమును, నా శత్రువును ఏక కాలములో నిర్మూలించి నా ప్రతిజ్ఞను తీర్చుకొనగలిగితిని. దైవయోగమువలన తటస్థించిన అవమానమును నా పురుషప్రయత్నముతో పోగొట్టుకొంటిని.

హనుమంతుడు సముద్రలంఘనము కావించి లంకను దహించినాడు. ఎన్నో దుర్ఘట కార్యములు చేసినాడు. సుగ్రీవుడు, విభీషణుడు నా కెంతో తోడ్పడినారు. వారి శ్రమయంతయు ఇప్పుడు సఫలమైనది.

శ్రీరాముని ధోరణిచూచి సీతాదేవికి దుఃఖము వచ్చినది. ఆమె కన్నీరు ప్రవాహమైనది. శ్రీరామునికి కోప మధికమయినది.

**రాముడు:** సీతా! నేను చేసిన రణపరిశ్రమ నీకొరకు కాదని ఎరుంగుము.

విదితశ్చాస్తు తే భద్రే! యోఽయం రణపరిశ్రమః
స తీర్ణ స్సుహృదాం వీర్యాన్న త్వదర్థం మయా కృతః. 118-15

నా అపవాదమును తొలగించుకొని మా కులగౌరవమును రక్షించుకొను నిమిత్తమై ఈ పని చేసినాను. అంతే!

నీ సదాచారమునుగూర్చి నేను శంకించుచున్నాను. నేత్రరోగపీడితుడు దీపమును చూచి బాధపడునట్లు, నా యెదుట నున్న నిన్ను చూచి బాధపడుచున్నాను.

[ఉపమానము చక్కగా నున్నది. నేత్రరోగము రామునిది. సీతాదేవి దీపమువంటిది. ఈ మాట శ్రీరాముడే చెప్పుచున్నాడు!]

ప్రాప్తచారిత్రసందేహా మమ ప్రతిముఖే స్థితా
దీపో నేత్రాతురస్యేవ ప్రతికూలాసి మే దృఢమ్. 118-17

సీతా! నీతో నాకు పనిలేదు. నీ ఇష్టమువచ్చినచోటికి పొమ్ము. నే నను జ్ఞ ఇచ్చుచున్నాను.

తద్గచ్ఛ హ్యభ్యనుజ్ఞాతా యథేష్టం జనకాత్మజే
ఏతా దశదిశో భద్రే కార్యమస్తి న మే త్వయా. 118-18

చిరకాలము పరుని ఇంటనున్న స్త్రీని సత్కులమున పుట్టిన వీర్యవంతుడైన పురుషు డెవ్వడుగాని పరిగ్రహింపడు.

[ 'స్త్రీయం పురుషవిగ్రహం' అని సీతాదేవి లోగడ పలికిన ఎత్తిపొడుపు మాటకు జవాబుగా ఉన్నది!]

నీవు రావణుని అంకమునుండి దిగివచ్చినదానవు. దుష్టుడైన రావణుడు నిన్ను దుష్టదృష్టితో చూచియుండును. కావున, సత్కులమునందు జన్మించిన నేను నిన్ను మరల ఎట్లు గ్రహింపగలను!

రావణాంక పరిభ్రష్టాం దృష్టాం దుష్టేన చక్షుషా
కథం త్వాం పునరాదద్యాం కులం వ్యపదిశన్ మహత్. 118-20

సీతా! నాకు నీమీద ఆసక్తిలేదు. ఇక్కడినుండి నీ ఇష్టము వచ్చినచోటికి పోవచ్చును. నే నెంతయో ఆలోచన చేసి ఈ మాట చెప్పుచున్నాను.

నాస్తి మే త్వయ్యభిష్వంగో యథేష్టం గమ్యతా మితః
ఇతి ప్రవ్యాహృతం భద్రే మయైత త్కృతబుద్ధినా. 118-21

లక్ష్మణుడు, భరతుడు, వానరేంద్రుడైన సుగ్రీవుడు, రాక్షసేంద్రుడైన విభీషణుడును ఉన్నారు. నీ కెచ్చట ఇష్టమో అచ్చట ఉండవచ్చును.

తన ఇంట నున్న నీ దివ్యరూపమును చూచి రావణుడు ఇంతకాలము సహించి ఊరకుండునా!

న హి త్వాం రావణో దృష్ట్వా దివ్యరూపాం మనోరమామ్
మర్షయేత చిరం సీతే స్వగృహే పరివర్తినీమ్. 118-24

ఈ కఠోరవాక్యములను విని సీతాదేవి అత్యంత సంతాపము నొందినది. అంత జనసమూహములో తనభర్త తన్నుగూర్చి ఎన్ని పరుషోక్తు లాడినాడు!

సీతాదేవి లజ్జాభారమున క్రుంగిపోయినది. వెల్లువలై ప్రవహించుచున్న కన్నీరు తుడుచుకొనుచు

సీత : (గద్గదస్వరముతో) ఓ వీరుడా! ఎవ్వడో ఒక పామరుడు ఒక సామాన్య స్త్రీతో పలుకునట్లు పలుకుచుంటివేమి! నీ వాడిన కర్ణశూలములైన వాక్కులు నీవు అనదగినవి కావు. నేను వినదగినవీ కావు.

కిం మామసదృశం వాక్య మీదృశం శ్రోత్రదారుణమ్
రూక్షం శ్రావయసే వీర ప్రాకృతః ప్రాకృతామివ. 119-5

నాయందెట్టి దోషమునులేదు. నా సచ్చరిత్రముపై ఆనపెట్టి చెప్పుచున్నాను. ఎవ్వరో కొందరు దుష్టస్త్రీ లుందురేమో! దానినిబట్టి సమస్తస్త్రీజాతిని శంకించుట తగునా! నన్నుగురించిన సందేహమును విడనాడుము.

నేను వివశనై యుండగా రావణుడు నా శరీరమును స్పృశించినాడు. అది దైవము చేసిన తప్పు. ఆ తప్పు నాదికాదు.

యద్యహం గాత్రసంస్పర్శం గతాస్మి వివశా ప్రభో
కామకారో న మే తత్ర దైవం తత్రాపరాధ్యతి. 119-8

నా అధీనములో నున్న నా హృదయము ఎల్లప్పుడును నీయందే ఉన్నది. నా స్వాధీనములేని శరీరమువిషయము నే నేమి చేయగలను!

మనమిద్దరము ఒకటిగా పెరిగి ఎంతోకాలము కూడియుండినవార మైనను నీవు నా స్వభావమును తెలిసికొనజాలనిచో ఇం కేమున్నది! నేను పూర్తిగా హతమైనట్లే.

సహ సంవృద్ధభావాచ్చ సంసర్గేణ చ మానద
యద్యహం తే న విజ్ఞాతా హతా తేనాస్మి శాశ్వతమ్. 119-10

నీవు నన్ను విసర్జించినసంగతి హనుమంతునితో చెప్పి పంపియుందువేని నేను ఆనాడే, అతని కట్టెదుటనే ప్రాణమును త్యజించియుందునుగదా! నీకును, నీ మిత్రులకును, ఈ మితిలేని శ్రమ తప్పియుండును.

నీవు క్రోధపరవశుడవై ఒక అల్పునివలె మాటలాడితివి. నేను జనకుని కొమారితనని పేరుబడినను, నిజమునకు నేను భూతలమునుండి ఉద్భవించినదానను.

[నేను అయోనిజను. నీవలె ఒక తల్లికడుపున పుట్టిన సామాన్యురాలనుకాదు.]

నీవు నా జన్మమును, నా శీలమును, నాకు నీయందుగల అనురాగమును, భక్తిని, తలపోయక ఎట్టి దుర్భాష లాడితివి! నా చిన్నతనముననే నన్ను అగ్నిసాక్షిగా వివాహమాడినప్పుడు నీవు చెప్పిన మాటలు ఏమైనట్టు!

లక్ష్మణా! చితి పేర్చుము. నా దుఃఖమునకు అదియే మందు. ఈ మిథ్యాపవాదములను భరించి బ్రతికియుండుట నా కిష్టము కాదు. ఈ గొప్ప జనసమూహములో నా భర్త నన్ను అన్యాయముగా నిందించి, నామీద అప్రీతి నెరపి నన్ను పరిత్యజించినాడు. అగ్ని ప్రవేశము చేయుటకంటె నాకు వేరుగతి లేదు.

చితాం మే కురు సౌమిత్రే వ్యసనస్యాస్య భేషజమ్
మిథ్యోపఘాతోపహతా నాహం జీవితు ముత్సహే. 119-18

అప్రీతస్య గుణైర్భర్తుస్త్యక్తాయా జనసంసది
యా క్షమా మే గతిర్గంతుం ప్రవేక్ష్యే హవ్యవాహనమ్. 119-19

[సీతాదేవిని అగ్నిప్రవేశము సేయుమని శ్రీరాముడు తన నోటిమాటతో చెప్పలేదు. తన మనస్సునం దున్న అభిప్రాయమును సీతాదేవి గ్రహించునట్లు పరుషముగా పలికి సీతాదేవి చేతనే అగ్నిప్రవేశము మాట అనిపించినాడు. రాముని పద్ధతియే అంత! సీతాదేవిమాత్రమే శ్రీరాముని అంతర్భావములను అర్థము చేసికొనజాలిన సమర్థురాలు.

అగ్నిప్రవేశమునుగురించి మరియొక మాట. ఆనాడు పంచవటియందు సీతాదేవి లక్ష్మణుని అక్రమముగా నిందించినప్పుడు లక్ష్మణుడు కోపించి "నీవు దహింపబడుదువుగాక!" అన్నాడు.

న్యాయవాదీ యథా న్యాయముక్తోఽహం పరుషం త్వయా
ధిక్త్వామద్యప్రణశ్యత్వం యన్మామేవం విశంకసే. అరణ్య: 45-32

లక్ష్మణుని వాక్కు ఫలించియుండునా! చితిని లక్ష్మణుడు పేర్చుటకూడ గుర్తింప దగియున్నది.]

సీతాదేవి మాటలను విని, ఇంగితజ్ఞుడైన లక్ష్మణుడు శ్రీరాముని ముఖము చూచి, సీతాదేవి అగ్నిప్రవేశము చేయుట రామునికి సమ్మతమే యని గ్రహించి, సీతాదేవి కోరికమేరకు చితిని పేర్చినాడు.

## సీతాదేవి అగ్నిప్రవేశము

సీతాదేవి అధోముఖియై శ్రీరామునికి నెమ్మదిగా ప్రదక్షిణము చేసి అగ్నిహోత్రమును సమీపించి దేవతలకును, బ్రాహ్మణులకును నమస్కరించి అగ్నిసన్నిధిలో

సీత: నా మనస్సు ఎప్పుడేగాని శ్రీరామునిమీదినుండి చలింపకుండినచో లోకసాక్షియైన యీ అగ్నిహోత్రుడు నన్ను రక్షించుగాక.

నా చారిత్రము పరిశుద్ధముగా నుండి నా భర్త ఆరోపించిన దోషము అసత్యమగునేని లోకసాక్షియైన యీ అగ్నిహోత్రుడు నన్ను రక్షించుగాక.

నేను కర్మముచేగాని, మనస్సుచేగాని, వాక్కుచేగాని, సర్వధర్మజ్ఞుడైన శ్రీరాముని అతిక్రమింపనిదాననే యగుదునేని యీ అగ్నిహోత్రుడు నన్ను రక్షించుగాక.

సూర్యుడు, చంద్రుడు, వాయువు, దిక్కులు, పగళ్లు, రాత్రులు, సంధ్యాకాలములు, భూమి, సమస్త భూతములు, ఇవన్నియు నా చారిత్రము పవిత్రమైన దని అంగీకరించు పక్షమున ఈ అగ్నిహోత్రుడు నన్ను రక్షించుగాక.

యథా మే హృదయం నిత్యం నాపసర్పతి రాఘవాత్
తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః 119-24

యథా మాం శుద్ధచారిత్రాం దుష్టాం జానాతి రాఘవః
తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః. 119-25

కర్మణా మనసా వాచా యథా నాతిచరామ్యహమ్
రాఘవం సర్వధర్మజ్ఞం తథా మాం పాతు పావకః. 119-26

ఆదిత్యో భగవాన్ వాయు ర్దిశ శ్చంద్ర స్తథైవ చ
అహశ్చాపి తథా సంధ్యే రాత్రిశ్చ పృథివీ తథా. 119-27

యథాన్యేపి విజానంతి తథా చారిత్రసంయుతామ్. 119-28

సీతాదేవి ఇట్లుపలికి అగ్నిహోత్రునికి ప్రదక్షిణము చేసి జ్వలించుచున్న అగ్నిలో ప్రవేశించినది. సమస్తలోకములు చూచుచుండగా సర్వాభరణాలంకృతయైన సీతాదేవి అగ్నిప్రవేశము చేసినది.

సా తప్తనవహేమాభా తప్తకాంచన భూషణా
పపాత జ్వలనం దీప్తం సర్వలోకస్య సన్నిధౌ. 119-30

సీతాదేవి అగ్నిప్రవేశముచేయుట ముల్లోకములవారును, దేవగంధర్వదానవులును చూచుచుండిరి. అక్కడి రాక్షససమూహములును, వానరసమూహములును, హాహాకారములు చేసినారు.

ఈ రోదనశబ్దమును విని, శ్రీరాముడు దుఃఖాక్రాంతు డయినాడు. కన్నుల నీరు నించినాడు.

తతో హి దుర్మనా రామ శ్శ్రుత్వైవ వదతాం గిరః
దధ్యౌ ముహూర్తం ధర్మాత్మా బాష్ప వ్యాకుల లోచనః. 120-1

ఇంతలో, కుబేరుడు, యముడు, ఇంద్రుడు, వరుణుడు, శివుడు, బ్రహ్మదేవుడు, వారివారి విమానములలో వచ్చినారు. శ్రీరాముడు వారికి నమస్కరించినాడు.

*దేవతలు* : రామా ! నీవు లోకకర్తవు. జ్ఞానవంతులలో శ్రేష్ఠుడవు. సీతాదేవి అగ్ని ప్రవేశము చేయుచుండ, నీవు ఉపేక్షించుచున్నావేమి ?

దేవతలలో నీవు ఉత్తముడవు; నీ తత్వమును నీవు తెలిసికొనకున్నావేమి ?

కర్తా సర్వస్య లోకస్య శ్రేష్ఠో జ్ఞానవతాం వరః
ఉపేక్షసే కథం సీతాం పతంతీం హవ్యవాహనే. 120-6

కథం దేవగణశ్రేష్ఠ మాత్మానం నావబుధ్యసే. 120-7

రామా ! నీవు అష్టవసువులలో ప్రజాపతియైన ఋతధామవు. ముల్లోకములకు నీవే ఆదికర్తవు. స్వయంప్రభుడవు. రుద్రులలో ఎనిమిదవ రుద్రుడైన మహాదేవుడవు. సాధ్యులలో అయిదవవాడవు. అశ్వినీదేవతలు నీచెవులు. సూర్యచంద్రులు నీ నేత్రములు. లోకముల సృష్టికి ముందును, లయమునకు వెనుకను నీ వొక్కడవే కనబడుచుందువు.

నీవు కేవల ప్రాకృతునివలె, సీతాదేవి అగ్నిప్రవేశము చేయుట చూచి ఉపేక్షించు చున్నావేమి ?

*రాముడు* : నేను సామాన్య మానవుడ నని, దశరథుని కుమారుడ నని, రాముడ నని, తలచుచున్నాను. నే నెవ్వడ నని మీరు చెప్పుట ? నే నెవ్వడనో, ఎందుకు పుట్టితినో, బ్రహ్మదేవుడు చెప్పునేని వినెదను.

ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్
యోహం యస్య యతశ్చాహం భగవాం స్తద్బ్రవీతు మే. 120-11

*బ్రహ్మ* : రామా ! నీవు చక్రాయుధుడైన నారాయణుడవు.

భవాన్ నారాయణో దేవ శ్రీమాన్ చక్రాయుధో విభుః 120-13

ఇట్లు ప్రారంభించి, బ్రహ్మదేవుడు శ్రీరాముని స్తోత్రము చేసినాడు.

*బ్రహ్మ* : రామా ! నీవు విష్ణుదేవుడవు. లక్ష్మీదేవియే సీతాదేవి. రావణసంహారమునకు నీవు మనుష్యరూపముతో అవతరించినావు.

సీతా లక్ష్మీర్భవా న్విష్ణు ర్దేవః కృష్ణః ప్రజాపతిః
వధార్థం రావణస్యేహ ప్రవిష్టో మానుషీం తనుమ్. 120-28

[బ్రహ్మ చేసిన స్తోత్రము పారాయణము చేయదగినది. అది అనుబంధముగా చేర్చబడి యున్నది]

ఆర్షమైన ఈ స్తోత్రమును అనుదినమును ఎవ్వరు కీర్తింతురో వారికి పరాభవ మనునది కలుగదు.

ఇమమార్షం స్తవం నిత్య మితిహాసం పురాతనమ్
యే నరాః కీర్తయిష్యంతి నాస్తి తేషాం పరాభవః. 120-32

బ్రహ్మదేవుడు చెప్పిన మాటలను విని అగ్నిహోత్రుడు అగ్నినుండి సీతాదేవి నెత్తుకొనివచ్చి శ్రీరామునికి సమర్పించినాడు. సీతాదేవి బాలసూర్యప్రభతో వెలుగు చున్నది. ఎఱ్ఱని చీర ధరించి,నీలకుంచిత కేశపాశముతో, కొంచెమైన కందని పుష్ప మాలికలతో, ఆభరణములతో, యథారూపముతో ప్రకాశించుచు, యౌవనలావణ్యముతో, ప్రసన్న మనస్సుతో ఉన్న సీతాదేవిని అగ్నిహోత్రుడు శ్రీరామునికి సమర్పించినాడు.

తరుణాదిత్య సంకాశాం తప్తకాంచన భూషణామ్
రక్తాంబరధరాం బాలాం నీలకుంచిత మూర్ధజామ్. 121-3

అక్లిష్టమాల్యాభరణాం తథారూపాం మనస్వినీమ్
దదౌ రామాయ వైదేహీ మంకే కృత్వా విభావసుః. 121-4

[శ్రీరాముడు సీతాదేవికి అలంకారము చేయించి తీసికొని రమ్మనుట ఈ అగ్ని పరీక్షకే కాబోలు!]

అగ్నిదేవుడు సీతాదేవిని శ్రీరామునికి సమర్పించి

**అగ్నిదేవుడు**: రామా! ఇదిగో సీతాదేవి. ఈమెయందు దోష మేమాత్రము లేదు. వాక్కుచేగాని, మనస్సుచేగాని, సంకల్పముచేగాని, కంటిచేగాని, సీతాదేవి ని న్నెంతమాత్రము అతిక్రమింపలేదు.

నైవ వాచా న మనసా నానుధ్యానాన్న చక్షుషా
సువృత్తా వృత్తశౌండీర న త్వామతిచచారహ. 121-6

రామా! పాపరహితయైన నీ భార్యను ప్రతిగ్రహింపుము. నాకు ప్రతివచనము చెప్పకుము. ఇది నా ఆజ్ఞ.

విశుద్ధభావాం నిష్పాపాం ప్రతిగృహ్ణీష్వ రాఘవ
న కించిదభిధాతవ్య మహ మాజ్ఞాపయామి తే. 121-10

అగ్నిదేవుని పలుకులు విన్న శ్రీరామునికి సంతోషము కలిగినది. తాను కావించిన పనిని తలచుకొని కన్నీరు విడిచినాడు.

**రాముడు**: (అగ్నిదేవునితో) సీత యేమాత్రము పాప మెరుగదన్నమాట సత్యమే. కాని రావణుని అంతఃపురములో చిరకాల ముండినది గనుక, నేను సీతను పరిశోధింపకయే గ్రహించి యుందునేని లోకు లందరు "రాముడు మూఢుడు; కాముకుడు" అని నన్ను నిందింపగలరు.

అవశ్యం త్రిషు లోకేషు న సీతా పాపమర్హతి
దీర్ఘకాలోషితా హీయం రావణాంతఃపురే శుభా. 121-13

బాలిశః ఖలు కామాత్మా రామో దశరథాత్మజః
ఇతి వక్ష్యంతి మాం సంతో జానకీ మవిశోధ్య హి. 121-14

సీతయందు ఎట్టి దోషమూ లేదనియు, సీత మహాపతివ్రత యనియు నాకు తెలియకపోలేదు. ముల్లోకముల యెదుట సత్యమును చక్కగా బయల్పరచుట యుక్తమని నేను ఉద్దేశించి, సీత అగ్నిప్రవేశము చేయుచుండినప్పుడు ఉపేక్షతో నుంటినే కాని మరియేమియూ కాదు.

అనన్యహృదయాం భక్తాం మచ్చిత్త పరివర్తినీమ్
అహమప్యవగచ్ఛామి మైథిలీం జనకాత్మజామ్. 121-15

ప్రత్యయార్థం తు లోకానాం త్రయాణాం సత్యసంశ్రయః
ఉపేక్షే చాపి వైదేహీం ప్రవిశంతీం హుతాశనమ్. 121-16

సీత తనప్రభావముచేతనే తన్ను రక్షించుకొనగలదు. సముద్రము చెలియలికట్టను దాటి రాజాలనట్లు సీతను మనసాకూడ రావణుడు అతిక్రమింపజాలడు.

ఇమామపి విశాలాక్షీం రక్షితాం స్వేన తేజసా
రావణో నాతివర్తేత వేలామివ మహోదధిః 121-17

సూర్యునిప్రభ సూర్యభగవానుని విడిచి భిన్నము కాజాలనట్లు సీత నానుండి భిన్నము కాజాలదు. నేనుమాత్రము సీతను బాసి ఉండగలనా !

అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా. 121-19

విశుద్ధా త్రిషు లోకేషు మైథిలీ జనకాత్మజా
న హి హాతుమియం శక్యా కీర్తిరాత్మవతా యథా. 121-20

దేవతలారా ! మీ రందరును చెప్పినమాటను పాటింపకుందునా ! నేను సీతను తప్పక పరిగ్రహించెదను.

సీతాదేవిని శ్రీరాముడు పరిగ్రహించినాడు. సీతారాములు మరల కలిసికొని సుఖముగా నున్నారు.

ఇతీదముక్త్వా విదితం మహాబలైః
ప్రశస్యమాన స్స్వకృతేన కర్మణా
సమేత్య రామః ప్రియయా మహాబల
స్సుఖం సుఖార్హోఽనుబభూవ రాఘవః. 121-22

## మహేశ్వరుడు

*మహేశ్వరుడు* : రామా ! అందరి భాగ్యవశమున, నీవు రావణుని వధించి సమస్తలోకములను పీడించుచుండిన రావణభయమును పోగొట్టినావు. నీవు అయోధ్య కరిగి భరతుని, కౌసల్యను, కైకేయిని, సుమిత్రను ఆశ్వాసింపుము. నీ మిత్రులను సంతోషపెట్టుము. నీవు పట్టాభిషేకము చేసికొని ఇక్ష్వాకువంశమును నిల్వబెట్టుము. అశ్వమేధయాగము చేసి విపులకీర్తిని ఆర్జించి మరల వైకుంఠమునకు చేరుము. రామా! మీ తండ్రి దశరథుడు ఈ విమానములో వచ్చియున్నాడు చూడుము. అసత్యదోషమునుండి నీవలన తప్పింపబడి ఇంద్రలోకము నొందినాడు. లక్ష్మణుడును, నీవును మీ తండ్రికి నమస్కరింపుడు.

## దశరథుడు - రాముడు

విమానస్థుడైన తమ తండ్రికి రామలక్ష్మణులు నమస్కరించినారు.

దశరథుడు తన ప్రాణాధికుడగు రాముని జూచి తనచెంతకు చేర్చుకొని అంకమున కూర్చుండబెట్టుకొని కవుగిలించుకొని, రామునితో అనుచున్నాడు.

*దశరథుడు* : రామా ! స్వర్గసుఖములుగాని, దేవతల మన్ననలుగాని, నిన్ను విడిచివచ్చిన నాకు ప్రియములు గాకున్నవి. నీవు వనవాసవ్రతమును పూర్తి కావించి నీ ప్రతిజ్ఞను పాలించితివి. నీ శత్రువును వధించి నీవు సుఖముగా నుండుటను చూచిన నేను అత్యంతానందము పొందితిని.

నిన్ను అడవికి పంపిన ఆనాడు కైకేయి పలికిన మాటలు మాత్రము మరపురాక నన్ను బాధించుచునే యున్నవి. ఇప్పుడు నిన్ను కవుగిలించుకొని నా దుఃఖమును తీర్చుకొన్నాను. అష్టావక్రుడు తన తండ్రిని తరింపజేసినట్టు నీవు నన్ను తరింపజేసితివి. రావణవధమును కోరి దేవతలు నీ పట్టాభిషేకమునకు విఘ్నము కలిగించినసంగతి ఇప్పుడిప్పుడే తెలియవచ్చినది. నీవు అయోధ్య కరిగి పట్టాభిషేకము చేసికొని భూనాథుడవుగా నున్నప్పుడు నిన్ను చూడగలిగినవారు ఎంతో కృతార్థులు.

సిద్ధార్థాః ఖలు తే రామ నరా యే త్వాం పురీం గతమ్
జలార్ద్రమభిషిక్తం చ ద్రక్ష్యంతి వసుధాధిపమ్ 122-20

నీయందు పరమభక్తి కలిగియున్న భరతుని కలిసికొనుము. భరతుడు ధర్మచారి.

రామా ! నీవు రావణుని వధించి దేవతలను సంతోషపరచి గొప్ప కార్యమును సాధించితివి. నీ వయోధ్య చేరి పట్టాభిషిక్తుడవై రాజ్యస్థుడవై, దీర్ఘాయుష్మంతుడవై తమ్ములగూడి సుఖముగా వర్ధిల్లుము.

**రాముడు**: (అంజలిచేసి) తండ్రీ! కైకేయీ భరతులను అనుగ్రహింపుము. "నిన్నును, నీ కొడుకును విసర్జించుచున్నాను" అని నీవు చెప్పిన మాటను ఉపసంహరింపుము. నీ శాపము వారికి తగులకుండునట్లు అనుగ్రహింపుము.

దశరథుడు రాముని ప్రార్థనను అంగీకరించినాడు.

## దశరథుడు - లక్ష్మణుడు

*దశరథుడు*: (లక్ష్మణుని కవుగిలించుకొని) లక్ష్మణా! నీవు సీతారాములకు శుశ్రూషచేసి నాకెంతో సంతోషము కలిగించితివి. నీవును ధర్మఫలమును పొందితివి. రాముడు ప్రసన్నుడైనచో ధర్మము, కీర్తి, స్వర్గము, మహిమ, అన్నియు కలుగుటకు సందియములేదు.

ధర్మం ప్రాప్స్యసి ధర్మజ్ఞ యశశ్చ విపులం భువి
రామే ప్రసన్నే స్వర్గం చ మహిమానం తథైవ చ. 122-29

రాముడు సమస్తలోకములకును మేలు చేకూర్చువాడు. రామునికి శుశ్రూష చేయుచుండుము. దానిచే నీకు మంగళము కలుగును. ఇంద్రాదులైన దేవతలును, మహర్షులును పురుషోత్తముడైన రాముని ఎట్లు పూజించుచున్నారో చూడుము. లక్ష్మణా! వేదములయొక్క హృదయమే రాముడు. రహస్యమైన బ్రహ్మమే రాముడు.

ఏతత్తదుక్తమవ్యక్తమక్షరం బ్రహ్మ నిర్మితమ్
వేదానాం హృదయం సౌమ్య గుహ్యం రామః పరంతపః. 122-32

లక్ష్మణా! నీవు సీతారాములకు భక్తితో శుశ్రూష కావించి శాశ్వతకీర్తిని ఆర్జించితివి.

లక్ష్మణుడు తండ్రికి నమస్కరించినాడు.

## దశరథుడు - సీతాదేవి

*దశరథుడు*: సీతా! రాముడు నిన్ను నిందించినందులకును, నిన్ను విడిచిపెట్టితినని పలికినందులకును, రామునిమీద కోపింపకుము. నీ పారిశుధ్యమును వ్యక్తపరచుటకై నీ మేలు కోరి చేసినపనియేగాని అన్యముకాదు.

కర్తవ్యో న తు వైదేహి మన్యుస్త్యాగమిమం ప్రతి
రామేణ త్వద్విశుద్ధ్యర్థం కృతమేతద్ధితైషిణా. 122-35

పతిశుశ్రూషను గురించి నీకొకరు చెప్పవలసిన పనిలేదు. అయినను చెప్పవలసినవాడనుగనుక చెప్పుచున్నాను. సీతా! ఈ రాముడే నీకు పరదైవము.

ఈ విధముగా కొడుకులకును, కోడలికిని, చెప్పవలసిన మాటలు చెప్పి దశరథుడు విమానమున ఇంద్రలోకమున కరిగినాడు.

## ఇంద్రుడు

*ఇంద్రుడు* : రామా ! మా దర్శనము నీకు ప్రీతిగలిగించినట్లే నీ దర్శనము మాకు పరమ ప్రీతి కలిగించినది. నీ వేదైన వరము కోరుకొనుము. సంతోషముతో ఇచ్చెదను.

**రాముడు** : దేవాధీశ్వరా ! నా కోరిక వినుము. నా నిమిత్తము పరాక్రమించి ప్రాణము లర్పించినవారి నందరిని బ్రతికింపుము. నా పనికై భార్యాపుత్రులను వదలివచ్చి తమ ప్రాణములునై తము సరకుసేయక యుద్ధము చేసి మరణించిన వారందరును పునర్జీవితులై తమ భార్యాపుత్రులను కలిసికొనునట్లు అనుగ్రహింపుము.

మమ హేతోః పరాక్రాంతా యే గతా యమసాదనమ్
తే సర్వే జీవితం ప్రాప్య సముత్తిష్ఠంతు వానరాః. 123-5

మత్కృతే విప్రయుక్తా యే పుత్రైర్దారైశ్చ వానరాః
మత్ప్రియేష్వభియుక్తాశ్చ న మృత్యుం గణయంతి చ 123-6

త్వత్ప్రసాదా త్సమేయుస్తే వరమేత దహం వృణే. 123-7

అందరును పునర్జీవితులై లేచి ఎట్టి గాయములుగాని, బాధగాని లేక యథా ప్రకారము బలపరాక్రమ సంపన్నులుగా నుండునట్లు వరము ప్రసాదింపుము. వానరు లుండుచోట అకాలమునకూడ ఫలమూలములు ఉండునట్లు అనుగ్రహింపుము.

*ఇంద్రుడు* : రామా ! నీవు కోరిన వరములు సామాన్యములుకావు. అయినను నేను మాట యిచ్చితిని గనుక నీవు కోరిన వరముల నిచ్చుచున్నాను. నీ కోరికలు ఫలించునుగాక !

మృతులైన వానరు లందరు బ్రదికి, నిద్రనుండి లేచునట్లు లేచినారు. గాయములుగాని బాధగాని లేక అందరును సుఖముగా నున్నారు. అందరికిని సంతోషము, ఆశ్చర్యము, కలిగినది. బంధుమిత్రు లందరును కలిసికొన్నారు. అందరు శ్రీరామునికి నమస్కరించినారు.

బభూవు ర్వానరా స్సర్వే కిమేతదితి విస్మితాః
తే సర్వే వానరా స్తస్మై రాఘవాయాభ్యవాదయన్. 123-16

*దేవతలు* : (శ్రీరాముని స్తోత్రముచేసి) రామా ! నీవు అయోధ్యకు పయనముగమ్ము. వానరులకు సెలవిమ్ము. సీతాదేవి నాశ్వాసింపుము. నీ తల్లులను, శత్రుఘ్నుని,

నీ వియోగ శోకమున తపించుచు తాపసవ్రతమునం దున్న భరతుని ఆశ్వాసింపుము. నీవు పట్టాభిషిక్తుడవై ప్రజలను సంతోషపెట్టుము.

**అభిషేచయ చాత్మానం పౌరాన్ గత్వా ప్రహర్షయ.** 123-20

ఈ మాటలు చెప్పి దేవత లందరు రామలక్ష్మణుల సెలవు తీసికొని వారి నమస్కారముల నందుకొని, వారివారి నెలవుల కరిగినారు. సీతారామలక్ష్మణులును, వానర సేనలును సుఖముగా నున్నారు.

[ఈ పట్టున ఒక విషయము గమనింపదగియున్నది.

శ్రీరాముడు కోరుకొన్న వరము సంగతి. తనకై బాధపడువారి బాధలు తీర్చుటయే రామునికి కావలసినది. తనకుగా మరేమియు అక్కరలేదు. రామకార్యార్థులై భార్యాపుత్రులను విడిచిపెట్టినను, తుదకు ప్రాణములు విడిచినను, దానివలన వచ్చు బాధ ఏమియు లేదు. అన్నిసుఖములు మరల సమకూడును. శ్రీరాముని నమ్మినవాడు ఎన్నటికిని చెడడు. ముందు ముందు కష్ట మనిపించినను పర్యవసానములో సుఖమే కలుగును. తన్ను నమ్మియున్న వారిని రక్షించుట శ్రీరాముని వ్రతము.

సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ. 18-33

అని శ్రీరాముడే చెప్పిన మాటకు ఈ ఘట్టములో నిదర్శనము కనబడుచున్నది]

## విభీషణుడు వానరవీరులను సత్కరించుట

మరునాడు ప్రొద్దున విభీషణుడు శ్రీరాముని చెంత కరిగి

*విభీషణుడు :* రామప్రభూ! నీకు యథాశాస్త్రముగా స్నానము చేయించి అలంకారము చేయుటకై ఈ కన్యలు వచ్చియున్నారు. వస్త్రములు, ఆభరణములు, గంధమాల్యములు అన్నియు సిద్ధముగా నున్నవి. వీనిని నీవు అంగీకరించి నన్ననుగ్రహింపుము.

అలంకారవిద శ్చేమా నార్యః పద్మనిభేక్షణాః
ఉపస్థితా స్త్వాం విధివ త్స్నాపయిష్యంతి రాఘవ. 124-3

*రాముడు :* విభీషణా! సుగ్రీవాది వానరవీరులకు స్నానములు చేయింపుము. సుకుమారుడును, సత్యప్రతిజ్ఞుడును, ధర్మాత్ముడును అయిన భరతుడు నా నిమిత్తమై ఎంతో తపించుచున్నాడు. భరతుని విడిచి స్నానముగాని అలంకారముగాని చేసికొనుటకు నా మనస్సు ఒప్పలేదు. నీవేమియు అనుకొనకుము.

**స తు తామ్యతి ధర్మాత్మా మమ హేతో స్సుఖోచితః**
**సుకుమారో మహాబాహుః కుమార స్సత్యసంశ్రవః.** 124-5

తం వినా కైకయీపుత్త్రం భరతం ధర్మచారిణమ్
న మే స్నానం బహుమతం వస్త్రాణ్యాభరణాని చ 124-6

దుర్గమమైన మార్గమును పట్టుకొని మే మెట్లయినను అయోధ్యకు చేరవలయును.

**విభీషణుడు**: రామప్రభూ! ఒక్క దినములో మిమ్ములను అయోధ్యకు చేర్పగలను. పుష్పకవిమాన మున్నది. మీ ప్రయాణమునకు ఎట్టి ఇబ్బందియును లేదు. నీవు నన్ననుగ్రహించి ఒక్కదిన మిందు నిలిచి నా పూజ లందుకొని నన్ను కృతార్థుని చేయుము. నీకును, సీతాదేవికిని, లక్ష్మణునికిని ఉచితమర్యాదలు చేసి పంప వలయు నని ఆశపడుచున్నాను. అన్ని ప్రయత్నములను పూర్తి కావించి సిద్ధముగా నున్నాను. నీవు నీ మిత్రులతోను, నీ సైన్యముతోను, ఇక్కడ ఒక్కపూట నిలిచి, నా సపర్యలను అంగీకరించి వెళ్లుము. నీ భృత్యుడ నైన నేను నిన్ను వేడుకొనుచున్నాను.

ప్రణయా ద్బహుమానాచ్చ సౌహృదేన చ రాఘవ
ప్రసాదయామి ప్రేష్యోఽహం న ఖల్వాజ్ఞాపయామి తే 124-15

**రాముడు**: విభీషణా! యుద్ధములో నీవు నాకు చేసిన సహాయమువలననే నీ భక్తి విశదమయినది. అంతకన్న సత్కార మే మున్నది! నీ మాటలు చెల్లింపలే దని నీవు చిన్నబుచ్చుకొనకుము.

భరతుని చూచుటకై నా మనస్సు త్వరపడుచున్నది. పాపము! చిత్రకూటమునకు వచ్చి నన్ను అయోధ్యకు రమ్మని శిరసా నమస్కరించి ప్రార్థించినాడు. అతని మాటను కాదంటిని. దానికి భరతుడు ఎంతో బాధపడినాడు. వెంటనే వానిని కలిసికొనవలయును.

తం తు మే భ్రాతరం ద్రష్టుం భరతం త్వరతే మనః
మాం నివర్తయితుం యోఽసౌ చిత్రకూట ముపాగతః. 124-19
శిరసా యాచతో యస్య వచనం న కృతం మయా. 124-20

మా తల్లులను, గురువులను, స్నేహితులను, పురజనులను చూడ త్వరపడుచున్నాను. విభీషణా! నా ప్రయాణమునకు అనుమతింపుము. వనవాసవ్రతము పూర్తియైనపిమ్మట ఇక్కడ ఉండుట సరికాదు. భరతుడు నా కొరకు వేచియున్నాడు. కావున పుష్పకవిమానమును సిద్ధము చేయింపుము. దానితో నన్ను పూజించిన ట్లగును.

విభీషణుడు పుష్పకవిమానమును తెప్పించి శ్రీరాముని చెంతకు వచ్చి

**విభీషణుడు**: రామప్రభూ! విమానము సిద్ధముగా నున్నది. నా కేమి ఆజ్ఞ?

రాముడు: విభీషణా! ఈ మహత్కార్యమును సాధించినవారు వానరవీరులు. వారి కందరకు వస్త్రములు, రత్నములు, ఆభరణములును ఇచ్చి వారిని సమ్మానింపుము. ప్రాణత్యాగము చేయుటకు సిద్ధపడి యుద్ధముచేసినవారిని మనము గౌరవింప వలయును. దీనివలన నీకుకూడ మంచి పేరుప్రతిష్ఠలు రాగలవు.

విభీషణుడు వానరు లందరకును యథాయోగ్యముగా వస్త్రములును, రత్నాభరణములును ఇచ్చి సత్కరించినాడు.

## సీతారామలక్ష్మణులు అయోధ్యకు పయన మగుట

సీతారామలక్ష్మణులు పుష్పకవిమాన మెక్కినారు. సిగ్గుపడుచున్న సీతాదేవిని శ్రీరాముడు తన అంకస్థలమున కూర్చుండబెట్టుకొన్నాడు.

తత స్తాః పూజితాః దృష్ట్వా రత్నైరర్థైశ్చ యూథపాః
ఆరురోహ తతో రామ స్తద్విమాన మనుత్తమమ్. 125.11

అంకేనాదాయ వైదేహీం లజ్జమానాం యశస్వినీమ్
లక్ష్మణేన సహభ్రాత్రా విక్రాంతేన ధనుష్మతా. 125.12

శ్రీరాముడు సుగ్రీవుని, వానరసైన్యములను, విభీషణుని చూచి

రాముడు: మిత్రులారా! మీ రెల్లరు నాకెంతయో సహాయము చేసినారు. మీ మీ నెలవులకు పోయి సుఖముగా వర్ధిల్లుడు.

సుగ్రీవా! మిత్రుడు చేయదగిన దంతయు పూర్తిగా చేసితివి. నీవు నీ సైన్యములను వెంటబెట్టుకొని కిష్కింధ కరిగి సుఖముగా నుండుము.

విభీషణా! నేను నీకు ప్రసాదించిన లంకారాజ్యమును పాలించుచు నీ రాజ్యము నందే యుండుము. అట్లుండువేని నిన్ను ఇంద్రుడు సైతము ఎదిరింపలేడు.

[పరరాజ్యములను ఆక్రమించుకోవలదు అని సూచన]

స్వరాజ్యే వస లంకాయాం మయాదత్తే విభీషణ
న త్వాం ధర్షయితుం శక్తా స్సేంద్రాఅపి దివౌకసః. 125.16

మిత్రులారా! నా తండ్రిరాజధాని యైన అయోధ్యకు వెళ్ళుచున్నాను. మీ రందరును అనుమతింపుడు.

ఈ మాటలు విని సుగ్రీవాది వానరులును, విభీషణుడును శ్రీరామునితో అనుచున్నారు.

వానరులు : రామప్రభూ! మాకును అయోధ్యకు రావలయు నని ఉన్నది. వనములలోను, పట్టణములయందును అల్లరి చేయక మెలకువతో ప్రవర్తింపగలము. నీ అభిషేకమును దర్శించి నిన్ను కన్న కౌసల్యాదేవికి నమస్కరించి మా నెలవులకు మరలి పోగలము. మమ్ములనుకూడ నీ వెంట గొనిపొమ్ము.

అయోధ్యాం గంతుమిచ్ఛామ స్సర్వా న్నయతు నో భవాన్
ఉద్యుక్తా విచరిష్యామో వనాని నగరాణి చ 125-19

దృష్ట్వా త్వా మభిషేకార్ద్రం కౌసల్యా మభివాద్య చ
అచిరేణాగమిష్యామ స్స్వాన్గృహా న్నృపతేస్సుత. 125-20

రాముడు : మీ అందరనుకూడి అయోధ్యకు వెళ్లుట నాకును ఇష్టమే. సుగ్రీవా ! వానరులందరితోను విమానము నధిరోహింపుము. విభీషణా ! నీవును నీ మంత్రులతో రమ్ము. అయోధ్యకు పోవుదము.

అందరు పుష్పకవిమానములో కూర్చుండినారు.

శ్రీరాముని అనుజ్ఞ నైకొని విమానము ఆకాశమార్గమున బయలుదేరినది.

తేష్వారూఢేషు సర్వేషు కౌబేరం పరమాసనమ్
రాఘవేణాభ్యనుజ్ఞాత ముత్పపాత విహాయసమ్. 125-25

శ్రీరాముడు సీతాదేవిని ఒడిలో కూర్చుండబెట్టుకొని బుజ్జగించుచున్నాడు. "నేను చేసిన కార్యము లన్నియు నీ నిమిత్తమే సుమా !" అని మరల మరల చెప్పుచున్నాడు. విమానములో ప్రయాణము చేయుచు ఆ యా ప్రదేశములను సీతాదేవికి చూపించుచున్నాడు.

రాముడు : సీతా ! చూచితివా ఈ లంకాపట్టణమును ! త్రికూట పర్వతశిఖరముమీద విశ్వకర్మ దీనిని ఎంత చక్కగా నిర్మించియున్నాడు !

ఇదిగో ! ఇదియే యుద్ధ భూమి. రాక్షసులును వానరులును లెక్కలేక చచ్చి పడిపోయిన చోటు.

అదిగో చూడుము. అచ్చటనే నేను రావణుని సంహరించినాను. నేను రావణుని వధించుట నీ నిమిత్తమే సుమా !

అత్ర దత్తవర శ్శేతే ప్రమాథీ రాక్షసేశ్వరః
తవ హేతో ర్విశాలాక్షి రావణో నిహతో మయా. 126-5

కుంభకర్ణుడు వధింపబడిన చోటు అదిగో ! ప్రహస్తుడు ఇదిగో ఈ చోటనే పడిపోయినాడు. హనుమంతుడు ధూమ్రాక్షుని వధించిన చోటు అం దున్నది చూడుము!

అదిగో అటు చూడుము. అచ్చటనే మన లక్ష్మణుడు ఇంద్రజిత్తును వధించినాడు. ఇదిగో ఇచ్చోటనే మండోదరి మున్నగు రావణుని భార్యలు వేయిమంది రావణుని గూర్చి విలపించినారు.

ఇటు చూడుము. సముద్రతీరము కనబడుచున్నది. సముద్రమును దాటి వచ్చి ఆ రాత్రి మే మందరము సేనలతో విడిసిన ప్రదేశము. ఇదిగో సేతువు. సముద్రమునకు సేతువు కట్టించినాను. నలుడు దానిని ఎంత చక్కగా నిర్మించెనో చూడుము. సేతు నిర్మాణము సామాన్యమైన పనిగాదు. ఇది యంతయు నీకోసమే చేసితినిసుమా!

ఏష సేతు ర్మయా బద్ధ స్సాగరే సలిలార్ణవే
తవ హేతో ర్విశాలాక్షి నల సేతు స్సుదుష్కరః. 126.11

సీతా! ఈ మహార్ణవ మెట్లు గర్జించుచున్నదో చూడుము. అదిగో! సముద్రము నుండి వెల్వడిన మైనాకపర్వతము. హనుమంతుడు నిన్ను చూడవచ్చినప్పుడు అతను విశ్రమించుటకై సముద్రగర్భమునుండి బయటికి వచ్చినది.

ఇదిగో ఇటుచూడుము. దీనిని సేతుబంధతీర్థ మందురు. పూర్వము మహాదేవుడు అనుగ్రహించిన తీర్థము.

అత్ర పూర్వం మహాదేవః ప్రసాద మకరో త్ప్రభుః. 126.16

**ఇదిగో! విభీషణుడు నన్ను శరణుజొచ్చిన చోటు. అల్లదిగో కిష్కింధ! సుగ్రీవుని రాజధాని. నేను వాలిని వధించినచోటు ఇందే యున్నది. చూడుము.**

**సీత:** ప్రభూ! విమానమును కొంచెము సేపు ఆపిన బాగుండును. సుగ్రీవుని ప్రియభార్యలైన తార మున్నగువారిని, వానరవీరుల స్త్రీజనములను వెంటబెట్టుకొని అయోధ్యకు వెళ్ళవలయు నని ఆశపడుచున్నాను.

శ్రీరాముడు విమానమును నిలిపి సుగ్రీవునితో అనుచున్నాడు.

**రాముడు:** సుగ్రీవా! వానరులందరును తమ తమ స్త్రీజనములను వెంటబెట్టుకొని అయోధ్యకు రావలె నని సీత కోరుచున్నది. మీ రందరు నగరములోనికి పోయి మీ స్త్రీజనములను వెంటబెట్టుకొని వేగిరముగా రావలయును.

[సీతాదేవి ఎంతచక్కని ఆలోచన చేసినది! ఇంతకాలము ఇండ్లు వాకిండ్లు విడిచి వచ్చి యుండిన వానరులకు వారి భార్యా పుత్రులను చూచుకొను అవకాశమును కల్పించినది. పుష్పక విమానములో ప్రయాణము చేయు అదృష్టమును వానర స్త్రీలకు కలిగించినది. తమ ప్రియురాండ్రకు ఇంత చక్కని మర్యాద జరుగుట వానరులకు ఎంత సంతోషము కలిగించును!

మరియొక మాట. శ్రీరామునివెంట అంతమంది మిత్రు లున్నారు గదా! సీతాదేవికి మాత్రము చెలికత్తె లక్కరలేదా!]

సుగ్రీవాది వానరులు విమానము దిగి కిష్కింధ ప్రవేశించినారు.

*సుగ్రీవుడు* : తారా! వానరస్త్రీ లందరిని వెంటబెట్టుకొని నీవు మాతోకూడ అయోధ్యకు రావలయును. ఇది సీతాదేవి కోరిక ఆమె ముచ్చట తీర్చుటకై శ్రీరాముడు సమ్మతించినాడు. శ్రీరామ పట్టాభిషేకోత్సవమునకు అయోధ్యకు పోగలుగు మహాభాగ్యము మన కందరకును కలుగుచున్నది. ఆలస్యము చేయక అందరును శీఘ్రముగా రావలయును.

> ప్రియే త్వం సహనారీభి ర్వానరాణాం మహాత్మనామ్
> రాఘవేణాభ్యనుజ్ఞాతా మైథిలీ ప్రియకామ్యయా. 126-26

వానరస్త్రీలకు మహాభాగురాలైన సీతాదేవిని సందర్శింపవలెనని కోరిక కలిగినది.

[ఆమె ప్రసాద మేకదా ఈ ప్రయాణము!]

అందరు సింగారించుకొని వచ్చి విమాన మెక్కినారు. విమానము ఋశ్యమూక పర్వతమును సమీపించినది.

*రాముడు* : సీతా! ఇదిగో ఋశ్యమూకపర్వతము. నాకును సుగ్రీవునికిని మైత్రి కుదిరినది ఈ పర్వతముమీదనే. ఇదిగో పంపాసరస్సు. దీనిచెంతనే, నిన్ను తలచుకొని తలచుకొని పరిపరివిధములుగా విలపించినాను సుమా!

> ఏషా సా దృశ్యతే పంపా నలినీ చిత్రకాననా
> త్వయావిహీనో యత్రాహం విలలాప సుదుఃఖితః. 126-35

ఈ పంపాసరోవరతీరమున, ధర్మచారిణియైన శబరిని చూచినాను.

అదిగో! అదియే నేను కబంధుని వధించిన చోటు.

ఇదిగో! మహాత్ముడైన జటాయువు నీకోసము రావణునితో యుద్ధము చేసినచోటు.

ఖరదూషణాదులను సంహరించిన ప్రదేశ మదిగో!

సీతా! ఇదిగో మన పర్ణశాల. ఇక్కడనుండియేగదా రావణాసురుడు నిన్ను అపహరించినాడు!

గోదావరీనదిని చూడుము.

అదిగో అగస్త్యాశ్రమము. ఇదిగో సుతీక్ష్ణమహర్షి ఆశ్రమము. సీతా! అల్లదిగో శరభంగుని ఆశ్రమము. మన మీ ఆశ్రమము సమీపించుచుండినప్పుడు ఇంద్రుడిచ్చటికి వచ్చియుండినాడు. జ్ఞాపక మున్నదా!

ఇదిగో దురాత్ముడైన విరాధుని వధించిన చోటు. అల్లదే అత్రిమహాముని ఆశ్రమము. అనసూయాదేవిని నీవు దర్శించిన స్థలము.

ఇదిగో చిత్రకూటపర్వతము. అయోధ్యకు రమ్మని నన్ను భరతుడు ప్రార్థించిన చోటు. దూరముగా యమునానది కనబడుచున్నది చూడుము. అదిగో భరద్వాజాశ్రమము. గంగానది, శృంగిబేరపురము, అన్నియు ఇక్కడినుండి కనబడుచున్నవి చూడుము. అదిగో సరయూనది. అల్లదిగో మన అయోధ్య. సుఖముగా వచ్చి అయోధ్యను మరల చూడగలిగినాము. సీతా! అయోధ్యకు నమస్కరింపుము.

ఈ మాట విన్నంతనే వానరులు, విభీషణుడు, అందరును లేచి నిలువబడి అయోధ్యను చూచినారు.

## సీతారామలక్ష్మణులు భరద్వాజాశ్రమము చేరుట

వనవాసము పదునాలుగు సంవత్సరముల కాలము పూర్తి అయినది. పంచమినాడు శ్రీరాముడు భరద్వాజాశ్రమమునకు చేరి ఆ మహర్షికి నమస్కరించినాడు.

పూర్ణే చతుర్దశే వర్షే పంచమ్యాం లక్ష్మణాగ్రజః
భరద్వాజాశ్రమం ప్రాప్య వవందే నియతో మునిమ్. 127-1

**రాముడు:** స్వామీ! అయోధ్య సుఖిక్షముగా నున్నదా! భరతుని పరిపాలనము బాగున్నదా! మా తల్లు లందరికిని క్షేమమేకదా!

**భరద్వాజుడు:** (చిరునవ్వుతో) రామా! పంకదిగ్ధుడును, జటిలుడును అగు భరతుడు నీ పాదుకలను పురస్కరించుకొని పరిపాలనము సాగించుచు నీ రాకకు ఎదురు చూచుచున్నాడు. గృహమునందు అందరకును క్షేమమే.

పంకదిగ్ధస్తు భరతో జటిల స్త్వాం ప్రతీక్షతే
పాదుకే తే పురస్కృత్య సర్వంచ కుశలం గృహే 127-4

ఆనాడు నీవు రాజ్యత్యాగముచేసి, జటావల్కలములు ధరించి సీతా లక్ష్మణ సమేతుడవై అరణ్యవాసము చేయ బయలువెడలినప్పుడు నిన్నుచూచి దుఃఖితుడనైతిని. ఈనాడు నీవు కార్యసిద్ధి నొంది, శత్రువుల జయించి, బంధుమిత్రుల గూడివచ్చుటచూచి సంతోషించుచున్నాను. ఈ మధ్యకాలమున నీకు కలిగిన సుఖదుఃఖము లన్నియు నాకు

అవగతములే. జనస్థాన రాక్షససంహారము, సీతాపహరణము, సుగ్రీవమైత్రి, వాలివధము, హనుమంతుడు సముద్రమును లంఘించి సీతాదేవిని సందర్శించుట, సేతుబంధనము, రావణసంహారము, దేవతాసందర్శనము, వరప్రదానము సమస్తము నా తపస్సుచే తెలిసి కొన్నాను.

నీ వేదేని వరము కోరుకొనుము. ఇచ్చెదను. ఈ పూట మీ రందరును ఇందుండి నా యాతిథ్యము స్వీకరించి రేపు అయోధ్యకు పోవచ్చును.

**రాముడు :** మహర్షులమాట కాదందునా! నాకు ఒక్క వరముమాత్రము ప్రసాదింపుడు. ఇప్పుడు కాలము కాకున్నను, అయోధ్యకు పోవు మార్గమునం దుండు చెట్లయందు తీయని పండ్లును, రుచిగల తేనెయు ఉండునట్లు ప్రసాదింపుడు.

*భరద్వాజుడు :* రామచంద్రా ! నీవు కోరినట్లే అగుగాక !

మహర్షి ఈ మాట పలికిన వెంటనే, ముప్పది యోజనముల పర్యంత మున్న చెట్లన్నియు పుష్పఫలభరితము లైనవి. ఎండియుండిన చెట్లుసైతము మధువును స్రవించినవి. వానరుల ఆనందమునకు మేరలేదు.

## శ్రీరాముడు భరతుని యొద్దకు హనుమంతుని పంపుట

అయోధ్యను తలచుకొని కొంత సేపు ఆలోచించి శ్రీరాముడు హనుమంతునితో అనుచున్నాడు.

**రాముడు :** హనుమంతుడా ! నీ విప్పుడు అయోధ్యకు పోవలయును. దారిలో శృంగిబేర పురమున గుహుని కలిసికొని నా క్షేమసమాచారము చెప్పుము. నేను కుశలినై యుండుట విని గుహుడు సంతోషింపగలడు. అయోధ్యకు పోవుదారిని నీకు సూచింపగలడు. నీవు పోయి మా తల్లుల క్షేమసమాచారమును తెలిసికొనుము.

భరతుని కలిసికొని, నేను వనవాసవ్రతమును పూర్తి చేసి సీతతోను లక్ష్మణునితోను క్షేమముగా వచ్చితి నని చెప్పుము. నా చరిత్రము నంతయు భరతునికి సవిస్తరముగా తెలియజేయుము. రావణుడు సీతను అపహరించినసంగతి, సుగ్రీవునితో నేను చేసికొనిన స్నేహము, వాలి నిబర్హణము, సీతాన్వేషణము, నీవు సముద్రమును లంఘించి సీతను చూచుట, సేతుబంధనము, రావణసంహారము, దేవతాసందర్శనము, వరప్రదానము, మహాదేవుని ప్రసాదమువలన కలిగిన దశరథ సమాగమము, వానర సేనాసమేతుడనై కపిరాజైన సుగ్రీవుని గూడి, రాక్షసరాజైన విభీషణుని వెంటబెట్టుకొని, నేను వచ్చియున్న సమాచారము, అన్నింటిని సవివరముగా భరతునికి ఎరిగింపుము.

నీ మాటలు విన్న భరతుని ముఖములో ఏయే మార్పులు కలుగునో వానిని మెలకువతో గ్రహింపుము. నన్నుగూర్చి ఏమనుకొనుచున్నాడో, భరతుని మాటలు, చూపులు, ముఖవర్ణము, సర్వము పరిశీలించి అతని అభిప్రాయమును గురుతింపుము.

ఏతచ్ఛ్రుత్వా య మాకారం భజతే భరత స్తదా
స చ తే వేదితవ్యస్స్యా త్సర్వం యచ్చాపి మాం ప్రతి. 128-11

అనుభవించుచున్న రాజ్యమును వదలుకొనుట ఎట్టివానికైనను కష్టముగనే యుండును. భరతునికి రాజ్యకాంక్ష గలదేని, రాజ్యమును అతనికే వదలివేయుదము. నీవు భరతుని అభిప్రాయమును గ్రహించి త్వరగా వచ్చి చెప్పుము. భరతునికి రాజ్యముపై ఆసక్తి కలదేని మనము అంతదూరము పోనేల ? ఇక్కడనుండి ఇట్లే మరలిపోవుదము.

తస్య బుద్ధిం చ విజ్ఞాయ వ్యవసాయం చ వానర
యావ న్నదూరం యాతాస్స్మ క్షిప్ర మాగంతు మర్హసి. 128-16

## హనుమంతుడు - భరతుడు

హనుమంతుడు మనుష్యరూపము ధరించి ఆకాశమార్గమున ప్రయాణము చేసి శృంగిబేరపురములో దిగి గుహుని కలిసికొని

**హనుమంతుడు :** గుహుడా ! నీ సఖుడైన శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతుడై కుశలియై యున్నాడు. తన క్షేమసమాచారము నీకు తెలియజేయుమని చెప్పిపంపినాడు. నేడు పంచమికదా ! ఈ రాత్రి వారు భరద్వాజాశ్రమములో నిలిచి రేపు ప్రొద్దున బయలుదేరి రాగలరు.

ఈ వార్త గుహునితోచెప్పి హనుమంతుడు ఆకాశమార్గముననే ప్రయాణము సాగించి దారిలో పరశురామతీర్థమును, వాలుకీనదిని, గోమతీనదిని తిలకించుచు పోయి, సాలవనమును అనేక జనపదములను దాటి అయోధ్యకు క్రోసెడు దూరములో నున్న నందిగ్రామము చేరి భరతుని చూచినాడు.

భరతుడు జటాజినములుదాల్చి, తాపసవృత్తిలోనుండి, కృశించి, బ్రహ్మతేజస్సుతో వెలుగుచున్నాడు. రామపాదుకలను పురస్కరించుకొని రాజ్యపాలనము చేయుచున్నాడు.

మంత్రులు, పురోహితులు, సేనాధ్యక్షులు కాషాయవస్త్రములను ధరించి రాజ్య పాలనలో భరతునికి తోడ్పడుచుండినారు.

**భరతుడు నారచీరలు కట్టుకొనియుండ పౌరులు భోగము లనుభవింపగలరా !**

న హి తే రాజపుత్త్రం తం చీరకృష్ణాజినాంబరమ్
పరిశోక్తుం వ్యవస్యంతి పౌరా వై ధర్మవత్సలాః 128-33

ధర్మవిగ్రహుడైన భరతుని జూచి హనుమంతుడు అంజలి ఘటించి

**హనుమంతుడు :** ధర్మమూర్తీ ! జటావల్కలధారియై దండకారణ్యములో వసించుచుండిన ఎవ్వనిగురించి నీ విట్లు దుఃఖపడుచుంటివో ఆ శ్రీరాముడు తన క్షేమసమాచారమును చెప్పుమని నన్ను నీ యొద్దకు పంపినాడు. దారుణమైన నీ శోకమును వదలిపెట్టుము. ఈ క్షణములోనే నీవు శ్రీరాముని కలిసికొనగలవు. శ్రీరాముడు రావణుని వధించి సీతాదేవిని తెచ్చుకొని మహాబలు లగు మిత్రులను గూడి సీతాదేవితోను, లక్ష్మణునితోను వచ్చుచున్నాడు.

ఈ మధురవాక్కులు వినుటతోడనే భరతుడు ఆనందపరవశుడై సొమ్మసిల్లినాడు. కొంత సేపటికి తేరుకొని

**భరతుడు :** (హనుమంతుని కవుగిలించుకొని ఆనందబాష్పనేత్రుడై) నీవు దేవతవో మానవుడవో తెలియుటలేదు. నాకు ప్రియవార్తను చెప్పి అమందానందము కలుగజేసితివి. నీకు పారితోషికముగా లక్షగోవులను, నూరు గ్రామములను, సాలంకృతలు శుభాచారలు అగు పదునారుగురు కన్యలను ఇచ్చుచున్నాను. అనేక సంవత్సరములక్రిందట దండకారణ్యమున కరిగిన నా నాథుడైన శ్రీరామునిమాట ఎంతకాలమునకు విన్నాను ! మానవుడు జీవించియుండునేని నూరుసంవత్సరములకైనను ఆనందము పొందగల డన్న లోకోక్తి ఇప్పుడు సత్యమే అయినది.

కల్యాణీబత గాథేయం లౌకికీ ప్రతిభాతి మే
ఏతి జీవంత మానందో నరం వర్షశతాదపి. 129-2

శ్రీరామునికిని వానరులకును మైత్రి ఎట్లు కుదిరినది ?

**హనుమంతుడు :** శ్రీరాముడు చిత్రకూటములో నున్నంతవరకు జరిగినసంగతి నీకు తెలిసియే యున్నదిగదా ! శ్రీరాముడు నిన్ను అయోధ్యకు పంపినపిదప చిత్రకూటమును వదలి దండకారణ్యములో ప్రవేశించినాడు. అక్కడ రామలక్ష్మణులు విరాధు డను రాక్షసుని వధించినారు. అక్కడనుండి కదలి కొన్ని ఆశ్రమములలో కొంతకాల ముండి ఆ పిదప జనస్థానము చేరినారు. అచ్చటికి శూర్పణఖ అను రాక్షసి వచ్చినది. లక్ష్మణుడు దాని ముక్కుచెవులు ఖండించినాడు. ఆ కారణమున పదునాలుగువేలమంది రాక్షసులు రామునిపై దండెత్తినారు. శ్రీరాముడు

వారి నందరిని మూడుగడియలలో వధించినాడు. రావణాసురుని అనుచరుడైన మారీచుడు ఒక రత్నమయమైన జింకరూపమున వచ్చి సీతాదేవికి కనిపింపగా సీతాదేవి ఆ జింకను పట్టితెమ్మని శ్రీరాముని వేడినది. రాముడు దానిని తరుము కొనిపోయి తుదకు ఒకబాణము వేసి దానిని కూల్చినాడు. లక్ష్మణుడును ఆశ్రమమునుండి రాముని వెనుకనే వెళ్ళినాడు. రామలక్ష్మణులు ఆశ్రమములో లేని సమయమున రావణాసురుడు ఆశ్రమములో ప్రవేశించి సీతాదేవిని అపహరించినాడు. సీతాదేవిని రక్షించుటకు ప్రయత్నించిన జటాయువును రావణుడు యుద్ధములో వధించి సీతాదేవిని తీసికొని ఆకాశమార్గమున వెళ్ళినాడు.

ఈ సంఘటనమును ఒకపర్వతముమీదనున్న వానరవీరులు చూచినారు. రావణుడు సీతాదేవిని లంకకు కొనిపోయి ఆమెను వశపరచుకొనుటకై ఎన్నియో ప్రయత్నములు చేసినాడు. ఆమె రావణుని తృణీకరించి మాటలాడినది. ఆ రావణుడు సీతాదేవిని అశోకవనమున ఉంచినాడు.

జింకను వెన్నంటిపోయిన రాముడు ఆశ్రమమునకు మరలివచ్చి చూడగా సీతాదేవి కనిపింపలేదు. ఆమెను వెదకుచుండుటలో జటాయువు కానవచ్చినాడు. జటాయువు హతుడై పడియుండినాడు. అతడు మీ తండ్రికి స్నేహితుడు. శ్రీరాముడు జటాయువునకు అగ్నిసంస్కారము చేసినాడు. రామలక్ష్మణులు సీతాదేవికొరకు కొండలు, నదులు, వనములు వెదకుచు తిరుగుటలో వారికి కబంధుడను రాక్షసుడు కనిపించినాడు. ఆ కబంధుడు చెప్పినమాటనుబట్టి రామలక్ష్మణులు ఋశ్యమూకపర్వతముచేరి సుగ్రీవుని కలిసికొన్నారు. రాముడును సుగ్రీవుడును వారి కష్టసుఖములను ఒకరి కొకరు తెలుపుకొని మిత్రులైనారు. సుగ్రీవుని అన్నయైన వాలిని రాముడు నిగ్రహించి సుగ్రీవునికి కపిరాజ్యము నిప్పించినాడు. సీతాదేవిని వెదికింతు నని సుగ్రీవుడు శ్రీరామునికి మాట ఇచ్చి పదికోట్ల వానరవీరులను నాలుగుదిక్కులకు పంపినాడు. సుగ్రీవుడు మాకు నిర్ణయించిన గడువు మేము వింధ్యపర్వత గుహలలో తిరుగుచుండగా దాటిపోయినది. మేము దుఃఖపడుచుండగా జటాయువు అన్నయైన సంపాతి మాకు కనబడి సీతాదేవి లంకలో రావణుని ఇంట నున్న వృత్తాంతమును తెలియజేసినాడు. లంకను చేరుటకు నూరుయోజనముల సముద్రమును దాటవలయును. మా వారి కందరికిని దిగులుపుట్టినది. దుఃఖించుచు కూర్చుండినారు. అప్పుడు నేను పూనుకొని సముద్రమును లంఘించి దుఃఖముతో కుమిలిపోవుచున్న సీతాదేవిని అశోకవనములో చూచినాను. శ్రీరాముడు నా చేతి కిచ్చిపంపిన అంగుళీయమును ఆమెకు గుర్తు చూపించి ఆమె వృత్తాంతమును తెలిసికొని ఆమెయొద్దనుండి ఒక గుర్తుగైకొని రామునిచెంతకు వచ్చినాను. విషయ

మును తెలిసికొని శ్రీరాముడు రావణుని వధింపబూనుకొని వానరసైన్యసమేతుడై సముద్రతీరము చేరి నలునిచేత సముద్రమునకు సేతువు కట్టించినాడు. అందరము లంకకు వెళ్ళి యుద్ధము చేసినాము. నీలుడు ప్రహస్తుని వధించినాడు. రావణుని కుమారుడైన ఇంద్రజిత్తును లక్ష్మణుడు వధించినాడు. శ్రీరాముడు కుంభకర్ణుని, రావణుని సంహరించినాడు.

ఆ తరువాత ఇంద్రుడు, వరుణుడు, శివుడు, బ్రహ్మదేవుడు, దశరథుడు సాక్షాత్కరించినారు. శ్రీరామునికి వరము లిచ్చినారు. అటుపిమ్మట శ్రీరాముడు సీతా లక్ష్మణుల సమేతుడై పుష్పకవిమానముమీద బయలుదేరి కిష్కింధమీదుగా వచ్చి ఇప్పుడు భరద్వాజాశ్రమములో ఉన్నాడు. రేపు ప్రొద్దున పుష్యమినక్షత్రములో ఇక్కడికి రాగలడు. నీవు రేపుప్రొద్దున శ్రీరాముని తప్పక చూడగలవు.

**భరతుడు :** (అంజలి ఘటించి సంతోషముతో) ఎంతకాలమునకు ఫలించినది నా కోరిక!

[రామాగమనవార్త భరతునికి ముందుగా అందించుట చాల ముఖ్యము. మరునాడు ప్రొద్దుననే శ్రీరాముడు కనబడనిచో భరతుడు అగ్నిప్రవేశము చేయును. కావున, రాముడు ముందుగా హనుమంతుని పంపినాడు. అదిగాక, శుభవార్తనైనను తటాలున చెప్పరాదు. శ్రీరాముడు మరునాడు వచ్చునని ముందు తెలిసినయెడల, శ్రీరాముడు వచ్చువేళకు భరతుడు కలత చెందకయుండును]

హనుమంతుడు తెచ్చిన శుభవార్తవిని భరతుడు ఆనందభరితుడై శత్రుఘ్నునితో చెప్పుచున్నాడు.

**భరతుడు :** తమ్ముడా! పట్టణమునకు అలంకారము చేయింపుము. నగరములోని దేవాలయములను, మంటపములను, గంధమాల్యములతో అలంకరించి మంగళవాద్యములను ఏర్పాటు చేయింపుము. సూర్యోదయములోపల సర్వము సిద్ధము కావలయునుసుమా!

శత్రుఘ్నుడు పెక్కువేలమంది పనివారిని నియమించి, నందిగ్రామమునుండి అయోధ్యవరకు మిట్టపల్లములు సవరించి దారి బాగుచేయించినాడు. నగరమునందు శీతలజలములు చల్లించి, పేలాలు, పుష్పములు వెదజల్లించినాడు. పతాకలెత్తించినాడు. గృహము లన్నియు అలంకారములు చేయింపుడని పురజనులకు ఉత్తరువు లిచ్చినాడు. రాజమార్గములలో పుష్పతోరణములు కట్టించి విడిపూవులు చల్లించి ముగ్గులు పెట్టించినాడు.

రాజభార్యలు, మంత్రులు, సైనికులు, వారి స్త్రీజనములు, కౌసల్య, సుమిత్ర, కైకేయి రామదర్శన లాలసులై నందిగ్రామమునకు బయలుదేరినారు. వేలకొలది

ఏనుగులకు, గుఱ్ఱములకు, అలంకారములు చేసి తీసికొనిపోయినారు. అయోధ్యానగర మంతయు నందిగ్రామమునకు నడచినది.

కృత్స్నంతు నగరం తత్తు నందిగ్రామ ముపాగమత్. 130-16

మహాత్ముడైన భరతుడు రామపాదుకలను శిరస్సుపై ధరించి శ్వేతచ్ఛత్రమును చామరములను గైకొని, మంత్రుల గూడి, శ్రీరామునికి స్వాగత మిచ్చుటకు ఎదురేగినాడు. కొంతసేపు శ్రీరామునికోసమై నిరీక్షించి హనుమంతునితో

*భరతుడు :* హనుమంతుడా! శ్రీరాము డింకను రాలేదేమి ? నీవు సూచించిన వానర సైన్యముల జాడయే కానవచ్చుటలేదు! నీ వానర చాపల్యముచే చెప్పిన మాటలు కాదుగదా!

కచ్చి న్నఖలు కాపేయీ సేవ్యతే చలచిత్తతా. 130-22

*హనుమంతుడు :* భరద్వాజ ప్రసాదమువలనను, ఇంద్రుని వరదానమువలనను దారిలోని చెట్లయందు ఫలములును తేనెయు సమృద్ధిగా ఉన్నవి గనుక తినుచు, త్రాగుచు, మావారు నెమ్మదిగా వచ్చుచుందురు. అదిగో! శబ్దము వినవచ్చుచున్నది. వానర సేనలు గోమతీనదిని దాటుచున్నవి. వాలుకినీనదిలో దుమ్ము రేగినది చూడుము. ఆ నదిని దాటియుందురు. సాలవనములో విహరించుచున్నారు కాబోలు!

## సీతారామలక్ష్మణులు పుష్పకవిమానములో నందిగ్రామమునకు వచ్చుట

అదిగో పుష్పకవిమానము! దూరముగా కనబడుచున్నది చూడుము. దానిలో నున్నాడు శ్రీరాముడు. సీతారామలక్ష్మణులు, సుగ్రీవుడు, విభీషణుడు దానిలో నెక్కివచ్చుచున్నారు.

విమానమును చూచి సంతోషించి "ఇదిగో! వచ్చుచున్నాడు శ్రీరాముడు" అని అచ్చటి జను లందరును కోలాహలము చేసినారు. పుష్పకవిమానములోనున్న శ్రీరాముని చూచి ప్రజలు నమస్కరించినారు. ప్రతిజ్ఞ తీర్చివచ్చిన శ్రీరామునికి భరతుడు స్వాగత మిచ్చి పూజించినాడు.

ప్రాంజలి ర్భరతో భూత్వా ప్రహృష్టో రాఘవోన్ముఖః
స్వాగతేన యథార్థేన తతో రామ మపూజయత్. 130-34

తతో విమానాగ్రగతం భరతో భ్రాతరం తదా
వవందే ప్రయతో రామం మేరుస్థమివ భాస్కరమ్. 130-36

శ్రీరాముని ఆజ్ఞానుసారము విమానము నేలమీద వ్రాలినది. శ్రీరాముడు విమానములోనికి భరతుని చేర్చుకొన్నాడు. భరతుడు శ్రీరామునికి శిరసా నమస్కారము చేసినాడు. శ్రీరాముడు భరతుని లేవనెత్తి అంకపీఠమున కూర్చుండబెట్టుకొని ప్రీతితో కవుగిలించుకొన్నాడు.

తం సముత్థాప్య కాకుత్స్థ శ్చిరస్యాక్షిపథం గతమ్
అంకే భరత మారోప్య ముదితః పరిషస్వజే. 130-39

భరతుడు లక్ష్మణునికి స్వాగత మిచ్చి, సీతాదేవికి అభివందన మొనర్చినాడు. సుగ్రీవుని, జాంబవంతుని, అంగదుని, మైందుని, ద్వివిదుని, నీలుని, ఋషభుని, సుషేణుని, నలుని, గవాక్షుని, గంధమాదనుని, శరభుని, పనసుని, వీరి నందరిని కవుగిలించుకొన్నాడు. వా రందరు మనుష్యరూపములో నున్నారు. అందరును ఆనందించి, భరతుని క్షేమసమాచారము అడిగినారు.

భరతుడు సుగ్రీవుని మరల కవుగిలించుకొని

*భరతుడు :* సుగ్రీవా ! నీవు మా నలుగురకు ఐదో తోడబుట్టు వయితివి.

త్వ మస్మాకం చతుర్ణాం తు భ్రాతా సుగ్రీవ పంచమః
సౌహృదా జ్జాయతే మిత్ర మపకారోఽరిలక్షణమ్. 130-45

భరతుడు విభీషణుని మంచిమాటలతో అనునయించి

*భరతుడు :* విభీషణా ! మా భాగ్యవశమున నీ సాహాయ్యముచే దుష్కరకార్యము సాధింపబడినది.

విభీషణం చ భరత స్సాంత్వంవాక్య మథాబ్రవీత్
దిష్ట్యా త్వయా సహాయేన కృతం కర్మ సుదుష్కరమ్. 130-46

శత్రుఘ్నుడు రామలక్ష్మణులకు నమస్కారములు చేసి సీతాదేవి పాదములకు మ్రొక్కినాడు.

శ్రీరాముడు తల్లిపాదములు పట్టుకొని మ్రొక్కి, సుమిత్రకును, కైకేయికిని నమస్కరించి, వసిష్ఠభగవానునికి అభివాదన మొనర్చినాడు.

ప్రజ లందరు చేతులు జోడించి నమస్కరించి శ్రీరామునికి గొప్పస్వాగత మిచ్చినారు. తామరమొగ్గలవలె నున్న ఆ చేమోడ్పులను శ్రీరాముడు ప్రతిగ్రహించి ఆదరించినాడు. భరతుడు రామపాదుకలను తెచ్చి శ్రీరాముని పాదములకు స్వయముగా తొడిగినాడు.

పాదుకే తే తు రామస్య గృహీత్వా భరత స్స్వయమ్
చరణాభ్యాం నరేంద్రస్య యోజయామాస ధర్మవిత్. 130-52

భరతుడు : (అంజలి చేసి) రామా! నీ రాజ్యమును నీ కప్పగించుచున్నాను. నీవు మరల అయోధ్యకు వచ్చి రాజు వగుట చూడ గలిగితిని. నా కోరిక ఫలించినది. నా జన్మము కృతార్ధ మయినది.

అద్య జన్మ కృతార్థం మే సంవృత్తశ్చ మనోరథః
యస్త్వాం పశ్యామి రాజాన మయోధ్యాం పునరాగతమ్. 130-54

నీ ధనాగారమును, ధాన్యశాలను, నీ నగరమును, సైన్యమును, చూచుకొనుము. అప్పటికంటెను ఇప్పుడు పదింతలు వృద్ధిపొందినది. ఇదియంతయు నీ ప్రభావమే.

అవేక్షతాం భవాన్ కోశం కోష్ఠాగారం పురం బలమ్
భవత స్తేజసా సర్వం కృతం దశగుణం మయా 130-55

భరతుని పలుకులు విని, భరతునికి అన్నయందుగల భక్తిని జూచి సుగ్రీవాది వానరులును, విభీషణుడును కన్నీరు విడిచినారు.

తథా బ్రువాణం భరతం తం దృష్ట్వా భ్రాతృవత్సలమ్
ముముచు ర్వానరా బాష్పం రాక్షసశ్చ విభీషణః. 130-56

[ఈ కన్నీరు సిగ్గువలన కలిగినదో ఆనందమువలన వచ్చినదో! సుగ్రీవుడును, విభీషణుడును అన్నలను చంపించినవారు గదా! శ్రీరామభరతుల సమావేశదృశ్యమును చూచి వారు ఎంత ఆశ్చర్యపడిరో, వారికి ఎన్ని ఆలోచనలు కలిగినవో వారికే తెలియవలెను. వారల కన్నీరు మాత్రమే మనకు కనబడుచున్నది!]

శ్రీరాముడు భరతుని తన ఒడిలో కూర్చుండబెట్టుకొన్నాడు. పుష్పక విమానము మీదనే ప్రయాణము చేసి అందరును భరతుని ఆశ్రమమునకు వచ్చి విమానము నుండి దిగినారు.

వెంటనే, శ్రీరాముడు ఆ పుష్పక విమానమును కుబేరునియొద్దకు పొమ్మని ఆజ్ఞాపించినాడు. శ్రీరాముని అనుజ్ఞగొని విమానము కుబేరునియొద్దకు వెళ్ళినది.

తతో రామాభ్యనుజ్ఞాతం తద్విమాన మనుత్తమమ్
ఉత్తరాం దిశమాగమ్య జగామ ధనదాలయమ్. 130-60

[విమానము పంపుటను గూర్చి విభీషణునితో ఒక మాటకూడ అనలేదు. దీనిని గురించి విభీషణు డేమనుకొన్నాడో! సుగ్రీవాది వానరులును, విభీషణుడును అయోధ్యనుండి వారి వారి నెలవులకు వెళ్లువర కైనను విమానము నుంచుకొనక పంపివేసినాడు! అందరును

ఆకాశమార్గమున ఎగిరి వెళ్లగలిగినవారు కాబట్టి వారి తిరుగు ప్రయాణమునకు విమానము అక్కరలే దనుకొన్నాడు కాబోలు శ్రీరాముడు!

ఏది యెట్లున్నను ఎవరివస్తువు వారియొద్ద నుండుటయే మంచిది అని తలచి కాబోలు తానే విమానమును పంపివేసినాడు]

అందరును భరతుని ఆశ్రమము చేరినారు. శ్రీరాముడు వసిష్ఠుని పాదములకు నమస్కరించినాడు. ఇద్దరును ఏక కాలములో వారివారి ఆసనములమీద కూర్చుండినారు. [అదియే మర్యాద.]

## శ్రీరాముడు అయోధ్యకు వచ్చుట

భరతుడు శిరస్సున అంజలి ఘటించి శ్రీరామునితో అనుచున్నాడు

శిరస్యంజలి మాధాయ కైకేయ్యానందవర్ధనః
బభాషే భరతో జ్యేష్ఠం రామం సత్యపరాక్రమమ్. 131-1

**భరతుడు** : రామా! నీవు నా తల్లిని పూజించి ఇచ్చిన యీ రాజ్యమును నీకు అప్పగించుచున్నాను. ఈ రాజ్యభారమును వహించుటకు నాకు శక్తి లేదు. ఒక దృఢమైన వృషభము మోయవలసిన బరువును చిన్నదూడ మోయగలదా! నీవు పట్టాభిషేకము చేసికొనుము. జ్యోతిశ్చక్రము ఎంతకాలము తిరుగుచుండునో, ఈ భూమండలము ఎంతకాల ముండునో, అంతకాలమును నీవు సమస్త రాజ్యమును పాలింపుచుండుము.

యావదావర్తతే చక్రం యావతీ చ వసుంధరా
తావ త్త్వమిహ సర్వస్య స్వామిత్వ మనువర్తయ. 131-11

భరతుని సంప్రార్థనము శ్రీరాముడు అంగీకరించినాడు. సుఖహస్తులును నిపుణులును అగు శ్మశ్రువర్ధకులను శత్రుఘ్నుడు పిలిపించి, ముందు భరతునికిని లక్ష్మణునికిని జటలు విప్పించి, కేశసంస్కారములు మంగళస్నానములును చేయించినాడు. తరువాత సుగ్రీవునికిని, విభీషణునికిని మంగళస్నానము లైనవి. ఆవల, శ్రీరాముడు తన జటలు విప్పించుకొని మంగళస్నాన మొనర్చినాడు. శత్రుఘ్నుడు రామలక్ష్మణులకు అలంకారములు చేయించినాడు. అంతఃపుర స్త్రీలు సీతాదేవికి అలంకారము చేసినారు.

కుమారునిమీద ఉండు ప్రేమ ననుసరించి కౌసల్యాదేవి వానరవీరపత్ను లందరికిని అలంకారములు చేయించినది.

సుమంత్రుడు రథము నాయత్తపరచినాడు. సూర్యమండల సంకాశమైన ఆ రథమును శ్రీరాము డారోహించినాడు.

సుగ్రీవుడు, హనుమంతుడు దివ్యవస్త్రములు ధరించి, అలంకారములు చేసికొని అయోధ్యకు బయలుదేరినారు.

వానరపత్నులును, సీతాదేవియును అయోధ్యా నగరావలోకన కుతూహలముతో వచ్చుచున్నారు.

పట్టాభిషేక ద్రవ్యములను సిద్ధము చేయుటకై మంత్రులు అయోధ్య కరిగి మరల రాముని కెదురు వచ్చినారు.

శ్రీరాముని రథమునకు భరతుడు సారథి అయినాడు. శత్రుఘ్నుడు శ్రీరామునికి ఛత్రము పట్టినాడు. లక్ష్మణుడును, విభీషణుడును వింజామరలు వీచుచున్నారు.

దేవతలు, మహర్షులు ఆకాశమున గుమిగూడి శ్రీరాముని ప్రస్తుతించినారు.

సుగ్రీవుడు శత్రుంజయమను ఏనుగు నెక్కివచ్చుచున్నాడు. వానరవీరులు మనుష్య రూపములు దాల్చి వివిధాభరణభూషితులై తొమ్మిదివేల ఏనుగులమీద వచ్చుచున్నారు.

శంఖభేరీనినాదములతోను, మంగళవాద్యశబ్దములతోను, ఘూనభోంతరాళములు పూరితములైనవి.

అక్షతలు, కుడుములు కొనివచ్చు బ్రాహ్మణులును, గోవులును, కన్యకలును, శ్రీరామునికి ముందు నడచినారు.

సుగ్రీవుని స్నేహము, హనుమంతుని ప్రభావము, వానరవీరుల పరాక్రమము, విభీషణుని శరణాగతి మున్నగు విశేషము లన్నియు శ్రీరాముడు మంత్రుల కెరిగింపగా వారు విస్మితులైనారు.

శ్రీరాముడు తన మిత్రులతోకూడ అయోధ్యా పట్టణము ప్రవేశించినాడు. పురజనులు ఇంటింటను పతాక లెత్తినారు.

శ్రీరాముడు తల్లులకు నమస్కరించి దశరథుని భవనమున ప్రవేశించి భరతునితో చెప్పుచున్నాడు.

రాముడు : భరతా ! అశోకవనశోభిత మైన నా భవనమునందు సుగ్రీవుని విడియింపుము.

యచ్చ మద్భవనం శ్రేష్ఠం సాశోకవనికం మహత్
ముక్తా వైడూర్య సంకీర్ణం సుగ్రీవాయ నివేదయ. 131.45

భరతుడు సుగ్రీవుని చేయిపట్టుకొని తోడ్కొనిపోయి రామమందిరములో ప్రవేశపెట్టినాడు. శత్రుఘ్నుడు ఆ భవనమును సకలసౌందర్యసంపన్నము గావించి సుగ్రీవునికి సంతోషము కలుగజేసినాడు.

*భరతుడు :* (సుగ్రీవునితో) వానరేంద్రా! శ్రీరాముని అభిషేకమునకు వలసిన జలములు తెచ్చుటకై దూతలను పంపుము.

సుగ్రీవుడు నాలుగు సువర్ణకలశములను నలుగురు వానరోత్తములకిచ్చి,

*సుగ్రీవుడు :* వానరవీరులారా! మీరు రేపు ప్రత్యూషవేళకు ఈ కలశములనిండ నాలుగు సముద్రములలోని జలములను గైకొనిరావలయును.

నలుగురు వానరులు కలశములగైకొని ఆకసమునకెగిరి వెళ్ళినారు. జాంబవంతుడు, హనుమంతుడు, వేగదర్శి, ఋషభుడు, ఈ నల్వురును అయిదువందల నదులనుండి జలములుగొనివచ్చినారు.

సుషేణుడు తూర్పుసముద్రమునుండి జలమును తెచ్చినాడు. దక్షిణసముద్ర జలమును కలశమున నింపి, దానిని రక్తచందనశాఖలతో కప్పి ఋషభుడు తెచ్చినాడు. పశ్చిమసముద్రజలమును గవయుడును, ఉత్తరసముద్రజలమును నలుడును కొనివచ్చినారు.

వానరులు అభిషేకజలముల గొనివచ్చినారని శత్రుఘ్నుడు వసిష్ఠులవారికి తెలియపరచినాడు.

## శ్రీరామపట్టాభిషేకము

పరిశుద్ధుడును, వృద్ధుడును అగు వసిష్ఠమహర్షి, సీతారాముల నిద్దరను రత్నమయ పీఠముమీద కూర్చుండబెట్టినాడు. అష్టవసువులు దేవేంద్రునికి అభిషేక మొనర్చిన విధముగా వసిష్ఠుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, కాత్యాయనుడు, సుయజ్ఞుడు, గౌతముడు, విజయుడు ప్రసన్నములైన సుగంధజలములతో సీతారాములకు అభిషేకము చేసినారు.

తత స్స ప్రయతో వృద్ధో వసిష్ఠో బ్రాహ్మణై స్సహ
రామం రత్నమయే పీఠే సహసీతం న్యవేశయత్. 131-59

వసిష్ఠో వామదేవశ్చ జాబాలి రథ కాశ్యపః
కాత్యాయన స్సుయజ్ఞశ్చ గౌతమో విజయ స్తథా. 131-60

అభ్యషించ న్నరవ్యాఘ్రం ప్రసన్నేన సుగంధినా
సలిలేన సహస్రాక్షం వసవో వాసవం యథా. 131-61

అటుపిమ్మట ఋత్విజులు, బ్రాహ్మణులు, కన్యకలు, మంత్రులు, పౌరులు, యోధులు, సీతారాములకు అభిషేకము చేసినారు. వసిష్ఠాదులచే ఆహూతులైన లోకపాలురు నల్వురును, తదితర దేవతలు అందరును ఆకాశములో సమావిష్టులై స్వర్గములో

వున్న సమస్త ఓషధుల రసముతో అభిషేకము చేసినారు. శ్రీరామునికి శత్రుఘ్నుడు శ్వేతచ్ఛత్రము పట్టినాడు. సుగ్రీవుడును విభీషణుడును చామరములు వీచినారు.

దేవేంద్రుడు పంపిన నూరుకమలముల సువర్ణహారమును వాయుదేవుడు కొని వచ్చి శ్రీరామునికి సమర్పించినాడు. అదిగాక మరియొక మణిరత్నవిభూషితమైన ముత్యాలహారమునుగూడ ఇంద్రుడు వాయుదేవునిచే పంపినాడు. దేవగంధర్వులు పాడినారు. అప్సరసలు ఆడినారు. వృక్షములు ఫలభరితములైనవి. పుష్పములు సువాసనలు వెదజల్లినవి.

శ్రీరాముడు లక్ష గుఱ్ఱములను, లక్ష పాడియావులను, నూరు వృషభములను ముప్పదికోట్ల బంగారు నాణెములను, వస్త్రాభరణములను బ్రాహ్మణుల కొసంగి సన్మానించినాడు.

సుగ్రీవునికి రత్నమయమైన కాంచనమాలను, అంగదునికి వజ్రరత్నవిభూషితమైన అంగదమును కానుకలుగా ఇచ్చినాడు. శ్రీరాముడు సీతాదేవిచేతికి చంద్రకిరణసమప్రభమైన ఒక ముక్తాహారము నొసంగినాడు. సీతాదేవి శ్రీరామునివంక దృష్టి నిలిపి ఆయన సమ్మతించుట గ్రహించి, వస్త్రములను ఆభరణములను హనుమంతునికి ఇచ్చినది. తనకంఠమునుండి హారమును తీసి, మాటిమాటికి వానరులవైపును తన భర్త వైపును చూచుచుండినది.

అరజే వాససీ దివ్యే శుభాన్యాభరణాని చ
అవేక్షమాణా వైదేహీ ప్రదదౌ వాయుసూనవే. 131-74

అవముచ్యాత్మనఃకంఠా ద్ధారం జనకనందినీ
అవైక్షత హరీన్ సర్వాన్ భర్తారం చ ముహుర్ముహుః. 131-75

ఇంగితజ్ఞుడైన శ్రీరాముడు సీతాదేవి మనస్సు గ్రహించి

రాముడు : దేవీ ! పౌరుషము, పరాక్రమము, బుద్ధియు ఎవ్వనియందు కలవో గుర్తించి నీ ఇష్టమువచ్చినవాని కిమ్ము.

ప్రదేహి సుభగే హారం యస్య తుష్టాసి భామిని
పౌరుషం విక్రమో బుద్ధి ర్యస్మి న్నేతాని సర్వశః. 131-77

ఈ మాట విని సీతాదేవి ఆ ముక్తాహారమును హనుమంతుని కిచ్చినది. హనుమంతుడు ముక్తాహారమును ధరించి తెల్లనిమేఘముతో గూడిన పర్వతము ప్రకాశించినట్లు శోభిల్లినాడు.

ద్వివిదునికి, మైందునికి, నీలునికి, తదితర వానరవీరులకును యథాయోగ్యముగా శ్రీరాముడు బహుమతు లిచ్చినాడు. విభీషణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు మున్నగు వానరోత్తములును శ్రీరాముడు కావించిన మర్యాదల నందుకొని వారివారి నెలవుల కరిగినారు.

సుగ్రీవుడును, ఇతరవానరులును రామాభిషేకము సందర్శించి పరమానందభరితులై కిష్కింధకు వెళ్ళినారు.

విభీషణుడు తన కులధనమును పొంది లంకకు పోయినాడు.

లబ్ధ్వా కులధనం రాజా లంకాం ప్రాయాద్విభీషణః. 131-85

[కులధన మనగా రంగవిమాన మని కొందరూ, లంకారాజ్యమే కులధన మని మరికొందరు అందురు.]

శ్రీరాముడు పట్టాభిషిక్తుడై లక్ష్మణునితో అనుచున్నాడు.

**రాముడు:** లక్ష్మణా! నీవు యువరాజువై ఈ రాజ్యభారమును నాతోపాటు వహింపుము.

ఎంత చెప్పినను లక్ష్మణుడు సమ్మతింపలేదు.

[లక్ష్మణునికి రాజ్యముతో పనియేమి? రామసేవయే చాలును.]

కావున, శ్రీరాముడు భరతునికి యౌవరాజ్య పట్టాభిషేకము చేసినాడు.

సర్వాత్మనా పర్యనునీయమానో
యదా న సౌమిత్రి రుపైతి యోగమ్
నియుజ్యమానోపి చ యౌవరాజ్యే
తతోఽభ్యషించ ద్భరతం మహాత్మా. 131-88

[ఏమైన నేమి! కైకేయి ఆశించిన భరతుని యౌవరాజ్య పట్టాభిషేకము జరిగినది.]

## రామరాజ్యము

శ్రీరాముడు పౌండరీకము, అశ్వమేధము, మున్నగు అనేక యజ్ఞములను అనేక పర్యాయములు నిర్వర్తించినాడు. శ్రీరాముడు నూరు అశ్వమేధ యాగము లొనర్చినాడు. లక్ష్మణసహితుడై రాజ్యమును పరిపాలించినాడు.

రామరాజ్యములో వ్యాధిగాని, భయముగాని, వైధవ్యముగాని లేదు. దొంగతనము లేదు. ఎట్టి అనర్థములును లేవు. చిన్నవారికి పెద్దవారు ప్రేతకార్యములు జరుపుటలేదు. సమస్త ప్రజలు ఆనందమయులై యుండినారు. శ్రీరాముని తలచుకొని, ప్రజలు తమ విరోధములు వదలుకొన్నారు. ఒకరి నొకరు హింసించుట మానుకొన్నారు. అందరును ధర్మప్రవర్తకులై యుండినారు.

సర్వం ముదితమేవాసీ త్సర్వో ధర్మపరోభవత్
రామమేవానుపశ్యంతో నాభ్యహింసన్ పరస్పరమ్. 131-95

[ప్రభువు మంచివాడైన ప్రజలు మంచివారుగా నుందురు. మన ఇండ్లలోను అంతే. పెద్దవారు మంచివారగుదురేని పిల్లలు మంచివారుగా ఉందురు. పిల్లల క్షేమముకోసమైనను పెద్దవారు సన్మార్గములో నుండుట అవసరము.]

రామరాజ్యములో ఎక్కడ చూచినను శ్రీరాముని గురించిన మాటలే వినిపించు చుండినవి. 'రాముడు, రాముడు, రాముడు' అను మాటయే చెవిని పడుచుండినది. రాజ్య మంతయు రామమయ మయినది.

రామో రామో రామ ఇతి ప్రజానా మభవన్ కథాః
రామభూతం జగదభూ ద్రామే రాజ్యం ప్రశాసతి. 131-97

వర్షములు సకాలములో కురియుచుండినవి. దేశము సుభిక్షముగా ఉండినది. నాలుగువర్ణములవారును వారి వారి పనులు జరుపుకొనుచు, అసూయలు లేక, జీవితములను సుఖముగా గడపుచుండినారు.

ఈ విధముగా శ్రీరాముడు పదునొకండువేల సంవత్సరములు రాజ్యము పాలించినాడు.

## ఫలశ్రుతి

ధనప్రదమును, కీర్తిప్రదమును, ఆయుర్వృద్ధికరమును, రాజులకు జయకరమును అగు, వాల్మీకి మహర్షి ప్రోక్తమైన యీ ఆదికావ్యమును చదివినను, వినినను సమస్త పాతకములూ నశింపగలవు. పుత్రులు కోరువారికి పుత్రులు కలుగుదురు. ధనము కోరువారికి ధనము లభించును. రాజులు విన్నచో యుద్ధమున విజయము కలుగును. స్త్రీలు విన్నచో కౌసల్యకు, సుమిత్రకు, కైకేయికి కలిగినట్లు దీర్ఘాయుష్మంతులగు సత్పుత్రులు కలుగుదురు.

శ్రీరామవిజయమును కీర్తించు ఈ రామాయణమును వినువారికి దీర్ఘాయువు కలుగును. శ్రద్ధతో విన్నవారికి కష్టములు తొలగిపోవును. దూరదేశములకు వెళ్ళిన బంధువులను కలిసికొందురు. కోరిన కోరికలన్నియు శ్రీరాముని అనుగ్రహమువలన ఫలించును. దేవతలు ప్రీతి పొందుదురు. గ్రహావినాయకులు శమింతురు. రాజులు భూమండలమును జయింపగలరు. స్త్రీలు పుత్రవతు లగుదురు.

రామాయణమును పూజించినను, చదివినను సర్వపాపములును నశించును. నారాయణుడును, ఆదిదేవుడును అయిన శ్రీరాముడు సంతోషించును. పతితలకును

శ్రోతలకును కుటుంబ వృద్ధియు, ధనధాన్య వృద్ధియు కలుగును. సుఖము లభించును. కోరిన కార్యము ఫలించును. సోదరభావము వృద్ధియగును. తేజస్సు పెంపొందును.

**కుటుంబ** వృద్ధిం ధనధాన్య వృద్ధిం । స్త్రియశ్చ ముఖ్యా స్సుఖముత్తమం చ
**శ్రుత్వా శుభం** కావ్యమిదం మహార్థం । ప్రాప్నోతి సర్వాన్ భువి చార్థసిద్ధిమ్. 131-11

**ఆయుష్య** మారోగ్యకరం యశస్యం । సౌభ్రాత్రకం బుద్ధికరం సుఖం చ
**శ్రోతవ్య** మేత న్నియమేన సద్భి । **రాఖ్యాన** మోజస్కర మృద్ధికామైః. 131-115

ఇది పూర్వము ప్రవర్తిల్లిన చరిత్రము. మీకు మంగళ మగునుగాక ! అందరును శ్రద్ధతో చదువుదురుగాక ! విష్ణుదేవుని మాహాత్మ్యము వర్ధిల్లునుగాక !

ఏవమేత త్పురావృత్త మాఖ్యానం భద్రమస్తు వః
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్. 131-116

మన కందరకును సీతారాముల ప్రసాదము కలుగునుగాక !

శ్రీరామచంద్ర శ్శ్రితపారిజాతః । సమస్త కల్యాణ గుణాభిరామః
సీతాముఖాంభోరుహ చంచరీకో । నిరంతరం మంగళ మాతనోతు.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం । న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం । లోకాస్సమస్తా స్సుఖినో భవంతు.

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ । దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః
అపుత్రాః పుత్రిణ స్సంతు పుత్రిణ స్సంతు పౌత్రిణః । అధనా స్సధనా స్సంతు జీవంతు శరదాం **శతమ్.**

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ సీతాయాఃపతయే నమః.

మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాబ్ధయే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్.

ఓం తత్సత్.



శ్రీరామాయ నమః

## అనుబంధము - 1

# ఆదిత్యహృదయము

తతో యుద్ధపరిశ్రాంతం సమరే చింతయా స్థితమ్
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్

దైవతైశ్చ సమాగమ్య ద్రష్టుమభ్యాగతో రణమ్
ఉపాగమ్యాబ్రవీద్రామ మగస్త్యో భగవానృషిః

రామ రామ మహాబాహో శృణు గుహ్యం సనాతనం
యేన సర్వానరీన్ వత్స సమరే విజయిష్యసి

ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రు వినాశనం
జయావహం జపేన్నిత్య మక్షయ్యం పరమం శివమ్

సర్వమంగళ మాంగల్యం సర్వపాప ప్రణాశనమ్
చింతా శోక ప్రశమన మాయుర్వర్ధన ముత్తమమ్

రశ్మిమంతం సముద్యన్తం దేవాసుర నమస్కృతమ్
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్

సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః
ఏష దేవాసుర గణాల్లోకాన్ పాతి గభస్తిభిః

ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః స్కందః ప్రజాపతిః
మహేంద్రో ధనదః కాలో యమః సోమో హ్యపాంపతిః

పితరో వసవః సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః
వాయు ర్వహ్నిః ప్రజాప్రాణ ఋతుకర్తా ప్రభాకరః

ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్
సువర్ణసదృశో భానుః స్వర్ణరేతా దివాకరః

హరిదశ్వః సహస్రార్చిః సప్తసప్తిర్మరీచిమాన్
తిమిరోన్మథనః శంభు స్త్వష్టా మార్తాండ అంశుమాన్

హిరణ్యగర్భః శిశిర స్తపనో భాస్కరో రవిః
అగ్నిగర్భోఽదితేః పుత్రః శంఖః శిశిరనాశనః

వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజుఃసామపారగః
ఘనవృష్టిరపాం మిత్రం వింధ్యవీథీప్లవంగమః

ఆతపీ మండలీ మృత్యుః పింగళః సర్వతాపనః
కవిర్విశ్వో మహాతేజా రక్తః సర్వభవోద్భవః

నక్షత్రగ్రహతారాణా మధిపో విశ్వభావనః
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మ న్నమోఽస్తు తే

నమః పూర్వాయ గిరయే పశ్చిమాయాద్రయే నమః
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః

జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః
నమో నమః సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః

నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః
నమః పద్మప్రబోధాయ మార్తాండాయ నమో నమః

బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః

తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః

తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే
నమస్తమోఽభినిఘ్నాయ రవయే లోకసాక్షిణే

నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః

ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః
ఏష ఏవాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రిణామ్

వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ
యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః

ఏనమాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ
కీర్తయన్ పురుషః కశ్చి న్నావసీదతి రాఘవ

పూజయస్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిమ్
ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి

అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి
ఏవముక్త్వా తదాగస్త్యో జగామ చ యథాగతమ్

ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽభవత్తదా
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్

ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వా తు పరం హర్ష మవాప్తవాన్
త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్

రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్

అథ రవిరవద న్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః
నిశిచరపతి సంక్షయం విదిత్వా
సురగణమధ్యగతో వచ స్త్వరేతి.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే చతుర్వింశతి సహస్రికాయాం సంహితాయాం
యుద్ధకాండే ఆదిత్యహృదయంనామ సప్తోత్తరశతతమః సర్గః.

# అనుబంధము - 2

# బ్రహ్మకృత రామస్తవము

తతో హి దుర్మనా రామః శ్రుత్వైవ వదతాం గిరః
దధ్యౌ ముహూర్తం ధర్మాత్మా బాష్పవ్యాకుల లోచనః

తతో వైశ్రవణోరాజా యమశ్చామిత్రకర్శనః
సహస్రాక్షో మహేంద్రశ్చ వరుణశ్చ పరంతపః

షడర్ధనయనః శ్రీమాన్ మహాదేవో వృషధ్వజః
కర్తా సర్వస్య లోకస్య బ్రహ్మ బ్రహ్మవిదాం వరః

ఏతే సర్వే సమాగమ్య విమానైః సూర్య సన్నిభైః
ఆగమ్య నగరీం లంకా మభిజగ్ముశ్చ రాఘవమ్

తతః సహస్తాభరణాన్ ప్రగృహ్య విపులాన్ భుజాన్
అబ్రువం త్రిదశశ్రేష్ఠాః ప్రాంజలిం రాఘవం స్థితమ్

కర్తా సర్వస్య లోకస్య శ్రేష్ఠో జ్ఞానవతాం వరః
ఉపేక్షసే కథం సీతాం పతంతీం హవ్యవాహనే
కథం దేవగణశ్రేష్ఠ మాత్మానం నావబుధ్యసే

ఋతధామా వసుః పూర్వం వసూనాం త్వం ప్రజాపతిః
త్రయాణాం త్వం హి లోకానా మాదికర్తా స్వయంప్రభుః

రుద్రాణా మష్టమోరుద్రః సాధ్యానామసి పంచమః
అశ్వినౌ చాపి తే కర్ణౌ చంద్రసూర్యౌ చ చక్షుషీ

అంతే చాదౌ చ లోకానాం దృశ్యసే త్వం పరంతప
ఉపేక్షసే చ వైదేహీం మానుషః ప్రాకృతో యథా

ఇత్యుక్తో లోకపాలైస్తైః స్వామీ లోకస్య రాఘవః
అబ్రవీ త్త్రిదశశ్రేష్ఠాన్ రామో ధర్మభృతాం వరః

ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజం
యోఽహం యస్య యతశ్చాహం భగవాం స్తద్బ్రవీతు మే

ఇతి బ్రువంతం కాకుత్స్థం బ్రహ్మా బ్రహ్మవిదాం వరః
అబ్రవీచ్ఛృణు మే రామ సత్యం సత్యపరాక్రమ

భవాన్నారాయణో దేవః శ్రీమాం శ్చక్రాయుధో విభుః
ఏకశృంగో వరాహ స్త్వం భూతభవ్యసపత్నజిత్

అక్షరం బ్రహ్మ సత్యం చ మధ్యే చాంతే చ రాఘవ
లోకానాం త్వం పరో ధర్మో విష్వక్సేన శ్చతుర్భుజః

శార్ఙ్గధన్వా హృషీకేశః పురుషః పురుషోత్తమః
అజితః ఖడ్గధృ ద్విష్ణుః కృష్ణశ్చైవ బృహద్బలః

సేనానీర్గ్రామణీశ్చ త్వం బుద్ధిః సత్త్వం క్షమా దమః
ప్రభవశ్చాప్యయశ్చ త్వ ముపేంద్రో మధుసూదనః

ఇంద్రకర్మా మహేంద్ర స్త్వం పద్మనాభో రణాంతకృత్
శరణ్యం శరణం చ త్వామాహుర్దివ్యా మహర్షయః

సహస్రశృంగో వేదాత్మా శతజిహ్వో మహర్షభః
త్వం త్రయాణాం హి లోకానా మాదికర్తా స్వయంప్రభుః

సిద్ధానామపి సాధ్యానా మాశ్రయశ్చాసి పూర్వజః
త్వం యజ్ఞ స్త్వం వషట్కార స్త్వమోంకారః పరంతప

ప్రభవం నిధనం వా తే న విదుః కో భవానితి
దృశ్యసే సర్వభూతేషు బ్రాహ్మణేషు చ గోషు చ

దిక్షు సర్వాసు గగనే పర్వతేషు వనేషు చ
సహస్రచరణః శ్రీమాం శతశీర్షః సహస్రదృక్

త్వం ధారయసి భూతాని వసుధాం చ సపర్వతామ్
అంతో పృథివ్యాః సలిలే దృశ్యసే త్వం మహోరగః

త్రీన్‌లోకాన్ ధారయన్ రామ దేవగంధర్వదానవాన్
అహం తే హృదయం రామ జిహ్వా దేవీ సరస్వతీ

దేవా గాత్రేషు రోమాణి నిర్మితా బ్రహ్మణా ప్రభో
నిమేషస్తే భవేద్రాత్రి రున్మేషస్తే భవే ద్దివా

సంస్కారాస్తేఽభవన్ వేదా న తదస్తి త్వయా వినా
జగత్సర్వం శరీరం తే స్థైర్యం తే వసుధాతలం

అగ్నిః కోపః ప్రసాద స్తే సోమః శ్రీవత్సలక్షణ
త్వయా లోకాస్త్రయః క్రాంతాః పురా స్వైర్విక్రమై స్త్రిభిః

మహేంద్రశ్చ కృతోరాజా బలిం బద్ధ్వా మహాసురం
సీతాలక్ష్మీ ర్భవాన్ విష్ణు ర్దేవః కృష్ణః ప్రజాపతిః

వధార్థం రావణస్యేహ ప్రవిష్టో మానుషీం తనుమ్
తదిదం నః కృతంకార్యం త్వయా ధర్మభృతాం వర

నిహతో రావణో రామ ప్రహృష్టో దివ మాక్రమ
అమోఘం బలవీర్యం తే అమోఘ స్తే పరాక్రమః

అమోఘం దర్శనం రామ న చ మోఘః స్తవ స్తవ
అమోఘాస్తే భవిష్యంతి భక్తిమంతశ్చ యే నరాః

యే త్వాం దేవం ధ్రువం భక్తాః పురాణం పురుషోత్తమం
ప్రాప్నువంతి సదా కామా నిహలోకే పరత్ర చ

ఇమ మార్షం స్తవం నిత్య మితిహాసం పురాతనమ్
యే నరాః కీర్తయిష్యంతి నాస్తి తేషాం పరాభవః

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే చతుర్వింశతిసహస్రికాయాం సంహితాయాం
యుద్ధకాండే బ్రహ్మకృత రామస్తవోనామ వింశత్యుత్తరశతతమః సర్గః.